# కఠోపనిషత్



ఆధ్యాత్మిక, జ్యోతిష, వాస్తు, ఆరోగ్య, ధర్మశాస్త్రాది అనేక విషయాలు తెలుసుకోండి...


గ్రంథనిధి
THE TREASURE OF PAGES
FIRSTEVER TELUGU FREE E-BOOKS DOWNLOADING WEB PORTAL

ఆధ్యాత్మిక గ్రంథ నిలయం
మోహన్ పబ్లికేషన్స్
కోటగుమ్మం, అజంతా హోటల్ ఎదుట,
రాజమహేంద్రవరం - 533101.

# కఠోపనిషత్తు

# KATOPANISHATH



1952 లో పూనాలోనున్ను
1954 లో న్యూఢిల్లీలోను
1957 లో మద్రాసులోను
జరిగిన ఉపనిషత్ జ్ఞానయజ్ఞ సందర్భమున

## స్వామి చిన్మయానందవారు

యిచ్చిన ఉపన్యాసములు

# విషయసూచిక

శ్రీః

# పీఠిక

విశాలవిశ్వమువలె యనంతమును, వియత్తలమురీతి విస్తృతమును, మహాసముద్రము కరణి ప్రశాంతగంభీరమును, మంచుకొండ శిరశ్శిఖరము పోల్కి మహోన్నతమును, మందాకినీతోయము భాతి పరమపవిత్రమును, మందారతరువుమాడ్కి బహు మహాఫలప్రదమును నగునది బ్రహ్మవిద్య. అట్టి బ్రహ్మవిద్యాప్రపంచమునకు, ప్రణవమునకు మూడు మాత్రలట్లు దశోపనిషత్తులు, బ్రహ్మసూత్రములు భగవద్గీత మూలకందములు - వానిలో ఉపనిషత్తులు ప్రథానస్థానము నాక్రమించినవి. ఆ దశోపనిషత్తులలో కఠోపనిషత్తు బహుళ ప్రచారము నందినది. అతి గహనమగు నాధ్యాత్మ విద్యాతత్త్వమును సుస్పష్టముగ, సుబోధకముగ, సువ్యక్తము చేయుటచే కఠోపనిషత్తు సర్వజనప్రియమైనది. భారతదేశమున, మతత్రయాచార్యుల వ్యాఖ్యానములు నందు ముఖ్యముగా శ్రీ జగద్గురు శంకరాచార్యులవారి వ్యాఖ్యానమును, ప్రసిద్ధికెక్కినవి. పాశ్చాత్యదేశములందుగూడ నీ యుప నిషత్తునకు భాషాంతరీకరణములు పెక్కులున్నవన్నచో దీని వ్యాప్తిని మనము గ్రహింపవచ్చును.

ఆంధ్రభాషలో నీ కఠోపనిషత్తునకు వ్యాఖ్యానములు, పద్యాను వాదములు వెలసినవి. మహాభారతమున తిక్కన ఎఱ్ఱన, కవుల రచనలలో నిందలి భావము లనువాదము బడసినవి. పరతత్త్వరసాయనము మొదలగు వేదాంత గ్రంథములలో, నిందలి శ్లోకములకు తెలుఁగుచేత గలదు. అద్యతన కాలమున, మహామహోపాధ్యాయ పరవస్తు రంగాచార్యులవారు, శృంగార కవి సర్వారాయుడు, శ్రీ బచ్చు పాపయ్య శ్రేష్ఠిగారి పద్యానువాదములుగలవు. శ్రీ మన్నవ బుచ్చయపంతులుగారి వచనవ్యాఖ్యానము మున్నగునవి చాలగా వ్యాప్తిలో నున్నవి.

నేడు ప్రకటితమైన కఠోపనిషత్తు ఆంధ్రానువాద మిదివఱకు ప్రకటి తములైన యనువాదము లన్నింటికన్న మిన్నయై, నవీన వచన వేదాంత వాఙ్మయ గ్రంథములలో నత్యున్నత స్థాన మలంకరించుచున్నది. ఇది

సహేతుకమే. ఏలననగా నీ యాంధ్రానువాదము చిరంతన బ్రహ్మవిద్యా సంపూర్ణులగు శ్రీ చిన్మయానందస్వామివారి యాంగ్లేయ భాషోపన్యాసములకు ననుసృతి.

పాశ్చాత్య నాగరకతాప్రభావముచేత, హైందవమతమునుగూర్చి, ఆ మత ప్రధాన గ్రంథములగు నుపనిషదాది తాత్త్విక గ్రంథములను గూర్చి, చెలరేగుచున్న అపోహలను, అపార్థములను, ఖండించి, శ్రీ చిన్మయానందు లీ కఠోపనిషత్తునందలి యాంతరంగికార్థమును, నవీనభావుక ప్రపంచమునకు సమువగు రీతిని, నరటి పండొలిచి యిచ్చినరీతిని వ్యాఖ్యానించి యున్నారు. శ్రీ స్వామివారి ఆంగ్లభాషారచనా ధోరణి ప్రౌఢగంభీర వాగ్గుంభనము గలది. అంతియేకాదు—అద్యతన ప్రపంచము సల్లకల్లోలము సేయుచున్న ప్రతిక్షణోత్పన్న నవీన వైజ్ఞానిక పరిశోధనలలోని సారాంశములను ఫలితములను మన హైందవాధ్యాత్మిక జ్ఞానదృష్టితో సమన్వయించుటచే ఉదాత్తమును శాస్త్రీయ సాంకేతికమునగు నొక ప్రత్యేక రచనారీతి యిందు ప్రవర్తిల్లినది. అయినను దృష్టాంతము లొనగుపట్ల, సవ్యజీవితమునందలి యుదాహరణములనే గ్రహించుటచేత గ్రంథ విషయము గంభీరమైనను, సుగమమైనది. పూర్వ వ్యాఖ్యాతలలో శ్రీ శంకరాచార్యులవారి భాష్యము ననునరించి శ్రీ స్వామిజీ యిందెన్నియో యపూర్వ విషయములను దెలిపి యున్నారు.

అచ్చటచ్చట మాక్సుముల్లరు, వెస్లే, మొదలగు పాశ్చాత్య విద్వాంసుల యభిప్రాయములును నుట్టంకితములైనవి. ఈ గ్రంథము శ్రీ స్వామిజీ సమకాలిక జీవితమునందలి సన్నివేశములనే గ్రహించి బహుప్రాచీనమగు కఠోపనిషద్విజ్ఞానమును సహృదయ హృదయంగమముగా సమన్వయించి యున్నారు. ఇంతియే గాక ఉపనిషత్ప్రోక్తములైన శబ్దములు - పదము, లింగము, యోగము, అశ్వత్థము, మున్నగువాని నిగూఢార్థములను, వ్యుత్పత్తులను నవీనభావుల కర్థమగు రీతిని చక్కగా వివరించి యున్నారు.

ఆత్మానం రథినం విద్ధి - ఊర్ధ్వమూలోఽవాక్శాఖా - మొదలగు మంత్రములకు శ్రీ చిన్మయానందులవారి వివరణములు చదివి తీరవలసి

నవియే. మహాతత్త్వవేత్త యగు శ్రీ శంకరాచార్యాది ప్రభృతుల నాకర్షించి యీ యుపనిషన్మంత్రముల ధ్వనిభావ సౌందర్యమును సుమనోరః సుస్పష్ట రచనారీతియు శ్రీ స్వామిజీ వ్యాఖ్యానదర్పణమున బహుముఖములుగా ప్రతిబింబించినవి. లోకోత్తరమగు నీ గ్రంథవిషయమవగాహన చేసికొనుటకు గ్రంథమంతయు నామూలాగ్రముగ పఠింపవలయును. గ్రంథవిషయములను విపులీకరించుట కవకాశము లేమి చింతిల్లుచున్నాడను. ఈ గ్రంథముతో ననుసంధింపబడిన, శ్రీ సద్గు తపోవన జీ మహారాజ్ దివ్యసందేశము, జీవనశాస్త్రజ్ఞులు, అను శీర్షి వశ్యలపఠనీయములు - మతము, శాస్త్రము, అను నీ రెండింటికే గాక, నవీ జీవన వైజ్ఞానిక పరిశోధనలకు, భారతీయ బ్రహ్మవిద్యాయోగ సిద్ధాంతముల నద్భుత భంగిని సమన్వయ మీ శీర్షికలలో కానవచ్చుచున్నది.

ఇట్టి మహోత్కృష్ట రచనావైభవముతో వెలయు శ్రీ స్వామిజీ గ్రం మునను పదించుట యన్న యది సముద్రమున కేతామెత్తుటవంటిది. ఇ పనికి సాహసించి పూనుకొనిన యాంధ్రానువాదకుల దీక్ష, ప్రశంసనీం మైనది. ఈ యనువాదమున నంధ్రతాముద్ర వెలయునట్టుల ననువాదః లీ క్రింది నియమముల నేర్చఱచికొని రచించియున్నారు

౧. సంస్కృత శ్లోకమునకు భావము తెలుఁగున చిన్నవాక్యముల చెప్పుట.

ఉదాహరణము: శ్లో ॥ శ్రేయశ్చ ప్రేయశ్చ మనుష్యమే తస్తౌ
సంపరీత్య వివినక్తి ధీరః
శ్రేయోహి ధీరోఽభిప్రేయసో వృణీతే
ప్రేయోమన్దో యోగక్షేమాద్వృణీతే

తెలుఁగు—"శ్రేయస్సు ప్రేయస్సుకూడ మానవుని చేరును. తెలివై వాని పరీక్షించి వివేచించుచున్నాడు. ఏలన యతడు ప్రేయస్సుకన్న శ్రేయస్సునే యెన్నుకొనును కాని అజ్ఞాని యిహమందలి యోగక్షేమమ కొఱకు ప్రేయస్సునే యెంచుకొనుచున్నాడు" పుట 53.

౨. సాధ్యమగునంతవఱకు మూలవాక్యముల యర్థభావమును తెలుఁగులోనికి ననూదితము లగునట్లు రచితమైనవి. "వేదసంస్కృతి యంతయు రంగరించిపోసిన పవిత్ర భారతబాలునియొక్క మనస్సులోని యాలోచనారూపమే యీ శ్లోకము." పుట 10

"కేవల గ్రంథకీటకములు రాజగురువుల స్థానము సలంకరించి నపుడు వారు దేశనాశనమునకే గాక, అంతర్జాతీయ కల్లోలములకు కారకు లగుదురు." పుట 59

3. మూలగ్రంథమునందచ్చట యాంగ్లేయ పదములుపయుక్తములైన సందర్భములలో నీయనువాదమున రెండు నియమములు పాటింపబడినవి.

1. నిత్యవ్యవహారములోనుండు ఆంగ్లభాషాపదము లట్లే వాడుట— రోడ్డు, ఆఫీసు, లాంతరు, టైపిస్టు మున్నగునవి. 2. శాస్త్రవిజ్ఞాన సాంకేతిక పదములకు భాషాంతరీకరణము నిచ్చుచు మూలపదములు నీయబడినవి.

ఉదాహరణము: విద్యుదణువులు (Electrons) ప్రాణువులు (Protons) మూలకములు (Elements) నిరంతరాయుత్వము (Frequency) మొదలగునవి. కొన్నియెడల నాంగ్లపదములు యథాతథముగా నుపయుక్తమైనప్పుడు, వాని యర్థము తెలుగున నీయబడినది.

ఉదా: డకోటా – సర్వసౌఖ్యములతో గూడిన విమానము
టార్పిడో – నావ రాకెట్ - తారాజువ్వ

౪. ఇందలి రచన కేవలము గ్రాంథికముగాక, కేవలము వ్యావహారికము గాక, సరళమగు మధ్యేమార్గము ననుసరించి యున్నది. విషయ గౌరవమునుబట్టి స్పష్టతకొఱకు వ్యావహారిక రచనాపద్ధతు లిందనుసరింప బడినవి.

1. అర్ధానుస్వార శకటరేఫములను విడిచిపెట్టుట.

2. విసంధి పాటించుట.

3. యొక్క, పడు—మొదలగువాని వాడుక.

4. అచ్చటచ్చట జాతీయములను ప్రయోగించుట.

ఉజ్జ్వలభావ సమన్వితములగు సుపనిషత్సూక్తులను సాధ్యమైనంతవఱకుసు, ఉదాత్తము ప్రసన్నమునగు భాషలోని కనువదించిన యనువాదకులు ప్రశంసనీయులు.

తొలుత వివరించినట్లుగా నిట్టి రచనకుపక్రమించుట యతిసాహసము. అయిన యతివరేణ్యులగు శ్రీ చిన్మయానందుల యనుగ్రహముచే నేడీ గ్రంథము పూర్ణాకృతి దాల్చినది. కావున సానుభూతితో నర్థము చేసికొని, పరిశోధనాదృష్టితో నిందలి భావములను కనుగొనుటకు ప్రయత్నించిన యెడల "వేదములను చీరకుచ్చెళ్లలో, ప్రాచీనత యను పైటమడతలలో శాశ్వతముగా నానందించుచు, అమరయైన ముక్తికాంత, సర్వమానవులకు, సర్వకాలములయందు సర్వథా ప్రత్యక్షము కాగలదు." ఈ రచనయందలి దోషములన్నియు ననువాదకులవి. ప్రాజ్ఞవిద్వల్లోకమును, పాఠకలోకమును దోష రూప హాలాహలమును బరిహరించి బ్రహ్మజ్ఞానామృతమును గ్రోలి, ఆనందవార్ధిలోలలాడుదురు గావుతమని విన్నపము.

నవ్యవిద్యార్థిలోకమున కాదర్శప్రాయుడగు నాచికేతునిగూర్చి యాంధ్రవాఙ్మయమునగల విశేషాంశముల నికముందు తెలుపుచున్నాను.

---

---

ఆంధ్రానువాదకులు తమనామము వెల్లడిచేయుట కంగీకరింపక పోవుటయే, వారి, చిత్తపరిపాకమును, ఆధ్యాత్మిక దృష్టియు విశదము చేయుచున్నవి.

# ఆంధ్రవాఙ్మయము - నచికేతుని కథ

## నచికేత నాచికేత శబ్ద విచారణ

కఠోపనిషత్తు ప్రారంభముననే "తస్యహనచికేతానామ పుత్ర ఆస" అని 'నచికేత'నామ ముదాహృతమై యున్నది. నచికేతస్ శబ్దమును వాడబడి యున్నది. కాని నాచికేత శబ్దమును వ్యవహార రూఢమైనది. ఈ సందర్భమున నాచికేత శబ్దమునుగూర్చి వాచస్పత్యమును బరిశీలింపఁగ నందిట్లున్నది.

"నాచికేత—పుం. నచికేత శబ్దార్థే (౧) అనలే (౨) ఋషిభేదే (3) తదుపాఖ్యానేచ; త్రికాండే నాచికేతు రితి పాఠః విపికరప్రమాదకృతః; నాచికేత ఇత్యేవ పాఠః శ్రుత్యాది సంవాదీ నాచికేతోపాఖ్యానంచ—భారతే: అను ౭౧ అధ్యా. ఆదౌ దృశ్యమ్"

వాచస్పత్యకారుని మతమున, నాచికేత శబ్దము శ్రుత్యను మతము, సాధువు. నాచికేతుశబ్ద మసాధువు.

తైత్తిరీయ బ్రాహ్మణ తృతీయాష్టక ఏకాదశ ప్రపాఠకమునందు "నచికేతస్" అను శబ్దమే పఠింపఁబడి యున్నది. అందును 'చి' కారము స్వరిత స్వరముతో నున్నది. ఇక శ్రీ శంకరాచార్యాది భాష్య కారులుకూడ నచికేత సాప్రాప్తం=నాచికేతమ్ అనియే వ్రాసియున్నారు. మహాభారతమున ననుశాసనిక పర్వమున - నాచికేతః అను అకారాంత శబ్దము ప్రయుక్తమైయున్నది.

సంస్కృతమున, నచికేత, నాచికేత శబ్దమును ప్రయుక్తములైనను, తెనుఁగున నీ శబ్దము నాచికేత నాచికేతు నాసికేతు అని రీతిగా ప్రయుక్త మైనది. తెలుత నీ కథ తెనుగులో తెనుగు మహాభారతమున గానవచ్చు చున్నది.

సంస్కృతభారతమున, అనుశాసనిక పర్వమున డెబ్బదియొకటవ యధ్యాయమున నేబదియేడు శ్లోకములలో నాచికేతుని కథ యున్నది. ఇందలి కథ కఠోపనిషత్తు కథకన్న భిన్నముగ నున్నది. ఆంధ్రమహాభారతమున తిక్కన, యిక్కథను అనుశాసనికపర్వము ద్వితీయాశ్వాసమున 446 నుండి 462 వఱకును పదునాఱు పద్యములలో రచించియున్నాడు. భీష్ముఁడు ధర్మరాజునకు గోదాన ప్రభావము నెఱింగించు సందర్భమున నీ కథ తెలిపియున్నాడు.

"నాచికేతుఁడు ఔద్దాలకిముని పుత్రుఁడు. ఒకనా డౌద్దాలకుడు స్నానముచేసి నదీతీరమున దర్భలు, ఇధ్మములు, జలకలశము మఱచి వచ్చెను. ఇంటికి చేరినతోడనే, కుమారుడగు నాచికేతుని పిలిచి, వానిని తీసుకొనిరమ్మనెను. అతడు నదికి వెళ్లునప్పటి కవి యన్నియు వరదవలన కొట్టుకొనిపోయినవి. నాచికేతుఁడు తండ్రితో నవి కానబడలేదని చెప్పగ నౌద్దాలకి కోపించి, యతనిని యమలోకమునకు బొమ్మని శపించెను నాచికేతుఁడు నిశ్చేతనుఁ డయ్యెను. ఔద్దాలకి చాలా దుఃఖించి, పుత్రుని వద్దనే కాపుండెను. ఘుఱునా డుదయమున నాచికేతుఁడు లేచి తాను యమలోకమును దర్శించితిననియు, యమధర్మరాజు తనకు, భోగయోగ్య పదార్థములును మహావిస్తృతములుగా నున్న పుణ్యలోకములు చూపె ననియు, నవి యన్నియు గోదానఫలమువలన చేకూరినవనియు, చెప్పి తండ్రి కామోదమును కల్పించెను. తిక్కన రచన యిచ్చట మూలాను సారమై యున్నది. మఱియు నిందు నాచికేత శబ్దమే వాడఁబడినది.

## నాసికేతోపాఖ్యానము - (నాచికేతుని కథ)

కఠోపనిషత్తునందుగాని భారతమునందుగాని నాచికేతుని పూర్వ వృత్తాంతము వివరింపబడియుండలేదు. కఠోపనిషత్తు "మృత్యుదేవత గృహ ములో నచికేతుని కథ" అను శీర్షికతో ప్రారంభము. భారతమున పైని వివరించిన రీతిని మృత్యుదేవత గృహమునకు బోవు పూర్వసందర్భ మున్నను నాచికేతుని జననము బాల్యదశ మొదలగు వృత్తాంతములు మున కేమియు దెలియరావు. ఆ విషయములును వివరించునది

## నాసికేతోపాఖ్యానము

తెనుగున నాచికేతుని పూర్వవృత్తాంతమును తెలుపు గ్రంథములలో నిది మొదటిది. ఇది యొక ప్రబంధము. సుప్రసిద్ధాంధ్ర కవిసార్వభౌముఁడైన శ్రీనాథమహాకవికి బావమఱదియు, ప్రశస్తకవియు నగు దగ్గుపల్లి దుగ్గన ప్రణీతము. ఈ గ్రంథములో మూడాశ్వాసములే లభించినను, నవి నాచికేతుని పూర్వకథ సమగ్రముగా తెలుపుచున్నది. దుగ్గన కృతి వెనుక నీ క్రింది రచనములు వెలువడినవి.

1. నాచికేతూపాఖ్యానము - చందలూరి చిక్కయ కృతము. ప్రబంధము - గ్రంథము లభ్యముకాలేదు. ప్రబంధరత్నావళి యను సంకలన గ్రంథమున నాఱు. పద్యము లుదాహృతమైనవి. ఈతఁడు దుగ్గనకు సమీప కాలమువాడో తరువాతివాడో యై యుండును.

2. నాచికేతూపాఖ్యనము-మిక్కిలి మల్లికార్జునకవి (1805-1875) ఇది మూడాశ్వాసముల ప్రబంధము-ఇది క్రీ. శ. 1876లో నొకమాఱును, క్రీ. శ, 1926లో నొకమాఱును ముద్రితమైనది.

3. నాచికేతూపాఖ్యానము - తోలేటి వేంకటసుబ్బారావు - వచనము - ముద్రితము - 1887. ఇది నిర్దుష్టమగు గ్రాంథికశైలిలో రచితమైనది.

4. నాచికేతూపాఖ్యానము - దక్షిణదేశమున శృంగారకవి తిరుమల నాథకవి దీనిని ద్విపదరూపమున రచియించియున్నాడు - అది అముద్రితము - మూఁడాశ్వాసములు గలది. తంజావూరికి సంబంధించినది.

పై గ్రంథము లన్నియు నాచికేతూపాఖ్యానము అను పేరుతో నున్నను దుగ్గన గ్రంథము మాత్రము నాసికేతోపాఖ్యానమను పేరితో

---

1. పూర్వము కృష్ణాజిల్లా, ముక్త్యాలయందు ప్రకటితమగుచుండెడి "సరస్వతి" యను మాసపత్రికయందు ముద్రితమైనది. నేడీ ముద్రణప్రతులు లభింపవు. దీనిని కీ. శే. వేటూరి ప్రభాకరశాస్త్రిగారు సంపాదించి ప్రకటించిరి.

వెలయుచున్నది. దుగ్గనయే తన కావ్యమున నొకచోట నిట్లు మార్పరాని ప్రాసస్థానమున నిబంధించియున్నాఁడు.

సీ॥ అనఘ! భారతమహాఖ్యానంబు కథలెల్లఁ
　　బాటించి నీవు చెప్పంగఁ దొల్లి
సావధానంబున నాద్యంతమును వింటిఁ
　　గడు నొప్ప నప్పుణ్యకథల సరవిఁ
బ్రానంగికంబుగా నాసికేతుని కథఁ
　　జెప్పితి వీవు సంక్షేపవృత్తి　　(1-93).

కావున తెనుగున నాచికేతశబ్దము నాసికేతశబ్దముగా వ్యవహృతమైనదని చెప్పవచ్చును.

ప్రాచీనమైన యుపనిషత్కాలమునుండి నచికేత నాచికేత శబ్దము లుండగా, దుగ్గన కథానాయకుని నామమునందే యిట్టి మార్పేల కావించెనని విజ్ఞులు సందేహింపకపోరు - మన పూర్వకవు లేది వ్రాసినను, దానికేదో తగిన యాధారముగాని యుపపత్తిగాని యుండకమానదు - ప్రస్తుతము దుగ్గనయు కథానాయకుని [illegible] నామము మార్చుటకు కారణ మాతని జన్మ వృత్తాంతమే - ఆ కథ యిది.

బ్రహ్మమానస పుత్రుడును, ఉన్నిద్ర బ్రహ్మచర్యనిష్ఠాగరిష్ఠుడగు నుద్దాలకమహాముని తన యాశ్రమమున తపస్సు చేసికొనుచుండగా పిప్పలాదు డను ఋషి యరుదెంచెను. కుశలప్రశ్న లైనవెనుక, పిప్పలాదు డుద్దాలకుని గృహస్థాశ్రమము స్వీకరింప గోరెను. ఉద్దాలకు డంగీకరింపక తన తండ్రి యగు బ్రహ్మకడకు వెడలి యాతని యభిప్రాయము కోరెను బ్రహ్మయు నాతఁడు పెండ్లి చేసికొనవలెననియే యుపదేశించెను. కాని యుద్దాలకుడు వినక, తాను బ్రహ్మచర్యవ్రతము నడుపుదునని భీష్మించెను. బ్రహ్మయు, "నీకు పుట్టిన కొడుకు, తన తల్లిని నీకు పెండ్లిసేయును" అని నుడివెను ఉద్దాలకుడును బ్రహ్మను వీడి ముందటికన్న నిష్ఠతో తపస్సు చేయుచుండెను. ఒకనాడు తపోభరముచే నాతడు, పూర్ణిమానిశిని

నిద్రావశుడైయుండగా, స్వప్నమున నొక సౌరసాక్షి త న్నుపగూహనమాచ రింపగ, నాతనికి వీర్యస్ఖలనమయ్యెను. తత్క్షణమే, అతడు మేల్కొని, బ్రహ్మచర్య విచ్ఛిత్తి కెంతయు చింతించి, యా చరమధాతువు నొక పద్మ సంపుటంబున నునిచి, ఆ తామరపత్రముల కొక పుష్పాకార మేర్పఱచి తన కెదురుగా నున్న భాగీరథీప్రవాహమున దానిని విడచెను.

ఆ సమయమునందే, ఆ భాగీరథీతీరమునకు కొండొక దూరమున రఘుమహారాజు కుమార్తె యగు 'చంద్రవతి' యను కన్యక, ఋతుస్నానార్థయై వచ్చెను. ఆమె చెలులతో నీటిలో దిగి స్నానముచేయుచుండ, దైవవశముచేత ఉద్దాలకుడు విడిచిన తామరపూవా సమయమున నచ్చటికి కొట్టుకొని వచ్చెను. ఆ పూవుయొక్క ఆకారమునకు సువాసనకు నాకర్షితయై చంద్రవతి దాని నాఘ్రాణించుచుండెను. ఇంతలో చెలికత్తెల స్నానములు కాగా, నామెయు, స్నానమును ముగించి, యంతఃపురమునకు వచ్చెను. వచ్చిన కొన్ని దినములకే యామె గర్భము ధరించెను. అంతిపురిలోనివారెల్లను భయభ్రాంతులైరి. చంద్రవతియు, తనకు పురుషసంపర్కము లేకుండ గర్భ మెట్లు కలిగెనని, యెంతయో దుఃఖించెను. కాని తాను తామరపూవు మూర్కొనిన సంగతియే మఱచినది. తండ్రి యగు రఘుమహారాజీ యుదంతము నెఱింగి, తన వంశమునకు కళంకము దెచ్చినదని యామెను నొంటరిగా నడవులకు పంపివేసెను. ఆమెయు గర్భభారముచే, యడవులలో వెడలుచుండగా తృణబిందుడను ఋషి, దివ్యదృష్టితో నీమె వృత్తాంతమును తెలిసికొని తన యాశ్రమమున నామెకు తావొసంగెను. అంత కొంతకాలమున కామె దివ్యవర్చస్సుతో నున్న కుమారుని గనెను. తృణబిందుడును నితర మౌనులును నాతని జన్మరహస్యము నెఱింగినవారు. గావున నాతనికి నాసికేతుడు (నాసిక+ఇతః - నాసిక - ముక్కుద్వారా - ఇతః - ప్రవేశించినవాఁడు) అని నామకరణము చేసిరి.

నాసికేతుడు పెరుగుచు స్తన్యముకొఱకు మిక్కిలిగా నేడ్చుచుండ, చంద్రవతి కోపము దెచ్చికొని, ఓరీ పాపీ! నీ మూలముగా నేను తల్లిదండ్రుల కెడమైతిని. నీవును అట్లే అగుమని, ఒక పేపబెత్తములచే చేయబడిన మందసయం దా శిశువునుంచి గంగలో విడిచెను. ఆ మందసయు నదిలో

కొట్టుకొని పోయి, ఉద్దాలకాశ్రమము చెంగట నిలిచియుండెను. ఉద్దాలకుడును మాధ్యాహ్నిక కృత్యములు తీర్చుకొనుట కచ్చటికి వచ్చి, మందస తెఱచి, శిశువుని గని పుత్రవాత్సల్యము పొంగారగా నాతని తెచ్చి, తన యాశ్రమమున పెంచుచుండెను. ఆతడును కొంత పెద్దవాడయ్యెను.

చంద్రవతి కోపముచే పుత్రుని నదిలో కూలద్రోసినదే గాని, ఆ వెనువెంటనే యామెకు పుత్రవియోగ దుఃఖము గలిగి, అచట నిలువలేక, పుత్రుని కొఱకన్వేషించుచు గంగానది యొడ్డున చాలదూరము నడచినది. దైవికముగా నామె, ఉద్దాలకాశ్రమ ప్రాంగణమున నాడు పుత్రుని చూచి, ఆనంద భరితయై యాతని వివరము లడిగెను. ఆతడును ఉద్దాలకుడు పెంచుచుండిన సంగతి నెఱింగించి యప్పు డాతడు లేడని చెప్పెను. అప్పు డామె యుద్దాలకుని యాశ్రమము నంతయు శుభ్రముచేసి, అలికి, రంగవల్లులు తీర్చి, పల్లవ తోరణములచే నలంకరించి వెడలిపోయి, అనతిదూరమున నివసించుచుండెను. ఉద్దాలకుడు తిరిగివచ్చి, యాశ్రమశృంగార మెవరు చేసిరని బాలుని ప్రశ్నించెను. తన తల్లియే యట్లు చేసెనని యాతడు ప్రత్యుత్తరము చెప్పెను. అట్లయిన నామెను పిలుచుకొని రమ్మని పుత్రు నంపెను. ఆమెయు, నేను రాజకుమార్తెను, పరపురుషు నెట్లు చూడగలనని బాలుని పంపివేసెను. ఉద్దాలకు డిది ఋష్యాశ్రమము కాబట్టి యట్టి శంక వలదనెను. చంద్రవతియు నచటికి రాగానే ఉద్దాలకునికి, తనకు కలలో కానవచ్చిన కాంత స్వరూపము మనోగోచరమైనది. అతడు సంయమి కావున నామెను నీవీ బాలుని కన్న సంగతి నెఱింగింపుమనెను. చంద్రవతియు వృత్తాంత మంతయు సవిస్తరముగ చెప్పగనే, ఉద్దాలకుడు ఆమె నిర్దోషి యని గ్రహించి తనవలననే యీ పుత్రుడు జన్మించెనని యెఱింగి, రఘు మహారాజువద్ద కేగి, యథావిధిగ నామెను వివాహమయ్యెను.

"నాసికాంత స్సముద్భూతః సర్వలక్షణ సంయుతః
నాసికేతు రితి ఖ్యాతః మునిభి కృతమంగళైః"

అను [redacted]లశ్లోకము ననుసరించి దుగ్గన దీనిని నాసికేతోపాఖ్యాన మని పేర్కొన్నాడు.

కాని నాసికేతశబ్దము పైని వివరించిన రీతిని నాసికా+ఇతః అను పదచ్ఛేదమువలన వ్యుత్పన్నము కాదనియు నాసికాశబ్ద మాకారాంత స్త్రీలింగ మగుటచేత తదస్య సంజాతం తారకాదిభ్య ఇతచ్ అను పాణినిసూత్రము (5-2-36) ననుసరించి తద్ధితప్రత్యయ మగును. అప్పుడు మొదట ముక్కు లేనివాడు. తరువాత ముక్కు కల్గినవాడు అను నర్థము వచ్చుననియు నొక విద్వాంసుఁడు వ్రాసియున్నాఁడు. ఆ పదచ్ఛేదము ననుసరించి, తారకిత శబ్దమువలె నాసికితశబ్ద మేర్పడును. తారకాద్యా కృతిగణములలో నాచికేత-నాసికేత శబ్దములు పఠింపబడలేదు.

ఇక 'పో' అను నర్థము గల ఇణ్ ధాతువువలన కర్త్రర్థక క్తప్రత్యయము చేర్పగా నిష్పన్నమైన రూపమైన నాసికేతశబ్దమైన, అప్పుడు ముక్కునుండి పోయినవాఁడని యర్థము వచ్చునుగాని ప్రవేశించినవాడు, పుట్టినవాఁడు అని యర్థము రాదు. కాబట్టి నాసికాయాః+ఇతః ముక్కువలన బయలుదేరిన వాఁడు అని యీ పదమునకు వ్యుత్పత్తి చెప్పుట సర్వవిధముల సమంజసము. భారతి. సం. 4. సం. 8. (4-8).

తెలుగున నాచికేత నాసికేత శబ్దములిట్లు ప్రచారమును బడసినను, కఠోపనిషత్తు కథకును, పైకథకును సంబంధమేమని పాఠకులకు సందేహము కలుగవచ్చును. నాసికేతోపాఖ్యానమున నాసికేతుని తండ్రి ఉద్దాలకుఁడు. కఠోపనిషత్తు ప్రారంభమున, నాచికేతుని తండ్రి వాజశ్రవస్సు అని యున్నను, ౧౧వ శ్లోకములో యథాపురస్తాద్భవితా ప్రతీత ఔద్దాలకి రారుణిర్మత్ప్రసృష్టః (నా యనుగ్రహముచేత అరుణిపుత్రుడైన ఔద్దాలకి నిన్ను గుర్తుపట్టుగాక!) అని, నచికేతుని తండ్రి ఔద్దాలకి యని కలదు. మఱియు నచికేతుని తండ్రికి గౌతముడు, అరుణి ఔద్దాలకి, వాజశ్రవస్సు అను పేళ్లున్నట్లుగా నా శ్లోకవ్యాఖ్యానమువలనఁ దెలియుచున్నది. (చూడుడు పుట 23, 24) భారతమునగూడ నాచికేతుడౌద్దాలకి యౌరసపుత్రుఁడని చెప్పబడినది. తెలుఁగున ఔద్దాలకినే ఉద్దాలకునిగా కవులు వ్యవహరించిరి. కాబట్టి కఠోపనిషత్తు కథానాయకుడగు నాచికేతుడును, తెలుగువాఙ్మయమున ప్రస్తుతుడైన నాసికేతుడునునొకడే యని సిద్ధాంతము.

నాచికేతుడు యమలోకమునకు పోవు సన్నివేశము కఠోపనిషత్తున, ప్రబంధకథయందును భిన్నముగ నున్నది. ఉపనిషత్తులో, తండ్రి గోదానములు చేయు సందర్భమున నాచికేతుడు తండ్రిని తన్నెవరి కిచ్చెదవని పలుమాఱు లడిగినట్లు వినువుచే, కోపముచే తండ్రి యమున కిచ్చెద నన్నట్లును కలదు. ప్రబంధకథలో, కుశలు, ఇధ్మములు తెచ్చుట మఱచినందున, తండ్రి నిత్యాగ్నిహోత్రములకు భంగము కలిగినందువలన, నాతడు యమలోకమునకు పుత్రుని, బొమ్మని శపించినట్లు కలదు. ఇచ్చట నొక విషయము చెప్పవలసియున్నది. మహాభారతమునకూడ నాచికేతుని కథలో ని ట్లిధ్మములు, కుశలు తెచ్చుట యాలస్య మైనందువలన తండ్రి శపించెననియే కలదు. కాని కథచివర, నాచికేతుడు తాను యమలోకమునకు పోయితిననియు, నందు నరకబాధ ననుభవించువారినే గాక గోదానప్రభావము వలన పుణ్యలోకము లనుభవించినవారిని చూచివచ్చితిననియు జెప్పెను. అనుశాసనిక పర్వమున నీ కథ ధర్మజునకు భీష్ముడు గోదానమహాత్మ్యము చెప్పు పట్టున నున్నది. దీనినిబట్టి తెలుఁగున నాచికేతుని కథకు కఠోపనిషత్కథకు సంబంధ మున్నదనుట నిశ్చితము. దీనికి కారణ మేమనగా కఠోపనిషత్కథ చాలా ప్రాచీనమైన వేదకాలమునాటిది. అది పౌరాణిక కాలమునకు కొంత మార్పు చెందినది. పౌరాణిక కాలమునాటి కథ భారత మూలమున వ్యాప్తిచెందినది.

మహాసముద్రమువంటి భారతేతిహాస వాఙ్మయమున కాలగర్భమున నడగిన యిట్టి యుదంతము లెన్నియేని గలవు. నాచికేతుని పై జననాది వృత్తాంతము కథ నేటి కాలమున నే గ్రంథమందును (పూర్వగాథాలహరి) మొదలగువానియందు[1] సూచితము కాలేదు. ఈ కథకు సంస్కృతమాతృక యొకటి యున్నది. దానివలన దీని యాకరము తెలియలేదు.

1. పూనాయందలి భండార్కారు పరిశోధకమండలివారి గ్రంథాలయమున నున్నది. అం దీ గ్రంథ మే పురాణమునుండి యుద్ధృతమైనదో ఆ విషయుముమాత్రము కన్పట్టుటలేదు.

కఠోపనిషత్తులోని నాచికేతుని జన్మమును దెలుపు నీ యపూర్వకథ నాంధ్రవాఙ్మయమున ప్రచారమునకు దెచ్చిన, తెలుఁగుకవులు మనము కృతజ్ఞతాపూర్వకముగ స్మరింపవగినవారు. ఇతర దాక్షిణాత్యభాషలలోను ప్రత్యేకముగ నీ కథ కానరాకపోవుటచే నిందు పాఠకలోకమున కుపకారకముగ నుండునని చేర్చితిని.

తత్త్వజ్ఞులకు, వేదాంతులకు, సాధకులకు తఱుఁగని యెఱుక కాణాచియై, ఆర్థిక దాహముచేతను, దేహ దాహముచేతను, శోషిల్లిన పాశ్చాత్యనాగరతా వాసనావాసితుల కమృతభాండమైనది కఠోపనిషత్తు. ఆంధ్రమున వెలసిన శ్రీ చిన్మయానందుల యీవ్యాఖ్యాకృతి అధ్యాత్మిక విద్యాగంధశూన్యమైన, అవ్యతన విద్యాప్రణాళికలయందు నిర్బంధ పఠనీయ గ్రంథముగా నియమితమైన నఖిలమాణవక మానసక్షేత్రముల నాధ్యాత్మిక విజ్ఞానబీజములు నాటుకొనగలవు. వయోజనుల కిది నిత్యపఠనీయమైన వారితరీతిని, వారి చిత్తనవృత్తి యాధ్యాత్మికోన్ముఖమై లోకవృత్తముతో నమీచీన నమన్వయము నంపగలదు. ఆంధ్రావళికి నైహికసౌఖ్యమును, అభ్యుదయమును ఆముష్మికానందమును ప్రసాదింపగలదు.

సహనావవతు సహనౌభునక్తు సహవీర్యంకరవావహై
తేజస్వి నావధీతమస్తు మావిద్విషావహై

ఓం శాంతిః శాంతిః శాంతిః

ఈ శాంతిపాఠము విద్యాబోధన, విద్యాధ్యయనాంతములయందు ప్రతిదినము గురుశిష్యులచే పఠ్యమాన మగుచుండెడిది. ఈనాడును ఆంధ్రవిశ్వవిద్యాలయమువారి చిహ్నము 'తేజస్వినావధీతమస్తు' అనునదియే. కావున ప్రస్తుతాంధ్రానువాదమును, ఆంధ్రదేశీయ సర్వకళాశాలలయందే గాక, రాష్ట్రేతరప్రాంత కళాశాలలయందును, విశాలాంధ్రమునను, నితోఽధికముగ నధీతిబోధాచరణ ప్రచారముల బడయుగావుత.

ఇట్టి మహోద్గ్రంథమునకు నుపోద్ఘాతపూర్వకముగ కొన్ని వాక్యములు వ్రాయుటకు నా కనుజ్ఞ నొసంగిన శ్రీ చిన్మయానందస్వామిజీవారికి నా సాష్టాంగ నమస్కృతులు.

**ఇతి శివమ్**

మనల నతండు బ్రోచుత సమంబుగ సౌఖ్యము సేయుగావుతన్
మనకు నధీతి బోధ లసమానము గాగ బలం బొసంగుతన్
మనదగు నీ యధీతమును మానితతేజము నొంది ద్వేషమున్
మన కెపుడుం దొలంగుతఁ! శమంబు, శమంబు, శమంబు గావుతన్.

౧3-౭-౧౯౫౮.
మదరాసు

విద్యారత్న,
నిడుదవోలు వేంకటరావు, ఎమ్. ఏ.
మద్రాసు విశ్వవిద్యాలయాంధ్రశాఖాధ్యక్షుడు.

# సవరణ పత్రము

| పుట. | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 52 | 10 | లాంతములో | లాంతరములో |
| 53 | శ్లో. ౨ | ద్యృణీతే | ద్వృణీతే |
| 59 | 25 | లందు | నందు |
| 62 | 2 | ఆవీశ | ఆవేశ |
| 70 | 12 | సిద్ధియైన | సిద్ధమైన |
| 143 | 9 | నాసి | నాస్తి |
| 146 | 5 | అది | ఆది |
| 197 | శ్లో. ౧౦ | రాత్మ | రాత్మా |
| 204 | 20 | పనిత్తు | పనిషత్తు |
| 225 | 3 | వరైన | వరైతే |
| 232 | 2 | న్యము | న్యమును |
| 236 | 19 | ధాన్య | ధ్యాన |

ఇంకను కొన్ని ముద్రణప్రమాదములు దొరలియుండవచ్చును. సహస్రాక్షుడు పరిశీలించినను ముద్రారాక్షసములు తప్పుటలేదు. క్షమతో దిద్దుకొని చదువుకొనప్రార్థన.

## మొదటి పుట - భాషాంతరీకరణములు

1. కఠోపనిషత్తు మొట్టమొదట క్రీ. శ. 1656–57వ సంవత్సరమున షాహజహాను కొమారుడగు దారా యను విద్వత్పోషకుని యధ్యక్షతక్రింద పారసీకభాషలోనికి భాషాంతరీకరణమైనది.

2. ఆ పారసీభాషనుండి యీ వెనుక కొలదికాలమునకే నసగా క్రీ. శ. 1680 ప్రాంతముననే లాటిన్ భాషాంతరీకరణము వెలసినది. పాశ్చాత్యదేశీయులకు హైందవ వేదాంతశాస్త్రమును దెలిసిన ప్రథమగ్రంథ మిదియే.

3. ల్యాటినుభాషనుండి, ఇంగ్లీషు, జెర్మను, ఫ్రెంచి, స్వీడిషు ఇటాలియను భాషలలోనికి పరివర్తితమైనది.

4. ఆసియాఖండ భాషలలో జపానుభాషలోనికి ననూదితమైనది.

5. ఇంగ్లీషుభాషలో దీనిని తొలుత యనువదించిన మహనీయుడు రాజా రామమోహనరాయలు.

6. మాక్సుముల్లరు, పాల్‌డ్యూసెన్, మ్యూర్, హ్యూమ్ మొదలగు వారి ఆంగ్లేయ భాషాంతరీకరణములు గలవు.

7. భారతీయ భాషలన్నింటిలో నిది యనూదితమైనది.

ఈ యుపనిషత్తునందలి 'ఆత్మానం రథినం విద్ధి' అను మంత్రమునకు తెలుఁగున గల భాషాంతరీకరణముల నిచ్చుచున్నాఁడను. దీనివలన యీ యుపనిషత్తునకు తెలుఁగున గల ప్రచారము తేటపడగలదు.

మూలము :

ఆత్మానం రథినం విద్ధి శరీరం రథమేవతు
బుద్ధింతు సారథిం విద్ధి మనః ప్రగహ మేవచ
ఇంద్రియాణి హయానాహు ర్విషయాం స్తేషు గోచరాన్
ఆత్మేంద్రియ మనోయుక్తం భోక్తేత్యాహుర్మనీషిణః ॥

తిక్కన:

క. తేరు శరీరము దానికి
సారథి సత్త్వంబు తురగచయ మింద్రియముల్
దారుణతరబుద్ధి వ్యా
పారంబులు దనరుజనుప పగ్గము లధిపా! —స్త్రీ. 1-57

క. నరవర! యేర్పడ విను మ
త్తురగంబుల పటు రయంబుతో ననుచరితం
దిరుగు పురుషుండు సంసృతి
పరుడై భ్రమియించు నవశ భావవ్యాప్తిన్. —స్త్రీ. 1-58

క. వానిఁ దమ యిచ్చ నెందుం
బోనీకుండంగ నాఁగు పురుషుఁడు సంసా
రానేక దుఃఖభాజన
తా నిరసనమునకు నేర్చు ధరణీనాథా! —స్త్రీ. 1-59

క. యముని యధీనం బిది దుః
ఖముల ననేకములఁ జేయఁగానోపు నృపో
త్తమ! యీ రథ మవియింతురు
విమల వివేకౌషధమున విను మార్యజనుల్. —స్త్రీ. 1-60

ఎఱ్ఱన:

చ. అరదము దేహ మింద్రియము లశ్వము లాత్ముఁడు సూతుఁ డిమ్మహా
తురగచయంబు ధైర్యమను తోరపుఁ బగ్గములన్ దృఢంబుగా
మరువడిఁబోకయుండ వెరపొప్పగఁ బట్టినవాఁడు స్వర్గపుం
దెరువున నేఁగు నప్పరమధీరుఁడు నూవెయు దారుఁడెయ్యెడన్.
—అరణ్య 5-92

ఫణిభట్టు :

దేహంబు రథమగుఁ దివిరి యింద్రియములు
ఘోటముల్ మనసు దావాటమైన
రజ్జువు బుద్ధియె రాజిల్లు సారథి
రథికుండు జీవుండు రాజవర్య
వెరవరి యైన వివేకునిచే శిక్ష
లేకున్నసారథి జోక దప్పి
యేమఱియుండఁగ నింద్రియాశ్వంబులు
విషయ భూములవెంట వెడలనీడ్చి
కొనుచుఁ గొనిపోయి రథికునిఁ గూల్చునెంత
గామముఖ శత్రుపట్కు విక్రాంత భూమిఁ
గర్మపాశంబులను వారు గట్టివైవ
దీనమతి నుండుఁ బురుషుండు తెలివి లేక.

—పరతత్త్వరసాయనము 4-209

# దివ్య సందేశము

## ( కఠోపనిషత్తును గూర్చి రెండు మాటలు )

## సద్గురు శ్రీస్వామి తపోవన్‌జీ మహరాజ్

శ్రేష్ఠమైన దశోపనిషత్తులలోను ఈ కఠోపనిషత్తు చాలా సుబోధమైనది. ఉపనిషత్తనగా బ్రహ్మవిద్య. అదియే బ్రహ్మజ్ఞానము. సాధారణముగా అనేకమైన ఇతర ఉపనిషత్తులు చేయునట్లు, ఉపాసనాది కర్మలను కలిపి అసలువిషయమును క్లిష్టపఱుపకుండ, అన్ని ముఖ్యవిషయములను వెల్లడించుచు, ఈ కఠోపనిషత్తు బ్రహ్మవిద్యను సుస్పష్టముగా, సువ్యక్తముగా బోధించి వివరించుచున్నది. ఈ ఉపనిషత్తు జగదేకసత్యమైన ఆ పవిత్రాత్మను, పరబ్రహ్మను, వర్ణనలతో రంగులువేసి సుస్పష్టము చేయుచున్నది. ఈ ప్రపంచములోని సమస్త దుఃఖములకు, ఆపదలకు మూలకారణము అవిద్య. బుద్ధిబలముచేతనైతేనేమి, అంతఃప్రేరణముచేతనైతేనేమి, మానవుడు ఈ శరీరమే ఆత్మ యని ఎంచుకొనుచున్నాడు. ఇదియే అవిద్య. "దేహము ఎప్పటికిని 'నేను' కాదు. నిత్యప్రకాశము, శాశ్వతము, నిర్మలము, సత్యము అయిన ఆత్మయే 'నేను.' అటువంటి ఆత్మను వివేచన చేసి, బాగుగా ధ్యానించి, సుస్పష్టముగా గ్రహించి, అనుభవించుటయే జ్ఞానమనబడును. ఈ ఆత్మజ్ఞానమును నచికేతుడు కోరగా యమధర్మరాజు సోదాహరణముగా, దీనిని వివిధ రీతులలో అతనికి వివరించి బోధించుచున్నాడు. గ్రంథమునకంతకు సారాంశమైన వాక్య మిది—"సమోదతే మోదనీయం హి లబ్ధ్వా"—ఆనందస్వరూపమైన ఆత్మను పొంది అత డానందించుచున్నాడు." నిత్యానందమే ఆత్మస్వరూపము. ఆత్మయే ఆనందమునకు ముఖ్యకారణము. ఆ ఆత్మయే 'తాను' అనునది. ప్రతివారును దానిని పొందియే ఉన్నారు. కావున దానిని పొందుట యనగా దానిని తెలుసుకొనుటయే. మామిడి పండును, 'ఆపిలు' పండును పొందునట్లు ఆత్మను పొందుటకు అది ఒక ప్రత్యేక వస్తువు కాదు. అది మనలోనే శుద్ధచైతన్యరూపమై, స్వప్రకాశమై ఈ దేహములోనే ఉన్నది. ఆ చైతన్యముచేతనే సర్వకార్యములు చేయు

నప్పటికిని అజ్ఞాని ఈ ఆత్మను తెలిసికొనలేకున్నాడు. కావున శ్రుతిమాత విచారాశ్చర్యములతో ఇట్లు చెప్పుచున్నది :

ఉత్తిష్ఠత—జాగ్రత—ప్రాప్యవరా న్నిబోధత ॥

'లెండు. మేలుకొనుడు. ఆత్మజ్ఞానులగు మహాత్ములను శరణువేడుడు. ఆత్మను తెలిసికొనుడు.''

ఇట్టి ఆత్మజ్ఞానమే ఈ కఠోపనిషత్తునందు మరలమరల బోధింపబడు చున్నది. బుద్ధిమంతుడైనవాడు, ఆసక్తి కలవాడు, దీనిని చదివినను వినినను నిజముగానే యీ విషయమును తెలిసికొని పూర్తిగా గ్రహించ గలుగుచున్నాడు. "నేను సత్యము, నిత్యము ఆనందమునగు (సచ్చిదానంద స్వరూపమగు) బ్రహ్మమును నేనీ దేహ మనో బుద్ధులకు అతీతుడను'' అను నిట్టి జ్ఞానమాత్రము ఉపనిషచ్ఛ్రవణముచే కలుగవచ్చునుగాని అంత మాత్రముననే ఆతడు తత్ఫలితమును అనగా ఆత్మానందమును పొందలేడు. "నేను పవిత్రమై, ఆనందస్వరూపమై, నిత్యమై, జనన మరణ రహితమైన ఆత్మను'' అనుదానిని అదేపనిగా గంగాప్రవాహమువలె ఏకధారగా నిరంతరము మననము చేయుచుండుటయే ఆత్మజ్ఞానము. అదియే అవిద్యను నశింపజేసి పరమశాంతిని కలిగించును.

దారిప్రక్కన జరుగు వేదాంతోపన్యాసముల వినిన జట్కాబండి నడపువాడుకూడ ఆత్మను క్షణకాలముపాటు తెలిసికొనుచున్నాడు. తనను ఆ ఆత్మగా ఆ సమయములో తెలిసికొనినప్పటికినీ, తన మనస్సు దృఢముగా దేహాత్మభావము కలిగియున్నదగుటచేత తనలో ఆ ఆత్మభావమును మరల మరల భావించలేడు. ఆత్మ అను భావమునకుగాని, ఆత్మజ్ఞానమునకుగాని, అతని మనస్సులో తావు లేదు. కామక్రోధాదులతో కూడిన అతని మనస్సు పలువిధములైన రాగద్వేషములతోను, ఆశలు ఆతురతలతోను, నిండియున్న దగుటచేత 'నేను - నాది' అను భావమును, దేహాభిమానమును వదలి ఆ ఆత్మను కొద్దిక్షణములుకూడ భావింపలేడు. తృష్ణ అనునట్టి యగ్నిలో ఆ భావము మఱిగి ఇగిరిపోవుచున్నది. నిశ్చలమై, శాంతియుతమై, ఏకాగ్రమైన మనస్సుతోనే ఆత్మను భావింపవచ్చును, మననము చేసి తెలిసికొనవచ్చును.

కాని, రాగద్వేషములతో, చంచలమైన మనస్సుతో ఆత్మను తెలిసికొను అవకాశమే లేదు.

ఈ కఠోపనిషత్తు సంబంధమైన చర్చలను వినినపుడు, తెలివైనవారి కెవరికైనను, ఆత్మనుగుఱించిన ఒక అభిప్రాయ మేర్పడును. అనగా వారు ఆత్మయొక్క మహత్త్వమును బుద్ధితో తెలిసికొనగలుగుచున్నారు. ఆత్మ దృష్ట్యా బుద్ధి అత్యల్పమైనదగుటచేత, ఆ బుద్ధికి సామర్థ్య మెంత కలదో అంతటి సామర్థ్యముతో మాత్రమే అది ఆత్మను గ్రహింపగలుగుచున్నది. కాని 'ఆత్మవిత్' లేక ఆత్మజ్ఞాని యగుటకు ఒకనికి అట్టి జ్ఞానముమాత్రము చాలదు. ఏలననగా ఆ జ్ఞానము సంపూర్ణము కాదు. అది నియమితమైన జ్ఞానముమాత్రమే యగును. శ్రోతలయొక్క మనస్సు నిశ్చలమై, ప్రశాంతమై, ఏకాగ్రత కలదైనయెడల, నిరంతరాత్మ ధ్యానముచేత ఆ మనస్సు అట్టి జ్ఞానమును తెలిసికొని అందు స్థిరపడుచున్నది. కావున అవిద్యను పూర్తిగా నశింపజేసి, శాంతి ఆనందముల నిచ్చు సంపూర్ణజ్ఞానమును పొందవలయు నని, శ్రోతలయొక్క మనస్సు నిశ్చలమై, పవిత్రమై, ఏకాగ్రత కలదై యుండవలెను దీని నీ మంత్రము స్పష్టముగా వివరించి చెప్పుచున్నది.

శ్లో॥ "నావిరతో దుశ్చరితాత్ నాశాన్తో నాసమాహితః।
నాశాన్తమనసో వాపి ప్రజ్ఞానేనైనమాప్నుయాత్॥"

దుష్కర్మలను ఎవడు స్వేచ్ఛగా చేయునో, ఎవనికి ఇంద్రియ భోగములందే కోరిక కలదో, ఎవనికి ఏకాగ్రచిత్తము లేదో, అట్టివాడు కేవల జ్ఞానముద్వారా ఆత్మను పొందలేడు.

ఈ కారణముచేతనే వేదాంతములో బ్రహ్మజ్ఞానసాధనము వైరాగ్యమే అని చెప్పబడినది. మనస్సులోని రాగ ద్వేషాది మాలిన్యమును తుడిచివేసి, వైరాగ్యము మనస్సును పరిశుద్ధము చేయును. కఠోపనిషత్తులోవలె మరి ఏ ఇతర ఉపనిషత్తులోను వైరాగ్యమునుగూర్చి ఇంత స్పష్టముగా వర్ణితము కాలేదు. యథార్థముగా బ్రహ్మవిద్యను సంపూర్ణముగా నభ్యసించు ప్రతిభాశాలియైన శిష్యుడు—నచికేతస్సు మూర్తీభవించిన వైరాగ్యమే!

సమస్త ఉపనిషద్వాఙ్మయములోను, ఇటువంటి మహామాహాత్మ్యుడై, బ్రహ్మవిద్యకు అధికారియైన శిష్యునిగూర్చి ఎచటను ఇంత విపులముగా చెప్పబడియుండలేదు. "తవైవ వాహాస్తవనృత్య గీతే—" ఈ రథములు, అశ్వములు, నృత్యగానములు చేయు అప్సరసస్త్రీలను నీవే ఉంచుకొనుము" అని తనకు విషయభోగములను చేతి కందించుచున్న గురువగు మృత్యుదేవతతో వెంటనే నచికేతుడు పలికెను. నచికేతునికి పేరాశ కలిగించుటలో ధర్మరాజు పూర్తిగా ఓడిపోయెను. వైరాగ్యమువలన, ధ్యానమువలన, మానవుని మనస్సు క్రమక్రమముగా ఏకాగ్రత కలది యగుచున్నది. సూటిగా ఆత్మను తెలిసికొనుటకు చిత్తైకాగ్రత, ధ్యానము, తప్పక ఉండి తీరవలయును.

చిత్తైకాగ్రత యనబడు యోగముయొక్క ప్రాప్తివలన మానవుడు పరమాత్మను దర్శించి సర్వ సుఖదుఃఖాతీతమై, శాశ్వత ఆనందదాయకమై, సంపూర్ణ సత్యస్వరూపమైన అట్టి జ్ఞానములో స్థిరపడుచున్నాడు. ఆత్మజ్ఞానమునకు తప్పించుకొనలేని సాధన యగు ఈ యోగ మెటువంటిది? అను ప్రశ్నను శ్రుతిమాత ఇట్లు వివరించుచున్నది :

శ్లో॥ "యదా పఞ్చావతిష్ఠన్తే జ్ఞానాని మనసా సహ।
బుద్ధిశ్చ న విచేష్టతి తామాహుః పరమాం గతిం
తాం యోగమితి మన్యన్తే స్థిరామిన్ద్రియ
ధారణాం ॥"

పంచేంద్రియములతో సహా, మనస్సు యే అవస్థయందు వశపడునో, బుద్ధి యెచట స్థిరపడునో, అట్టి అవస్థ ఉత్తమమైనది. దానినే ప్రాచీన యోగులు "యోగము" అనిరి. ఈ యోగము ఇంద్రియములను మనస్సును వశపఱచుకొని నిత్య, సత్య, ఆనందరూపమైన (సచ్చిదానంద రూపమైన) ఆ పరమాత్మను తెలియజేయు సాధనమైనప్పటికినీ, ఈనాటి ప్రాచ్య పాశ్చాత్య పాఠకులు ఈ యోగమును చాలవరకు అపార్థము చేసికొనిరి. వారు యోగమనగా ఏదో గుప్తశక్తి అనియు, ఈ దేహేంద్రియముల

ు అమానుషశక్తి యనియు తలచుచున్నారు. వారు 'కుండలిని'
ంక్క అద్భుతశక్తిచే ప్రభావితులై యోగులు కాగోరుచున్నారు. అంతే
), వారి కాత్మజ్ఞాన మక్కరలేదు. ఆత్మజ్ఞానముకొఱకు వారు
ాగాభ్యాసము చేయరు. ఉపనిషత్తుల ప్రకారము చిత్తైకాగ్ర్యమే యోగము
ైన ఆత్మజ్ఞానమును పొందగోరువాడు, అట్టి యోగాభ్యాసమునే
మవలెను.

వైరాగ్యము, చిత్తైకాగ్ర్యము లేక ఆత్మజ్ఞానము పొందే అవకాశమే
ం కావున ప్రతి జిజ్ఞాసువు ఎట్లైనను ఆ రెంటిని పొందుటకు ప్రయత్నించి
వలెను. కఠోపనిషత్తులోని ఈ పైమంత్రము దీనినే చెప్పుచున్నది.
ైన మొట్టమొదట మంచిగా ఉండి మంచికర్మలనే చేయుము. భగవదా
ధనము, భగవచ్చింతన, భగవద్ధ్యానము ఇత్యాది కర్మలచే మనస్సును
త్రము చేసికొనుము. సగుణుడైన భగవంతుని ధ్యానించుట, అతని
మమును జపించుట మొదలైన ఉపాసనాక్రియలను అభ్యసింపుము.
ర్థరహితమైన సేవచేతను, ఉపాసనలచేతను చంచలమైన మనస్సు
ులమై, క్రమక్రమముగా పరిశుద్ధమగును. ఆపైని నీవు నిస్సందేహముగా
్మను తెలిసికొనుటయే గాక, ఈ కఠోపనిషత్తుయొక్క చర్చలను వినుట
న బుద్ధిచే గ్రహింపబడిన ఆత్మయందే స్థిరముగా నివసింపగలుగుదువు.

ఎప్పుడుగాని వేదాంతోపన్యాసములలో పాల్గొని, చర్చలను వినుట
కనే తృప్తిపడకుము. బుద్ధిగ్రాహ్యమైన ఆత్మజ్ఞానము మొదటి మెట్టు
త్రమే. అదియే చరమసీమ యని తలపవద్దు. ఈ బుద్ధితో ఆత్మను
ిసికొన్నతరువాత, ఆత్మదర్శనమునకు ఆత్మానుభవమునకు మరియు
్న మెట్లు ఎక్కవలసి యున్నది. ఉత్తమోత్తమమైన బ్రహ్మవిద్యనే
పనిషత్తు బోధించుచున్నది. కాబట్టి నిరంతరముగా ఆధ్యాత్మిక
ధనాభ్యాసమువలన ఆ చివరిమెట్టునుకూడా దాటుటకు ప్రయత్నింపుము.
ద్ధిద్వారా సంపాదించిన ఆత్మజ్ఞానముతో తృప్తిపడవద్దు. ప్రయత్న
ర్వకముగా ముందడుగు వేసి ఆత్మస్వరూపమును పొందుము.

# ప్రకాశకుల విజ్ఞప్తి

ఉపనిషత్తులు హిందూమతములో ప్రధానగ్రంథములు. అట్టి ప్రధాన గ్రంథములగూర్చి ఏమియు తెలియని మతస్థులను వేలకొలది సంవత్సరములనుండి "హిందువు"లని పిలుచుట విచిత్రముగానే యున్నది. మరి ఏ సంస్కృతియైనను ఇందులో సగముకాలము అజ్ఞానములో పడియున్న ఈపాటికి నశించియేయుండెడిది. కాని హిందూమతము నేటికిని సజీవమై మనలను ప్రభావితులను చేయుటకు, మన వేదాంతసూత్రములు జీవన సూత్రములతో మనోహరముగా పెనవేసుకొని ఉండుటయే కారణము. తెలిసియో తెలియకయో ప్రతిదినము ఉపనిషత్తులలో ప్రకటితమగు పరబ్రహ్మనుగూర్చి మన నిత్యజీవితములో మాట్లాడుచునేయున్నాము; భావించుచునేయున్నాము.

ముఖ్యమైన దశోపనిషత్తులలో, అంత ప్రాచీనము గాంభీర్యము కలది కాకున్నను ఈ కఠోపనిషత్తు సంక్షేపముగాను, సుస్పష్టముగాను, తాను చెప్పబోవు భావమును సువ్యక్తపరచునదిగాను ఉండుటచేత, ఇది సర్వజనప్రియమైనది. మరియు నాటకీయత కళాసౌందర్యము కలిగి ఎటువంటి విద్యార్థినైన తనవైపునకు ఆకర్షించుకొనుచున్నది. కావుననే ఇతర ఉపనిషత్తులకన్నను ఈ కఠోపనిషత్తునకు ప్రతులు ఎక్కువగా యున్నవి. ప్రపంచములోని విభిన్నభాషలలోనికి కూడ నిది యనువదింపబడినది.

హిందువుల ఆస్తిక్యతను అభివృద్ధిపరచు పాఠ్యగ్రంథము కఠోపనిషత్తు అని కొందరు విశిష్టాద్వైతులయొక్క దృఢాభిప్రాయము. స్థూలదృష్టిలో వారి వాదము అంగీకారయోగ్యమైనను గ్రంథమును తఱచి లోతుగా చూచిన ఆ వాదము అంతగా సరియైనదని ఒప్పుకొనుట కష్టతరము. శ్రీరామానుజులు ప్రత్యక్షముగా దీనికి భాష్యము వ్రాయకున్నను, తమ శ్రీభాష్యములో దీనిని విరివిగా ఉదాహరించియున్నారు. మధ్వాచార్యులయొక్క ఈ ఉపనిషద్వ్యాఖ్యానము యథార్థముగా పాక్షికమైనదే.

భారతీయ అధ్యాత్మికతత్త్వ పరిణామ చరిత్రలో కఠోపనిషత్తునకు గల మహత్త్వమును ఏ వేదాంతవిద్యార్థియు కాదనలేడు. కాని మన ఈ ప్రయత్నము చరిత్రకారుని కార్యమును నిర్వహించుట కాదు. మనము ఈ ఉపనిషత్తులోని భావములు హిందువేదాంత భావనల గొప్పదనమును వెల్లడి చేయునవని తెలిసికొన్నంతమాత్రాన తృప్తిపడలేము. మన నిత్యజీవిత సమస్యలను పరిష్కారము చేయునపుడే శాస్త్రపాఠము సఫలమైనదని తలచెదము. మతము మానవజీవిత సమస్యాపరిష్కారము చేయలేనియెడల అది మతమే కాదని తిరస్కారపాత్రమని చెప్పవచ్చును. ఈ ప్రాచీనశాస్త్రము నేడు సజీవమైన అర్థముతో కూడుకొన్నదా లేదా అను విషయమును ఉపనిషదధ్యయనము వలననే కనుగొనగలము.

ఈ ఉపనిషత్తు కాఠకశాఖకు చెందిన కృష్ణయజుర్వేదసంహితకు సంబంధించినది. కొంతమంది పరిశోధనాపండితుల అభిప్రాయముప్రకారము, దానికి మూలస్థానమైన కురు పాంచాల దేశములోనే (ఢిల్లీ-ఆగ్రా జిల్లా) అది వ్రాయబడినదని తెలియుచున్నది. ఇప్పుడున్నంతమట్టుకు ఈ ఉపనిషత్తులో మూడేసి వల్లులు గల రెండధ్యాయములు ఉన్నవి. కొంతమంది విమర్శకులు రెండవ అధ్యాయము వెనుకకాలములో చేర్చబడినదని, మూలము మొదటి అధ్యాయముతోనే పూర్తిచేయబడినదని అభిప్రాయపడుచున్నారు. ఆ ప్రతివాదుల వాదములను శాస్త్రీయముగా అంగీకరించినప్పటికినీ, ఈ కాలపు వారమగు మనము ఈ రెంటినేగాక మరికొన్ని అర్థమగు అధ్యాయములను ఈ గ్రంథములో చేర్చినను నిర్వివాదముగా వాని నంగీకరించి వారికి కృతజ్ఞులమయ్యే యుండవలెను.

ఈ కఠోపనిషత్తు క్రీ. పూ. 500 సంవత్సరములనాటి దనియు, భగవద్గీత క్రీ. పూ. 250 సంవత్సరములనాటి దనియు చెప్పుటకు చేతినిండ మనకు కావలసినంత ఆధారమున్నది. ఈ రెండును పాశ్చాత్య పరిశోధనా విధానముతోనే వారి వాదముల కనుగుణ్యముగానే నిర్ణయింపబడినవి. వారి ఈ పరిగణనకు ఆధారము ఏమనగా భగవద్గీతలో ఈఉపనిషత్తులోని శ్లోకములు ఎక్కువగా ఉదాహరింపబడుటయే అని చెప్పవచ్చును. స్వామీజీ తమ

ఉపన్యాసములో ఇటువంటివానిని ప్రత్యేకముగా ఎత్తిచూపి వాటిని చక్కగా సమన్వయపరచియున్నారు.

కఠోపనిషత్తుయొక్క ఈ మూడవ కూర్పు స్వామీజీ 1954 సం. సెప్టెంబరు - నవంబరులో ఢిల్లీలో జరిగిన జ్ఞానయజ్ఞ సందర్భములో నిచ్చిన ఉపన్యాసములమీదనే ఎక్కువగా ఆధారపడియున్నది. ఈ మూడవకూర్పు రెండవకూర్పువలెనే కనబడవచ్చును. కాని, ఇందులో నవీన భావస్ఫూర్తి కలిగిన నూతన వ్యాఖ్యానములు మఱి కొన్ని, ఆయా స్థలములలో చేర్చబడినవి కావున, యీ మూడవ కూర్పు మొదటి రెండు కూర్పులవలెనే పరమార్థమును అర్థము చేసికొని, అనుభవింపగల పాఠకుల ఆదరాభిమానములను పొంద గలదని ఆశించుచున్నాము.

మద్రాసునందలి ఉపనిషద్యజ్ఞసమయములో స్వామీజీ శిష్యుల కుపయోగపడునటుల ఈ కూర్పును ప్రకటించి అందించుచున్నారు.

4, జంతర్ మంతర్ రోడ్డు
క్రొత్త ఢిల్లీ
జూలై 10, 1957.

శ్రీమతి షీలా పూరి
ప్రకాశకురాలు.

# జీవన శాస్త్రజ్ఞులు

మతము, శాస్త్రము అను నీ రెండును ఒక మహత్తర కార్యమును సాధించుచున్నవి. మానవ జీవితమునకు సౌఖ్యమును, ఆనందమును చేకూర్చుట అను ఒకే లక్ష్యసిద్ధికొఱకు ఇవి రెండును పాటుపడుచున్నవి. ఆలోచింపగా, ఆకాంక్షించి సంపాదించిన ప్రతి స్వల్ప విజ్ఞానవిషయముకూడ జీవితములో అత్యున్నతమైన ఆనందసాధమునకు సోపానమే అగుచున్నది. విజ్ఞానశాస్త్రముతో వివాదములు పెట్టుకొను వ్యతిరేకపు శక్తులవలె గాక ప్రాచీనకాలపు మహర్షులు స్వకీయములైన ఆంతరిక పద్ధతులమీదనే జీవిత మందలి దుఃఖసమస్యను పరిష్కరింప ప్రయత్నించి అంతరాత్మను కనుగొనిరి. వారి దృష్టి తార్కికమైనది. వారి పద్ధతులు శాస్త్రీయములైనవి. విచిత్రమైనదియు సందేహబద్ధమైనదియు క్లిష్టతరమైనదియు అర్థరహిత మైనదియు యగు విషయమేదియును మతములో నుండదు. కాని వర్తమాన కాలపు నవీనమానవుడు మతమునుగూర్చి తలచినపుడెల్ల యెక్కువగా తికమక పడుచున్నాడు. లోకములో సులభతరమైన మతములయందే యీ తికమక కనిపించుచున్నప్పుడు నైసర్గికముగా గంభీరమైన హైందవ మతములో నిది గోచరించుట సహజమే. మన తరమువారు హిందూమతము 'మృతమతము' అనిన సంతోషముతో ఒప్పుకొందురు. హిందూమతము పైని మన దృష్టి యంతయు కేవలము బాహ్యమైనదగుటయే దీనికి కారణము. నవీన విమర్శకుడు దీనిని ఒక పెద్ద విశాలవృక్షముతో పోల్చు చున్నాడు. అది తన శాఖలను విరివిగా వ్యాప్తిజెందించి ఒకప్పుడు ఫల పుష్ప భరితమైయుండి, ఒకానొక శిశిర ప్రాతఃకాలమున మోడువాఱి కన్పించి నపుడు చూపఱులు దానిని ఎండిపోయిన వృక్షముక్రింద జమ కట్టుదురు. కాని దానిని సమీపించి సూక్ష్మముగా పరిశీలించి, ఆ మహా వృక్షమునందు కొన్నియైనను జీవనకణములు కనబడినపుడు ఇది చిగురెత్తగలదా లేదా యని తెలిసికొనుటకు దానిని నఱికివేసి పరీక్షింప నక్కరలేదు. తడి యున్న ఆ వృక్షములోనే జీవనకణములు అభివృద్ధి చెంది మరల ఆ చెట్టును పచ్చిగా చేయగలవు. అట్లే మన మతముకూడ యెల్లప్పుడు

మృతప్రాయముగా కనిపించి క్రొంగ్రొత్త పుష్పములను ఫలములను నీయకున్నను, ఈ మతమందు మూఢనమ్మకములు, మంత్రములు, మోసములు మొదలగువానికి చోటుండి, అవి పెచ్చుపెఱుగుట కవకాశముండుటచేత మనము ఈ మతము మృతినొందలేదను నిశ్చయమునకు రావచ్చును. ఎండబారిన వృక్షము చుట్టునున్న గడ్డిని, పిచ్చిమొక్కలను త్రవ్వి పారవేసి, ఎరువువేసి, నీరుపోసి, దోహదమిచ్చిన అది యెట్లు చిగుర్పకలదో అట్లే పెచ్చుపెఱిగిన మూఢనమ్మకములను మోసములను మొదలంట పెరికివైచి మాననీయమైన హిందూమతము అనెడి వృద్ధవృక్షమును, ఆత్మార్పణ, విశ్వాసపాత్రమైన సేవ, ధీయుక్తమైన జ్ఞానము అను పుష్టికరమైన దోహదములతో పునరుద్ధరింపవచ్చును. గ్రుడ్డినమ్మకము ఎవరిని రక్షించలేదు. కేవలము గ్రుడ్డినమ్మకమే యైన యెడల నది సజీవమైన సంస్కృతికి మూలస్తంభమై స్థిరమైన వేదాంతమునకు దారితీయదు. ఏదో ఒక్క విషయావిష్కరణతో పరిమితమైనది కాకపోవుటచేతనే ఈ పవిత్ర హిందూమత విషయములో మరింత తారుమారులు కలుగుటకు కారణమగుచున్నది. ప్రపంచములోని ఇతర మతములతో పోల్చిచూచిన హిందూమతమును "ఒక మతము" అని చెప్పలేము. దీనిని 'ఒక అభ్యుదయకారి లేదా నిరంతరాభ్యుదయదాయకమగు ఒక సాంప్రదాయము అని, దీనిలో వ్యక్తులు పుష్టికరమైన వాతావరణములో సంపూర్ణ స్వాతంత్ర్యముతో నైతికముగా మానసికముగా పరిణామము పొందుటకు తగిన అవకాశ మున్నదనిమాత్రమే చెప్పవచ్చును. ఒక గులాబిపొదను పైపైని కఱ్ఱతో బాది కదలించినమాత్రముననే పువ్వులు దానినుండి రాలవన్న విషయమును జీవనశాస్త్రజ్ఞులైన మన ప్రాచీనమహర్షులు గుర్తించిరి. అంతియే గాక, పువ్వులలోని అంతఃప్రవృత్తుల కనుగుణమైన వాతావరణములో వానిని స్వేచ్ఛగా సంపూర్ణముగా పెరుగుట కవకాశమిచ్చిన అప్పు డవి తమంతట తామే అప్రయత్నముగా వికసింపగలవని కూడా వారు తెలిసికొనిరి.

సమకాలీన పరిస్థితులను, ఆనాటి చరిత్రను అధ్యయనము చేయనిదే ఒక యుగమునందలి ప్రజల మతమును మనము పూర్తిగా అవగాహన చేసికొనలేము. హిందూదేశపు సరిహద్దుల నతిక్రమించి అఫ్గనిస్థానము

గుండా వాయవ్య సరిహద్దుప్రాంతమును దాటి ఆర్యశాఖ సింధునదీ ప్రాంతమును ప్రవేశించినది. సింధునదీ లోయలోని ప్రజలను వారి సమాజమును సూచించుటకే 'హిందు' శబ్దమును విదేశీయులు వాడిరి. ఆ వాడుకనుబట్టి మనము కొంతవఱకు, హిందుఇజమ్ (Hinduism) అనగా ఒక ప్రత్యేక జాతి జనులు నివసించిన భూగోళప్రాంత నామముగా సూచింపబడినదనియు, అచట వారు తమ బుద్ధిని వికసింపజేసికొనిరనియు చెప్పవచ్చును.

ఆర్యులు తమ వేదసంస్కృతితో గంగానదీ సమతల ప్రదేశములను దాటి కాలక్రమమున దక్కను ప్రవేశించిరి. స్థలముల నిట్లు మార్చునపుడు వారు విధ్వంసక ఖడ్గములను గాని, నిరంకుశాధికారములను ఆయుధమును గాని గ్రహించలేదు. తద్వ్యతిరిక్తముగా వారు సోదర మానవులను ప్రేమతో కలిసికొని, తమ జ్ఞానమును వారికి తెలియజేసి, వారివద్దనుండి తాము గ్రహించుటకు కూడ సంసిద్ధులైరి. ఆ దినములలో యీ దక్షిణభాగమున ద్రావిడులే గాక ఇంకను అనేక జాతులవారు నివసించుచుండిరి. ఆర్యులు ప్రతి సాంస్కృతిక సంస్థలను దర్శించి, అచట తాము చూచిన ప్రతి విషయములోని మంచిని గ్రహించి, తాముసు వాటి ననుసరించిరి. కావుననే వారి భావములు సంపూర్ణ వికాసమును పొంది, మహోన్నతమగు వేదాంత తత్త్వమును అప్పటి దేశీయులకు అందజేయగలిగిరి.

ఇట్లు నవీనులగు ఆర్యుల పద్ధతిలోనే వేదకాల పుటార్యులుకూడ ఆనాటి జాతులయొక్క సమస్యను పరిష్కరించుటకు ప్రయత్నించిరి. అట్టి ప్రయత్నములో వారు అధునాతన పద్ధతులగు తిరస్కృతమార్గమునుగాని, విధ్వంసకమార్గమునుగాని అవలంబింపక గ్రహణ విలీనీకరణములను శాంతి మార్గమునే యవలంబించిరి. వారు అప్పటి ప్రజలయొక్క ప్రాంతీయ దేవతలు లేదా ఆదర్శములు, ఉన్నతభావములకు ఆస్కారములు కావని తోచినపుడు, వారి పూజావిధానములను పరిహసింపక, అంతకంటె మిన్నయైన తత్త్వములను వేదసత్యములద్వారా వారికందజేసి, వారి మతమునే వేద

తుల్యమగునట్లు చేసిరి. ఇవన్నియు, ప్రాచీన భారతనాగరకతపై పరిశోధన చేసిన విద్వాంసులు ఒప్పుకొని వెల్లడిచేసిన శాస్త్రీయ సత్యములు.

ఈనాడు యజ్ఞశాలలో సమావేశమై యున్నవారిలో చాలమందికి ఈ మాటలు విరుద్ధముగా తోచవచ్చును. ఇక్కడకు ఏదో ప్రాచీనమగు గ్రుడ్డి నమ్మకముతో మనము రాలేదు. బుద్ధిపూర్వకమైన మెచ్చుకోలుతో, ప్రశ్నించుటకు తయారుగా, ప్రాచీనమైనంతమాత్రమున దేనిని ఒప్పుకొనని భావముతో, చేరియున్నాము. కేవల విశ్వాసము మనలను రక్షించలేదు. కాబట్టి నేను మిమ్ములను అమాయక విశ్వాసముతో, మందగించిన బుద్ధితో, ఇచట ప్రవేశించమని చెప్పుటలేదు. ప్రజ్వలించుచున్న పరిశోధనా పాండిత్యముతో, అన్వేషించి కనుగొను భావముతో, నేను చెప్పిన ప్రతి అంశమును తెలిసికొని, ప్రశ్నించి అవగాహన చేసికొనవలసినదని నా ప్రార్థన.

ఇట్లు మహర్షులను అర్థముచేసికొన యత్నించునపుడు మనము క్రొత్తమార్గములను త్రొక్కవచ్చునుగాని, అవి నూతన సామాజిక తత్త్వమునకు సరిపోయి వర్తమానకాలమునకు సంబంధించినవై యుండవలెను. ఇట్లు మనము చేయునపుడు దీనిని ఒక గ్రుడ్డితిరుగుబాటుక్రింద జమకట్ట లేము. ఇంతకూ హిందూమతచరిత్ర యంతయు, మరలమరల జరిగిన తిరుగుబాట్లయొక్క కథయే. కాబట్టి తరతరముల ప్రజల నూతన దృక్పథములు హిందూమతములో జేరి తత్తద్విభిన్న దేశ కాలములకు తగిన సాంప్రదాయములుగా ఏర్పడినవి. ఈ సాంప్రదాయ విభేదములు యథార్థమునకు బాహ్యములే. జీవగఱ్ఱ అయిన ఆంతరికతత్త్వము మారలేదు. హిందువులు ప్రత్యేకమైనట్టి ఒక సంస్కృతిని కలిగిన సంఘమని, ఇతరదేశ ప్రజలతో పోల్చిచూచినపుడు సమగ్రము సంపూర్ణమునైనమతము గలవారని మాత్రమే, నేను చెప్పుచున్నాను. కాలానుగుణ్యమైన క్రొంగ్రొత్త సాంప్రదాయములను తనలో లీనము చేసికొనుటకు సంసిద్ధమైయుండుట మన మతమందలి పుష్టికరమైన ఒక చిహ్నము. అదియే దీనికి దీర్ఘమైన చరిత్రను చేకూర్చి నేటికి రేపటికి ఎన్నటికిగూడ ఈ మతము నశించునది కాదని చాటి చెప్పుచున్నది.

ఈనాటికికూడ, ఈ మతము పడిపోవునంతటి శిథిలావస్థకు వచ్చినప్పటి కినీ, ఇది జీవించియున్నదనియే చెప్పవలసియున్నది. రాజకీయాధి కారముతోగాని, అనధికారముతోకాని, ఇతర మతస్థు లొనర్చు ప్రచారము వలన హిందూదేశములో పరిగణింపతగినంత మతపరివర్తనలు జరుగలేదు. ఈ విషయమును క్రైస్తవులు మహమ్మదీయులు కొన్ని పరిస్థితులలో తప్పక ఒప్పుకొని తీరవలసినదే.

ఇట్లు హిందూమతములో నెక వ్యక్తముగాని ఆకర్షణ మనకు తెలియ కుండగనే మనలనందరిని కలుపుచున్నది. ఇట్లు కలపగల దీనిలోని అడ్డు లేని ఐక్యతకు, పతనము లేని శక్తికి రహస్య మేమైయుండును? ఈ ప్రశ్నకు తెలివితక్కువ విమర్శకులుకూడ, తమ విశ్వాసపూరితమైన పరిశీలనవలన 'ప్రపంచమతములలో హిందూమతము ఒక స్థిరమైన స్థానమును గడించు కొనినదని' ఒప్పుకొనుటద్వారా జవాబు చెప్పుచున్నారు. దీనికి కారణము మన మతతత్త్వములు జీవనపద్ధతితో సమ్యక్సంయోగమును పొందియున్నవి. కావుననే యథార్థ జిజ్ఞాసువులు ఆధ్యాత్మిక క్షేత్రములోనే గాక ప్రాపంచికమైన దైనందిన జీవితములోకూడ సౌఖ్యమును పొంది, తద్వారా పరిపూర్ణత్వము యొక్క గంభీరమైన ఆనందమును అనుభవింపగలుగుచున్నారు. మతము జీవితమునుండి వేరుపడ్డది యని భావించుట మతవిషయకమగు అజ్ఞాన మును ప్రదర్శించు కొనుటయే. కేవలము దేవాలయములకు వెళ్ళుట, పూవులచే పూజించుట, పూజారులకు దక్షిణలను నమర్పించుకొనుట, పురోహితులకు భోజనము పెట్టుట, మొదలగు మతము పేరితో చేయు నిర్జీవ కర్మలు మానవజీవితముతో ప్రత్యక్ష సంబంధము కలిగియుండకపోవచ్చును గాని, ఉపనిషత్తులను బాగుగా అధ్యయనము చేసి, మతముయొక్క నిజ స్వరూపమును అవగాహన చేసికొనినచో మన మీ గొప్ప సత్యమును ప్రశంసించ గలుగుచున్నాము. సత్యములైన మతములన్నియు జీవితము నుండి జన్మించి, జీవితములోనే యుండి, జీవితములోనే పరిపూర్ణత్వమును పొందుచున్నవి. మానవ జీవితమునుండి వేఱుపడ్డ మతము జీవించు మానవులది కాదు. మన మందరము సంపూర్ణముగా జీవించియున్నాము.

కాబట్టి జీవితముతో సన్నిహిత సంబంధమున్న మతమే, మనలను రక్షించి, పులకరింపజేసి, సహాయపడగలదు.

నేను మొట్టమొదట చెప్పినట్లు ఆ మహర్షులు - జీవిత విజ్ఞానవేత్తలు భౌతికవిజ్ఞానముతో వివాదములు పడక అంతర్ముఖముగా దృష్టిని కేంద్రీకరించి సాధారణమానవుని నిత్యజీవితములో ఏది మహత్తరసౌఖ్యమును ఆనందమును ఈయగలదో దానినే కనుగొనుటకు యత్నించిరి. జీవితము అనుభవములతో కూడుకొన్నది. వ్యక్తులు బాహ్యప్రపంచముతో సంబంధము కలుపుకొని దాని ప్రతిఫలముగా ఇతర కర్మల నాచరించినపుడే ఈ యను భవములు వారికి కలుగును. జర్మనీదేశములో ఒక అందమైన స్థలమును గూర్చి విన్నంతమాత్రమున దాని సౌందర్యమును మన మనుభవించలేము. దానిదగ్గఱకు వెళ్ళి మనంతట మనమే దానిని కనులార చూచినగాని సౌందర్య రసాస్వాదన చేయలేము. ఈనాటి విజ్ఞానవేత్తలు ప్రపంచమందలి వస్తువులను మరల క్రమపఱచి స్వాధీనపఱచుకొనుటవలన జీవితములో సౌఖ్యమును అభివృద్ధిపఱచ యత్నించుచున్నారు. సంపూర్ణమైన అనాసక్తి విరామములతో జీవించు ఆనాటి విజ్ఞానవేత్తలగు మహర్షులు, మానవుని జీవితమునే చర్చనీయ క్షేత్రముగా నొనర్చి, దానినే యొక ప్రయోగశాలగా చేసి ఆనందమును అన్వేషించినారు. ఇది సరియైన మార్గమే. ఈనాటి భౌతిక విజ్ఞానవేత్తలకన్న వారు మెఱుగైనవారే. ఎంత అద్భుతముగా మనము మన చిన్న బాహ్యప్రపంచమును తయారుజేసినను, దానిలో నివసించు మనము మనలనే సరిదిద్దుకొనలేకపోయినచో ఆనందమును, తృప్తికరమైన అనుభవమును పొందలేము.

ఇట్లు వ్యక్తియొక్క తత్త్వమును అతని అనుభూతిని బట్టి పరిశీలించగా ఆ మహర్షులు "భౌతికముగా ప్రతి వ్యక్తియు ఒక సంపూర్ణ స్వరూపముగా నున్నను, ఎదుటి వస్తువులతో సంఘర్షణ ఏర్పడి ప్రతిక్రియలకు లోనైనపుడు, మనము ఒకే స్వరూపముగా గాక నాలుగు ప్రత్యేక స్వరూపములు కలిగియున్నాము" అనుటను గుర్తించినారు. ఇట్లు "నేను నా జీవితమునుండి ఆనందమును కోరునపుడు ఆ ఆనందము ఒక నవీనమగు నేటి సంపూర్ణసౌకర్యములతో కూడిన భవనమువలన కలుగునని నిశ్చయించు

కొనినచో ఆ ప్రణాళికను ఫలవంత మొనర్చుటకై రాత్రింబవళ్ళు పోరాడు దురు. ఈ కోర్కెను సాధించుటకొఱకు ద్రవ్యమును దుర్మార్గముగా గడించి నా స్వప్నమును—భవన నిర్మాణమును—పూర్తిచేసితి ననుకొనుడు. కన్నులు మిఱుమిట్లు కొలుపు ఆ హర్మ్యమును ప్రవేశించి ఆనందమును సౌఖ్యమును పొందుటకు బదులు, అంతరాత్మలో ఏదో అలజడి కలుగుటను అనుభవింతును. భౌతికముగా నా కలలు నిజమై ఆనందించుటకు అవకాశ మున్నను నా పాపకృత్యములు తుఫానువలె రేగి మనశ్శాంతిని పోగొట్టు చున్నందువలన నేను ఆ సౌఖ్యములను అనుభవించ లేకపోవుచున్నాను.

ఒకవేళ భౌతికముతోపాటు మానసికముగా కూడా నా ఆకాంక్ష తృప్తి నొందినను నా బుద్ధిలో అలజడి రేగి బాధపడవచ్చును. ఉదాహరణకు నా రాజకీయ నమ్మకములు, అధ్యయనము, విశ్వాసము వీనివలన నేనొక సమాజవాదిని (socialist) అనుకొనుడు. దురదృష్టవశాత్తు నా దేశములోని పాలనాపద్ధతి అటు పెట్టుబడిదారి (capitalist) ప్రభుత్వమును కాదు, ఇటు సంపూర్ణ సామ్యవాద (communist) ప్రభుత్వము కాదు. నేను ఆనందముగాను, గౌరవముగాను జీవితమును గడపుటకు ఆశించి ప్రభు త్వము నాకొసంగు ఉన్నతోద్యోగమును ఒప్పుకొందుననుకొనుడు. అప్పుడు నా భౌతిక ఆకాంక్షలు, మానసిక స్వప్నములు అన్నియు తృప్తినొందినవి గాని బుద్ధిలో నాకు వ్యతిరేకమైన పద్ధతిలో ప్రభుత్వపు కార్యక్రమమును నిర్వ హించి ఆ పద్ధతిలోని ప్రణాళికను సమర్థించుచున్నానను అలజడి ఎప్పుడునూ ఉండనే ఉన్నది.

అయినప్పటికి అతి స్వల్పసంఖ్యాకులైన మనలో కొందరికి భౌతిక, మానసిక, బుద్ధి సంబంధములైన సంతృప్తి ఏర్పడవచ్చును. అప్పుడుకూడ వారిలో అసంతృప్తికి అలజడికి అవకాశము లేకపోలేదు. ఈ సందర్భములో రాజకుమారుడైన సిద్ధార్థుని కథను ఒక మహత్త్వోదాహరణముగా పేర్కొన వచ్చును. అతనికి ధనము, ఉన్నతస్థితి, ప్రేమించి ఆరాధించు ప్రజలు, ఉన్నతమగు విద్య, చుట్టును పండితులు, సర్వము లభ్యమైయుండినవి. కాని అతని హృదయాంతరాళములో ఏదో యొక అవ్యక్తమైన అసంతృప్తి పీడించుచునేయుండి, చివరకు అతనిని ఈ సర్వసౌభాగ్యములనుండి తరిమి

చేసి, అంతరంగముయొక్క మహోన్నత తృప్తికారణమును వెదకునట్లు చేసినది.

పైన పేర్కొనిన మనలోని ఈ నాలుగు వ్యక్తిత్వముల మధ్య నిరంతరముగా జరుగు పరస్పర పోరాటముయొక్క పరిణామమే జీవితమును విషాదాంతముగా చేయుచున్నది. ఇవి వేర్వేరుగా నున్నప్పుడు ప్రతి ఒక్కటి మానవునియొక్క సమభారమును తనవైపునకు లాగి ఎదుటివానికి వ్యతిరేకముగా నడిపింపజేయుచున్నది గావున ఎట్టి పరిస్థితిలోను మనకు సంపూర్ణానందము ఏర్పడకున్నది. పై మన పరిశీలనలకు మహర్షుల నిర్ణయములకు ఎంతో దూరము లేదు. మానవుడు తన అంతరంగములో పొందిన సమన్వయావస్థ కనుగుణ్యముగనే ఆనందము ఏర్పడునని వారు ప్రకటించిరి.

పైన పేర్కొన్న నాలుగు భిన్న విషయములను సమన్వయపఱచుటకును, వానిని అదుపాజ్ఞలలో నుంచి అభివృద్ధికి తెచ్చుటకును, ఎట్టి ప్రత్యేక పరిస్థితులయందైన ఏకవ్యక్తివలె సమైక్యతతో అవి ప్రవర్తించుటకును, అనుకూలించు సూత్రముగాని పద్ధతిగాని ఏదైన ఉన్నచో అప్పుడు దాని ద్వారా మనము నిరాతంకముగా జీవితమున ఉత్తేజకరమైన శాంతిని, ఆనందమును పొందగలము.

సూర్యుడు ఒకటిన్నర అడుగు దూరముగా నుండియున్నచో హిందూదేశము ఎంతయు చల్లని నివాసస్థలమై యుండియుండెడిదే, అని చెప్పుట వలన గ్రీష్మతాపమునుండి వెంటనే ఎటువంటి ఓదార్పును లభించదు. ఎంత ఆదర్శవంతమైనప్పటికిని కేవలము వేదాంతము సౌఖ్యమునకు వెనువెంటనే కారకము కాదు. మన జీవితములో ఆ వేదాంత తత్త్వము ననుసరించి, ఆచరణలో పెట్టినప్పుడే శాంతికి అవకాశము కలుగును. ప్రాచీన మహర్షులు వేదాంతమును ప్రకటించుటమాత్రమే గాక, పైని వర్ణితమైన మానవవ్యక్తిత్వ సమన్వయమునకుకూడ ఒక నిర్ణీతమైన పద్ధతిని చూపించియున్నారు.

జీవనవిజ్ఞానమందలి ప్రకటనలును ఆంతరిక సమన్వయముతో జీవించు పద్ధతియొక్క వివరములును కలసి ఉపనిషత్తులలో చెప్పబడిన

విషయములగుచున్నవి. 'లక్ష్యముయొక్క వివరణ, తన్మార్గవర్ణన' అను నీ రెండు ముఖ్యాంశములను కలిగియుండని ఉపనిషత్తే లేదనవచ్చును. ప్రస్తుతము మనము గ్రహించిన ఈ కఠోపనిషత్తు కూడ 'లక్ష్యము - తన్మార్గము' అను నీ రెండింటినీ సంపూర్ణముగా వివరించుచున్నది.

## మార్గములు

తనలోని భావప్రవాహములయొక్క స్వభావమును, పరిమాణమును గుణములను, బాగుగా తెలిసికొని వానియొక్క ఉత్పత్తిని అణచివేయగలుగు విధానము నభ్యసింపజేయుటకుగాను సాధకుడు జాగరూకతతో తన మనస్సున కిచ్చు శిక్షణయే యోగములోని సాధన లగుచున్నవి. ప్రపంచము నందలి తదితర మతములవలె హిందూమతము ఏదేని ఒక్కటే సంకుచితమై సలిగిపోయిన కాలిబాటవంటి పద్ధతిని ప్రచారము చేయుటలేదు. మతమునకు ఆధారమైన 'సత్యము' అను విశాల కూటములు గల పెద్దదేవాలయమును చేరుటకు హిందుమతమున ప్రతివారికి నాలుగు నిర్ణీతములైన మార్గములు గలవు. అవి యన్నియు నా దేవాలయముదగ్గఱకు తీసికొనిపోవునవే.

ఈ మానవుని వ్యక్తిత్వ సమన్వయమునకు కారకములైన నాలుగు మార్గములు—(1) భక్తిమార్గము. (2) జ్ఞానమార్గము. (3) కర్మమార్గము. (4) గూఢమార్గము.

నిష్పాక్షికమైన శాస్త్రీయపద్ధతిలో ఈ వేఱువేఱుగా కనిపించు మార్గముల సాహిత్యమును పరిశీలనా పరిశోధనా దృష్టులతో నధ్యయనము చేసితిమేని మనలో ప్రతివారికి ఈ నాలుగు మార్గములయొక్క లక్ష్యమును, ఇవి ఆధారపడియుండు శాస్త్రీయ సిద్ధాంతమును ఒక్కటే అన్న విషయము వ్యక్తమగును. సాధకుని జీవనపద్ధతికి నిర్ణీతమైన అంశములలోకూడ ప్రతిచోటను సామ్యము కనిపించుటను చూడనగును.

ఇవన్నియు ఒకటే అన్నప్పుడు వీనిలో వైవిధ్య మెందుకున్నది యని ప్రశ్నించితిరేని దానికి సమాధాన మిది:—మనలోని విభిన్న ప్రకృతులకు, మానసికావస్థలకు వీలుగ నుండుటకే వేఱువేఱు మార్గములు చూపబడినవి.

మానవు లందరును ఒక్కటే స్వభావము ప్రకృతి గలవారు కారు. మనలో ప్రతివారికి ప్రత్యేకమైన అభిరుచులున్నవి. అందరిని తృప్తిపరచుటకై ప్రాచీన విద్వాంసులు మానవజాతిని నాలుగు విభిన్న తరగతులుగా విభజించినారు: (1) హృదయప్రధానులు. (2) బుద్ధిప్రధానులు. (3) హృదయ బుద్ధి ప్రధానులు. (4) ఈ మూడు తరగతులలో చేరనివారు అనగా పరిపక్వమైన హృదయముగాని బుద్ధిగాని లేనివారు.

ఈ రకములు నవీన మనస్తత్వశాస్త్రములోని (1) ఆవేశానుభూతి యుతులు. (2) వివేకులు. (3) చురుకైనవారు. (4) పోల్చుకోలేని భావము కలవారు అను విభజనకు సరిపోలుచున్నవి.

ఆవేశము గలవారికి భక్తిమార్గము చూపబడినది. భక్తుడు ప్రేమతో సంపూర్ణుడైన స్వభావము కలవాడు, అట్టివానిని 'భగవంతుని ప్రేమించి నిరంతర ధ్యాన మననాదులచే ముక్తిని పొందుమ'ని మన పెద్ద లాదేశించిరి. ఆ ప్రేమపూరితహృదయునకు ప్రియతముడైన భగవంతునిగూర్చి ధ్యానించుటకంటె వేరే వ్యాపారమే యుండదు. ఇట్లు మనస్సు తన ప్రియతముడైన భగవంతుని ఆకారము, మహత్త్వము, దివ్యస్వభావమును గూర్చి మాటి మాటికి స్మరించుచున్నది. ప్రేమలోని తీవ్రత కనుగుణ్యముగా మనస్సు లక్ష్యమునందు కేంద్రీకృతమై నిరంతరాయమైన భావనకు లోనగుచున్నది. ఇట్టి ఏకలక్ష్యమందు కేంద్రీకృతమైన మానసిక సమన్వయ స్థితిలో, భక్తుడు భగవంతుని తన హృదయములో, తన చుట్టుపట్ల ఎక్కడ పట్టిన అక్కడే చూచుచున్నాడు. ఈ సంతోషమువలన గలిగిన ఉన్మాదాతిశయముచేత భక్తుడు తన హృదయములోని సువాసన వెదజల్లు ప్రేమోద్యానములలో సర్వవ్యాపి యైన ప్రేమతత్త్వముతో సంచరించుచున్నాడు. ఈ స్థితినే "పరాభక్తి" యనగా మహోన్నతమైన ప్రేమగా పిలుచుచున్నారు.

పరాభక్తి స్థితిలోని భక్తుడు ప్రేమ పరాకాష్ఠ పొందునపుడు తన్ను తానిట్లు ప్రశ్నించుకొనుచున్నాడు: "నాచుట్టు నేనా సర్వాంతర్యామి యగు భగవంతుని దర్శించుచున్నాను. నే నాతని ప్రేమపాత్రుడను. అతడు నా ప్రియతముడు. నేను మరి దేనిని చూచుటలేదు. అతడొకడే నాకు కన్పించుచున్నాడు. ప్రతిచోట అతనినే చూచున్నాను. అట్లైన నేనెవరను?"

రాశీభూతమైన ఆవేశానుభూతుల కిట్టి భావముయొక్క రాపిడి కల్గి నప్పుడు మాయాజాలము భస్మమై నాశనము చెందగా మహత్తు తేజోవంత మైన మెఱుపుపలె, హృదయవీథిని భాసించును. ఈ మహత్తరమైన ప్రశ్నతో భక్తుడు ఆంతరంగికముగా చూచుకొనును. భక్త్యుద్వేగమువలన ఏర్పడిన ఆ స్థితిలో భగవంతుడు తప్ప మరేదియు బాహ్యముగా గాని అంతరంగిక ముగా గాని గోచరించదు. అతడు అంతరంగికముగా దృష్టిని సారించగానే తనలోనే ఆ ఆరాధ్యమైన ప్రియతముని సాక్షాత్కారమును పొందుచున్నాడు. ఆ సాక్షాత్కారమందు తన్ను తానర్పించుకొని ఐక్యమును పొందుచున్నాడు. అంత భగవంతుడొక్కడే శాశ్వత పరిపూర్ణుడుగా నుండును. ఈ దివ్యాను భూతియే భక్తుని పరమాదర్శము.

కాని కేవల వివేకి యగు మానవునకీ మార్గము లభ్యముకాదు. నామ రూపములు గల భగవంతునివైపు ప్రసరించుటకు, నిరవధిక ప్రేమ కలిగి ప్రవాహరూపమును దాల్చు సున్నితహృదయ మాతనియందు లేదు. బుద్ధి, హృదయరంధ్రముల పూడ్చివేయు శక్తియై యున్నది. అందుకే మహర్షు లట్టివానికి వివేచనాపూర్వకమగు జ్ఞానమార్గము నాదేశించిరి. అట్టి వివేచన పర్వతసదృశములగు సందేహములనుసైతము భస్మమొనర్చి నిరాశల తిక మకల మహారణ్యములో చక్కని రాచబాట నేర్పరచగలదు. శ్రుతిశిఖర ములందు ప్రకాశించు జ్ఞానదీపికచే వెలుగొందినవాడై, విషయవాసనా పూరితమైన అహంకారయుత పశుత్వస్థితినుండి మెల్లమెల్లగా సాధకుడు పైకెక్కుచున్నాడు. వివేకవంతులు వేదాంతవిద్య నభ్యసించి జీవితము నందలి ఆశాపాశములు బూటకపు మెఱుగులు మాత్రమేనని స్వయముగానే గుర్తించినారు. అందుచేత కోర్కెలను ఏహ్యములని వదలినారు. ప్రపంచ మందలి ఇంద్రియవిషయములనుండి తమ దృష్టిని మరల్పగలుగుటచే వారి కొక విధముగా మానసికసంతులనము (Balance) ఏర్పడినదనియే చెప్పవచ్చును. ఇట్లు వేదాంతక్షేత్రమును ప్రవేశించకమునుపే వారికి మానసిక సమన్వయము కుదురును. అట్టివారు తీవ్రముగా ఉపనిషత్ సిద్ధాంతముల లోని అనంతమగు తర్కమును, శుద్ధవివేచనను తమది చేసుకొనగానే వారి

మనస్సులు గాఢమైన ధ్యానపుటౌన్నత్యము నందుకొనగానే ఆ మహత్సత్వాను భూతికి వారు లోనగుచున్నారు.

అన్ని కాలములందును, అన్ని సమాజములందును ఎక్కువగా, బుద్ధి సూత్రములకు, హృదయపు విలువలకు మధ్య ఎల్లప్పుడు నూగులాడుచు నుండువారు ఉండనే ఉన్నారు. వారొక్కక్షణము అతి వివేకవంతులుగాను, మరుక్షణము కుశాగ్రబుద్ధిసంపన్నులుగను గోచరింతురు. అట్టి 'సమ్మిళిత ప్రవృత్తులకు' కర్మయోగము ఆదేశింపబడినది. అదియే నిష్కామ కర్మయోగము.

యథార్థములో ఈ కర్మయోగము భక్తియొక్క ఆవేశానుభూతుల వలని ఆనందమును, వేదాంతముయొక్క బుద్ధివిలువలను చక్కగా సమన్వయించుచున్నది. భక్తిలోని ప్రేమతత్త్వము వేదాంతములోని అద్వైత శాశ్వత సంపూర్ణత్వముతో కలసినపుడు స్వార్థరహితమైన సేవా పద్ధతి యేర్పడుచున్నది.

కొన్ని నిర్ణీతమైన శరీరవ్యాయామ ప్రణాళికలచే, పరిణతి గలదై మహోన్నతస్థితి నందుకొను మనస్సును ఉత్పత్తిచేయుటకుగాను దేహమయ కోశమును ప్రాణమయ కోశమును సమన్వయము చెందించు పద్ధతికి 'హఠయోగము' అని పేరు. ఇట్లు తయారైన మనస్సు 'కుండలిని' అను రహస్యశక్తివైపు కేంద్రీకృతమగుచున్నది. ఈ కుండలిని శక్తి సాధకుని మనస్సునందే అంతర్నిహితమై యున్నది. ఇక్కడకూడ మానసికాభివృద్ధి, భావపవిత్రత, కోర్కెలను క్రమపఱచుట చివరకు భావములను సమన్వయ పఱచుట అనునవి సాధ్యములగుచున్నవి.

సామాన్యహైందవుడు తన మతమహత్త్వమును గుర్తించక అజ్ఞాన మందు మునిగియుండుటచేతనే, ఈనాడిన్నిశాఖలు, ఉపశాఖలు బయలుదేరి మనలో ఇన్ని కొట్లాటలు అల్లరులు జన్మించినవి. భక్తితత్త్వము వేదాంత సూత్రములను ఛేదించునదెప్పుడును కాదు. వేదాంతి యగువాడు భక్తిమార్గము నపహసించినచో శ్రుతిచే చెప్పబడిన పూర్ణసత్యము నందు కొనుటకు ముందతడు పిచ్చిఆసుపత్రి చేరవలసియుండును. దీనినే

వివేకానందస్వామి యెంత శక్తివంతముగా వ్యక్తపరచినాడో చూడుడు:— "భక్తి లేని వేదాంతము వెఱ్ఱియే. వేదాంతము లేని భక్తి మూఢనమ్మకము మాత్రమే."

పైన చెప్పినది వేర్వేరు యోగమార్గములకు సంబంధించిన గ్రంథాగారపు ఉద్గ్రంథముల గూర్చిన సంగ్రహ టీకమాత్రమే. మీరీ భావనలను మననము చేసినచో ఏ యోగమును ఇంకొకదానితో ఘర్షణ పొంద లేదనుటను గుర్తింపగలరు. నిజమునకు ఒకటి తదితరమునకు పూరకము మాత్రమే. అయినను మనలో మనము కొట్లాడుకొనుచున్నాము. శాస్త్రములలో ఐక్యత యున్నను మనలోని పశుత్వమును అణచివేయబడక పోవుటయే దీనికి కారణము.

ఈ నాల్గు మార్గములు వేర్వేరుగా గోచరించినను పద్ధతియందు మాత్రమే భేదమున్నది గాని లక్ష్యమంతయు నొకటె. ఈ లక్ష్యమునే సాంకేతిక పరిభాషలో "ప్రత్యాహారము" అని అందురు. వేర్వేరు మార్గముల ననుసరించు సాధకులు వివిధ రీతుల విభ్రమించు మనస్సును ఏక లక్ష్యము వైపు కేంద్రీకృతము చేయు స్థితినే ప్రత్యాహార మనవచ్చును. మానసికముగా స్థిరత్వము ఏర్పడి ఇష్టవస్తువువైపునకు ఏకైకముగా దృష్టి మరల్చగలిగిన స్థితిలో యోగులందరు సఖ్యముతో ఆధ్యాత్మికమార్గమున ధారణ, ధ్యాన ములను మజిలీలను చేసి సమాధిస్థితిని చేరుకొనుచున్నారు.

మానవునిలోని వ్యక్తిత్వ సమన్వయమునలో మొదటి మెట్టు 'ప్రత్యాహారము.' భావనలే మానవుని వ్యక్తిత్వమును నిర్ణయించునను మన పూర్వుల సిద్ధాంతమును నవీన మనస్తత్వ శాస్త్రమందలి 'భావనయే మనుష్యుడు' అను ప్రకటనకూడ నిరూపించుచున్నది. అస్తవ్యస్తమగు మార్గములలో నొక మానవుని భావములు సంచరించుచు, వ్యతిరేక భావములను కలిగించు చున్న అతడు అనతికాలములో జీవగఱ్ఱ లేని శక్తిహీనుడుగా తయారగును. అట్టివానిలో సంపూర్ణ శక్తిని, దార్ఢ్యమును పునరుజ్జీవింపజేయుటయే వేదాంతముయొక్క పరమలక్ష్యము. వేదాంతము ననుసరించి మనుష్యుడు తనలో తాను దివ్యుడైనను, అతని యోచనల బట్టి, దైనందిన వ్యవహారములో వంకరటింకరగా వక్రుడుగా వ్యక్తమగుచున్నాడు.

అట్టి మానవుని తన్మాత్రోవను వదలింపజేసి జీవితమున క్రమపద్ధతి ననుసరింపజేసి, అతనిలోని స్వీయశక్తులను గుర్తించి, క్రొత్త జీవితపు విలువల నేర్పరచుకొన సహాయపడి, అధ్యాత్మికమార్గమున నాతని పురోగమింపజేయుటయే, మతములయొక్క ఉద్దేశ్యము. అది వేరు వేరు నామములచే పిలువబడవచ్చును. వేరు, వేరు భూగములందు అనుసరింపవచ్చును. కాని ఉద్దేశ్యమున భేదములేదు. ఇది పైన వివరించిన మార్గములవలన సుసాధ్యమగుచున్నవి. ప్రతిఒక్కటియు మానవుడు సూటిగా తన్నుతాను కనుగొనుటకు తగిన పద్ధతియే.

ఈ విషయమున నవీన విజ్ఞానవేత్తలకు నోటికి మించిన కబళములు కావచ్చును. ఉపనిషత్తుల పరిశోధనామార్గము మన తరమువారికి హానిదాయకము కాదు. మనలోని మేధాసంపన్నులనుకూడ తలలూపింపజేయు తార్కికపద్ధతినే నిరనుకరణీయులగు ఆ ఉపనిషద్రుములు అవలంబించిరి. ఇంతకుమున్ను చెప్పినట్లు ఉపనిషత్కర్తలు జీవితమందలి యథార్థతత్త్వమును గుర్తించుటకు మానవుని ప్రయోగశాలగా గ్రహించి అతని ఆంతరిక వ్యక్తిత్వమును ఛేదించి మనుష్యునియందే ఆ మహజ్జీవనమును కనిపెట్టిరి. వృక్షశాస్త్రవేత్త పుష్పమును ఛేదించి పత్రములను విడివడచి జాగ్రత్తగా పరిశీలించి అది ఏ జాతికి చెందినదో నిర్ణయించుచున్నాడు. అట్లే తైత్తరీయోపనిషత్తు రచయిత తన పరిశీలనలను మానవునిపట్ల అంత సూక్ష్మముగా చేసినాడు. ఆ ఉపనిషత్తునందు మాత్రమే మానవుని గూర్చి అతడు జీవించు విధానమునుగూర్చి సంపూర్ణ వివరణ గలదు. శరీర శాస్త్రవేత్త దృష్ట్యా మానవుడు కేవలము ఒక ఇంజనువలె ఆహారము నందజేసినపుడు పనిచేయువాడు మాత్రమే. కాని ఆ కాలపు ఋషులు "దేహముతో కూడ మానవుని కొక యోచనాజీవిత మున్నదని, తద్వారా యతడొక మహత్తర ఉద్దేశ్యమును పరిపూర్తి చేయగలడని" గుర్తించినారు. మరియు వారీ భావవిశ్లేషణమువలన యిట్లు వ్యక్తపఱచిరి. మానవుడు భౌతికముగాను మానసికముగాను బుద్ధి దృష్టితోను మౌనముగా నున్న తనలోని ఆంతరిక వ్యక్తిత్వము, అలజడికి లోనై కోర్కెలు, సంతృప్తులతో కూడియున్నదని, అది మాటలలో వ్యక్తము చేయుటకు గంభీరమైనదైనను, నిర్లక్ష్యము

చేయుటకు వీలులేనంత స్పష్టముగ నున్నది." ఈ యాంతరికమైన మౌనపు పిలుపులు, మానవుని సాధ్యమువైపు త్రిప్పి, సంపూర్తినంది పరమాత్మతో అభేదము పొందుమనునవియే, జీవాత్మయొక్క యాక్రందనములని పిలువబడుచున్నవి.

బుద్ధి హద్దులను దాటి మానవుని అస్తిత్వమును గూర్చి చర్చించు పండితులు ప్రపంచమందలి ఏ నవీనవేదాంతమందును కానరారు. ఈ నవీనయుగములో బాహ్యప్రపంచమును గూర్చి ఎంతో విజ్ఞానవిషయ సంచయము లభ్యమగుట నిజమే. మానవుని శరీరమునుగూర్చిన విషయ జ్ఞానమును యెంతో చేకూరినది. ఈనాటి పండితులు మనస్సునుగూర్చి కూడ తమ పరిశీలనలను నిర్ణయములను బయలుపఱుప సాహసింపక పోలేదు. కాని నావరకు, వానిలోని ఉత్తమోత్తమ సిద్ధాంతములుకూడ బుద్ధి పరిధిని దాటిపోలేదని చెప్పగలను. మరీ అపవాదములుగా ఒకటి రెండు ఉండవచ్చును. కాని ఈ నవీనపండితుల నిర్ణయములు అపరిపక్వములు, అస్పష్టములు. వారి చర్చలు బలహీనములు, అసంపూర్ణములు. వారి ప్రకటనలు అస్థిరములు, అసంబద్ధములు అని సాహసించి చెప్పగలను.

మానవుని వ్యక్తిత్వమును గూర్చి లభ్యమైన నవీనసాహిత్యమును సమగ్రముగా నవలోకించిన తరువాత పట్టుదల గల విద్యార్థి ఉపనిషత్తులను చదివినచో తనకు వాడుక లేని వినుగు కలిగించు భాషలో నున్నప్పటికి ఆ వర్ణనలలో సంపూర్ణత, విజ్ఞానశాస్త్రమునకు మించిన శాస్త్రీయమును అగు విషయవిశ్లేషణము సమృద్ధిగా నుండుటను తెలిసికొనగలడు. నవీనవిజ్ఞానవేత్త, తన నిర్ణయములను బట్టి మానవుని ఆధ్యాత్మిక అస్తిత్వము ఒకటి నొకటి చుట్టుకొని తీవ్రతరములై యున్న గోళముల మధ్య ఇమిడియున్నదని, ఆంతరంగికమై లోపలి పొర అతి సూక్ష్మమైనదని, బాహ్యమైన చిట్టచివరి పొర శరీరమని, అది ఆత్మను చుట్టుకొనియున్న స్థూలరూపమని చెప్పును.

ఇపుడు మనము మన ప్రాచీన ఋషులు వర్ణించిన అంతరశరీర యంత్ర నిర్మాణపద్ధతి నవలోకింతము. ఆ ఋషులు తమ అనుభవములనే క్రోడీకరించి శాస్త్రములలో నిట్టివర్ణనలను గావించియున్నారు.

శారీరకశాస్త్రము - మానవుని మెదడుతో కూడిన ఒక భౌ స్వరూపముగాను, యోచించి అనుభవించు ప్రాణిగాను నిర్వచించుచున్న పాశ్చాత్య శరీరశాస్త్రవేత్తల విషయవిజ్ఞానమున కందని రీతిని మన ప్రా ఋషులు మానవుని ఆధ్యాత్మిక - భౌతిక నిర్మాణమును దర్శించియున్నా వేదాంతద్రష్టలు ప్రతిపాదించిన విధమును ఎదుటి పుటలోని చిత్రమ వ్యక్తపరచుచున్నాను.

కేవల భౌతికశరీరము కదలలేదని, పెరిగి పనులను చేయలేద విషయము అందఱు నెఱిగినదియే. ప్రాణ మను ఆంతరశక్తి ద్వా చలన, వృద్ధి కార్యకరణ శక్తుల నిచ్చుచున్నది. మృతకళేబరము నవ్వ —తినదు—నడవదు—యోచించదు—అనుభవించదు. ప్రాణవాయువు పైకి లేవగనే శరీరము క్రింది కొఱగి, కొద్దికాలములోనే శిథిలమై తన నిమిడియున్న పంచభూతములలో కలిసిపోవుచున్నది. జీవించియున్నప్పు ఎంత గొప్పవాడైనను, మరణించినతర్వాత అతని శరీరమునకా య తప్పుటలేదు. మన ప్రతి ఒక్కరిలోని జీవితకేంద్రమే అన్నికార్యము కీలకమగు పవిత్రబిందువు. ఈ స్వామిలోనే ఆ జీవితకేంద్రము లోపించిన మరుక్షణమే అతడు తన ఉపన్యాసమునకు స్వస్తి చెప్పితీరును. రందరును ఈ మాటలను విని, మానసికముగా విశ్లేషించి, ధీయుక్తమ నవగాహన చేసికొనుచున్నారు. ప్రాణమే మీ దేహ మనో బుద్ధులలో లేక మీ రీకార్యములను చేసియుందురు,—చేయరు, చేయజాలరు.

ఈ దివ్య జీవనజ్యోతిని—ఆధ్యాత్మిక కేంద్రమును ‘ఆత్మ’ వేదాంతము పిలుచుచున్నది. ఇది వివిధరీతుల స్థూలములైన పొ మధ్య ఇమిడియున్నది. అన్నిటికన్న వెలుపటిదై మిక్కిలి దళసరి పార శరీరము. సాధారణముగా ఈ శరీరమునే జమకట్టి చాలమ మానసిక, బుద్ధియుత వ్యక్తిత్వములును ఉన్నవన్న విషయమునుక తెలియని స్థితిలో నున్నారు. అట్టి స్థితిలో ఆత్మను గూర్చిన దూర పరిక్ష మున్నవారు కూడ అసలే లేరని చెప్పవచ్చునుకదా.!

పై చిత్రములో ఆత్మ పవిత్ర ప్రణవచిహ్నమగు ‘ఓం’ అను అక్షర చేత సూచితమైనది. ఇదియే మన ఆత్మ; మన నిజస్వభావము; సర్వా

వంతము, సర్వజ్ఞత్వము గల 'చిత్' స్వరూపము. వేదాంతములో 'కోశములు' అని పిలువబడు పదార్థపు పొరలమధ్య ఈ జీవనజ్యోతి జగజ్జేగీయమానముగా వెలుగొందుచున్నది. 'కోశము' అను పదమునకు కత్తియొక్క ఒర అని అర్థమున్నది. కత్తి ఒరలో ఇమిడియున్నను కత్తికి ఒరకు ఏ సంబంధము లేనట్లే శాశ్వత జీవనజ్యోతికి, ఆవరించియున్న పదార్థపు పొరలకు ఏలాటి సంబంధమును లేదని 'కోశము' అను పదము సూచించుచున్నది. ఒరలో నున్న కత్తియొక్క దృఢత్వమువలన, తీక్ష్ణతవలన ఒరకు ఏరీతిగా జీవకళ వచ్చుచున్నదో అట్లే ఆత్మసాన్నిధ్యమువలన ఈ కోశములకు జీవనస్థితి యేర్పడుచున్నది.

మనలో అయిదు విశిష్టమైన కోశములున్నవి. అన్నమయకోశము అతి బాహ్యమైనది. ప్రాణమయకోశము లోపల అంచు గట్టుకొని యున్నది. దానిలోపల మనోమయ కోశము. అందులో విజ్ఞానమయ కోశము. అందులో సూక్ష్మాతిసూక్ష్మమై అనందమయ కోశమున్నది.

ఈ కోశముల నిర్మాణము స్వభావమును గూర్చిన సూక్ష్మచర్చకు దిగుటకు ముందు 'అంతరికము' అను పదముయొక్క వేదాంతశాస్త్రార్థమును వెల్లడిచేసెదను. మనము ఒక కోశము మరియొక కోశమునకు 'అంతరికముగా' (లోపల) ఉన్నదనునప్పుడు లోపటిది సూక్ష్మము కోమలము నని అర్థము చేసికొనుచున్నాము. ఇంతేగాక కోశముయొక్క సూక్ష్మత్వము దాని వ్యాప్తిమీద అధారపడి యున్నదనుటను గ్రహింపవలసియున్నది.

భౌతికశరీరము స్థూలతమమైనది. మనము ఉచ్ఛ్వసించు ప్రాణవాయువు శరీరము ఇముడ్చుకొనగలిగిన దానికన్న ఎక్కువ వ్యాప్తి పొందగలదు. కావున ప్రాణమయ కోశమును అన్నమయ (శరీర) కోశముకన్న సూక్ష్మమని యంటిమి. మన మనస్సు మన శ్వాస యందుకోలేని స్థలములనందుకొన గలదుకదా! మన బుద్ధియొక్క దృష్టి, మనస్సు చేరుటకు సాహసింపని దూరమును చేరుకొనగలదు. ఇట్లు మనోమయ, విజ్ఞానమయ కోశములు వెలుపలి రెండు కోశములకన్న సూక్ష్మము లని మనము గ్రహించవలెను. కావున సూక్ష్మతమము ఆత్మ. అది అన్నిటిని ఆవరించును, అది

దేనిచేతను అపరింపబడదు అని శ్రుతి ఉద్ఘోషించుచునే యున్నది. అది సర్వవ్యాపి.

ఇంక మనము ఈ కోశముల నిర్మాణమును గూర్చి తెలిసికొందము—

అన్నమయ కోశము—మనలోని చైతన్యము జాగృతి పొందు స్థితిలో అందరికి కానుపించు ఈ బాహ్యశరీరమును అన్నమయ కోశమందుము. తండ్రి భుజించు ఆహార సార ఫలితముగా నీ శరీరము రూపొందినది. ప్రతిదినము భుజించు ఆహారమువలననే అది కాపాడబడుచున్నది. మృత్యువునకు తర్వాత మరల ఆహారమగుటకు వెళ్ళుచున్నది. మన భౌతికనిర్మాణము ఆహారమునుండి ఉద్భవిల్లి, దానిచే పోషింపబడి మరల ఆహారములో చేరుచున్నది గాన సహజముగా సామంజస్యముగా దీనిని అన్నమయ కోశమని పిలుచుచున్నారు. జ్ఞానేంద్రియ కర్మేంద్రియములు ఈ కోశములోనే యున్నవి.

ప్రాణమయ కోశము—మనము లోనికి పీల్చు గాలి, రక్తముతో మిళితమై భౌతికశరీరముయొక్క ప్రతి జీవాణువును చేరుచున్నది అని అందఱు ఎఱిగినదే. ఎక్కువ ఊహించకనే మనము పీల్చు ప్రాణవాయువు లోపలి నున్నని అంచుగా ఏర్పడిన అనుభూతిని పొందుచున్నాము. ప్రాణమయ కోశము అన్ని కర్మేంద్రియములను వశపరచుకొని వేర్వేరు కార్యములను చేయుచున్నది. వేదాంతశాస్త్రము దీనిని అయిదు వేరు నామములక్రింద వర్గీకరించినది—పంచప్రాణములు—(ప్రాణ, అపాన, వ్యాన, ఉదాన, సమానములు.)

మనోమయ కోశము—మనలోని మానసికస్థితిని కొద్దిగనో గొప్పగనో తెలియనివారెవరును ఉండరు. మన సందేహములకు, సంతోషములకు, ఆశలు మొదలగువానికి ఆస్పదమైనది మనస్సే. యోచనా పరంపరల ప్రవాహమును నిరంతరముగా ఉండునట్లు చేయును. మనస్సు ఇది తగినదా—తగనిదా అని సందేహించు తత్త్వము గలది. బుద్ధి దానిని నిర్ణయించునది. మనస్సు కని విని ఎరుగని వస్తువులను చేరగలదు. ఊహించగలదు. ఇది చాల విశాలముగా వ్యాపించుటచేతనే దీనిని బాహ్యతరకోశములకన్న సూక్ష్మమైన దానినిగా గ్రహించియున్నారు.

విజ్ఞానమయ కోశము—వేదాంతవాఙ్మయములో తఱచు బుద్ధిని మనస్సును ఒకటిగానే గ్రహింతురు. మనస్సు ఒక నిర్ణీతమైన నిర్ణయమునకు వచ్చినపుడు, సంకల్పించిన తీర్పును అందుకొన్నప్పుడు, అది బుద్ధి యగుచున్నది. మనస్సుకన్న బుద్ధి సూక్ష్మమగుటకు కారణమిది. ఈ బుద్ధి మానసికావస్థలో అందని ఔన్నత్యముల చేరుకొనుచున్నది. బుద్ధి క్షేత్రములు మనస్సు అనుభవించనివి కావుననే దానిని మనస్సులోపలి కోశముగా గ్రహించినారు.

ఆనందమయ కోశము—మన చేతనాశక్తి సంపూర్ణ నిద్రావస్థలో మునిగియున్నప్పుడు ఈ కోశము అభావము లేక అజ్ఞానముతో కూడుకొనియుండును. జాగ్రతసుషుప్తి అవస్థలలో వ్యక్తులు ఎట్టిస్థితిలో నున్నను, సుషుప్తి నుండి మేల్కొనినచో వారెట్టివారైనను—ధనికులుగాని, దరిద్రులుగాని, నిరాశాపూరితులుగాని, విజయోత్సాహవంతులుగాని, ఆరోగ్యవంతులుగాని, రోగార్తులుగాని, వృద్ధులుగాని బాలురుగాని—ఒకటే రకమగు నిరంతరాయమగు మహదానందము ననుభవింతురు. కావున దీనికి ఆనందమయ కోశమని పేరు వచ్చినది. సాధారణమైన స్థూలబుద్ధి కివి కేవల అచేతనస్థితియందుండు అభావముమాత్రమే........అది నిర్వచించిన పదార్థములలో ఇది యే పదార్థమును గాదు. ఇట్టి గాఢసుషుప్త్యవస్థలో కూడ మానవుడు ఇతఃపూర్వము అనుభవించని ఆనందస్థితిని అనుభవించుచున్నాడు. కాని అది ఏదని తెలియక, అది అభావమని అనగా ఏ భావమును కాదని చెప్పుచున్నాడు.

అన్నిటికన్న సూక్ష్మతమమైనది జీవితకేంద్రమని, అదియే ఈ పంచకోశ నిర్మాణమునకు కేంద్రబిందువని తెలిసికొంటిమి. పైన చర్చించిన పదార్థముల పంచకోశములు, అందలి శాశ్వత జీవితకేంద్రము కలిసి, మీలోని నాలోని ఆధ్యాత్మిక శరీర స్వరూపముగానగుచున్నది. మనోమయ విజ్ఞానమయకోశములు స్పష్టముగా పవిత్రముగా నున్నచో ఈ జీవములోని చేతనాశక్తి చక్కగా వ్యక్తమై భాసించును. పాషాణములలో నీ మనోబుద్ధులు పూర్తిగా లోపించినవనే చెప్పవచ్చును. వృక్షజీవితములో ప్రాథమికావస్థలో నున్న మనోబుద్ధులు ఉండునని వేదాంతము చెప్పుచున్నది. కావున రాళ్ళకన్న వృక్షములలో చైతన్యము ఎక్కువగా గోచరించును. జంతువులలోని మనో

బుద్ధులు మరికొంత పరిణామమును చెందినపుడు వానికి చేతనాశక్తి మరింత ఎక్కువ యున్నదని తెలియును. అందరికన్న మహోన్నత జీవి కానము మానవునియందే యున్నది.

మనో బుద్ధులు నిర్మలములైనచో అట్టి శుద్ధచైతన్య స్వర్ణకిరణములు బయటికి వ్యాపించి తత్సిద్ధి పొందిన ఆ సాధువుయొక్క ముఖమున తేజో రూపమున తాండవించును. శ్రుతి "బ్రహ్మవిద్ బ్రహ్మైవ భవతి" అనగా బ్రహ్మజ్ఞానము తెలిసికొన్నవాడు ఆ బ్రహ్మయే అగుచున్నాడు అని చెప్పుచున్నది.

ఆత్మ లేక జీవితకేంద్రమగు ఈ శుద్ధచైతన్యమును పోల్చుకొనుటయే మానవ జీవిత లక్ష్యము. పరిణామదశయందలి పరాకాష్ఠ. దివ్యమానవత యొక్క పరిపూర్ణత్వము.

యథార్థములో మనము ఈ జీవితకేంద్రముమాత్రమే యైనను మన నిజతత్త్వమును విస్మరించి మనలను మనము బాహ్యావరణ కోశములుగా పరిణమించియున్న మూడు వేర్వేరు శరీరములున్నవానితో పోల్చుకొని, వేర్వేరు వ్యక్తిత్వములు గలవారమని భావించుచున్నాము.

(మనలో రేకెత్తు అహంభావము మనము భౌతికశరీరముతో సరి పోల్చుకొన్నప్పుడు 'విశ్వ' అని, సూక్ష్మశరీరముతో పోల్చుకొనినపుడు 'తైజస' అనియు, కారణశరీరముతో పోల్చుకొనినపుడు 'ప్రాజ్ఞ' అని పిలువబడుచున్నది. దీనినిగూర్చి స్వామీజీయొక్క మాండుక్యోపనిష ద్వ్యాఖ్యానమున తెలిసికొనవచ్చును.)

ఇట్లు ఒకప్పుడు మనము 'నేను నల్లబడినాను' అనునపుడు శరీరము తోను, నేను అలజడికి లోనైయున్నా నన్నప్పుడు మనస్సుతోను, నా కొక భావన కలిగినదనినపుడు బుద్ధితోను అభేదత్వము పొందుచున్నాము.

మనలో ప్రతివారిలో యేదో ఒక గుంపు ఉన్నట్టున్నదికదా! ఇట్లు మనలను వెలుపలి పదార్థావరణలలో నొకదానితో సరిపోల్చుకొని మనలనే మనము తెలివితక్కువవారిగా నిరూపించుకొని, తత్ఫలితముగా ఇంద్రియ పరిమితులకు దుఃఖమునకు అశాంతికి అస్పదుల మగుచున్నాము.

మనలోని పైని పేర్కొన్న వెట్టి, అవకతవక వ్యక్తిత్వములలో జీవించుచున్నను ప్రతివారును లోపలి కోశములకై బాహ్యకోశములను త్యాగము చేంసంసిద్ధులమగుట జగద్విదితమైన సత్యము. ఉదాహరణకు, ఒక వ్యక్తిముంజేతిపై బాధాకరమగు వ్రణము సంభవించిన దనుకొనుడు. దానివలమానసికముగా గూడ అతడు బాధపడుచున్నాడు. వైద్యుడు అతనిని సంపించి చేతిని కొట్టివేయవలయునని సలహా ఇచ్చినాడనుకొనుడు. రోగి తచేతిని ఖండించుటకు ఒప్పుకొనును. అనగా తన మానసిక శాంతికొఱదేహమును వైకల్యము చేసికొనుటకునూడ మానవుడు సంసిద్ధుడచున్నాడు. మరియొకచోట మతసంబంధమైనదికాని రాజకీయమైనదిగాఆదర్శము ఒకరి బుద్ధిలో పూర్తిగా ఆవరించినచో ఆ వ్యక్తి భౌతికముఎట్టి బాధలనైన పడుటకుగాని, మానసికముగా నెట్టి సంఘర్షణలలోనగుటకుగాని, సంసిద్ధుడై తాను బుద్ధిపూర్వకముగా విశ్వసించసిద్ధాంతమును కాపాడుకొనుచున్నాడు. అనగా అవ్యక్తి తన బుద్ధిఐక్యము పొందునపుడుపై అవరణలను పూర్తిగా నిర్లక్ష్యము చేయచున్నాడు.

ఇంతవరకు చర్చించిన విషయములను బట్టి గొప్ప ప్రవక్తల సంనీయుల మానసికస్థితిని మనము పోల్చుకొనవచ్చును. ఆత్మయొక్క సహస్వరూపము వ్యక్తముకాగానే వారి వెలుపలి అవరణల పొందు బాధలలక్ష్యము చేయుటలేదు.

ఏసుక్రీస్తు సిలువపై తనను బాధించి చంపుచున్నవారిని క్షమింపుమభగవంతుని ప్రార్థించినాడు. మహాత్మగాంధి మొన్నమొన్న రామనామస్మఐతో గుండెలను గుండుదెబ్బలకు గురిచూపి దేహమును త్యజించలేదాచరిత్రలో అలగ్జాండరు తన దండయాత్రలో 'కేవలము బాహ్యవిజంసంపాదకుని దృష్టిలో నిర్లక్ష్యము చేసిన ఒక ఆత్మజ్ఞానిని గూర్చి ఏదైవరము కోరుకొమ్మనెను. ఆ యోగి అలెగ్జాండరు ముఖము చూచి ఏపగిపుతో, " నీవు సూర్యుని వెలుగును అడ్డుపెట్టుచున్నావు, కొంచెము జరుగుమఅదియే నేను కోరు కోర్కె" అనెను.

ఆత్మను పునరవలోకనము చేయుటమాత్రమే మన అసంపూర్ణత్వ మునకు ముగింపు కాదు. అది మనము దైవస్థితిని పొందుటకు మొదటి మెట్టు మాత్రమే.

ఉపనిషదృషులు హిందూదేశ ప్రజలందరు బాహ్య అంతరిక పరిస్థితు లను వశముచేసికొని దైవతుల్యులు కావలయునని కలలు కనిరి. దీనిని పొందుటకు అధ్యాత్మిక కర్మమార్గమే సాధనము. అందువలన మన లోని పశుత్వము సద్వివేచన అను ప్రజ్వరిల్లు అగ్నికి ఆహుతి యగు చున్నది. స్వయంవిచ్ఛేదకములగు బాహ్యావరణల తగులాటములో చిక్కు కొని అవియే స్వయంసంపూర్ణత అని మనము భావించుచున్నాము. ఈ బాహ్యావరణ వ్యామోహమునుండి బయటపడుట యెట్లన్న ఆత్మావలోకనా దృష్టితో [1] ధ్యానమును అభ్యాసమును చేయవలెను.

మనకెందుకీ విషయజ్ఞాన మనిమీరనుకొనవచ్చును. సోదరసాధకుడు నేను చెప్పనది చేసిన చాలునా? అని అడుగుచున్నాడు. మిత్రులారా! సంశయరహితమైన విశ్వాసమే సాధకున కొక శక్తివంతమైన సహాయక మగు చున్నది. కాని అజ్ఞానములో పూడుకొనిపోయి భయజనితమైన అంధవిశ్వా సము కేవలము బానిసత్వపు శృంఖలముమాత్రమే అగుచున్నది. సాధనా మార్గమున కవధి కల్పించునది జ్ఞానమే, అదియే మనలను ఈ విమాన యుగమున జీవితప్రయాణమున [2] డకోటా సౌఖ్యమును [3] టార్పెడో నిశ్చి తత్వమును, [4] రాకెట్ వేగమును కలిగించి సిద్ధిని చేకూర్చుచున్నది-

---

1. స్వామీజీ 'ధ్యానము - జీవనము' చదువుడు.
2. డకోటా - సర్వసౌఖ్యములతో కూడిన విమానము.
3. టార్పెడో - నావ.
4. రాకెట్ - తారాజువ్వ.

# కఠోపనిషత్తు

ఓం సహనావవతు । సహనౌభునక్తు ।
సహవీర్యం కరవావహై । తేజస్వినావధీతమస్తు ।
మా విద్విషావహై ।

ఓం శాంతిః । శాంతిః । శాంతిః ।

[ ఆ పరమాత్మ మనలతోకూడ నుండి మనలను రక్షించుగాక! ఆ పరమాత్మ మనతోకూడ నుండియే మనకు సుఖమును కలిగించుగాక! మన విద్యకు (అధీతిబోధలకు) బలము కలుగునట్లుగా మనము కలిసి ప్రయత్నింతము। మన అధ్యయనము ఆచరణప్రచారములు కలుగునది అగుగాక! మనము ద్వేషభావము లేనివారమై ఉందుముగాక! ]

ఓం శాంతిః । శాంతిః । శాంతిః ।

# ప్రథమాధ్యాయము

## ప్రథమవల్లి

### మృత్యుదేవత గృహములో నచికేతుని కథ

శ్లో॥ ఉశన్ హ వై వాజశ్రవసః సర్వవేదసం దదౌ।
తస్య హ నచికేతా నామ పుత్ర ఆస ॥ ౧ ॥

ఒకప్పుడు స్వర్గమును కోరి వాజశ్రవస్సు యజ్ఞములో తన సర్వస్వమును దానముచేయ మొదలిడెను. అతనికి నచికేతస్సు అను పుత్రుడుండెను.

ఈ ఉపనిషత్తులోని "ఉశన్-స్వర్గమును కోరుచున్న" అను తొలి పలుకు "స్వర్గకామో యజేత" ఇత్యాది విధులను సూచించుచున్నది. ఇట్టి విధులచేతనె బ్రాహ్మణ మతము కర్మప్రాధాన్యము కలదని స్పష్టమగుచున్నది. కావుననే యాగాదికర్మలు తమతమ ఇచ్ఛాపూర్తికై చేయబడుచుండెడివి. కర్మకాండ మానవుని మనోరథములకు తాత్కాలికమైన ఉపశమనమును కలిగించుచున్నది. కాని కొంతకాలము తరువాత ఉపనిషత్తులు మానవుని "ఆశలను త్యజించవలసినది" అని మరల మరల ప్రబోధించినవి. ఆశలను వదలి అనంతానందమును శాంతిని పొందవలసినదని ఉపదేశించినవి. ఈ పై భావమును బోధించుటయే ఈ ఉపనిషత్తులోని ప్రత్యేకత. "మర్త్యుడు తన సమస్త ఆశలను త్యజించినయెడల ఈ జన్మలోనే అమరత్వము జెంది బ్రహ్మజ్ఞానముచే జీవన్ముక్తుడగుచున్నాడు. (అ. 2 - వల్లి. 6 - శ్లో. 14-15)

ఇది అనూచానముగా వచ్చుచున్న శంకరభాష్యముయొక్క తాత్పర్యము. భట్టభాస్కరమిశ్రుడు తన తైత్తరీయ బ్రాహ్మణ భాష్యములో ఇట్లు వివరించుచున్నాడు: "ఉశన్-వాజశ్రవస్సు పుత్రుడు." (ఉశన్నామ వాజశ్రవసః పుత్రః) ఇది క్రమబద్ధముగాను సూటియైనదిగాను స్ఫురించుచున్నది. ఈ రెండు వ్యాఖ్యానములయొక్క మిశ్రణముచే మనము ఈ

నిర్ణయమునకు రావచ్చును. పది పదకొండు శతాబ్దములలో జనియన్ మహాకవి అమూర్తములకు మూర్తత్వమును కల్పించినట్లు ఇచట మూర్తీభవించిన కోరికయే 'ఉశన్' వాజశ్రవస్సు పుత్రుడు అని అర్థము చెప్పుకొనవచ్చును.

గమనిక—1. 2. 4. మంత్రములు వచనాత్మకముగానే యున్నవి. ఇవి తైత్తరీయ బ్రాహ్మణములలో నున్నవానిని యథాతథముగానే ఇచట ప్రవచింపబడినట్లు కనబడుచున్నది. 3. 5. 6. మంత్రములు ఛందోబద్ధమైనవి. ఇవి నచికేతునియొక్క మనోభావమును ప్రతిబింబింపజేయునవి. ఇవి మూలమైన బ్రాహ్మణములయొక్క కథలో కనబడవు.

శ్లో॥ తం హ కుమారం సన్తం దక్షిణాసు నీయమానాసు
శ్రద్ధాఽఽవివేశ సోఽమన్యత ॥ ౨ ॥

అట్లు తండ్రి దక్షిణలు పంచిపెట్టుచుండగా పుత్రుడగు నచికేతుని లేతహృదయములో తండ్రియొక్క భావిశ్రేయస్సును గుఱించి తీవ్రమైన శ్రద్ధ ఆవహించెను. అంత నతడిట్లు ఆలోచించెను.

సాటిలేని ఈ ఉపనిషత్తునందలి ఈ పై శ్లోకమువలన మన కథానాయకుడైన నచికేతుని వంశపరంపరయొక్క ఔన్నత్యము తెలియుచున్నది. నచికేతుడు ఉత్తమవంశ సంజాతుడు. సక్రమముగా పెంచబడినవాడు. తలితండ్రుల ప్రేమకు పాత్రుడైనవాడు. అతని పితామహుడు వాజశ్రవస్సు. అతడు మహా అన్నదాత అను నర్థము, అతని ఆ పేరులోనే యున్నది. అతని పుత్రుడే మన నచికేతుని తండ్రి. ఇతడు తన సర్వస్వమును దక్షిణగా నీయగలిగిన 'విశ్వజిత్' అను యాగమును చేయుచుండెను. సాధారణముగా పూర్వకాలమున దిగ్విజయ యాత్ర చేసి రాజధానికి మరలిన రాజులే ఈ యాగమును చేయుచుండిరి. మఱియు సర్వసంగ పరిత్యాగులగు గృహస్థులుకూడ సన్యాసాశ్రమ స్వీకారమునకు పూర్వము ఈ యాగమును చేయుచుండిరి. ఇట్టి యాగమును చేయగలిగిన వారికి పొందరాని దేదియులేదు. ఇట్లు మన నచికేతునియొక్క అభిజాత్యము

ఉత్తమోత్తమము, అతని తాత తండ్రులు ఒకరి నొకరు మించినవారని తెలియుచున్నది. కావుననే వేదమాత నచికేతునియొక్క పవిత్ర సంస్కృతిని ఇట్లు సూచించుచున్నది.

నచికేతుని శబ్దచిత్రమును పుష్టివంతము చేయని శ్లోక మొకటియు ఈ అధ్యాయములో లేదు. రెండవ శ్లోకమునందే 'శ్రద్ధ' అనునది సాధారణ పదమైనప్పటికినీ కథాంశమును తెలుపు భావస్ఫూర్తి కలదిగా నున్నది. 'శ్రద్ధ' అను పదమే పవిత్రభావగర్భితము గాన ఈ పదమును ఎట్టి పాశ్చాత్యభాషలోనికి అనువదించుటకు వీలుపడకున్నది. ఈ సాధువునకు, ఈ పదమునకు వెస్లీ ( Wesley ) యొక్క అనువాదము కొంచెము నయముగా కనబడుచున్నది. ( Wesley ) వెస్లీ "శ్రద్ధ అనగా నేమి" అని ప్రశ్నవేసుకొని తనకు తానే ఇట్లు సమాధాన మిచ్చుకొన్నాడు. "సత్యమునకు దగ్గఱగా నున్నను శ్రద్ధ అనగా ఒక అభిప్రాయముగాని లేక అనేక అభిప్రాయముల కూడికగాని కాదు. అది ఆత్మస్పృష్టియే. బాహ్యేంద్రియములు భౌతికవిషయములను తెలియజేయునట్లు అధ్యాత్మిక విషయములను తెలియజేయు శక్తియే శ్రద్ధ."

చదివీచదవగానే ఈ అనువాదము చాలా దూరాన్వయము కలదిగా కనబడవచ్చును. శ్రీ శంకరులవారి వ్యాఖ్యానము 'శ్రద్ధ' అను పదమును ఇట్లు వివరించుచున్నది. "గురువాక్యములయందు, శ్రుతిపాఠములయందు, తన అంతరాత్మయొక్క యనుశాసనమునందు నిశ్చలమైన విశ్వాసమును కలిగియుండుటయే శ్రద్ధ."

విద్యార్థి కాదగియుండుటకు కావలసిన నాలుగు లక్షణములలో శమ దమాది షడ్గుణములు కలిగియుండుట ఒకటి, ఆ షడ్గుణములలో శ్రద్ధ యనున దొకటి. వేదాంతమునందు విశ్వాసము లేనిచో దానియొక్క శాసనమును అనుసరించుట కుదురదు. అనగా వేదాంతవాక్యములను అర్థము చేసుకొనవలెననిన శ్రద్ధ అనునది ఉన్ననే సాధ్యమగును. ఈనాటి యువకులు కొంతమంది ఈ 'శ్రద్ధ' అనుదానిని అపార్థము చేసుకొని అది గ్రుడ్డి నమ్మకమనియు, ప్రకృత్యతీతమైన శక్తియందలి నమ్మకమనియు వచించుచున్నారు. ఇదియే వారి యభిప్రాయమైనయెడల ఈ 'శ్రద్ధ' అను పదము

వారి అవహేళనకు తగినవే, కాని శ్రద్ధ అను పదమున కర్థము - నమ్మకము లేక విశ్వాసము అని మాత్రమే. కావున యోచించి చూడగా ఈ ప్రపంచ ములో ఎటువంటివారు ఎటువంటి పనినికూడా శ్రద్ధ లేనిదే చేయలేరు.

ఉదాహరణకు : నీవు నీ స్వంత వ్యవహారమునుండి ఈ శ్రద్ధ అను దానిని తీసివేయుము. అట్లైన నీవీ యజ్ఞశాలనుండి ఇంటికి చేరుటకు ఒక్క అడుగైనను బయటకు తీసిపెట్టలేవు. నీవొక ఉద్యోగమునకు దరఖాస్తు పెట్టినా వనుకొందము. ఈ శ్రద్ధ అనునదే లేకున్నచో నీ కెటువంటి పూర్వాను భవము కలుగనే కలుగదు. కాని నీలో కొంత ఆత్మవిశ్వాస మున్నయెడల అవకాశము దొరికినప్పుడు అనుకూల పరిస్థితులలో అధికారికి సంపూర్ణ తృప్తి కలుగునట్లు విజయవంతముగా కార్యనిర్వహణ చేయగలవు. కావున శ్రద్ధ లేనిదే ఎవ్వరూ ఒక్క రోజుకూడా ఈ భౌతిక ప్రపంచమునందు జీవించలేరు. ఇటువంటి శ్రద్ధలేని కొంతమంది, మనోదౌర్బల్యము కలవారుగానో, ఉన్మత్తు లుగానో జీవించుచున్నారు. వారు తమలో విశ్వాసమును పూర్తిగా గోల్పోయి కూర్చున్న చోటునుండి లేచుటకుకూడా సాహసించలేరు. అట్లు సాహసించి నను, ప్రతి అడుగున ప్రతి చిన్న గులకరాయిని పరీక్షించి ఎత్తెత్తి అడుగు వేయుచున్నారు. ఎందుకనగా అడుగడుగున వారికి అధైర్యమే. కావున వేదాంత జగత్తులోకూడా ప్రధానముగా ఆచార్యునియందు విశ్వాసము, తరువాత శాస్త్రములయందు విశ్వాసము, అన్నిటిని మించి ఆత్మవిశ్వాసము దృఢముగా నున్నచో మన మీ వేదాంతమును ఆచరణలో పెట్టి దానివలని శ్రేయస్సును ఆకాంక్షించ గలుగుదుము.

'శ్రద్ధావిష్టుడు' అను పదములోనే ఒక పవిత్రభావము కలదు. ప్రతి మతముయొక్క ధర్మములు తత్తద్దేశకాలములందలి విభిన్న భావాను గుణములుగా నుండవలెను. ఉన్నవికూడ. ఆనాటి ప్రజల స్వర్ణయుగ ములో అట్లుండినవిగాని రానురాను అవి ఆయా మతస్థులను కట్టివేయు "చేయవలెను, చేసితీరవలెను, తప్పదు" అను పదములచే తమంతటతాము గట్టిపడి కఠిన శృంఖలారూపమును దాల్చినవి. అనగా ఆయా మతస్థులు వారివారి ధర్మములను సరిగా అర్థముచేసికొనక "చేయవలెను, తప్పదు" అను భావముతో గ్రుడ్డిగా అనుసరించుచుండిరి.

అట్లే వాజశ్రవస్సు తాను చేయు విశ్వజిద్యాగముయొక్క అంతరార్థ మును గుర్తించక దానిని తన జీవనస్థితిని, పురోహితుల గొప్పతనమును, విలువను బట్టియే సంపూర్ణముగా చేయ నుపక్రమించెను. ఈ క్రతువు లన్నియు ఆత్మరహితములైనవి. ప్రతిక్రతువును యాంత్రికక్రమాగతము కాజొచ్చినది. బాలుడైనను నచికేతుడు తగిన వివేచనా శక్తిని యలవరచు కొని స్వతంత్రముగా ఈ యాగాంతరార్థములగూర్చి వివేచన చేయ సాహ సించి శ్రద్ధావిష్టుడై తన తండ్రి చేయు కార్యములోని ప్రాముఖ్యమును విచారించెను.

ఇచట కొన్ని చారిత్రక విషయములు మనకు స్ఫురించుచున్నవి. బ్రాహ్మణ మతవిధులు తార్కికదృష్టి గల ప్రజలను తృప్తిపరచలేక నిరుప యోగములు కాగా, శాంతిపూర్వకమైన తిరుగుబాటు జరిగి, చివరకు కర్మ కాండ ఉపనిషత్తులలో వివరింపబడిన వేదాంత సత్యములతో బోధింపబడి పూర్ణత్వమును పొందినది.

శ్లో॥ పీతోదకా జగ్ధతృణా దుగ్ధదోహా నిరింద్రియాః ।
అనన్దా నామ తే లోకాస్తాన్ స గచ్ఛతి తా దదత్ ॥ 3 ॥

(దాన మివ్వబడిన) గోవులు చివరి నీటిబొట్టును త్రాగివేసినవి. చివరిసారిగా గరికపోచను నమిలివేసినవి. ఇవ్వగలిగినన్ని పాలనన్నిటి నిచ్చి వట్టిపోయినవి. కాబట్టి అట్టి పశువులను దానముచేయువారు 'అనంద' (సుఖము లేని) అను పేరు గల లోకములను చేరుకొందురు.

ఈ పై శ్లోకము ఉపనిషత్తులలోని ఉత్తమ కవిత్వమునకు ఉదాహర ణమై ఆత్మగానము వెల్లడిచేయుచున్నది. ఇచట ఈ పదప్రయోగమే అతి సుందరముగా చేయబడినది. ఎంచి కూర్చబడిన కొద్ది మాటలలోనే గంభీ రార్థము స్ఫురించుచున్నది. ఆ దానము చేయు పశువుల దీనస్థితియొక్క సంపూర్ణ చిత్రమును పాఠకులయొక్క కండ్లకు కట్టినట్లు చేయుటకు ఈ పై పద్యములోని నాలుగు విశేషణములే చాలును. ఆ యావులు ఇంకొక గుటకకూడా మ్రింగలేవు. మరియొక గడ్డిపోచనుకూడా కొఱుకలేవు. కాబట్టి

దానము పుచ్చుకొన్నవారికి ఒక పెడకడినూడా దొరికే అవకాశము లేదు. ఇంకను అవి ముసలివి. పాలివ్వవు. వాటిలో చాలవరకు వట్టిపోయినవి. కొన్ని కుంటివికూడ.

ఈ పై శ్లోకము కేవలము నిరర్థకముగా శబ్దచాతుర్యమును వ్యక్తపరచు పదముల గారడీమాత్రము కాదు. శ్రుతిలో వ్యర్థపదములకు అవకాశమే లేదు. తక్కువ పదములతో ఎక్కువ అర్థమును చెప్పుటయే ఉపనిషత్తు శైలి. ఈ శ్లోకములో కవితాసౌందర్యముతోబాటు ఒక నిశ్చితమైన ఉద్దేశముకూడా నిర్వహింపబడినది. నచికేతుని చిత్తరువు మరికొంత వర్ణము మరి రెండు రేఖలు చేర్చబడి మరింత చక్కగా వ్యక్తమైనది.

నవవర్ష వయస్కుడగు నచికేతుడు శాస్త్రముల నుదహరించుచు "లోభులై పురోహితులకు నిరర్థకములగు దానము చేయువారు సుఖరహితమగు లోకములను చేపకొందురు" యని చెప్పుటలో అతడు నిరక్షరాస్యుడు కాడని తద్విపరీతముగా శాస్త్రపాఠములను క్షుణ్ణముగా నభ్యసించిన ఉత్తమ విద్యార్థి యని వ్యక్తమగుచున్నది.

శ్లో ॥ స హోవాచ పితరం తత కస్మై మాం దాస్యసీతి ।
ద్వితీయం తృతీయం తం హోవాచ మృత్యవే త్వా
దదామీతి ॥ ४ ॥

నచికేతుడు తండ్రిని సమీపించి "తండ్రీ! నన్నెవరి కిచ్చెదవు?" అని అడిగెను. కార్యాంతరాసక్తుడైన తండ్రి బదులు పలుకకపోగా అదే ప్రశ్నను రెండవసారి మూడవసారి కూడ అడిగెను. విసుగెత్తిన తండ్రి కోపముతో "మృత్యువున కిచ్చెదను" అని బదులు పలికెను.

ఈ ఉపనిషత్తులోని ఈ శ్లోకమునందలి పదజాలముద్వారా పాఠకుడు (గౌతముని) వాజశ్రవస్సుని ఇంటి యావరణను స్పష్టముగా చూడగలుగుచున్నాడు. ఇంటిముందరి యావరణలో దానము పుచ్చుకొనుటకు వచ్చిన బ్రాహ్మణుల గుంపు, ఒకవైపు నీరసమై దీనమైన ఆవులు ఉన్నవి. వాటిని

అందుకొని తండ్రి మరియొకవైపు ఋత్విక్కులకు దానముచేయుచున్నాడు. ఇంటి వరండాలో తన ఆలోచనలతో తికమకపడుతూ మన నచికేతుడు నిలబడియున్నాడు. అతనికి తండ్రి కార్యములోని పవిత్రభావమేమో స్ఫురించుటలేదు. యజ్ఞము చేయుచున్న తండ్రియొక్క మనోరథములు ఫలించవలెననియే అతని ఆశ. కాని తండ్రి చేయు ఇట్టి దానమువలన సత్ఫలితము కలుగదని తెలియును. ఏలయన తనవద్ద గలవానిలో సారవంతమైనవాటిని దానము చేసిననే ఈ విశ్వజిద్యాగమువలన సత్ఫలితము కలుగునుకదా!

పరిపక్వము చెందిన హృదయము గల నచికేతుడు ఇట్లు తలచెను: "తన ఆస్తియందుగల సంసక్తి మోహములచే తన తండ్రి ఏదోవిధముగా శాస్త్రార్థమునకు తన మనఃప్రేరణచే చేయు కర్మలకు ముడిపెట్టి సరిపెట్ట దలచుకొన్నాడు." వాజశ్రవస్సుని హృదయములోని ఈ సంఘర్షణ అతని బాహ్యకర్మలలో నిట్లు సువ్యక్తము కాగా, నచికేతుడు తన తండ్రికి భవిష్యత్తులో కలుగబోవు తథ్యమైన యాపదను తెలుసుకొనెను.

తన సర్వస్వమును దానము చేయవలసిన విశ్వజిద్యాగమునందు తానుకూడా తన తండ్రికి సంబంధించిన వాడగుటచే, తండ్రియొక్క భావి శ్రేయస్సును తలచిన నచికేతుడు, తండ్రిని సమీపించి, తన నెవ్వరి కిచ్చెదవని అడుగుచున్నాడు. చేయుచున్న యజ్ఞము విశ్వజిద్యాగమగుటచే యజమాని తనది అని చెప్పుకొనదగిన ప్రతిదానిని దానము చేయవలెను. కావున తననుకూడా సంతోషముతో దానముచేయుమని పుత్రుడు తండ్రిని అడుగుట సహజమే కాని పుత్రుని అనుమతి లేకుండా స్వసుఖమును కోరి పుత్రుని దానముచేయుటకు ఏ తండ్రికిని హక్కులేదు. స్వతంత్రజీవితము గల ఒక ప్రత్యేక వ్యక్తిగా కుమారుడు తన తండ్రిని తనకుగల విశేషాధికారములను కోరుట న్యాయమేకదా. లేదా యిది తన జీవితమున తిరుగుబాటు చేయవలసిన సమయమున నిర్లజ్జతో తన తండ్రి వ్యక్తపఱచు ఆత్మఘాతకమైన లోభత్వమును వ్యంగ్యముగా సూచించు నచికేతుని సూచనయైనను కావచ్చును.

ఆ వృద్ధబ్రాహ్మణుడు ధీమంతుడును, సర్వశాస్త్రవేత్తయు అయి నప్పటికినీ తనను అధోగతికి లాగు మనోవికారములకు, మనసు చికాకు పఱచు ఆలోచనలకు అతీతమైన సాధువు అనిగాని సన్యాసి అనిగాని చెప్ప

నర్హుడు కాడు. సన్యాసియే యైనయెడల సకామకర్మను చేసియేయుండడు. కాని యత డభ్యుదయాకాంక్షి యగు జిజ్ఞాసువు. కావుననే యాగముయొక్క అంతరార్థమును గ్రహించుటకు సాహసించి దానిని తన స్థితి కనుగుణముగా నొనర్చుకొని ప్రతిగ్రాహ్యులైన పండితుల సంతృప్తికొఱకు వారిని కానుకలచే సంతోషపఱచవలసివచ్చెను.

అతనిలో ధనాశ యున్నట్లు స్పష్టముగా తెలియుచున్నది. పుత్రుని దానము చేయుటకు హక్కులేదను విధిప్రకారము స్వేచ్ఛాపూర్తికి తన ఏక పుత్రుని దానము చేయుటకు తండ్రి ఒప్పుకొనడేమోయని నచికేతుడు సందేహించుటయు సహజమే. మీరీ యర్థము దూరాన్వయము కలదని యను కొనవద్దు. మానవహృదయము ఇంతకన్న యెక్కువ యాత్మద్రోహమునకు కూడ పాల్పడగలదు. జీవితములో తిరుగుబాటు చేయవలసిన తరుణమేతెంచినపుడు సాధారణముగా మనము మనోవికారములకు లొంగిపోవుటయే గాక మన మనుసరించు మార్గమునుండి క్రింద బడుచున్నామని తెలిసియు మన తప్పులను సమర్థించుకొనుటకు నిరాక్షేపముగా వాదింతుము.

ఆ మునలితండ్రికి ఈ బాలుని పట్టుదల భరింప శక్యము కాక పోయెను. మొదటిసారి పుత్రుని ప్రశ్నకు జవాబు చెప్పలేదు. మరల యడిగినను వినిపించుకొనలేదు. లేదా, కోపపడి ఊరకుండుమని చీవాట్లు పెట్టియుండవచ్చును. కాని మూడవసారి యదే ప్రశ్ననడుగగానే పుత్రుని యుపద్రవముచే చికాకుపడి, విసుగెత్తి, కోపముతో ననహాయుడై హాని లేని శాపము నీయదలచి "నిన్ను మృత్యువున కిచ్చెదను" అనెను. ఇది ఇంగ్లీషు వారు సాధారణముగా కోపగించినపుడు "నరకమునకు పొమ్ము" అనువానితో పోల్చవచ్చును. నిజముగా తండ్రియొక్క ఈ మాటలయందు ఎటువంటి దురభిప్రాయము లేదు. కోపముతో విసుగెత్తిన తండ్రి తన చికాకును పొగరుపోతుగా వ్యవహరించిన పుత్రునకు ప్రకటించుటయే యిచటి అభిప్రాయము. ఏ బ్రాహ్మణుడు ఉపయోగములేని మునలియావులను దక్షిణగా నివ్వదలచెనో, అటువంటి బ్రాహ్మణుడు తన యేకైకపుత్రుని యమ రాజునకు కానుకగా నర్పించుట కల్ల గదా. మన మతనినుండి యటువంటి దానిని యాశించలేముకూడా.

శ్లో ॥ బహూనామేమి ప్రథమో బహూనామేమి మధ్యమః ।
కిం స్విద్యమస్య కర్తవ్యం యన్మయాద్య కరిష్యతి ॥౫॥

నచికేతుడు తలంచుచున్నాడు: "అనేకమంది పుత్రులలో నేను ఉత్తముడను. లేదా యనేకమందిలో నేను మధ్యముడను. (కాని అధముడను మాత్రము కాను.) ఇటువంటి నన్ను పొంది యమధర్మరాజు ఏమి చేయగలడు? నా వలన చేయించతగిన పని యతనికి యేమి కలదు?"

వేదసంస్కృతి యంతయు రంగరించి పోసిన పవిత్ర భారతబాలుని యొక్క మనస్సులోని యాలోచనారూపమే యీ శ్లోకము. తండ్రి తనను మృత్యుదేవత కిచ్చెదనని చెప్పినంతనే తాను ఒక ఏకాంత ప్రదేశమునకు జని నచికేతుడు పరిస్థితులను పర్యాలోచింప దొడంగెను. దీనివలననే నాతని యాత్మ పరిపక్వమైనదని తెలియుచున్నది. పరిపక్వహృదయు డెవ్వడునూ పరిసర వాతావరణమునకు పూర్తిగా లొంగడు. అతని జ్ఞానము భావావేశప్రేరితములైన పిచ్చికేకలకుగాని, ఎదుటివారి బెదరింపులకుగాని అణగిపోవునది కాదు. తండ్రిమాటతో నచికేతునిపై హఠాత్తుగా ఒక పిడుగు పడినట్లైనది. తనకును ప్రపంచమునకును గల సంబంధమునుగూర్చి అతడు ఆందోళనలో పడినాడు. పక్వత నొందిన బుద్ధివలె అతడు మెల్లగా ఏకాంత ప్రదేశమునకు జారుకొని యోచించి తండ్రివాక్యమును విశ్లేషించి, వివేచించి ఒక నిర్ణయమునకు వచ్చుటకు ప్రయత్నించినాడు.

ఆ యేకాంతస్థలములో, పండితులును శాస్త్రములును చెప్పినవాటిని ఉదాహరణగా తీసికొని తన జ్ఞానమును దానితో సమన్వయించి చూచుకొన్నాడు. శాస్త్రవిధి "ఎట్టి నిజమైన శిష్యుడుగాని పుత్రుడుగాని గురువు లేక తండ్రి ఆజ్ఞను జవదాటకూడదు" అని చెప్పుచున్నది. ఇది పవిత్ర ఆర్య హిందూధర్మము ప్రకారము ఏర్పడినది. గురుధర్మమును నిర్వర్తించుట మూడు విధములుగా విభజింపబడినది: (1) గురువు చెప్పకయే అతని కోరికను తెలుసుకొని నిర్వర్తించుట - ఉత్తమ శిష్యుని లక్షణము. (2) మధ్యముడు గురువు చెప్పినంతనే తదాజ్ఞానువర్తియై చేయును.

(3) అధముడన్ననే గురువు చెప్పినను చేయడు. మన కథలో నచికేతునకు గౌతముడు తండ్రియు, గురువునూ అగుచున్నాడు. కావుననే పుత్రుడు - శిష్యుడునైన నచికేతునినుండి ఉత్తమాధమాధికార వర్గీకరణము వెలువడి నది. శాస్త్రవిధుల ప్రకారము చూచినయెడల ఇచట నచికేతుని వివరణ లోని మనోభావము స్పష్టమగుచున్నది. తను సర్వథా శ్రద్ధాళువు అయిన వాడని చెప్పదలచుకొన్నాడు. కావుననే ఉత్తములలో ఒకడని అనుకొన్నాడు. ఒకవేళ తనంతటతాను తెలిసికొని చేయకున్నను చెప్పిన వెంటనేనైన చేయువాడను అని అనుకొన్నాడు. కాబట్టే మధ్యములలో తనను చేర్చు కొన్నాడు. కాని తా నెప్పుడు చెప్పినను చేయనటువంటి అధముడను మాత్రము కానని, తెలిసిగాని తెలియకగాని అవిధేయుడు కాలేదని గట్టి నమ్మకముతో చెప్పుకొనుచున్నాడు. ఇకముందు అధములలో చేరకూడదని నిశ్చయించుకొని తండ్రియాజ్ఞను తిరస్కరించరాదని తలచుచున్నాడు.

తండ్రి తనను మృత్యువున కిచ్చుటకు నిజముగా ఉద్దేశించలేదని, సనాతన ధర్మశాస్త్రప్రకారము తా నాతని ఆజ్ఞను పాలించవలసినదేనని నచికేతునకు తెలియును. కాని ఈ రెంటికిని సమన్వయము ఏ సనాతన ధర్మశాస్త్రములోను చెప్పియుండలేదు. న్యాయమైన, ధర్మశాస్త్ర సంబంధమైన జీవనవిధుల నున్నవిధముగానే యనుసరించవలెను. మన పరిస్థితులకు తగినట్లుగా మనము వ్యాఖ్యానించుకొనుట ఆ ధర్మమును బాహాటముగా అణచివేసి మన విషయలోలుపతను ప్రకటించుకొనుటయే యగును. కావున మిత్రులారా! కపటముతో మన కనుకూలముగా సమన్వయపఱచుకొన్న ధర్మముకన్నను ప్రయత్నపూర్వకమైన యధర్మమే యెంతో మేలు.

హిందువులచే ఆ పరమధర్మముయొక్క వక్రగతు లనెడి పారలతో ఘన సంస్కృతియొక్క సమాధి తెరువబడినది, జాతీయోద్బోధన కలిగి మనము ఇటువంటి ధర్మనాశకులను దృఢధైర్యముతో నశింపజేసినయెడల మన మీనాడు భౌతిక జీవితములోనైన చాలా ఔన్నత్యము పొందిఉందుము. కావున ఈనాడు మనకు ఆధ్యాత్మిక జీవనము గడపు సాహసము లేదు సరికదా యధర్మాత్ములుగా జీవించుటకునూడా శక్తిలేదు. మన యీ యబలాసహజమైన పిరికితనమును సమర్థించుకొని రెండు విరుద్ధభావముల

మధ్య నాపత్కరమైన క్రీడలో పాల్గొనియున్నాము. ఈ విరుద్ధ భావములు— ధర్మమువంటి యధర్మము. అధర్మమువంటి ధర్మము.

నచికేతున కీ విషయము తెలియును. అందువలననే అతడీ పైవిధముగా ధర్మాధర్మములకు సంధి చేయ సాహసించలేదు. మనము దురాశాప్రేరితులమై యా పరమసత్యముయొక్క విలువను మన సౌకర్యముల కనుకూలముగా నమన్వయించుకొనుట దైవదూషణ చేయుటవంటిదే. కావుననే నచికేతుడు "ఈవిధముగా తండ్రిచే పంపబడిన తనద్వారా యముడు సాధించ కలిగిన ఆ పరమకార్య మేది?" అని చకితుడయ్యెను. ఈ నచికేతుని యోచనలో తన జీవిత పరమావధిని వెతుకుచున్న ప్రతి జిజ్ఞాసువునకునూ ఒక రహస్యమార్గమున్నది. నచికేతునికి, తన తండ్రి యతని యుద్దేశమును వెలిబుచ్చలేదని, వ్యక్తపఱచినట్లు ఉద్దేశించలేదని బాగుగా తెలియును. కాని తన కాతడు తండ్రియే గాక గురువుకూడ. గురువుగారి వాక్కులు వ్యర్థములు కావు. మన పురాణగాథలలో పెక్కుచోట్ల పరమగురువులయొక్క వాక్కులు అంతమున యథార్థముగా నెట్లు పరిణమించినవో చెప్పబడియే యున్నది. కావున నం దాశ్చర్యమేమియు లేదు. అది యట్లు జరిగి తీరవలసదే. రేడియోస్విచ్చి ఢిల్లీస్టేషనుకి త్రిప్పినయెడల ఢిల్లీలో ప్రసారము చేయబడిన గీతములే వినబడునుగాని యితర స్థలములనుండి వినరావు కదా! కాని రేడియో తనంతట తానే తన ఇష్టము వచ్చినట్లు పలుకలేదు! ఆ విధముగానే ఆత్మజ్ఞానియై భగవదవతారపురుషుడైన వ్యక్తి 'తత్' పదార్థముతో ఐక్యము పొందుచున్నాడు గాన తననుగూర్చి వ్యర్థపదములలో వ్యక్తపఱచుకొనడు, పఱచుకొనజాలడు. అతడు పలికిన వన్నియు సత్యములే లేదా సారవంతములైనవే. అతని యోచన లన్నియు ఆ మహత్తత్త్వముయొక్క యోచనలే. అతని పలుకు లన్నియు ఆ దివ్యసంకల్పమునకు సంబంధించినవే, దైవేచ్ఛతో కూడినవే. ఆధ్యాత్మిక విషయములో గురువుయొక్క యనుగ్రహమును పొందగోరిన ప్రతి శిష్యునకునూ బుద్ధితో తెలుసుకొనదగిన విషయమే యిది. ఏ దురుద్దేశము లేకుండా ఉద్రేకముతో పలికిన తండ్రి పలుకులే అయినప్పటికినీ పైచెప్పిన విధముగా గురుభక్తి కలవాడైనందున నచికేతుడు తండ్రిమాటలను శిరసావహించి యా మాటల ప్రకారమే నడవ

దలచెను. ఇట్లు తన గురువునకు మారుపలుకని వాడగుటచే శిష్యుడైన నచికేతుడు మృత్యుదేవతయొక్క పాదసన్నిధిని పరమైశ్వర్యమును సాధించి పొందగలుగుచున్నాడు.

"ఆ యమునికి నాద్వారా చేయదగిన లేక కావగిన పని ఏమున్నది?" అను పలుకులలోనే అతని హృదయములోని సూక్ష్మమైన భావనాశక్తి విదిత మగుచున్నది. బాలుడైన నచికేతుడు ధర్మశాస్త్రములలో ప్రతిపాదితమైన మార్గమునే యనుసరింప దలచుకొనెను. భవిష్యత్తును తొంగిచూచుటలో గల యాతురత, మృత్యుదేవతకు తనవలన కాబోవు కార్యమును గుఱించి జిజ్ఞాస, యనునవే యాతని యాశ్చర్యమునకు కారణములు.

గమనిక—మూడుసార్లు తన నెవరికిచ్చెదవని నచికేతు డడుగుట లోను, మృత్యువునకని తండ్రి చెప్పుటలోను నొక విశేషమున్నది. ఇచట నచికేతుడు మూడుసార్లు తన్నర్పించుకొనుటలో మొదటిసారి స్థూల దేహమును, రెండవసారి సూక్ష్మదేహమును, మూడవసారి కారణదేహమును అర్పించుకొనుచున్నాడు. అనగా యీ దేహేంద్రియాదులందు అభిమానము వదలి తన్ను తానర్పించుకొనుచున్నాడు. అట్టివానిని మృత్యువున కిచ్చుట యనగా నాతనిలోని వ్యక్తిత్వమును యహంకారమును నాశనము చేయుటయే. అహంకార వ్యక్తిత్వములు నశించిన యాతడు కేవల పర మాత్మ స్వరూపుడేనని యర్థము. నచికేతునిద్వారా యీ యుపనిషత్తు మన కిట్లు బోధించుచున్నది. "దేహేంద్రియాది యభిమానమును వీడిన జిజ్ఞా సువు 'అహం' నశించి ఆత్మస్వరూపుడగుచున్నాడు."

శ్లో॥ అనుపశ్య యథా పూర్వే ప్రతిపశ్య తథాఽపరే।
సస్యమివ మర్త్యః పచ్యతే సస్యమివాఽజాయతే పునః

ఇట్టి పరిస్థితిలో మన పూర్వు లెట్లాచరించిరో మన తరమువారు ఎట్లాచరించుచున్నారో జ్ఞప్తికి తెచ్చికొనుము. సస్యములు నశించి మరల పుట్టునట్టుల మానవుడు ఈ దేహమును త్యజించి మరల పుట్టుచున్నాడు.

ఈ వాక్యములు పుత్రుడైన నచికేతుడు ప్రత్యక్షముగా తండ్రితో చెప్పుచున్నాడు. సమస్త శ్రుత్యుపదిష్టజ్ఞానము, సమస్త సనాతన ధర్మసారమే ఈ శ్లోకములోని ముఖ్యభావము. హిందూమతమునకు వెన్నెముకయై, నిరసనకరణీయమైన పునర్జన్మను గురించిన వేదాంతమును ఈ శ్లోకము సూచించుచున్నది. మన మెక్కడనుండి వచ్చినాము? ఎక్కడికి పోవుచున్నాము? అని తీవ్రముగా నిష్కపటుడై ఆలోచన చేయు ప్రతి వివేకియైన మానవుడునూ యీ నిర్ణయమునకు రావలసినదే. పూర్వకర్మ అనునదే లేకపోయినయెడల మనము చూచుచున్న మానవులలో నింతగా భేదముండనేయుండియుండదు. కష్టజీవికి పుట్టిన పిల్లవాడు పుట్టినప్పటినుండియు నీచమైన యీ జబ్బువలని కష్టము ననుభవింపవలసినదే. అదే సమయములో మరియొకచోట మహారాజునకు పుట్టినవాడు కిరీటమును తలదాల్చి రాజ్యము నేలుచున్నాడు. ఇది ఏల?

ఈ జీవితము సూటిగా భగవంతుని వద్దనుండియే ప్రారంభమైనదని మనమనుకొన్నచో ఆ సృష్టికర్త తన శక్తి నిరంకుశత్వములతో సాధారణమైన రాజువలెనే రాక్షసత్వమును వహించి తన సంతోష సంకల్పముల కనుగుణముగా ఇష్టమువచ్చినవారికి ఐశ్వర్యమును ఆనందమును ప్రసాదించి తదితరులను దుఃఖసాగరమున ముంచుచున్నాడన్న నిర్ణయమునకు వచ్చి తీరుదుము. న్యాయాన్యాయ విచారణ లేనివాడై, చంచలచిత్తము కలిగి, పక్షపాతియై చపలబుద్ధి కలిగి ఇష్టానుసారముగ ప్రవర్తించు ఇట్టి భయంకర ప్రాణి, భక్తితో తన సర్వస్వమును అర్పించుటకు సిద్ధపడిన భక్తునకు భగవంతు డెన్నటికినీ కాజాలడు. మరియు క్రూరశక్తులు కలిగి పక్షపాతియై న్యాయహీనుడైనవాడు భగవంతుడని ప్రపంచములోని ఏ మతమును చెప్పుటలేదు.

ఈ శ్లోకమువలన మన జీవితములు అకస్మాత్తుగా సంభవించినవి కావనియు, అవి మన పూర్వకర్మ ఫలరూపములే గాక మన పునర్జన్మకు కారకములనియు తెలియుచున్నది. ఇట్టి పరస్పర సంబంధము గల గొలుసు వంటివీ జన్మలని యీ శ్లోకముయొక్క యంతరార్థము. ఈ వాక్యములవలన 'అహం' కారణముగా మనము పూర్వమున యనేక జన్మలెత్తియుండుటయే

కాక పునః అనేక జన్మలెత్తబోవుచున్నామని తెలియుచున్నది. సంగ్రహించి చెప్పిన ఇప్పటి యీ జన్మ నిత్యసత్యమైన యీ ఆత్మయొక్క అస్తిత్వములో ఒక ఘటనా మాత్రమే.

తరతరముల ప్రజలు భూమిపై జన్మించి ఆహారము తిని పెరిగి పెద్ద వారై సంతానమును గని తమ తరువాతి క్రొత్తగుంపుకు చోటు వదలుచు తాము మరణించుచున్నారు. సస్యము పుట్టి మరల పెరిగి పెద్దదై నశించుట అను మఱువరాని రూపకమునుండి ఈ భావము వ్యక్తపఱుపబడినది. సస్యము వర్షాకాలములో పెరిగి వెంటనే పుష్పించి రెండు నెలలలోనే వెన్నువేసి ఎండిపోవుచున్నది. అట్లే మనుష్యుడును తన పిల్లలు పెద్దవారగు నప్పటికి వారికి చోటు వదలి వారి యభివృద్ధికొఱకు తాను మఱుగుపడవలసినదే.

నచికేతుడు తన తండ్రికి "ప్రతి జీవి నశించవలసినదేననియు, యీ యనంత కాలప్రవాహములో ప్రతి వ్యక్తియొక్క ఆయుఃప్రమాణము క్షణికమేననియు" తెలియుజేయుచున్నాడు. కావున ఇట్టి అల్పాయుష్కులైన మానవులు ఎందులకు విమోహితులై పేరాశకు లొంగి అధర్మమును చేయవలెను అనునదియే దీనిలోని సాధారణాంశము. ఈ విధముగా చెప్పుట తనను మృత్యుదేవతవద్ద కనిపి, తండ్రియు గురువునైన అతడు సత్యమును పాలించవలెననుదానిని నెలకొల్పుటకు పుత్రుడు చేయు దృఢమైన వాదనయే.

మరియు నచికేతుడు జీవితములో ధర్మాధర్మములయొక్క వివేచనను గుఱించికూడా చర్చించుచున్నాడు. ధర్మమేదో యధర్మమేదో తెలియక తత్త్వాన్వేషి యనేకసారులు తన మార్గమునుండి తొలగినటుల తలచు చున్నాడు. అటువంటి అజ్ఞనస్థితిలో, అనగా కింకర్తవ్యతా విమూఢస్థితిలో శ్రుతి, "పూర్వులు ఎట్లాచరించిరో అధునాతనులు ఎట్లాచరించుచున్నారో జ్ఞప్తికి తెచ్చుకొనుము" అని సలహా నిచ్చుచున్నది.

ఇది అతిముఖ్యమైన ప్రబోధము. ప్రతి తత్త్వాన్వేషియు దీనిని గ్రహింప వలసినదే. నైతికముగాను ధార్మికముగాను క్లిష్టపరిస్థితులు వచ్చినప్పుడు మన మనస్సు యుక్తాయుక్తములను వివేచించునంతటి స్థిరత గలిగి మంచి

మార్గములోనే నడచుశక్తి, శాంతి, గలిగి యుండదు. కావున ప్రతి సాధకుడునూ యీ పైవిషయమును గ్రహించవలసినదే. ఆ సమయములో పూర్వులట్టి పరిస్థితులలో నెట్లు నడచుకొనిరో పరిశీలింపవలెను. కొన్ని సమయములలో మనకు వచ్చు పరిస్థితులు మన పూర్వులకు అజ్ఞాతములై, యననుభూతములై యుండవచ్చును. ఉదాహరణకు—క్రిక్కిఱిసిన బస్సులలో ప్రయాణము చేయు పరిస్థితి మన పూర్వులకు కలిగియుండక పోవచ్చును. కావున అట్టి క్రిక్కిఱిసిన బస్సులలో ఆ జనసమూహములో నెట్టి ధర్మము ననుసరించవలెను? అనుదానికి, "ఈనాటివారు ఎట్లు నడచుకొనిరో వారినే యనుసరింపుము," అనునదే సమాధానము. కావున "యద్యదాచరతి శ్రేష్ఠః" యనునట్లు పూర్వకాలమునగాని అధునిక కాలమునగాని మహాత్ములు ఎట్లు నడచుకొనిరో తెలుసుకొని మంచి చెడ్డలపట్ల ఆ విధముగా నడచుకొనునట్లు మన మనస్సునకు బోధించుకొనవలెను.

శ్రీ శంకరులవారు మరియు కొంతమంది భారతీయ వ్యాఖ్యాతలుకూడ ఇదే భావమును వెల్లడిచేసిరి. (మేక్స్‌ముల్లరు శ్లో. 5. 6. జన్మాంతరమును గుఱించిన నచికేతుని ధ్యానమును చెప్పుచున్నవని తలచుచున్నాడు.) ఆలోచించగా మరణము అంత వింతయైనది కాదు. మానవుడు మృతిజెందు కోటానుకోట్ల ప్రాణులలో తాను ఒకడే. ఆ యనంత మృత్యుమార్గమున తిరుగు ఒక ప్రయాణికుడే. తన తరువాతివారికి యతడు ముందువాడు. తన సమకాలీనులలో తానొకడు. అతడు (నచికేతుడు) తన ధ్యానదృష్టిని ఈ 'అను' అనుటచే పూర్వీకులవైపు, 'ప్రతి' అనుటచే తన తరువాతి వారివైపు కేంద్రీకరించుచున్నాడు. కావున ప్రతి జీవికినీ ఈ యవస్థ యనగా పునర్జన్మ సమమే కాబట్టి యీ పైరెండు శ్లోకములునూ సస్యము పుట్టి నశించునట్లే మానవుడు పుట్టి పెరిగి నశించుచున్నాడను విషయమును బోధించుచున్నవి.

అంతియే గాక పై శ్లోకము హిందూమతములోని సిద్ధాంతరూపమైన పునర్జన్మను ప్రకటించుచున్నది. ఈ సిద్ధాంతము ముందుగా బృహదారణ్యకోపనిషత్తులోనే కనబడుచున్నది.

శ్లో ॥ "వైశ్వానరః ప్రవిశత్యతిథిర్బ్రాహ్మణో గృహాన్ ।
తస్యైతాం శాన్తిం కుర్వన్తి హర వైవస్వతోదకం"॥

"అతిథి అయిన బ్రాహ్మణుడు అగ్నివలె ఇంటిలో ప్రవేశించును. అతనికి యజమాని దీని నిచ్చి శాంతపఱచును. ఓ, వైవస్వతా! నీవు జలమును కొనిపొమ్ము."

పూర్వశ్లోకమునకునూ, యీ శ్లోకమునకునూ మధ్య కొంత మౌన నాటకము జరిగినది. దానిని మనము వేదభాగమైన బ్రాహ్మణముల కథ నుండి పూర్తిచేసుకొనవలెను. అదేమనగా: నచికేతుడు యమధర్మరాజు గృహమును చేరెను. నచికేతుడు తండ్రిని ఆశ్వాసించి, పూర్వులైన ఆర్యులు ఏమార్గమున నడచిరో, అట్టి సత్యమార్గముననే ప్రవర్తించమని బ్రతిమాలి, తాను తిన్నగా యమరాజువద్దకు చేరెను. సింహద్వారము చేరి యమధర్మరాజు ఆచట లేడని తెలుసుకొని ద్వారమువద్దనే వేచియుండవలసిన వాడాయెను.

ఇచట చిన్మయానందస్వామి ఆలోచన లేని చదువరుల యర్థరహిత స్థూలప్రశ్నలకు జవాబుచెప్పుటకై యూగుచున్నారు. కొందరు "మర్త్య బాలుడు తన యిష్టముతో మృత్యులోకమున కెట్లు చేరగలిగెను?" అనియు, మరికొందరు, "నచికేతుడు యమధర్మరాజును దర్శించుటకీ స్థూలశరీరముతో వెళ్ళెనా లేక సూక్ష్మశరీరముతో వెళ్ళెనా?" అనియు నడిగెదరు. ఇవన్నియు తెలివితక్కువ ప్రశ్నలే! ఇటువంటి సారము లేని ప్రశ్నల దొంతరవలన మనము విషయమును పొడిగించి మరికొన్ని మూఢప్రశ్నలకు నవకాశ మిచ్చుచున్నాము. ఇటువంటి ప్రశ్నలు సాధారణముగా ముఖ్యార్థము తెలిసికొనగోరని బుద్ధిభావము గలవారికే తోచును. అసలిది యొక కథ. దీని ముఖ్యోద్దేశము బాలుడు ఇచ్ఛానుసారముగా మృత్యులోకమునకు వెళ్ళెనా, స్థూలదేహముతో వెళ్ళెనా లేక సూక్ష్మదేహముతో వెళ్ళెనా? అను విషయమును చర్చించుట కాదు. ఇది జ్ఞానదాహము గలిగి తత్త్వాన్వేషియైన విద్యార్థిని ఉత్తమజ్ఞానియైన మృత్యుదేవతవద్ద చేర్చుటయే ఫలముగా

గలది. కాబట్టి అనవసరమై యర్థరహితమైన ప్రశ్నలచే మనము ఉపనిష దుద్దేశమునుండి జారి దూరముగా పోవుచున్నాము.

ఉపమానము ప్రతి చిన్నవిషయమును వివరముగా తెలుసుకొనుట వలన అర్థముకాదు. ఒక కవి 'కుమారి సరోజ ముఖము చంద్రునివలె నున్నది' అని వర్ణించె ననుకొందము. దీనివలన ఉపమానమైన చంద్రుని వలె ఆమె ముఖము రేఖాగణిత ప్రకారము వర్తులముగాను, చంద్రునిలో నున్న మచ్చవలె ఆమె ముఖములో నల్లని మచ్చలున్నవనిగాని యర్థము కాదుగదా! కావున నటువంటి యరసికులైన చదువరులు కావ్యములను మాని గణిత శాస్త్రమును గ్రహించవలసినదే. వారు కావ్యరసమును ఆస్వా దించలేరు సరికదా తాము చదువు కావ్యార్థమునే నాశనము చేయుచున్నారు.

మృత్యుదేవత ఇంటిలో లేనందున నచికేతుడు తనకు తానే విధించు కొనిన శిక్షతో మూడురోజు లుపవాసముండవలసి వచ్చెను. ఇక్కడనూత 'మృత్యుదేవత లేకున్న అతని భార్య లేమైరని' ఆశ్చర్యపడుటయు అర్థ రహితమైనదే. సిద్ధుడైన గురువుయొక్క అనుగ్రహము పొందుటకు విద్యార్థికి కొంత ఆత్మసంయమనము, నిగ్రహము, శిక్షణ ఉండవలెనని తెలుసుకొనుటయే ఇచట ముఖ్యము. మూడు దినముల తరువాత మృత్యు దేవత తిరిగివచ్చెను. ఈ పైశ్లోకములోని వాక్యములు అతని మంత్రులు గాని భార్యలుగాని చెప్పియుందురు.

మన హిందూధర్మశాస్త్రము ననుసరించి పవిత్రుడై, సంస్కృతి గలిగి, కర్మిష్ఠుడైన బ్రాహ్మణుడు రెండువైపుల వాడిగలిగిన ఆయుధమువంటివాడు. అతనిని మనము మన జీవనమార్గములోని కంటకములను నరికివేసి గమ్యస్థానము చేరుటకైనను ఉపయోగించుకొనవచ్చును, లేదా అతనిని లక్ష్యపెట్టక యతని సలహాలను తిరస్కరించి మనలను నాశనముచేసి కొనుటకైనను ఉపయోగించవచ్చును.

పరలోకములోని సుఖములను పొందుటకు అగ్న్యారాధనమే (అనగా అగ్నియొక్క ఆరాధనమే) ముఖ్యసాధనము గావున అట్టి యగ్నితో నతిథిని పోల్చుట మిక్కిలి యుక్తముగానే యున్నది. అట్లే యగ్ని యిహమునందు

యిళ్ళను కాల్చి యజమానికి దుఃఖమునుకూడా కలిగించును. మరియు 'వైశ్వానర' అను పదమునకు విశ్వమానవులకు సంబంధించినవాడని మరియొక యర్థము కలదు. అగ్నియొక్క వివిధకార్యములను తెలుపుటకు ఋగ్వేదములో 'వైశ్వానర' అను పదము అరవైసార్లు ఉపయోగింప బడినది. ఈనాటి సంఘములోకూడ, సంస్కృతి కలిగి విద్యావంతుడైన అతిథి సర్వదా భక్తితో గౌరవింపబడుచున్నాడను విషయమును గమనింప వలెను. ఇచట బ్రాహ్మణుడనగా ఏదో అకస్మాత్తుగా బ్రాహ్మణజాతిలో పుట్టినవాడుమాత్రము కాదు. నేను చెప్పిన ప్రకారముగా, నెవనిలో కావలసిన పవిత్ర సంస్కృతి, మానసికశక్తి, బుద్ధిశక్తి గలిగి ప్రత్యేక వ్యక్తిత్వము కలిగియుండునో అతడే బ్రాహ్మణుడు.

శ్లో॥ ఆశా ప్రతీక్షే సంగతం సూనృతాం చ ఇష్టాపూర్తే
పుత్రపశూంశ్చ సర్వాన్ ।
ఏతద్వృంక్తే పురుషస్యాల్పమేధసో యస్యానశ్న
న్వసతి బ్రాహ్మణో గృహే ॥ ౮ ॥

ఎవని ఇంటిలోనైతే బ్రాహ్మణుడు ఉపవాసముండునో అట్టి యజ్ఞానియొక్క ఆశలు, ఆకాంక్షలు, సత్సాంగత్యము, మైత్రి, యజ్ఞములు, పుణ్యదానములు, పుత్రపశుసంపదలు నశించును.

వృంక్తే—ఇది వృనక్తిలోనుండి పుట్టిన పదము. త్రిప్పివేయుట లేక మెలిపెట్టుట అని దీని యర్థము. కావున ఆ బ్రాహ్మణుడు యజమాని తనను గౌరవించనియెడల ఆతనినుండి ఈ పైచెప్పిన సంపదలను మెలి పెట్టి బలాత్కారముగా లాగుకొనుచున్నాడు.

సాధారణమైన మానవుల గృహములలోనే గాక మృత్యుదేవత సదన ములోకూడ సనాతనధర్మము అనుసరింపబడుచు, శాస్త్రవిధులు పేర్కొనబడి ఆచరింపబడుచున్నవి. ఎవడైతే సంస్కృతి జ్ఞానము కలిగినవానిని బుద్ధి

పూర్వకముగా నవమానించునో యట్టివానికి రాగల పరిణామమును యీ శ్లోకము వివరించుచున్నది.

అతిథిగా వచ్చిన సాధువును అవమానపఱచినవారియొక్క అశలు ప్రతీక్షలు నాశము చేయబడుచున్నవి. ఇచట 'ఆశ' యనగా తెలియని వానిని - స్వర్గము మొదలైనవానిని - కోరుట. ప్రతీక్ష యనగా తెలిసిన విషయములను - ధనము సంబంధ బాంధవ్యములు—మొదలైనవానికొఱకు ఆశతో ఎదురుచూచుట. సాధువైన అతిథిని అవమానపఱచిన యజమానిని శ్రుతి 'అల్పమేధసుడు' అని పిలుచుచున్నది. ఈనాడు మన సంఘములో సాధువులను ఆదరించి సత్కరించక నిర్లక్ష్యము చేయువారిని ఎక్కువగా చూచిన యెడల శ్రుతియొక్క భాషప్రకారము మనము బుద్ధిహీనుల తరమువారమగుచున్నాము.

సనాతనధర్మప్రకారము (అతిథిదేవోభవ) అతిథి దేవుడే, లేదా అతిథి నారాయణుడు. యజమాని తనయొక్క జ్ఞేయమైన మానసిక పరిణామములలో భావి యభ్యుదయము నాకాంక్షించి నిత్యము చేయు పంచమహాయజ్ఞములలో అతిథ్యము ఒకటి. ఒక దృష్టిలో ఈనాడు బ్రాహ్మణుడనగా ఏదో ప్రత్యేకమైన హక్కుగల తరగతిగా భావించు అర్థములో కలోప నిషత్తుకూడా, బ్రాహ్మణమతమును ప్రచారముచేయు సాధనగా కనుపించ వచ్చును. బ్రాహ్మణులే ఉపనిష దధ్యయనమునకును తత్త్వజ్ఞానమునకును తగినవారని సాంప్రదాయమున్నప్పటికినీ ప్రాచీన ఉపనిషత్తులలో ఈమహాజ్ఞానము ముందుగా క్షత్రియునకు ఉపదేశింపబడినదనియు తద్ద్వారా బ్రాహ్మణునకు ఉపదేశింపబడినదనియు చెప్పబడియున్నది. బృహదారణ్యక ఛాందోగ్యోపనిషత్తులలో పాంచాలరాజైన 'ప్రవాహనజైవలి'నుండి బ్రాహ్మణ సాధువైన "గౌతమ ఆరుణి" ఆ జ్ఞానమును పొందెనని ఇట్లు చెప్పబడినది : "ఈ తత్త్వము నీకు పూర్వము బ్రాహ్మణుల కుపదేశింపబడలేదు." కౌషీతకిలో, ఆరుణిఋషి, "చిత్రగార్గ్యాయన" అను రాజువద్ద శిష్యుడైనాడని చెప్పబడియున్నది. అట్లే బృహదారణ్యకములో కాశీరాజైన అజాతశత్రువు వద్ద బ్రాహ్మణుడైన గార్గ్యుడు శిష్యత్వము చేసినట్లు చెప్పబడియున్నది.

శ్లో॥ "త్రిస్రోరాత్రీర్యదవాత్సీర్గృహేమే అనశ్నన్బ్రహ్మన్న
తిథి ర్నమస్యః।
నమస్తేఽస్తు బ్రహ్మన్ స్వస్తిమేఽస్తు తస్మాత్ప్రతి త్రీ
న్వరాన్వృణీష్వ॥ ౯॥"

"ఓ గౌరవనీయుడైన అతిథిబ్రాహ్మణా! నీవు నా గృహములో మూడురాత్రు లుపవాసముంటివి. దానికి ప్రాయశ్చిత్తముగా మూడు వర ములను కోరుకొనుము. నీకు నమస్కరించుచున్నాను. నాకు శుభమగు గాక" అని యముడు నచికేతునితో చెప్పుచున్నాడు.

సనాతన ధర్మమును అనుసరించుటలో ఆర్యులు ఎంత ఉన్నత భావము కలవారో ఈ శ్లోకమువలన తెలియుచున్నది. ఆలోచించగా, మృత్యు దేవతవంటి దివ్య ప్రభావశాలి, తొమ్మిదేండ్ల బాలుని ముందర, అతివినయ ముతో తాను విధిలేక చేసిన తప్పును క్షమించవలసినదని కోరుట నిజముగా ఆశ్చర్యపడవలసిన విషయమే. ఇది, గవర్నర్లే తమ శాసనములను తప్పి నడచు కాలము. తానే ఇంటిలో లేనప్పుడు ఆ బ్రాహ్మణబాలునకు ఆతిథ్యము జరుగనందుకు మృత్యుదేవతను ఎవ్వరును తప్పుపట్టరుకదా! అయినప్పటికి మృత్యుదేవత బ్రాహ్మణబాలుని తన తప్పునకు క్షమాపణ వేడుకొని దానికి ప్రాయశ్చిత్తముగా మూడు వరములు కోరుకొమ్మనుచున్నాడు. శక్తిసామర్థ్యములు, అంతస్థు, అధికారములు కలిగిన మానవులు ఇట్లు ధర్మమును చక్కగా అనుసరించినచో సాధారణులు దానిని తిరస్కరిం చుటకు సాహసించరుకదా! ఇచట యమధర్మరాజు ముఖమునుండి వెలువడిన మాటలలో బ్రాహ్మణబాలుని ప్రశంస అంతఃప్రవాహముగా గోచరించుచున్నది. "నాకు శుభమగు గాక" అనునది బ్రాహ్మణుడు దీర్ఘకోపి కాడు గావున నమస్కారమును చేసినవెంటనే శుభమును అనుగ్ర హించును గాన యమరాజు అడుగకముందే అతనికి శుభము సిద్ధించినదని తెలియుచున్నది.

1-9 శ్లో॥ తండ్రియొక్క సత్యవాక్పరిపాలనకై నచికేతుడు మృత్యులోకమును చేరుట, అచట మూడురాత్రులు ఉపవాసముండుట, తన అపరాధమునకు ప్రాయశ్చిత్తముగా యమరాజు బాలునికి మూడు వరముల నిచ్చుట యనువానిని చెప్పుచున్నవి.

శ్లో॥ శాన్తసంకల్పః సుమనా యథాస్యాద్వీత మన్యుర్గౌత
మో మాఽభి మృత్యో।
త్వత్ప్రసృష్టం మాఽభివదేత్ప్రతీత ఏతత్త్రయాణాం
ప్రథమం వరం వృణే॥ ౧౦॥

ఓ మృత్యువా! మా తండ్రియైన గౌతముడు నామీద కోపము లేక, దయగలిగి, సమాధానపడి, నీవు పంపిన నేను, తిరిగి వెళ్ళగానే సన్మానదరించునటుల మూడింటిలో మొదటిదగు వరముగా నిమ్ము" అని నచికేతుడు పలికెను.

మృత్యుదేవత మూడే వరము లిచ్చినప్పటికినీ నచికేతుడు మొట్ట మొదటి దానిని తండ్రి కనుకూలముగా కోరుచున్నాడు. ఈ కార్యము అతని బుద్ధిని చరిత్రను మిక్కలి తేజోవంతము చేయుచున్నది. ఉన్నతలోకమునకు వెళ్లినప్పటికినీ మొట్టమొదట తండ్రికి శాంతిని సంతోషమును కలిగించునటుల మొదటి వరముగా గోరి ప్రప్రథమముగా తన పుత్రకర్తవ్యమును నిర్వర్తించుచున్నాడు. తన నావిధముగా మృత్యు దేవత గృహమునకు పంపిన తండ్రి తనను గూర్చి పగలు కాకున్నను రాత్రియైనను పశ్చాత్తాపపడుట సహజము. అందువలన రాత్రి తండ్రికి శాంతి కలుగవలెనని నచికేతుని కోరిక. తండ్రి విషయమై కలుగు ప్రేమతో కూడిన యాలోచనయే మానవుని మనోవికాసమునకు ప్రారంభము. ఇట్లు తలితండ్రులతో ప్రారంభించిన ఈ వికాసము వైశాల్యమును పొంది ప్రపం చములోని యచేతన పదార్థములనుకూడా ప్రేమించుటతో నంతమగు చున్నది.

సంపూర్ణమానవుడనగా భగవదనుభవము గలిగి తనను, తనవారిని, తన దేశస్థులనే గాక సర్వులను ప్రేమించువాడని యర్థము. అట్టి సంపూర్ణ మానవుడే నిజముగా ప్రపంచ పౌరుడు. వానికి సంపూర్ణమైన ప్రేమ యుండును. ఇట్టి సంపూర్ణత్వమును సాధించుటకు సాధకుడు సానుభూతి ప్రేమలను, స్వార్థరహితమైన త్యాగమును ముందుగా తన తలితండ్రుల యెడల చూపించవలెను.

మతముపేరిట అనేక అసభ్య ఆచరణలను అమలులో పెట్టునట్టి రోజులివి. నేటి యువకులెల్ల, తమ బుద్ధిహీనతచేత తమ ఇంద్రియముల యొక్క స్వేచ్ఛానుగమనముచేత బాధింపబడినవారలై, తమ జీవితములో అస్థానపతితమైన యుత్సాహముతో, సన్యాసమువైపు పరుగెత్తిపోవుచున్నారు. అటువంటి దుస్సాహసి, నీతిబాహ్యుడు, ఈ సన్యాసములో సాఫల్యమును పొందలేడు. అట్టివాడు ఈ ఐహికవిషయములలోనే గాక అసవులలో చేయు తత్త్వాన్వేషణములో, ఆత్మానుభవములోకూడా అర్హత లేనివాడై యున్నాడు. తనమీద ఆధారపడువారి విషయమై, తనచుట్టునున్న ప్రపంచ విషయమై, తనయొక్క ఉత్తమవిధిని నిర్వర్తించుట నచికేతునిలో కనబడుచున్నది.

శ్లో॥ యథాపురస్తా ద్భవితా ప్రతీత ఔద్దాలకిరారుణిర్మత్ప్రసృష్టః।
సుఖం రాత్రీః శయితా వీతమన్యుస్త్వాం దదృశివా
న్మృత్యుముఖాత్ప్రముక్తం ॥ ౧౧ ॥

నా యనుగ్రహముచేత ఆరుణిపుత్రుడైన ఔద్దాలకి నిన్ను గుర్తుపట్టు గాక! రాత్రియందు నిర్విచారముగా, సుఖనిద్ర జెందువాడై, మృత్యు ముఖమునుండి వెలువడిన నిన్ను కోపము లేక యాదరించును.

ఈ శ్లోకములో మృత్యుదేవత సాంగముగా నచికేతుని కోరికను అను గ్రహించుచున్నాడు. నచికేతుని తండ్రికి—గౌతముడు, ఆరుణి, ఔద్దాలకి, వాజశ్రవస్సు, అని నాలుగు పేర్లు ఉన్నట్లు ఇంతవరకు నీ యుపనిషత్తులో

తెలియుచున్నది. అతడు ఉద్దాలకునకు ఔరసపుత్రుడు, ఆరుణికి దత్త పుత్రుడు. కొంతమంది వ్యాఖ్యాతలు నచికేతుని తండ్రియగు వాజశ్రవస్సు, ఔద్దాలకారుణి ఒకడే యనుచున్నారు. కావున అస్త—ఆరుణి నచికేతుడే యగుచున్నాడు. 'నచికేతుని మృత్యుముఖమునుండి విడుట చూచి వాజ శ్రవస్సు సంతోషమును పొందుచున్నాడు' మొదలగునది వాజశ్రవస్ యొక్క కొడుకు వాజశ్రవస్సు అనునట్లే అపత్యార్థ తద్ధితనామము.

10-11 శ్లో॥ నచికేతుడు మొదటి వరముగా తన తండ్రివద్దకు తిరిగివెళ్ళవలెనని కోరుచున్నాడు.

శ్లో॥ స్వర్గే లోకే న భయం కించనాస్తి న తత్ర త్వం న జరయా బిభేతి ।
ఉభే తీర్త్వాఽశనాయా పిపాసే శోకాతిగో మోదతే స్వర్గలోకే ॥ ౧౨ ॥

క్షుత్పిపాసలు, జరామరణములు, లేక సమస్త దుఃఖాతీతుడై స్వర్గములో ఆనందించుచున్నాడు. అచట ఎటువంటి భయమును లేదు. నీ వచట లేవు.

నచికేతుడు రెండవ వరమును కోరదలచినవాడై ముందుగా స్వర్గ లోకముయొక్క మహిమను వర్ణించుచున్నాడు. ఆ స్వర్గలోకమహిమను స్థిరపఱచుటకు ఇహలోకములోని దుఃఖములతో దానిని పోల్చుచున్నాడు. అక్కడ యెటువంటి భయమును లేదు. అనగా వారు అమర్త్యులు గాన మర్త్యలోకములోనివారికంటె నెక్కువ కాలము జీవింతురు. అందువలననే నచికేతుడు మృత్యువుతో "నీ వక్కడ లేవు" అని చెప్పుచున్నాడు. అనగా నచట మృత్యుభయము లేదని యర్థము. కాని యిది పరమసత్యము కాదు. ఏలనన అచటివారుకూడ తమ పుణ్యఫలము ననుభవించి "క్షీణే పుణ్యే మర్త్యలోకం విశంతి" అనునట్లు తమ పుణ్యము క్షీణించగానే మర్త్యలోక మును చేరుచున్నారు.

మానవుని జీవితములో జననము. బాల్యము, యౌవనము, వార్ధక్యము, మరణము అను నయిదవస్థలు గలవు. కాని దేవతలు మొదటి మూడవస్థలే కలిగియున్నారు. అనగా వారు జరామరణవర్జితులు అని యర్థము. ఆ విషయమునే నచికేతుడు వివరించుచున్నాడు. జరామరణములు వాటివలన బాధలు వారికి లేవు సరిగదా మర్త్యులవలె వారికి యాకలి దప్పులుకూడ లేవు.

కాబట్టి ప్రాచీనకాలములో మృత్యుదేవత యీనాటివలె నంత భయంకరముగా పరిగణింపబడలేదు. వేదములయొక్క తొలిభాగములలో మృత్యుదేవత మర్త్యుని స్వర్గద్వారమునకు చేర్చు మార్గదర్శకుడు మాత్రమే అగుచున్నాడు. కాని ఈ కఠోపనిషత్తుకాలమునాటికి యీ ప్రశస్తభావము నశించినది.

శ్లో॥ స త్వమగ్నిం స్వర్గ్యమధ్యేషి మృత్యో ప్రబ్రూహి
త్వం శ్రద్ధధానాయ మహ్యాం।
స్వర్గలోకా అమృతత్వం భజన్తే ఏతద్ద్వితీయేన వృణే
వరేణ ॥ ౧౩ ॥

ఓ మృత్యువా! ఏ అగ్నివలన స్వర్గలోకమును చేరి అమరులై యుందురో, యట్టిదానిని గురించి నీవు తెలియుదువు. శ్రద్ధాళువైన నాకు దానిని తెలియజేయుము. ఇదియే నా రెండవ వరము.

ఈ శ్లోకములో నచికేతుడు మృత్యుదేవతను తన రెండవ వరము కోరుచున్నాడు. స్వర్లోక నివాసమే ఈ లోకములో నివసించు మానవుల ధ్యేయమని యీ శ్లోకములో చెప్పబడినది. వారు తమ ఆధ్యాత్మిక, అధిభౌతిక కర్మలను, స్వర్గలోకములో కొంతకాలమైనను నివసించుటకుగాను ఆచరించుచున్నారు. కర్మిష్ఠులైన అజ్ఞానులను మనసులో నుంచుకొని వారు ఏ కర్మచేసిన ఆనందదాయకములైన స్వర్గసుఖములు వారికి లభింపగలవో యట్టి అగ్న్యారాధనాది కర్మను ఈ మర్త్యులకొఱకు వివరించవలసినదని నచికేతుడు తన రెండవ వరమును కోరుచున్నాడు.

ఇచట నచికేతుడు తన వరమును తన మానవజాతికంతకునూ ఉపయోగపడునట్లు అడుగుటచే అతడు మతాభివృద్ధి అధ్యాత్మికభావావిర్భావము గల విద్యార్థి యని తెలియుచున్నది. సత్యమైన హైందవుడు ఎల్లప్పుడు తాను ముక్తి పొందుముందర తన బంధువులయొక్క తన తరమువారి యొక్క ముక్తిని కోరి తన విధిని నిర్వర్తించుకొనును. దీర్ఘకాలము విశ్వమానవప్రేమ ననుభవించిననేగాని విశ్వరూపుడైన యా విశ్వాత్మునియందు ఐక్యమును పొందజాలడు. కావున ఇచట శ్రుతిమాత నచికేతునిద్వారా తత్త్వాన్వేషికి విశ్వమానవప్రేమ ముఖ్యమని నొక్కి వక్కాణించు చున్నది.

ఈ మంత్రములో నచికేతుడు అమరత్వమును పొందించు కర్మ రహస్యమును తెలియజేయవలసినదని మృత్యుదేవతను కోరుచున్నాడు. దీనిని జీవిత పరమలక్ష్యమైన దైవత్వప్రాప్తి, లేక అమరత్వము, అను ప్రధాన లక్ష్యముతో ముడిపెట్టకూడదు. అట్లర్థము చెప్పుకొనిన వేదాంతముయొక్క మూలసిద్ధాంతములకే వైరుధ్యము కలుగును. జీవితముయొక్క పరమ లక్ష్యమును కర్మ సంపాదించలేదు. కర్మచేతనే అట్టి గమ్యము పొందబడిన యెడల, అది కర్మచేత చేయబడినదిగాని లేవా పుట్టినదిగాని యగుటచేత ఆద్యంతములు కలదగుచున్నది. ఆద్యంతరహితమై శాశ్వతమై, సత్య స్వరూపమైన ఆత్మ ఒక కర్మచే పుట్టునదిగాగాని, కర్మఫలముగాగాని ఉండ జాలదు. కావున ఇచట అమరత్వమను పదము సంబద్ధార్థముగ వాడబడి నది. ప్రతిదినము ఈ లోకమున కానిపించు మృత్యుప్రవాహముతో స్వర్లోక వాసులు జీవించు దీర్ఘకాలమును పోల్చి ఆ సందర్భమున అమరత్వము అను పదము వాడబడినది.

శ్లో॥ ప్ర తే బ్రవీమి తదు మే నిబోధ స్వర్గ్యమగ్నిం నచికేతః ప్రజానన్ ।
అనన్తలోకాప్తి మథో ప్రతిష్ఠాం విద్ధి త్వమేతం నిహితం గుహాయాం ॥ ౧౪ ॥

ఓ నచికేతుడా! నేను చెప్పెదను. నీవు శ్రద్ధగా వినుము. నాకొ అగ్నినిగూర్చి తెలియును. విశ్వమునకు ఆధారమై, హృదయకుహరములో నిహితమై స్వర్గమునకు దారిచూపు అగ్నిని నేనెఱుగుదును.

ఈ శ్లోకములో మృత్యుదేవత బ్రాహ్మణ బాలునకు రెండవ వరమును అనుగ్రహించుచున్నాడు. దీనివలన వేదకాలములో విద్యాభ్యాసము గురు ముఖతః జరుగుచుండెననియు, ఈ కాలపువారివలె టీకలకు (notes) ప్రాధాన్యమిచ్చి యర్థములేని వ్యాసములను కంఠస్థము చేసికొని విద్యను అభ్యసించలేదనియు, తెలియుచున్నది. గురువు చెప్పినది బాగుగా అర్థము చేసుకొని అప్పటి కప్పుడే కంఠస్థమగునట్లు దానిని మననము చేసి గురు ముఖమునుండి వచ్చినట్లే గ్రహించవలెను. ఈ విధానములో శిష్యునికి బుద్ధిసూక్ష్మత కలిగియుండుటయే గాక ధారణాశక్తికూడా కలిగియుండ వలెను. కనుకనే మృత్యుదేవత నచికేతునితో "నేను చెప్పుచున్నాను. శ్రద్ధగా వినుము. నావద్దనుండి నేర్చుకొనుము" అనెను.

ఈ ఉపోద్ఘాతము నవీన ఆచార్యులపట్ల వర్తించదు. ఏలన, ఇట్లు శ్రద్ధగా వినమని విద్యార్థులతో చెప్పిన, అతనిని పిచ్చివాడుగా వారు జమ కట్టుదురు. ప్రకృత విద్యావిధానములో దానికి చోటులేదు. అదియుగాక ప్రస్తుత విద్యార్థులలో అటువంటి బోధను అవగాహన చేసుకొనునంతటి శక్తి కూడ లేదు. కావున విమోహితులై ఆశాబద్ధులైనవారిలో, ఆత్మోన్నతి లేని వారిని ఈ కర్మ నాచరించుటకు ఉద్బోధించు అగ్నివిద్యను ప్రశంసించుటకే ఈ విశేషణము లిచట ప్రయత్నపూర్వకముగా వాడబడినవి.

సూక్ష్మరూపములో సర్వాంతర్యామియైన అగ్ని, విరాడ్రూపమున విశ్వమున కాధారమగుచున్నది. హృదయకుహరములో నున్నదనగా జ్ఞానుల యొక్క బుద్ధిలో నున్నదని అర్థము. "నిహితం గుహాయాం—హృదయ కుహరములో నుంచబడినది." ఈ వాక్యము ఉపనిషత్తులలో చిరపరిచిత మైనదే, అనగా ఎక్కువగా వాడబడుచున్నది. ఈ శ్లోకములో హిందూ మతములో పరంపరగా వచ్చుచున్న కర్మసంబద్ధ వాఙ్మయముపై తిరుగుబాటు యొక్క పరిణామము సూచితమై యుండవచ్చును. కావున కఠోపనిషత్తు,

బ్రాహ్మణములలోని కర్మకాండతో ప్రారంభించినప్పటికినీ యిచటనే యాగ లేదు. మిగత యుపనిషత్తులవలె భావమును పద్ధతిని పురోగమింప చేయుచున్నది—"యజ్ఞములు చేయుటయే పరమావధి కాదు. అవి యజమాని యొక్క సంపూర్ణ ముక్తికి సాధనములుగా తెలిసికొనవలయునని" సూచింపబడుచున్నది.

శ్లో॥ లోకాదిమగ్నిం తమువాచతస్మై యా ఇష్టకా
యావతీర్వా యథా వా ।
సచాపి తత్ప్రత్య వదద్యథోక్తం అథాఽస్య మృత్యుః
పునరేవాహ తుష్టః ॥ ౧౫ ॥

తరువాత యముడు ఆ అగ్నియాగమును వివరించెను. ఆ అగ్ని లోకములకు కారణమనియు, ఆ యాగమందు ఎటువంటివి, ఎట్లు, ఎన్ని ఇటికల నుపయోగింపవలెనని పూర్తిగా వివరించెను. నచికేతుడు దాని నంతయు వెంటనే వప్పజెప్పెను. సంతుష్టుడై యముడు మరల పలుకు చున్నాడు.

ఈ శ్లోకమును కాఠకఋషిగాని శ్రుతిభగవతిగాని చెప్పియుండ వచ్చును. అసంపూర్ణమై ఆకారమాత్రములో ఉన్నప్పటికిన్నీ, ఈ కథలో శ్రుతిమాత మనస్సునంటునట్లు తన కళానైపుణ్యమును, మార్దవమును వ్యక్త పఱచెను. మన కథానాయకుని చరిత్రలో మరికొన్ని వర్ణములను కలుపుటయే గాక, ఇది సత్యజీవనముయొక్క భావోద్రేకమును వర్ణించి కథకు ప్రకాశము కలుగజేయుచున్నది.

ప్రతి ఉపాధ్యాయునకును, విద్యార్థి పాఠములను వినీవినగానే గ్రహించి వప్పచెప్పినచో ఆనందము కలుగుట సహజమే! ఇది అతనికి ప్రశంసను గూర్చునదేకాక అతనికి తృప్తిని విజయమును కలిగించుచున్నది.

మృత్యుదేవత అంగాంగసహితముగా యాగకర్మను శిష్యునికి వివరించెను. ఇది జ్ఞానకాండ యగుటచేత ఆ యాగమునుగూర్చిన వివరము

లను పూర్తిగా వర్ణింపక, కొన్ని స్థూలభాగముల యొక్క పేర్లక్రింద వివరించెను. ప్రాచీన విద్యావిధానము చక్కగా పాటించువాడగుటచేత మృత్యుదేవత పాఠానంతరము తన శిష్యుని విన్నదానిని వప్పజెప్పమనెను. నచికేతుడు గురువుగారి పరీక్షకు నిలిచి చెప్పినదంతయు వివరముగా వప్పగించెను. మృత్యుదేవత యతని తెలివికి మెచ్చి యతనికి యధికముగా నొక వరము నిచ్చి యనుగ్రహించదలచెను.

శ్లో॥ తమబ్రవీత్ప్రీయమాణో మహాత్మా వరం తవేహాద్య
దదామి భూయః।
తవైవ నామ్నా భవితాయమగ్నిః సృంకాం చేమామ
నేకరూపాం గృహాణ ॥ ౧౬ ॥

మహాత్ముడైన మృత్యుదేవత సంతుష్టుడై నచికేతునితో నను చున్నాడు – నీకు మరియొక వరమును ఇచ్చుచున్నాను. ఈ అగ్ని నీ పేరుతో పిలువబడుగాక! మరియు నీవీ చిత్రమాలను గ్రహింపుము.”

మాక్సుముల్లరు ప్రకారము 16-18 మూడు శ్లోకములు ప్రక్షిప్తములు. ఈ విషయములో నాతడు దృఢనమ్మకము కలిగియున్నాడు. ఈ శ్లోకములు మృదుపాకము గల ఉపనిషత్తుశైలిలో విపరీతముగా నుండి తికమక గల అర్థము గలవై యున్నవి.

మృత్యుదేవత తన శిష్యుని మెచ్చి రత్నాలహారమును ఇచ్చుచున్నాడు. శ్రీశంకరులు తమ వ్యాఖ్యానములో ఈ ‘సృంకాం’ అను పదమునకు రెండర్థములు చెప్పుచున్నారు. (1) మాల. (2) బహుఫలదములగు క్రియలు. శ్రీశంకరులు చెప్పినట్టుగా మృత్యుదేవత నచికేతునికి మానవ మనోరథములను తీర్చు రహస్యమైన మరికొన్ని యాగాదిక్రియలను బోధించి యుండవచ్చును. లేదా రత్నములు పొదిగిన హారమునైనా ఆ బ్రాహ్మణ బాలునికి పారితోషికముగా నిచ్చియుండవచ్చును. ఏది ఎట్లున్నను మనము అతీతమైన బుద్ధికుశలత గల విద్యార్థి గురువునకు ఆనందము కలిగించు

టయే గాక గురుముఖముగా అభినందింపబడుచున్నాడను విషయమును గ్రహించిన శ్రుతియొక్క ఉద్దేశము నెఱవేరుచున్నది.

శ్రీ శంకరులు ఈ రెండర్థములను తప్పక చెప్పవలసిన వారాయెను. ఏలన తరువాతి మంత్రములో ఈ పదమే 'మార్గము' అను అర్థములో ఉపయోగింపబడినది. 'హారము' అనేదానికికూడా రెండు మంత్రములలో మొదటిదానిలో 'అలంకరించెను' అనియు రెండవదానిలో బంగారు సంకెళ్ళు అనియు అర్థము చెప్పకొనవచ్చును.

ఒకడు శాస్త్రజ్ఞానమును పొంది ముక్తిని పొందవలయునన్నచో బుద్ధి యందు నచికేతుడు కావలెను. దీనివలన, "అవకాశము కలిగినప్పటికిని, తమ శాస్త్రజ్ఞానమును పూర్తిగా ననుసరించి దాని నాచరణలో పెట్టలేక సంఘమునకు బరువుతెట్టువలె నేర్పడి, తత్త్వాన్వేషణలో సాఫల్యమును పొందలేనివారు. ఈ బ్రహ్మవిద్యను తెలిసికొనజాలరు. నిజమైన నన్యాసదృష్టిగలవాడు మాత్రమే యీ బ్రహ్మవిద్య నర్థము చేసికొని ఆచరింపగలడు" అని మనము తెలిసికొనుచున్నాము.

శ్లో॥ "త్రిణాచికేతస్త్రిభిరేత్య సన్ధిం త్రికర్మకృత్తరతి జన్మ
మృత్యూ।
బ్రహ్మజజ్ఞం దేవమీడ్యం విదిత్వా నిచాయ్యేమాం
శాన్తి మత్యన్తమేతి॥ ౧౭॥"

నాచికేతాగ్నిలో ఎవడు మూడుసార్లు యాగముచేసి, మూడింటిని ఐక్యముచేసి, మూడు విధులను పాలించునో, అటువంటివాడు జనన మరణాతీతుడగును. అటువంటివాడు బ్రహ్మనుండి పుట్టి బ్రహ్మను తెలుసుకొని ప్రకాశవంతమైన ఈ అగ్నిచేత శాశ్వత శాంతిని పొందుచున్నాడు.

ఈ శ్లోక మొక సమస్య అయినది. శ్రీ శంకరులవారి వ్యాఖ్యానమే లేకుండినచో ఈ సమస్య పరిష్కారముగాక, జిజ్ఞాసువులు తెల్లబోయి యుందురు. కాని వేదకాలమునాటి విద్యార్థులకు ఇది చిక్కుసమస్యగా

నుండెనని చెప్పుటకు వీలులేదు. అనాటి విద్యార్థులు వైదిక సంప్రదాయ ములోను, ఆచరణములలోను బాగుగా ఆరితేరిన వారగుటచేత, వారికి శ్లోకము తనంతట అదే వ్యాఖ్యానమై అర్థబోధకమగుచున్నది కాబట్టియే దీనికి వేరే వ్యాఖ్యానము అవసరము లేకపోయెను. ఒకవేళ విశేషవ్యాఖ్యానమే కావలసినయెడల, వారి శిష్యులకు సుబోధమగుటకై ఆ మహర్షులు వీటిమీద చర్చలు వివరణలు చేసియేయుందురు.

మూడు విధముల నచికేతాగ్ని : 1. నచికేతాగ్నిని ఎవడు మూడుసార్లు వేల్చునో, అనిగాని

2. నచికేతాగ్ని యాగమును ఎవడు అభ్యసించి, తెలుసుకొని, ఆచరిం చునో,—అనిగాని

3. నచికేతాగ్నికూడ అగ్నిహోత్రమే గనుక గార్హపత్య, ఆహవనీయ, దక్షి ణాగ్నులు మూడనికాని వివరించ వచ్చును.

మూడింటియొక్క ఐక్యము—1. తల్లితండ్రులు ఆచార్యుడు అనెడి ముగ్గురి ప్రభావము ఎవనికుండునో, అనగా ఈ ముగ్గురియొక్క అనుగ్రహము ఎవరికి ఉండునో, ఆతడు వారిని గౌరవించి, వారికి విధేయుడై, వారి ముగ్గురి వలన ఆశీర్వచనముల నందుచున్నాడు.

2. ప్రత్యక్షప్రమాణ, అనుమానప్రమాణ, ఆగమప్రమాణము లనెడు ముగ్విధములైన జ్ఞానమెవ్వనియం దైక్యము కలిగియుండునో, అనియు.

3. శంకరులవారి మతప్రకారము శ్రుతి, స్మృతి, శాస్త్రజ్ఞానము లెవ్వనియందుండునో—అనియు వివరించవచ్చును.

మూడువిధులు : ప్రతి బ్రాహ్మణ గృహస్థు చేయవలసిన మూడు కర్మలు : 1. పంచయజ్ఞములు, 2. వేదపారాయణ, 3. దానము.

ఎవడైతే ఈ పై అగ్నిత్రయము, అనుగ్రహత్రయము, కర్మత్రయమును తెలిసికొని ఆయా విధులప్రకారము నడచుచున్నాడో, వాడు సంసార మను

సుడిగుండమునుండి విముక్తుడై జనన మరణ రహితమైన (మానవులతో పోల్చిన) ఇంద్రలోకములో, శాంతిని విశ్రాంతిని పొందుచున్నాడు. ఆ అగ్ని, ఆత్మ అనియు 'బ్రహ్మజజ్ఞ' అనునది ఆ అగ్ని పేరనియు తెలుసు కొన్నప్పుడు, అతడు ఇంద్రలోకములో నివసించుచున్నాడు.

జ్ఞ = తెలుసుకొనువాడు, బ్రహ్మజ = బ్రహ్మనుండి పుట్టినది—జగత్తు. జాతవేదస్—సర్వజ్ఞుడు అనునదికూడా వేదములో అగ్నికిమరొక పేరు.

శ్లో॥ త్రిణాచికేత స్త్రయమేతద్విదిత్వా య ఏవం విద్వాం
శ్చినుతే నాచికేతం।
సమృత్యుపాశాన్పురతః ప్రణోద్య శోకాతిగో
మోదతే స్వర్గలోకే ॥ ౧౮ ॥

ఈ జ్ఞానముతో ఎవరైతే నచికేతాగ్నిని తెలిసికొందురో అట్టివారు సంసారబంధములను త్రెంచుకొని దుఃఖవిముక్తులై స్వర్గములో ఆనందించు చున్నారు.

యముడు, నచికేతాగ్నిని దాని ఆచరణవిధానమును, తత్ఫలమును చెప్పి తన ఉపదేశమును పూర్తిచేయుచున్నాడు. ఎవడైతే ఈ అగ్నివిద్యకు సంబంధించిన మూడు విషముల జ్ఞానమును బాగుగా తెలిసికొనుచున్నాడో, అట్టివాడు సమస్త ప్రాపంచిక బంధములను త్యజించి, జ్ఞానావస్థితిలో నుండి, శాశ్వతముగా ఆనందించుచున్నాడు. ఇటికలు, వాటి సంఖ్య, వాటి ఉప యోగ విధానము—అనునవి తెలిసికొనుటకూడా ఈ నచికేతాగ్ని జ్ఞానత్రయ ములో మిళితమైయున్నది. ఎవడైతే ఈ యజ్ఞమును చేయునో, ఆ అగ్నిని తన ఆత్మగా ధ్యానించునో, అతడు మరణానంతరము మహత్తత్వస్థితిని— హిరణ్యగర్భ లేక బ్రహ్మలోకమును పొందుచున్నాడు.

ఇది ఇట్లుండదగినదే. నిష్కపటమైన చిత్తవృత్తితో చేసిన కర్మోపాస నల నమ్మేళనమువలన 'అహంకారము బ్రహ్మలోకమునందలి ఆనందము నకు దారితీయును'. అనుటను ముందరి చర్చలలో తెలిసికొన్నాము.

అచట సృష్టికర్తచే స్వయముగా బోధింపబడి, లయకాలమున ఆ అహం కారము శాశ్వత ముక్తిని అనగా కైవల్యమును పొందుచున్నది. దీనినే వేదాంతములో 'క్రమముక్తి' అనెదరు, క్రమముక్తిని గూర్చిన వేదాంత ములోని ప్రధాన విశ్వాసమునకు పునాది కల్పించుటవలన ప్రస్తుతము చర్చనీయమైన ఈ శ్లోకము చాలా ముఖ్యమైనది. ముందు చెప్పిన విధముగా, ఆత్మధ్యానముతో నచికేతాగ్నిని ఎవడు వెల్చుచున్నాడో అట్టివాడు ఈ మర్త్యదేహములోనే మృత్యువునుండి ముక్తిని పొందుచున్నాడని ఈ ఉపనిషత్తు నొక్కి చెప్పుచున్నది.

ఇక్కడ మృత్యువనగా, అజ్ఞానము, కోరికలు, ద్వేషము మొదలైన ఏహ్యాపు విషయములయొక్క మృత్యువు. అనగా జీవన్మృతి అని అర్థము. కర్మసహితమైన ధ్యానమును అనగా ఉపాసనను అభ్యసించువాడు తన ఆత్మలో విరాట్స్వరూపమైన ఒక చిన్న ప్రపంచమును తెలుసుకొనుచున్నాడు.

శ్లో॥ ఏష తేఽగ్నిర్నచికేతః స్వర్గ్యో యమవృణీథా ద్వితీయేన వరేణ

ఎతమగ్నిం తవైవ ప్రవక్ష్యన్తి జనాసస్తృతీయం వరం నచికేతో వృణీష్వ ॥౧౯॥

దేనినైతే నీవు రెండవ వరముగా కోరితివో, ఏది స్వర్గమునకు దారి తీయునో, అట్టి ఈ అగ్నిని ప్రజలు నీ పేరుతో పిలిచెదరుగాక ! ఓ నచి కేతా ! మూడవ వరమును కోరుకొనుము.

శిష్యునియొక్క నిష్కపటమైన భక్తికి తెలివితేటలకు మిక్కిలి సంతోషించినవాడై, మృత్యుదేవత అతనిని అధికముగా అనుగ్రహించు చున్నాడు. ఏ బాలునిద్వారా ఈ అగ్నియొక్క వివరములు ప్రపంచ మునకు తెలియజేయబడినవో ఆ అగ్ని ఆ బాలుని పేరుతోనే అనగా నచికేతాగ్ని అని పిలువబడునని యమధర్మరాజు ప్రకటించుచున్నాడు.

మరల ఇచట శ్రుతిమాత నేర్పుగా ఈ శ్లోకములో యమధర్మరాజు యొక్క మహిమకు ప్రకాశము కలిగించునటువంటి సౌందర్యమును చేకూర్చు కళాప్రతిభను ఇమిడ్చియున్నది. అధికముగా వరము నిచ్చి నప్పటికినీ మూడు వరములను ఇచ్చెదనన్న మొదటి మాటప్రకారము అతనికి మూడవ వరము అప్పుపడినవాడగుటచే మృత్యుదేవత అతనిని మూడవ వరము కోరుకొనుమనుచున్నాడు. ఏలన బ్రాహ్మణబాలుడు ఈ అధిక వరముచే తృప్తిపడి మూడవ వరమును మఱచిపోవుటకు అవకాశ మున్నదికదా! కావున మహిమాన్వితుడై కర్మాధికారియైన మృత్యుదేవత ఆ బ్రాహ్మణబాలునికి "మూడవ వరమును ఏరి కోరుకొనుము" అని చెప్పుచున్నాడు.

స్వర్గమును చేర్చు నచికేతాగ్ని యాగమును రెండవ వరముద్వారా నచికేతుడు తెలిసికొనెను.

శ్లో॥ యేయం ప్రేతే విచికిత్సా మనుష్యేఽస్తీత్యేకే నా
యమస్తీతి చైకే।
ఏతద్విద్యామనుశిష్టస్త్వయాఽహం వరాణామేష
వరస్తృతీయః ॥౨౦॥

మానవుడు మరణించినవెనుక కొందరతడున్నాడని కొందరతడు లేడని చెప్పుచున్నారు. నీచేత బోధింపబడినవాడనై నేనాం విషయమును తెలిసికొన గోరుచున్నాను. ఇదియే నా మూడవ వరము.

ఉపనిషత్తులలోని ఋషులు మాటలచే గాక, సూచనలచే నాయకుని చరిత్రను స్పష్టముగా చిత్రించినంత చక్కగా షేక్స్పియరు ప్రతిభకూడ చిత్రింపలేదు. ఆ అమరఋషులకు మన నమస్కారములు.

నచికేతునిలోని తత్త్వజిజ్ఞాన ఎట్లు తన తండ్రియొక్క సుఖ శాంతులను కోరుటలోను, తనజాతి మానవులను అనుగ్రహించుటలోను, తన రెండు వరములు చెల్లించుకొనెనో, మనము ఇంతకుముందే తెలిసికొన్నాము.

అతడు ఈ మూడవ వరమును కోరునప్పుడే తన కల్యాణమును (ముక్తిని) కోరుకొనువాడై యమధర్మరాజు యెదుట వివరణకై తన సందేహమును చెప్పుచున్నాడు.

తన జీవనయాత్రలో సాఫల్యమును పొందగోరు ప్రతి తత్త్వాన్వేషికిని—తనకు ప్రియమైన తనవారిని గూర్చియేగాక, తన జాతివారిని గూర్చియు, తనకు నివాసమైన యీ విశ్వమును గూర్చియు సానుభూతి కలిగియుండుట, త్యాగతత్పరుడై లోకకల్యాణమునకై ముందుగా పాటు పడుట, అపైని తన విముక్తికై పాటుపడుట, అను నీ మూడును తప్పని సరి యోగ్యతలైయున్నవి. కేవలము భక్తవర్గములో చేరినవారు యిట్టి యోగ్యతలయందు విశ్వాసము లేక, వ్యతిరేకభావము కలిగి దీనిని అపార్థము చేసుకొనుచున్నారు. ఇట్టి అపార్థమే వారికి కందిరీగపుట్టవంటి దుఃఖములకు కారణమైయున్నది.

సంపూర్ణ సాంఘిక సామాజిక జీవనమునకు మతానుసరణ యెన్నటికిని అడ్డుతగులదు. తత్త్వాన్వేషి ఎన్నటికినీ మూగివాడుగాను చెవిటివాడుగాను ఉండకూడదు. ఇతరులయొక్క కష్టములను గ్రహించి, వాటిని సహించి, వాటికొఱకు దుఃఖించు శక్తిని తన హృదయమునకు కలుగజేసుకొనుటయే గాక సర్వదా ప్రపంచ దుఃఖములను తెలిసికొనువాడై ఉండవలయును. తన బంధువులతోను తన తరమువారితోను ఐక్యము పొంది వారి కష్టసుఖములు తెలిసికొనలేనియెడల, అట్టివాడు పవిత్రాతిపవిత్రమైన ఈ సత్యదేవాలయములోనికి ప్రవేశించుటకే అర్హత లేనివాడగుచున్నాడు.

ఈ శ్లోకముతో యథార్థమైన ఉపనిషత్తత్త్వము ప్రారంభించుచున్నది. ఇంతవరకు పరిపక్వమైన ఆత్మను, పూర్ణజ్ఞానము గల బోధకునివద్దకు చేర్చుటకు కావలసిన నాటక పరికరములను గూర్చుటయే జరిగినది.

బ్రాహ్మణబాలుని ఈ సందేహము అతనియొక్క శాస్త్రజ్ఞానమును, ఆత్మపరిణామమును తెలియజేయుచున్నది. ఇంద్రియ భోగాసక్తుడై, పశుత్వమే ఎక్కువగా గల సామాన్య మానవునికి, జీవితమును మహద్రూపముగా జూచునట్టి మానసిక సమభావము, బుద్ధియొక్క ప్రాపు గలిగి,

గంభీరమై సూటియైన ఇట్టి సంశయము గలుగుట అరుదైన విషయము. జీవితములో దుఃఖకరమైన సంఘటన యగు ఈ మృత్యువుయొక్క భయంకర సౌందర్యముచే అనేకమంది చింతకులు మోహితులై, తృప్తిని జెందక మోసపోవుచున్నారు. అన్ని కాలములలోను అన్ని దేశములలోను ఇప్పటికినీ వేదాంతులకు, గ్రంధకర్తలకు, లేఖకులకు, చింతకులకు ఈ మృత్యువు ఒక భ్రమపుట్టించు విషయముగానే యున్నది. కాని తగిన సామర్థ్యముగల వారు ఇట్టి గంభీరసమస్యను పరిష్కరింప బూనుటకూడ మిక్కిలి అరుదే.

ఏకాంతములో తమ బుద్ధిని గ్రహణశక్తిని కూడ ఆ ఉన్నతమై ఊహాతీతమైన ఆధ్యాత్మిక సామ్రాజ్యమును అందుకొనునట్లు తయారు చేసుకొన్న ఆ మహర్షులు ఈ మృత్యుసిద్ధాంతమును గురించి "అది ఏమి? ఎట్లు వచ్చినది? ఎందులకు వచ్చినది?" అనుదానిని శాస్త్రీయముగా వివరించి ఒక సత్యమైన నిర్ణయమునకు వచ్చినారు.

సాధారణమైనప్పటికినీ, ఆశ్చర్యకరమైన ఈ మృత్యువును గురించి చింతించు భారతీయ చింతకులలో స్వమత విరుద్ధములైన వాదనలను, ప్రతిఘటింపదగు నిర్ణయములను చూచుచున్నాము. నచికేతుడు చెప్పిన విధముగా కొంతమంది మరణము తరువాత ఏమియు లేవని ఉన్నది శూన్యమేనని చెప్పువారు కలరు. మరికొంత మంది మరణించిన తరువాత కూడ అస్తిత్వము ఉన్నదని అంగీకరించి వాదించి స్థిరపఱచువారున్నారు.

మరణము తరువాత అస్తిత్వము ఉన్నదా? లేదా? అను ఈ ప్రశ్న మనోగోచరమైనది గాని బుద్ధిగమ్యమైనదిగాని కాదు. ఇట్టి ప్రశ్నలను కలిగించు భావములు మనోబుద్ధ్యతీతములై లీలగా ఆ పరమజ్ఞానమును సూచించునవై యున్నవి. ఆ పరమపవిత్ర జ్ఞానలోకమును చేరుటకు మానవుడు ఎంత తెలివైనవాడైనప్పటికినీ తగిన సాధనములు లేనివాడై ఉన్నాడు. ఆ గొప్ప సన్యాసులే ప్రత్యేకముగా ఆ అతీతావస్థను చేరుటకు వలసిన సహజ జ్ఞానశక్తిని అభివృద్ధిపరచుకొన్నారు. సంగ్రహముగా చెప్పిన ఆ అతీతప్రశ్నలు సామాన్యమైన ఈ ప్రత్యక్ష, అనుమాన, ఉపమాన ప్రమాణములచే బోధింప వీలులేనివి అని అనవచ్చును. సాధుసన్యాసులు జ్ఞానోద్రేకములో పలికిన ఆగమములే ఈ సమస్యను పరిష్కరించుటకు ముఖ్యమార్గము లగుచున్నవి.

కావున ధర్మరాజైన మృత్యుదేవతను నచికేతుడీ ప్రశ్న అడుగుట న్యాయమైనదిగా నున్నది. శూన్యవాదులైన బౌద్ధులు చార్వాకులు ఈ మృత్యువు తరువాత శూన్యమే కలదను నిర్ణయమునకు వచ్చియున్నారు.

చార్వాకులు దేహాత్మవాదులు. కరచరణాద్యవయవ సంయోగముచే ఈ దేహము సృష్టింపబడినదనియు, జీవితమనగా ఏదో దివ్యమైనది కాదనియు చెప్పుచున్నారు. "వక్కలు, ఆకులు, సున్నము కలిసిన తరువాత కలుగు పదార్థమందలి ఎరుపురంగు ఎట్లు ఈ మూడింటియొక్క రంగు కాదో, అట్లే కరచరణాద్యవయములతో కూడిన ఈ దేహములో ఉష్ణమును కలిగించు జీవితమును సంయోగవశాత్తు వచ్చినదేగాని మరియొకటి కాదు," అని వివరించిరి. అనగా జీవితము ప్రకృతిసిద్ధమైనదే కాని వేరేదియు కాదు. కరచరణాద్యవయవ సంయోగమే దేహమనువారికి మృత్యువనగా ఈ దేహనాశనమే. అటువంటి సమయములో ఈ దేహము నశించిన తరువాత వారికున్నది శూన్యమే. "శూన్యములోనే ప్రాణి పుట్టుచున్నది. శూన్యములోనే కొద్దికాలము క్రీడించి మరల శూన్యములోనే లయమగుచున్నది." ఈ మతము ఆలోచించువానికి తల తోక లేనిదానివలె తోచును. ఏలన "శూన్యము నుండి ఒక వస్తువు వచ్చుట ఎట్లు? వచ్చిన యా వస్తువు శూన్యములో లయమగుట యెట్లు?" అను ప్రశ్న కలుగును. ఈ శూన్యవాదులయొక్క వాదనలను పరిశీలించినచో వారి వాదనలే స్వవచోవిరుద్ధములైనవని స్పష్టముగా తెలిసికొనగలుగుచున్నాము. వారా పరమసత్యమును శూన్యముగా స్థిరపరచుటకుగాను వాదించుచున్నారు. కావున వారి మతప్రకారము "ఏమియు లేనిది—అభావము" అనునదే ఉన్నది. శ్రీ శంకరులవారు వారి ఈ వాదముచేతనే వారిని రంగమునుండి తొలగించిరి. వారి వాదము నంతయు స్వీకరించినయెడల మనము ఈ శూన్యవాదులయొక్క 'అభావమును' ఒప్పుకొనవలెను. అనగా వారికి ఈ 'అభావమును' గూర్చిన జ్ఞాపమున్నది. వేదాంతులకు, శ్రీ శంకరులకు కూడా ఈ అభావమును తెలిసికొనువాడు లేక తెలిసికొను జ్ఞానమే ఆ పరమసత్యము. అట్టి మనలోని "ఆ తెలిసికొనువాడు నాశనముగాని, రోగముగాని, మృత్యువుగాని లేనివాడు" అని శ్రుతి చెప్పుచున్నది. కావున సాధకునకు కేవల పుస్తక పరి

జ్ఞానము మాత్రము ఉపయోగపడదు. ఏలన అనేకమంది చింతకులు తమ సంస్కృతిస్వభావముల కనుగుణముగా చింతించి వాదించి వివిధ నిర్ణయ ములను చేసియున్నారు. సత్యమును తమలో ననుభవించిన పరమగురువులే ఈ విషయమునకు సరియైన తీర్పు చెప్పగలరు. కావున మృత్యుదేవతను ఈ ఆధ్యాత్మిక ప్రశ్నను వేయుటలో నచికేతుడు సమర్థనీయుడే.

శ్లో॥ "దేవైరత్రాపి విచికిత్సితం పురా నహి సువిజ్ఞేయ
మణురేష ధర్మః।
అన్యం వరం నచికేతో వృణీష్వ మామోపరోత్సీ
రతి మా సృజైనం ॥౨౧॥

ఈ విషయముపై పూర్వము దేవతలుకూడా సంశయము గలవారైరి. సూక్ష్మాతిసూక్ష్మమగుటచే ఇది అంత సులభముగా తెలిసికొనుటకు శక్యము కాదు. కావున ఓ నచికేతా! ఈ విషయమున నన్ను నిర్బంధింపకుము. నాకొఱకు దీనిని విడచిపెట్టి మరియొక వరమును కోరుము.

యమధర్మరాజు శిష్యుని పరీక్షించుట అనేక శ్లోకములలో వివరింప బడినది. పరిపక్వమైన హృదయము లేనివారుకూడా వందలకొలది జనులు ఈ పరమార్థమునుగూర్చి సంశయించి ప్రశ్నించుచున్నారు. శాస్త్రములలో చర్చించబడిన ఆ సత్యమును గ్రహించుటకు వారి మనస్సులలో పవిత్రత గాని వారి బుద్ధిలో పరిపక్వతగాని లేనివారగుచున్నారు. అట్టివారికి ఆ పరమార్థమును గూర్చి చెప్పుట, వారితో దివ్యస్వభావము గల ఆ పరమార్థ మును గూర్చి చర్చించుట వ్యర్థప్రయత్నమే గాక, అది వినువారి కెట్టి ఫల మును ఈయజాలదు. కావున సాధారణముగా పరమగురువులు వారిశిష్యులను పరీక్షించి, ఆ పరీక్షకు నిలిచి తగినవారని తోచిననే తమ సూక్తులను వారికి వెల్లడి చేసెదరు. ఇట్లు చెప్పుటవలన వేదాంతము ఏదో రహస్యముగా ఉంచవలసినదనిగాని లేక ఏ ఎంచిన కొద్దిమందికో చెప్పవలసినదనిగాని తాత్పర్యము కాదు. వేదాంతజ్ఞానము ప్రతివారికినీ జన్మహక్కు. అది అందరికి సంబంధించినదే.

ఇట్లు తెలివిగా వివేచించుట మన నిత్యజీవితములో నున్నదే! ఉదాహరణకు,—ఒక చిన్నపిల్లవాడు తండ్రిదగ్గరకు వెళ్ళి, "నాన్నా వాన ఎట్లు వచ్చుచున్నది?" అని అడిగెననుకొనుడు. అప్పుడా తండ్రి తెలివైన వాడైనచో వానితో, "నాయనా, ఈ కనబడు మేఘముల వెనుక ఒక తెల్ల ఏనుగున్నది. అది తొండముతో సముద్రములోని నీటిని పీల్చి మనయం దరిమీద జల్లుచున్నది," అని చెప్పును. ఆ పిల్లవాడే కొంచెము పెరిగి పెద్దవాడైన వెనుక ఈ ప్రశ్న వేసినచో తండ్రి, "నీరు ఆవిరియై మేఘ రూపములో సంగ్రహింపబడి చల్లదనము ఎక్కువైన మరల నీరుగా మారి వర్షముగా పడుచున్నది," అని చెప్పుచున్నాడు. ఈ రెండు విధములైన వివరణలను ఒకే విషయమును గూర్చి ఒకే పిల్లవానికి వివిధ పరిస్థితులలో చెప్పబడినవి. అనగా రెండవ వివరణమును గ్రహించు బుద్ధివికాసము మొదటి చిన్నపిల్లవానిలో లేదు. అట్లే బుద్ధి వికాసమున కనుగుణముగా రెండవ విధానము పెరిగి పెద్దవాడైన పిల్లవానికి చెప్పబడినది. కావున వారి ఈ బుద్ధివికాసమునుబట్టి మనమీ వివరణలో భేదమును చేయవలసి వచ్చెను.

అట్టి దృష్టితోనే గురువు శిష్యుని బుద్ధివికాసమును పరీక్షించును. తాను చెప్పబోవు విషయమును గ్రహించు బుద్ధివికాసము వానిలో ఉన్నదా లేదా అని పరీక్షించి దానికి తగినట్లుగా వానికి బోధచేయును. అట్లే మృత్యుదేవత ఇచట తత్త్వాన్వేషియైన నచికేతుని పరీక్షించుచున్నాడు.

అతడు నిష్కపట భావముతో నచికేతునితో చెప్పుచున్నాడు: 'తన మూడవ వరమును ఈ బాలుని నిష్ఫలమైన విచారణగూర్చిన వివరణమున వ్యర్థము చేయుదలచుకొనలేదు.' అందువలననే "మృతితరువాత ఆత్మ ఏమగుచున్నది అను నీ విషయము చాలా సూక్ష్మమైనది. దురవగాహ మైనది. దేవతలుకూడా ఇప్పటికినీ ఇట్టి సంశయమును కలిగియే యున్నారు," అని మృత్యుదేవత చెప్పుచున్నాడు.

దేవ—అనగా తేజస్సు అని అర్థము. ఆ స్వర్గమున నివసించు దేవతలు అత్యధికమైన బుద్ధిని శక్తిమంతమైన మనస్సును కలిగియున్నారు.

అని తాత్పర్యము. కావున వారు ఎక్కువగా ఆలోచించి తర్కించుటకు శక్తి గలవారే గాక వారికి దీర్ఘకాల జీవితము కలదు గావున ఇట్టి ఆలోచనలు కలిగి వాదనలను పరిష్కరించుకొనుటకు అవకాశముకూడ ఉన్నది. అట్టి వారైన దేవతలే ఇప్పటికిన్నీ ఆత్మస్వభావమును అర్థముచేసుకొన లేకపోవు చున్నారనగా, మానవమాత్రుడైన ఈ బాలుడు అట్టిదానిని అర్థముచేసికొని గ్రహించుట దుష్కరము. అనుభవము సంగతి అటుంచి, అసలు దానిని గ్రహించవలయుననను ఆశయే నిరర్థకము.

ఇచట మృత్యుదేవత తన ప్రశ్నకు జవాబు చెప్పమని నిర్బంధించు నచికేతునితో చాలా నేర్పుగా వాదన చేసెను. కాని అతనికి నచికేతుని ప్రశ్నకు బదులు చెప్పకుండా తప్పించుకొనే ఉద్దేశముమట్టుకు లేదని మనము జ్ఞాపకముంచుకొనవలెను. బహుశః శిష్యునికన్న గురువునకే ఈ జ్ఞానము బోధించుటయందు ఆసక్తి ఎక్కువ ఉండిఉండవచ్చును. కాని గ్రహించువాని గ్రహణశక్తి తగినంత ఉన్ననేగాని వేదాంతములో చెప్పిన పరమ సత్యమునకు తయారుగాని శిష్యునకు దానిని బోధించుట నిష్ఫలమే గాక, ప్రమాదకరముకూడ అగుచున్నది. ఏలన, గ్రహణశక్తి లేనివాడు ఈ పరమసత్యమును ప్రకటించు శ్రుతియొక్క ఉద్దేశము, ప్రాముఖ్యమును గూర్చి అపార్థము చేసికొనగలడు. వేదాంతమును సరిగా అర్థము చేసికొనిన యెడల అతడు నిజమైన భక్తుడేగాక భూమిమీద దేవుడే. ఆ వేదాంతమునే సరిగా అర్థముచేసికొనక అపార్థము చేసినయెడల అట్టి విద్యార్థిని ఆ జ్ఞానబోధ పిశాచముగా తయారుచేయును. పెద్దవాని చేతిలో ప్రయోజన కారియైన నిప్పుపెట్టి చిన్నపిల్లవాని చేతిలో అపాయకరము కాగలదు.

శ్లో॥ "దేవైరత్రాపి విచికిత్సితం కిల త్వంచ మృత్యో
యన్న సువిజ్ఞేయ మాత్థ।
వక్తా చాస్య త్వాదృగన్యో న లభ్యో నాన్యో వరస్తుల్య
ఏతస్య కశ్చిత్ ॥౨౨॥"

ఓ మృత్యువా! దేవతలుకూడా ఈ విషయమై సంశయగ్రస్తులైరని, అది తెలిసికొనుటకు అంత సులభమైనది కాదని చెప్పుచున్నావు. కావున నీకంటె మించినవాడు దీనిని చెప్పగలవాడు మరియొకడు లేడు. ఈ వరముతో సమానమైన వరముకూడా మరియొకటి లేదు.

ముందు శ్లోకములోని మృత్యుదేవతయొక్క మాటలే చాతుర్యమైన వని అనుకొనుచుండగా, ఈ శ్లోకములోని అప్రయత్నముగా వెలువడిన నచికేతుని వాక్యములు—తెలిసికొనుట, అర్థముచేసికొనుట అను అతని దృఢ నిశ్చయము తెలియజేయునవై మరింత నైపుణ్యము గలవైయున్నవి.

విద్యార్థి అభిప్రాయ ప్రకారము మిగత అన్ని వరములు ప్రాపంచిక విషయికము లగుటచే అశాశ్వతములు, ఆద్యంతములు గలవియు అగుచున్నవి. కావున పరమ సత్యమును తెలిసికొనగోరు వరముతో అవన్నియు సాటి గావు. మరియు దేవతలుకూడా ఈ ఆత్మయొక్క సత్యమును వెదకి తెలిసికొనలేకపోవుచున్నారనగా ఈ లోకములోనివారమైన మనకు ఈ జ్ఞానమును బోధించుటకు ఒక పరమాచార్యుడు కావలసి యున్నాడు. కావుననే అట్టివాడు మృత్యుదేవతకంటె తగినవాడు మరియొకడు లేడు.

శ్లో॥ శతాయుషః పుత్రపౌత్రాన్ వృణీష్వ బహూన్పశూన్
హస్తిహిరణ్య మశ్వాన్ ।
భూమేర్మహదాయతనం వృణీష్వ స్వయం చ జీవ
శరదో యావదిచ్ఛసి ॥ ౨౩॥

శతవర్షములు జీవించు పుత్రపౌత్రులను కోరుకొనుము. అనేకములైన పశువులను, గజములను, అశ్వములను, హిరణ్యమును కోరుకొనుము. భూరాజ్యమంతయును కోరుకొనుము. నీకిచ్ఛ వచ్చినన్ని సంవత్సరములు జీవించుము.

విద్యార్థియొక్క చిత్తస్థైర్యమును పరీక్షించుటకై మృత్యుదేవత అనంతములగు కోర్కెలను దండ గ్రుచ్చినట్లు పేర్కొనుచున్నాడు.

ఇంద్రియ విషయములయొక్క మాయామోహములనుండి విడివడిననే గాని ఒకడు ఆ పరమ సత్యమునందు సంసక్తుడు కాజాలడు. కావుననే ఆ పరమ గురువులు తమ శిష్యులను ఇట్టి కఠినపరీక్షలకు లోనుచేయుట న్యాయము గానే యున్నది. ఈనాటి పరీక్షలవలె విద్యార్థులను ఉన్న జ్ఞానముకూడా పోవునట్లు చేయునవి గాక ఆనాటి పరీక్షలు విద్యార్థులను జ్ఞానవంతులనుగా తయారుచేయునవై యున్నవి. దురదృష్టవశాత్తు విద్యార్థి అజ్ఞానముచే అవగాహన చేసికొను అంతస్థుకు రానియెడల, వానిని అప్రయోజకునిగా త్రోసి వేయక, ఆ బోధలు వాని మనస్సును పవిత్రము చేసి ఆ అంతస్థుకు తీసుకొని వచ్చునటుల అభివృద్ధిమార్గమును చూపునవై యున్నవి.

ఈ వ్యామోహములయొక్క పట్టీ చాలా పెద్దదిగా కనబడుచున్నది. సాధారణ మానవునికి వానిని త్రోసివేసి పైకి వచ్చుట చాలా దుష్కరము. మృత్యుదేవత నచికేతునికి అనేక శతాయుష్కులగు పుత్రపౌత్రులను ఇచ్చు చున్నాడు. ఇంకను ఈ పట్టీలో రాజ్యము, ఐశ్వర్యము పదవికూడా చేర్చ బడినవి. ఇవన్నియుకూడా గ్రహించువాడు తగినంత ఆయుష్యము లేని వాడగుచో నిష్ప్రయోజనములే. అల్పాయుష్కునికి ఐశ్వర్యము దుఃఖదాయకమే కదా! కావున ఇచట నచికేతునకు ఇవి యన్నియు అనుభవించుటకుగాను అతడు ఇష్టపడినన్ని సంవత్సరములు ఆయుష్యమును ఇచ్చు చున్నాడు.

శ్లో॥ "ఏతత్తుల్యం యది మన్యసే వరం వృణీష్వ విత్తం చిర
జీవికాం చ।
మహాభూమౌ నచికేత స్త్వమేధి కామానాం
త్వా కామభాజం కరోమి ॥౨౪॥"

దీనితో సరితూగునట్టి మరియొక వరమున్నచో కోరుకొనుము. ఐశ్వర్యము, ఆయుష్యము, భూప్రపంచమునకు చక్రవర్తిపదవి అన్నియును ఓ నచికేతా! నీవనుభవించునట్లు చేసెదను.

పూర్వశ్లోకములోనివానికి తోడుగా ఇక్కడ మరికొన్ని కలిపి వ్యామోహమును పెంచుచున్నాడు. బహుశః పూర్వ శ్లోకములోని ఆశలను వినగానే నచికేతుని ముఖములో అసంతృప్తి గోచరించి యుండవచ్చును. అందుకే ఈ వరదానములో మరికొన్ని విషయములను కలుపుట జరిగినది.

మిత్రులారా! మీ కీ నగరములో మరియొక చోట అయిదు రూపాయలు దొరకు అవకాశమున్నచో వెంటనే మీ రీ యజ్ఞశాలనుండి పరుగెత్తుకొని పోయెదరు. కాని ఇచట నూటికి నూరు వంతులు నిశ్చయమైన వరమును పొందియు తత్త్వాన్వేషియైన నచికేతుడు పుత్రపౌత్రులు, బంగారము, పశువులు, దీర్ఘాయువు, రాజ్యము మొదలైనవి ఇవ్వబడుచున్నప్పటికినీ కొంచెముకూడ సంతోషమును కనబఱచుట లేదు. ఇట్టి ఏకాగ్రత, సత్యమునకై సర్వసంగ త్యాగము, తత్త్వాన్వేషి యగు ప్రతివానిలోను కనబడుచున్నది. ఈ శ్లోకములో మృత్యుదేవత తన వరముల పట్టీని పూర్తి చేసి 'బ్రాహ్మణ బాలుడు కొంచమైన లొంగుచున్నాడా? తన ముఖ్యోద్దేశము నుండి మఱలుచున్నాడా?' అని చూచుచున్నాడు. 'ఒకవేళను ఆ దీర్ఘ పట్టీలో చేరని రహస్యమైన కోరికలు నచికేతునిలో ఉండియుండవచ్చును. అందుకనే బహుశః అతని ముఖములో నిస్పృహ నిరాశ స్పష్టముగా కనబడుచున్నవి." అని అనుకొని మృత్యుదేవత "ఈ ఐశ్వర్యము ఆయుష్యముతో బాటు ఇంక ఎట్టిదైనా ఏ వరమైనా కోరుకొనుమ"నుచున్నాడు. తరువాత కూడా అతని ముఖములో ఉత్సాహము లేనట్లు కన్పట్టగా, మృత్యుదేవత అతనికి ప్రపంచ ప్రభుత్వము నిచ్చి కావలసిన కోరిక లన్నిటిని అనుభవించునట్లు చేసెద ననుచున్నాడు. ఈ అన్ని వరములను "మరణము తరువాత అస్తిత్వ మున్నదా" అను ముఖ్యప్రశ్నయొక్క జవాబునకు బదులుగా ఇచ్చుచున్నాడు. ఎంత మంచి బేరము? అయినప్పటికిని మృత్యుదేవత కెంత విచారకరమైన పరాజయము!

శ్లో॥ "యేయే కామా దుర్లభా మర్త్యలోకే సర్వాన్
కామాన్ శ్ఛందతః ప్రార్థయస్వ।

ఇమా రామాః సరథాః సతూర్యా న హీదృశా లమ్భ
నీయా మనుష్యైః ॥
ఆభిర్మత్ప్రదత్తాభిః పరిచారయస్వ నచికేతో మరణం
మానుప్రాక్షీః ॥౨౫॥"

మర్త్యలోకములో దుర్లభమైన వరములను నీ ఇచ్ఛానుసారము కోరుకొనుము. మానవలోక దుర్లభమైన ఈ అప్సరసలు వారి రథములతో సంగీత వాయిద్యములతో అనుభవింపదగినవారు. వారిని నీకిచ్చుచున్నాను. వారిని పూర్తిగా అనుభవింపుము. మరణమునకు తదుపరి గల ఆత్మవిచారమునుగూర్చి మాత్రము ప్రశ్నింపకుము.

అంతరాంతరమున ఎచ్చటనైనా ఒక్క ఆశాక్రిమి అతుకుకొన్నప్పటికినీ అది తత్త్వాన్వేషియొక్క విజయమును నాశనము చేయును. యథార్థమైన సాధకుడు విజయమును సాధింపదలచినచో, అతని భౌతిక, మానసిక, ఆధ్యాత్మిక వ్యక్తిత్వములకు సమమైన వికాసమును చేకూర్చవలెను. వానిలో ఏదిగాని విచ్ఛిన్నమైనచో పూర్తిసమ్మేళనము క్రమము తప్పిపోవును. అట్టి క్రమరహితమైన వాద్యమునుండి నిజమైన సంగీతము ఎప్పుడును వెలువడజాలదు. మృత్యుదేవత ఆత్మకు సరియైన వైద్యునివలె గురుస్థానమున నుండి తన విద్యార్థియొక్క వ్యక్తిత్వమును అతని అంతర సాధనల పరిస్థితిని క్షుణ్ణముగా పరీక్షించుచున్నాడు. కాబట్టి మృత్యుదేవత నచికేతుని, మరణమున కనంతరము అస్తిత్వమును గూర్చిన జిజ్ఞాసను మాని భౌతికలాభము ఇంద్రియసౌఖ్యమును గూర్చిన కోర్కెను కోరుకొనుమనుచున్నాడు. నచికేతునిలో ఎంతటి స్వల్పమైన ఇంద్రియ తృష్ణగాని భౌతిక వాంఛగాని ఉన్నచో బయటపడవలసినదే! విద్యార్థికి అప్సరస స్త్రీలయొక్క నృత్యములు, రథ, వాజి, అభరణములు.... ....ఇంకేమి గావు. అన్నియు కోరుకొనుటకు నీయబడినవి.

శ్లో॥ "శ్వోభావా మర్త్యస్య యదన్తకైత త్సర్వేంద్రియాణాం జరయన్తి తేజః।
అపి సర్వం జీవితమల్పమేవ తవైవ వాహా స్తవ నృత్యగీతే ॥౨౬॥"

ఓ మృత్యువా! ఇవన్నియు అశాశ్వతములైనవి. ఇవన్నియు ఇంద్రియములయొక్క శక్తిని నాశనము చేయునవి. దీర్ఘాయువుకూడా అత్యల్పమైనదే. కావున ఈ అప్సరసలు, నృత్యగీతములు, రథాశ్వములు అన్నియు నీవే ఉంచుకొనుము.

మనస్తత్వ శాస్త్రవేత్తగా ప్రవర్తించిన మృత్యుదేవతయొక్క సూక్ష్మ ప్రశ్నలకు ఇచటి రోగి—నచికేతుడు తగిన ప్రత్యుత్తర మిచ్చెను. ఆ జవాబులోని శబ్దార్థముల ధ్వనిచేతనే ఈ విషయము వ్యక్తమగుచున్నది. మరియు, ఇవన్నియు అశాశ్వతములని చెప్పుటచేత, బాలుడైనను నచికేతుడు పూర్తిగా మానవులయొక్క, పదార్థములయొక్క సూక్ష్మవివేచన చేసి బుద్ధితో తన్నుతాను విమర్శించుకొనిన సఫలమైన జీవనమును గడపినవాడని తెలియుచున్నది.

అతడు యథార్థముగానే ఇంద్రియ విషయములు ఆద్యంతములు గలవి, అశాశ్వతములు, అని వివరించి ఆ కారణముచేతనే తనకు వాని మీద గల ఏవగింపును చెప్పుచున్నాడు. అల్ప జీవితములోనే గాఢముగా విషయవివేచన చేసి స్వర్గీయములైనప్పటికిని విషయసుఖములు అశాశ్వతములనియు 'శ్వోభావా' మరునాటివరకుకూడా ఉండునవికావనియు, ఇవన్నియు మాయా కార్యములని తెలిసికొని యుక్తమైన నిర్ణయమునకు వచ్చెను.

ఇంద్రియ విషయములిట్లు శాశ్వతములే గాక వానిలో తగుల్కొన్నవి యింద్రియములను నీరసపఱచి మన మానందము ననుభవించుటకు వీలు లేకుండా చేయును. ఇంద్రియములు లేక విషయములు, సుఖమునుగాని దుఃఖమునుగాని యనుభవింప జేయలేవుకదా! నచికేతుని వివేచనాశక్తి విషయముల మీద పనిచేయగానే యతడవి తాము నశించునవేగాక యింద్రియ

ములనుకూడా నశింపజేయునని తెలిసికొన్నాడు. ఉదాహరణ :—లడ్డు మొదట తియ్యగా ఉండవచ్చును. కాని యయిదవది తియ్యగా నుండక పోవచ్చును ఇరవైయవ లడ్డు బాధాకరముగకూడ నుండవచ్చును. నలభై రెండవ లడ్డు రాక్షసరూపము దాల్చవచ్చును. పరిస్థితి యిట్లుండుట వలన బుద్ధిని యుపయోగించి బుద్ధి చెప్పునట్లు నడచుకొనువా డెవడును అశాశ్వతమైన భౌతిక సుఖమును కోరడుగదా!

మృత్యుదేవత యిచ్చిన దీర్ఘాయువునుగురించి చిదనవ్వు నవ్వుట లోనే నచికేతునికి దానిమీద నెంత యేవగింపున్నదో తెలియుచున్నది. ఎంత దీర్ఘాయువైనప్పటికి నచికేతున కది యత్యల్పముగానే తోచుచున్నది. ఏలనన యెంతకాలమీ భూమిమీద జీవించినను మానవుడు తృప్తిజెందడుగదా! సరే, ఎంత దీర్ఘాయువైనను ఒకనాటికి అదికూడా మృత్యువు వాత పడ వలసినదేకదా. మరియు నేడైనా సరే పదివేల సంవత్సరముల తరువాత నైనా సరే మృత్యువు బాధాకరమైన మృత్యువేకదా!

కావున సరిగా నర్థము చేసికొని యేహ్యాభావముతో నచికేతుడు "నీ రథములు, నృత్యగీతములు నీవే యుంచుకొనుము," అని చెప్పుచున్నాడు. ఈ నచికేతుని యత్యున్నత స్థితిని చూచిన మృత్యుదేవత యెంత నంత సించెనో తెలిసికొనుటకు నొకడు స్వయముగా యథార్థమైన గురువు కావలెను. ఈ పై ప్రకటనయే నచికేతునియొక్క యంతరాత్మ యెంత పరిపక్వత చెందినదో స్పష్టముగా వెల్లడిచేయుచున్నది. నచికేతునివంటి విద్యార్థికి ఆత్మజ్ఞానము వెంటనే నిరాక్షేపముగా సిద్ధించును.

శ్లో॥ "న విత్తేన తర్పణీయో మనుష్యో లప్స్యామహే విత్త
మద్రాక్ష్మ చేత్త్వా।
జీవిష్యామో యావదీశిష్యసి త్వం వరస్తు మే వరణీయః
స ఏవ ॥౨౭॥"

మానవుడు ఐశ్వర్యమును పొందినంతమాత్రముననె తృప్తిపడడు. నిన్ను చూచిన చాలును ఐశ్వర్యము లభించుచున్నది. నీవు రాజ్యము

చేయునంతకాలము మేముకూడా జీవించెదము. కావున ఆ 'ఒక్క వరమే' నే నాశించదగినది.

నచికేతుడు బాలుడైనను విఢ్యాధికునియంతటి జ్ఞానము అతనికి గలదు. అతడు జీవితమును కేవలము గ్రుడ్డిఎద్దువలె గడపలేదు. అతడు తెలివితేటలతో జీవించుటయే గాక తనయొక్క తదితరులయొక్క అనుభవములను బాగుగా గ్రహించినవాడు. కావుననే 'కేవలము సంపదలు ఆనందమునకు దారి తీయజాలవు' అను వివేకమైన నిర్ణయమునకు వచ్చెను. ఇచట ఐశ్వర్యమనగా కేవలము బ్యాంకులలో కూడబెట్టిన ధనము మాత్రమే కాదు. 'జీవితములో అనుభవించదగు అన్ని విధములైన అనుభవములను కల్పించునది' అను విశాలార్థము కలిగియున్నది.

బాహ్యప్రపంచమును సరిదిద్దినంత మాత్రముననే మన ఆనందమునకు హామీ కలుగదనుట సత్యము. దేశకాల పరిస్థితులను బట్టి ఆ యా వస్తువులతో సంబంధము కలుగునప్పుడు కలుగు అనుభవముయొక్క స్థితియే ఆనందము. విషయములు అవే అయినప్పటికిని కాలానుగుణముగా అవి వ్యతిరేకముగా మారవచ్చును. ఏ పాయసము సామాన్యావస్థలో తీయగా నుండునో ఆ పాయసము దుఃఖితునికి చేదుగా నుండవచ్చును. కావుననే నచికేతుడు 'కేవల ధనముతో ఆనందము కలుగదు' యని చెప్పుట మిక్కిలి యుక్తముగాను సత్యముగాను తోచుచున్నది. ఏలన తఱచుగా మనము దుఃఖితులైన ధనవంతులను చూచుచున్నాముకదా! కోటీశ్వరులు కూడా ఆత్మహత్య చేసికొనినట్లు తెలియుచున్నది.

నచికేతుడు చెప్పుచున్నాడు—"మృత్యుదేవతవగు నిన్ను చూడనంత వరకే మానవుడు ఈ సంపదలను పొందగలిగి యనుభవించ గలుగుచున్నాడు." మరణించినవానికి ఈ ధనధాన్య సంపత్తి ఏల ? తన యతులైశ్వర్యములో నొక్క పైసాకూడా యతని కక్కరలేదు.

ఈ శ్లోకమును వేరొక విధముగా వ్యాఖ్యానించుకోవచ్చును:

"ఓ మృత్యుదేవతా! నిన్ను చూచిన తరువాతకూడా ఎవడు నిర్ధనుడగును?" అని. దీనివలన "మృత్యుదేవత యొక్కదర్శనమాత్రము

చేతనే మానవుడు ధనధాన్యాదులతో అనుగ్రహింపబడుచున్నాడు" యని తెలియుచున్నది. కావున అదివరకే సిద్ధమైన విషయములను కోరి నచికేతుడు తన వరమును వ్యర్థము చేసికొనుట తెలివితక్కువ పని యనుచున్నాడు.

ఇది యెట్లున్నదనగా పాఠశాలలోని యుపాధ్యాయుడు విద్యామంత్రిని కలుసుకొనికూడ తన కా పాఠశాలలోనే తన క్లాసుమాస్టరుగానే యుద్యోగ మిప్పించవలసినదని కోరడ మెంత వ్యర్థమో, పిచ్చితనమో యట్లే దర్శన మాత్రముచేతనే సిద్ధమైనవానిని మరల మృత్యుదేవతను కోరుట యంత వ్యర్థము పిచ్చితనము నని చెప్పవచ్చును.

పై వాదములమీద ఆధారపడినవాడై, తెలివితేటలు వివేచనాశక్తి గలిగి తత్త్వాన్వేషియగు నచికేతుడు తాను ముందు కోరిన వరమునే తన కీయ వలసినదని దృఢముగా చెప్పుచున్నాడు.

శ్లో ॥ "అజీర్యతామమృతానాముపేత్య జీర్యన్మర్త్యః
క్వధస్థః ప్రజానన్ ।
అభిధ్యాయన్వర్ణరతిప్రమోదాన్ అతిదీర్ఘే జీవితే
కో రమేత ॥ ౨౮ ॥"

శాశ్వతమై నాశము లేనివారి పొందు కలిగికూడ జ్ఞానము కలిగిన ఏమానవుడు విషయసుఖములయొక్క స్వభావమును తెలిసి దీర్ఘాయువును కోరును ?

విషయలోలుడై, బుద్ధిహీనుడై, నిరాశావాదియైన అజ్ఞానియొక్క హృదయములో నుండి వెలువడిన నిరాశావిలాపము గాక యీ శ్లోకములో బుద్ధిసూక్ష్మత గలిగి తెలివితేటలు గలిగిన ఆశావాదియొక్క యానందగానమే వర్ణితమైనది. ఈ పదముల కూర్పులోనే ఒక విధమైన యుపహేళన ధ్వనించు చున్నది. రక్తమాంసములతో కూడి దుర్గంధ భూయిష్ఠములైన యీ దేహము లోని జీవి, పుండుమీది పురుగువలె భౌతికసుఖము ననుభవించుటకుగాను, సాంప్రదాయికముగా వచ్చు భూమిమీది తన దివ్యజీవితమును ఎవడు వ్యర్థ పఱచుకొనును ?

ధనార్జన, ధనసంచయము, ధనాధిపత్యము, ధనవ్యయము మొదలైన వాటికొఱకు పాటుపడు ఈ మర్త్యజీవులను అసహ్యించుకొనుటయే గాక వారి మీద సానుభూతి కలవాడై నచికేతుడు, తనమీద తాను చేసుకొను మానవజాతి అత్యాచారమునకు తగిన క్షమాపణను వెదకుకొనుచున్నాడు. అమరత్వము, అవినాశము కలిగిన వారివద్ద చేరియు, ఎవ్వడుకూడ అనిత్యము నాశసహితమైన మర్త్యజీవితమందు సంసక్తుడుకాడు.

దేహమనోబుద్ధులయొక్క ఐక్యము, వాటితో సంబంధమును వదలించుకొనవలెనని అన్నిమతములు ఏకగ్రీవముగా పలికినను ఈ నిస్సంగములోని సత్యమును తెలిసికొనిననేగాని సాఫల్యములేదు. ఆంతరిక సత్యసిద్ధాంతము ఎటువంటిదనిన, లోసాధనములను తెలిసికొను జ్ఞాతవిషయములనే గాక జ్ఞేయములనదగు బాహ్యవిషయములనుకూడ తన ఆధీనమందుంచుకొని వాటికి దారుఢ్యము నిచ్చుచున్నది. ఇట్టి వేదాంతసత్యముతోనే నచికేతుడు "నాశనము లేక అమరత్వము గలదానిని పొందికూడా దీర్ఘాయువును ఎవడు కోరును ?" అని కార్యకారణ సహితముగా నిర్ధారించుచున్నాడు.

దివ్యముతో సంసక్తి యనిన అదివ్యముతో అసంగము అనియే అర్థము కదా! ప్రకాశములోనికి పోవుటయనగా అంధకారమునుండి అవల పడుటయే. తీరమునకు చేరుట యనగా జలమునుండి స్థలమునకు వచ్చుటయే. మేలుకొనుట యనగా స్వప్నమునుండి తప్పుటయే. ఇట్లు నిజమైన మతములన్నియు వారి మతగ్రంథములలో నొక్క చెప్పబడిన దానినిబట్టి నిస్సంగమతమనిగాని, సంసక్తమతమనిగాని పిలువబడుచున్నవి.

శ్లో॥ "యస్మిన్నిదం విచికిత్సన్తి మృత్యో యత్సాంపరాయే
మహతి బ్రూహి నస్తత్ ।
యోఽయంవరో గూఢమనుప్రవిష్టో నాన్యం తస్మా
న్నచికేతా వృణీతే ॥ ౨౯ ॥"

ఓ మృత్యువా! దేనియందు మానవులు సంశయావిష్టులగుచున్నారో దానిని చెప్పుము. దేనివెనుక గొప్ప మహత్తు గలదో, ఏది ఇంతవరకు

అనూహ్యమో అట్టి ఆత్మజ్ఞానమునుగురించి గాక ఇతరమైన వరమును నచికేతుడు కోరడు.

(ఇట్లు మొదటి అధ్యాయములోని ప్రథమ వల్లి ముగియుచున్నది)

ప్రథమాధ్యాయము ఇట్లు విద్యార్థియొక్క దృఢమైన కోరికతో ముగియుచున్నది. అతనిని మాయాజాలములైన విషయ సుఖములందు వ్యామోహితునిగా చేయుటకు ఎట్టి వ్యామోహములకును శక్తి చాలలేదు.

ఈ ఉపనిషత్తులోని ఈ అధ్యాయము నాటకీయ దృశ్యము నిచ్చునదే గాక ప్రశంసనీయమైన ఆత్మజ్ఞాన తృష్ణ గల ఆ బ్రాహ్మణబాలుని చిత్రమును మన కన్నులముందర ప్రదర్శించుచున్నది. అతడు వివేచనాబుద్ధి కలిగి యుండుటయే గాక మాయావిషయములయందు నిస్సంగుడై ఆ పరమ సత్యమునందు సంసక్తి కలిగియున్నవాడగుచున్నాడు.

ఈ ప్రథమ వల్లిలో అసలు ఉపనిషత్తుభాగము చాలా కొంచెముగానే వర్ణితమైనది. సిసలైన వేదాంత చర్చ ద్వితీయవల్లినుండియే ప్రారంభించు చున్నది. ఇంతవరకు శ్రుతిభగవతి ఆ పరమసత్యమును ఆత్మగా తెలిసి కొనగోరు వేదాంతవిద్యార్థి కుండవలసిన విశేషగుణములను నొక్కి చెప్పుట లోనే పరిశ్రమ చేసినది.

ఆ గుణములు: (1) వైరాగ్యము—ఇహపర సుఖములనుండి విరక్తి
(2) వివేకము—నిత్యానిత్య వివేచన.
(3) షట్సంపత్తి—శమ, దమ, ఉపరతి, తితీక్షా, శ్రద్ధా, సమాధానములు.
(4) ముముక్షత్వము—(మోక్షేచ్ఛ) సర్వాంతర్యామి యగు ఆత్మను తెలిసికొనగోరుట.

**20-29** శ్లో॥ మూడవవరముద్వారా నచికేతుడు పరమునుగురించిన అర్థమును తెలిసికొనగోరును. మృత్యువు నచికేతుని పరీక్షించెను. మిగతా సమస్త దానములను తిరస్కరించి తాను ముందు కోరిన వరమునే మరల నిర్బంధముగా కోరును.

---

# ద్వితీయ వల్లి

అమరత్వమునుగూర్చి మృత్యువుయొక్క బోధ-శాశ్వత సత్యమును గ్రహించి అర్థముచేసికొనుట.

శ్లో॥ అన్యచ్ఛ్రేయోఽన్యదుతైవ ప్రేయస్తే
ఉభే నానార్థే పురుషం సినీతః ।
తయోః శ్రేయ ఆదదానస్య సాధు
ర్భవతి హీయతేఽర్థాద్య ఉ ప్రేయో వృణీతే ॥ ౧ ॥

యమధర్మరాజు చెప్పుచున్నాడు—"ఒకటి శుభమును గూర్చునది రెండవది సుఖమును గూర్చుచున్నది. విభిన్నదృష్టి గల యీ రెండును మానవుని కట్టివేయుచున్నవి. ఎవడైతే శ్రేయస్సునే కోరుచున్నాడో వాడు అనుగ్రహింపబడును. ఎవడైతే సుఖమును గోరుచున్నాడో వాడు లక్ష్యమును పోగొట్టుకొనుచున్నాడు."

పై విధముగా విద్యార్థిని పరీక్షించి బ్రహ్మజ్ఞానమునకు తగినవాడని తెలుసుకొనిన తరువాత మృత్యుదేవత చెప్పుచున్నాడు. "శుభ మొకటి, సుఖము మరియొకటి." జీవులచే చేయబడు ప్రతి పనిలోను నేదో యొక యానందమును పొందు నుద్దేశము ఉండనే యున్నది. జీవితములో ప్రతి సంఘర్షణ, ప్రతి పోరాటము, ఆనందమే లక్ష్యముగా గలది. ప్రాకులాడు చున్న చిన్న పురుగుకూడ తానున్న చోటుకన్న తాను చేరబోవు స్థలములో నేదో యధికానందమున్నదని సంచరించుచుండును. సంపూర్ణ సంతృప్తిలో నన్ని యాశలు, ఆకాంక్షలు సంతమగుచున్నవి. ఇట్టి ఆశలు లేని, యాకాంక్షలు లేని యవస్థయే జీవిత పరమలక్ష్యము. ఇది దేవత్వము లేక కైవల్యమని పిలువబడుచున్నది. ఇట్టి సంపూర్ణ సంతృప్త్యవస్థను చేరుటకు

ప్రయత్నించకుండ నుండలేనియెడల మన యనుభవములను విచారణ చేసి యేది నిజమైన సాధనయో నిశ్చయించుకొనుట కిదే సమయము.

ఈ సమస్యపై జరిగిన విమర్శయే మృత్యుదేవత ముఖమునుండి యీ విస్పష్టత గల శ్లోకరూపముగా వెలువడినది.

యమధర్మరాజు ఫలానుసారముగ సమస్త క్రియలను రెండు విధములుగా విభజించుచున్నాడు. సమస్త క్రియలును ఫలముల దృష్ట్యా రెండు విధములుగా నుండవచ్చును. ఒకటి జీవితములో నశాశ్వతానందమును కలిగించునది. రెండవది యీ నిత్యానందమును పొందించునది. అనగా కొన్ని భౌతికములై సద్యఃఫలితములై యుండునవి. మరికొన్ని నెమ్మదిగా కాలాంతములో నాత్మ సంస్కృతికి, నాత్మ పవిత్రతకు సహాయపడునవై యున్నవి.

హృదయ విహీనుడైన చీకటిబజారు (Black market) వ్యాపారిగాని నీతి లేక లంచము పుచ్చుకొను నుద్యోగస్థుడు గాని, నీచమైన పైశాచిక కృత్యములచేత లోభము అత్యాశలకు లొంగి ధనసంచయ మను పందెములో గెలువవచ్చును. దీనిని సాధారణ ప్రజ తమ యజ్ఞానముచే నతనిలో ఇది యభివృద్ధి యని గాని, విజయమని గాని తలచెదరు !

ప్రత్యేక వ్యక్తిత్వము గల మనము జీవన సూత్రములైన న్యాయము, భక్తి, సత్యపరత్వము, దయ, సహనము, ప్రేమ మొదలైనవానిమీద మన జీవితమును నిర్మించుకొనుటకు స్వతంత్రులము. అంతేగాక మనము ఆత్మ శాంతి, ఆనందము కలిగించునటువంటి యుత్తమైశ్వర్యమైన యాత్మ సంస్కృతి కొఱకు జీవించుచున్నాము. ప్రతి వ్యక్తి యెన్నుకొనవగు నీ రెండు రకములగు మార్గములే "ఒకటి సుఖమైనది, మరియొకటి శుభమైనది" అని చెప్పుటతో మృత్యుదేవతచేత సూచింపబడినవి. సుఖవంతములు శ్రేయోదాయకములయిన కార్యము లున్నప్పటికిని శ్రేయస్సు సర్వదా సుఖదాయకమే కానక్కరలేదు. అసౌఖ్యదములై లోపభూయిష్ఠములైన భౌతిక విషయములను గోరక, ఉత్తమ ప్రయత్నములలో చిక్కులున్నప్పటికిని లక్ష్యపెట్టక, స్థిరముగా తన సన్మార్గమున కంటుకొని నిత్యా

నందమైన పరమ లక్ష్యమును యెవడు కోరుకొనుచున్నాడో నట్టివాడే యాధ్యాత్మిక నాయకుడు.

"ఈ రెండును మానవుని బంధించుచున్నవి" అను వాక్యము పరమ లక్ష్యముయొక్క దృష్ట్యా మిక్కిలి ప్రధానమైనది. సుఖమార్గము తఱచు నీచ యోనులలో పుట్టింపజేయు పాపములను నేరములను చేయించి, బలాత్కారముగ ప్రమాదములోనికి ద్రోయును. అనగా నీ సుఖమార్గము ననుసరించువాడు తనను తానే అధోలోకమునకు త్రోసుకొని యందే స్థిరపడునట్లు ప్రణాళికను తయారుచేసుకొనుచున్నాడని యర్థము. ఈ సుఖమార్గమున మనము మనలనే క్రిందకు త్రోసుకొని, పరిణామమున అతి నిమ్నమైన స్థితిలో నుండిపోవుటకు ప్రయత్నించుచున్నాము. ఈ సందర్భములో పాపమనగా లక్ష్యమునుండి తప్పింపజేయు కర్మ యని యర్థము. అట్లే శ్రేయోమార్గములో పోవువానిని అది ఉన్నత జ్ఞానావస్థితికి మార్పు చెందించుచున్నది. అవి తమ పుణ్యకర్మ ఫలములను అనుభవింపజేయు దేవలోకములు. కావున యా పరిపూర్ణ తత్త్వమును అన్వేషించువానికి శ్రేయోమార్గము ప్రేయోమార్గము రెండును బంధనములే.

శ్లో ॥ శ్రేయశ్చ ప్రేయశ్చ మనుష్యమేతస్తౌ ।
సంపరీత్య వివినక్తి ధీరః ।
శ్రేయో హి ధీరోఽభి ప్రేయసో వృణీతే
ప్రేయో మన్దో యోగక్షేమాద్వృణీతే ॥ ౨ ॥

శ్రేయస్సు ప్రేయస్సుకూడ మానవుని చేరును. తెలివైనవాడు పరీక్షించి వివేచించుచున్నాడు. ఏలన యతడు ప్రేయస్సుకన్న శ్రేయస్సునే యెన్నుకొనును. కాని అజ్ఞాని యిహమందలి యోగక్షేమముల కొఱకు ప్రేయస్సునే యెంచుకొనుచున్నాడు.

జీవితము పోటీలతో కూడినది. క్షణక్షణమునకు కాలప్రవాహములో మనవైపువచ్చు "చేయుదుటా, మానుటా" అను ప్రశ్నను యెదుర్కొనవలసి

వచ్చుచున్నది. వ్యామోహములమీద వ్యామోహములు మనదఱి చేరుచున్నవి. భవిష్యత్తు వర్తమానమై అనాదియైన భూతములో లీనమగుటకు దొరలు చున్నది. ప్రతిక్షణము, వస్తువుల విషయమై స్వతంత్రమైన నిర్ణయము చేయుటకు మనకు బుద్ధి, వివేచన కావలసి యున్నవి. బాహ్యవిషయము లశాశ్వతములగుటచే స్థిరముగా నుండవుగాన, ప్రతిక్షణము అవి చిత్ర విచిత్రమైన వస్తువులుగా తయారగును.

క్షణక్షణము మార్పులు గల విషయముల విషయమై ఆలోచన చేయుగల మానవుడు, వానితో సంబంధముకొఱకు, తన నిర్ణయములను గూడ వానికిదగినట్లు క్రొత్తగా చేసికొనవలెను.

ప్రతిక్షణము వచ్చు సంఘర్షణములోను మనకు రెండు మార్గములు తెఱువబడియున్నవి. ఒకవైపు దుఃఖములతో గూడుకొని అనంత మృత్యువను అంధకారములోని కీడ్చుకొనిపోవు ప్రకాశమువలె కనబడు సుఖమార్గ మున్నది. మఱియొకవైపు, యెత్తుపల్లములతో వంకరటింకరలుగా అగమ్య ముగానున్నట్లు తోచినప్పటికినీ, అంతమున సూర్యునిచే ప్రకాశితమైన పచ్చని పైర్లతో, ఫల పుష్ప భరితమై, శాశ్వతానందదాయకమైన ప్రదేశమునకు తీసికొనిపోవు శ్రేయోమార్గమున్నది.

జ్ఞానముగల మానవుడీ రెండింటిని బాగుగా వివేచించి తెలివైన నిర్ణయమునకు వచ్చినవాడై, శ్రేయోమార్గమునే విడువక యంటుకొని యుండును. అందులోనే తన జీవనయాత్రను కొనసాగించి అంతమున జీవితకార్యమును సఫలము చేసికొనుచున్నాడు. అజ్ఞాని "గతాను గతికో లోకః" అనునట్లు సామాన్యప్రజననుసరించువాడై, దేహాభిమానముతో పశుప్రవృత్తితో, గాలము గడపుచున్నాడు. అధఃపాతాళమున కణచివేయు పాపములను క్రూరకృత్యములను చేయుంచునవై విషయభోగాసక్తములై సదా తృష్ణతో గూడిన యింద్రియములను తృప్తిపఱచుటకొఱకు అతడు సుఖమార్గము ననుసరించుచున్నాడు.

మృత్యుదేవతయొక్క యీ వాక్యములు తెలివైన వానికి ఆదర్శ మార్గమున జీవితమును గడపుటకు, అంతమున విజయము పొందుటకు

మర్మమును చెప్పుచున్నవి. మనము మన యాశలకు, కామాదులకు, లొంగిపోయి బానిసలమైనయెడల సంపూర్ణాత్మానందముతో జీవించు మానవుల మగుటకు బదులు ద్విపాదపశువుల మగుచున్నాము.

ఈ వల్లిలో మొదటి రెండు శ్లోకములలో స్వప్రయత్నముయొక్క తర్కమును సిద్ధాంతమును అతిసుందరముగ జెప్పబడియున్నది. ప్రతిక్షణమును జీవితసమస్యల నెదుర్కొనవలసినప్పుడు యీ రెండు మార్గములును మన ముందర నిల్చును. ఏ మార్గములో నడవవలసినది మనము నిర్ణయించవలసినవేగాని యీ భగవంతుడు మనలను దుఃఖభూయిష్ఠమైన సుఖమార్గమునకు బలవంతముగా లాగుకొనిపోవుటగాని, శుభమార్గమందలి చత్వరమున నిలచి అందే నడవుడని ప్రచారము చేయుటగాని లేదు. ప్రతి క్షణమునందును మానవునకు యీ రెండు మార్గములలో నేదేనొకటి అనుసరించుటకు పరిమితస్వాతంత్ర్యము గలదు. యథార్థముగా మానవునకు, సంపూర్ణమై యపరిమితమైన బాహ్యపరిస్థితులమీద స్వాతంత్ర్యము లేకపోవుట నిజమేకాని, వానికి క్షణక్షణ బాహ్యపరిస్థితులలో మంచి చెడ్డల నాలోచించుటకు పరిమితస్వాతంత్ర్యము ఉండనే యున్నది. ఈ పరిమిత స్వాతంత్ర్యమునే తెలివిగా నుపయోగించిన సంపూర్ణ స్థితిని బొంది తాను దేవు డగుచున్నాడు.

జీవితము నిజముగా ఆత్మసంపూర్ణత్వముయొక్క కళ. దీనిని శ్రద్ధాయుతమైన ఆత్మసంయమనముతో మరికొంత శోభావంతము చేసికొనవచ్చును. ప్రారంభకుడు యీ క్లిష్ట సమయములలో నంతఃప్రేరణచే చెడుదారినే పోవుచున్నట్లు తలచుచున్నాడు. తనకుగూడ వ్యతిరేకముగ నిట్లు నడచుటకు కారణము తన "కర్మ" యనుచున్నాడు, కాని వాస్తవమున అది కాదు.

అట్లు చెడుమార్గమున నడపుటకు, మనలో ప్రయత్నపూర్వకముగా నభివృద్ధిపఱచుకొని, పూర్వమునుండి చెడుగా ఆలోచించుటవలన వాసనా రూపముగా మారిన యభ్యాసమే కారణము. ఆ విధముగానే కసాయి వాడుగాని వేటగాడుగాని తాత్కాలిక శత్రువును వదలించుకొనుటకు

చంపుట సహజమైనదే యని తలపవచ్చును. అట్లే యహింసాధర్మమును పాలించు మరియొక చింతకుడు శత్రువును చంపి వదలించుకొనుట యను దాని నొప్పుకొనడు. అఫ్రికాయడవులలో నివసించు నరమాంస భక్షకుడు ఆకలి తీర్చుకొనుటకు తన పొఱుగు పిల్లవానిని చంపి తినుటలో నెట్టి బాధను పొందడు. నవీనకాలపువారమైన మనము మన పొరుగు పిల్లవాడు నిజముగా తన యల్లరిచే మనలను చీకాకు పెట్టి చంపదగినవాడై నప్పటికిని వాని కెట్టి బాధను కలిగించుటకు తలపెట్టము.

మానవు డనగా యతని మనస్సే, ఆ మనస్సు నెట్లు మనము దిద్దుకొని సరిచేసిన అట్లే మన మగుదుము. అనిత్యమై, కాదనదగు తక్కువ విలువలవైపు, మన మనస్సును మఱలించిన మనము నిశ్చయముగ బుద్ధిహీనమైన ద్విపాదపశువుల మగుచున్నాము.

కావున మనస్సును ప్రేమ, సహనము, దయ మొదలైన యున్నతమై శాశ్వతములైన విలువలకు తగినట్టుగా త్రిప్పుకొనుట కలవరచిన, మనము సంస్కృతి, సంపూర్ణతలను గలిగి భవిష్యత్తుకు తగిన యర్హతలను సంపాదించగలము. మనము భవిష్యత్తుకు మరణపత్రమును గాని దివ్యత్వమునకు యావజ్జీవాధికారమును గాని యెన్నుకొనుట కష్టులమై యున్నాము. తత్ఫలితముగ మృత్యువును గాని, యమర జీవితమును గాని యనుభవింపగలుగుచున్నాము.

మనకన్న వేఱుగా మనల కతీతమై మనకు పైగా విధియన్నది వేఱొకటి లేదు. మనమే మన భవిష్యత్తును నిర్మించుకొనువారము.

మృత్యుదేవతయొక్క సారవంతమైన వాక్కులు జ్ఞానగర్భితములైనట్లు యీ పై శ్లోకమును ప్రారంభించుటలో తోచుచున్నది.

శ్లో॥ స త్వం ప్రియాన్ప్రియరూపాం శ్చ కామానభిధ్యాయ
న్నచికేతోఽత్యస్రాక్షీః ।
నైతాం సృంకాం విత్తమయీ మవాప్తో యస్యాం
మజ్జన్తి బహవో మనుష్యాః ॥ 3 ॥

ఏ యైశ్వర్యపథమును పెక్కుమంది మానవులు వాంఛింతురో యట్టిదానిని నీవనుసరింపక ఆశలను ఆశావిషయములనుగూడ వాని సహజ స్వభావమును తెలిసికొన్నవాడవై త్యజించితివి.

సమస్త పరీక్షలకు వ్యామోహములకు నిలచిన యా బ్రాహ్మణబాలుని గూర్చి మృత్యుదేవత హృదయమునుండి వెలువడిన అప్రయత్నపూర్వక మైన యభినందనలను వినుచున్నాము. సమస్త మానవరాజ్యములోని వారును స్వయముగా ననుభవించలేనప్పటికి, నెట్టి వ్యామోహములకు లొంగిపోవుదురో నట్టి వ్యామోహములచే మృత్యుదేవత నచికేతుని విషయ సుఖములవైపు మరలింప దలచినాడు.

కాని యీ బాలుడు నిత్యానిత్యవివేచన గలిగి, యాతడు చూపు వ్యామోహములకు లొంగక, స్థిరముగా నిలుచుటయే మృత్యుదేవత యాత నిని ప్రశంసించుట కవకాశ మిచ్చినది. ఏలన గురువునకు తనకంటె మించిన శిష్యుడు అరుదుగానే లభించును. నచికేతునకు శతాయుష్కులగు పుత్ర పౌత్రులే గాక నృత్య గీతాదులతో ప్రతినిత్యము సేవించు యప్సరస్త్రీలు గూడ వరముగా నివ్వబడిరి. కాని పరిపక్వత జెందిన నచికేతుని ఆధ్యాత్మిక వ్యక్తిత్వమునకు యివియన్నియు చిన్నపిల్లలాడుకొను ఆటవస్తువులవలెనే గోచరించినవి.

"సృంకాం" అను పదమునకు "మాల, మార్గము" అను రెండు విధములుగా నర్థము చెప్పబడినది. నచికేతుడు తాను కానుకగా నివ్వదల చిన రత్నమాలను నిరాకరించుటవలనను, లేక ఐశ్వర్యపు బాటలో నడచు టకు గల యాతని యేవగింపువలనను వ్యక్తమైన నచికేతుని వైరాగ్య భావమును చూచి మృత్యుదేవత ఆశ్చర్య చకితుడాయెను.

శ్లో॥ దూరమేతే విపరీతే విషూచీ అవిద్యా యా చ విద్యేతి జ్ఞాతా ।
విద్యాభీప్సితం నచికేతసం మన్యే న త్వా కామా బహ వోఽలోలుపన్త ॥ ౪ ॥

జ్ఞానము, అజ్ఞానము—రెండు విభిన్నలక్ష్యములను చేర్చు రెండు సుమార్గములు. ఇట్టి కామాదులు నిన్ను కదలింపకపోవుటచే నచికేత! నీవు జ్ఞానమార్గమునే యవలంబించినావని నమ్ముచున్నాను.

వైరాగ్యముచేతను వివేకముచేతను సర్వ వ్యామోహముల నరికట్టిన హృదయము గల నచికేతుని తెలిసికొన్న మృత్యుదేవతయొక్క హృదయములో ప్రకాశించిన యూహలే, నీ పై నాలుగు శ్లోకములలోను వివరింప బడినవి. మృత్యుదేవత నచికేతునిలో తానుచేసిన పరిశోధనల, పరిశీలనల ఫలములను విలువగట్టుచున్నాడు.

శ్రేయః ప్రేయోమార్గములు రెండును చీకటి వెలుతురులవలె స్వభావ విరుద్ధములైయున్నవి. ప్రేయోమార్గము అజ్ఞానమార్గము. శ్రేయోమార్గము జ్ఞానమార్గము. పరమ విద్యయై శాస్త్రములకెల్ల శాస్త్రమైన యా బ్రహ్మవిద్యను శ్రద్ధగా సన్మార్గమున నడచువానికే నీయవలెను. నచికేతుడు స్థిరముగా, భక్తితో శ్రేయోమార్గము ననుసరించువాడుగా ఋజువుచేసికొనినాడు గాబట్టి మృత్యుదేవత యీ బ్రాహ్మణబాలుడీ జ్ఞానమున కర్హత గల విద్యార్థి యని మనస్సులో నిశ్చయించుకొనినాడు.

శ్లో॥ అవిద్యాయా మంతరే వర్తమానాః స్వయం ధీరాః
పండితం మన్యమానాః
దన్ద్రమ్యమాణాః పరియన్తి మూఢా అన్ధే నైవ నీయ
మానా యథాన్ధాః ॥ ౫ ॥

అజ్ఞానాంధకారములో మునిగి తమ్ము పండితులుగా భావించుకొని మూఢులు మాయాజాలములో జిక్కి వంకరమార్గములలో గ్రుడ్డివానిని వెంబడించు గ్రుడ్డివారివలె పర్యటించుచున్నారు.

ఈ యుపమాన మిక్కడ అంతగా మనస్సుకు హత్తుకొనిపోవుటచే నిది యొక సామెతగా మారినది. అందుచే నిది మహాపండితుల

మనుకొని సంఘమును సమాజమును తీర్చి దిద్దుటకు లేనిపెత్తనమును పైనివేసుకొను పండితమ్మన్యుల విమర్శించుపట్ల తఱచుగా వాడబడు చున్నది.

ఆత్మవంచకులై దొంగభక్తి గల "యూదుల"ను విమర్శించుచు నిటువంటి వాక్యము బైబిలులోగూడగలదు—"గ్రుడ్డివాడు గ్రుడ్డివానికి మార్గదర్శకుడైన నిరువురును గోతిలో పడవలసినదే."

ఆత్మపవిత్రత గలిగి ఆత్మజ్ఞానమున కర్పితమైన జీవితమును పూర్తిగా వైరాగ్యముతో గడపిననేగాని కేవల పుస్తక పరిజ్ఞానముచే మాత్ర మొకడు నిజమైన విద్వాంసుడు కాజాలడు. కేవల పుస్తకజ్ఞానము ఒకనిని నిజమగు ధీమంతుడుగా చేయజాలదు. నిజమైన ధీమంతుడు గొప్ప పండితుడు కాకున్నను ఆత్మసంయమనము ధర్మయుతమునైన జీవితమును గడపగలుగుచున్నాడు.

కేవల 'గ్రంథకీటకములు' రాజగురువుల స్థానము నలంకరించినపుడు, వారు దేశనాశమునకే గాక అంతర్జాతీయ కల్లోలమునకు గూడ కారకులగుదురు. కేవల జన్మగాని అభిజాత్యముగాని యొకనిని పండితుని చేయజాలదు. అట్టి పండితులు నాయకులైనయెడల నేతయు నీయమానుడు గ్రుడ్డివానిచే నడపబడిన గ్రుడ్డివానివలె నొకేసారిగ పరిహాసాస్పదమైన అపదకు లోనగుచున్నారు.

'వక్రమార్గములలో మోహితులై'—యనువానికి అర్థమిది. ఒక వ్యక్తి అసంపూర్ణతలను ఆధ్యాత్మిక అజ్ఞానమును చక్కగా సాగుచేయుటవలన, యతని హృదయములో నాశ లభివృద్ధి పొందును. వాని తృప్తికొఱకు అతడు మంచిగాని చెడ్డగాని లేక యుదాసీనములైనవిగాని కర్మలను చేయుచున్నాడు. తత్ఫలితముగా ననంతములైన పునర్జన్మలలో "ప్రతిఫలము" అను సంపదలను గడించి, వానిని అనుభవించి దుఃఖించుచున్నాడు. నిజమైన యాత్మస్వభావమునందుదాసీనుడై యుండుటవలన నహంకారము నభివృద్ధిపఱచుకొని దాని ఫలితముగా "నాది నేను" అను బాధాయుతమగు క్లిష్టపరంపరలలో తగుల్కొనుచున్నాడు.

శ్లో॥ న సాంపరాయః ప్రతిభాతి బాలం
ప్రమాద్యన్తం విత్తమోహేన మూఢమ్ ।
అయంలోకో నాస్తి పర ఇతి
మానీ పునః పునర్వశమాపద్యతే మే ॥ ౬ ॥

బాలుడై అజ్ఞానియై సంపదలచే మోహితుడైనవానికి పరలోక మార్గము కనబడదు. "ఇదియే లోకము, మఱియొకటి లేద"ని తలచువాడు నా వశమునకు మరల మరల వచ్చుచున్నాడని మృత్యుదేవత చెప్పుచున్నాడు.

అనారతముగా ధనసంపాదన, గ్రహణ, సంచయాదులయందు ప్రయత్నించువానికి, పరమునుగూర్చి చింతించుటకు అవకాశముగాని, సమయముగాని, తగిన బుద్ధిహృదయములుగాని యుండవు. అనాలోచితములగు నిర్ణయములపైన, దేహాత్మభావనపైన, సాధారపడినవై నీచజీవనోద్దేశములలో, మనోబుద్ధు లెంతవఱకు మునిగిపోవుచున్నవో, అంతవఱకెవడును, యిహలోకపు బంధనలు తెంచుకొని పైకి పోవుటకు ప్రయత్నించడు. అటువంటివారికి-అనగా దేహాభిమానులకు, దుఃఖము, శ్రమ, అశాశ్వతసుఖములు పైపై చిఱునవ్వులు వీనితో గూడిన యిహలోకజీవితమే ధ్యేయము అగుచున్నది. వారికి యీ యున్నతాదర్శములు దివ్యజీవితములు సంభవములనికూడ తోచవు. ఒకవేళ వారికి యెవరైన నింతకన్న పైని యున్నతమైన జీవితమున్నదని చెప్పినను, వారికా దివ్యజీవనమును అనుభవించుటకు మానసికశక్తిగాని అట్టి ఆధ్యాత్మికాదర్శములను గ్రహించుటకు ధీశక్తిగాని యుండదు. ఇచ్చట "బాల" యను పదము బృహదారణ్యకోపనిషత్తులో క్రైస్తవ బైబిలులో నుపయోగించినట్లుగాక, వేఱువిధమైన యర్థములో నుపయోగింపబడినది. బృహదారణ్యకములో "ఎట్లు ఆత్మ తెలియబడుచున్నద"ని యడుగగా యాజ్ఞవల్క్యుడు "బ్రాహ్మణుడు తన పాండిత్యమును వదలి బాల్యమును చేకొనుగాక!" యనుచున్నాడు. ఇచట బాలునివలె ననగా కామాదులు లేక యమాయికముగా నుండుట యని యర్థము.

మహర్షులయొక్క యీ శాశ్వతాభిప్రాయమే "యేసుక్రీస్తు" యొక్క వాక్యములలోను ప్రతిధ్వనించుచున్నది. "మీరు చిన్నపిల్లలవలె నయినగాని మీరు దేవరాజ్యమును చూడలేరు" అని.

అట్టి అర్థముకాని చిన్నతనపు మాటలాడు వదరుబోతువారు—భౌతికవాదులు, ఏది అభావమునుండి పుట్టినదో, ఏది శూన్యములో లయమగుచున్నదో, ఏది జీవించునంతకాలము గతమును పరిశీలించక భవిష్యత్తును గూర్చిన యాకాంక్షలు లేకయున్నదో, యట్టి స్వల్పమైన అనిశ్చితమైన, అస్థిత్వమే స్వయంసంపూర్ణమైనదని భావించెదరు. అట్టివానికి జీవిత మయోమయమై అస్తవ్యస్తమై అబోధితమై అగ్రాహ్యమై తార్కికమైనప్పటికిని, యర్థరహితమై తికమకపెట్టు చిక్కుల పుట్ట. నిజముగా నట్టివారు వేదాంత చర్చలకుగాని నియమబద్ధమైన జ్ఞానజీవితమునకుగాని అనారతముగా తమ్ముతాము క్రమశిక్షణలలో నుంచుకొనుటకుగాని తగినవారు కారు.

1—6 శ్లో. రెండు మార్గములు. 1. శ్రేయము—జ్ఞానమార్గము. 2—ప్రేయము—సుఖమార్గము. అశాశ్వతానందములచే మోహితులై ప్రజలు చవకరకపు విషయసుఖములకు లోబడి మృత్యువునకు బానిసలగుచున్నారు.

శ్లో॥ శ్రవణాయాఽపి బహుభిర్యో న లభ్యః
శృణ్వంతోఽపి బహవో యం న విద్యుః ।
ఆశ్చర్యో వక్తా కుశలోఽస్య లబ్ధాఽశ్చర్యో
జ్ఞాతా కుశలానుశిష్టః ॥ 7 ॥

ఆ యాత్మనుగురించి పెక్కుమంది వినలేకుండ యున్నారు. వినికూడ గ్రహించలేకున్నారు. అట్టి స్థితిలో ఆత్మజ్ఞానమును బోధించువాడు దొరకిన ఆశ్చర్యకరమైన విషయమే! తగిన గురువుచేత బోధింపబడినవాడై దానిని గ్రహించగల శిష్యుడు కుదురుటయు నాశ్చర్యకరమైన విషయమే.

ఈ విషయముగ మృత్యువు తన అలోచనలను శబ్దములద్వారా వెల్లడించుచు శ్రీ భగవాన్ వ్యాసులకుగూడ ఆ వేశమును గలిగించిన యీ యాత్మజ్ఞానమును గంభీరముగ చెప్పుచున్నాడు. ఆలోచింపగా శ్రీ వ్యాసుల వారు అట్టి దివ్య ప్రేమబోధకమైన భాగవతమును వ్రాయుటకు యీ కఠోప నిషత్తే ప్రోత్సాహము కలిగించి యుండును. కాలాంతరమున వేదాంత కవియైన వ్యాసు డిందులోని కొన్ని శ్లోకములనే తన మహత్తర జ్ఞానగ్రంథమగు భగవద్గీతయందు పొందుపఱచి యున్నాడు. ప్రస్తుతపు యీ శ్లోకములోని యర్థమే గీతలోని "మనుష్యాణాం సహస్రేషు (అధ్యా. 8 శ్లో. 3.—గీత.) అనుదానిలో ప్రతిధ్వనించుచున్నది. సాధకుడు తన అంతఃకరణములును అనుభవములును బాగుగా పరిణామము పొందినవెనుకనే, యీ యతీత ధ్యానములను పొందుట కష్టమగుచున్న దనునది ప్రతి వేదాంత శాఖలోని వారును యొప్పుకొన్న విషయమే." భారతీయ వేదాంత సాంప్రదాయములన్నిటియందును, సమస్తమైన ఉన్నత చర్చనీయాంశములలోను, జిజ్ఞాసా విషయములను మననము చేసి పరిణామము పొందిన యోచనా శక్తిలోను, అనుభవ విషయములోను, పరిశ్రమ చేసిన అర్హులైన కొందరికి మాత్రమే ఈ బ్రహ్మవిద్య నిర్ణయింపబడినదగుట సర్వజన సమ్మతమైన విషయము. ఇట్లనుటవలన బ్రహ్మవిద్య దేవాలయములోని గాలి చొఱని చీకటికోణములలో భద్రపఱుపబడిన రహస్య జ్ఞానమనిగాని యేదో అడవిలో చెట్టుక్రింద యీ యాత్మజ్ఞాన నిధిని పిశాచములవలె కాపలా కాయుచు బ్రాహ్మణులు చుట్టుముట్టియున్నారని గాని యర్థముకాదు. మరియు నుపనిషత్తులలో నున్న జ్ఞాన నిధిని సమీపించుటకు వచ్చు అమాయకములై ఆకలి గొన్న పశువులను చూచి ప్రతీకారవాంఛతో పురోహితులు కుక్కలవలె మొఱుగుచున్నారనికూడ నర్థము కాదు. ఈ నాటి పండితుడు యీ జ్ఞానమనున దొక ప్రత్యేక జాతి సర్వాధికారమని చెప్పుటకు యెన్ని తెలివైన వాదములు చేసినప్పటికినీ, అవి దైవతుల్యులైన ఆ శాస్త్రకారుల యభిప్రాయముల నన్నిటిని దూషించునవియై యున్నవి.

మన పూర్వ కర్మానుసారముగ ప్రతిఒక్కరిని జీవితములో సుఖమునుగాని దుఃఖమునుగాని అనుభవింపచేయుటకై అవకాశము కల్పించు

టకుగాను ఆ శాశ్వత శాసనము ఉండనేయున్నది. ఆవేశములో గాని యుద్రేకములోగాని నేదియు జరుగదు. ఆ శాశ్వత శాసనములో ఆక స్మాత్సంభవములు లేవు. క్షణక్షణమునకు జీవితము ముందుకు సాగి పోవును. అది తార్కికమైనది. దానిని గుఱించి నియమిత గణితమును తయారుచేయవచ్చును. ఇదిట్లుండ, మహోన్నతమై, సర్వవ్యాపియై, జీవన అస్తిత్వచక్రము సంతతము యిమిడి, దినదినము మన కనుల యెదుట మన చుట్టు వ్యక్తమై, సత్యమై, భాసించు ఆ పరమ సత్యమును గూర్చి వినవలెనని వచ్చుటకుగూడ ప్రతివారును నోచుకొనలేదు. ఈ యిరువది దినముల జ్ఞానయజ్ఞములవలన మీలో చాలమందికి యిా నే చెప్పిన విషయము ప్రచారకుని అతిశయోక్తిగా కాక యథార్థ విషయ వివరణమే యనుట వ్యక్తమై యుండవచ్చును.

ఈ మహాయజ్ఞములో పాల్గొనుటకు తమ బంధువులనుగూడ ప్రోత్స హించుచున్న విషయమును మీలో చాలమంది వచ్చి యిా సాధువునకు తెలియజేసియున్నారు కూడ. అట్లు బ్రతిమాలి తీసికొని రాబడినవారు యజ్ఞశాల ద్వారమువద్దకు వచ్చినంతనే పెట్టెకు తాళమువేయుట మఱచితి ననియో, ఆఫీసుతాళము టేబిలుమీద మఱచితిననియో జ్ఞాపకము రాగానే యుపన్యాసమును ప్రారంభింపకమున్నే యింటికి పరుగెత్తుచున్నారు.

నియమముగా నిక్కడకు ప్రతిరోజు వచ్చుచున్నవారు పూర్వజన్మమున సుకృతము చేసిన కొద్దిమందే యని నిజముగా నమ్మవచ్చును. భగవంతుని లీలలను చర్చించు భక్తుల సభకు ద్వారపాలకు డక్కరలేదు. "అర్హత పత్రము" హస్తముల ధరించినవాడే యిందులోనికి ప్రవేశింప గలుగు చున్నాడు. తానుకూడ సాధకుడైన మానవునకు యితర సాధకుల యోగ్యత లను తగినంత విషయసామగ్రి లేక నిర్ణయించుట బుద్ధిహీనతకు లక్షణము.

నీ కిష్టము వచ్చినచోట వేదాంతము నుపదేశింపుము. నీ సందేశమును అర్హత గలవాడొక్కడే వినును. ఆ శాశ్వత శాసనమే యనర్హులను తరిమి వేయుచున్నది. ఈ యుపనిషత్తును నీ కిష్టమువచ్చిన భాషలలోని కనువ దింపుము. భూమిమీద నే స్థలమునందైన వానిని పంచిపెట్టుము. కాని ఆ తగినవాడెవడో వాడొక్కడే దీనివైపు తొంగియైన చూచును.

ఈ నిగూఢమైన దస్తావేజుయొక్క రహస్యమును మానవ నిర్మితమైన రక్షణలచే రక్షించ నక్కరలేదు. ఇది ద్వేషభావముతో కనిపెట్టబడి మానవుని కామతృష్ణలను సిగ్గువిడచి ప్రకటించు యాటంబాంబు రహస్యము కాదు. బ్రహ్మవిద్య యనగా ఆ పరమసత్యముయొక్క విజ్ఞానము. ఇది మానవ మనోబుద్ధులచే పుట్టినది కాదు. మఱియు మానవునిలోని పశువాంఛలను తీర్చుకొనుటకు దీనిని కాపాడుటలేదు. కావున తనను అర్హత లేనివారి దగ్గఱనుండి రక్షించుకొనుటకు ఆ విజ్ఞానమునందే రహస్యమైన శక్తి యిమిడి యున్నది. బ్రహ్మవిద్య యెంత వినినప్పటికి దాని నర్థము చేసి కొనుటకు అంత సులభము కాదు. గంభీర సాంకేతికపదములను, వాని యథార్థభావములను గ్రహించుటకుగూడ విద్యార్థికి తగినంత అంతః పవిత్రత తత్ఫలితమగు కుశాగ్రబుద్ధి యుండవలెను. మనస్థైర్యము, బుద్ధి సూక్ష్మత మనకు హఠాత్తుగా వచ్చునవికావు. స్థిరముగా అనారతముగా దివ్య జీవితము గడపుటచేతనే యవి సిద్ధించును. ఈ యుద్దేశముతోనే మన శాస్త్రములు తక్కువ యధికారులకు కర్మోపాసనను బోధించుచున్నవి. ఇవి తక్కువ అంతస్థులలో నున్నవానిని పవిత్రులను చేసి గౌరవపఱచి సంస్కృతి గలవారినిగ తయారుచేసి అర్హతకన్న నెక్కువగ వారిని తీర్చి దిద్దుచున్నవి.

ఈ జగత్ సత్యమగు అమరత్వమును గురించిన గొప్ప భావములు, ప్రత్యక్షముగా గురుముఖతఃగాని, అప్రత్యక్షముగా గ్రంథరూపమునగాని, అవగతము చేసికొనబడినవియై, ధీయుక్తమైన ప్రతిబింబములను జీర్ణము చేసికొన్నప్పుడే, శ్రోతయొక్క హృదయమున స్థిరమైన ముద్రను వేయు చున్నవి. ఉపనిషత్పఠనము నిద్రాబద్ధకముతో చదువు అరుకానుల అపరాధ పరిశోధక నవలానుభవము వంటిదికాదు.

ఎవడు బోధచేయగలడో వాడొక విచిత్రవ్యక్తి. యథార్థములో అర్హత గల విద్యార్థు లరుదైనట్లే, అర్హతగల యధ్యాపకులుకూడ అరుదే. యథార్థ మైన గురువు సత్యముయొక్క స్వానుభవముచే గలిగిన దివ్యుడు మాత్రమే గాదు. అతడు ఉపనిషద్గ్రంథముల నన్నిటిని తఱచి చూచిన జ్ఞాననిధి కావలెను. మన పవిత్రగ్రంథమగు మాండూక్యోపనిషత్తులో

గురువుయొక్క అర్హత లిట్లు చెప్పబడియున్నవి.—"శ్రోత్రియం,—శాస్త్రజ్ఞానము కలిగినవాడు; బ్రహ్మనిష్ఠం—బ్రహ్మానుభవము గలవాడు". పండితులలో మొదటిది గలదు గాని రెండవది పూర్తిగా లోపించినదనే చెప్ప గలము. ఏలన, ఆ పరమసత్యమైన యాత్మానుభవము వారిలో లేకపోవుట యే దానికి కారణమగుచున్నది. చాలమంది సాధువులు సన్యాసులు ఆత్మానుభవము కలిగినవారైనప్పటికి దురదృష్టవశాత్తు వారిలో శాస్త్రగ్రంథముల పరిజ్ఞానముండదు. ఈ రెండు రకములవారును గురుస్థానము నాక్రమించుటకు తగినవారు కారు. ఈ యుద్దేశముతోనే మృత్యుదేవత "తగిన గురువు దొరకుట యాశ్చర్యమే" యని పలుకుచున్నాడు.

దీర్ఘజటలు గలిగి నిద్రాహారములు మాని దిగంబరుడైనవాడే గురువని యర్థము చెప్పకొనరాదు. బాహ్యవేషములు గురువుయొక్క యర్హతను తెలుపునవి కావు. జాగ్రత్త! అనేకమంది జిజ్ఞాసువులు యీ బాహ్యవేషమునకు మోసపోయి కపటసన్యాసుల వలలో చిక్కుకొనుచున్నారు.

'గ్రహించు వాడుండుట యాశ్చర్యమే'—సంపూర్ణ మానవజాతిలో నిజముగా తమ జీవితములో వాక్కునకతీతమైన అనందమును పొందు వారెంత కొద్దిమంది! వినుట కవకాశమే యరుదుగా కలుగుచున్నది. అనిన, వినినప్పటికి ఆ సూక్ష్మవిషయమును పూర్తిగా నర్థముచేసికొని జీర్ణించుకొనువారు మరియు నరుదు. విద్యార్థియొక్క సంశయములనుతీర్చి యా పరిపూర్ణతత్త్వముతో నైక్యముచేయగల గురువు అరుదైనవారిలో నరుదు. ఈ మూడు అనుగ్రహములు కలుగునంత యదృష్టశాలి యయి నప్పటికినీ గురుముఖతః శాస్త్రములు వినగనే యర్థముచేసికొని ఆత్మానుభవ మును పొందువాడు అదృష్టవంతులలో నదృష్టవంతుడు—అని మృత్యుదేవత చెప్పెను.

మిత్రులారా! అట్టి యరుదైన, కఠినమైన విషయమును మేము సాధించుటలో సాఫల్యమును పొందగలమా యని సంశయపడవలదు. ఎందుకు కూడదు? జ్ఞానయజ్ఞమును ప్రతిదినము వినువారిలో మీరు కొద్ది మంది కారా? ఈ భూప్రపంచములో నీ నిర్భాచీ స్వేచ్ఛాచారము గల రోజులలో, గుంపులుగుంపులుగా కోట్లకొలది జనులు దుఃఖములచేత కాల్చ

బడి పిశాచప్రీతిగా కన్నీరు కార్చుట లేదా? కావున యటువంటి కోట్లకొలది జనులలో జీవన విజ్ఞానమును వినుచున్న మీ కొద్దిమంది యదృష్టవంతులు కారా? నిజమైన తత్త్వాన్వేషి యెన్నడు నిరాశావాది కాకూడదు. ఎల్లప్పు డతను ఆశావాదిగనే యుండవలయును.

మీవెనుక కోట్లకొలది జనులు పరిణామ శ్రేణికయొక్క అడుగు మెట్టుమీదే యున్నారని జ్ఞాపకముంచుకొనుడు. బ్రహ్మవిద్య మానవ పశువునకు మిక్కిలి యపదు, కష్టముకూడాను. పరిణామములో మానవుడు మనుష్యత్వస్థితిలో నున్నప్పుడు జీవితలక్ష్యము సాధించుట, పరిపూర్ణత్వ దేవాలయములోనికి నడచుటకు యెన్నుకొను ప్రశ్నమిదనే యథారపతి యున్నది. కావున ఆశావాదులై యుండుడు. అట్లు కాలేకపోయిన శ్రీ చిన్మయానంద దగ్గఱనుండి దీనిని గ్రహింపుడు. "నీవు అర్హతగల యధికారివి. ఈ జన్మలోనే యీ పరమవిజయమును - భగవత్ప్రాప్తిని కొంచెము ప్రయత్నము చేసినయెడల తప్పక సాధించగలవు—జంకవద్దు—సంశయింపకుము—ముందుకు నడువుము. దానిని పొందుము."

శ్లో॥ న నరేణావరేణ ప్రోక్త ఏష సువిజ్ఞేయో
బహుధా చింత్యమానః।
అనన్యప్రోక్తే గతిరత్ర నాస్తి అణీయాన్
హ్యతర్క్య మణుప్రమాణాత్ ॥ ౮ ॥

బహువిధ చింతన చేయదగినదగుటచే ఆ యాత్మ, హీనబుద్ధులచే బోధింపబడినదై తెలిసికొనుటకు శక్యముకాదు. కాని ఆ యాత్మ బ్రహ్మైక్యము పొందిన గురువుచేత బోధింపబడినదైన దానిని పొందు విషయమై యెట్టి సందేహమును లేదు. ఆ యాత్మ అణువుకంటె అణువగుటచే కేవల వాద మాత్రముచేత సిద్ధించునది కాదు.

పూర్వ శ్లోకములో వివరించినదాని నిందుకూడ వివరించుచున్నాడు. మరలమరల దృఢపఱచుటకుగాను మృత్యుదేవత ముందు చెప్పినదాని

లోని తాత్పర్యమునే మరల నిందు చెప్పుచున్నాడు. కేవల పుస్తక పరి జ్ఞానము కాని, కేవల ఆత్మానుభవము గాని ప్రపంచమును సేవించుటకు తగిన గురువునకు సంపూర్ణ లక్షణము కావని ముందే తెలిసికొంటిమి. మఱియు శాస్త్రజ్ఞానము, ఆత్మానుభవము కలిగినవాడీ శ్రుతిమంత్రములను బోధించినయెడల సావధానియైన విద్యార్థి తత్క్షణమే యా జ్ఞానమును పూర్తిగా గ్రహింప గలుగుచున్నాడు.

ఈ శ్లోకములోని "అనన్యప్రోక్త" "గతి" అను నీ రెండు పదము లును నాలుగు విభిన్నార్థములు వచ్చునట్లు శ్రీ శంకరులు వ్యాఖ్యానించిరి.

(1) ద్వైతరహితమై అ అద్వైతస్థితిని పొందిన గురువుచేత ఈ జ్ఞానము బోధింపబడినట్లైన యా బోధలో విద్యార్థికి సంశయము లుంపనే యుండవు.

(2) విద్యార్థియొక్క ఆత్మగానే ఆ పరమాత్మ బోధింపబడినట్లయిన అచట సంశయము ఉండనేయుండదు.

(3) 'గతి' అను పదము మార్గము అను నర్థమై యుండవచ్చును. ఆ యర్థమే సరియైనదయిన ఆత్మైక్యమునుగూర్చి బోధింపబడినవానికి మరలనీ సంసారమార్గములో ప్రయాణము చేయుటయే యుండదు.

(4) "గతి" యనునది చింత (సంశయము) అనికూడ నర్థము నిచ్చుచున్నది. ఈ పైవిధముగా నర్థము చెప్పుకొన్న ఆత్మానుభవము గల గురువుచేత బ్రహ్మవిద్య బోధింపబడినచో శిష్యుని హృదయములో సందేహ లేశముండుటకు అవకాశమే లేదు.

కొంతమంది విమర్శకులు శ్రీశంకరులు తమ మతానుసారముగానే యీ యుపనిషత్తుకు వ్యాఖ్యానము చేయుచున్నారని తలచెదరు. వారి మతప్రకారము "అనన్యప్రోక్తే—గతిః—అత్ర—నాస్తి" అనుదానికి సూటియై సామాన్యమైన అనువాదము—'ఇది యితరులు చెప్పనిది, వేరు మార్గములు లేనిది'. ఈ అనువాదము చాల సులభమైనదనుట నిజమే కాని నిస్సారమును దారుణమునుకూడ నగుచున్నది.

శకుంతలయొక్క పవిత్రత, పారిశుద్ధ్యము, సౌందర్యము, మహత్త్వము స్వార్థరహితములైన ఉల్లాస విలాసాదులు చితిపై కాలి చితికిపోవు ఆమె కంకాళములో లేవు. సరిగదా! అవి మరింకెవరియందు గోచరించినను చిఱునవ్వులు నవ్వి ప్రేమపూరితమైన పులకలను కలుగజేయవు. కావున కేవల పదపదార్థానువాదము మూలములోని సౌందర్య మహత్త్వమునకు గొడ్డలిపెట్టగుచున్నది.

ఇట్టి వివిధ వ్యాఖ్యానములను యిచ్చుట వివరించుటలో గల యభిప్రాయము శ్రీశంకరులుగాని యితర వ్యాఖ్యాతలుగాని యెంత సూక్ష్మముగా మన మతగ్రంథములను పరిశీలించి పరిశోధించి ఆ పరమసత్యమును నెలకొల్పుటకు పరిశ్రమ చేసిరో, దానిని మీకు తెలియపఱచుటయే యగుచున్నది. ఆ బుద్ధిసూక్ష్మత, మనశ్శాంతి, శైలిలోని ప్రశాంతత, నిష్కాపట్యము, భక్తి విశ్వాసము లనువానిని కలిగి పరిపక్వ హృదయములు గల యా మహాత్ములు తన బల్లయొద్ద కూర్చుండి గ్రంథములలోని కెట్టి పరమార్థ విషయమును చొప్పించిరో, దానిని మనబోటివారము, ఒంటరిగా గాని నలుగురితో కలిసిగాని ధ్యానించుటనుగూడ నాశించలేకున్నాము. సూక్ష్మముగా చెప్పవలయునన్న మనము ఆ శంకరుల నిర్ణయములను యథాతథముగా గ్రహించుటయే బుద్ధికుశలత. ఈ యుద్దేశముతోనే నేడు మన మీ రెండు పదములమీద శంకరులవారి నాలుగు వ్యాఖ్యానములు వివరించుటకొఱకు మన చర్చల నింత పొడిగించితిమి.

శ్లో॥ నైషా తర్కేణ మతిరాపనేయా ప్రోక్తాన్యేనైవ
సుజ్ఞానాయ ప్రేష్ఠ ।
యాం త్వమాపః సత్యధృతిర్బతాసి త్వాదృఙ్నో
భూయాన్నచికేతః ప్రష్టా ॥ ౯ ॥

ఈ జ్ఞానము వాదములచేత పొందదగినదికాదు, కాని ఓ ప్రియమైన నచికేతా! భేదభావము లేని గురువుచే బోధింపబడిన నది సువిజ్ఞేయమగును.

నీవు దానిని పొంది ఆ సత్యమునందు స్థిరపడితివి. ఓ నచికేతా! నీవంటి జిజ్ఞాసువులు మరల మాకు లభించెదరా?

ఇంతవరకు శిష్యుని అభినందించుటలో సుద్రిక్తుడయిన మృత్యు దేవత మొదటసారిగా శిష్యుని ముఖాముఖిని అభినందించుచున్నాడు. మీది రెండుశ్లోకముల ఫలితముగా మృత్యుదేవత ఆత్మ కేవల తర్కముల చేత పొందదగినది కాదని చెప్పుచున్నాడు. ఈ కేవల తర్కవాదము ఐహిక విషయముల సరిహద్దుల వఱకు మాత్రమే పోగలదు.

అట్టి సత్య ప్రపంచము మనో బుద్ధుల కతీతమై యున్నది. ఈ కఠోపనిషత్తులోని మంత్రములను చర్చించునపుడు మనలోని సత్యము— జీవనజ్యోతి సచ్చిత్‌రూపమైన ఆత్మయే, మనో బుద్ధ్యాదులను వశమందుంచు కొని ప్రేరేపించునదని యిదివఱకే తెలిసికొంటిమి. యదార్థములో పదార్థ ములన్నియు జడములే! ఆత్మతో సంబంధము కలిగినపుడే యివి జీవితములో చలనమును పొందుచున్నవి. మనలోని యీ దివ్యతేజస్సే మనోబుద్ధులకు శక్తి నిచ్చుచున్నది. అప్పుడే అవి అనుభూతులు, కోరికలు వీనిద్వారా పని చేయుచున్నవి, కావున ఆత్మ యీ విధముగా మనోబుద్ధులకు సూత్ర ధారి యగుచున్నది. కాన యివి కేవల సాధనమాత్రములే యనియును తమకు వెనుకనున్న యీ శక్తిని గ్రహించు సామర్థ్యము వానికి లేదని స్పష్టమగుచున్నది. మనమెంత సూక్ష్మదృష్టి కలవారమైనప్పటికిని మన కండ్ల నా కండ్లతోనే చూచుకొనలేముగదా. ఎంత నీవు అలసిపోయినను నిన్నునీవే మోసుకొని ఒక్క అడుగయినను నడువలేవుకదా. ఆ విధముగానే మనోబుద్ధులు ఆత్మను, తాను, వివరించి గ్రహించువిషయముగా నొనర్చు కొనలేవు. గ్రహించి, వివేచించు మనోబుద్ధులనుండి ఆత్మ వేఱుపడ్డచో అప్పుడవి జడములై మృతప్రాయములగును. కారును నడపు డ్రైవరు తన కారునే తనమీదికి నడుపుకొనలేడుకదా! కారు నాపి ముందరి చక్రముల వద్దకు వెళ్లుసరికే చక్రములు ఆగిపోవును. అవిధముగానే, బుద్ధికి శక్తినిచ్చి నడిపించు ఆత్మ తన స్థానమును వదలి, ముందు నిలవగానే మనోబుద్ధులు పని చేయక నిలచిపోవును. అనగా నవి ఆత్మను గ్రహించి వివేచింపలేవు.

కాబట్టియే మృత్యుదేవత ఆత్మజ్ఞానమును తర్కవాదముతో తెలుసుకొనలేమని చెప్పుచున్నాడు.

మనోబుద్ధులను యీ సాధారణ జ్ఞానసాధనము లా పరమాత్మను తెలుసుకొనలేకపోయినంత మాత్రమున, అదేదో తెలియరానిది, కోరరానిది, అందనిది, అయిన విషయమునుగూర్చి యీ వేదాంతము చర్చించుచున్నదని మనము నిర్ణయించకూడదు. సర్వవ్యాపి యైన యీ దివ్యతత్త్వమును గూర్చి తమ సన్నిహిత స్వానుభవమును వ్యక్తపఱచిన గ్రంథములే వేదముల కంతమైన యీ యుపనిషత్తులు.

మానవాకారులై భగవత్స్వరూపులైన మహాత్ములు యీనాటి చరిత్రలో కూడ మనకు సమకాలీనులుగా జీవించుచున్న విషయము అందరెఱిగినదే.

ఈ ఆత్మజ్ఞానము దుష్కరముగాదు. పైగా దానిని తెలిసికొనుటకు మనకు జన్మసిద్ధమైన యధికారమున్నది. ఉత్తమమైన మానవ జీవితము దీనిని తెలిసికొనుటవలననే సఫలమగుచున్నది. ఈ చిన్న పరిధినుండియే పవిత్రతను, శాస్త్రీయపద్ధతిమూలముగా భగవంతుని ఆకారమును, శక్తిని, బుద్ధిని సంపూర్ణత్వమును పొందుచున్నాము. మొదట తెలిసికొని తుదకు యేతత్ స్థితిని పొందుటయే జీవన పరిణామము. మానవున కొక్కనికే యిట్టి సాధనములు కలవు కావున యతడు తనంతట తానే వానిద్వారా ప్రకృతిసహాయము లేకుండ శీఘ్రముగా నా స్థితిని పొందగలుగుచున్నాడు. ఈ జ్ఞానమే బుద్ధిగమ్యమైనదైనచో ఆ సత్యము బుద్ధిచేత పొందరానిదని చెప్పు మృత్యుదేవత వాక్యములలోని యభిప్రాయమేమి? ఈ బుద్ధియొక్క అశక్తత శ్లోక ప్రథమపాదమందలి రెండవభాగమున ఉక్తమైనది. అది అనేక విధములుగా నాలోచింపదగినది. ఈ వేదాంతక్షేత్రములో మనస్థూలబుద్ధిని మాత్రమే యుపయోగించి పరిశీలించినచో నీ ప్రశ్నపై వివిధములైన నిర్ణయములు గోచరించును.

అన్ని పరీక్షలకు వేదాంతజ్ఞానబోధకు నర్హుడగుటచేతనే మృత్యుదేవత తన ప్రథమోపన్యాసమును ప్రారంభింపక పూర్వమే యిట్లు చెప్పుచున్నాడు: "నీవు నీ లక్ష్యమగు బ్రహ్మవిద్య నిదివఱకే పొందితివి."

ఆత్మజ్ఞానమును పొందుట కంతశ్శుద్ధి కలుగుటయే యాలస్యము. అది కలిగి నియమవంతుడయినయెడల దివ్యానుభవ సామ్రాజ్యములోనికి మౌనముగా నాత్మను తెలిసికొనుటవలన మెల్లగా ప్రాకుచున్నాడు. కరుణార్ద్ర హృదయుడైన ఆ యమధర్మరాజుయొక్క హృదయకుహరమునుండి "నీవంటి జిజ్ఞాసువులు మాకింకను కలుగుదురుగాక" యన్న ప్రార్థన బయటికి వచ్చెను." ప్రచారముచేయ పట్టుదల గల ప్రతి గురువుయొక్క తీవ్రమయిన కోరికయే యిది. ఇట్టి ఆదర్శదృష్టితో నవలోకించిన గురువులే అరుదుగా కన్పింతురు. ఇట్టి స్థితి గురువర్గమునకే గాక శిష్యజాతికికూడ చాల విషాదకరమైన విషయము. ఇవి యెక్కువ జీతముకొఱకు స్కూల్ మాష్టర్లు సమ్మెకట్టు రోజులు కావున జీతములు కట్టు విద్యార్థులే గురువునకు యజమాను లగుచున్నారు. తమ కర్థము గానట్లు బోధించి చిక్కులలోనికి దింపు గురువును తక్కువగా జూచుట విద్యార్థులకు సహజమేకదా!

శ్లో॥ జానామ్యహం శేవధిరిత్యనిత్యం నహ్యధ్రువైః
ప్రాప్యతే హి ధ్రువం తత్ ।
తతో మయా నచికేత శ్చితోఽగ్నిరని త్యై
ర్ద్రవ్యైః ప్రాప్తవానస్మి నిత్యమ్ ॥ ౧౦ ॥

ఆ స్థిరమైన యాత్మ యీ యస్థిరములైనవానిచే పొందబడదని నాకు స్పష్టముగా తెలుసును. నేను "శేవధి" (నిధి) అనిత్యమని తెలుసుకొన్నాను. అయినప్పటికి నాచే నచికేతాగ్ని వేల్వబడినది. దాని చేతనే ఈ నిత్యత్వమును పొందియున్నాను.

ఇట్లు విద్యార్థిని ప్రశంసించుటలో మృత్యుదేవత తన యజ్ఞానమును జ్ఞప్తికి తెచ్చుకొని పొల్చుకొనుచున్నాడు. ఇప్పుడు క్రొత్తగా జ్ఞానము కల్గుటచే నా యపరాధమును సరిదిద్దుకొనినప్పటికి, తాను పూర్వము చేసిన కర్మల ఫలముగా కొంత బాధపడవలసినవా డగుచున్నాడు. తనకు "నిధి" యొక్క అనిత్యత్వమునుగూర్చి తెలియును. కర్మ అనిత్య పదార్థముల ద్వారానే చేయబడును. అనిత్య వస్తువులచే చేయబడిన కర్మలయొక్క ఫలములుగూడ ననిత్యములే గదా! మట్టిముద్దనుండి బంగారు నగను

చేయుచలచుట వ్యర్థప్రయత్నమే గదా! మానవుడు అనంతానందమును కోరువాడై శ్రేయోమార్గము నవలంబించి శాస్త్రోద్దిష్టములైన యాగాది కర్మలు చేయుచున్నాడు. స్వర్గీయానందముకూడ ఆ నిత్యవస్తువుతో పోల్చి నప్పుడు అశాశ్వతమే యని మృత్యుదేవత సూచించుచున్నాడు.

అహంభావపూరితులగు జీవులు మానవులుగానున్నప్పుడు తామున్నత పదవులు పొందుటకై ఆశతో తగిన కర్మలనుచేసి వానికి తగిన జీవితమును గడపిరి. కావున, నా కర్మఫలము ననుభవించుటకొఱకు, వేదకాలములో వారు మూర్తరూపములో భావించుచున్న యీ అగ్ని, వాయు, ఇంద్ర, సూర్య, చంద్ర, వరుణాది దేవతల పదవులు వారికివ్వబడుటచే వారీనాడు ఈ రూపములనుదాల్చి ఆయా పదవులను స్వీకరించిరి. అనగా పూర్వము మానవులు ఇంద్రాది దేవతల పదవులను కోరినవారై వానికి తగిన యజ్ఞ యాగాది కర్మలను చేసెడివారనియు, ఆ యాగాది కర్మల ఫలితముగానే వారు ఆయా దేవతలపదవులు పొందగలిగిరనియు తాత్పర్యము. ఇదియే సమస్త వేదాంతులకును ముఖ్యముగా వైశేషిక మతస్థులకు గల గట్టి నమ్మకము. ఇట్టి విశ్వాసమునకు అధికారపూర్వకమైన కారణము చెప్పువాడై మృత్యు దేవత తాను మానవుడుగా నున్నప్పుడీ నచికేతాగ్నిని వేల్చితినని దాని ఫలి తముగానే యిప్పుడీ మృత్యుదేవతయొక్క ఆసనమును స్వీకరించ గలిగినా నని చెప్పుచున్నాడు.

"నేనీ నిత్యపదవిని పొందితిని" ఇచట నిత్యమనగా సంబంధార్థ కము. మానవులతో పోల్చిన యీ పదవి నిత్యమైనదే అనగా నిత్య మృత్యువుగల మర్త్యులతో పోల్చిన ప్రళయకాలమువఱకు శాశ్వతముగా స్థిర ముగా నుండు మృత్యుదేవతయొక్క జీవితము నిజముగా నిత్యమేగదా!

మృత్యువు తాను మర్త్యుడుగా నుండి యీ నచికేతునివలె తత్త్వా న్వేషుడై యున్నయప్పటి తన యభిప్రాయములను, ఇప్పటి యీ వివేక వైరాగ్యములతో గూడిన నచికేతునితో పోల్చుకొని, తన హృదయపూర్వక మైన ప్రశంసలను వెల్లడించుచున్నాడు.

మాక్సుముల్లరు, హ్యూము, మొదలగు కొంతమంది వ్యాఖ్యాతలీ శ్లోకమును నచికేతుడు చెప్పినట్లు వ్యాఖ్యానించి యున్నారు. కాని నచికే తాగ్నిని నచికేతు డప్పుడే తెలుసుకున్నాడు గాబట్టి వారి మత మెంతమాత్ర మంగీకార్యము గాదు.

శ్లో॥ కామస్యాప్తిం జగతః ప్రతిష్ఠాం క్రతోరానన్త్యమ్
అభయస్య పారమ్ ।
స్తోమ మహదురుగాయం ప్రతిష్ఠాం దృష్ట్వా
ధృత్యా ధీరో నచికేతోఽత్యస్రాక్షీః ॥ ౧౧ ॥

కామములయొక్క లాభమును, జగదాధారమును, అంతులేని యాగ ఫలములను, భయరహితములైన యావలిఒడ్డును, గొప్పదై, సర్వవ్యాపియై, మహద్రూపమైన ప్రతిష్ఠ గలిగియుండుటను, మొదలైనవన్నో పొందగలిగి గూడ, ధీరుడవైన యో నచికేతా! అన్నిటిని వివేచన గలవాడవై ధైర్యముతో త్రోసివేసితివి.

ఈ ఆదర్శ విద్యార్థియందలి సుగుణము లనంతమై, యెడతెగని ప్రశంసా పాత్రములై యున్నట్లు తోచుచున్నది. గురువులో నుత్సాహము పెరిగినకొలది యతడు యీ ఆదర్శ వేదాంతవిద్యార్థియొక్క సుగుణములనధికాధికముగ కీర్తించుచున్నాడు.

సమస్త మానవులకు హిరణ్యగర్భ లేక బ్రహ్మలోకము లక్ష్యముగా నున్నది. మహత్తత్త్వము లేక కేవల బుద్ధిగ్రాహ్యములైన యిట్టి అనంతానందము కలిగి పరిపూర్ణతకు స్థానమైన బ్రహ్మలోకమునుండి ఉపాసకుడైన మానవుడెవడును దూరముగా పోలేడు. అనగా ధైర్యముతో బ్రహ్మలోక వాంఛనుండి తొలగలేడు.

యాగములను చేయు ప్రతివానియందును మనము వివేచించి చూచిన యెడల మానసికముగ బ్రహ్మలోక వాంఛ యుండును. అక్కడ కొంత కాలముండి ప్రళయకాలమందు కైవల్యమును పొందుదురు. అనగా నింద్రియములచే అనుభవింపదగిన సూక్ష్మాతిసూక్ష్మానందములను గూడ పొందగలుగు ఆ బ్రహ్మలోకమునుగూడ తిరస్కరించు తన శిష్యుని చూచి మృత్యుదేవత నిజముగా నాశ్చర్యయుత మానసుడాయెను. ఈ శ్లోకములోని విశేషణములన్నియు ఆ హిరణ్యగర్భస్థితిని వర్ణించునవియై యున్నవి.

జగదాధారము—హిరణ్యగర్భలోకమే అవ్యక్తమునుండి వ్యక్తప్రపంచమునకు వచ్చునపుడు మొదట వెలువడిన వ్యక్త సృష్టి—దీనికి ఉపమానముగా విత్తనములోనుండి మొట్టమొదట చెట్టుగా పెరుగుటకు ముందుగా ఏ మొలక మొలచునో అదియే మహత్తత్త్వమన వచ్చును. ఆ మొలక మిగిలిన వృక్షమున కెట్లాధారమో అట్లే హిరణ్య గర్భస్థితి విశ్వవ్యాపియైన యీ స్థూలసృష్టికి నాధారము. అనగా ఆధ్యాత్మిక అదిభౌతిక, అదిదైవికమైన సమస్త ప్రపంచములకును యీ హిరణ్యగర్భుడే యాధారము.

"ఉరుగాయం—సర్వవ్యాపి" ఈ పదము ఋగ్వేదములో సోమునికి విష్ణువుకు దూరవ్యాపియై విశాలారంభము గల ఉపస్సుకు విశేషణముగా నుపయోగింపబడినది. శ్రీశంకరమత ప్రకారముగా హిరణ్యగర్భ మనగా మహత్తత్త్వమని అర్థము చెప్పకొనవచ్చును. "హిరణ్యగర్భ" యనునది మొట్టమొదట ఋగ్వేదములోనిసృష్టిసూత్రమున సృష్టిక్రమములో ముందుగా నుద్భవించినదని వర్ణింపబడినను, యీ యభిప్రాయము తొలి యుపనిషత్తులలోదైన శ్వేతాశ్వతరోపనిషత్తు కాలమనగా వేదాంత కాలములో అభిప్రేతమైనంతగా అభివృద్ధి పొందలేదు. మన మీ యుపనిషత్తులకన్న కఠోపనిషత్తు తరువాతిదన్న శంకరమతములోని యీ యభిప్రాయము కాలవ్యతిక్రమముగా గ్రహింపవచ్చును.

"తెలివైనవాడవగుటచే నీవు వానిని తిరస్కరించితివి"—ఇక్కడ మృత్యుదేవత తన శిష్యునిలో చూచిన వివేక వైరాగ్యములను ప్రశంసించుట స్పష్టముగా తెలియుచున్నది. యథార్థ తత్త్వాన్వేషియైన నచికేతుడా పరమ సత్యమును తెలిసికొని పొందగోరుచున్న వాడగుటచే మృత్యుదేవత చూపు వ్యామోహములన్నియు నతనికి విసుగెత్తించుచున్నవి. స్వర్గీయానందములను కూడ నతడు తిరస్కరించుచున్నాడు.

7-11 శ్లో॥ ఆ పరమసత్య మాశ్చర్యకరమైనది. అది గ్రంథ పఠనముచే అర్థమవునదికాదు. యథార్థ గురువుయొక్క ఆవశ్యకత వివరింపబడినది. యముడు నచికేతుని తన శిష్యునిగా అంగీకరించుచున్నాడు. గురువును మించిన వైరాగ్యము గలవాడగుటచే శిష్యుని ప్రశంసించుచున్నాడు.

శ్లో॥ తం దుర్దర్శం గూఢమనుప్రవిష్టం గుహాహితం
గహ్వరేష్ఠం పురాణం ।
అధ్యాత్మయోగాధిగమేన దేవం మత్వా ధీరో
హర్షశోకౌ జహాతి ॥ ౧౨ ॥

ధీరుడైన మహర్షి తన ఆత్మధ్యానమువలన పురాణమై, చర్మ చక్షువున కగోచరమై, హృదయకుహరమందు గుప్తమై, సంసారబంధమున చిక్కుకొని బుద్ధిమధ్యస్థుడై యున్న ఆ పరమాత్మను కనుగొని హర్ష శోకములను త్యజించుచున్నాడు.

హిరణ్యగర్భ స్థితిని త్యజించిన తరువాత తత్త్వాన్వేషియొక్క మనస్సు దేనియందు లగ్నము కావలెను? ఎచట మిక్కిలి అధికమైన పరిపూర్ణత్వమును పొందగలుగుదుమో అట్టి సూక్ష్మతరమైనది ఏదైన కలదా? కఠోపనిషత్తు పాఠము ననుసరించు ప్రతివిద్యార్థికి పైప్రశ్నలు కలుగుట సహజమే. ఈ ప్రశ్నలకు గురువుయొక్క జవాబుగా యథార్థమైన ఉపనిషద్భాగము ఈ శ్లోకమునుండియే ప్రారంభించుచున్నది. ఈశ్లోకముతో పరిపూర్ణతత్త్వము యొక్క సిద్ధాంతము, శాస్త్రముయొక్క చర్చకూడ ప్రారంభమగుచున్నది.

ఈ వాక్యములో మృత్యుదేవత మహత్తత్త్వముకంటె సూక్ష్మమైనది నిత్యసత్యమైనది ఒకటున్నదనియు, తత్త్వాన్వేషి దానిని కనుగొని 'అయం అహం అస్మి'—ఇది నేను అవుచున్నాను' అనుదానిని సమీప సంబంధ స్వానుభవముచే తెలిసికొనుచున్నాడు, అనియు చెప్పుచున్నాడు. సర్వాత్మ స్థితమగు నిత్యసత్యమైనది ఏది ఉన్నదో దానిని ఈ శ్లోకములోని విశేషణములు వర్ణించుచున్నవి.

పురాణం—ప్రాచీనమైనది. దేహమనోబుద్ధులను, ఇంద్రియములను వశముచేసికొని ఆడించునట్టి ఏ పరమాత్మగలదో, అది ఎప్పుడూ జాతము కాకపోవుటచే ప్రాచీనమే అగుచున్నది. ఘటాకాశము మహాకాశము ఒకటే అయినట్లు, మధ్యను ఘటమున్నను పోయినను ఆకాశమునకు నష్టము

లేనట్లు ఆ సచ్చిదానందము పుట్టలేదు చావనుచావదు. అట్టి జన్మజరామరణ రహితమైన ఆత్మనే 'పురాణము' అని చెప్పవచ్చును.

దుర్దర్శం—చూచుటకు శక్యము కానిది. జరామరణములు గల భౌతిక విషయములకు ప్రాణమిచ్చునదై, వాటిచే ఆవరింపబడినట్లు కన బడునదై, బుద్ధినికూడ వశపరచుకొనిన ఆ సత్యమును నేత్రేంద్రియము గ్రహించజాలదు. నేత్రము కేవలము సాధనముగుటచే దానికంటె ఇతరమైన విషయమునే చూడగలదు. ఆ కన్ను తననే తాను చూచుకోలేదు. దూర దర్శినీయంత్రముద్వారా చూచువాడు ఇతరములను చూచునట్లు దాని ద్వారా ఆ కంటినే చూడలేడు కదా! ఇట్లు ఆత్మ నేత్రేంద్రియ గ్రాహ్యము కాదనుటచేత, ఇతర ఇంద్రియములచేత, మనోబుద్ధులచేత అనుభవించి గ్రహింపబడుటకు ఒక విషయము కాదని శ్రుతి చెప్పుచున్నది.

సంగ్రహముగా చెప్పదలచిన, ఇంద్రియములద్వారా విషయములను గ్రహించునట్లు, మనస్సుద్వారా అనుభవించునట్లు, బుద్ధిద్వారా తెలిసికొను నట్లు, అదే విధముగా వీనిద్వారా ఈశ్వరదర్శనము లేక సత్యజ్ఞానము కలుగదు. అనుభవించువానికి తన ఆత్మవలెనే ఆ సత్యముకూడ ఆత్మాను భవ పూర్వకముగానే తెలియవలసియున్నది.

గూఢమనుప్రవిష్టం—ఏకాంత స్థితియందుండునది. సర్వవ్యాపియైన ఆత్మకు లోని ఏకాంతస్థితిలో నున్నదని పరిమితి కల్పించుట నిజముగా ఆత్మ లేదనుటయే. కాని మృత్యుదేవత నాస్తికుడు, దైవదూషణ చేయువాడు, కాడు. శ్రుతికూడ 'ఇంగర్‌సాల్' (Ingorsol) యొక్క రచనకాదు. ఈ విశేషణమువలన ఆత్మ బాహ్యప్రపంచమునందు లేదనికాదు కాని అది మనలోని సూక్ష్మాతిసూక్ష్మమైన సూత్రము లేక సిద్ధాంతము అని ఇచట శ్రుతి యొక్క తాత్పర్యము.

స్థూలభౌతికావరణము రక్తమాంసాదులతో కూడిన దేహము. అదియే అన్నిటికంటె స్థూలముగా కనబడు ఆవరణ. అందులో ప్రాణకోశమున్నది. ప్రాణము ఆకారములో పదార్థముకన్న సూక్ష్మమైనదని మనకు తెలిసినదే. సూక్ష్మత ఎప్పుడు దాని వ్యాపకత్వము నుద్దేశించి కొలువబడుచున్నది.

ప్రాణముకంటె సూక్ష్మమైనది మనస్సు. ప్రాణముచేత కలిగిన విఘాతములు, శరీరముకంటె అధిక భాగమును ఆవరించియున్నయెడల మనస్సుచేత సృష్టింపబడిన విఘాతములు అంతకంటె ఎక్కువ స్థలమును ఆవరించును. కావున మనలో ప్రాణము ఆవరించిన స్థలముకంటె మనస్సు మరికొంచెము సూక్ష్మప్రదేశమును ఆవరించియున్నది. అనగా ప్రాణమయకోశములో మనోమయకోశమున్నదని యర్థము. ఈ మూడింటితో పోల్చి చూచిన విజ్ఞానమయకోశము మరియు సూక్ష్మతరమైనది. దానికంటె సూక్ష్మతమమైనది ఆనందమయకోశము.

ఆత్మలేక ఆ దివ్యజ్యోతి ఈ పంచకోశములను వశమందుంచుకొని వానికి శక్తినిచ్చి నడపించుచున్నది. కావున అచేతన పదార్థములను చేతనములుగా చేయు ఇట్టి ఆత్మ నిజముగా సూక్ష్మాతిసూక్ష్మమైనదే. అది మనలోని పవిత్రాతిపవిత్రమైన స్థానములోనున్నది. ఈ ఉద్దేశముతోనే శ్రుతి ఆత్మ ఏకాంతస్థలమందున్నదని చెప్పుచున్నది. ఇది నీరు మంచులోను ఆవిరి జలములోను ఉన్నదని చెప్పుటతో సమానముగా నున్నది.

నిహితంగుహాయాం—వేదములు సమ్మతించిన సనాతన ఆర్యుల యొక్క మతము. ఆ ఆత్మ హృదయకుహరములో నున్నదనుట ఈనాడు కూడ అంగీకరించిన విషయమే. చూచునదే నమ్ముట అను మతము గల సూక్ష్మదర్శినితో చూచు వైజ్ఞానికి బుద్ధి బుఱ్ఱలోఉన్నది అనునది సిద్ధాంతమగుటచే ఈ పైవాక్యము అసంబద్ధముగా తోచవచ్చును. కాని మనము ప్రయోగశాలనుండి గ్రంథాలయమును ప్రవేశించి ఆ మహాకవులు బుద్ధిని గుఱించి చెప్పినవారి అభిప్రాయములను వినినయెడల, అవి చాల విభిన్నముగా నుండును. మార్దవానుభూతిరహితమైన బుద్ధి పశుత్వమునకు దారి తీయునని తెలుపుటకు అమరకవి షేక్స్పియరు తన నాటకములో మరువరాని పాత్రలయొక్క హాస్యచిత్రణద్వారా తెలిపియున్నాడు.

కవులు, పండితులు, చింతకులు, వేదాంతులు, చూడగా ఒక్క వైజ్ఞానికులు తప్ప మిగత అందరు హృదయమాధుర్యముతో బుద్ధి సమ్మేళనము చెందినపుడే శాశ్వతమైన యోచనలు ఉద్భవించునని ఏకగ్రీవముగా ఉద్ఘోషించియున్నారు.

ఈ ఆధ్యాత్మిక ఆత్మాన్వేషణలోకూడ ఈ బుద్ధి హృదయభావములతో ఏకీభవించిననే ఫలము చేకూరును. బుద్ధి హృదయకుహరమున నివసించుచున్నదని ఆత్మజ్ఞానము బుద్ధి హృదయములయొక్క అనంవయుతమగు సంయోగమున చేకురుననుటయే వేదములన్నియు ఒప్పుకొనిన సత్యము.

గహ్వరేష్ఠం—దుఃఖకరమైన పరిసరముల నడుమ నుండునట్టిది. మాయామోహితుడై తన కామక్రోధాదులకు, ఆశాప్రతీక్షలకు నీచమైన వ్యతిరేక గుణములగు అసూయా ద్వేషములకు, లొంగి బానిసజీవితము గడపువానికి హృదయకుహరము ఎల్లప్పుడును వెఱ్ఱినెత్తించు యోచనలతో కూడుకొనియుండును. వీటిమధ్య సంసారియొక్క బుద్ధి ఎక్కువ పనిచేసి అలసి, సొలసి, ఊనమైనదై ఆ నిత్యసత్యమును - ఆత్మస్వభావమును ఆలోచించి తెలిసికొనుటకు సమర్థము కాకున్నది. కావుననే ఈ పదము—'గహ్వరేష్ఠం' అనునది యుక్తముగానే ఉపయోగింపబడినది.

ఇట్లు గ్రహించ శక్యముకానిది తెలిసికొనుటకు వీలులేనిది అయిన యెడల, అట్టి ఆత్మస్థితిని పొందుటకుగాని, తెలిసికొనుటకుగాని శక్యము కాదని ప్రకటించుట కాదా? కాని భారతీయ వేదాంతి జీవితమును అనుభవము లేక కేవల దర్శించుటతోనే తృప్తిపడడు. హైందవతత్త్వమునకు వ్యవహార రూప ఆకాంక్షలకు తగినట్లు ఆర్యులు 'జీవితమార్గము' అను దానిని ప్రకటించి సర్వసంపూర్ణమైన ఆత్మస్థితిని అనగా దైవత్వస్థితిని అనుభవపూర్వకముగా సూచించియున్నారు. అదియే ఈ శ్లోకములో సూక్ష్మముగా ప్రకటింపబడినది.

అధ్యాత్మ యోగ - ధ్యాన విధానము. ఈ ఉపనిషత్తులో ఈ పదము ఈ ఒక్కచోటనే ప్రయోగింపబడినది కాబట్టి దీనిలో యముని ఉద్దేశ మేమో తెలిసికొనుట కష్టము. సంపూర్ణ ఉపనిషత్తులోను 'యోగ' అను పదమును సూచించు అవకాశము కలుగుటకు ఇదియే మొదటిసారి. 'యుజ్ -(కలుపుట, ఐక్యపరచుట) ధాతువు నుండి 'యోగ' అను పదము వచ్చినది. తొలి కాలములో ఈ ధాతువుయొక్క యుపయోగము అశ్వములనుగాని ఎడ్లనుగాని పూన్చుట యను అర్థములో ఉపయోగింపబడినది. తరువాత

కాలములో ఈ పదము సంపూర్ణ శాస్త్రముగా మారి దేహముయొక్క అయాసము లేక క్రమశిక్షణ అను అర్థము గలదైనది. మనస్సుయొక్క శిక్షణ అను అర్థములో ఏకాగ్రత లేక ధ్యానము కలిగియుండుట కావున శ్రీ శంకరులవారు ఈ రెండర్థములను జతపరచి 'యోగ' అనగా గాఢ ధ్యానము, లేక సమాధానము అనియు, దానిచేత బాహ్యవిషయములనుండి మనస మనస్సును మరల్చుట అనియు వివరించిరి.

ప్రారంభదశలో కఠోపనిషత్తులో ఉపయోగింపబడిన యోగము ధ్యానమను సానుకూలమైన అర్థము కలదగుచున్నది. కాని తరువాత చరిత్రలో అనగా పతంజలి యోగ శాస్త్రములో ఈ పదమునకు బలవంతముగా ఇంద్రియనిగ్రహమనియు, శారీరక క్రియలనుండి క్రూరముగా విరమించుట యనియు అర్థమున్నది.

ఆత్మ పవిత్రీకరణము అను ధ్యానముద్వారా అలభ్యమైన ఆ ఆత్మ జ్ఞానము లభ్యమగుచున్నది. ధ్యానము ఒక సాధన. దానివలన మనస్సు పవిత్రమై తత్ఫలితముగా ఏకాగ్రత కలిగి, ఆత్మభావము మరియొక విషయ చింతనయందు సంచరించక, ఆత్మయందే కేంద్రీకృతము కాగలదు. వ్యతిరేక భావములనుండి విడివడి నిర్మలమైనది అయినప్పుడే ధ్యానియొక్క మనస్సు ఆత్మయందే కేంద్రీకృతమై ఇతర విషయ వ్యాపారములనుండి తొలగి, విజయవంతము కాగలదు.

సత్య ప్రకృతియందు ధ్యానము చేయు ధ్యాని, తన పవిత్రానుభవములో, దైవత్వానుభవము కలిగినటుల తెలిసికొనుచున్నాడు. సాధారణముగా బాహ్యవిషయములను తెలిసికొని వాటిని పొందుటకు చేయు సాధన పద్ధతులకంటెను, ఆత్మను తెలిసికొను పద్ధతిలో, ఒక ప్రత్యేక విశేష సాధన గలదు. ఆత్మజ్ఞానముకొఱకు చేయు గంభీరచర్చలనెడి దళసరి పొరల క్రింద, ప్రచ్ఛన్నముగా అణగియుండు అంతః ప్రేరణా శక్తులను ఆ విశేష సాధనచేత అభివృద్ధిపఱచుకొనవచ్చును. ఆత్మతో సంబంధము కలుగ జేయు ఇట్టి పద్ధతినే ఇచట "అధ్యాత్మ యోగము" అను పదము వ్యక్త పరచుచున్నది.

ఈ సత్యము ఇంత సూక్ష్మమై, దానిని సాధించు పద్ధతి ఇంత తికమక గలదై, సాధించు అవకాశములు అరుదై, విజయము సాధించినవారి సంఖ్య అల్పమై యున్నప్పుడు, హిమాలయ పర్వత ప్రాంతారణ్యాము లలో కష్టములకోర్చి, దేహమును శుష్కింపజేసి, అగ్రాహ్యాములును ఊహామాత్రమునైన భావములను మాత్రము మననముచేయుట వెఱ్ఱి తనము కాదా !

అవును—ఇంతకంటె ఇచటనే చెమట యూడ్చి పరిశ్రమ చేసి, ఏడ్చి కన్నీరు కార్చి, నిట్టూర్చి నవ్వి, నృత్యము చేసి ఆనందించియుండుట చాల మేలు కదా! ఇటువంటి ప్రశ్న వేయువాడు ద్విపాద పశువుకంటె మేలు కానిచో వానికి చెప్పదగిన జవాబు ఏదియు లేదు. ఎటువంటి అపరిణత మతముకూడ ఇటువంటి నీచ నర కీటకమునకు జవాబు చెప్పలేదు. ఇంక సంపూర్ణ మానవుని దైవత్వమునకు చేర్చు మతములో పరమావధియైన వేదాంత బ్రహ్మవిద్య అట్టి మానవ కీటకమునకు ఎట్లు సహాయపడగలదు! కాని ఈ ఉపనిషత్తు వివేకముగా జీవనము గడపి, ఈ సంసారము కందిరీగ పుట్టవంటి దోషములను, దుఃఖములను, అంతము లేని బాధలను మాత్రమే ఉత్పత్తి చేయుగలదని తెలిసికొని, ప్రశ్న వేసిన జిజ్ఞాసువునకు మాత్రమే ఉద్దేశింపబడినది. అనగా అట్టి సాధకులు ఈ అధ్యాత్మ యోగమును అను సరించినచో దాని ఫలమగు ఆత్మజ్ఞానమును పొందగలరని ఈ శ్లోకము ప్రకటించుచున్నది. శీతోష్ణములు, సుఖ దుఃఖములు, జయాపజయములు, నిందాస్తుతులు మొదలగు ద్వంద్వములతో సంసార సమర సంబంధమైన ఆయుధాగారము నింపబడి యున్నది. దైవత్వమును, జ్ఞానమును అనుభ వించి, ఆత్మపరిపూర్ణత నొందిన ఋషి, మనోగమ్యములైన ద్వంద్వములకు తానే జ్ఞాతయై, తేజస్స్వరూపమై, జీవితములోని వివిధానుభవములకు కేవ లము ప్రేక్షకుడుమాత్రమే అగుచున్నాడు. క్షణ క్షణమును కలుగు అను భవములలో గల క్రౌర్య—దౌష్ట్యములకు అతీతుడై అతడు పైకి లేచు చున్నాడు. మరియు తన సాన్నిధ్యముచేతనే ప్రపంచమును అను గ్రహించి జీవింప జేయుట దైవ-మానవునియొక్క మహత్త్వమును ప్రకటించుచున్నది.

శ్లో॥ "ఏతచ్ఛ్రుత్వా సంపరిగృహ్య మర్త్యః ప్రవృహ్య
ధర్మ్యమణుమేతమాప్య ।
స మోదతే మోదనీయం హి లబ్ధ్వా వివృతం సద్మ
నచికేతసం మన్యే ॥ ౧3 ॥

"సమస్తమైన ఆనందములకు కారకమైన ఆత్మనుగూర్చి విని, దానిని అర్థముచేసికొని ధర్మరూపమైన ఆత్మను సంగ్రహించి, అణురూపమైన ఆత్మను పొందుటచేత, అతడు సర్వసంపత్కరుడైనాడు. నచికేతునికి ఆ బ్రహ్మసదనము సంపూర్ణముగా తెలియబడినదని తలచెదను."

ఆ పరమాత్మను నిర్వచించుటకు శక్యము కాదు. నిర్వచించుట యనిన భగవంతుని తక్కువపఱచుటయే. అతడు అనంతుడగుటచేత ఆద్యంతములు గల ఈ భాషలోని పదములు అతనిని స్పష్టపఱచలేవు. అయినప్పటికిని ఈ ఉపనిషత్తులయొక్క విషయము ఆ నిత్యసత్యమే అయిఉన్నది. ఇది విరుద్ధమైన మాట కాదు. ఆ సత్యమును నిర్వచించుటను గాని, వివరించుటను గాని ఈ ఉపనిషత్తు చేయుటలేదు. తత్త్వాన్వేషికి లేక సాధకునకు సాధించు విధమును మాత్రమే ఇది చెప్పుచున్నది. దానిని స్వేచ్ఛగా తన కనుకూలమైన మనోబుద్ధుల సహాయముతో అనుసరించిన సాధకుడు ఆ సత్యాత్మను అనుభవించ గలుగుచున్నాడు. యథార్థానుభవములను సమగ్రముగా వ్యక్తపఱచుటకు భాష చాలదు. నేను అమెరికాకు వెళ్ళి అచట నా స్నేహితునికి లడ్డును వర్ణింపదలచినచో, ఏదో బాహ్యాకారమును లక్షణములను చెప్పగలను కాని మన దేశపు ఆ లడ్డును నోటిలో వేసుకొన్న రుచియొక్క అనుభవమును యథాతథముగా వర్ణించలేనుకదా!

పై శ్లోకములో చెప్పబడిన సిద్ధాంతములను శ్రద్ధగా విని, అర్థము చేసికొని సరిగా ధ్యానము చేసినయెడల, సాధకుడు ఆత్మానుభవమును పొందగలుగుచున్నాడని మృత్యుదేవత ఈ శ్లోకములో చెప్పుచున్నాడు. మనలోని నిజమైన సారమే ఆ విశ్వవ్యాపి యగు ఆత్మ అని తెలిసినతరువాత, మనలోని

మాయామోహములు వానియంతట అవియే తొలగిపోయి ఆ ఆత్మయందే మనకు నిజమైన సంసక్తిని కలుగజేయుచున్నవి.

ఇంతవరకు స్వప్నావస్థలో నుండుటచే మనము మర్త్యుల మనుకొనుచున్నాముగాని, నిజముగా మనము ఆ పరమాత్మయే యని తెలిసికొన్నచో మనమానందించుటయే గాక సమస్తపరిమితులను దాటి, కన్నీరు, నిట్టూర్పు నిరాశలు లేని స్థితిని పొందుచున్నాము. మోదనీయం హి లబ్ధ్వా—ఆనందింపదగినదానిని (ఆనందింప కారణమైనదానిని) పొంది, కొంచె మాలోచించిన యెడల మనకు మన నిజమైన ప్రకృతినిగూర్చిన జ్ఞానమే అత్యంతానందమును కలుగజేయునది అని తెలిసికొందుము. కావుననే మనమీదనే మనకు అంతులేని ప్రేమ.

ఒక ఉద్యోగస్థుడు తన ఆఫీసులో ఉండగా తన ఇల్లంటుకొనినదని అగ్నినివారణ యంత్రములుకూడా ఆర్పలేక పోవుచున్నవని ఫోనులో తెలిసికొనిన వెంటనే మూడుదాట్లలో మేడ దిగి టేక్సీని పిలచుచు, రోడ్డుమీద పడెను. ఆ టేక్సీనెక్కి ఎగిరిపడెనో యనునట్లు ఇంటివద్దకు రాగా, అతని తల్లియు భార్యయు చుట్టుమూగిన గుంపుమధ్య దీనముగ ఏడ్చుచున్న దృశ్యము కనబడెను. వారిని సమీపించి తన ఏకైక పుత్రు డచట కనబడకపోవుటచే వారినడిగెను. ఆ పసిపిల్లవాడు ఇంటి మేడమీద ఊయెలతొట్టిలోనే పండుకొని మెల్లగా లేచుచున్నాడని తెలిసెను. ఆ ఉద్యోగస్థుడు అక్కడే నిలబడి చూచుటకు వచ్చిన జనసమూహము నుద్దేశించి దీనాతిదీనముగా ఇట్లు మొఱపెట్టెను: "ఇంత జనసమూహములో ఏ ఒక్కరైనా నా పిల్లవానిని తెచ్చి ఇచ్చు కరుణాత్ములు లేరా? నా పిల్లవానిని రక్షించండి. నేను మీకు గొప్ప బహుమతి నిచ్చెదను. నాకు ధన మక్కర లేదు. నాకు నా పుత్రుడే కావలెను. అయ్యో నా పుత్రుడు. రక్షించండి." మరల అత డిట్లు దుఃఖించెను: "అయ్యో! ఒక్కరూ లేరా? ఎవరికిని దీనుడైన ఈ తండ్రిమీద కరుణ గలగలేదా? నా పిల్లవానిని రక్షింపరా?"

ఎవ్వరును ముందుకు రాలేదు. ఆ ఉద్యోగస్థుడు ఆ పిల్లవానిని అట్లే అగ్నికాహుతి గావించెను. ఆ తండ్రి బహుశః ఆ పిల్లవానిపై తనకు సాధారణ

మైన తండ్రులకంటె ఎక్కువ మక్కువ ఉన్నప్పటికిని, ఆ మంటలో పడి, ఆ ఇంటిలో ప్రవేశించి, ఆ పిల్లవానిని బయటకు తేవలయునను ఊహ అతనికి క్షణకాలము పాటైనను కలుగలేదు. కావున ఆ తండ్రి తన పుత్రునికంటె తననే ఎక్కువగా ప్రేమించుకొనుచున్నాడు. తన పుత్రుని రక్షణకొఱకు, తనను తప్ప తన కున్నదంతయు త్యాగము చేయుటకు సంసిద్ధుడైనాడు. ఆ తండ్రియొక్క అంతరాత్మలో ఆ కుమారుడు కేవలము ఒక ఇల్లడగానే భావించియుండవచ్చును. ఏదో పూర్వకర్మచేత ఇవ్వబడినవాడు అనగా ఋణానుబంధుడు అని తలచియుండవచ్చును.

కావున మానవులు తమ్ము తామెక్కువ ప్రేమించుకొనుచున్నా రను విషయము బృహదారణ్యకోపనిషత్తులో ప్రసిద్ధ శ్లోకమున ఇట్లు ప్రకటిత మైనది. తల్లి పిల్లవానిని, వానికొఱకు గాక, వాడు తన కిచ్చు ఆనందము కొఱకే ప్రేమించుచున్నది. అట్లే భర్త భార్యను ఆమెకొఱకు గాక ఆమెవలన కలిగెడు తన ఆనందముకొఱకే ఆమెను ప్రేమించుచున్నాడు. ఇట్లు ఎన్నియో ఉదాహరణలు చెప్పవచ్చును.

సరియే! ఈ విధముగా మనలనే మనము ఎక్కువగా ప్రేమించు కొనుచున్నామనిన మనలో ప్రేమపాత్రమైన ఆ పదార్థమేది? దానిని తెలుసుకొనెదము గాక!

ఈ దేహాంగములలో అంగచ్ఛేదము చేయవలసి వచ్చినపుడు కాళ్లని నఱకుటా, కళ్ళని పొడుచుటా యని యడిగిన మనము కాళ్ళ నర్పించు టకే సంసిద్ధుల మగుదుము. కావున కర్మేంద్రియ జ్ఞానేంద్రియములలో నేదో యొకదానిని ఎన్నుకొనవలసివచ్చిన మనము జ్ఞానేంద్రియములకే ప్రాధాన్య మిత్తుము.

జ్ఞానేంద్రియములలో నొకటగు చెవిలో కురుపు లేచి, దానివలన మనకు ఎక్కువ బాధ కలుగుచున్న దనుకొనుడు. ఆ చెవిబాధ వదలించు టకు డాక్టరు ఆపరేషను చేయవలయు ననిన మనశ్శాంతికొఱకు జ్ఞానేంద్రియ మైన చెవినికూడా పోగొట్టుకొనుటకు సిద్ధ పడుచున్నాము. కావున జ్ఞానేంద్రియ ములకంటె మనకు మనస్సే ప్రధానమైనదని సుస్పష్ట మగుచున్నది.

మిత్రులారా! తమ ఆదర్శములను అభిప్రాయములను రక్షించు కొనుటకొఱకు కొరడాదెబ్బలను మరియు అనేక విధములైన బాధలను అనుభవించి మతమునకై ప్రాణము లర్పించువారియొక్క కథలను చరిత్రలో మీరు వినియుండ లేదా? ఈ మననాటి చరిత్రలోకూడ అగర్భ శ్రీమంతులైనవారు తమ సర్వస్వమును తమ ఉద్యోగాభివృద్ధిని త్యజించి దేశ స్వాతంత్ర్యము, విముక్తి కొఱకు కారాగారములందు లాటీదెబ్బలను అనుభవించుటను మనము చూచియేయున్నాము కదా! పై ఉదాహరణలవలన మానసికమైన ఉద్రేకములకంటెను, బుద్ధిలోని ఆదర్శములకు సంస్కృతి గల మానవుడు ప్రాముఖ్య మిచ్చుటవలన మనస్సుకంటెను బుద్ధినే మనము ఎక్కువగా ప్రేమించుచున్నామని తెలియుచున్నది కదా!

ఇట్లు వివేచించి వివరించినయెడల, చివరకు ఈ మనోబుద్ధులకు కూడ కారణమై, వాటి కతీతమైన ఆత్మయే మన కెక్కువ ప్రేమపాత్రమైనదని తేలుచున్నది. ఏలయన, మనకు పరమావధి యగు ఆనందమునకు కారణ మదియేకదా! కావున దేనికొఱకు మనము ఈ స్థూలమైన ఆవరణలను, మనోబుద్ధ్యాదులనుకూడ త్యజించుచున్నామో, అట్టి మనలోని ఆ దివ్యతేజస్సే ఉపనిషత్తు ప్రకారము 'సర్వానందములకు' కారణ మగుచున్నది. తత్త్వాన్వేషి దానితో ఐక్యమును పొందినప్పుడు ఆనందపు టంచులను కొలువ గలుగుచున్నాడు.

మనలోనే ఇమిడియున్న విశ్వవ్యాపి యగు ఆ పరిపూర్ణ శాశ్వత సత్యమును తెలిసికొనుటవలననే, ఉపనిష ద్వ్యాఖ్యానములు, వేదాంత చర్చలు చేసిన ఉత్సాహవంతు లనేకులు దానిని నిస్తబ్ధచలనముగాను, నిర్గుణనీ రూప పరమాత్మగాను నిర్వచించియున్నారు. ఈ పరిపూర్ణ స్థితి 'చీకటిలో ఆవు లన్నియు నల్లగా ఉన్నవి' అనుటవంటిది కాదు. అది ఆనందోద్రిక్త సత్యజీవనము. "స మోదతే—వాడు ఆనందించుచున్నాడు."

నచికేతునికి మోక్షద్వారము తెఱువబడినది అని చెప్పుట మృత్యుదేవతయొక్క ప్రశంసల సంపుటీకరణమే అగుచున్నది. అనగా నచికేతుడు శ్రుతి మంత్రములను వినునప్పుడే అర్థమును గ్రహించి, ఆత్మానుభవమును బొందు అర్హత గల విద్యార్థి అయియున్నాడని అర్థము.

**12-13.** శ్లో॥ ఆత్మబోధ ప్రారంభము. గూఢముగా దాచబడిన సత్యము అధ్యాత్మయోగముచేత లేక ఆత్మధ్యానముచేత అనుభవింప బడుచున్నది.

శ్లో॥ "అన్యత్ర ధర్మాదన్యత్రాధర్మాదన్యత్రాస్మాత్ కృతాకృతాత్ ।
అన్యత్ర భూతాచ్చ భవ్యాచ్చ యత్తత్ పశ్యసి తద్వద" ॥ ౧౪ ॥

నచికేతుడు చెప్పుచున్నాడు - నీవు ధర్మాధర్మములకు భిన్నము గను, కృతాకృతములకు అనగా కార్యకారణములకు అతీతముగను, భూత భవిష్యత్తులకంటె అన్యమైనదిగను దేనిని చూచుచున్నావో దానిని నాకు చెప్పుము.

గురువుయొక్క అనంత ప్రశంసలకు శిష్యుని సమాధాన మేమనగా— తన ప్రాతప్రశ్ననే సంశయచ్ఛేదముకొఱకు భిన్నశబ్దములలో మరియొక విధముగా అడుగుటయేయని తెలియవలెను. తత్త్వాన్వేషి నిందాస్తుతులకు చెవి యొగ్గడు; కన్నుల నప్పగింపడు. ఏకాగ్రతతో, తన "సమస్యా పరిష్కారము" అను ఒక్క భావమునుమాత్రమే అత డనుసరించును. పరిసరములకు, గురుముఖమునుండి వెలువడు స్తుతులకు అచేతనుడై, చెవులొగ్గక, నచికేతుడు గురుముఖతః వచ్చు జ్ఞానోత్తరమునకే చెవులప్ప గించినాడు. మిగత అన్నిమాటలు అతనికి అర్థరహితమైన వాగుడుగానో, మందమై ధ్వనిరహితమైన శబ్దముగానో తోచును. ఈ సందర్భములో నిచట తత్త్వాన్వేషియైన నచికేతుడు ఆత్మస్వభావమును ప్రశ్నించుచున్నాడు. ఇది విషయమును తప్పిబ్బుపఱచుటకుగాని, తన తెలివితేటలు ప్రకటించు కొనుటకుగాని చేయు నిష్ఫల ప్రయత్నము కాదు. ఇది, అంతవరకు అతడు తన జీవనఘట్టములనుగూర్చి స్వతంత్రముగ మననము చేయుటవలన పొందిన బుద్ధివైశాల్యమును సూచించునదై యున్నది. ప్రత్యేకముగా గాని

మొత్తముగా గాని ఈ ప్రశ్నలోని మూడు భాగములను పరిశీలించినయెడల పై విషయము స్పష్టమగుచున్నది.

ఇతని ప్రశ్న ధర్మాధర్మముల కతీతమై, కార్యకారణములు కానిదై, భూత భవిష్యత్తులకు సంబంధించని ఆత్మను సూచించుచున్నది. ధర్మాధర్మములు అని చెప్పుటవలన మనకు, సుఖదుఃఖములు, జయాపజయములు, ఆశా నిరాశలు, ఆరోగ్యామయములు అను ద్వంద్వములు స్ఫురించుచున్నవి. ఆ పరమ సత్యము అద్వైతమగుటచే దానికి సహజముగనే ఈ ద్వంద్వములతో ఎట్టి సంబంధము లేదని తెలియుచున్నది. అధర్మమున్ననే ధర్మమును, చీకటిఉన్ననే వెలుతురును తెలిసికొందుము. మరణము లేకున్న జీవితము అర్థరహితమే! కావున ఆ సత్యమును ధర్మము అన్నచో అధర్మముకూడా ఉండవలసియుండుటచేత అది పరిమిత మగుచున్నది. సహజముగా విభిన్నమైన రెండు వస్తువు లున్నచో పరిమితి తప్పక ఏర్పడును. ఉదాహరణకు: గ్లాసులో సగము పాలుండి మిగతా సగము నీటితో కలిపి నిండుగా చేసిన మనము గ్లాసునిండ పాలు అని చెప్పలేము. ఏలయన నీరు పాలకు ఒక హద్దు కల్పించినది. అట్లే ఆ సత్యమును ధర్మమైనదిగ చెప్పిన దానికొక హద్దు కల్పించినవార మగుదుము. కావున అది అశాశ్వతమైనది ఆద్యంతములు గలది అగుచున్నది. అప్పుడు శాస్త్రములందు క్రమశిక్షణ పొంది సంస్కృతి గల ధీచింతనల సంపుటి ఒకటి ఈ ప్రశ్న వెనుక ఉన్నదని తెలిసికొనవలసియున్నది.

ఇట్లే తాను ధర్మరూపము కానప్పటికీ, ధర్మాధర్మములకు ఏది కారణమగుచున్నదో, అట్టి శాశ్వత దివ్యసత్యముయొక్క వివరణను గూర్చియే ఆ బ్రాహ్మణ బాలుడు మృత్యుదేవతను ప్రశ్నించుచున్నాడు. పవిత్ర చేతనమై, శాశ్వత సత్యమై, నిత్య సాక్షియై ధర్మాధర్మములను రెండింటిని ప్రకాశింపజేయు ఆత్మయొక్క వివరణమునే ఈ ప్రశ్న ఆకాంక్షించుచున్నది.

వీథిదీపము వీథిని ప్రకాశింపజేయుటయే గాక ఎటువంటి వస్తు సముదాయము దాని పరిహద్దులలోనికి వచ్చినను దానినికూడ ప్రకాశింపజేయుచున్నది. ఆ దీపము కేవలము సాక్షిమాత్రమైనదే. అది నూతనదంప

తులు వచ్చినపుడు ప్రకాశించుటకు సంతోషమును గాని, త్రాగుబోతు వచ్చు నపుడు ప్రకాశ మిచ్చుటలో కైపును గాని, శవమును తీసుకొనిపోవునపుడు ప్రకాశము కలుగజేయుటకు దుఃఖమునుగాని పొందదుకదా! వాటి గుణా గుణములను లక్ష్యపెట్టక తన పరిధిలోనికి వచ్చిన ప్రతి వస్తువును ప్రకా శింపజేయుట దీపమునకు సహజ గుణమే.

ఆ విధముగనే సర్వసాక్షియై సర్వజ్ఞుడై, సర్వజీవులకు సర్వప్రకాశ ములకు కారణభూతుడైన ఆ ఆత్మ మనలో వెలుగొందుచున్నది. దానివల ననే మనము ధర్మాధర్మము లనే భావములను మన మనోబుద్ధుల సహాయ మున తెలిసికొనుచున్నాము. యథార్థముగా ధర్మాధర్మాతీతమైన ఈ ఆత్మ మహత్తరమైన సాక్షిమాత్రమే కావున నిది ధర్మాధర్మములకు భిన్నమైయున్నది

ఇక ప్రశ్నలో రెండవ బాగమును తీసికొందము: కార్యముగాని కార ణముగాని కానిదానినిగూర్చి విచారింతము. ప్రతి కార్యము కారణము యొక్క ఫలరూపమే. కావున కాలమాన పరిస్థితుల మార్పును సూచించు కారణముయొక్క రూపాంతరమే కార్యము; అది రూపాంతరమును పొందిన కారణమే అగుచున్నది.

కారణభూతమైన విత్తనమును నాటిన, అది పరిస్థితు లనుకూలించి నప్పుడు కాలాంతరములో కార్యరూపమైన మొలకగాగాని, మొక్కగాగాని రూపొందుచున్నది. కావున అన్ని కార్యములను కారణములక్రింద జమ కట్టవచ్చును. అయినప్పటికి "ఈ కారణమునకు కారణ మేమి?" అను ప్రశ్న ప్రతిసారియు కలుగుచునే యుండును. ఇట్లు అనంతములుగా వచ్చు ప్రశ్నపరంపరలవలని కష్టమునకు సంస్కృత తర్కశాస్త్రములో 'అనవస్థాదోషము' అని పేరు కలదు. ఈ అసంగతిని సరిదిద్దుకొనుటకే వేదాంతములోని అన్ని శాఖల వారిచేతను, దైవసిద్ధాంతమును, జగత్తునకు, ఆదికారణమును అయిన, ఆ ఆత్మ అకారణ కార్యము లేదా స్వయంభూః— కారణములేని కారణము అని ఏకగ్రీవముగా ఒప్పుకొనబడుచున్నది.

కాని, నచికేతునియొక్క ప్రశ్న, దైవసిద్ధాంతమై కారణరహితమగు ఆత్మనుకూడ దాటిపోవుచున్నది. దానిని కారణముగా అంగీకరించినచో

కారణము కార్యరూపము దాల్చినపుడే వానియొక్క అస్తిత్వము సమర్థ నీయమగును. కావున ప్రస్తుతము నచికేతుని ప్రశ్నస్వరూపము కారణము కంటె భిన్నము అని చెప్పవచ్చును. కారణము కార్యము రెండునుకాని ఆ సిద్ధాంతమునుగూర్చి ఈ ప్రశ్న ఉద్దేశింపబడినదని స్పష్టముగా తెలిసి కొనవలెను. కాబట్టి ఈ పదముచేతకూడ "తాను స్వయముగా కార్యమును గాని కారణమునుగాని కాక కార్య కారణములను తెలిసికొనునట్టిదియు, సాక్షిభూతమునైనదియు నగు ఆత్మ తత్త్వమును వివరింపుము" అని ఆ బ్రాహ్మణబాలుని ప్రశ్న కోరుచున్నది. కాలమునకు, కార్యమునకు అధీనము గాని, ఆ పరమాత్మనుగూర్చి ఈ ప్రశ్న వేయబడినదని 'కృతాకృతాత్ అన్యత్ర' అను శ్లోకభాగమునుండి తెలియుచున్నది.

'మనలోనుండి పరమావధియైన ఆ సత్యముయొక్క స్వభావమును గూర్చి అనగా ఆ యాత్మనుగూర్చి బోధించవలసినద'ని యీ తుదిప్రశ్న ద్వారా శిష్యుడు కోరుచున్నాడు. అనిశ్చితమైన ప్రదేశములలో నుత్పన్నము కాని కాలమును (భవిష్యత్తును) గూర్చి ఆకాంక్షలకు ఆశలకు లోబడనప్పుడు గాని, గతించిన క్షణములు, నెలలు, సంవత్సరములతో కూడిన భూత కాలమను శ్మశానతలమునుండి పైకెగయు పిశాచములవంటి స్మృతులతో యేకీభావము పొందనపుడుగాని, శుద్ధ చైతన్యముగా ఏది తెలియబడుచున్నదో యట్టి యాత్మస్వభావమునుగూర్చియే నచికేతుని జిజ్ఞాస. భవిష్యత్తులో మనలను చిక్కుపఱచు ఆశాప్రతీక్షలు, ఆకాంక్ష లనెడు అల్లికల నాపివేసి నపుడును, నిరర్థకమై గొలుసువలె యల్లుకొనిన పూర్వస్మృతులనుండి విడి వడినపుడును మాత్రమే మన మా పరమజ్ఞానమును గుఱించి తెలిసికొను చున్నాము. వెనువెంటనే వచ్చు క్షణములయొక్క తత్త్వమే శాశ్వత మైనదియు నిత్యమైనదియు నగుచున్నది. గతముయొక్కగాని భవిష్యత్తు యొక్కగాని సంకెళ్ళనుండి ఒక క్షణమాత్రము విడివడినచో అదియే సాధకుని పరమావధి యగుచున్నది. దీనిని 'సమాధి' యని పిలుచు చున్నాము. దీనియందలి యనుభవము ఆ సత్యముయొక్క అనుభవమే.

తన చుట్టుపట్లనుగూర్చి, తనను తనలో వానినిగూర్చి, నచికేతుడు నిరంతరముగా ఆలోచించుచు ననేక దివారాత్రములు గడిపెనని స్పష్టమగు

చున్నది. సర్వసాక్షియై, దివ్యసాన్నిధ్యమై మన స్మృతులకు అధికారి, ప్రేక్షకుడు, భూతభవిష్యత్తుల జ్ఞాతయైన మనలోని యాత్మను గుఱించి ఉద్దేశింపబడినదే ఈ ప్రశ్న.

సంపూర్ణ శాస్త్రజ్ఞానముచే పూర్తిగా ఆత్మసంయమనము గలవాడై నచికేతుడు మృత్యుదేవతను " ఇదివరకు శాస్త్రములు బోధించినవానిని గాని, లేక తన గురువు చెప్పినవానినే తిరిగి చెప్పుటగాని చేయవద్దని సూచన చేయుచు, మృత్యుదేవత చూచుచున్నదానినే (యత్తత్పశ్యసి) " చెప్ప మనుచున్నాడు. అనగా మృత్యుదేవత స్వకీయమైన ఆత్మానుభవమునే వెల్లడి చేయవలయునని నచికేతుని కోరిక.

14 శ్లో॥ నచికేతుడు వేదోక్త కర్మలు, వాటి ఆచరణము, వాటి ఫలములుగాని అనావశ్యకము లనుచున్నాడు. కాల కారణముల కతీతమైన దానిని చెప్పమనుచున్నాడు. పరమ సత్యమును బోధింపమనుచున్నాడు.

శ్లో॥ " సర్వేవేదా యత్పదమామనన్తి తపాంసి సర్వాణి
చ యద్వదన్తి ।
యదిచ్ఛన్తో బ్రహ్మచర్యం చరన్తి తత్తేపదం సంగ్ర
హేణ బ్రవీమ్యోమిత్యేతత్ ॥ ౧౫ ॥

యముడు చెప్పుచున్నాడు - సమస్త వేదములు ఏ పదమును లక్ష్యముగా పేర్కొనుచున్నవో (ప్రశంసించుచున్నవో) సమస్త తపములు దేనిని ప్రకటించుచున్నవో, దేనిని కోరి వారు బ్రహ్మచర్యమును అవలంబించుచున్నారో, అట్టి పదమునుగూర్చి నీకు సంగ్రహముగా చెప్పెదను. అదియే ఓం.

ఇచట గురువైన మృత్యుదేవత ఉపనిషత్సారమై ప్రశస్తమైన తన చర్చను మొదలుపెట్టుచు, ధర్మాధర్మముల కతీతమై, కార్యకారణములు కానిదై, భూత భవిష్యత్తులకు భిన్నమై యుండుదానిని సంగ్రహముగా చెప్ప ప్రారంభించెను.

అసలు ఉపనిషత్తుశైలిలో అధికాక్షర ప్రయోగము బ్రహ్మాండమైన పాపముగా పరిగణింపబడుచున్నది. అందులోని సంక్షిప్తత మానవాతీతమైయుండగా, అట్టి సంక్షిప్తతను రక్షించుటకొఱకు భాషనుకూడ మనము కొన్నిచోట్ల త్యజించవలసి వచ్చుచున్నది. ఇట్టి పరిస్థితిలో ఇచ్చట మృత్యుదేవత స్వయముగానే 'సంక్షిప్తముగా' చెప్పుచున్నాననినచో మనము అర్థముచేసికొనుటకు అతి ప్రయాసను పొందుచున్నాము.

"పదమ్" అను పదము చాలా చిన్నదిగా కనబడినప్పటికిని దానిమీద ఒక గ్రంథము వ్రాయగలిగినంత అర్థమున్నది. పేలవముగా కనబడు ఈ రెండక్షరముల పదమునకు, ఇరవై రెండర్థములు గలవు—స్థానము, మార్గము, నివాసము, స్థితి, అడుగు, పాదగుర్తులు, సంజ్ఞ, మాట, గమ్యస్థానము, లక్ష్యము మొదలగునవి.

'సమస్త వేదములు' అనగా సమస్త ఉపనిషత్తులు విభిన్న దృక్పథము గలవైనప్పటికిని ఒకే లక్ష్యమగు సత్యమును సూచించుచున్నవి. ఈ 108 ఉపనిషత్తులు ఒకే చక్రపు పరిధిలోని బాణపుగుర్తులై ఒకే కేంద్రబిందువును ఉద్దేశించునవై యున్నవి. రేఖాగణితము ననుసరించి ఎట్లు రెండు వేర్వేరు బాణములు ఒకే పరిధిమీద సమానాంతరములుగా నుండజాలవో, అట్లే రెండు వేర్వేరు ఉపనిషత్తులయొక్క ద్వివిధ మార్గములు సమానములుగానుండవు.

ఓంకారములో సంగ్రహముగా నిమిడియుండి, నీవు ప్రశ్నించు ఆ సత్యానుభవముకొఱకే సాధకులు, గురువులవద్ద దీర్ఘకాలము విద్యాభ్యాసము చేసి, సేవాజీవనము గడపి, త్యాగ మొనర్చి, భక్తి శ్రద్ధలు కలిగి ఆ ఓంకారమునే ప్రకటించు తపశ్చర్యలు చేయుచున్నారు. పరమాత్మయే లక్ష్యము కానిచో వారి తపశ్చర్యయే వ్యర్థము.

ఈ శ్లోకముయొక్క ప్రతిధ్వని అనగా ఇంచుమించు ఇదే అర్థముగల శ్లోకము శ్రీమద్భగవద్గీతలో కనబడుచున్నది. మరియు భగవద్గీతలో ఈ శ్లోకముయొక్క రెండవపాదము ఉన్నది ఉన్నట్లుగానే పునరుక్తమైనది.

ఓం అను సంజ్ఞచేత ఆ సత్యము సూచింపబడుచున్నది. దీనివలన "ఓం" సత్యమును నిర్వచించుచున్నదని చెప్పుట తగదు. ఏల యన

సత్యమును నిర్వచించుట యనగా దానికి లాఘవమును కల్పించుటయే అగును. ఆత్మసంపూర్ణత్వ పద్ధతిలో ఉపనిషదృషులు "ఓం" అనునది ఒక గమ్యస్థానమును తెలియజేయు ఒక సూత్రమని, సగుణోపాసనకు 'ప్రతీక' మని గ్రహించినారు. అదియునుగాక ఈ "ఓం" అను అక్షరము ఋగ్వేదములోగాని, అథర్వవేదములోగాని కనబడలేదు. తైత్తరీయ సంహితలోను యజుర్వేదములోను మాత్రము కనబడుచున్నది.

శ్లో॥ ఏతద్ధ్యేవాక్షరం బ్రహ్మ హ్యేతదేవాక్షరం పరం।
ఏతద్ధ్యేవాక్షరం జ్ఞాత్వా యో యదిచ్ఛతి తస్య తత్
॥ ౧౬ ॥

ఈ అక్షరమే బ్రహ్మ. ఇదియే పరమైనది. దీనిని బాగుగా ఎవడు తెలిసికొనుచున్నాడో వాడు దేనిని కోరునో అది సిద్ధించును.

ముందరి శ్లోకములో 'పదం' అనుదానికి ఇరవైరెండర్థము లున్నట్లు ఈ శ్లోకములోని 'అక్షరం' అనుదానికి పదునాలుగు విభిన్నార్థములు కలవు. సంస్కృతభాషయే ధ్వనిగర్భితమై, ప్రతిపదము సందర్భానుగుణముగా వాడుకొనుటకు తగిన విశాలార్థములు గలదై 'సంస్కృత, లేక సంస్కరిత అను నామమునకు అనుగుణముగానున్నది. ఇట్టి భాషనే బహుశః తర తరముల ప్రయాస ప్రయోగముల ఫలితముగా, ఆర్యులు అనిర్వచనీయమైన ఆ సత్యమును వివరించుటకు సాధనముగా గ్రహించిరి.

ఆయా కాలపు ప్రజల మానసిక స్థితికి తగినట్లుగా ప్రతితరములోను క్రొత్తక్రొత్త పదములు ఏర్పడుట చూచుచున్నాము. ఆ విధముగానే గంభీర ధ్యానము, తత్త్వాన్వేషణముతో కూడిన ఆ యుగమువారు క్రొత్త పద జాలమును సృష్టించి, తమ ఉద్దేశపరిపూర్తికై తగిన భాషను పరిణమింప జేయవలసి వచ్చినది. ఆలోచించగా సంస్కృతముద్వారా చెప్పినట్లు మఱి ఏ ఇతర భాషలద్వారాకూడా ఈ ఆత్మతత్త్వమును - సత్యస్వరూపమును ఇంత తేలికగా అందజేయలేము.

ప్రస్తుతము చర్చనీయమైన ఈశ్లోకములో మృత్యుదేవత "ఓం" యొక్క ఆరాధన పద్ధతిని వివరించుచున్నాడు. ఆ పరమగమ్యమును సూచించుటయే గాక, 'ఓం' అనునది సగుణారాధకులకు ధ్యానించుటకు ఒక ఆకారరూపమై యున్నదని ఇదివరకే చెప్పితిమి. ఈ 'ఓం' అనుదానిని హెబ్రూలయొక్క 'అవును-అట్లుండనిమ్ము' అను అర్థమునిచ్చు 'ఆమెన్' (Amen) అనుదానివలె ప్రాచీనకాలపు వేదములలో ఒక ఋక్కుగా ఉపయోగించిరి. కాలాంతరమున సెయింటు జాన్ అనునతడు "ఆమెన్ విశ్వాసపాత్రుడైన, సత్యమైన" అను అర్థములో భగవంతుని పేరుగా దీనిని మార్చివేసినాడు. "ఈ ఆమెన్ అనునది భగవంతుని పేరుగా మారి ప్రాముఖ్యమునకు వచ్చినట్లే, ఈ ఓం అనునదికూడ ప్రాముఖ్యమునకు వచ్చినది" అను ఈ ఐరోపీయ సిద్ధాంతమును 'ఓం' యొక్క దివ్యత్వ మును అనుభవించినవారు ఒప్పుకొనజాలరు.

ఇంతకు పూర్వమే ఉపనిషత్పద్ధతిలో స్వార్థరహితమైన యజ్ఞయా గాదులు మానవుని అంతరపవిత్రతను అభివృద్ధిపఱచి, ధీశక్తిని పెంపొందింప గలవనుటను చూచితిమి. లోకములో కిరీటము ఏ రాజుయొక్క తలమీద లేకపోయినను తనకు తానే రాజత్వము లేక ప్రభుత్వముయొక్క గుర్తుగా ఎట్లున్నదో, శివభక్తునికి శివలింగమే శివస్వరూపముగా ఎట్లున్నదో, అట్లే ఈ 'ఓం' అనునది ఆ సత్యస్వరూప చిహ్నమని ఈ మంత్రములో ప్రకటన చేయబడినది. దీనిని నమ్మనివారు మువ్వన్నెపతాకను తీసి క్రింద వేసి కాలుతో త్రొక్కిన ఏమగునో చూడుడు. వెంటనే దేశభక్తుల సమూహము వచ్చి వారిపై బడి ఆక్రమించగలదు. అట్లు చేయనియెడల వారాపనిని ఎవరు చూడని నడిరాత్రి సమయములో చేసిఉందురు అని అనుకొన వచ్చును.

సామాన్యముగా ప్రజాసమూహము తలచునట్లు వేదాంతి దైవదూష కుడును కాడు, విగ్రహధ్వంసకుడును కాడు—అని దైవతుల్యులైన మన మహర్షులచే ఈ ఉపనిషత్తులలో చెప్పబడిన ఈ 'ఓం' యొక్క ఆరాధన వలన, స్పష్టముగా తెలియుచున్నది. ఈ కాలమున మన భారతదేశములో విగ్రహారాధన తగదని ఎవరైన పిచ్చివారై ఊహాగానముతో నృత్యము

చేయుచు దానిని ఏవగించినట్లైతే, నిజముగా వారు, తమకేగాక ఆత్మ పరిపూర్ణత్వమును పొందించు శాస్త్రమునకుకూడా అన్యాయము చేయుచున్న వారగుచున్నారు. అట్లు తప్పుదారిని నడచువారు సాధారణ వ్యక్తులైనచో వారిని శ్రుతివిషయిక జ్ఞానము లేనివారిక్రింద జమకట్టి మనము పూర్తిగా విస్మరించవచ్చును. కాని చదువుకొని గౌరవింపదగిన వివేకులే అట్లు చేసినచో సాంఘికముగా నేరము చేయువారికి విధించు శిక్షనే వారికి విధింపుడు — వారిని వెలివేయుడు — వారిని నిందింపుడు — వారినుండి మిమ్ము లను మీరు జాగ్రత్తగా కాపాడుకొనుడు!

'ఓం' అనునది సత్యమును సూచించు ఒక రూపమే గాక అది నిత్యసత్యమునకు సంబంధించిన ప్రాతినిధ్యమునుకూడా వహించుచున్నది. ఉపాసకుడు లేక ధ్యాని ఆ 'ఓం'ను పరమాత్మగాగాని తత్సంబంధిగాగాని ధ్యానము చేయవచ్చును. సాధకుడు తన తీవ్రధ్యానములో ఐక్యమును పొందునపుడు ఏ సత్యమునకు ఈ 'ఓం' ప్రతీకముగా నున్నదో, అట్టి సత్యముతో అత డభేదమును పొందుచున్నాడు. ధ్యానించబడువానితో ధ్యానించువాడు ఐక్యమైన, ధ్యానించునది అపరబ్రహ్మయొక్క (హిరణ్య గర్భ) ప్రతినిధి యని తలచిన, అతడు శాశ్వత బ్రహ్మలోకమును పొందు చున్నాడు. అట్లుగాక ఆ ధ్యానించు విషయము పరమసత్య స్వరూపమైన యెడల, అతనికి క్రమముగా అంతశ్శుద్ధి ఏకాగ్రత గలుగుచున్నది. మరియు అతడు దీర్ఘధ్యానముద్వారా ఆత్మస్వభావమును భావింపగలిగి "అయమహ మస్మి - ఇదియే నేను - ఆత్మయే నేను" అని అంతమందు ఆత్మైక్యమును పొందుచున్నాడు.

"వాడు దేనిని కోరిన అది సిద్ధించును" — మృత్యుదేవత పలికిన ఈ వాక్యము, నవీనమన స్తత్వశాస్త్ర ప్రకారము వివేచనాపూర్వకమైన జీవన సంఘటనల పరిశీలనద్వారా సిద్ధాంతీకరించిన సత్యమునకు అనుగుణముగా నున్నది. "నీవు భావించినట్లే నీవగుదువు" అనునది భావన తగినంత శక్తివంతమైననప్పుడే యథార్థమగుచున్నది. మనము కోరికలను కోరుటయే చాలదు. అవి నిజముగా సఫలము కావలెనని కాంక్షించుటకూడ

ముఖ్యము. మీరు కోరిన కోరికలు సాధారణముగా ఫలరూపమును దాల్చవు గనుక మీరు 'ఈ స్వామీజీకి మతిభ్రమణ కలిగెనా" యని యాశ్చర్య పడవచ్చును. మిత్రులారా! అతనికి మతిభ్రమణము కలుగలేదు! శ్రుతి కూడ 'పిచ్చిఊహలను పొందుపఱచిన గ్రంథము' కాదు. 'అగ్ని చల్లగ నున్నది' అని శ్రుతి చెప్పగానే మనము అజాగ్రత్తగా అగ్నిని తాకుటగాని, లేదా ఎండకాలములో అగ్నిని చేతిరుమాలులో కట్టి చల్లదనముకొఱకు మన తలమీద పెట్టుకొనుటగాని చేయముకదా! మనయొక్క అనుభవములు శ్రుతివాక్యముకంటె భిన్నమైనపుడు, ఆ శ్రుతి చెప్పుదానికి వాచ్యార్థముకంటె భిన్నమై ఏదో విశేషార్థమును సూచించునది ఉండియుండునని మనము తలచవలెను.

అయిన ఎందుకు మన కోరికలేవియు ఫలించుటలేదో విచారణ చేయుదముగాక! మనలోనుండు భావన జడరూపమై, నిస్సారసంఘట నాత్మకమై యున్నదను భ్రమ మనకు కలిగియున్నది. ఈ దురభిప్రాయము వలననే మనకి సాంసారిక దుఃఖములు, పరిమితులు కలుగుచున్నవి. కాని మన భావములకు దివ్యశక్తులున్నవని తెలిసికొనవలెను. మనలో ఒక భావము పుట్టగానే, అది రూపముదాల్చి మనకు సహాయపడి సఫలము చేయుగోరును. 'అలావుద్దీను—అద్భుతదీపము' అను కథలో వచ్చు జిన్నీ వంటిది ఈ భావము. అలావుద్దీను దీపమును తోమిన చాలును, వెంటనే జిన్నీ ప్రత్యక్షమై, వంగి సలాముచేసి, తనయజమాని కోరికలను నెరవేర్చు టకు సిద్ధముగా సతనియెదుట నిలుచుచున్నాడు. ఆ దీపపు జిన్నీకి ఏదియు అసాధ్యమైనది లేదనికూడ మనకు తెలియును. అట్లే ఆ జిన్నీకంటె వేయింతలు ప్రభావశాలియై, ప్రశస్తమైన మన మనోభావము సిద్ధముగా నుండి, స్వేచ్ఛతో సేవించి, మన కోరికలను సఫలముచేయు బానిస యగుచున్నది.

అయినప్పటికిని మిత్రులారా! మీరు రెప్పలార్చుచు ఆ ప్రాతప్రశ్ననే మరలమరల వేయుచున్నారు. "స్వామీజీ! మీకు మతి పోయినదా? మీరు మా అనుభవములకు విరుద్ధముగా మాట్లాడుచున్నారు. జిన్నీభావము మా మనస్సునకు వినోదమును కూర్చునది మాత్రమే అగుచున్నది."

నిజముగా మన మపజయమే పొందుచున్న ఆ అపజయములకు కారణమును తెలిసికొందముగాక! ముందు చెప్పినట్లుగా ప్రశస్తమైన మానసికభావము — మనస్సుయొక్క జిన్నీ — మన మానసికావధిలో లేచు ప్రతి కోరిక ధ్వనించునప్పుడును, మనముందర ఒక ఆకారముతో నిలుచు చున్నది. ఆ భావము అంతమగుటతో ఆ జిన్నీ నిష్కపటుడై విశ్వాసముతో మన కోరికను తీర్చుటకు తిరిగి అడుగువేయుచున్నాడు. కాని ఇంకను అత డడుగు తీసి అడుగు వేయకుండనే మనకు, "జిన్నీని పిలిచి మరికొన్ని అజ్ఞల నివ్వవలయును" అని మరియొక కోరిక పుట్టుచున్నది. మనస్సు యొక్క అనతిప్రకారము తన యజమానివైపు ఆ జిన్నీ అడుగుత్రిప్పి తిరుగుచున్నది. మానవ హృదయాధి దేవత యైన ఈ దివ్యప్రధానియొక్క దురవస్థ ఇటువంటిది; సర్వశక్తిమంతుడై ప్రభావశాలియైన ఈ ప్రాణికి మన స్వంతమైన యీ తికమక కోరికలను తీర్చుటకొఱకు, వ్యతిరేకమైన యాజ్ఞలను నిర్వహించుటకొఱకు బొంగరమువలె అటునిటు తిరుగవలసి వచ్చుచున్నది. కాని ఏ పనియు పూర్తిచేయు అవకాశము దానికి కలుగకున్నది.

ఏ మనసైనతే పోరాడెడు భావములతో అల్లకల్లోలపడుచున్నదో, ఏ మనస్సు పొక్కులెక్కు మశూచికమువంటి కోరికలతో హింసింప బడుచున్నదో అట్టిమనస్సు తన అశక్తతకు తానే ఏడ్చుచున్నది.

ఏకాగ్రత కలిగిన మనస్సు ఎటువంటి కోరికలను కోరినప్పటికిని తప్పక ఆ కోరిక నెఱవేరును. ఈ దృష్టితో చూచితిమేని యోగము మానసిక చలన ప్రవృత్తిని ఒక నిర్ణీతమైన మార్గమున నడపించి దానిని వశపఱచు కొను పద్ధతి యగుచున్నది. ఎవడైతే ఈ శాస్త్రమందు ప్రవీణుడై మనస్సును సంపూర్ణముగా వశపరచుకొనుచున్నాడో, అట్టివాడు తన కోరికలు స్ఫురించిన వెంటనే ఫలరూపమును దాల్పజేయు భూమిమీది దేవుడే అగుచున్నాడు. మనయొక్క పిచ్చిఆలోచనలచేతనే మనము మనలోని దైవశక్తులను వ్యయపఱచుకొనుచున్నాము.

నీవు నీయింటినుండి ఆఫీసుకు పోవుచు సంతోషపారవశ్యములో అనిర్ణీత భావములు కలిగి ఆఫీసు దృష్టి కలిగినపుడు ముందునకు, ఇంటిదృష్టి కలిగి నపుడు వెనుకకు నడచుచున్నయెడల, రాత్రికికూడ నీవు ఇంటినిగాని ఆఫీసును

గాని చేరక రోడ్డుమీద నడచుచునే ఉందువు. కావున మనస్సును ఆఫీసునకు పోవుట యను కోరికయందు ఏకాగ్రముగా స్థిరపఱచి, వ్యతిరేక భావము లను మనస్సునుండి తొలగించి దేహమునుకూడా దానికి అనుగుణముగా నడపిన, తప్పక నీవు ఆఫీసును చేరగలవు. అట్లే మనము మన యితర కోరికలను తీర్చుకొనుటకూడను జరుగుచున్నది. పరిపక్వమై సారవంత మైన మునుపటి కోరికలే ఈనాటి మన ఈ స్థితికికూడ కారణమని చెప్ప వచ్చును.

నీవు ఇష్టమైన నీకా పనిలో విజయము గలిగించు శక్తినే నీవు కోరుదువు. తగినంత ఏకాగ్రతతోను నిష్కపట భక్తితోను ఈ దేశాధ్యక్షుడవు (President) కాగోరినయెడల, మనశ్శక్తిని తగ్గించు వ్యతిరేకపు భావ సంఘర్షణ లేకుండ ఆ భావమునే విశ్వాసముతో కాపాడుకొనుచున్న తప్పక నీమనస్సుయొక్క జిన్ని నిన్ను గొరడితివాసిమీద కూర్చుండబెట్టి ఢిల్లీ చేర్చ గలదు. నీవు ఆ ప్రభావయుత సింహాసనముమీద కూర్చొనగలవు. బహుశః దానిలోని బాధలకు విచారించగలవుకూడ!

మనము చాలా దీర్ఘచర్చలలో దిగితిమి. కాని యీనాడు దేశములో ఎక్కువ భాగము నాక్రమించుకొని దుఃఖముతో నిరుత్సాహముతో అణచివేయ బడిన నిరాశావాదులున్నారు. వారు తమలోని ఆత్మవిశ్వాసమును, నిరుప యోగమై తగిన కృషి లేకయున్న తన స్వశక్తులను తెలిసికొనినచో, ఈ సాధువు తన యీ అప్రస్తుత ప్రసంగమును ఆవశ్యకమైనదీ న్యాయమైనదీ అని సమర్థించుకొనును.

కావున ధ్యాని "ఓం"ను బ్రహ్మలోకమును పొందు ఉద్దేశముతో ధ్యానించిన తప్పక దానిని పొందును. లేక అతడు నచికేతునివంటి ఉత్సాహముతో ఆ "ఓం" ను దివ్యమైన పరమసత్యముగానే ధ్యానించిన అతడు తప్పక "తత్—అది" అగుచున్నాడు.

శ్లో॥ ఏతదాలమ్బనం శ్రేష్ఠమేతదాలమ్బనం పరం।
ఏతదాలమ్బనం జ్ఞాత్వా బ్రహ్మలోకే మహీయతే॥

ఈ ఆలంబనము చాలా శ్రేష్ఠమైనది. ఇదియే పరమ శ్రేష్ఠమైన ఆలంబనము. ఎవడైతే ఇట్టి ఆలంబనమును తెలిసికొనుచున్నాడో అట్టి వాడు తప్పక బ్రహ్మలోకమును పొంది ఆనందించుచున్నాడు.

"జ్ఞానేనైవతు కైవల్యం = జ్ఞానముచేతనే ముక్తి," అనునది సర్వ వేదాంతులయొక్క మూలసిద్ధాంతము. రాత్రి రజ్జువును సర్పభ్రాంతిచే ఎంత గట్టిగా కొట్టినను ఆ భ్రాంతసర్పము మరణించదుకదా! కాని కొంత ప్రకాశము ఆ త్రాడుమీదపడినచో, ఆ రజ్జువుయొక్క జ్ఞానము కలిగి సర్పము తనంతటతానే మరణించును. అట్లే ఆ పరమ జ్ఞానముయొక్క స్వకీయానుభవముచేతనే సత్యపదార్థమైన ఆ పరిపూర్ణతను చెందు చున్నాము. అది విజయమునకు పరమావధి, అది పరిపూర్ణత్వమునకు శిఖరమువంటిది.

కాని తక్కువ పరిణతి జెందిన మనస్సు గలవారియొక్క మంచి కొఱకు ఈ ఉపనిషత్తు ఉపాసనావిధానము నుపదేశించుచున్నది. ఈ శ్లోక ములో ఉపాసకుడు బ్రహ్మలోకమును అనగా హిరణ్యగర్భ స్థితిని పొందు చున్నాడు, కాని అదియే పరమావధికాదని శ్రుతి స్పష్టముగా వెల్లడి చేయుచున్నది.

సంస్కృతములో "బ్రహ్మలోక" అను పదమునుండి రెండర్థము లను పిండవచ్చును. 'బ్రహ్మరూపీలోకః—ఆత్మకు సహజలోకము.' (2) బ్రహ్మణః లోకః—అ సృష్టికర్తయైన బ్రహ్మయొక్క లోకము. ఉపాసకుడు తన కర్మలద్వారా సృష్టికర్తయొక్క లోకమును చేరుచున్నాడు. ధ్యాని "ఓం" చేత సూచింపబడిన ప్రధానాంశములద్వారా, తనను ఆ సత్యముతో ఐక్యము పొందినవానినిగా తెలిసికొని, ఆ జ్ఞానముచేత సచ్చిదానందరూపము తానగుచున్నాడు. ఈ విధముగా ఈ శ్లోకములో మృత్యుదేవత కర్మజ్ఞాన ముల ఫలములను సూచించుచున్నాడు.

15-17. శ్లో॥ మృత్యుదేవత, "నిత్య సత్య పరిపూర్ణుడైన ఆత్మ పూర్తిగా ఓం అనుదానిచే గుర్తింపబడుచున్నది" అని చెప్పుచున్నాడు.

శ్లో॥ న జాయతే మ్రియతే వా విపశ్చిత్ నాయం కుతశ్చిన్న
బభూవ కశ్చిత్ ।
అజో నిత్యః శాశ్వతోఽయం పురాణో న హన్యతే
హన్యమానే శరీరే ॥ ౧౮ ॥

జ్ఞానియైన ఈ ఆత్మ జన్మించలేదు. మరణించదు, దేనినుండియు ఇది ఉద్భవించలేదు. దీనినుండి ఏదియు ఉద్భవించలేదు. జన్మలేనిది, శాశ్వతమైనది, ప్రాచీనమైనది, నిత్యమైనది అయిన ఆత్మ తన దేహము హత్య గావింపబడినపుడు తాను హతముకాదు.

ఈ కఠోపనిషత్తులోని మంత్రములు వ్యాసులవారిని ప్రోత్సాహపఱచి తన సత్యానుభూతిని భగవద్గీతా శ్లోకరూపములో ఎట్లు వెల్లడింపజేసెనో ఇంతకుముందే దానిని మనము తెలిసికొంటిమి.

భగవద్గీతలోని మొదటి అధ్యాయమంతయు సాటిలేని పృష్ఠభూమిని (back-ground) గూర్చును. ఈ ఉపనిషత్తులోని నచికేతుని కథవలెనే, దివ్యమైన గురువుగా కృష్ణభగవానుడును, మానవుడైన అర్జునుడు,-శరణము భక్తి అన్వేషణ కలిగిన శిష్యుడుగాను, ఎట్లు చిత్రింపబడిరో, ఆ విషయము మీకందరికి తెలిసినదేకదా! మరియు రెండవ అధ్యాయములో ఆ భగవంతునిచే గానముచేయబడిన దివ్యగీతలలో, ఇప్పుడు మనము చర్చించుచున్న మంత్రములోని ఆ పదములే ఉన్నవి ఉన్నట్లుగా పునరుక్తమైనవి. (ఉత్తరార్ధ మట్లే పునరుక్తమైనది.)

ధర్మాధర్మములకు అతీతమై, కార్యకారణములు కానిదై, భూత భవిష్యత్తులకంటె భిన్నమైనదైన ఆత్మను మృత్యుదేవత తాను అనుభవించినట్లుగా చెప్పమని నచికేతుడు అడుగుట మీరందరు జ్ఞాపకముంచుకొనవలెను.

ఈ శ్లోకముయొక్క చర్చలో మనము ఉత్సాహము గల ఆ బ్రాహ్మణ బాలుడు "నిత్యసాక్షియై, జ్ఞానజ్యోతియై, దేహములో నున్న ఆత్మస్వభావమును" అడుగుట స్పష్టముగా తెలిసికొనినాము. మరియు దానికి జవాబు

చెప్పుచు మృత్యుదేవత ముందుగా "ఓం" ను గురించి ప్రారంభించుటయుకూడ తెలిసికొంటిమి.

ప్రస్తుత శ్లోకములో గురువు ఈ జడపదార్థములగు దేహ మనో బుద్ధులను ప్రకాశింపజేయు ఆ దివ్యజ్యోతిని సూటిగా సూచించుచున్నాడు.

"న జాయతే మ్రియతే - ఆత్మ జన్మించలేదు - అది మరణించదు."

ఆద్యంతములు గలిగి నశించు సమస్త పదార్థములు మార్పులను పొందును. ఆ మార్పులు, పుట్టుట—పెరుగుట—రోగము,—జరా,—మరణము—అను అయిదు వర్గముల క్రింద విభజింపబడినవి, మనలోని నిత్యసత్యాత్మ ఈ పంచకములో, పుట్టుట మరణించుట, అను రెండు మార్పులు లేనిదని చెప్పబడినది. ఈ రెండింటిలో, మిగిలిన మూడునూ కూడ చేరినవనే అభిప్రాయముతో ఆద్యంతములగు మార్పులను మాత్రమే ఈ శ్లోకములో పేర్కొనినాడు. ఏదైతే మార్పును జెందునో అది నశించు గుణము గలది అగుచున్నది. అట్లు మార్పులు లేవనుటలో గురువు మానవునిలోని ఆత్మయొక్క నిత్యత్వమును సూచించుచున్నాడు.

ఇచట 'విపశ్చిత్' అను పదము ఆత్మనుద్దేశించి ఉపయోగింపబడినదని గమనింపవలెను. ఇది అనాలోచితముగా గాని పరిస్థితుల కనుగుణముగా అర్థమునిచ్చుటకుగాని ఉపయోగించినదికాదు. 'విప్'—(వణకుట) అను ధాతువునుండి వచ్చినది. దాని విశేషణరూపము 'విప'—(ఈశ్వర ప్రేరితమైన) నామవాచక రూపము విపస్—(దైవజ్ఞానము) కావున విపశ్చిత్—దైవజ్ఞానమును తెలిసికొనుట. అనగా ఆ పవిత్రజ్ఞానముయొక్క అనుభవమువలన పుట్టినది. ఆత్మ జన్మరహితమైనది. దేహమే జన్మించుచున్నది. మన ప్రారంభచర్చలలో ఈ విషయమును విపులముగా చర్చించుట మీకు జ్ఞాపకముండియుండును. అయినను మీ సహాయము కొఱకు చెప్పినదానినే మరల చెప్పుటకు ఈ క్రిందిదానిని చేర్చుకొనవచ్చును.

కుమ్మరి కుండను చేయును. ఘటము పుట్టినది. కాని ఆ ఘటములోని ఆకాశము అనంతాకాశమును ఎల్లప్పుడును ఒకటే అగుటచే ఆకాశము సృష్టింపబడినది కాని జన్మించినదికాని కాదు. ఘటము భగ్నము కావచ్చును.

సృష్టింపబడినది నశింపవలసినదే. కాని ఘటము పగులుటచే ఘటాకాశము పగులలేదు. జన్మించని ఘటాకాశమునకు మరణము లేదు. ఆ విధము గానే ఆత్మ లేక సత్పదార్థము జన్మించలేదు. కాబట్టి అది మరణము లేనిది. నీచధ్యానములతోను అజ్ఞానాలోచనలతోను దేహ మనో బుద్ధిరూపమై నశ్వరమైన ఆకారమును కల్పించుటయేకాక, అందులో ఆ విశ్వ వ్యాపియగు సత్య మిమిడియున్నదనికూడ మనలోనున్న అబద్ధపుటహంకారము మనకు తోచింప జేయును. ఈ దేహపరికరములు నశించవచ్చునుగాని ఆ మూలసత్యము మాత్రము నశించదు. మరియు కుమ్మరి ఘటమును సృష్టించి అందులో నాకాశము నుంచలేదు. అతడు ఆ అవకాశము (ఆకాశము) లోనే పనిచేసెను. ఘటమును తయారుచేయునపుడు అందులో నా యాకాశము ఇమిడియుండు నట్లే అతడు తయారుచేసెను. అట్లే ఈ దేహము ఆత్మలో, ఆత్మతో పుట్టినది కావున ఆ విశ్వవ్యాపియగు ఆత్మ దేహములోపల అధిదైవముగా నున్నది. మరియు అది ఈ దేహము లేకయే పుట్టునపుడు పెరుగునపుడు, జీర్ణించి రుజాక్రుష్టమై మరణించునపుడు బాహ్యమందే యుండును.

ఈ పైభావములవలన శ్లోకములోని ఉత్తరార్ధము దానంతట నదియె వివరించునదియై యుండవలెను.

శ్లో॥ హన్తా చేన్మన్యతే హన్తుం హతశ్చేన్మన్యతే హతం ।
ఉభౌ తౌ న విజానీతో నాయం హన్తి నహన్యతే ॥

హన్తకుడు తాను హత్యచేయుచున్నానని తలచినను, హతమైనవాడు తాను హత్యచేయబడితినని తలచినను ఈ ఇద్దరును ఏమియు తెలియని వారే యగుచున్నారు. ఏలనన ఈ ఆత్మ ఎన్నడును చంపదు; చంపబడదు.

ఈ మంత్రములోని భావమును ఎరువుతీసికొనుటయే గాక శ్లోకము యొక్క రెండవ భాగమును ఉన్నది ఉన్నట్లుగానే భగవద్గీతలో పునరుక్తమై యుండుటను గమనింపవచ్చును.

హంతకుడు శరీరమును గాయపఱచుటవలన ఆత్మను చంపితిననిగాని, హత్యచేయబడినవాడు తన ఆత్మకు మరణము తటస్థించినది యనిగాని

తలచినచో నీ యిద్దరును దేహము ఆత్మ యను మాయాభావము కలవారగు చున్నారు. పింగాణీకప్పును క్రిందపడవేసినవుడు అందులోని ఆకాశ భాగమును పగులగొట్టితిమని తలచుటలో ఎంత అజ్ఞానమున్నదో అంతయే పైభావమునందును ఉన్నది.

ముందటి మంత్రములయొక్క చర్చలను జాగ్రత్తగా వినినవారికి ఈ మంత్రార్థము చానంతట అదియే స్ఫురించును.

శ్లో॥ అణోరణీయాన్మహతో మహీయానాత్మాస్య జన్తో

ర్నిహితో గుహాయాం ।

తమక్రతుః పశ్యతి వీతశోకో ధాతుప్రసాదా న్మహి

మాన మాత్మనః ॥ ౨౦ ॥

ఈ ఆత్మ అణువుకంటె అణువుగాను, మహత్తుకంటె మహత్తుగాను నుండి ప్రతి ప్రాణియొక్క హృదయకుహరమునందు నివసించుచున్నది. మనో బుద్ధీంద్రియముల అనుగ్రహముచే ఎవడు సంకల్పవికల్పములనుండి విముక్తుడగుచున్నాడో, అట్టివాడు పైన చెప్పబడిన ఆత్మయొక్క ఇట్టి మహిమను తెలుసుకొని దుఃఖవివర్జితు డగుచున్నాడు.

ఈ శ్లోకము చాలామంది వేదాంతులచేతను, ఆచార్యులచేతను ఉదా హరింపబడువానిలో నొకటి. అకర్షణీయమై సంక్షిప్తతతో గూడి ఈ మంత్రము ధ్వనికి నిధియై సమస్త సాధకులకు గమ్యమైన ఆ యాత్మను సూచించునది యై యున్నది. అణువుకంటె అణువు అని ఆత్మను నిర్వచించుటచేత బుద్ధిహీనుడైనవాడు వైజ్ఞానికులు అణువును చూచునట్టి సూక్ష్మదర్శినీ యంత్రమును కనిపెట్టలేదు కాబట్టి 'ఆత్మను ఎవరును చూడలేదు, అది ఎవరిచేతను కనిపెట్టబడలేదు' అని అనుకొనవచ్చునుగాని శాస్త్ర సంస్కా రము గల వేదాంతియొక్క హృదయమునకు ఈ వాక్యము ఆత్మయొక్క మహత్త్వమును, సూక్ష్మత్వమును వివరించునదై యున్నది. శ్రుతి యీ వాక్యముతోనే ఆగినయెడల "మహత్పదార్థములందు ఆత్మతత్త్వము లేదేమో" అను సందేహము కలుగవచ్చును.

ఇట్టి సంభవింపనున్న అపార్థమును ఈ తరువాతి వాక్యముచేత నివారించుకొనవచ్చును. "మహతోమహీయాన్—మహత్తుకంటె మహత్తయినది." ఈ మహత్పదమునకు 'సృష్టింపబడిన విశ్వమునంతయు ఆవరించినద'ని యర్థము. శ్రుతిప్రకారము ఆత్మ విశ్వవ్యాపియే గాక, విశ్వము నావరించినదే కాక, విశ్వములో చొచ్చుకొనిపోవునదే గాక, అంతరాళములోని, అనేకవేల బ్రహ్మాండములనుకూడ వ్యాపించియున్నది. గీతలో ఇటువంటి వాక్యమునే కృష్ణుడు చెప్పియున్నాడు. "విష్టభ్యాహమిదం కృత్స్నం ఏకాంశేన స్థితోజగత్ (గీత. అ-10 శ్లో-42) సమస్త బ్రహ్మాండములతో నిండిన జగత్తు మాయలోని విఘాతములతో నిండుకొని యున్నది. ఇది నాలో నాలుగవ భాగముమాత్రమే." ఇట్లు చెప్పుటవలన యథార్థమైన ఆత్మతత్త్వము, మాయాతీతమై, ద్వంద్వాతీతమై మూడు భాగములుగా నున్నదనియు, మిగిలిన ఒక్క భాగము మాత్రమే యీ విశ్వమనియు తెలియుచున్నది.

ఇచట సత్యము అణువులో అణువనియు, మహత్తులో మహత్తనియు, వర్ణింపబడినది. ఈ సత్యము సర్వవ్యాపియనియు, అల్పాతి అల్పమైన స్థలముకూడా ఈ దివ్యప్రభావముచే ఆవరింపబడినదనియు తెలియుచున్నది. ఈ వాక్యముల తరువాత ఆత్మ—"జన్తోర్నిహితో గుహాయాం—జీవియొక్క హృదయకుహరములో నున్నది" అను వాక్యముచే వర్ణింపబడిన వర్ణన పాశ్చాత్య విద్యార్థిని తికమకపెట్టునదై యున్నది. అందుచేతనే యతడు "కఠోపనిషత్తు తేలికయైన శ్లోకములచే కూర్పబడినదనియు, కావుననే అది యీ కూర్పుసమయములోనే వాడుకనుండి తొలగింపబడినదనియు" ఆక్రందించుచున్నాడు.

ఈ ఉపనిషత్తునుగూర్చి చెప్పుటకు నిటువంటివి మరికొన్ని అబద్ధపు సాక్ష్యములుగలవు. కఠోపనిషత్తు కూర్పుయనుటయే యబద్ధము. 'సత్యము హృదయములో నివసించుచున్నది' యని చెప్పుట, ప్రత్యేక వ్యక్తి ధ్యానించి తెలిసికొనుటకు వీలైన యొక లక్ష్యమని సూచించుచున్నది. శ్రవణ మనన నాదులతో కూడుకొనిన వేదాంతసాధన ధ్యానమనెడు దైవప్రేరణచేతనే ఫలవంత మగుచున్నది. దీనికి మానవుడొక్కడే వారసుడు. అవిద్యా, కామ, కర్మలనెడి మానసిక బంధనములనుండి విడివడి స్వతంత్రస్థితికి—

దివ్యానందమునకు దారితీయుటకు ధ్యాన మొక్కటే మార్గము. ఈ మార్గముద్వారా ఆ పరమాత్మ – నిత్యానందరూపి, పై విశేషణములచేత సూచింపబడినదై యిచట నుదాహరింపబడినది.

అక్రతుః—సంకల్ప వికల్పములనుండి విముక్తుడు. జయశీలుడగు సాధకునకు నీ విశేషము వాడుటవలన ఉపనిషత్తులలోని ధ్వనిశైలిద్వారా శ్రుతి మహదర్థమును వ్యక్తపఱచుచున్నది. అక్రతు :—నిష్కామస్థితి. ఇచట వైరాగ్యమనగా అశక్తతాజన్యమైన అకర్మణ్యత కాదు. చెడు మార్గమునకు త్రిప్పబడి వివేకవంతుల మనుకొను గర్విష్ఠులగు కొంతమంది హిందువులు యిటువంటి అర్థమును లేవదీసినారు. 'తత్త్వాన్వేషియొక్క అంతశ్శక్తులను నశింపజేసి, తత్త్వజ్ఞానమునకు నసమర్థునిగా చేయునటు వంటి బాహ్యేంద్రియ విషయములనుండి సహజముగా విముక్తుడై స్వతంత్రు డగుటయే ఈ శబ్దార్థము'ని శ్రీశంకరులు స్పష్టముగా సూచించియున్నారు. తత్త్వేచ్ఛకూడ ఒక్కొక్కసారి మానవుని ఆత్మీయతను నశింపజేసి ఆతు రతను కలిగించును. అత డంత్యదశయందు ఈ ఆతురతనుకూడా విడచి పెట్టి ఆ పరమాత్మయందే విశ్రాన్తి పొందుచున్నాడు. అదియే మహత్తర సంకల్పమని నిర్ణయించుచున్నాడు. ఈ విధముగా 'అక్రతుః' అనుట వలన సాధకుని సాధన సాధ్యములు రెండును సూచింపబడినవి.

ఆర్యుల వ్యక్తిత్వము సాధారణముగా విషయములను భావించుట తోనే తృప్తిపడునది కాదు. ఆ భావము లెంత మహత్తరములైనప్పటికినీ, నిత్యకృత్యములలో నుపయోగపడి, తదనుగుణముగా నాచరణయోగ్యము లైననే యవి ప్రయోజనకరములని వారు తలచిరి.

దీర్ఘమై కఠినమైన ఆచరణలచే కోరికలనుండి విముక్తిజెంది మనస్సును ఇంద్రియములను వశముచేసికొనిన, అట్టి పవిత్రస్థితిలో స్వయంప్రకాశమైన ఆత్మతత్త్వమును సాధకుడు అనుభవించగలుగు చున్నాడు. ఆత్మైక్యజ్ఞానముచే, దుఃఖాదులు మనోదేహములకు సంబం ధించినవనియు, 'నేను దేహమనోబుద్ధులను సాధనములు గాను, వాటి కతీ తుడను' అనియు, తెలిసికొని వాటి నధిగమించుచున్నాడు. మోటారుకారు అలసిన, కారు యజమానికి అలసట కలుగదు కదా! మరియు తాను-తన మోటారుకారు ఒకటి కాదని యతనికి బాగుగా తెలియును.

మిమ్ములను వినోదపఱచు నుద్దేశముతో స్వామీజీ ద్వైతాద్వైత సంఘర్షణను చూచుటకు మిమ్ములను క్షణకాలము పిలువవచ్చును. శ్రుతి ప్రమాణము ప్రకారము రెండును అస్తిత్వము కలిగియున్నవి. ఈ శ్లోకములో 'ధాతుః ప్రసాదాత్' అను పదము కలదు. ద్వైతుల ప్రకారము 'ధాతుః' అనగా 'ధాత' సృష్టికర్త యని యర్థము. ఇది శ్రుతిభగవతి సిద్ధాన్తము గావున ధాత్వనుగ్రహమున్ననే యీ యాత్మతత్త్వము తెలిసికొనబడుచున్నదని ద్వైతులు చెప్పుచున్నారు.

ఇదే పదమును అద్వైతులు "ధాతు; సంప్రసాదాత్'—ఇంద్రియములయొక్క మనస్సుయొక్క పవిత్రతచేత" (ధాతు-పదార్థము) అని వ్యాఖ్యానించిరి. ఈ అద్వైతుల మతప్రకారము, ఇంద్రియములవలననే కాక, ఇంద్రియములతో నేకీభావముజెంది వాని వెనుకనుండి యంత్రమువలె పనిచేయు మనస్సువలననే, ఈ బాహ్యప్రపంచము యొక్క అస్థిత్వము తెలియబడుచున్నది.

ఇట్లు ఒకే పదము ద్వివిధ మతస్థుల ప్రకారము వివరింపబడినది. కాని ప్రత్యేకముగా చూచిన, లేక వివేకముతో పరిశీలించిన, ప్రత్యేక వాదములచేతను, అనివార్య తర్కములచేతను అవి రెండును మనలను అకర్షించును. ఇట్టి ద్వివిధ మతములను అనుసరించిన సాధారణ ప్రజ వారి వారి మతముయొక్క గొప్పతనమును స్థాపించుకొనుటకు ప్రయత్నించి, అందుకని వారు పట్టాభిషిక్తులైనట్లు తగవులాడుట సహజమే కదా. కాని నిజమైన తత్త్వాన్వేషి తన మార్గములో పరిశ్రమచేసి నిజమును తెలిసికొనగోరువాడైనచో, మధ్వ రామానుజ శంకర మతములలోని వైరుధ్యములను తొలగించి ఏయే దృష్టిలో వారి వారి ఉద్దేశములను వెల్లడించిరో గ్రహించి అర్థము చేసికొనును.

కాని ఈ వ్యాఖ్యాతలు వారి అభిమత మతసిద్ధాంతములకు ఉపనిషత్తులనుండి శాస్త్రీయానుమతమును పొందగోరినపుడే కష్టము సంభవించుచున్నది. యజ్ఞములు చేయువాడు హృదయపూర్వకముగా భగవంతుని ప్రార్థించినయెడల దానిఫలము దేవతాప్రీతి అని వేదములు ఒప్పుకొనుచున్నవి. దీనితో సమానాంతరముగా చూచిన అత్మ తనను సాక్షాత్క

రింపజేసుకొనుట తప్ప ఆత్మానుగ్రహము అనునది వేరేదియు లేదు. కావున శ్రీ శంకరులవారు ధాతుః ప్రసాదాత్ అనుదానికి 'సాధకునిలో సూక్ష్మ పదార్థములను పవిత్రము చేయుటవలన' అని అర్థము చెప్పుటలో సామంజస్యమున్నది. ఇచట సూక్ష్మపదార్థములు మనోబుద్ధులు - పవిత్రమైన బుద్ధి ఏకాగ్రతగల మనస్సు ఆత్మైక్యమును పొందుటకు తగియున్నవి. కావున అవి ఆత్మైక్యమును పొందునపుడు కలుగు ఆనందమే ఆత్మానుగ్రహమని తాత్పర్యము. ఆత్మైక్యము కలుగుటకు సహాయపడునట్టి యీ పవిత్ర శాంతికి ఆత్మానుగ్రహ మావశ్యకమై యున్నవి.

ప్రయత్నములన్నింటిని ఒక కార్యరూపముగా సంగ్రహించిన, ఆ కార్యము శక్తిమంతమై కావలసిన చలనశక్తి గలిగి, విజయమును పొందుచున్నది. అట్లే తత్త్వాన్వేషి యొక్క ఆత్మపావనతకు చేసిన ప్రయత్నములు కూడ సఫలము కాగలవు. ఇట్లు చేసిన ప్రయత్నము లన్నియు ఏకమై దివ్య శక్తిగా మారి తదనుగ్రహముచే ఆత్మలాభమును పొందుచున్నాడు. కేవలము వేదాంతసిద్ధాంతముమీదనే జీవించు వేదాంతులమగు మనకు ఏ మతమును వ్యతిరేకమైనదికాదు. వేదాంతియొక్క బుద్ధి ఎట్టి సమస్యనైనా ఆ పరమ సత్యము పేరిలో పరిష్కరించగలదు.

శ్లో॥ ఆసీనో దూరం వ్రజతి శయానో యాతి సర్వతః ।
కస్తం మదామదం దేవం మదన్యో జ్ఞాతు మర్హతి ॥

కూర్చొనియుండియే దూరముగా పోవుచున్నాడు. శయనించియే సర్వత్ర సంచరించుచున్నాడు. కావున నాకంటె ఎవడు హర్ష శోకములు లేని భగవంతుని తెలిసికొనగలుగుచున్నాడు ?

డ్యూసన్ చెప్పుచున్నాడు—"ఈ రెండు గుణములు ఒకదానినొకటి రద్దుచేయునట్లుగ బ్రహ్మయందారోపింపబడినవై, శాస్త్రజ్ఞానము లేక బ్రహ్మ జ్ఞానము కలుగుట యసంభవమని చెప్పుచున్నవి."

ఆ పరమ సత్యమును నిర్వచించుటలో నిష్ఫలమైన ప్రయత్నములు గలవై శాస్త్రములు భేదాభిప్రాయములు గలవగుచున్నవి. కాని ఇచట ఈ విశేషణములు పరస్పర విరుద్ధములే గాక మాటలచేత ప్రకటింపలేని వాస్త

వికతతో "మహామదం—మదము కలిగి, మదము లేక (మత్తుడైనప్పటికిని ప్రశాంతుడై) ఉండునట్టి ప్రభువును, 'శక్తిమంతము, కాని శాంతమైన' ఆత్మను" గుఱించి సత్యమునే సూచించుచున్నవి.

వర్ణింప శక్యముగాని ఆత్మ, పరిమితమైన అర్థములు గలిగి, ఆద్యంతములు గల భాషలో తాను ఇముడవలసివచ్చినచో, ఉపయోగింపబడిన పదములు, వాక్యములు వంకరటింకరలై వైరుధ్యముగలిగి ధ్వంసమగును. అర్హత గల విద్యార్థిమాత్రమే ఆవశ్యకమైన బుద్ధి, హృదయము గలవాడై ఈ పదజాలముగుండ అవలకు తొంగిచూచి ఆ పరమాత్మయొక్క సౌందర్యమును సత్యమును కనుగొనుచున్నాడు. ఇది అర్హత గల గురువునుండి శ్రుతిమంత్రముల చర్చలు వినినప్పుడే విజయవంతమగుచున్నది.

ఆసీనుడయ్యే దూరముగా పోవుచున్నాడు :—మన మనోబుద్ధీంద్రియములమీద అధ్యక్షత వహించు శుద్ధచైతన్యమే ఇచట కూర్చున్న ఆత్మగా పరిగణింపబడుచున్నది. ఈ సత్యము శక్తి నిచ్చినవెంటనే, మానసిక భావనాతరంగము సూర్యకాంతి ప్రకాశితములైన ఇటలీలోని స్థలములను చూచుటకును, అచట అదివరకే యున్న చైతన్యమును లేక అస్తిత్వమును కలుసుకొనుటకును ఇచటనుండి యూరోపునకు ఎగిరిపోవుచున్నది. వాస్తవములో సర్వవ్యాపియైన సత్యము కదలక కదలజాలకపోయినను "ఈ పై ఉద్దేశముతోనే ఆత్మ దూరదేశములకు ప్రయాణము చేయుచున్నది" అని చెప్పుచున్నాము.

మనము ప్రక్కగదిలోనికి వెళ్ళుచున్నామనగా మనమున్న స్థలమును విడచుచున్నామనియు, మనము లేని స్థలమును—ఎచట మనము మరుక్షణముందుమో దానిని సూచించుచున్నది. ఒకవస్తువు పరిమితవ్యక్తిత్వము కలదైననే ఈ కదలిక సంభవించును. కాని అది సర్వవ్యాపి యైనచో తా నెక్కడకు పోగలదు? అదివరకు అది వ్యాపించని స్థలమే లేదు. ఉదాహరణకు, నీ కుడిచేయి నీ కుడిచేయియంతట వ్యాపించియున్నదిగాన నీకుడిచేయి నీకుడిచేతిలోనే ప్రవేశింపలేదు. "రెండు వస్తువులు ఒకే సమయములో ఒకే స్థలములో ఇముడలేవు" అని, నవీనులు మెచ్చుకొని ప్రశంసించిన అధునిక విజ్ఞానశాస్త్రముయొక్క సిద్ధాంతము.

కావున, ఆత్మ లేక జీవనకేంద్రము కదలిక లేని సత్యము. కాని అది మనస్సు చే నియమితమై దానిచే వ్యక్తపరుపబడినపుడు భాషతరంగముల రీతిని చలనరూపము పొందినట్లు గోచరించును.

"నాకంటె ఇంకెవరు ఈ దైవతత్త్వమును తెలిసికొనగలరు?" (కస్తం మదామదం దేవం మదన్యో జ్ఞాతుమర్హతి) అను నీ మంత్రములోని ఉత్తరార్థము, సరిదిద్దుటకు వీలులేని గర్వాహంకారములు గల ఒక రాక్షస వ్యక్తి, శ్రోతలు తనను ప్రశంసించి ప్రోత్సాహించుచుండ, సాయంకాలపు చర్చలలో మాట్లాడు వాక్యమువలె నున్నది. కాని మిత్రులారా! ఇచట అటువంటి అహంకార ముద్దేశింపబడలేదు. మృత్యుదేవత అట్టి అహంకారియే యైనయెడల ఇప్పుడున్నట్లు ఆతడు జ్ఞానిగాను ఆత్మజ్ఞానముగల వాడుగాను ఉండజాలడు. మఱియు తన ప్రియపుత్రుడైన నచికేతునికి అధ్యాపకుడుగా ఉండుటకు అటువంటి గురువును శ్రుతి తన భవనము లోనికి రానిచ్చుటకూడ మిక్కిలి యయుక్తముగా నుండును.

ఇచట గురువుయొక్క అభిప్రాయము:—ఒకడు తన మనోబుద్ధుల మీద తగినంత అధికారముండి, నిష్కపటమైన క్రమశిక్షణద్వారా ఆత్మ సంయమనము కలిగినయెడల ఆ యాత్మను తెలుసుకొనగలుగుచున్నాడు. ఆ సత్యస్వభావముపై ఉన్నత ధ్యానము చేయుటవలన యా యధికారి సర్వవ్యాపియై, విరోధాభాసమగు మనోజ్ఞభాషలో వర్ణితమైన ఆ సత్యాత్వాను భూతి కలిగి, క్రోడీకరింపబడిన మహత్వస్థితిని పొందగలుగుచున్నాడు. మనస్సనునదే శుద్ధముగా లేనిచో కనుగొనిన సత్యముకూడ పరిపూర్ణమైనది కాజాలదు. అద్దమువలె సత్యముకూడ తన యెదుటనుండు వస్తువులను యథాతథముగా ప్రతిబింబింప జేయుచున్నది. ఉదాహరణకు, దాస్ అను నతడు, స్నానపు తువ్వాలు కట్టుకొనిగాని, ఆఫీసుదుస్తులను ధరించిగాని, వైవాహికవేషము కలవాడైగాని, లేక తన యిష్టప్రకారముగా యెన్నుకొనిన యెట్టి దుస్తులు ధరించిగాని, అద్దముముందర నిలబడినచో ఆ అద్దము అట్టి ప్రత్యేక దుస్తులతోనూడిన రూపమునే ప్రతిబింబింపజేయునుగాని యితర మైన మరెట్టి రూపమును ప్రతిబింబింపజేయదు. అట్లే మలినబుద్ధి మలిన సత్యమునే అనుభవించును.

శ్లో॥ అశరీరం శరీరేష్వనవస్థేష్వవస్థితం ।
మహాన్తం విభుమాత్మానం మత్వా ధీరో న శోచతి॥

దేహములందు దేహము లేనివానిగను, అనిత్యములయందు నిత్యునిగను, మహాత్మునిగను, సర్వవ్యాపిగను, ఆత్మను తెలిసికొని ధీరుడు దుఃఖింపడు.

ఈ దేహమనోబుద్ధ్యాది పరికరములే ఆత్మయనియు, వానికంటె యితరమైన మరియొక సత్యము లేదనియు భావించు మనయొక్క భావనయే, మనకు గలుగు ఈ బాధలు, దుఃఖములు, నిరాశా నిస్స్పృహలు, ఆశా ఆకాంక్షలు, రోగములు మరణము మొదలైనవాటికి ముఖ్యకారణము.

నచికేతునివలె పరిణతి జెందిన మనోబుద్ధులు గలవాడు తన పరిపక్వమైన వివేచనతో ఆత్మను ప్రశ్నించి తెలిసికొనుటకు, అన్వేషించి కనుగొనుటకు వచ్చినయెడల, అట్టి సాధువు పరిమాణ పరాకాష్ఠ నందుకొని, పరిపూర్ణస్థితిలోనుండి, ఆ పరమ సత్యముతో శాశ్వతముగా ఆత్మైక్యమును పొందుచున్నాడు. అటుపిమ్మట సహజముగనే అతడు దుఃఖములుగాని, పరిమితులుగాని లేనివాడగుచున్నాడు. ఈ అభిప్రాయమునే పైమంత్రము వివరించుచున్నది.

మానవుడు భగవంతుడు కాగోరినయెడల యాతడు తన మలిన మనస్సునందలి, పైశాచిక రూపములు దాల్చిన భావములను, శనిగ్రహము వంటి కిచకిచలను, అహంకార గర్వమును పూర్తిగా త్యజించవలయును. అసత్యమునుండి సత్యమునందు సంసక్తులు కండు! దానిలోనే నిజమైన ముక్తి, విజయము, సిద్ధి గలదు.

శ్లో॥ నాయమాత్మా ప్రవచనేన లభ్యో న మేధయా
న బహునా శ్రుతేన ।
యమేవైష వృణుతే తేన లభ్యస్తస్యైష
ఆత్మా వివృణుతే తనూం స్వాం ॥ ౨౩ ॥

ఆత్మ వేదపాఠముచేగాని, వివేకముచేగాని ఎక్కువగా వినుటచే గాని లభ్యమగునదికాదు. ఎవరు దానిని వరించెదరో వారికే అది లభ్యమగును. ఇటువంటివారికి ఆత్మ తన స్వరూపమును తానే స్వయముగా వెల్లడిచేసుకొనును.

కేవల పుస్తకజ్ఞానము జ్ఞానమేకాదు. ఇది మనకు తెలిసిన అన్ని శ్రుతులయందలి యేకాభిప్రాయము. భాషావశములోనున్న అతి తేలిక పదముల నుపయోగించు శైలిగల విశ్రుతి గ్రంథములలోని శబ్దార్థములను గుఱించి, సంస్కృతభాషా లక్షణములు తెలిసిన ప్రతివ్యక్తి అంతులేకుండా, చర్చించగలడు. యథార్థజ్ఞానముచే సంపాదింపబడిన అనుగ్రహరూపమును, ఉపనిషత్సిద్ధాంత భూతమును, చైతన్య కారణమును అగు మనలోని ఆత్మయొక్క స్వకీయానుభవమును గూర్చి ధనము కొఱకు దేవాలయము లలో మాట్లడువారిని, శబ్దాడంబరమును వ్యక్తపరచు వారిని అనుగ్రహించుటకు శ్రుతిమాత నిరాకరించుచున్నది.

కొంతమంది అజ్ఞానులైన పండితులు, పవిత్రగ్రంథములలోని కొన్ని ముఖ్యాంశములను కంఠస్థము చేయుటతోనే, ఆత్మజ్ఞానము కలుగగలదని భావించుచున్నారు. మేధ యనగా బుద్ధియొక్క జ్ఞాపకశక్తి. కొంతమంది నాలుగు వేదములను జ్ఞాపకముంచుకొను శక్తి గలవారు మన పండితులలో నున్నారు. వారిని చతుర్వేదులందురు. సంపూర్ణభాగవతమును శ్రీధరీయ వ్యాఖ్యతో కంఠస్థము చేసిన ఒక మలబారు బ్రాహ్మణుడు ఈ సాధువునకు తెలియును. పది ఉపనిషత్తులలోని అన్ని మంత్రములను శంకరభాష్య సహితముగా కంఠస్థము చేసి గానముచేయు మహాత్ములు చాలమంది కలరు. భౌతిక ప్రపంచములో వారియొక్క శక్తిని ప్రశంసించి మెచ్చుకొని మన ఆదరాభిమానములను చూపుటకు సిద్ధపడినను, ఇచట శ్రుతి వారిని పూత్కారముతో చీదరించుకొని అది వ్యర్థమైనదని ప్రయోజనము లేనిదని విసర్జించుచున్నది. శ్లోకములు కంఠస్థము చేయుట మంత్రములమీద చర్చలు చేయగలుగు శక్తి నలవఱచుకొనుట అనునవి ఒక వ్యక్తిని శ్రుతిచే సూచింపబడిన గమ్యస్థానమును చేర్చలేవు.

ఇంకను మరికొందరు కేవలము సత్సంగసభలలో హాజరగుటకు ప్రాధాన్యమిచ్చెదరు. అట్టివారు ఎట్టి చీకాకైన పడి, ఎంత దూరమైనా ప్రయాణము చేసి ఏదో విధముగా ఆధ్యాత్మిక చర్చలు జరుగు కూటములో ఉన్న చాలునని తలచెదరు. ఆ కూటమునకు వచ్చినవెనుక చాలమంది మందకాంతి గల దీపముక్రింద సుఖకరమైన ఒక మూలను కనుకొని గోడకుగాని స్తంభమునుగాని చేరబడి విశ్రాంతి పొందుచు, మనస్సును మౌనముగా తన ఇంటివైపునకు తమ మిత్రులవైపునకు మరలించెదరు. శరీరముతో సత్సంగమందు కూర్చున్నను మానసికముగా మతివిషయమై వారు గట్టిగా మూతవేసి బిగించిన విషద్రవ్యము గల గాజుబుడ్లువంటి వారగుచున్నారు. స్వామిజీ అతిశయోక్తిగా చెప్పలేదు. ఇచట అధమపక్షము అరడజనుమందైనా చెవులు చిల్లులుపడునట్లు అరచు నీ విషయమును విననివారుకూడ తప్పక ఉండవచ్చును.

వేదాధ్యయనము, కంఠస్థముచేయుట, సత్సంగము అనునవి యేవియు ఆత్మానుభవమునకు తోడ్పడలేకపోయినపుడు ఆ పరమ సత్యమైన ఆత్మ జ్ఞానము అసంభవమైనదనియా అభిప్రాయము? శ్రుతి ఈ మంత్రముయొక్క ఉత్తరార్థములో అది సంభవమనియే చెప్పుచున్నది. కాని మనము మహర్షుల యొక్క మార్గమును, నిరంతరముగా నిష్కపటముగా విశ్వాసముతో అనుసరించవలెను. శ్రద్ధతో ఆత్మను అన్వేషించువానికి ఆత్మ స్వయముగనే తనను వెల్లడిచేసుకొనునని శ్రుతి చెప్పుచున్నది. మన ఆత్మతత్త్వమును చేరుటకు ప్రాకారములవలె నిలుచు కామక్రోధాదులు, జాతిమతాహంకారములు, నిర్ధనిక ధనిక భేదములు, స్వార్థము, అహంభావము, మొదలగు వ్యతిరేకమైన మానసిక భావములను త్రోసివేయుటయే 'అన్వేషణ' యని చెప్పవచ్చును. ఇట్టి బీభత్సమైన ఈ స్వయంకృతాపరాధములయొక్క వివరములు మనమే మన నిర్వాసమును ఎన్నుకొనునట్లు చేయుచున్నవి. అని ఈ క్రింది శ్లోకములో సూచింపబడినది.

'వృ' ధాతువునకు 'ఎన్నుకొనుట లేక ఆవరించుట'యని యర్థము. 'వృణుతే - (వరించుచున్నాడు) ఎన్నుకొనుచున్నాడు.' 'వివృణుతే - వెల్లడి యగుచున్నది - ఆవరణరహితమగుచున్నది - బయలుపడుచున్నది.

శ్లో॥ నా విరతో దుశ్చరితాత్ నాశాన్తో నా సమాహితః।
నాశా న్త మానసోవాపి ప్రజ్ఞానేనైన
మాప్నుయాత్ ॥ ౨౪ ॥

దుశ్చరితములనుండి మరలనివాడును, ఇంద్రియనిగ్రహము లేని వాడును, ఏకాగ్రమనస్సు లేనివాడును, మనస్సును శాంతపఱచనివాడును కేవలము జ్ఞానముచేత ఆత్మను పొందలేడు.

ఈ శ్లోకము వెనుకటి శ్లోకముతో అన్వయము కలది కావున దానితో దీనినికూడ చదువవలెను. వెనుకటి శ్లోకములో చెప్పబడిన 'శాస్త్రపాఠము చేతను, ప్రవచనములచేతను, అట్టి ప్రవచనముల వినుటమాత్రముచేతను ఆత్మదర్శనము కానేరదు'' అను అభిప్రాయముతో ఈ శ్లోకములోని అభిప్రాయము సంబంధించియున్నట్లు తోచుచున్నది.

ఇచట మృత్యుదేవత మనము మన అజ్ఞానముచేత ఆత్మకును మనకును మధ్య లేవనెత్తిన ప్రహరీ గోడను వివరించుచున్నాడు. ఈ మంత్రములో ఆత్మానుభూతి తత్ఫలితమగు ఆనంద రససిద్ధి ఈ క్రిందివారికి నిరాకరింపబడినవి. (1) అధర్మాచరణమునుండి మరలనివారు, (2) ఇంద్రియ నిగ్రహము, ఏకాగ్రత కలిగించు మనస్సమాధానము, శాంతి లేనివారు (3) కర్మఫలములను గూర్చిన ఆతురత ఆరాటములతో మనశ్శాంతిని పొందనివారు.

మన ఆధ్యాత్మిక సాధనలను దృఢపరచుటకు కావలసిన సూచనలన్నియు నీ మంత్రములో చేయబడినవి. ప్రప్రథమముగా సాధకుడు అధర్మము అన్యాయము నుండి విరమించవలెను. అట్లు విరమించిననేగాని జప తపాదులు, పూజా పురస్కారములు, చందన కర్పూరాదులు, చర్చి మసీదు దేవాలయ గమనములు, ఏవియును సాధకుని ఆధ్యాత్మికాభివృద్ధికి తోడ్పడవు. ఎవరైతే పదిమంది పిల్లల తండ్రియో, ఎవడైతే ఒక కానీ కొఱకు ఎటువంటి అబద్ధమునైన చెప్పునో, ఎవడైతే తన కప్పుపాలలో చీమలతో నిండిన చక్కెర కలుపుటచే ఎక్కువ రుచిని అనుభవించగలడో,

అట్టివారే సాధారణముగా వినుచున్న మతనిందను చేయుచున్నారు. వారికి ఆత్మసంయమనము గాని నీతి నిజాయతీ గాని, అహింసాతత్త్వము గాని ఉండదు. మఱి మన మతమైతే బ్రహ్మచర్యము సత్యము అహింస అను సిద్ధాంతములపై ఆధారపడి యున్నది.

ఒక వ్యక్తి కొద్దికాలముపాటైనా ధర్మమును గౌరవించిన అధ్యాత్మికాచరణలకు అర్హతను పొందుచున్నాడు. మరియు పరిపూర్ణత గల మహాలోకములను చేరుటకు ఆశించువాడు, అనంతముగా దుఃఖములను కలిగించు విషయములయందు పిచ్చిగా అనందించు ఇంద్రియములను నిగ్రహించుకొనవలెను. ధర్మయుత కర్మాచరణమువలన, వ్యక్తి తన కర్మలకు పరిమితి కల్పించుకొని, ఇంద్రియములపై కొంత యధికారము సంపాదించినపుడు, మనస్సు తనంత తానే శక్తివంతమై సామర్థ్యము కలిగిన దగుచున్నది. ఈ స్థితిలోకూడ సాధకుడు తన మానసికమైన ఆతురతలనుండి సంపూర్ణముగా విడివడి, ఆంతర శిక్షణకు లోనైన, ఇంద్రియ నిగ్రహము, స్వార్థత్యాగము మొదలైన పద్ధతులతో కూడిన తపశ్చర్య ఫలవంతము కాగలదు.

యోచించగా నిచట అట్టి పూర్ణాధికారము గల సాధకులు చాలా స్వల్ప సంఖ్యాకులుగా నున్నారని సూచించుటయే మృత్యుదేవతయొక్క తాత్పర్యమని రానడే చెప్పుచున్నాడు. అట్లని వేదాంత పథమున కర్హుడైన విద్యార్థి, ఉషఃకాలమందలి మంచుతోపాటు వికసించు మొగ్గలపై కుఱికి తన బరువుచేతనే తాను క్రిందకు దొరలు వనదేవతవంటివాడు కాడు. అర్హత గల విద్యార్థి శ్రద్ధయొక్క త్వరితగతికి, నిష్కపట అనుసరణకు మధ్య నలిగిపోవుచున్నాడు. అట్టి శిక్షణా కేంద్రములు ఎంత అరుదు!

21-వ మంత్రములో మృత్యుదేవత యిట్టి యుద్దేశముతోనే "నాకంటె యితరు లెవరు యీ బ్రహ్మవిద్యను తెలిసికొన గల్గుచున్నారు?" అని ఆక్రోశించెను.

శ్లో॥ యస్య బ్రహ్మ చ క్షత్రంచ ఉభే భవత ఓదనః।
మృత్యుర్యస్యోపసేచనం క ఇత్థా వేద యత్ర సః॥

[ఎవనికి బ్రహ్మ క్షత్రియ జాతులు రెండును అన్నమగుచున్నవో, మృత్యువు ఊరగాయ అగుచున్నదో, అటువంటిదగు ఆ ఆత్మ ఎచట నున్నదని ఒకడు ఎట్లు తెలుసుకొనగలడు?]

(ఇంతటితో ప్రథమాధ్యాయములోని ద్వితీయ వల్లి సమాప్తము)

సాధకులు అన్వేషించు ఆత్మ యను ఆ మహత్తత్త్వమే నామరూపములతో కూడిన ప్రపంచముల అస్తిత్వమునకును, వాటి కార్యాచరణముల కును, కారణభూతమైన ముఖ్యాంశ మగుచున్నది.

సత్యము సమస్త జగత్తును ఆవరించియున్నది. జడములై మృతచ్ఛాయలైన ఈ సత్యాభాసము లన్నియు శుద్ధచైతన్యముద్వారానే పని చేయగలవు. ఆ పరమైన అస్తిత్వములోనే ఇంద్రియగోచరములగు నామరూపాత్మక ప్రపంచములుకూడ తమ అస్తిత్వమును కలిగియున్నవి. ఈ భావ మీ మంత్రములో కవితాశైలిలో వెల్లడియైనది. సమస్త పదార్థములలో మానవు డుత్తముడు. అట్టి మానవులలో, ఉత్తములైన బ్రహ్మ క్షత్రియ వర్గములుకూడ ఆ పరమసత్యముచేత కేవలము వండిన అన్నమువలె కబళింపబడి జీర్ణము చేసికొనబడినవని యనుటలోనే, యా కవితాభావము స్ఫురించుచున్నది. వ్యక్తమగు యీ ప్రపంచమంతయు ఆ యాత్మకు ఒక్క క్షణములో జీర్ణమగు కబళముమాత్రమే. అటువంటి మహాత్మునికి, భీతావహమైన మృత్యువుకూడ తన ఆకలిని అభివృద్ధిపఱచి రుచిని ఎక్కువచేయు ఊరగాయవంటిదే. శుద్ధచైతన్యముయొక్క ప్రభావ ప్రభుత్వములు అంత గొప్పవి కావుననే యితఃపూర్వము వివరింపబడిన ఆత్మపవిత్రీకరణము, ఆత్మపరిపూర్ణతను పొందు సాధనలను క్రమముగా అనుసరించిననే గాని, ఆ యాత్మతత్త్వమును సాధారణ మానవులు గ్రహించి యనుభవించుట కష్టతరమైనదని చెప్పవచ్చును.

**21-25** శ్లో॥ ఇట్టి ఆత్మను ఎట్లు తెలిసికొనుట; బుద్ధికుశలత, పాండిత్యము, శాస్త్రజ్ఞానము, అధ్యయనము చింతన ఇవన్నియు నిష్ఫలములే. కాని మనశ్శాంతి కలిగి పవిత్రుడైనవానికే ఆ పరమాత్మయొక్క సన్నిహితానుభవము కలుగుచున్నది. ఎటువంటి పదవి, అంతస్థులలో నున్నప్పటికిని మిగత యందరు మృత్యువున కాహారములే యగుచున్నారు.

---

# తృతీయవల్లి

రథమును గూర్చిన కథ. అధ్యాత్మయోగమును, జీవాత్మ పరమాత్మల సమ్మేళనమును తెలియజేయుచున్నది.

శ్లో॥ ఋతం పిబన్తౌ సుకృతస్య లోకే గుహాం ప్రవిష్టౌ
పరమే పరార్ధే ।
ఛాయాతపౌ బ్రహ్మవిదో వదన్తి పంచాగ్నయో
యే చ త్రిణాచికేతాః ॥ ౧ ॥

ఆ పరమాత్మకు స్థానమైన హృదయకుహరములో కూర్చొని యే యిద్దరు తమ సుకృత ఫలముల ననుభవించుచున్నారో, వారిని బ్రహ్మజ్ఞానులు, పంచాగ్నుల నారాధించి, త్రిణాచికేతాగ్నిని వేల్చు గృహస్థులు కూడ ఛాయాతపములని చెప్పుచున్నారు.

ఈ తృతీయవల్లియందు దేహాత్మవివరణ సందర్భములో ప్రసిద్ధమై దివ్యమైన రథముయొక్క రూపక ముపయోగింపబడినది. ఆ రథముమీద, సారథియు యజమానియు నాసీనులగుదురు. అట్లే యీ దేహములో పరమాత్మ జీవాత్మలు ఆసీనులైయున్నారు. ఇట్టి సంపూర్ణమైన యాధ్యాత్మిక యోగమే యిచట వివరింపబడుచున్నది.

ఇట్టి జీవాత్మ పరమాత్మలనెడు నీ రెండు విషయములను పరిచయ పఱచుటకే యీ వల్లిలోని ప్రప్రథమ శ్లోకములోనే గృహస్థులైన పండితుల చేతను, బ్రహ్మజ్ఞానులచేతను ఏకగ్రీవముగా నిచట నొక ప్రకటన చేయ బడినది. ఈ జీవాత్మ పరమాత్మలు రెండును నీ దేహమును నధిష్టించి, దానిని యాచరణయోగ్యముగా చేయుచున్నట్లు కనబడుచున్నప్పటికిని నీ రెండింటిలో నొకటి యింకొకదానికి ప్రతిబింబము మాత్రమేనని పైరెండు తరగతులవారు ప్రకటించుచున్నారు.

ఛాయ లేక ప్రతిబింబము స్వతంత్రమైన అస్తిత్వము లేనిది. అది ప్రకాశముగాని ఒక ప్రకాశించు వస్తువుగాని ఉన్నప్పుడే ఉండును.

సంస్కృతి లేని నరపశువుయొక్క మానస సరోవరములో కోరికలచే ప్రోచ్ఛలముపొందిన యోచనాతరంగములు స్వేచ్ఛానుసారముగా పైకిలేచి క్రిందబడుచు శాశ్వతముగా నుండును. తమ దుండగములను మనస్సు నెదుటకు తన్నుచున్న యోచనా తరంగముల నృత్యోన్మృత్యములలో మారుచు చలించుచున్న ఒక ఛాయ యుద్భవించుచున్నది.

ప్రత్యేక వ్యక్తి తన అంతరదృష్టిలోపించగా బాహ్యదృష్టిగలవాడై ఈ ఛాయను చూచి దానితో ఐక్యమును పొందుచున్నాడు. ఈ చాయ లేక అహంకారము లేక సంసారియే యీ శరీరములోని పీడలను, మానసిక బాధలను, బుద్ధియొక్క పరాజయములను, మరియు ఆధ్యాత్మికతా భావములను ఐహిక బాధలను అనుభవించువాడు. ఈ ఛాయను జీవాత్మయని యనుచున్నాము. దీనికి—అహంకారమునకు కారణభూతమై ప్రకాశరూపమైన మనలోని దైవికసూత్రమును పరమాత్మయని పిలుచుచున్నాము.

ఋతం—నామవాచకముగా వేదములలో చాలా ప్రాముఖ్యమును వహించినదియై కేవల ధర్మముకన్న కొంచెము ఎక్కువ అర్థము కలిగి యున్నది. ఇది కర్మలను వాటి ఫలములను కలుపు 'దివ్యశాసనము.'

కర్మయొక్క ఫలములు ఒక్క జీవాత్మచేతనే అనుభవింపబడు చున్నవి. ఏకవచనమునకు బదులుగా ద్వివచనము ఉపయోగింపబడినది, కావుననే శ్రుతివాక్యము పరమాత్మ జీవాత్మ లిరువురునూ అనుభవించుటలో భాగస్థులని సూచించుచున్నది. శాశ్వతమై పరిపూర్ణమైన ఆత్మ కర్త కాదు భోక్త కాదని అనేకసార్లు చెప్పి దానిని నిలబెట్టుకొనుచున్న శ్రుతికి, తన స్వీయప్రకటనకే వైరుధ్యము వచ్చుచున్నది గాన ఈ వాక్యమును యథాతథముగా మనము అర్థముచేసికొనకూడదు. ఆ ఆత్మ సమస్త కర్మలను, తత్ఫలములను, ఆనందములను ప్రకాశింపజేయువాడు మాత్రమే.

అయినప్పటికిని ఈ మంత్రములో "వారిద్దరు తమ సుకృతముల ఫలములను అనుభవించుచున్నారు" అని ద్వివచన ముపయోగింపబడినది.

ఈ క్లిష్టత శ్రీ శంకరుల వ్యాఖ్యానములో పరిష్కరింపబడినది. జ్యోతిరూప మైన ఆత్మ లేనిదే ఈ ఛాయారూపమైన అహంకారమునకు అస్తిత్వమే లేదు కావున అవి రెండును సాధారణముగా జోడింపబడినవి. ఇట్టి జోడింపుల యుదాహరణము మన నిత్యజీవితములో తఱచు చూచుచున్నాము. ఒక సమూహములో అనేకమంది ఛత్రములు ధరించువారు నడచుచున్న (లేక గాంధీటోపీ ధరించువారు నడచుచున్న) ఒకరిద్దరు ధరించనప్పటికిని ఛత్రములవారు, అనగా ఛత్రములు ధరించువారు (లేక కాంగ్రెసువారు) నడచుచున్నారు అని దైనందిన వ్యవహారములో సూచించెదము.

ఇదే విధముగా జీవాత్మ పరమాత్మల (అసత్యమైన - నేను, సత్యమైన నేను) — సహస్థితి కలిగినటుల కనబడుచుండుటవలన జీవాత్మకు సంబంధించిన భ్రాంతియుతానందానుభవములను కలిగించు కర్మఫలములు సాక్షీభూత శాశ్వత జ్యోతిర్మయ జ్ఞానరూపమగు పరమాత్మతో జోడింపబడినవి. ఇది ముండకోపనిషత్తులో మరింత తేటతెల్లము చేయబడినది. బుద్ధికి స్థాన మైన ఆ హృదయకుహరమందు జీవాత్మ పరమాత్మలు నివసించునట్లు చెప్పబడియున్నది. హృదయములో బుద్ధి యున్నదను నభిప్రాయమును ఇంతకుముందు అనేకసార్లు వివరించి యుండుటచే దానిని సాంగముగా నిచట చర్చించ నవసరము లేదు.

ఇచట కఠోపనిషత్తు ధ్యానమార్గముయొక్క మహత్త్వమును వర్ణించు చున్నప్పటికిని " గృహస్థ జీవనమును కాదనుటలేదు " అని తెలిసికొనుట చాలా కుతూహలకరమైన విషయము. వారుకూడా ఆ సత్యమును ఆంతర దృష్టిలో పొందగలుగుచున్నారు.

శ్లో॥ యః సేతురీజానానామక్షరం బ్రహ్మ యత్పరం ।
అభయం తితీర్షతాం పారం నాచికేతం శకేమహి ॥ ౨॥

' యజ్ఞములు చేయువారికి అది సేతువువంటిది. మఱియు అది - ఆ యున్నత పరబ్రహ్మ స్వరూపము, నిర్భయమైనది. సంసారమును తరింపగోరు వారికి ఆవలి తీరము. అట్టిదానిని మనము తెలిసికొనుటకు సమర్థులమగుదము.'

ఈ వల్లిలోని మొదటి రెండు శ్లోకములు ప్రత్యేకముగా వేఱువేఱు సిద్ధాంతములను చెప్పునవియు, ఇటు పిమ్మట రాబోవు చర్చలతో నెట్టి సంబంధము లేనివియు నగుటచే ఇవి ప్రక్షిప్తములవలె కనబడుచున్నవి. ఏది యెట్లైనప్పటికిని యీ రెండింటికిని పరస్పర సంబంధముండి, రాబోవు చర్చలతోను, వేదములలోని కర్మకాండయొక్క తిరుగుబాటువలన పుట్టి నప్పటికిని, యా కర్మకాండనుండియే బయలువెడలి, దానితోనే సన్నిహిత సంబంధము గలవైన యుపనిషత్తులతోను, సంబంధము కలిగియేయున్నవి.

సేతుః—(వంతెన, శరణము) ముందు చెప్పబడిన నచికేతాగ్ని మన యీ మర్త్యలోకమును, యావలి తీరముననున్న స్వర్గములోని యమర జీవనమును కలుపు వంతెనగా వర్ణింపబడినది. ఈ శ్లోకము కర్మజ్ఞాన మార్గముల రెండింటిని ప్రశంసించువానివలె కనబడుచున్నది. ఈ పవిత్రాగ్ని ముందు చెప్పిన విధముగా భక్తివిశ్వాసములతో వేల్చిన నీ యహంకారపూరిత జీవాత్మను స్వర్గమనెడి చైతన్య లోకమునకు చేర్చునను విషయమును యీ శ్లోకములోని పూర్వార్థము చెప్పుచున్నది. స్వర్గములోని జీవన పరిమాణము భూప్రపంచములోని మానవుల జీవనపరిమాణముతో పోల్చిచూచిన దీర్ఘమైనది కావున నది యేతత్ దృష్ట్వా యమరజీవనమే.

ఈ మంత్రముయొక్క రెండవ భాగములో నా యాత్మతత్త్వము, పరమాత్మతో దాని సంబంధము, ధ్యానించుటచే చేరగలుగు ధ్యానియొక్క గమ్యస్థానము ప్రశంసింపబడినవి.

మొత్తముమీద నిదియంతయు జ్ఞానయోగముయొక్క విపుల చర్చలను ప్రారంభించుటకు పూర్వము గురుశిష్యులు చేయు ప్రార్థనవలెనున్నది. చివరి పాదము ‘ తత్—అది ’ అను దాని నామవాచకముగా చదువవచ్చును. లేకున్న ‘ యత్ నాచికేతం ’ యని చదివినచో ‘ నాచికేత ’ యనునది జీవిత లక్ష్యమునకు సంజ్ఞగాగాని, నామముగా గాని యగుచున్నది.

శ్లో ॥ ఆత్మానం రథినం విద్ధి శరీరం రథమేవ తు ।
బుద్ధింతు సారథిం విద్ధి మనః ప్రగ్రహమేవ చ ॥ 3 ॥

ఆత్మను రథములోని యజమానిగా తెలిసికొనుము. శరీరమును రథముగాను, బుద్ధిని సారథిగాను, మనస్సును కళ్ళెముగాను తెలిసికొనుము.

హిందువులయొక్క వేదాంత సాహిత్యములో గ్రంథకర్తలచే, ప్రవచనకారులచే తఱచుగా నుదాహరింపబడు నీ రథోపమానముయొక్క చర్చతో నీ శ్లోకమును ప్రారంభించుచున్నాము. మఱియు, నిదియే వ్యాసులవారిని యుపనిషత్కావ్యమైన గీతను రచించుటకు పురికొల్పినది.

దివ్యగీతమైన భగవద్గీతలో నీ రథసాదృశ్యము చక్కగా కన్నులకు కట్టినట్లు చిత్రింపబడినది. అక్కడ "ఉత్సాహముతో నుప్పొంగు నయిదశ్వములతో కూడిన రథము, దాని నొగలున పరమ జ్ఞానరూపుడైన కృష్ణభగవానుడు సారథియై కూర్చొనినట్లు, తికమకపడుచు కలవరపాటుతో నర్జునుడు యజమానివలె రథములో కూర్చొనినట్లును, చిత్రములోవలె చూచుచున్నాము. ఇదియేగాక రథమునకు రెండువైపుల యుద్ధమునకు సిద్ధపడిన కౌరవపాండవ సైన్యములనుకూడ చూచుచున్నాము. ఇట్టి గంభీర క్షణములో ప్రధానమైన యుద్ధము ప్రారంభించుటకు ముందు గీతాదృశ్యము మనకు కనబడుచున్నది. "ధర్మమా ? కర్తవ్యమా ?" యను సందేహముచే మనస్సునందు బుద్ధియందుకూడ సంఘర్షణపడినవాడై యర్జునుడు నిరుత్సాహముతో భగవంతుడగు శ్రీకృష్ణుని పాదపద్మములపై వ్రాలి "తనకు జ్ఞానమునిచ్చి మార్గదర్శకుడుగా నుండుము"అని యతనిని దీనముగా వేడుచున్నాడు. కృష్ణభగవానుడు కళ్ళెమును గుఱ్ఱములను గట్టిగా పట్టుకొనినవాడై, కొంచెము ప్రక్కకు తిరిగి, చిరునవ్వుతో వివిధమైన యుపనిషత్తులలోను ప్రకటింపబడిన యీ పరమ సత్యమును సంగ్రహముగా చెప్పుచున్నాడు. కావున వ్యాసునివంటి కళాకారుడుకూడ నీ యుపనిషత్తులోని సర్వోత్కృష్టమైన యీ సత్యముయొక్క ప్రకటనలను అలతిపదములలో వివరింపదలచినవాడై ఈ ఉపనిషత్తులోని పదిమంత్రములను లేక మంత్రభాగములను ఉన్నదున్నట్లుగా గీతలో మరల చెప్పెననిన నందులో నాశ్చర్యములేదు. ఇట్టి పునరుక్తములనుగుఱించి యిదివరకే చర్చించితిమి. మఱియు ముందు ముందటువంటి పునరుక్తులను చూడబోవుచున్నాము.

ఈ రథసాదృశ్యములో ఆత్మ యజమాని. పవిత్రవివేచనా శక్తి గల బుద్ధి సారథి. వ్యక్తియొక్క దేహము రథము. మరియు దేనిచేత బుద్ధి దేహముయొక్క కదలికలను తన వశమందుంచుకొనుచున్నదో, అట్టి మనస్సు కళ్ళెము.

ఇటువంటి ఉపమానమే శ్వేతాశ్వతరోపనిషత్తులో కనబడుచున్నది—
2 - 9.

శ్లో॥ ఇంద్రియాణి హయానాహుర్విషయాంస్తేషు గోచరాన్ ।
ఆత్మేంద్రియ మనోయుక్తం భోక్తేత్యాహుర్మనీషిణః ॥ ౪ ॥

ఇంద్రియములు అశ్వములు. వాటి మార్గము ఇంద్రియ విషయములు. ధీమంతులు వానిని (ఆత్మను) ఈ దేహేంద్రియ మనస్సులతో కూడినపుడు 'భోక్త' యని పిలిచెదరు.

ఆ సాదృశ్యమునే పొడిగించుచు నిచట ఈ మంత్రము రథ చిత్రములో అశ్వములు ఏవి యనగా "ఇంద్రియములే అశ్వములు" అని చెప్పుచున్నది. త్వక్, చక్షుః శ్రోత్ర జిహ్వా ఘ్రాణేంద్రియము లనెడు పంచేంద్రియములు లేకున్న దేహమను రథము కదలజాలదు. ఒక శిశువు ఇంద్రియములు లేకుండ పుట్టిన అది చనిపోయినట్టే భావించుట యాధునిక మనస్తత్వ శాస్త్రములో తెలుసుకొనబడిన సత్యమే. ఒక గ్రుడ్డివానికి వినికిడిశక్తి మరింత అధికముగా నుండుట మనము సాధారణముగా చూచుచున్నాము. గ్రుడ్డి చెవుడు రెండు గల మనిషిని మన జీవితములో అరుదుగా చూచుచున్నాము. గ్రుడ్డి చెవుడు గలిగి స్పర్శజ్ఞానము లేని వ్యక్తులు మిక్కిలి అరుదు. బహుశః అటువంటివారు ఉండరేమోకూడా. సంగ్రహముగా చెప్పిన, మనమధ్యలో ఒకటి లేక రెండింద్రియములు లేని విచారకరమైన వ్యక్తిని చూడగలుగుదుము గాని మనలో రెండింటికన్న ఎక్కువ ఇంద్రియములు లేని జీవిని చూచుట చాలా అరుదు.

ఇది యాశ్చర్యకరమైన విషయము కాదు. ఈ దేహమును ధరించి ఇచటకు వచ్చి మానవులుగా జీవించు మన జీవితము వెనుక ఒక ఉద్దిష్ట కారణమున్నది. ప్రత్యేక జీవాత్మలు, ప్రత్యేక శరీరముల ధరించి, ప్రత్యేక పరిస్థితులలో, నిర్దిష్ట సమయమునందు, నిర్దిష్ట జీవనములో, తమ జీవితాను భవములను ఆర్జించుటకొఱకు జన్మించుచున్నారు. బాహ్యప్రపంచమందలి అనుభవమును పొందుటకు సాధనములు మన పంచేంద్రియములు. మన పంచేంద్రియములను బిగించినచో మనమట్టుకు బాహ్యప్రపంచము శూన్యమే యగుచున్నది. ఉదాహరణకు గాఢనిద్రలో బాహ్యప్రపంచ జ్ఞానమే మనకుండదు. ఏలన మన ఇంద్రియములలో ఏ ఒకటిన్నీ నిద్రావస్థలో పని చేయదు.

కనులు లేకున్న రూపము లేదు. చెవులతో రూపమును గ్రహించ లేము. అట్లే ఇతరములైన ఇంద్రియ విషయములును అని తెలియవలెను. ఈ ఇంద్రియములే మనకు లేకున్నచో ఈ జన్మమెత్తుటయే, ఉద్దేశరహితమై పిచ్చివాని వెఱ్ఱియాటలవలె వ్యర్థమగుచున్నది. సృష్టికర్త ఉన్మత్తుడు కాడు. కావున ప్రతి జీవియు-పురుగుగాని భూమీశుడుగాని నిర్దిష్టమైన ఉద్దేశము లేక ఈ ప్రపంచమున అడుగుపెట్టుట లేదు. ఇంద్రియములు లేకుండ మన దేహ ధారణము నిష్ఫలమగుచున్నది గావున ఆపరమోద్దేశమును నిష్ఫలము చేయ కుండుటకై ఇంద్రియవిహీనమైన శిశువును సృష్టికర్త జన్మింపచేయుటలేదు.

ఇచట శ్రుతి దేహమను రథమును లాగు గుఱ్ఱములుగా స్పర్శాది ఇంద్రియములను చెప్పుచున్నది. ఇచట ఇంద్రియములను పదము సామూహికార్థమున కేవల జ్ఞానేంద్రియములనే గాక కర్మేంద్రియములను కూడా చెప్పుచున్నది. సంపూర్ణముగా అభివృద్ధిపొందిన సాంఖ్యవేదాంత మతముల ప్రకారమే ఈ పైవ్యాఖ్య చేయబడినది. కఠోపనిషత్తుకంటె తరువాతిదైన ప్రశ్నోపనిషత్తులో ఈ దశవిధేంద్రియములు పేర్కొనబడినవి. హైందవ శాస్త్రములు సాటిలేని భావప్రకటన, శక్తివంతమైన పరిపూర్ణత, గలవి. శైలిలో అవి చాలా సంక్షిప్తత గలవైనప్పటికిని, ఏ విషయమును సగము చెప్పి వదలిపెట్టవు. యజమాని, రథము, సారథి, అశ్వములు వీనిని గుఱించి చెప్పినతరువాత అవి నడచు మార్గమును గుఱించికూడా వివ

రించి చెప్పనియెడల చిత్రము పూర్తికాదు. ఉపనిషత్తు ఈ ఇంద్రియములు విషయములలో పరుగెత్తుచున్నవని చెప్పుచున్నది. ఎట్లు ?

కన్ను రూపమునే ప్రకాశింపజేయును. అనగా రూపమున్న చోటనే కన్ను పని చేయును. కాని కన్నులతో వినలేము కదా. అట్లే చెవులు. అవి శబ్దమునే గ్రహించును. చెవులతో రూపమును చూడలేము. జిహ్వ రుచి చూచుటయందే శక్తమైనది. త్వక్ స్పర్శజ్ఞానమును కలిగించునది. ఇట్లు మొత్తముమీద మనకు తెలిసినదేమనగా ఏటివలన దేహముయొక్క అస్తిత్వమున్నదో అట్టి ఇంద్రియములు వాటివాటికి నియమితమైన క్షేత్రములలోనే పని చేయును.

మనీషిణః—ధీమంతులు. అనగా సాధుసన్న్యాసులు. ఎవరైతే వారి జీవితములో దైవత్వము అను పరిపూర్ణ తత్త్వమును తెలిసికొనుచున్నారో మరియు తమ అంతర-అనుభవములను ప్రకటించుటచే ఉపనిషద్గ్రంథ కర్తలగుచున్నారో అట్టి మహర్షులే, ఇచట—మనీషిణః - బుద్ధిమంతులు. మనలోని యీ సుఖదుఃఖముల ననుభవించు పదార్థము సర్వసాక్షియైన జ్ఞానరూపమగు ఆత్మ కాదనియు, అది నియమితమైన (జీవాత్మ) ఆత్మ యనియు వెల్లడిచేసిరి. ఆ పరమాత్మ యిట్లు మనోదేహములచే నియమిత మైనచో నది యహంకారి యగు జీవాత్మయే యగుచున్నది. నశ్వరమగు సంసారజీవితములోని పరిస్థితులకు తగినట్లు అది సుఖదుఃఖములు పొందు చున్నట్లు తోచును. మనలోని యీ భోక్తను (అనుభవించువానిని) నిర్వ చించుటలో శ్రుతి నిశ్చయముగా మనలోని రెండు పదార్థములను భిన్న పఱచుచున్నది. ఒకటి సత్యసిద్ధాన్తము—కర్త భోక్త కానిది. మరియొకటి మాయానిర్మిత అహంకారసహిత జీవాత్మ. అది మానస సరోవరములోని యీ పరమ జ్ఞానముయొక్క ప్రతిబింబముమాత్రమే.

శ్లో॥ యస్త్వవిజ్ఞానవాన్భవత్యయుక్తేన మనసా సదా।
తస్యేన్ద్రియాణ్యవశ్యాని దుష్టాశ్వా ఇవ సారథేః ॥౫॥

సారథికి దుష్టాశ్వములవలె, అయుక్తమైన మనస్సుకలవాడై, మంచి చెడ్డలు తెలిసికొను జ్ఞానములేని వానికి ఇంద్రియములు వశముగావు.

ఇటువంటి సాదృశ్యమును కల్పించి అట్లు చేయుటలోని తన యుద్దేశ మును శ్రుతి వెల్లడించకపోయిన నది కేవలము పదముల చాతుర్యముగానే యుండును. ఉపనిషత్తుల శైలిలో సంక్షిప్తత యుండవలయునను నియమమున్నది గాన యనావశ్యముగా నిచట నొక యక్షరము నుపయో గించినను, అది మహాపాపముగా పరిగణింపబడుచున్నది. అటువం టప్పుడు యీ సందర్భములో నాలుగుశ్లోకము లుండుట శ్రుతిమాత తానుప యోగించిన సాదృశ్యముయొక్క యుద్దేశమును వెల్లడిచేయుటకొఱకే యని తెలియవలెను.

సారథి చేతకానివాడై పగ్గములను వదులుచేసిన ఆ యశ్వములకు ఉన్మాదము గలిగి యవి యిష్టమువచ్చినట్లు పరుగిడుటయే గాక రథమును కూడ తునాతునకలు చేసి యజమానిని దారిప్రక్కన అపాయావస్థలో పడ వేయుచున్నవని యీ మంత్రములో చెప్పబడినది. ఈ సాదృశ్యమందలి భావనుబట్టి, 'వివేచనాశూన్యమైన బుద్ధితో మన మనస్సును వదలివేసిన యింద్రియములు విషయములలో వెఱ్ఱిగా పరుగిడి యమితమైన యీ వ్యామోహములలో దేహమునే నాశనము చేయు'నని మనము తెలిసికొనవలసి యున్నది. ఒక జిజ్ఞాసువు వేదాంతజీవనమును గడపి, తద్ద్వారా పరిణతి పొందుటలో తొందరపడినయెడల, యతడు వివేచనాశక్తి గల బుద్ధితో తన మనస్సును స్థిరముగా నుంచుకొని, యింద్రియము లనెడు గుఱ్ఱములను దృఢ మైన యధికారములో నుంచి వశపఱచుకొని, సంపూర్ణ సంయమనముతో నడపవలసియున్నది. ఈ విషయము తరువాతిశ్లోకములో వివరింపబడినది.

శ్లో॥ యస్తు విజ్ఞానవాన్భవతి యుక్తేన మనసా సదా।
తస్యేన్ద్రియాణి వశ్యాని సదశ్వా ఇవ సారథేః ॥ ౬ ॥

సారథికి మంచిగుఱ్ఱములు వశమైనట్లు, మనస్సును సర్వదా వశమం దుంచుకొని ఆత్మను తెలిసికొనినవానికి యింద్రియములు వశమునందుండును.

వివేచన గల సారథి తెలివితో పగ్గములను త్రిప్పిన తన యజమాని పోదలచిన మార్గమునందు అశ్వములను నడపగలుగుచున్నాడు. ఇంద్రి

యము లను గుఱ్ఱములు వెక్కిత్తి, ఒడ్డునుంచి క్రిందకు దూకి, సౌఖ్యములను పంకిలక్షేత్రమున తమ యిష్టమువచ్చినట్లు పరుగెత్తి, రథమును పగుల గొట్టి, ప్రయాణమును విషాదాంతముగా మార్చుచున్నవి కావున, జిజ్ఞాసువు వివేకియై, నిర్మలమైన బుద్ధి కలిగి, మనస్సును సంయమనముతో వశముచేసి కొనినచో, తన జీవితమును దివ్యమార్గమున విజయవంతముగా నడుప గలడు. అట్టి సాధకుడు తన మనః ప్రేరణలను వివేచనాబుద్ధితో వశపఱచు కొనుటయే యుక్తము అని చెప్పబడుచున్నది. మరియు అట్టివాడు ధీమంతులగు శాస్త్రజ్ఞులచేత "విజ్ఞానవాన్" అని ప్రశంసింపబడుచున్నాడు.

శ్లో॥ యస్త్వ విజ్ఞానవాన్భవత్యమనస్కః సదాశుచిః ।
న స తత్పదమాప్నోతి సంసారం చాధిగచ్ఛతి ॥ 8 ॥

ఎవడైతే సరియైన వివేచన లేక, యోచన లేక అశుచియై యుండునో అట్టివాడు గమ్యస్థానమును చేరలేక జననమరణ రూప సంసారమందు భ్రమించుచున్నాడు.

ఇంతవరకు చర్చించిన విషయము నాలోచించి చూచిన మనకు శ్రుతియొక్క అభిప్రాయము స్పష్టముగా తెలియుచున్నది. నిత్యజీవితములో సాధకుడు, వివేకముతో ధర్మములను నీతులను అనుసరించి శిక్షణ పొందిననేగాని అతనికి దివ్యజీవనములో ఎటువంటి అవకాశము కలుగదని తెలియచెప్పుటయే శ్రుతియొక్క ముఖ్యోద్దేశము. మరియు సాధకుడు సంపూర్ణమైన యాత్మసంయమనము గలిగి సత్యమైన జీవనము గడుపుటకు నేర్చుకొనిననేగాని ఈ ఆధ్యాత్మికసాధనలు సంపూర్ణానందమును కలిగించవని చెప్పుటలో శ్రుతి, వినువుచెందక అడుగడుగున నతి ప్రాధాన్యమైన యీ విషయమును చెప్పుచునేయున్నది.

ఎవడైతే తన వివేచనాశక్తిని ఉపయోగించి యవిరతముగా మనః ప్రేరణలను వశపఱచుకొనడో అట్టివాడు, 'అయుక్తుడు' అనబడుచున్నాడు. శాస్త్రజ్ఞులు వాని పశుత్వమును చూచి నవ్వుచు వానిని 'అవిజ్ఞానవాన్' అని పిలుచుచున్నారు.

నవీనకాలములో మన మన్నివైపులనుండియు ముఖ్యముగా విద్యావంతులదగ్గరనుండే 'మన మతము వట్టిపోయినది, నిస్సారమైనది. నిరుపయోగమైనది' అను మాటలను వినుచున్నాము. భయంకరులైన కొంతమంది పుస్తకజ్ఞానమాత్ర పండితులు గర్వముచే నుబ్బి, సిగ్గు లేనివారై గొప్పదైన మన మతముపై నిందల నారోపించుచున్నారు. ఈ సాధువు స్వయముగానే యటువంటివారిని కొంతమందిని కలిసికొనెను. ప్రక్కకు పిలచి యెందుకు హిందూమతమును నిందించుచున్నావనగా వారిలో కొంతమంది తగిన కారణములతో వచ్చి యిట్లు చెప్పుచున్నారు. వారు భక్తియోగమును, కర్మయోగమును, తదితర యోగములను చాలకాల మాచరించినను, నవి నిర్దేశించిన సౌఖ్యముల నావంతయు ననుభవింపలేకపోతి మని వెల్లడిచేసికొన్నారు. అట్టి యాతతాయులు, దుస్సాహసులు, పరిపూర్ణాత్మతత్త్వమును బోధించు శాస్త్రమనియెడు హిందూమతముయొక్క విచారకరమైన విమర్శారూపమును దాల్చుచున్నారు.

'వేదకాలములోని ప్రజలు ఇప్పటివారికంటె మిక్కిలి సంయమనము కలవారు, నిజాయతిపరులు, మంచివారు' అని మన కందరికి తెలియును. అయినప్పటికిని శ్రుతి యానాటి సాధకునకుకూడ సంయమన మత్యవసరమని మరలమరల చెప్పుచునేయుండినది. ఇప్పటి దీనులైన సాధకులు కపటమైన బజారుజీవనము, చీకటిబజారు బేరములు, లంచగొండితనము, ఇత్యాదులతో కూడి వివిధములైన జీవనములను గడుపువారై కొన్నిక్షణములు మాత్రము జపముచేసిన యా పరమశ్రేష్ఠమైన పరిపూర్ణతత్వము నెట్లు యనుభవించి యానందించగలుగుదురు? "మనస్సును నిగ్రహించి తద్ద్వారా యింద్రియముల యొక్క యుద్రేకము నణచుటకు ప్రయత్నింపని యెడల నా భక్తున కతని సమస్త కీర్తనలు, భజనలు, జపములు, తపములు, దేవాలయ గమనము, బ్రాహ్మణ సమారాధన యిత్యాదులన్నియు కేవల ధనవ్యయకారకములే గాక కాలమును వ్యర్థపఱచునవి మాత్రమే యగును," అను నీ ప్రసిద్ధవిషయమే యిచట సూచింపబడినది.

వివేకముతో కూడిన యింద్రియనిగ్రహమును, ఆత్మసంయమనమును నెవరు పాలింపకుండనుందురో, వారు శ్రుతిలో చెప్పిన 'తత్పద' మగు

సర్వోత్కృష్ట దివ్యస్థితిని చేరుటకు తగిన నిచ్చెనను ఎక్కలేదు సరిగదా, వారు పరిణామస్థితిలోనుండి క్రిందకు జారి పశువులగుదురనియు శ్రుతి చెప్పుచున్నది. మానవుడు జంతువైనప్పటికిని తన వివేచనాశక్తిచేత జీవులలో నుత్తమోత్తముడుగా పరిగణింపబడుచున్నాడు. మానవపశు వొక్కడే ప్రతి జీవన పరీక్షాసమయములోను శ్రేయోమార్గమునుండి ప్రేయో మార్గమును వివేచించు శక్తి గలిగి అంతమున శ్రేయోమార్గమునే యనుస రించగలుగుచున్నాడు.

మానవుడు భగవద్దత్తమైన యీ వివేచనాశక్తిని తనంతట తాను పోగొట్టుకొన్నప్పుడు అతడు తనకుండు హక్కులను చేతులార జారవిడచు కొనుచున్నాడు. ఇట్లు తన స్వతంత్రసంకల్పముచేత పశువుగానే యుండునని కోరుకొనువానిని ప్రకృతి "ఆ పశుత్వపు సరిహద్దులలోనే యుండి బాధల ననుభవింపుము" అని ఆశీర్వదించుటలో నాశ్చర్యమేమున్నది? మానవు డొక్కడే యాత్మజ్ఞానమునుండి వెలువడు మహత్తరానందమునకు ఏకైక వారసు డగుచున్నాడు. కావుననే యాతడు జీవులలో పరిపూర్ణత్వము కలవాడగుచున్నాడు.

'తినుటకే జీవించుట' యనునట్లు ఆహారాదులతోనే జీవితమును గడపి నేరు లేక వచ్చిన కష్టముల ననుభవించి రిక్తసుఖములతో కూడిన భ్రమలలో పడిపోవుట జంతువులకే తగియున్నది. "ఆత్మసంయమనము లేని మానవులు యనంతమైన యానందమును, శాంతిని పొందుటకు బదులు మరలమరల జననమరణాత్మకమై దుఃఖభూయిష్ఠమైన సంసార మను సుడిగుండములో విచారకరముగా పడిపోవుదురు" అని యిచట శ్రుతి చెప్పుచున్నది.

శ్లో॥ యస్తు విజ్ఞానవాన్ భవతి సమనస్కః సదాశుచిః ।
స తు తత్పదమాప్నోతి యస్మాద్భూయో న జాయతే॥

ఎవడు వివేకవంతుడో, యెల్లప్పుడు శుచియైనవాడో, మనో నిగ్రహము కలవాడో, అట్టివాడు ఎచట చేరిన మరల జన్మలేదో, యట్టి పదమును పొందుచున్నాడు.

పూర్వశ్లోకములో యింద్రియనిగ్రహము లేకుండ అజ్ఞానపశువువలె విషయవ్యామోహములో పడి జీవితమును గడుపువానియొక్క విషాదకరమైన అంతము చెప్పబడినది. ఉపనిషత్తు ఆ వాక్యమును అంతటితో నాపివేసినయెడల మన చుట్టుపట్లవారియొక్క మనయొక్క అనుభవముచే, ఇంద్రియముల వాంఛ చాలా ప్రభావము కలదని, వాని యధికారమునుండి తప్పించుకొనుటకాని, వానిని అణచి వశపఱచుకొనుటగాని అంత తేలికైన పని గాదని, తెలిసికొనుచున్నాము. కావున మనలో కొంతమంది ఒకసారి మానవుడై పుట్టినతరువాత వానికి ముక్తిపొందు నాశ లేదేమోనని నిరుత్సాహపడవచ్చును. ఈ శ్లోకము ఋషుల శైలిఎంత తార్కికము, పరిపూర్ణము అయినదో నిరూపించుచున్నది. వారి ధీశక్తికి హృదయవ్యక్తిత్వమునకు ఇది తార్కాణమైయున్నది.

"ఒకడు స్థిరమైన అభ్యాసముతో మిక్కిలి ఆత్మసంయమనము కలిగినవాడైన, తద్వారా నిత్యనైర్మల్యము, ఆధ్యాత్మికాభివృద్ధి గలిగి యీ యంతస్థులద్వారా పరిపూర్ణత్వమును పొందుచున్నాడు" అని ప్రస్తుతము మనము చర్చించు శ్లోకము చెప్పుచున్నది. ఆ పదము శాశ్వతమై దివ్యమైనదగుటచే అక్కడకు ఒకసారి చేరుకొనిన యోగి మరల తిరిగిరాడు.

'యస్మాద్భూయోనజాయతే'—ఎక్కడనుండి మరల జన్మించడో. ప్రారంభ సాధకులకు, ప్రారంభింపని విద్యార్థులకు, సాధారణముగా కలుగు సందేహమునకె యిచట జవాబు చెప్పబడినది. బ్రతికియున్నంత కాలము ఎవ్వడుగాని ఒక్క క్షణమైన కర్మ చేయక యుండలేడు. అట్టి కర్మలకు ప్రతీకారములు తప్పక యున్నవి. కాబట్టి మృత్యుసమయములో ఈ 'ప్రతిఫలముల నిధి' ప్రతి జీవాత్మను మరల అనుభవింపజేయుటకై యుండనేయున్నది. కావుననే జీవులు తాము చేసిన కర్మఫల మనుభవించుటకు తగిన స్థానము సాధనములు అయినట్టి దేహములందు తత్తత్పరిస్థితులలో మరలమరల జన్మించుచున్నారు. ఉపనిషత్ప్రోక్త జీవితమును గడపి తద్వారా ఆ పరమపదమును పొందిన నిజమైన భక్తుడుకూడ సంసారమునకు సంబంధించిన జననమరణము లనెడి సుడిగుండములో పడవలసినదేనా? ఏల?

అంతస్సంపర్కణ నెదుర్కొని సాధనచేసి ఆత్మసంయమనము, ఆత్మ నిగ్రహముపొందిన మానవుడుకూడా, ఈ మాయాప్రపంచములోనికి మరల రావలసినయెడల ఆ సాధనలతో ప్రయోజనమేమి? ఇంద్రియలోలుడై స్వేచ్ఛగా నడచు పాశవికమానవునికన్నా అతడు ఏవిధముగా భిన్నుడగు చున్నాడు? ఈ సంశయము సాధారణముగా సాధకుని నిరుత్సాహపఱచు చున్నది. ఈ పరమ సత్యమును చేరినటువంటివాడు "అచటనుండి మరలిరాడు. వాని కిక జన్మ లేదు" అని దయాళువైన శ్రుతి జవాబిచ్చు చున్నది.

ఆ పరమగమ్య మనగా మనయొక్క ఆత్మైక్యము లేదా బ్రహ్మైక్య మును తెలిసికొనుటయే. ఇట్టి నిజమైన ఐక్యమువలన, మనోబుద్ధి పరికర ములతోను అహంకారముతోను గల యసత్యపు లైక్యభావన పూర్తిగా నశించు చున్నది. రజ్జువుయొక్క సర్పముయొక్క జ్ఞానము ఒకేసారి కలిగియుండ లేము. అట్లే ఆత్మజ్ఞానమును, జీవభావము అనగా మాయాపదార్థములతో ఐక్యమగు అహంకారమునూ ఒకేసారి కలిగియుండలేము. జననమరణ ములు అజ్ఞానముచే సృష్టింపబడిన అహంకారమునకు సంబంధించినవి. అట్టి అహంకారము ఆత్మజ్ఞానముచే నశించిన జననమరణరూప స్వప్న ములుకూడ నశించును.

శ్లో॥ విజ్ఞాన సారథిర్యస్తు మనః ప్రగ్రహవాన్నరః।
సోఽధ్వనః పారమాప్నోతి తద్విష్ణోః పరమం పదం॥

విజ్ఞానమే సారథిగా గలిగి మనస్సే ప్రగ్రహముగా గలవాడు తన ప్రయాణ గమ్యస్థానమును చేరుకొనును. అదియే విష్ణువుయొక్క పరమ పదము.

సాదృశ్యభాగమును ముగించునదియై శ్రుతి యీ శ్లోకములో "ఎవడైన యొక ప్రత్యేక వ్యక్తి యింద్రియములను తన బుద్ధివశము చేసి కొనిన యీ పరమగమ్యమగు విష్ణుపదమును చేరును" యని చెప్పు చున్నది. మనము సాధారణముగా ప్రయాణము చేయునపుడు బండినడుపు వాడు త్రాగుబోతైన మన గమ్యస్థానమును చేరమనుట సుస్పష్టమేకదా!

సామాన్యముగా మనము జీవితములో ప్రమత్తులమై యుందుము. మరియు మన వశములో లేని మనస్సుయొక్క కోరికలచే కొట్టబడిన వారమై, మలిన మనఃప్రేరితులమై, పిచ్చివారివలె విషయములయందు త్రుళ్ళుని పరిభ్రమించుచున్నాము. అంతట, నాయాసముతో, నలసతతో, శ్రమపడి, బడలిక చెంది, చిక్కి, నీరసించి, ప్రపంచమానవు డనబడువాడు ప్రాసాదములందు నివసించి, పట్టుబట్టలు ధరించి, హంసతూలికా తల్ప మందు పండుకొనినప్పటికినీ, విశ్రాంతిలేని విసుగుతో నిరుత్సాహ జీవితమునే గడుపుచున్నాడు. అట్టి మానవునకు భౌతికవిజయములుగాని, యింద్రియ విషయములుగాని పరిపక్వత నొందిన మానవుని జన్మహక్కగు నిత్యమైన సుఖమును, దైవశాంతిని యెంతమాత్రమును కలుగజేయలేవు.

కాని విషయసుఖములు లేక, చెట్టుక్రింద నివసించి, చింపిరిగుడ్డలు కట్టుకొని, బండలమీద దొరలుచున్న ఋషిని చూచినచో నతడు పరమా నందమును పొంది దివ్యశాంతిని యనుభవించుచున్నట్లు మనము తెలిసి కొనుచున్నాము. మనము కొంచెము కళ్ళు తెఱచి యీ రెండు దృశ్య ములను చూచినయెడల, నింద్రియములను మన కనుకూలమైన విధముగా నమర్చుకొనుటద్వారా నిజమైన శాంతి కలుగునట్టిది కాదని స్పష్టమగు చున్నది. మనస్సునకు క్రమశిక్షణ నిచ్చి యాత్మసంయమనముక్రింద నడచుకొనునట్లు దానిని తయారుచేసినయెడల, ప్రతి వ్యక్తియొక్క హృదయమునుంచి యాత్మానందము, సంతృప్తి పైకుబుకును. మన మనః క్రీడను సదా జాగృతమైన వివేచనాజ్ఞానముచేత నిరంతరము నదుపాజ్ఞలలో నుంచినగాని మన జీవితములో గమ్యస్థానమగు నా 'శాంతి' యను నాలయ మును నెమ్మదిగా చేరుకోలేము. ఆ పరమగమ్య మిచట విష్ణుస్థానముగా చెప్పబడినది. వేదాంతవిద్యార్థి యా విష్ణుస్థానమును పురాణములలో చెప్పిన వైకుంఠముగా తలచిన నది యసంగతముగా నుండును. శాస్త్రములను వివరించుటకు నచట విష్ణువు త్రిమూర్తులలో నొకడుగా చెప్పబడినాడు. కాని యిచట విష్ణువు సర్వవ్యాపి, వాసుదేవుడు యనగా పరమాత్మ యని యర్థము.

"జీవాత్మ పరమాత్మల రెండింటిమీద చర్చలు, యీ రెండింటికి గల సంబంధము, యెట్లు జీవాత్మ పరమాత్మతో సంయోగమును పొందుచున్నది?

ఎట్లు ఆత్మైక్యము తెలిసికొనబడుచున్నది" అను విషయములు రథకథ ద్వారా వివరింపబడినవి.

శ్లో॥ ఇంద్రియేభ్యః పరాహ్యర్థా అర్థేభ్యశ్చ పరం మనః।
మనసస్తు పరా బుద్ధి ర్బుద్ధేరాత్మా మహాన్
పరః ॥ ౧౦ ॥

ఇంద్రియములకన్న యింద్రియవిషయములు పరమైనవి. వానికంటె పరమైనది మనస్సు. దానిపైని బుద్ధి, బుద్ధికి పైని యీ పరమాత్మ పరమైనవి.

సాధకుడు శాశ్వతమై, దివ్యమై, తన యస్తిత్వమునకు మూలకారణమైన యీ పరమాత్మను ధ్యానించి యనుసంధించుటకుగాను, నీ శ్లోకమును తరువాతి శ్లోకమును ఒక మార్గమును చూపించి సహాయపడుచున్నవి.

ఇంతకుముందే మనము వేదాంతగ్రంథములలో 'పరము' అనగా సూక్ష్మమనియు, రెండు వస్తువులను పోల్చి చూచునపు డుపయోగింపబడుననియు, సృష్టి సమయములో వాటి సూక్ష్మత యనగా "నొకదానిపై మరియొకదానియొక్క యధికవ్యాపకత్వము తద్ద్వారా కొలవబడుచున్నదనియు" వివరించితిమి. సత్యముయొక్క స్థూలాతిస్థూలమైన సృష్టితో ఇచట శ్రుతి ప్రారంభించుచున్నది. మెల్లగా విద్యార్థికి సూక్ష్మాతిసూక్ష్మమైన తర తమ మార్గమును చూపి అంతమున ఆ సూక్ష్మాతిసూక్ష్మమైన ఆత్మస్థానములో ప్రవేశ పెట్టుచున్నది.

ఈ మంత్రముకూడా గీతలో ప్రతిధ్వనితమైనది. (గీ. III-46) ఇచటి సిద్ధాంతముల పరంపర తరువాతికాలమున సాంఖ్యవేదాంతశాస్త్రములలో సాంకేతికపదములుగా మారెననుటను జాగ్రత్తగా గమనించవలెను. ఈనాడు మనము ఈ మంత్రమును చదువునప్పుడు తరువాతకాలమున వచ్చిన వేదాంతసూత్రములలో ఆ సాంకేతిక పదములు సమన్వయింపబడినవను విషయమును మరువలేము.

ఈ మంత్రముయొక్క వివిధ భాగముల అర్థములు స్వయంవ్యక్తములై సుస్పష్టముగా నున్నట్లు గోచరించుచున్నప్పటికి ఇంద్రియములకన్న ఇంద్రియ విషయములు సూక్ష్మమైనవి అను ప్రథమ వాక్యమే అర్థముచేసికొనుటకు కఠినముగా నున్నట్లు స్పష్టపడుచున్నది. మానవునిచే ఇదివరకు తన ప్రయోగశాలలో మన చెవిలోని శబ్దగ్రహణయంత్రమంత సూక్ష్మయంత్రము కనిపెట్టబడలేదనియున్నీ, మన కండ్లలో నున్న రూపగ్రహణ శక్తి, మన త్వక్‌సందుండు స్పర్శను గ్రహించు పరికరములంతటి సూక్ష్మయంత్రములను కనిపెట్టలేదని నవీనవిజ్ఞానశాస్త్రము చెప్పుచున్నది. ఈ వైజ్ఞానిక యుగములోకూడా పైవానిలోని ఇంద్రియములు ఏ ఒక్కటైనను నూతనావిష్కారములచే అపజయమును పొందలేదు. అయినప్పటికిని ఇంద్రియములకన్న ఇంద్రియవిషయములు సూక్ష్మతరమైనవని ప్రకటించుటకు శ్రుతి సాహసించుచున్నది. ఈ మంత్రమును చదువు విద్యార్థి, కనులకన్న రూపములు ఎట్లు సూక్ష్మమైనవి ? చెవులకన్న శబ్దమెట్లు సూక్ష్మమైనది, నాలుకకన్న రసము ఎట్లు సూక్ష్మతరమైనది, అని ఆశ్చర్యపడుట సహజమే.!

హిమాలయపర్వత సానువులలో ఈ మంత్రము ఆ గురువులచేత వారి శిష్యులకు స్పష్టముగా బోధింపబడినది. ఉదాహరణకు ఈ సాధువే ఈ వాక్యమును మ్రింగలేక అధిక వివరణమునకై తన గురువువద్దకు వెళ్ళుట జరిగినది. వేదాంతములోని సంశయములకు విద్యార్థిని అలసట చెందించు నేర్పున్నది. కాని ఆ సంశయములే యథార్థగురువుచే వివరింపబడినచో ఆ శిష్యునకే స్పష్టమై ఇంత తేలికయైన విషయముపై తన కెట్లు సందేహము కలిగెనని ఆశ్చర్యము కలుగును.

బాహ్యప్రపంచములో వివిధరూపములే లేనియెడల మనము మనకు కళ్ళున్నవని సమర్థించుకొనలేము. ఈ ప్రపంచమే నిశ్శబ్దతలో మునిగియున్న అందరును చెవిటివారై యుందురు. ఏలన అటువంటి పరిస్థితిలో చెవి తానున్నట్టు ఋజువుపరచుకొనజాలదు. ఇట్టి అర్థములోనే ఇంద్రియవిషయములు ఇంద్రియకారణము లని చెప్పబడినవి.

ఈనాటి రాజకీయజీవితమునుండి నవీనమైన ఉదాహరణను తీసికొన్న ఈ విషయము మరింత స్పష్టమగును. హిందూ 'జనత'—సామాన్యప్రజలే

లేనియెడల ఇండియా ప్రెసిడెంటుగాని పార్లమెంటుగాని ఉండి ఉండదు. గదా. దేశప్రజలే రాష్ట్రమునకుగాని, దేశప్రభుత్వమునకుగాని కారణము మొత్తముగా రాష్ట్రపు శక్తిసామర్థ్యములు ప్రతియొక్క వ్యక్తియందు లేకపోయినను, సమిష్టిగా ఆ దేశములోని ప్రజలే ఆ దేశపు స్థితికి కారణము.

ఈ అర్థములోనే యింద్రియవిషయములు యింద్రియములకు కారణమగుచున్నవి. సాధారణముగ యెల్లప్పుడు కార్యముకంటె కారణము సూక్ష్మతరమైన దగుటచే శ్రుతి "యింద్రియములకంటె విషయములు సూక్ష్మతరమైనవి" అని చెప్పుట పూర్తిగా న్యాయమైనదే యగుచున్నది.

ఈ విషయములకంటె మనస్సు సూక్ష్మమైనది—ఈ వాక్యము స్వయం వ్యక్తమగుచున్నది. ఇంద్రియములు తత్తద్విషయములలో తగుల్కొన్నప్పుడు వెనువెంటనే తత్తద్విషయజ్ఞానమును సంగ్రహించి నివేదించుటకు మనస్సనునదే లేకున్న మనకు తత్త ద్విషయముల యాకారాదులయొక్క సమగ్రజ్ఞానము (కుర్చీ, బల్ల, యిత్యాదులు) కలిగియేయుండదు.

మనస్సుకంటె సూక్ష్మమైనది బుద్ధి :—వేదాంతములోని మూలసిద్ధాంతములయొక్క చర్చలో మనము మానవుని మనస్సుయొక్క నిర్మాణమును గుఱించి, యుద్దేశమునుగుఱించి చర్చించినాము. మఱియు మనస్సనునది మనలో నున్న కార్యాలయములో విషయములను గ్రహించి రవాణాచేయు గుమాస్తా యని చెప్పితిమి. మనస్సు పంచేంద్రియములద్వారా కోరికలను గ్రహించి, వాటినియొక సంపుటముగా క్రోడీకరించి బుద్ధికి అందజేయుచున్నది.

ఆ మనస్సుచేత పంపబడిన నివేదికను బుద్ధియొక్క నిర్ణాయకత్వము క్రమపఱచుచున్నది. అచట యా బుద్ధి యిప్పటి కోరికలను స్మృతిపథములో నిలిచిన వెనుకటి కోరికలయొక్క అనుభవములతో పోల్చి పరీక్షించుచున్నది. అట్టి పరీక్షచే ఇప్పటి కోరికలు సరియైన వర్గీకరణము చేయబడి విలువకట్టబడుచున్నవి. అప్పుడు బుద్ధి తన తీర్పును చేయును. మనస్సు దానిని తిరిగి గ్రహించి, ఆ యాజ్ఞలను పాలింపమని పంచేంద్రియములను ఆజ్ఞాపించును. అవి మారుపలుకక బాహ్యములైన యింద్రియవిషయములందు తదాజ్ఞాప్రకారము తగిన విధముగా నడుచుకొనుచున్నవి.

ఇచట మనలోని ప్రభుత్వనిర్వహణరీతిని యింత విపులముగ చర్చించుటకు కారణము మనస్సుకంటె బుద్ధికి అధిక ప్రాధాన్యము గలదని తెలుపుటకొఱకే యనవచ్చును. కావున యీ ఉపనిషత్తు మనస్సుకంటె బుద్ధి సూక్ష్మమైనది యని వివరణముచేయుట న్యాయమైనదే యగుచున్నది.

"బుద్ధికన్న సూక్ష్మమైనది మహత్తు". అదియు సహజమే. ఇంత వరకు మనము చర్చించిన మహత్తత్త్వము లేక మహాజ్ఞానము అను హిరణ్యగర్భుడే యీ మహత్తు. మాయచే సృష్టింపబడిన యీ యహంకారముచేత మనము యితరులకంటె భిన్నమైన యోచనలను చేయుచున్నామని అనుకొందుము. ఆ యోచనలన్నియు మన స్వంతములే యనియు వాటిని గూర్చి, వాటి కూర్పునుగూర్చి యితరులు బాధపడవలసినది లేదనియు తలచుచున్నాము. ఈ తలంపు పామరుడై ఆటవికుడైన వ్యక్తియొక్క యోచనలేని నిర్ణయము; పసరుబోతుయొక్క అసంగతమైన వివరణము. మొత్తముమీద నెవ్వరుకూడ ఒక్క భావమునైనను స్వతంత్రముగా చింతింపలేరని చెప్పవచ్చును.

ఈ విషయమును నొక యుదాహరణద్వారా అర్థముచేసికొనుటకు ప్రయత్నించెదము. దాస్ అనునతడు ఆఫీసునుండి తిరిగివచ్చి, అల్పాహారమ్మును సేవించి, దుస్తులు మార్చి పడకకుర్చీలో విశ్రాంతిగా కూర్చొని, "నేడు సినీమా చూడవలెను" అని తలచుచున్నాడు. వెంటనే యాతడు తనకు సినీమానుగుఱించిన కోరిక పుట్టినదని అది తన కోరికయే యని తలచుచున్నాడు.

మిత్రులారా! పగలంతయు పనిచేసి వరండాలో విశ్రాంతి తీసికొనుచున్న ఆ గుమాస్తాలో పుట్టిన కోరికకు 'అతడొక్కడే కర్త యని' మీరిప్పుడు ఒప్పుకొనెదరా? (అతని తాతముత్తాతల కాలములో సినీమాలు లేవుకాబట్టి వారి కట్టి అభిప్రాయములు కలిగికూడ యుండవు.) అతడు తన కాలపువారి యభిప్రాయముల కనుగుణముగా జన్మించినవాడు. కావున ఆ వారములో తెలిసియు తెలియకయు కలుగు ప్రభావములకు బానిసయై, మౌనముగా ప్రకటితమైన లెక్కలేనన్ని ప్రకటనలను జూచియు, ఈ 'చిత్రమును'

ప్రశంసించు స్నేహితులయొక్క ప్రశంసావాక్యములను వినియు, వాటివలన కలిగిన ఆనాటివారి అభిప్రాయములకు అంచనాలకు అనుగుణమైన కోరిక పుట్టినవాడుకదా యతడు! కాని యతడు ఎంత వివేకి యైనప్పటికిని "సినీమాకు వెళ్ళుట యను కోరిక తనకా సాయంకాలము కలిగినదనియు, అది తన స్వతంత్రమైన స్వంత కోరికయే" యనియు నిర్లజ్జతో ప్రకటించు చున్నాడు.

కావున యథార్థములో మన మెవ్వరముకూడ స్వతంత్రముగా నాలోచించి, యనుభవించలేమని తెలియుచున్నది. మన జీవితములోని ప్రతి క్షణములోను మనము యితరుల ప్రభావముచేతనే నివసించుచున్నాము. కాని మనము సత్యములైన విశ్వాసములు, ఉదాత్తమైన జీవితపు విలువలు గలవారమైన అప్పుడు మనమే సమస్తమును ప్రభావింపజేయు శక్తి గల వారమగుచున్నాము. భగవత్సూత్రమును గ్రహించుటయే మహత్తత్త్వమన వచ్చును. సంపూర్ణమైన లోపలి సాధన యగు "అంతఃకరణము" ఇచట వివేకమను పదముతో సూచింపబడుచున్నది. కావున ఇప్పుడు నిజముగా ఆ మహత్తత్త్వము ప్రత్యేక వ్యక్తిలోని బుద్ధికంటే సూక్ష్మమైనదని స్పష్ట మగుచున్నదికదా!

శ్లో॥ మహతః పరమవ్యక్త మవ్యక్తాత్పురుషః పరః ।
పురుషాన్న పరం కించిత్సా కాష్ఠా సా పరాగతిః
॥ ౧౧ ॥

మహత్తుకన్న పరమైనది అవ్యక్తము. అవ్యక్తముకంటె పరమైన వాడు పురుషుడు. పురుషునికన్న పరమైనది మరియొకటి లేదు. అదియే చరమసీమ. అదియే పరమగమ్యము.

ముందరిమంత్రములో మహత్తత్త్వమనగా హిరణ్యగర్భస్థితి యనియు, విత్తనములోనుండి మొలకవలె యది ముందుగా ప్రపంచరూపములో వ్యక్త మైనదనియు మనము తెలిసికొన్నాము. అత్తిగింజయందు అవ్యక్తరూపములో అత్తివృక్షమంతయు ఇమిడియున్నదని మన కందరకు తెలియును.

అనుకూల పరిస్థితులలో విత్తనముయొక్క పైచర్మమునందలి సూక్ష్మరంధ్రములు తమద్వారా నీటిని పీల్చినపుడు, విత్తనములోని యాహారపదార్థములు ఉబ్బి, ఆవరించుకొనియున్న చర్మమును చీల్చుకొని పైకి ఉబుకుచున్నవి. ఇట్టి తొట్టతొలిమొలక, దానియొక్క మొదట పుట్టిన పత్రములందు జమ చేయబడిన ఆహారముతో పుష్టిని పొంది, దాని చర్మములో చేయబడిన రంధ్రముద్వారా మెల్లమెల్లగా పైకి వచ్చుచున్నది. ఇట్టి యవస్థలోనే మనము విత్తనము మొలకెత్తుచున్నదని యందుము.

ఆ విధముగా సత్స్వరూపమై, విశ్వవ్యాపియైన ఆ శుద్ధసత్త్వము శాశ్వతముగా పరిపూర్ణావస్థలో ఇమిడియున్నది. మాయాకార్యముచేత నా శుద్ధచైతన్యము అనేకములగు పొరలను చీల్చుకుని, జగద్రూపముగా బయలువెడలుచున్నది. విత్తనముయొక్క సాదృశ్యమును చెప్పునపుడు, యెచట జగత్తు అప్పుడే వ్యక్తమగుచున్నదో యట్టి మహత్తత్త్వము మొలక యనిన విత్తనములోని చెట్టు యవస్థను మంత్రములో చెప్పిన అవ్యక్తమునకు పోల్చవచ్చును. అవ్యక్తావస్థ యనగా వ్యక్తముగాని జగత్తుయొక్క స్థితి. తల్లిగర్భములోని శిశువువంటిది. ఇచట అవ్యక్తము - మూలప్రకృతి- అవ్యాకృతి, మాయ అనునవి పర్యాయపదములని గ్రహించవలెను.

ఇట్టి అవ్యక్తముకంటె పరమైనవాడు పురుషుడు. అవ్యక్తావస్థకన్న సూక్ష్మతరమైనది ఆ పరమోత్కృష్ట శుద్ధసత్త్వము. ఈ ఉపనిషత్తులోని ఈ మంత్రము దానిని 'పురుషః' యనుచున్నది. ఇది సూక్ష్మములలో సూక్ష్మతమమై వ్యక్తప్రపంచము నంతటికిని శ్రేష్ఠమైన గమ్యస్థానము.

మనము పై రెండు మంత్రములను పరిశీలించిన స్థూలాతిస్థూలమైన సత్యముయొక్క బాహ్యసృష్టినుండి సూక్ష్మాతిసూక్ష్మమైన పొరలగుండ సర్వోత్కృష్ట శుద్ధ సూక్ష్మసత్యముయొక్క స్థానమును అన్వేషించి పోవుచున్నాము. తరతమ భావములో స్థూలతమమైనవి ఇంద్రియములు. వానికన్న సూక్ష్మమైనవి ఇంద్రియవిషయములు. అంతకన్న సూక్ష్మమైనది మనస్సు. దానికన్న సూక్ష్మతరమైనది బుద్ధి. దానికన్న మహత్తత్త్వము, దానికన్న అవ్యక్తము సూక్ష్మతరములైనవి, అని చెప్పి సూక్ష్మతమము అనుదానిని

సర్వోత్కృష్ట గమ్యస్థానమగు ఆ పురుషుడు—సత్యము, అనుదానితో ముగించుచున్నాము. తర్కములో ఉండినయెడల బహుశా మనము ఈ పురుషునికంటె సూక్ష్మతమమైనది ఏది యని తెలిసికొనగోరియుందుము; అటువంటప్పుడు తార్కికులు పరిగణించు 'అనవస్థాదోషము'లో పడి పోవుదుము.

ఈ అనవస్థాదోషమును పరిహరించుటకును, తెలిసినగోరు బుద్ధిని తృప్తిపరచుటకును, "పురుషునికన్న సూక్ష్మమైనది లేదు" అని శ్రుతి ఇచట స్పష్టముగా వివరించుచున్నది.

"ఆ పురుషతత్త్వమే తమచేత పొందదగిన ఆ పరమ సత్యమా? దానిని పొందియే తాము సంపూర్ణత్వమును శాంతిని పొందుచున్నామా?" అన్న సందేహము సాధకున కింకను కలుగవచ్చును. అందువలన నటువంటి నిస్సార సందేహములను పరిహరించి చెప్పినదాని నంతటిని చుట్టపెట్టి యొకచోట చేర్చి సంగ్రహముగా శ్రుతి యీ మంత్రములో 'సా పరాకాష్ఠా' యదియే చరమసీమ యని చెప్పుచున్నది.

శ్లో॥ ఏష సర్వేషు భూతేషు గూఢోఽఽత్మా న ప్రకాశతే।
దృశ్యతే త్వగ్ర్యయా బుద్ధ్యా సూక్ష్మయా
సూక్ష్మదర్శిభిః ॥ ౧౨ ॥

ఈ యాత్మ సమస్తజీవులందును గూఢమైయున్నది. సులభముగా కనబడునది కాదు. సూక్ష్మదృష్టి గలవారు తీక్ష్ణమై, సూక్ష్మమైన బుద్ధితో దీనిని చూడగలుగుచున్నారు.

వేదాంతములోని యాత్మజ్ఞానము దివ్యత్వము ననుభవించుట మాత్రము కాదు. మనమే యా భగవత్తత్త్వమని మరల కనుగొనుటమాత్రమే సంపూర్ణజ్ఞానము కాదని శాస్త్రములు చెప్పుచున్నవి. సమస్తమును తన యాత్మలో నైక్యమగుదానినిగా తెలిసికొనిననేగాని మహాత్ముని ప్రయత్నము పూర్తికాదు. తనని భగవంతునిగను, నితరులను మానవకీటకములుగను

తలచిన నతని జ్ఞానము వ్యర్థమైనది, యసంగతమైనది యని చెప్పవచ్చును. ఘటాకాశము తను ఘటమాత్ర పరిమితమనే యసత్యపు భావనను పోగొట్టుకొనుటకు తా నా మహదాకాశమని తలచుకొనుచున్నది. అట్లే యొక సాధకుడు ఓర్పుతో నిరంతరముగా చేయు సాధనలద్వారా యహంభావమును, వానివలని దేహమనో బుద్ధులతోడి యైక్యభావమును వదలించుకొనినపుడు "అయమహమస్మి - ఇదియే నేను" "అయమహమస్మి - ఇదియే నేను" అని యా పరిపూర్ణమైన మహత్తత్త్వమునే తన సత్యస్వరూపముగా తెలిసికొనుచున్నాడు.

సంగ్రహముగా చెప్పిన ప్రత్యగాత్మకు-ఆ బ్రహ్మతోడి ఐక్యజ్ఞానమే జ్ఞాన మార్గము నవలంబించుటకు క్రమపద్ధతి. దీని నీమంత్రము స్వయంవ్యక్తము చేయుచున్నది. ముందరి మంత్రములో ఇంద్రియవిషయములు, మనస్సు, బుద్ధి, మహత్తత్త్వము అను వాటిమీద చర్చ జరిగినది. ఆ మంత్రము తన ప్రకటనలను ముగించుటకు ముందు సర్వోత్కృష్టమైనది "పురుషుడు" అని సూచించినది.

ముందరి మంత్రమును వెనువెంటనే అనుసరించిన ఈ మంత్రములో 'సర్వభూతములయందు' నివసించునది యగు గూఢాత్మనుగురించి చర్చ జరుగుచున్నది. ఇందులోని అభిప్రాయము ప్రత్యగాత్మకు ఆ బ్రహ్మతోడి ఐక్యమే.

సర్వేషు భూతేషు గూఢో ఆత్మా - ప్రత్యేక వ్యక్తిలోని ఆత్మ. అది మననుండి ఎప్పటికిని దాచబడదు. ఆయినప్పటికిని అజ్ఞానమనెడు తెరవెనుక మాయాకార్యములగు కామక్రోధాదు లనెడు దళసరిగోడల మధ్య, తెలిసికొనుట - అనుభవించుట - అర్థముచేసికొనుట గల అహంకారయుత సాధనములైన ఇంద్రియ మనోబుద్ధులనుండి దాచబడుచున్నట్లు కనబడుచున్నది. ఎట్లు రజ్జువు మాయాసృష్ట సర్పభ్రాంతివలన దాచబడినదో ఆవిధముగా మాయామోహితము మాయాకార్యము అగు అహంకారమునుండి ఆత్మ దాచబడినది.

అన్వేషణ విచారణలతో ప్రశాంతమైన మనస్సు గలవాడై అంధకారములో సర్పముగా భ్రమించిన రజ్జువును రజ్జువుగా కనుగొనినట్లు, సాధ

కుడును, అన్వేషణ ఆత్మాభివ్యక్తి అనుదృక్పథములతో జీవితోద్దేశమును సమీపించిననేగాని, జీవన మంతటికి ఆధారమైన ఆ అత్మతత్త్వమును తానై కనుగొనజాలడు.

శ్లో॥ యచ్ఛేద్వాఙ్మనసీ ప్రాజ్ఞస్తద్యచ్ఛే జ్జ్ఞాన ఆత్మని।
జ్ఞానమాత్మని మహతి నియచ్ఛేత్తద్యచ్ఛే చ్ఛాన్త
ఆత్మని ॥ ౧౩ ॥

వాక్కును మనస్సులోను, మనస్సును జ్ఞానములోను, జ్ఞానమును మహత్తత్త్వములోను, మహదాత్మను ఆ శాంతాత్మలోను, ప్రాజ్ఞుడు ఉప సంహరించవలెను.

ఆర్యులు ప్రత్యక్షదర్శనోద్దేశము కలవారగుటచేత వారి స్వభావము, ఎంత కావ్యసరళిలో నుండిన మానసికసృష్టియైనను, కేవల వేదాంతాభి ప్రాయములతోనే తృప్తిజెందునట్టిది కాదు. ఆ యాత్మనియమన పద్ధతి నవలంబించినప్పుడే సాధకుడు అది ప్రమాణముచేయు ఆనందములను అనుభవించి ఆ ఆదర్శతత్త్వము గల జీవితమును గడపుటకు వీలుపడును. అది యట్లు ప్రత్యక్షముగా ప్రయోజనకారి కాకున్న యథార్థపు ఊహ్యని యొక్క దృఢమై స్థిరమైన మనస్సు దానిని పరిహసించి తిరస్కరించి యుండును.

దేశముయొక్క, దానిలోని ప్రజలయొక్క ఇట్టి యుద్దేశము నను సరించునదే భారతీయవేదాంతము. అది పతనముచెందుచున్న తరములవారి యశాశ్వత మానసికావస్థను ప్రశంసించి గౌరవించుటకు నిర్జీవములు, విపరీత ములునైన భావములతో గ్రుచ్చబడిన మాలలు గల ఒకానొక గ్రంథము మాత్రము కాదు. సర్వోత్కృష్టమైన అస్తిత్వావస్థితియొక్క వివరణగలదై "పురుష" పదముచే నే పరిపూర్ణస్థితి సూచింపబడినదో యట్టిదానిని తెలిసి కొను పద్ధతిని యీ ఉపనిషత్తులోని మంత్రము వివరించి వర్ణించుచున్నది.

వాక్కును మనస్సులో నుపసంహరింపుము - సంస్కృతపాండిత్యము గల కొంతమంది పండితులు శ్రుతిపాఠములను సంకుచితదృష్టితో చూచి వాటికి కఠినమై బిగువైన యర్థమును కల్పించి యందుండు సత్యమును గుణించిన విశాలభావమును నాశనము చేయుచున్నారు. ఈ శాస్త్రము యొక్క శైలియే తన స్వకీయానుభవములను ప్రకటించునదిగా నున్నదిగాని, కేవలము పదపదార్థజ్ఞానమును వెల్లడించునదిమాత్రము కాదు. శాస్త్రములలో నిట్టి తబ్బిబ్బులు చేయుటవలన సంస్కృతపండితులు మంచికంటే చెడ్డనే యధికముగా చేసిరి. విజ్ఞానమునకు విజ్ఞానమై సర్వోత్కృష్టమైన సత్యమును తెలుపు శాస్త్రములోని పదములకు కేవల నీరసజ్ఞానముతో నర్థము చెప్పదలచుట తెలివితక్కువతనమే గాక తీరని నేరముకూడ యగుచున్నది.

ఇచట యుపనిషద్గ్రంథము ఒకే సమయములో ఇంద్రియములను, ఇంద్రియక్రియలను రెండింటిని 'వాక్' అను ఒక్క పదముతోనే సూచించుచున్నదని తెలిసికొనవలెను. "కర్మేంద్రియ జ్ఞానేంద్రియముల నన్నిటిని వశమందుంచుకొనవలెన''నునదే యిచట కేవల 'వాక్' అనువానిచే శ్రుతి బోధించుచున్నది.

'మనస్సును బుద్ధిలో నుపసంహరింపుము' - అనగా మానసిక సందేహములు, సంశయములు, ఆశలు, నిరాశలు, ఉద్రేకములు, ఆవేశములు మొదలైనవాటి నన్నిటిని వివేచనాశక్తి గల బుద్ధియొక్క వశమందుంచుకొనవలెను' అని తెలియుచున్నది. ఈ కార్యము మనము దేహాత్మభావమును వదలి బ్రహ్మైక్యభావమును పొందిననే జరుగుటకు వీలగును. ఇది మరల 'నిద్ర లేని నిద్రవంటి తురీయావస్థచే పుటము వేయబడుచున్నది. అట్టి యీ యవస్థనుకూడ దాటిన సాధకుడు ఉత్తమధ్యానముద్వారా శక్తివంతమైన అనుభవము కలిగి, యెచ్చట తననే యా పరమపురుషునిగా తెలిసికొనుచున్నాడో, యట్టి గమ్యస్థానమును చేరుచున్నాడు.

**10-13 శ్లో॥** ఆత్మైక్యభావముతో సాధనచేసిన ధ్యానయోగము శక్తివంతమగునని సమగ్రముగా చర్చింపబడినది. మెల్లగా, స్థిరముగా మన

బాహ్యదృష్టిని, ధ్యానమును లోనికి మరలించుట. మఱియు వానిని లోతులకు - సత్యకేంద్రమునకు - ఆత్మవఱకు పోనిచ్చుట.

శ్లో॥ ఉత్తిష్ఠత జాగ్రత ప్రాప్యవరా న్నిబోధత ।
క్షురస్య ధారా నిశితా దురత్యయా దుర్గం
పథ స్తత్కవయో వద న్తి ॥ ౧౪ ॥

లెమ్ము మేలుకొనుము - గురువును సమీపించి ఆత్మజ్ఞానమును పొందుము. వాడియగు కత్తిఅంచువలె ఆమార్గము చాలా నిశితమైనది. దాట శక్యముగానిది. పొంద శక్యము కానిది,—అని కవులు చెప్పుచున్నారు.

మహర్షులు తమ తీవ్రమైన ధ్యానావస్థలో అనుభవించిన పరమ సత్యముయొక్క ప్రకటనలే ఈ ఉపనిషత్తులు.

ఒక వ్యక్తి సాధారణమైన ఐహికానందమును పొందినపుడే పిచ్చివానివలె ఆవేశము కలవాడై తన సహచరులకు చెప్పునంతవరకు బాధపడునుకదా! కావుననే జ్ఞానమునుగూర్చి వివిధశాఖలలోను సాహిత్యము సంపుటములు సంపుటములుగా ఉన్నప్పటికిని ప్రతి భాషలోను కవుల గానములును ఉండనేఉన్నవి. వైజ్ఞానికులు తీవ్రపరిశీలనచే మరియొక ప్రకృతిరహస్యమును కనుగొనినపుడు చాలవరకు పిచ్చివారై పోవుచున్నారన్న విషయము వేరే చెప్పనక్కరలేదు. న్యూటను 'ఆపిలుపండు' తన ముక్కుమీద పడినపుడు 'భూమియొక్క ఆకర్షకశక్తి అన్ని వస్తువులను క్రింద కీడ్చును' అను ఆలోచనవలన కలిగిన ఏ ఆనందాతిరేకము కలదో, దాని వలన 'ఆపిలుపండు' తన ముక్కుమీద పడుటవలన కలిగిన బాధనుకూడా అంతగా అనుభవించి ఉండడు.

'నీటిలోని ఘనపదార్థములను తీసివేసిన వెనుక ఆ నీటిని కొలుచుటచే ఆ పదార్థముయొక్క ఘనపరిమాణము తెలిసికొనవచ్చును' అని కనుగొనిన వెంటనే ఆర్కిమెడిస్ పిచ్చివాడై 'నాకు తెలిసినది. నాకు తెలిసినది' అని నగ్నముగా స్నానముగదినుండి నగరవీథులలోనికి పరుగెత్తెను.

ప్రాచీనకాలపు మహర్షులు సత్యమునుగుఱించిన మౌనధ్యానములో శాశ్వతమైన దివ్యత్వమే తమ స్వభావమని తెలిసికొనిరి. మఱియు శ్రేష్ఠమైన పరిపూర్ణత ననుభవించి వారు పొందిన యానందాతిశయములో తమ తరము వారిని పిలిచి "ప్రతివాడును నా దివ్యత్వముతోడి యైక్యమును తెలిసికొను వఱకును సత్యమును సాధించు నా మార్గమును అనుసరించవలసినది" యని చెప్పిన ట్లుపనిషత్తులలో చాలచోట్ల యుదాహరణలు గలవు.

ఏసుక్రీస్తు చాలవఱకు దీనితో సమానమైనటువంటి యభిప్రాయమునే ప్రకటించియున్నాడు: "తిన్నని ద్వారములో ప్రవేశించుటకు ప్రయత్నింపుడు. ఆ ద్వారము చాల సన్నగా నున్నదిగాని మార్గము తిన్నగా నున్నది. దానిని కనుగొనువారు చాల కొద్దిమందే యుండవచ్చును" అని.

ప్రస్తుతము చర్చించుచున్న యీ మంత్రములో నాధ్యాత్మిక సామ్రాజ్యములోని కాహ్వానమున్నది. నిరాశలతో, నిస్పృహలతో బాధపడు మానవునకు నది యానందమును ఆశను రేకెత్తించునది. మానవుని లేపుటకును, మేలుకొలుపుటకును, ప్రసిద్ధమైన యీ పిలుపునే శ్రీ వివేకానందులు తమ ప్రచారసంస్థకు చిహ్నముగా స్వీకరించిరి.

ఉత్తిష్ఠత - జాగ్రత! సంసారమనెడి చిత్తడినేలలో మునుగుచున్న యో మానవుడా! లెమ్ము! సూర్యకాంతిచే ప్రకాశించుచున్న పరిపూర్ణ తత్త్వమువైపు మఱలుము. మహర్షులచే చూపబడిన యీ మార్గము ననుసరించియే నడువుము. ఆ మార్గమే యనుసరణీయమైనది. నీ యొక్క యసంపూర్ణ పరిమిత జ్ఞానములు, ఆశ యాకాంక్షలు, జయాపజయములు, రాగద్వేషములు, జననమరణములు మొదలైనవన్నియు, "నడివేసవి రాత్రికలలే" యని యొచట నిలిచి తెలిసికొందువో అట్టి అత్యున్నతదశను చేరికొనుము.

కేవలము పడకనుండి లేచుటయే నిద్రయొక్క సమాప్తి కాదు. తలగడమీదనుండి తలయెత్తి లేచినప్పటికి మరికొన్ని క్షణముల పిమ్మట నున్నట్లు వెంటనే మనకు అంత చురుకుదనము, బాహ్యప్రపంచమునుగూర్చి మేలుకొనుట ఉండదు. మనము మామూలుగా మేలుకొని లేచుటకంటెను హఠాత్తుగా నిద్ర మేల్కొని లేచుటలో చాలా భేదము కలదు.

ఆస్తులను పోగొట్టుకొనుట, హఠాత్తుగా ఇష్టజననష్టము, ఆశాభంగములు మొదలైన జీవితములోని కఠినాఘాతములవలన స్వార్థములతో, పోటీలతో గడపు నిత్యజీవితములోని విలువయొక్క అనిత్యత్వమును తాత్కాలికముగానైన తెలిసికొందుము. జీవితములోని ఇట్టి ఒత్తిడివలన మానవుడు తాత్కాలికముగా అత్యుత్తమ వైరాగ్యమువలె ఆభాసించుదానిని పొందుచున్నాడు. కాని ఇది ఒక అనిత్యభావస్థితియే. శక్తిలేని కోరికవలె ఇట్టిది మనకందఱకు ఎప్పుడో ఒకసారి వచ్చి వెంటనే దాటిపోవుచుండును.

ఇట్టి మనచేత గడపబడుచున్న జీవితముయొక్క తాత్కాలికమైన నిస్సారత్వమును తెలిసికొను మన మానసికస్థితి 'లెమ్ము' అను పదముచే సూచింపబడుచున్నది. ఇట్టి స్థితిలో సాధకుడు తనలోని మార్పును పూర్తిగా తెలిసికొనియుండడు....అందుననే 'మేలుకొనుము'—కొరడా దెబ్బలవంటి పరిస్థితులలోనుండి 'లెమ్ము' అను ఆజ్ఞను పాలించుటకు ఎవడు వచ్చునో అట్టివాడు తనలో, తన వ్యక్తిత్వములో నిజముగా ఏమి జరిగినదో తెలిసికొని దానివలన పూర్తిగా మేలుకొనవలెనని" మహర్షులు చెప్పిరి.

ఈ జాగృతి బ్రహ్మవిద్యను నేర్చుకొనుటకు గురుపాదములవద్దకు పరుగెత్తిననే గాని సఫలము కాజాలదు.

మనకు గురువు ఎందుకు? ఈ ప్రశ్న తఱచు విద్యావంతులైన ప్రజలనుండి వచ్చుచున్నది. కాని యాంత్రిక కళయైన టైపు వ్రాతనే గురువు లేక నేర్చుకోలేమన్న ఆ పరమమైన ఆత్మజ్ఞానము గురువులేక ఎట్లు నేర్చుకొనగలుగుదుము అను మాటను వారు మఱచిపోవుదురు.

మరల ఈ మార్గము చాలా కఠినమైనది—'చురకత్తియొక్క వాడి అంచువలె నున్న మార్గము. కేవలము పరిహాసముకొఱకైన ఎవడు ఈ మార్గమును అవలంబింప ప్రయత్నమైనను చేయునో అట్టివాడు ఆ మార్గము ఇఱుకై జారుడు కలదియని తెలిసికొనవలెను.

సంపూర్ణ ఆత్మసంయమమునకు, క్రమశిక్షణకు, సంపూర్ణ అప్రమత్తతకు, వివేచనకు అర్పితమైన జీవితమును గడపుట అంత సులభమైనది

కాదు. కట్టెలు కొట్టువానికి గాని, నగరవానన కలిగిన భీమాకంపెనీ ఏజంటుకుగాని చెట్టుక్రింద కూర్చున్న సాధువు సోమరివలె తోచవచ్చును. కాని ఆ ఏజంటే ఒక గంటసేపు ఈ సాధువుయొక్క మార్గమును అనుసరించినచో ! (ఆ విషయము తెలియును.)

కత్తిఅంచువలె వాడి అయినది అని చెప్పుటవలన సర్వకాల సర్వావస్థలలోను ఈ మార్గమును జాగ్రత్తగా అనుసరించుట ఎంత ముఖ్యము అనుదానిని గట్టిగా స్పష్టపఱచుచున్నది. దీనిని ఏవిధముగను అపార్థము చేసికొని ఈ మార్గము అగమ్యము, అసంభావ్యము అని భావించకూడదు. యథార్థమైన సాధకునకు అసంభవము అనునదియే లేదు.

మృత్యుదేవత ఈ పై వాక్యము తనదిగా చెప్పుకొనుటలేదు. ఇచట అతడు తన వినయబుద్ధిని ఏ విధముగను విడిచిపెట్టుట లేదు. విడిచి పెట్టడు. ఏలన వేదాంతములోని కేవల నమ్మకముతో ఎవరెట్టి వివరణను 'తన స్వంత అనుభవము' అని చెప్పినను, మనము ఒప్పుకొనము. ఊహలకు ఉత్ప్రేక్షలకు వేదాంతములో తావులేదు. గురు శిష్య పరంపరల నుండి వచ్చిన వివరణములను వచనములనే మనము అంగీకరించెదము. కావుననే మృత్యుదేవత 'ప్రాచీన కాలములో మేధావులు ఈ వివరణను చెప్పిరి (కవయో వదన్తి)' అని చెప్పుచున్నాడు.

మానవునిలోని దివ్యత్వానుభూతిని తత్ జ్ఞానమును ఆటంకపరచు ఎట్టి నాగరికతగాని, సంస్కృతిగాని, నిరంతర నిద్రలో నిలిచిన అస్తిత్వమనియు, తడబడపాట్లతో కూడిన పురోగమనమనియు ఋషుల మతము.

శ్లో॥ అశబ్ద మస్పర్శ మరూప మవ్యయం తథారసం నిత్యమ
గన్ధవచ్చ యత్ ।
అనాద్యనన్తం మహతః పరం ధ్రువం నిచాయ్య త
న్మృత్యుముఖాత్ప్రముచ్యతే ॥ ౧౫ ॥

ఎవడైతే దానిని శబ్దము లేనిదిగను, స్పర్శ లేనిదిగను, రూపము లేనిదిగను, నాశము లేనిదిగను, రసము (రుచి) లేనిదిగను, గంధము

లేనిదిగను, ఆద్యంతములు లేనిదిగను, నిత్యమైనదిగను, మహత్తుకు పర మైనదిగను మార్పు లేనిదిగను, (ధ్రువమైనది) తెలిసికొనుచున్నాడో, అట్టి వాడు మృత్యుముఖమునుండి విముక్తుడగును.

మరణము తరువాత అస్తిత్వము ఉన్నదా లేదా అనునదే మృత్యు దేవతను నచికేతుడు తీవ్రముగా ప్రశ్నించెనని మీకు జ్ఞాపకముండియే యుండును.

ఈనాటి పార్లమెంటులోవలె అవును-కాదు అనే పద్ధతిలో మృత్యు దేవత సూటిగా జవాబు చెప్పలేదు. ఇట్లు చెప్పకపోవుటను మతములయొక్క మతబోధలయొక్క సరియైన ఉద్దేశమును అర్థముచేసికొను వివేకములేని నాస్తికులు నిరీశ్వరవాదులు, ఉదహరించి, మహాగురువులుకూడా అమాయకపు సాధకులచే అడుగబడు ప్రశ్నలకు సరియైన జవాబు నివ్వక తప్పించుకొనుట లోనే విజయము గాంచిరి అని ప్రలపించుచున్నారు. కాని శాస్త్రీయముగా చెప్పవచ్చిన పైకి చూచుటకు నిష్కపటమై హృదయపూర్వకమైనప్పటికిని నచికేతుని ఆ ప్రశ్న వేదాంతరీత్యా అసంగతమైనది. సంపూర్ణ విజ్ఞానభాషలో అట్టి తప్పుప్రశ్నకు ఏ వేదాంతియు జవాబు చెప్పలేడు. ఒకవేళ మృత్యు దేవత మరణము తరవాత అస్తిత్వము లేదన్న అతడు అసత్యము పలికినవా డగును. శుద్ధసత్త్వము శాశ్వతముగా అస్తిత్వముకలిగియుండవలెను. ఒక వేళ మృత్యుదేవత మరణము తరువాతకూడ అస్తిత్వ మున్నదన్నయెడల అదికూడ అబద్ధమే అగును. వైజ్ఞానికముగ అతడు పొరబడుచున్నాడు. ఏలన శుద్ధసత్త్వ సామ్రాజ్యములో అసత్తుకు తావు లేదుకదా. మరియు భావము అను అభిప్రాయము అభావ సంబంధమున్ననే కుదురును. ఇటు వంటి అసంబద్ధ పరిస్థితియే బుద్ధభగవానునికి కలిగినది. కావుననే అతడు తనశిష్యులు దేవుడున్నాడా లేడా అని అడిగినప్పుడు మౌనము వహించవల సిన వాడాయెను.

మృత్యుదేవత సూటిగా చెప్పకపోయినప్పటికిని అతని మాటలలో వివేకులగువారికి జవాబు స్ఫురించుచునే యున్నది.

ఆద్యంతములు కలిగి పరిమితమైన విషయములను వివరించి అను భవములను వచించుభాషలోనే ఆ పరిపూర్ణస్థితి ఆ ఆత్మతత్త్వము ప్రస్తుతము మనము చర్చించు మంత్రములో వివరింపబడినది.

పంచేంద్రియములనెడి పంచరంధ్రములద్వారానే మనము ఈ ప్రపంచ మును గ్రహించగలుగుచున్నామని ఇదివరకే తెలిసికొంటిమి. ఏది జీవిత ములో గ్రహించి అనుభవింపబడుచున్నదో అది చెవులు విన్నది కన్నులు చూచినది, స్పర్శ అనుభవించినది, జిహ్వ ఆస్వాదించునది, ఘ్రాణ మాఘ్రా ణించునది అవుచున్నది.

పదార్థములతో కూడియున్న జగత్తును తెలిసికొను ఆ జ్ఞానము పదార్థ ముల గుణములద్వారా అభివ్యక్తమగుచున్నది. ఆత్మస్థానమును సూచించు ప్రయత్నములో శ్రుతి ముందుగా భౌతికప్రపంచమును చూపించి 'దాని కావల శుద్ధచైతన్యక్షేత్రమగు ఆత్మసామ్రాజ్యము ఉన్నదని' వివరించుచున్నది.

పరిమిత భౌతిక ప్రపంచముయొక్క సరిహద్దులవద్ద భాషలన్నియు ఆగిపోవుచున్నవి. దాని కావల ఆత్మభాష—మౌనధ్యానము, అదియే తన ఆత్మతో మాట్లాడుటకు ఆత్మకు భాషగా లభించుచున్నది. కావున 'నేతి— నేతి' 'ఇదికాదు-ఇదికాదు' అను పదములచే తప్ప ఆ వివరించరాని సత్య మును వైజ్ఞానికముగా వివరించుటకు శ్రుతికి మరియొక సులభమార్గము లేకపోవుట సహజమేకదా!

ఈ మంత్రములో ఆత్మయొక్క మహోత్కృష్ట ప్రభావమును వ్యతిరేక భాషలో నీవిధముగా వివరింపబడినది. అశబ్ద-శబ్దములేనిది, అస్పర్శ-స్పర్శ లేనిది, అరూప - రూపము లేనిది, అగన్ధ - గంధములేనిది అని, ఆ పరమ సత్యమును ఆద్యంతములు గల భాషలో చెప్పవలెననిన ఇది ఒక్కటియే మార్గము.

శబ్ద స్పర్శ రూప రస గంధములనెడు విషయగుణములను నిరాకరిం చుటచే ఈ ఇంద్రియములు ఆ సత్యమును తెలిసికొనలేవనుటను శ్రుతి వ్యక్తపఱచుచున్నది.

నిత్యం—ఇంద్రియములచే గ్రహించుటకు అశక్యమైన దగుటచే అది శాశ్వతము. పిలన కుండ, కుర్చీ, టేబిలు మొదలైనవి ఇంద్రియ గ్రాహ్యములగుటచే ఆద్యంతములు గలవగుచున్నవి. కాబట్టి ఇంద్రియముల నిరాకరించి సత్యమును చెప్పుటచే శ్రుతి ఆత్మయొక్క నిత్యత్వమునుకూడ చెప్పుచున్నది.

అనాద్యనంతం—(అది అంతములు లేనిది) వ్యతిరేకపు బాషతో ఇంద్రియాదులను నిరాకరించి, ఆత్మయొక్క నిత్యత్వమును సూచించుటతో తృప్తిపడక, శ్రుతి మంత్రముయొక్క మొదటి పాదములో 'ఆత్మ నిత్యము' అని వ్యక్తపరచెను. సాధకుల హృదయములోనికి ఈ అభిప్రాయమును ప్రవేశింపజేయుటకు శ్రుతి పునరుక్తదోషమును అచరించి ఆత్మను 'అది, అంతములేనిది' అని మరల చెప్పుచున్నది. బ్రహ్మవిద్యాజ్ఞానముయొక్క సరియైన అర్థములో ఈ విశేషణమును జీర్ణించుకొన్న మనము ఇది కేవల పునరుక్తము గాక, దానివలన సూచింపబడిన ప్రతిదానినిగూర్చి స్పష్ట భావమును కలిగించుటకు యుక్తమైన పదమని తెలిసికొందుము.

అంతము గలది అనగా నశించునది. ఏ వస్తువుగాని ప్రస్తుతపు అస్తిత్వమును పోగొట్టుకొనుటకే నశించును. అట్లు నశించుటలో అది తన కారణస్థితిలోనికే పోగలుగుచున్నది. మట్టికుండ పగిలిన అది మరల తనకు కారణభూతమైన మట్టిగానే మారుచున్నది. ఒక విత్తనము అంతమొందిన దాని కారణమగు వృక్షముగా మారుచున్నది. లేదా ఆ విత్తనము నశించిన ఏ పదార్థములతో అది సృష్టింపబడినదో ఆ పదార్థములుగనే అది మారుచున్నది. గుప్త అనునతడు చనిపోయెననగా లేదా ఇంకలేడనగా అతని రూపమును సృష్టించిన పదార్థములు ఆ రూపములో మరి లేవనియు మట్టిలో కలిసిపోయినవనియు మనము అర్థము చెప్పుకొనుచున్నాము. భౌతిక విజ్ఞానభాషలో "కొవ్వువత్తి కాలిన పోవున వేదియు లేదు" అనుట ఈ విషయమును వ్యక్తపరచుచున్నది.

ఆ విధముగానే అద్యంతములు గల సమస్త పదార్థములు తామెందుండి పుట్టెనో అట్టి కారణములోనికే పోవుచున్నవి. ఆ సత్యమునకు అంతము

లేదు అని చెప్పుటవలన శ్రుతి 'ఆ సత్యము కారణములన్నిటికి కారణ మగుచున్నది గాన తిరిగి అందులోనికి పోవుటకు వేరే కారణము లేదని' సూచించుచున్నది. దీనివలన ఆ సత్యము దేనిచేతను దిద్ది తీర్చబడినది కాదనికూడ తెలియుచున్నది. అదియే చివరిది. అందువలననే అది అది లేనిది.

ధ్రువం - మార్పు లేనిది. పైదానివలన శుద్ధచైతన్యమైన ఆత్మ తన సర్వోత్కృష్టతలో మార్పులేనిది అని వ్యక్తమగుచున్నది. ఇంద్రియ మనో బుద్ధులచే గ్రహింప శక్యము కానిదై ఆ పరమసత్యము ధ్రువమై, నిత్యమై, మహదతీతమై (హిరణ్యగర్భ లోకాతీతము) అనాద్యనంత మైనప్పటికిని, ఒక సాధకుడు దానితో నైక్యమును స్థాపించుకొనుటకు ఎందుకు సాధన చేయవలెను? ఈ దుఃఖకరమైన జీవితపుటాటను నాడుట, నిత్యకృత్యపు బజారువీథులను చేరుట, యచట ప్రయత్నించి, పోరాడి, చెమటోడ్చి, పరిశ్రమ చేసి, దుఃఖించి, నిట్టూర్చి, మధ్యమధ్య నాడి పాడి, నవ్వి నాట్య మాడి, చిఱునవ్వులతో నుండుటయే దీనికన్న మిక్కలి లాభకరమైనది, నిశ్చయమైనది, తథ్యమైనది, ప్రాప్తియోగ్యమైనది కాదా!

అటువంటి పరమసత్యము నన్వేషించి దానితో నైక్యమును పొందుటకు సాధకుడేల ప్రయత్నించి సఫలుడు కావలెనో యిచట శ్రుతి వివరించుచున్నది. ఎవడా బ్రహ్మానందస్థితిని తెలిసికొనుచున్నాడో వాడు మృత్యువు నుండి విముక్తుడగును. జీవితములో మృత్యువనిన భయపడినంతగా మరి దేనిని చూచియు భయపడ మనునది యందరికి తెలిసిన సర్వసామాన్యమైన విషయమేకదా! ఇక్కడ 'మృత్యు'వనగా "నీ భౌతికదేహమును కృశించి నశించుటకు నీ భూతలముమీద వదలి, తన చివరి ప్రాణవాయువుల ననంతాకాశములో విడచిపెట్టుట" యను పరిమితార్థము కలది కాదు. ఇచట మృత్యువనగా, "భౌతికమై, యనిత్యపదార్థములతో కూడిన ప్రపంచమును తనలో నిముడ్చుకొనుట" యనునదే యర్థము.

నిరంతరము సాధనచేసిన సాధకుడు ఆ పరమసత్యముతో ననగా యా పరమాత్మతో నైక్యము పొందుటలో సఫలుడు కాగలడనియు, వానికి

యాద్యంతములు గల ప్రపంచము లేనిదే యగుచున్నదనియు, వానిక నిరుత్సాహములు, నిరాశలు, దుఃఖములు, హృదయమునకు తెచ్చి తన సంపూర్ణానందమును నశింపజేయు నింద్రియములు లేనివే యగుచున్న వనియు, ఈ మంత్ర మిచ్చుట వివరించుచున్నది.

నిచాయ్య—తెలిసికొని—టేబిలునుగాని కుర్చీనిగాని తెలిసికొనునట్లు 'సత్యమును తెలిసికొనుట' అని ఇచట తాత్పర్యముకాదు. సత్య ప్రపంచములో జొరబడుటకు ఈ మంత్రము పూర్వార్ధములో ఇంద్రియములను నిరాకరించినట్లే తత్ఫలితముగా మనోబుద్ధులనుకూడ నిరాకరించినది. (ఇచట "నిచాయ్య—ఆత్మీయముగా అనుభవించి" అను అర్థమునే కలిగి యున్నది. జ్ఞానముతో సహజముగా అనుభవించుటయే పరిపూర్ణ సత్యమును తెలిసికొనుట.)

**14-15.** నానాత్వమునుండి మనలను ఏకత్వమునకు తీసికొనిపోవుట అధ్యాత్మయోగ మార్గము. "'ఛురస్యధారా' వాడియై తీక్ష్ణమైయుండు కత్తిఅంచువలె" అని వర్ణింపబడినది. కాని అది ధీరుడై నిష్కపటుడైన సాధకుని మృత్యువున కతీతమైన అమరత్వస్థితికి తీసికొని వెళ్ళుచున్నది.

శ్లో॥ నాచికేత ముపాఖ్యానం మృత్యుప్రోక్తం సనాతనం ।
ఉక్త్వా శ్రుత్వాచ మేధావీ బ్రహ్మలోకే మహీయతే
॥ ౧౬ ॥

మేధావి మృత్యువుచేత చెప్పబడిన సనాతనమైన ఈ నాచికేతోపాఖ్యానమును చెప్పినను, విన్నను బ్రహ్మలోకమునందు ఆనందించుచున్నాడు.

**16-17.** ఏ మంత్రములతో ఉపనిషత్తునందలి ప్రథమాధ్యాయము ముగియుచున్నది. వీనిలో ఈ ఉపనిషత్తుయొక్క మాహాత్మ్యము సంగ్రహముగా వర్ణింపబడినది. అటువంటి స్తోత్రపాఠములు శాస్త్రశైలిలోనే తఱచుగ కనబడును. ఇవి శ్రీ శంకరులవారి మతప్రకారము ఈ శాస్త్రములను చదివి ఆమార్గము ననుసరించుటకు సాధకులను ప్రోత్సహించునవైయున్నవి.

శ్రీ శంకరాచార్యులు తమ వ్యాఖ్యానములో బ్రహ్మలోక అనువానికి రెండర్థములు చెప్పిరని గమనింపవలసియున్నది.

బ్రహ్మలోక—సృష్టికర్తయొక్క లోకము—హిరణ్యగర్భస్థితి.

బ్రహ్మరూపీ లోకః—ఇచట లోకమనగా ప్రకాశరూపము; స్వయం ప్రకాశమైన బ్రహ్మ.

సంగ్రహముగా చెప్పినచో మేధావి అయినవాడు ఈ ఉపనిషత్తులోని మొదటి మూడు వల్లులను కంఠస్థము చేసి, ఇతరుల యెదుట వప్పగించి తద్ద్వారా వానిని ప్రచారము చేసిన సర్వోత్కృష్టమైన ఆ బ్రహ్మలోకానందమును అనుభవించుచున్నాడు.

మనము శ్రీ శంకరులవారి ఇతర వ్యాఖ్యానములను అంగీకరించిన 'శ్రుత్వా' 'ఉక్త్వా' అను పదములకు అర్థమును త్రిప్పి మరొక విధముగా చెప్పవలెను. శ్రుత్వా - సమర్థుడైన గురువునుండి ఆ సత్యమునుగూర్చివిని, ఉక్త్వా—తాను జ్ఞాని అగువరకును తన అనుభవములను, ధ్యానములను మరల మరల ఆవృత్తి జేసి పునరుక్తము చేయవలెను. అటువంటి మహాత్ముడు "బ్రహ్మరూపీ లోకః" బ్రహ్మజ్ఞాని, బ్రహ్మయే యగుచున్నాడు— అను శాస్త్రప్రకటనద్వారా బ్రహ్మానందమును అనుభవించుచున్నాడు.

శ్లో॥ య ఇమం పరమం గుహ్యం శ్రావయేద్బ్రహ్మసంసది
ప్రయతః శ్రాద్ధకాలేవా తదానన్త్యాయకల్పతే
తదానన్త్యాయ కల్పత ఇతి ॥ ౧౭ ॥

ఈ పరమగుహ్యమును బ్రాహ్మణసభలో భక్తితో చదివి వినిపించిన, లేక శుచియై శ్రాద్ధకాలమునందు వినిపించిన అతడు అమరత్వమును చెందుచున్నాడు. అనంత ఫలము నిచ్చును - అనంత ఫలము నిచ్చును.

ప్రథమాధ్యాయములోని తృతీయ వల్లి సమాప్తమైనది.

అనన్త్యాయకల్పతే - అమరత్వమును పొందుచున్నాడు.

"ఈ వాక్యము సూటిగా దేనిని సూచించుచున్నది" యని వేదాంత విద్యార్థి తికమకపడకూడదు. ఎంత మహత్త్వము గలవైనను కేవల గ్రంథములు సభలలో చదువుటచేతనే యమరత్వమును పొందింపజేయలేవు. అజ్ఞానమును నశింపజేయునది జ్ఞానమొక్కటియే. ప్రకాశమే అంధకారమును పోగొట్టునది. ఆత్మతత్త్వముయొక్క నిజస్వరూపమును సమాధిస్థితిలో ప్రత్యక్షముగా యనుభవించిననే మాయకల్పితమైన అహంకారయుత జీవభావము నశించును. ఆ యహంకారముయొక్క అంతముతోనే సంసారములోని దుఃఖస్వప్నములు, అంతములేని జన్మలనెడి సుడిగుండములు, అంతమొందుచున్నవి. మానవులతో పోల్చిన దేవతల జీవితము చాలా దీర్ఘమైనది గావున నిచట 'అమరత్వము' అను పదము స్వర్గవాసులైన దేవత లనుభవించు సంబద్ధార్థముగా వాడబడినది. అది వేలకొలది సంవత్సరములు జీవించు ఆ స్వర్గస్థులచేత ననుభవింపబడుచున్నది గావున అల్పజీవితము గల మానవుల దృష్ట్యా వారు అమరులే యగుచున్నారు.

ఇట్లు బ్రహ్మవిద్యా మాహాత్మ్య కథనముతో మంత్రముయొక్క పూర్వార్థము ముగియుచున్నది. అధ్యాయముయొక్క ముగింపును సూచించుటకు ప్రతి యుపనిషత్తులోను ఆఖరుమంత్రముయొక్క చరమ పాదము రెండుసార్లుచ్చరింపబడును. అట్లే నిచటకూడ చివరి రెండు పదములు ముగింపును సూచించుటకు ద్విరుక్తములైనవి. ఈ విధముగా నీ యధ్యాయములో అర్హత గల వేదాంతవిద్యార్థి యగు నచికేతుడు తీవ్రమైన తన సంశయమును పరిహరించుకొనుటకు బ్రహ్మవిద్యను స్వాధీనపఱచుకొని గురువైన మృత్యుదేవతను సమీపించుట యను విపులమైన చిత్రమును చూచుచున్నాము. ఆ మహాప్రశ్నకు వక్రోక్తులు గలిగి, సంగ్రహముగా సూచించు శాస్త్రీయ వివరణములనెడి ప్రత్యుత్తరములుకూడ నీ యధ్యాయములో నున్నవి. ఉపనిషత్తుయొక్క ఉత్తరార్థమగు తరువాతి యధ్యాయములో ఆత్మతత్త్వమును గూర్చిన వేదాంత వివరణలు స్పష్టముగా బోధింపబడినవి.

16 - 17శ్లో ॥ ఇంతటితో ఉపనిషత్తు సమాప్తమైనదని, ఈ రెండు శ్లోకములు ఫలశ్రుతివంటివని కొంతమంది విమర్శకులు తలచుచున్నారు.

కాని ఈ అధ్యాయము "ఆత్మతత్త్వము, యోగమునకు అర్థము" అను కొన్ని అంశములను పైకిదీసి విడిచిపెట్టినది. కావుననే ఈ రెండవ అధ్యాయము వాని వివరణకొఱకు కావలసివచ్చెను.

శ్లో॥ ఓం సహ నావవతు ః సహ । నౌ భునక్తు సహ వీర్యం కరవావహై ।

తేజస్వి నావధీతమస్తు, మా విద్విషావహై ॥

ఓం శాంతిః ! శాంతిః !! శాంతిః !!!

అతడు మనల నిద్దరను రక్షించుగాక, అతడు మనతోకూడ నుండియే మనకు సుఖమును కలిగించుగాక, మనవిద్యకు (అధీతిబోధలకు) బలము కలుగునట్లుగా మనము కలసి ప్రయత్నింతము. మన అధ్యయనము ఆచరణప్రచారములు కలదగుగాక, మనము ద్వేషభావములేనివారిపై యుందుముగాక.

ఓం శాంతిః శాంతిః శాంతిః ।

ఈ శాంతిపాఠము ఉపనిషత్తులయొక్క శైలినిగూర్చి తెలిసికొనుటకు పునరుక్తమైనది. మరియు పరిశోధకులు "తమ పరిశోధనలు మూల రూపమైన కఠోపనిషత్తు ఈ ప్రథమాధ్యాయముతోనే సమాప్తమైనట్లు ప్రకటించుచున్నది" యని తెలియబరచిరి.

వానినిగూర్చిన వాదనలు :—

(1) మొదటి యధ్యాయముయొక్క (తృతీయ వల్లియొక్క) అంతమున ఫలశ్రుతి ప్రకటింపబడినది. సాధారణముగా గ్రంథముయొక్క అంతమందు ఇది యానుపూర్వికముగా చేర్చబడుట పరిపాటి.

(2) మొదటి అధ్యాయములో 'అధ్యాహారములు' లేవు. సంపూర్ణ భావములు సూక్తులు అప్పటికప్పుడు నవీనముగా ప్రకటింపబడినవే.

(3) ప్రథమాధ్యాయములో ఇచ్ఛాపూర్వక లయాన్విత సాహిత్య పద్ధతి ఉన్నది. రెండవ అధ్యాయము బిగువు లేక తిరుగుచు కొన్నిచోట్ల

అడ్డు తగిలిన ప్రవాహముయొక్క బలవంతపు కదలికగా చివ్వకున్న వెనుకకు లాగబడినట్లు ఉన్నది. అట్టిచోట్ల మన కవియన్నియు 'తరువాతి భావములే' (after-thoughts) అని తోపింపజేయుచున్నవి. మరియు ఈ క్రొత్తచేర్పులు అక్కడక్కడ కాక సంపూర్ణ అధ్యాయమే కాలాంతరమున తక్కువ ప్రతిభావంతులచే చేర్చబడినదని ఒప్పుకొనవలసివచ్చును.

(4) రెండవ అధ్యాయములో ఇతర గ్రంథములనుండి తెచ్చుకొనిన సూక్తులు ఎన్నో గలవు. కొన్ని ప్రథమాధ్యాయమునుండి తేబడినవే.

(5) విషయములోకూడ కొన్ని ప్రథమాధ్యాయములోని నిర్ణయములనే సూచించు కొన్ని లక్షణములు గలవు. ప్రథమాధ్యాయములో కొన్ని ప్రశ్నలను ఆ కాలపు రహస్యభాషలో జవాబివ్వబడినవి. రెండవ అధ్యాయము క్రొత్త సమస్యలను వెలిబుచ్చి వాటిని పరిష్కరించుటకు ప్రయత్నించుచున్నది. మొదటి అధ్యాయములోని వంకరటింకరగా తోచు కఠిన ప్రకటనలకు సూత్రములను సూచనలను తెలిసికొనుటకు ఈ రెండవ అధ్యాయము సహాయపడుచున్నదన్న మాట నిజమే. కాని రెండవ అధ్యాయములో నవీనభావము లేవియు లేవు. ఇది సాధించి సహాయపడు అనుబంధమువంటిది. ఈ అనుబంధము కొంచెము త్వరగా కూర్చుటచే క్రొత్త సమస్యలను పుట్టించి వానిని పరిష్కరించుటకుకూడ అవకాశ మీయుచున్నది.

ఈ పై పాఠభేదములచే ద్వితీయాధ్యాయము 'తరువాతి భావన' (after-thought) అనియు నీ ఉపనిషత్తు యథార్థముగా ప్రథమాధ్యాయములోని శాంతిపాఠముతోనే ముగింపు చెందినదనియు వారు నిర్ణయించినట్లున్నది.

సాధకులమై లక్ష్యమును అర్థము చేసికొనుటకు ప్రయత్నించు మనము ఈ పండిత నిర్ణయములను మెచ్చుటగాని నిందించుటగాని చేయనవసరములేదు. మనము రెండవ అధ్యాయమునుకూడ చదువుదము, ఉపనిషత్తుయొక్క ముఖ్యాభిప్రాయములను తెలిసికొనుటకు దానిని ఉపయోగపఱచుకొందము.

---

# ద్వితీయాధ్యాయము

## చతుర్థవల్లి

### ఐక్యతాజ్ఞానమును కలిగించి దానిని పొందజేయు అంతర్వాణి యొక్క పిలుపు.

శ్లో ॥ పరాఞ్చి ఖాని వ్యతృణత్ స్వయంభూ స్తస్మాత్ పరాఙ్
పశ్యతి నాన్తరాత్మన్ ।
కశ్చిద్ధీరః ప్రత్యగాత్మానమైక్ష దావృత్త చక్షురమృ
తత్వ మిచ్ఛన్ ॥ ౧ ॥

స్వయంభూవైన బ్రహ్మ బాహ్యమునకు మరలు స్వభావము గల యింద్రియములను సృష్టించెను. అందువలననే మానవుడు అంతరాత్మను చూడక బాహ్య విషయములనే చూచుచున్నాడు. కాని కొంతమంది ధీమంతులు 'అమరత్వమును' కోరినవారై విషయములనుండి దృష్టిని లోనికి మరలించి యీ ప్రత్యగాత్మను కనుగొనుచున్నారు.

ఇది యీ యుపనిషత్తుయొక్క రెంవవ భాగమగుటచే నిచట పరిమితుల, దుఃఖముల గుఱించియే గాక యీ దుఃఖమయ ప్రపంచము నుండి విముక్తిపొందుటకుగాను జ్ఞానులనుసరించిన మార్గముకూడ సూచింపబడినది.

తానే సృష్టికర్తయై సమస్త రూపములయందు సూత్రధారిగను, సర్వాధికారి యగు నియంతగను యుండునను తాత్త్వికభావము లేకుండ ప్రపంచములో నెట్టి మతమును లేవనియే చెప్పవచ్చును. ఈ భగవత్తత్త్వము ప్రసిద్ధులైన సమస్త ప్రవక్తలచేతను, ఋషులచేతను "స్వయంభూ" యని తెలుసు

కొనబడుచున్నది. శ్రుతిమాత యిట్టి భగవత్తత్త్వమునుగూర్చి యిచట మఱల మఱల చెప్పుచున్నది.

సృష్టికర్తయైన భగవంతుడు, తమతమ ప్రత్యేక కామవిషయము లందు సంచరించుటకుగాను శక్తివంతమైన ప్రవృత్తి కలిగిన పంచేంద్రియ ములను సృష్టించియున్నాడు. సందడిగా ఉన్న బజారువీథిలోకూడ మన చెవులు దూరమున నున్న చెట్టుమీది పక్షియొక్క కిచకిచ ధ్వనులను గుసగుసలనుకూడా వినగలుగుచున్నవి. మన చెవులు వినలేనివానినికూడా మన కన్నులు పరిశీలించగలుగుచున్నవి. నేటి క్లబ్బులలో దీనికి స్పష్టమైన ఉదాహరణను చూడవచ్చును. అచట ఒకడు తన స్నేహితు లిద్దరు అల్లంత దూరాన ఏదో గుసగుసలాడుకొనుచుండ, దానిని వినలేక పోయినను కన్నులతో వారి పెదవుల కదలికను చూచుటచేతనే గ్రహించ గలుగుచున్నాడు. అట్లే అన్ని ఇంద్రియములును ఎల్లప్పుడు బాహ్య విషయములమీదికి దుముకుటకు సర్వసిద్ధముగా నుండును, కాని దేహము లోనికి దృష్టిని మరల్చుటగాని, లోనేమి జరుగుచున్నదో తెలిసికొనుటకుగాని, వినుటకుగాని, స్పృశించుటకుగాని, రుచిచూచుటకుగాని, వాసనచూచుటకు గాని, అవి ప్రయత్నింపవు.

ఈ గ్రంథభాగము యథాలాపముగా చదువువారిచేతను, విద్యాశీలు రగు పండితులచేతనుకూడ తఱచు అపార్థము చేసికొనబడినది. శ్రీ శంకరుల వ్యాఖ్యానము ఈ అపార్థమునకు అనుమతినిచ్చుచున్నది. శ్రీ శంకరులు ఇట్లు చెప్పియున్నారు: "పరమేశ్వరుడు ఇంద్రియములను హింసించెను" అనగా "భగవంతుడు ఇంద్రియములను శపించెను" అని చెప్పుటచేత వేదాంతమునకు గల బాహ్యప్రపంచ విషయమైన అవజ్ఞ అని ఇచట అపార్థము చేసికొనబడినది. అట్టి భావము ఇచట ఏవిధముగాను ప్రతిధ్వనించలేదు. ఎవరు ఉన్నతమైన ధ్యానయోగమును సాధన చేయు చున్నారో అట్టివారికి ఈ ఇంద్రియములు తమలోనికి మరలుటకు నిరా కరించునుగాన 'అవి శాపమువంటివే అనిమాత్రము చెప్పబడినది. అన్ని పదార్థములలోను మూలాధారమైన ఆ దివ్యత్వమును తెలిసికొనుటకు ఇంద్రియములను ఒక్కసారి లోనికి మరల్చవలసియున్నది. కావున

'భగవంతుడు ఇంద్రియములను శపించెను' అనుదానిని యథాతథముగా అర్థముచేసికొనసగూడదు. అట్లైన నీ యధ్యాయమంతయు, మన యింద్రియ ములను వశముచేసికొని వివేకముతో వాటిని యా పరిపూర్ణ తత్త్వము వైపు త్రిప్పు ధర్మయోగమును గాక, బలవంతముగా నింద్రియనిగ్రహ మనెడు వ్యతిరేకమైన యోగము నుపదేశించుచున్న దనవచ్చును.

అయినప్పటికిని పరిణామ ప్రాసాదములోని మొదటి మెట్టుమీద నిలబడి యా 'అస్తిత్వ'మనే పైభాగమును చేరుటకు నాశ గలవారై యింద్రియములను నిగ్రహించి, వాటిని లోవైపునకు మరలించి యచట జ్ఞాననిధియు, సమస్త ప్రాణికారణమగు నాత్మను చూచుటకు నాశించువారు చాలా యరుదుగానే యున్నారు. ఆత్మతత్త్వమును తెలిసికొని, "జీవితసిద్ధి యా ఆత్మ" యను యనుభవము కలుగుటకు, అపరాని యంతఃప్రేరణ యున్ననేగాని యొక సాధకుడు, అంతర్దృష్టియొక్క జ్ఞానమునుగాని, నైతికధైర్యమునుగాని, బుద్ధిలో సమాధానమునుగాని, మానసిక సాహస మునుగాని, చిత్తస్థైర్యమునుగాని, యాధ్యాత్మిక శక్తినిగాని, కలిగి యింద్రి యములను బాహ్యవిషయ ప్రవాహమునుండి యరికట్టి, కారణ భూతమైన యాత్మను సమీపించుటకుగాను తన ధ్యానప్రవాహమును లోనికి ప్రవహింప జేయుటకుకూడ తగినంత శక్తి లేనివాడగుచున్నాడు. ఎట్టి తరములోను, నట్టి పరిపూర్ణత గల మానవులు అరుదే యనవచ్చును.

ఉపనిషత్సాహిత్యములో కఠోపనిషత్తే ప్రాచీనతమమగు హైందవ శాస్త్రగ్రంథమని యంగీకరించినచో, 'ప్రత్యగాత్మ - అంతరాత్మ' యను పదము లిచట ప్రప్రథమముగా ప్రాచీన మహర్షులచే నుపయోగింపబడినవని మనము చెప్పవచ్చును.

ఈ మనోహరమైన శ్లోకములో మృత్యుదేవత మరణరోగములకు కారణ ములు వర్ణించి వాటికి విరుగుడెట్లు వివరించెనో స్పష్టపరుపబడినది. రంగ స్థలముమీద నిలిచి ఉపన్యాసము లిచ్చునపుడును, గుడి గోపురములలో ప్రవచనములు చేయునపుడును, న్యాయస్థానములలో తీర్పుచెప్పునపుడును, ఈ శ్లోకము ఉదాహరింపబడుచున్నదన్న ఆశ్చర్యపడవలసినది లేదనే చెప్ప వచ్చును.

శ్లో ॥ పరాచః కామానను యన్తి బాలాస్తే మృత్యోర్యన్తి
వితతస్య పాశం ।
అథ ధీరా అమృతత్వం విదిత్వా ధ్రువమధ్రువేష్విహ
న ప్రార్థయన్తే ॥ ౨ ॥

పసిబాలురవంటి అజ్ఞానులు బాహ్యవిషయ సుఖములను కోరి వ్యాప్తమైన మృత్యుపాశమునందు తగుల్కొనుచున్నారు. కాని ధీరులు ప్రపంచముయొక్క నశ్వర వస్తువుల మధ్యనున్న ఆ నిత్యమైన అమరతత్త్వమును పొల్చుకొని ఎట్టి ప్రాపంచిక విషయములను కోరరు.

అజ్ఞానమనగా ఆత్మతత్త్వమును మరచుటయే. ఈ అజ్ఞానమే మానసిక పరిధిలో కోరికలుగా వ్యక్తమగుచున్నది. ఈ కోరికలచే ప్రేరితమై మనస్సు వాటి ఆజ్ఞను నడపుటకు ఇంద్రియములను విషయ ప్రపంచములోనికి తరుమును. దీనినే మనము కర్మ అని అందుము. ఆత్మలోని అజ్ఞానమే మానసికావధిలో కోరికలుగా మారి, విషయ ప్రపంచములో కర్మలుగా మారుచున్నది. కావున అజ్ఞానము, కోరిక, కర్మ అను ఈ మూడింటిని వేదాంతపరిభాషలో హృదయ గ్రంథులు (హృదయమునకు మూడు ముళ్లు) అనుచున్నారు. ఈ గ్రంథులే కర్మలకు కారణము లగుచున్నవి. ఈ కర్మల ఫలమును అనుభవించుటకు మానవుడు, అంతులేని దుఃఖములను, అనిశ్చయమైన ఆనందమును కలిగించు వివిధ పరిస్థితులలో స్వతంత్రజీవిగా అనేక క్రొత్తక్రొత్త జన్మలను నిర్బంధముగా పొందుచున్నాడు.

ఈ రెండు మంత్రములలోను నాత్మజ్ఞానమున కడ్డంకులై నిలచు రెండు మహావిఘ్నములు స్పష్టముగా సూచింపబడినవి. (1) మానవున కున్నటువంటి ధ్యానధనమంతయు నెత్తుకొని పరారియగుచు విషయముల వైపు పరుగెత్తునట్టి యింద్రియములయొక్క సహజగుణములు. (2) ఇహపరములలోని విషయ సుఖముల ననుభవించు కోరిక.

ఎక్కువమంది యిటువంటి జీవనమునకు చెందినవారే. ఆధ్యాత్మిక పరిపూర్ణతయొక్క యంతస్థులో వారు "బాలాః - బాలురు" అనగా పరిణామములోను పెరుగుటలోను బాలురు అని నిర్దేశింపబడుచున్నారు. ఇంద్రియములు దుఃఖమునెడి గోతులలో పొరలుచుండ, దైనందిన వ్యామోహములలో చిక్కుకొనుచున్న మానవుడు తన యిప్పటి స్థితికంటె యతీతమై, దివ్యమై, ఉన్నతమైన స్థితి యొకటి యుండుట కవకాశ మున్న దను విషయమునుకూడ తెలుసుకోలేకున్నాడు. కావున శ్రుతి యట్టివానిని 'బాలుడు' యనుటలో మిక్కిలి సామంజస్య మున్నదనియే చెప్పవచ్చును.

కోరికలచే వెంబడింపబడి మనస్సుచే ప్రేరేపింపబడినవై యింద్రియములు నిరంతరమై నిర్విఘ్నమైన యానందము ననుభవింపదలచి, విషయమార్గములలో నిష్ఫలముగా నడచుచున్నవి. శాశ్వతత్వమే మానవునికి తృప్తి నివ్వగలదు. అనిత్యత్వము మానవుని సదా నిరుత్సాహపఱచును. కాని నిత్యతత్త్వము నన్వేషించువారమై మన మజ్ఞానములో పడి యింద్రియ విషయానుభవముతోనే యలసిపోవుచున్నాము. నిష్ఫలమైన యనుసరణలచే, యలసి, సొలసి, బాధపడి చివరకు ప్రతివారును తమ యంతిమ వాయువుల నాకాశమున వదలి భూమిమీద కొఱగుచున్నారు. కావున పరిణామము చెందిన వివేచనాశక్తి లేని బాలురవంటి యజ్ఞానులు భ్రమ ఫలితమైన మృత్యుపాశములో తుదకు చిక్కుకొనుచున్నారని శ్రుతి ప్రకటించుచున్నది.

ఈ బాలురైన మానవులతో, విజ్ఞానులై యప్రమత్తమైన వివేచన గల మానవులను పోల్చి శ్రుతి వారిలో గల భేదము నిచట చూపించుచున్నది. వివేకులు నిత్యానిత్యములయందు, సత్యాసత్యములయందును సప్రమత్త వివేచన కలిగియున్నారు. భ్రమించిన మనస్సులోని యాత్మఘాతుకములైన కోరికలనుండి వారు సహజముగనే తప్పించుకొనుచున్నారు. అస్థిరమై నాశము గలిగి యనిత్యమైన విషయసుఖములను వారు వాంఛింపరు. వారికి అమృతమైనది నిత్యమైనది అగు ఆత్మ తప్ప మరియొకటి యక్కరలేదు.

అజ్ఞాన కామకర్మలు, అంతశ్శత్రువులగుటచే ధీమంతులు వివేకముతో కోరికల నణచివేసి నిష్కామస్థితిని పొందెదరు. కోరికలవిద్యారూపము

లగుటచే నిష్కామస్థితిలో సహజముగనే, యవిద్య నశించుచున్నది. అవిద్య నశించగానే దాని రూపాంతరములగుటచే కోరికలు కర్మలుకూడ నశించుచున్నవి. ఇటు అజ్ఞానము నశించగానే జ్ఞానము ప్రకాశించుచున్నది. అవిద్య జ్ఞానములోనికి యంతర్హితమగుచున్నది. అట్టి జ్ఞానులే యిచట 'ధీరాః' అను పదముచే చెప్పబడిరి. అట్టి మానవులే సిద్ధి పొందు సాధనలను చేసిరి. ఇచట నట్టివారిని యాంగ్లకవి బ్లేక్ (Blake) యను నతడు తన "ఆగరీస్ ఆవ్ ఇన్నొసెన్స్" (Auguries of Innocense) అను పద్యములో నిట్లు వర్ణించెను: "ప్రపంచమునంతను నొక యిసుక కణములో చూచువారు, యడవిపూవులో నమరలోకమును చూచువారు, హస్తతలములో నాత్మను యిముడ్చుకొనువారు, నిత్యత్వము నొకే ఘంటలో భావించువారు."

మాయామోహితులైన సామాన్య సంసారికులె వారు తమకొఱకు అనిత్యమైన విషయసుఖములను ఆశించరు. అన్ని వస్తువులు వారికి ఆ పరమాత్మయొక్క రూపాంతరములే గనుక వారు దేనిని ద్వేషించరు.

1-2. శ్లో॥ ఆశలు ఔన్నత్యమును పొందినవనగా సహజమైన దృష్టి విషయతృష్ణతో బాహ్యమువైపు మరలినదనియు, తనదిగా చేసికొనుటకు ప్రయత్నించుచున్నదనియు, ఆనందించుటకు ఆశించుచున్నదనియు భావము. కాని వివేకులు, భ్రమింపజేయునట్టి అనిత్యములోనే ఆ శాశ్వ తత్వమును అనుభవించుటకు తమ దృష్టిని అంతర్ముఖము చేయుచున్నారు.

శ్లో॥ యేన రూపం రసం గన్ధం శబ్దాన్ స్పర్శాంశ్చ మైథునాన్ ।
ఏతేనైవ విజానాతి కిమత్ర పరిశిష్యతే ॥ ఏతద్వైతత్ ॥

ఏ ఆత్మచేత మానవుడు శబ్ద స్పర్శ రూప రస గంధము లను కామాదులు మొదలగువానిని తెలిసికొనుచున్నాడో అట్టి ఆత్మకు ఈ ప్రపంచములో తెలియరాని దేమున్నది? ఇదియే అది (నీవు తెలిసికొనగోరిన ఆత్మ)

కేనోపనిషత్తు చదివి మననము చేసిన మీకు ఈ మంత్రము సుస్పష్టమై యుండును. కేనోపనిషత్తులోని సంపూర్ణ పూర్వపక్ష సిద్ధాంతములయొక్క సంగ్రహమే ఈ మంత్రము.

నేత్రేంద్రియమునకు తనంతట తానే విషయములు చూచు శక్తి లేదని కేనోపనిషత్తులో తెలిసికొంటిమి. తమంతట స్వయముగా చూచు శక్తియే నేత్రేంద్రియముల కున్నయెడల ఇచట నేను నాకన్నులను పెట్టెకి ఈ బల్ల మీద పెట్టి అచట ఉన్న విషయములను చూడనిచ్చెదను. కాని ఇది అసంగతమని మనకు తెలియును. మరియు, మరణించిన మానవుని కన్నులుకూడ తెరవబడి మనవైపు చూచుచున్నట్లే యున్నప్పటికిని మనము మన జీవితములోని యనుభవముచేత యవి దేనిని చూచుటలేదనుటను తెలిసికొనుచున్నాము. ఈపై యుదాహరణముచే మనము యీ మానవ నేత్రము కేవలము సాధనమాత్రమేనని, మనలోని యా ద్రష్ట దానిని యుపయోగించవలయునని తెలిసికొనుచున్నాము.

సాదృశ్యముకొఱకు దూరదర్శినీ యంత్రమును తీసికొందము. ఆ దూరదర్శినీ యంత్రము తనంతట తానే యాకాశములోని గ్రహములను చూడలేదుకదా. ఆ సాధన వెనుక దానిద్వారా చూచువాడొక డా గ్రహములను చూచుట కున్నాడు. పై దూరదర్శినీ యంత్రమువలెనే యీ శబ్ద స్పర్శ రూప రసాదులను గ్రహించు శ్రోత్రాది పంచజ్ఞానేంద్రియములను కేవల సాధనములు మాత్రమే. ఆ లోనున్న జ్ఞానమూర్తి యీ సాధనముల నుపయోగించుకొనుచున్నాడు.

మన ప్రతియొక్కరిలోను నట్టి శక్తి యనగా చెవులవెనుకనుండి వినునది, కన్నుల వెనుకనుండి చూచునది, జిహ్వలోనుండి రుచిచూచునది, ఘ్రాణాంతర్గతమై వాసన చూచునది, త్వగంతర్భూతమై స్పర్శను తెలిసి కొనునది, యేదైతే గలదో యదియే మానవుని యాత్మ - ఆ పరమాత్మ.

"ఏతత్ వైతత్ - రూపరసాదులను గ్రహించున దేదియో అదియే నీవడిగిన యా ఆత్మ." కేనోపనిషత్తులో నిదివఱకే నిర్ణయించినదానినే యీ శ్లోకములో చక్కగా సంగ్రహించి మృత్యుదేవత చెప్పుచున్నాడు.

'మైథునాన్ - ఇంద్రియానందములు '' ఇచట బహువచన మువయో గించుటచే నా పదమున కర్థము కేవల స్త్రీపురుష సంబంధమైన యానందమే కాదనియు, కర్మ జ్ఞానేంద్రియములచే గ్రహింపబడు ప్రపంచములోని సమస్త విషయసుఖములనియు, తెలియుచున్నది.

విషయజగత్తును గూర్చిన మన జ్ఞానమంతయు నీ పంచేంద్రియముల ద్వారానే తెలియబడున దగుటచేతను, నట్టి సాధనములైన యింద్రియ ములకు పై యధికారియై, శక్తివంతమైన యా వివేకమే యాత్మ కాబట్టియు, నీ జగత్తులో నా యాత్మకు తెలియరానిదేదియు లేదని స్పష్టమగుచున్నది. మరియు నీ యుపనిషత్తులోనే ముందుముందా యాత్మ 'పరమజ్ఞాన రూపమే' యని తెలిసికొందుము.

మృత్యుదేవతయొక్క భవనద్వారమున నిలచి, "యేది ధర్మాధర్మ ముల కతీతమైనదో, కార్యకారణములు కానిదో, భూతభవిష్యత్తులకు భిన్న మైనదో, అట్టిది ఏది?" అని నచికేతుడు జిజ్ఞాసతో మృత్యుదేవతను ప్రశ్నించుటను మనమిచట సౌలభ్యముకొఱకు జ్ఞాపకము తెచ్చుకొందము. ఆ ప్రశ్నకిపుడు మృత్యుదేవత సూటిగా జవాబు నిచ్చుచున్నాడు. ఈ దేహ మనో బుద్ధులయొక్క కర్మలను వశపఱచుకొని వానిని ప్రవర్తింపజేయునట్టి జీవనకేంద్ర మేదైతే మనలో నున్నదో యదియే జ్ఞానజ్యోతి యగు నిత్య పరమాత్మ. అది నిత్యమై యాద్యంతములు లేని తత్త్వమగుటచే 'అది యిట్టిది' యని దానిని నిర్వచించుట కీ భాషకు శక్తి చాలదు. మృత్యుదేవత మన చుట్టునున్న మృత జడపదార్థములద్వారా మనలోని దివ్యశక్తియొక్క యస్తిత్వమును సూచించి యటుపిమ్మట "ఇదియే - అది" యని వివరించుచున్నాడు.

సాధారణముగ వ్యవహారములో మనము వస్తువులను సూచించుటకు 'ఇది' 'అది' యను పదముల నుపయోగించెదము. మనకు దగ్గఱగా నున్న పదార్థములను సూచించుటకు 'ఇది' యను సర్వనామపదము నుపయో గించెదము. 'ఆ కుర్చి - ఈ పెనా' యని చెప్పునపుడు కుర్చీ దూరముగా నున్నదనియు, పెనా దగ్గఱగా నున్నదనియు స్పష్టమగుచున్నది. అట్లే

మనము తొడుగికొనిన జుబ్బానుండి పేనాను దూరముగా నుంచిన అది దూరమై 'ఆ పేనా - ఈ జుబ్బా' అనెదము. అట్లే 'ఆ శరీరము - ఈ మనస్సు' 'ఆ మనస్సు - ఈ బుద్ధి' అని దేహ మనో బుద్ధులను పోల్చి చూచుకొన్నప్పుడు చెప్పెదము. కావున ఇట్లు పరిశీలించగా మనలోని సార భూతమైన ఆ ఆత్మ మనకు చాలా దగ్గరగా నున్నట్లు తెలియుచున్నదిగాన అట్టి దానిని శ్రుతి 'ఇది' అని సరిగానే సూచించినది.

కిమత్ర పరిశిష్యతే - ఇచట ఇంకేమి మిగిలినది. ఈ వాక్యము మీద లభ్యమైన వివిధ వ్యాఖ్యానము లన్నిటిని పోల్చిచూడగా శ్రీ శంకరులవారిదే ఉత్తమమైనదని నిర్ణయించవలసియున్నది. "ఆత్మకు తెలియరాని విషయము ఈ జగత్తులో ఏది మిగిలియున్నది?" అనగా ఆత్మకు తెలియనిదేదియు లేదనియు, అన్నియు తెలిసియే యున్నవనియు, గ్రహింపవలెను. అన్నియు, ఆజ్ఞానరూపమే అగుటచే వేరే తెలిసికొనవలసిన పదార్థములు లేవు.

ఇచట ఉపనిషత్తు - 'ఏతద్వైతత్ అనగా ఈ ప్రత్యగాత్మయే ఆ పరమాత్మ అని చెప్పుచున్నది. మరియు వేదాంతరీత్యా ప్రత్యగాత్మ యొక్క బ్రహ్మైక్యమును వ్యాఖ్యానించుటలో మన మంగీకరించగల నాట కీయమైన ఉపనిషత్తుయొక్క పృష్ఠభూమి (background) ఇట్లు వివరించుచున్నది. "తత్ - నీవు తెలిసికొనగోరిన యా ఆత్మ" దేనిని గూర్చి దేవతలుగూడ సంశయావిష్టులైనారో అట్టి ఆత్మ - తత్ - అదియే."

శ్లో॥ స్వప్నాన్తం జాగరితాన్తం చోభౌ యేనానుపశ్యతి ।
మహాన్తం విభుమాత్మానం మత్వా ధీరో న శోచతి ॥౪॥

స్వప్నావస్థలోను జాగ్రదవస్థలోను సమస్త విషయములను దేనిచే తెలిసికొనుచున్నాడో అట్టి ఆత్మ (తత్) సర్వవ్యాపి యగు పరమాత్మ యని (మేధావి) ధీరుడు తెలిసికొన్నవాడై శోకింపడు. (నశోచతి)

మనలోని ఆత్మయొక్క ప్రాముఖ్యమును, మన జీవితములో దానిని సమన్వయపరచుకొనుటను గూర్చి మృత్యుదేవత కొంచెము విపులముగా వివరించుచున్నాడు. కామమోహితులై, భౌతిక సంపాదనా సంచయ

ములకు వశులై, ప్రతివిషయమున సంశయగ్రస్తులైన, ఈనాటి విద్యావంతు లైన హిందువులు దేశమంతట "వేదాంతము బోధించుచున్న ఈ విచిత్ర జ్ఞానమేమి? అది మన అభివృద్ధికి తోడ్పడునా? ప్రపంచములోని దారిద్ర్య మును పోగొట్టి విశ్వశాంతిని యీయగలదా?" అని పలువిధములుగా ఆక్రోశించుచున్నారు.

అవివేకముగా మతమును అనుసరించు ఈ తరమువారిని శపింప బుద్ధి గలిగినను, బహుశః ప్రపంచ చరిత్రలోనే ఉత్సాహపూరితులై హృదయ పూర్వకముగా ప్రజాశాంతిని, విశ్వమానవ భ్రాతృత్వమును, అభిలషించు మన తరమువంటివా రేకాలము నందునను జన్మించలేదని ప్రతివాడు ఒప్పు కొని తీరవలసియున్నది.

ఈ జ్ఞానమును తెలిసికొని, ఆ సత్యాంశమైన శుద్ధచైతన్యముతో ఐక్య మును పొందగోరువాడై వచ్చు సాధకుని, దేహ మనో బుద్ధులయొక్క స్థితి ఎట్లుండవలయునని ఈ శ్లోకములో తగినంత వివరముగా సూచింపబడినది.

జాగ్రదవస్థలో పంచేంద్రియములచేత ప్రపంచ విషయములను అనుభవించుచున్నామనగా దానికి కారణము అపరిపూర్ణ జ్ఞానము - జీవిత శక్తి అయిన మనలోని ప్రధానమగు ఆ ప్రత్యగాత్మయే, అని ఇదివరకే పూర్వమంత్రములో తెలిసికొంటిమి.

ఈ దేహములో ఆ జీవియే లేకపోయినట్లైతే అతడు ఎట్టి మహాత్ము డైనను ఎంతటి వైజ్ఞానికుడైనను, ఎటువంటి రసికత గల కవియైనను, ఎంత ప్రతిభావంతుడైన చిత్రకారుడైనను, ఈ దేహములో ఆ జీవము అధ్యక్షత వహించకున్నచో, ఎవరుకూడా తమ పనులను నిర్వహించలేరు. కావున జాగ్రదవస్థలోని మన జాగృతిని ప్రకాశింపజేయుటకు మనలోని ఆ జ్ఞాన రూపమైన ఆత్మ కారణమని తెలిసికొనుచున్నాము ఇంతవరకు స్వప్నాను భూతి లేనివాడు ఏయొక్కడును. లేడు ప్రస్తుతము నీవు ఒక పుస్తకమును చేతిలో ఉంచుకొనుము. దాని నెట్లు చదివెదవు? ఆ పుస్తకములోని పదము లను అక్షరములను ప్రకాశింపజేయు తగినంత ప్రకాశము లేకున్న నీవు చదువగలవా? ఒకవేళ రాత్రియైన నీవు వెన్నెలలో చదువగలవు. కృష

పక్షములో నక్షత్ర కాంతిచే చదువగలవు. తారావిహీనమై మేఘచ్ఛన్నమైన రాత్రిని నీవు చదువుటకు - అక్షరములను ప్రకాశింపజేయుటకు అగ్నికాంతి నైనా కల్పించెదవు. దీని ఫలితముగా ఏదో ఒకవిధమైన ప్రకాశమున్ననేగాని మనము వస్తువులను చూడలేము అని తెలియుచున్నది. అయినప్పటికి మనము మనకు నిత్యమువచ్చు స్వప్నమును చూచుచునే యున్నాము. ఈ స్వప్న ప్రపంచము మనలోనే సంభవించుచున్నది. మనము వాటిని చూచుచున్నాము కాబట్టి అవి విషయములు - పదార్థములు. కావున మనో లోకములో నుండు అంతఃపదార్థములను చూచుటకు ఏదో ఒక విధమైన ప్రకాశము ఉండియుండవలెను. ఆ స్వప్నప్రపంచముకూడా మనలోని ఆత్మతత్త్వమైన ఆ దివ్యజ్ఞానమువల్లనే ప్రకాశింప చేయబడుచున్నదని మృత్యుదేవత వివరించుచున్నాడు.

మనలోని ఒకే శుద్ధచైతన్యము జాగ్రదవస్థలోమాత్రమే గాక స్వప్నా వస్థలోకూడ మన అనుభవములను తెలిసికొనుటకు ప్రకాశించుచున్నది.

దేహ మనో బుద్ధులయందలి సంసక్తినుండి విముక్తిచెంది ఆ బాహ్యా వరణములో వ్యక్తమై మన కార్యములను సరియైన మార్గములలో నడుపు నట్టి ఆ దివ్యజ్యోతిని, మరల కనుగొనుటయే మానవునియొక్క గమ్య స్థానము లేక పరమలక్ష్యము నగుచున్నది.

మహాన్తం-విభుం - (మహత్తు-విశ్వవ్యాపి) దివ్య చైతన్యముయొక్క చరమానుభవములో పరిపూర్ణస్థితి నందిన యాతడు తన ఆత్మతో ఐక్యతను స్థిరపరచుకొని వెంటనే తననే ఆ మహత్తుగాను విశ్వవ్యాపిగాను తెలిసికొను చున్నాడు. మన మిదివరకే ప్రత్యగాత్మయే ఆ పరమాత్మయని తెలిసి కొంటిమికదా.

ఇట్లు ఈ సత్యమును తెలిసికొని ధీరుడైనవాడు దుఃఖపడడు (నశో చతి) మానవ హృదయములోని పరిమితత్వభావమే కోరికలకు మాతృస్థాన మగుచున్నది. ఈ కోరికలు యోచనలనే హోరుమను సుడిగాలిని రేకెత్తించి, హృదయమును దద్దరిల్లజేసి, ఇంద్రియములను విషయపంకిలములగు మార్గములందు పరుగెత్తించుచున్నవి. మన ప్రతి కోరికకును తృప్తిని ఆకాం

క్షించి ప్రయత్నించి, సంఘర్షణపడి చిట్టచివరకు తత్ఫలితముగా కన్నీటి కాలువలలో మునిగిపోవుచున్నాము. మన కోరికలు సఫలమైనను, మనము ఆకాంక్షించిన ఆ ఆనందము అచట లోపించుచున్నదని తెలిసికొను చున్నాము. భగ్నమనోరథులై మానవులు ఏడ్చి నిట్టూర్చి, తమ జీవితమును అసహ్యములగు పుంటల కుప్పలుగా తయారుచేసికొనుచున్నారు. ఇట్లు కోర్కెలు పూర్తియైనను కాకున్నను చివరకు దుఃఖమును తప్ప మరి దేనిని ఇచ్చుటలేదు.

మనలో నసంపూర్ణత్వభావము ఉన్నప్పుడే కోరిక యనునది మనలో నుద్భవించుచున్నది. ఎంతటి తిండిపోతులైనా కడుపునిండ భోజనము చేసిన తరువాత కొంచెముసేపైనా, తిండిని కోరడు. ఆ సమయమునకు వానిలో ఆహారపు కొరత లేదు. కాని రెండుఘంటలు దాటిన తరువాత వానికి అల్పాహారము కావలసివచ్చును. ఇప్పుడు ఆతనిలో అసంపూర్ణతా భావము ప్రారంభించినది కావున కోరిక యుదయించినది.

పరిపూర్ణ మానవుడు తనలోని కొఱతల నన్నిటిని పూర్తిచేసుకొని తానే ఆ పరమజ్ఞాత అనునది తెలిసికొనిన, సర్వోత్కృష్ట సంపూర్ణ స్థితిలో పంచేంద్రియములచేత నీయబడు నీ ప్రాపంచిక సుఖములను వేటిని కోరడు. అట్టి పరిపూర్ణస్థితి నందినవాడు భూమిమీది దివ్యమానవుడే యగు చున్నాడు. మానవునకు తెలిసిన సమస్త మతములలో ఉత్తమమైన హిందూ మతమునందు నిట్టి స్థితియే గమ్యస్థానముగా సూచింపబడినది. వేదాంత మతము మానవుడు దేవునకు ఏవిధముగను తక్కువ కాడని చెప్పుచున్నది. కావున మానవుడు ఆ దివ్యచైతన్యమును తెలిసికొని అట్టి స్థితియందే ఉన్న యెడల వానివద్దకు ఎట్టి దుఃఖములు చేరవు.

అట్టి దివ్యమానవులే జన్మించినయెడల, మన ఈనాటి రాజకీయ, ఆర్థిక, సాంస్కృతిక, మతవిషయిక సమస్యలన్ని మరింత తృప్తికరముగా పరిష్కరింపబడియుండవా? ఒక మానవుడు ఆధ్యాత్మిక జీవనమును గడపుటకు ప్రారంభించిననే చాలు గారడీవలె నీ పై సమస్యలన్నియు సమ గారిపోవును. ఈ వేదాంతమతముకన్న మరి ఏదైన యాచరణయోగ్యమై నది యున్నదా?

శ్లో ॥ య ఇమం మధ్వదం వేద ఆత్మానం జీవమన్తికాత్ ।
ఈశానం భూతభవ్యస్య న తతో విజుగుప్సతే ।
॥ ఏతద్వై తత్ ॥ ౫ ॥

ఎవడైతే ఈ ఆత్మను మధువును అనుభవించువానిగాను, జీవించి ఉన్నవానిగాను, భూతభవిష్యత్తులకు ఈశుడుగాను, తనకు దగ్గరగయున్న వానిగను తెలిసికొనునో, అట్టివాడు తరువాత భయపడడు. ఇదియే అది.

'అట్టి పరిపూర్ణ మానవుడు సుఖదుఃఖ రహితుడగుటయె గాక భయరహిత స్థానమును చేరుచున్నాడు' అని ఈ మంత్రము చెప్పుచున్నది.

మధ్వదం=(మధువును సేవించువాడు) అహంకారరూపజీవుడు చేయు సత్కర్మఫలమునే ఇచట మధువుగా పేర్కొనుచున్నాడు. ఆత్మ లేక శుద్ధచైతన్య మిచట నీ మధువును సేవించువాడుగా చెప్పబడుచున్నాడు. అనగా ప్రేమ, దయ, దాక్షిణ్యములు కలిగి పూర్వజన్మలలో చేసిన సత్కర్మలయొక్క సత్ఫలములను సత డనుభవించుచున్నాడు.

ఈ పై వాక్యమునందు వాచ్యార్థమును గ్రహించిన నది వేదాంతమూల సూత్రమగు "ఆత్మ కర్త కాదు భోక్త కాదు"—అనుదానికే వైరుధ్యము సంభవించుచున్నది. ఒకవేళ "ఏకమేవాద్వితీయం" అనునట్టి ఆ శుద్ధచైతన్యములో ఆత్మను భోక్తగా మన మంగీకరించిన "అనుభవించుట-అనుభవింపబడునది" అనువానిని ఆ శాశ్వతభోక్తనుండి వేరుపఱచుట కెట్లు వీలగును ? మనయొక్క చేయదగిన కర్మలకు, చేయరాని కర్మలకు, ప్రశస్తములైన కర్మలకు, నింద్యములగు కర్మలకు—అన్నిటికిని ప్రకాశము కలుగజేయునట్టి యా జ్ఞానమే ఆత్మ. మఱియు అదియే యా జ్ఞానసూత్రము, మన సుఖ దుఃఖములను ప్రకాశింపజేయునది. సూర్యుడు హత్యాస్థలమును యజ్ఞభూమిని యొకేవిధముగా ప్రకాశింపజేయుచున్నను, ఆ రక్తముచేత మలినుడుగాని, ఈ మంత్రములచేత పవిత్రుడుగాని కాడుగదా. ఆ విధము గానే ఆత్మచైతన్యము జీవునియొక్క మాయామోహితము అహంకార యుతము నగు జీవితవ్యవహారములో జరుగు సమస్త జాగృత కర్మలకును

తన చైతన్యము నిచ్చుచు, తాను సాక్షీభూత పవిత్ర జ్ఞానప్రకాశము మాత్రమే అయియున్నది.

3 - 5 శ్లో ॥ ఇచట 'ఆత్మ' జ్ఞానసిద్ధాంతముగా సూచింపబడినది ఏలన దానివలననే గ్రహణజ్ఞానము, అనుభవించు జ్ఞానము సంభవ మగుచున్నది. తెలిసికొనుట, అర్థముచేసికొనుట, ఆత్మజ్ఞానము గల జ్ఞాత సమస్త భయములనుండి విముక్తుడగుచున్నాడు.

శ్లో ॥ యః పూర్వం తపసో జాతమద్భ్యః పూర్వమజాయత ।
గుహాం ప్రవిశ్య తిష్ఠన్తం యో భూతేభిర్వ్యపశ్యత ।
ఏతద్వైతత్ ॥ ౬ ॥

పంచభూతముల మధ్యనున్నవానిగను, బ్రహ్మయొక్క తపస్సుచే పుట్టినవాడుగను, జలముకంటె పూర్వము సృష్టింపబడినవాడుగను, హృదయ కుహరమందు నివసించువానిగను, వానిని ఎవడు చూచుచున్నాడో అట్టి వాడే బ్రహ్మను చూచుచున్నాడు. ఇదియే అది (బ్రహ్మ) నీవింతవరకు ముందడిగినది.

ఉపనిషత్సాహిత్యములో సృష్టిసూత్ర మొక ముఖ్యసమస్య. ఈ పవిత్ర గ్రంథములు ప్రపంచ సృష్టివిషయమై "యెట్లు యెచటనుండి వచ్చినది" అని వివరించుటలో పరస్పర విరుద్ధ సిద్ధాంతములు కలిగియుండుటచేత, ఈనాటి యోర్పులేని విద్యార్థులు—పుస్తకాహారులు అంతఃప్రేరిత జ్ఞానము నిజముకాదని విపరీత నిర్ణయములను చేయుచున్నారు.

సృష్టిక్రమ మేవిధముగ జరిగినదో వివరించునపుడు, ఏ రెండు ఉపనిషత్తులు తమలోతామేకీభవింపవు. ప్రతియొక్క ఉపనిషత్తును తనయొక్క అసమానమైన స్వతంత్ర క్రమములోను పద్ధతిలోను సృష్టి క్రమమును వివరించుచున్నవి. ఒక ఉపనిషత్తు విద్యార్థి మనస్సుకు సమాధానము కలుగునట్లుగా తన ప్రత్యేక సుందరమగు శైలిలో సృష్టి క్రమమును వివరించుచున్నది. అతడు తన దృష్టిని మరియొక ఉపని

షత్తులోని సంపూర్ణ వైరుధ్యము గల సృష్టిక్రమ సిద్ధాంతమువైపు మరల్చు వరకు నిది తృప్తికరముగానే యుండును.

కేవల సత్యమునందే లక్ష్యము గల యా ఉపనిషదృషులు ఈ సృష్టి క్రమమును నంత ముఖ్యమైనదిగా నెంచలేదు. వారి జ్ఞానములో వారికీ నామ రూపజగత్తు మాయావిష్ట మనస్సుతో సృష్టింపబడినదని బాగుగా తెలియును. వారికి మన స్వప్నమెంత సత్యమో అప్రపంచమును అంత సత్యమే.

తన భ్రమలో తాను పూర్తిగా మునిగి తనదగ్గరకు వచ్చిన సాధకునికి ప్రారంభదశలో జగత్తు సర్వధా సత్యమే అను సంగతి మహర్షులకు తెలిసినదే. గురువును సమీపించినపుడు ఎటువంటి స్థితిలో విద్యార్థి ఉన్నాడో తెలిసికొని, అంతకన్న ఉన్నత జ్ఞానావస్థితికి మెల్లగాను, సుకుమారముగాను నతనిని యుద్ధరించవలెను.

ఏ యిద్దరు విద్యార్థులుగాని ఒకే స్వభావము, ఒకే అర్హత, ఒకే సంస్కృతి ఒకే అభిప్రాయము కలిగియుండరు. కావున గురువగువాడు ప్రతివిద్యార్థిని నేర్పుతో సూక్ష్మపరిశీలన చేసి వారివారి స్వభావానుగుణముగ వారిని వర్గీకరించుచున్నాడు.

ఆత్మ సత్కర్మలయొక్క సత్ఫలములను నియమిత దశలోనే అనుభవించుచున్నదని ఉపనిషత్తు చెప్పుచున్నది. దేహ మనో బుద్ధి పరికరములు కేవల జడపదార్థములచే నిర్మింపబడిన వగుటచేత, అవి ప్రాణహీనములని తెలిసికొంటిమి. ఈ ఆవరణల కా యాత్మయే యొక యసత్యపు జీవము నిచ్చుచున్నది.

ఈ విషయమును స్పష్టపఱచుకొనుట కొక యుదాహరణను తీసికొందము. గాజు 'బల్బు'నకుగాని, యందులోని సన్నని తీగెలకుగాని, చీకటిగదిలోని పదార్థములను ప్రకాశింపజేయు శక్తి లేదుకదా! కాని కావలసిన విద్యుచ్ఛక్తిని యా సన్నని తీగెలలోనికి ప్రవహింపజేసిన యా 'బల్బు'నకా గదిలోని వస్తువులను ప్రకాశింపజేయుటకు నొక విశేషశక్తి కలుగుచున్నది. కాని విద్యుచ్ఛక్తి స్వయముగా గదిని ప్రకాశింపజేయదు. 'బల్బు'లోని ప్రకాశించు సన్నని తీగెలే ప్రకాశము నిచ్చుచున్నవి. అయి

నప్పటికిని మనము వ్యవహారములో విద్యుచ్ఛక్తిచే గదికి ప్రకాశము కలిగిన దని చెప్పుకొనుచున్నాము కదా? "ఆత్మకర్మఫలముల ననుభవించువాడు" అని మనము చెప్పుకొనుటకూడ సరిగా నిట్టిదే యగుచున్నది. ఆత్మ యనగా దేహ మనో బుద్ధి పరిమితమైన యాత్మ యనియే యిచట తాత్పర్యము.

న తతో విజుగుప్సతే—ఆత్మను పై విధముగా నెవడు తెలిసికొనుచున్నాడో యట్టివా డటుపిమ్మట భయములేని వాడగుచున్నాడు. ఎచట యనురాగమున్నదో యచట భయము క్రోధముకూడ కలిసియుండును. ఎవడు నిష్కామ స్థితిని పొందుచున్నాడో యట్టివానికి ప్రపంచ విషయములందు ప్రేమ లేకపోవుటచే సహజముగానె భయముకూడ నుండదు. తన జ్ఞానముతో నతడీ దేహము స్వప్నదేహముయొక్క ఛాయమాత్రమేనని తెలిసికొనుటచేత నతనికి యా మృత్యువును చూచినను భయము కలుగదు. స్వయముగా సృష్టించుకొనిన సాలెపట్టులోనుండి తప్పించుకొనుట మాత్రమే గనుక నతడా మృత్యువునకుకూడ భయపడడు. అనగా నతనికి తన స్వంత శరీరముపైనికూడ ననురాగము లేదు. అతడు సంపూర్ణ ముగా దేహాత్మ భావన కతీతుడు. ఇదియే నీ వడిగిన యా ఆత్మ.

ఒక్కొక్క రకమైన వ్యక్తికి యొక్కొక్క విధముగా నా మహర్షులు కల్పిత ప్రపంచమునుగూర్చి కల్పిత వివరణలు చేసిరి. అభావమైన యా ప్రపంచముయొక్క వివరణల విషయమై యుపనిషత్కర్త లపేక్ష గలవారు కారు. ఎటువంటి వివరణలు చేసియైనను సరే, యెట్టి జాగరూకమైన పద్ధతి నవలంబించినను సరె, తన శిష్యునకు, ఉత్కృష్ట పరిపూర్ణత్వ దృష్ట్యా యీ జగత్తు పుట్టనే లేదనిన్ని, జీవునియొక్క స్వమనో భ్రాంతి మాత్రముచేతనే కలిగినదనిన్ని తెలియపఱచి, యతనిని యా శుద్ధచైతన్య స్థితికి చేర్పుటయే ప్రతిగురువునకు ముఖ్యమైయున్నది.

రజ్జుసర్పభ్రాంతిని వివరించుటకు మనముకూడ యా సర్పదష్టుడైనవాని యవస్థ కనుగుణముగా వివరణలను నవలంబించవలెను. ఆ సర్పదష్టుడు మరియొక స్వభావముగలిగి మరియొక సంస్కృతి కలవాడుగా మారిన, మనము దాని కనుగుణముగా మన వివరణలను రూపొందించవలయును.

ఇతరమైన యుపనిషత్తులలో నీ సృష్టిక్రమము విపులముగా వివరింపబడినది గాని యీ మంత్రములో సృష్టినిగుఱించి కేవలము కొన్ని సంకీర్ణ సమన్వయములు మాత్రము చేయబడినవి. బ్రహ్మ లేక యీ పరమ సత్యమును సమిష్టిరూపుడై విశ్వవ్యాపియైన స్థితిలో "హిరణ్యాగర్భుడు" యనుచున్నాము. అతడు వ్యష్టిరూపుడై సూక్ష్మప్రపంచములో నున్న యతనిని "జీవుడు" యనుచున్నాము. ఎవడు బ్రహ్మను వ్యష్టి సమిష్టి రూపములలో తెలిసికొనుచున్నాడో వాడే నిజమైన బ్రహ్మజ్ఞాని.

అద్భ్యః పూర్వం - జలమునకు ముందు. హిరణ్యగర్భ లేక యీ మహత్తత్త్వము పంచభూతములకు ముందుద్భవించినది. జలము మిగత పృథివ్యాది భూతములను సూచించుచున్నది. మహత్తత్త్వమునుండి యుద్భవించిన వానిలో నాకాశము స్థూలతరమైనది.

తపసః - తపస్సు లేక జ్ఞానము. సృష్టిక్రమము వివరింపబడిన గ్రంథభాగములు వివిధోపనిషత్తులలోను గలవు. తైత్తరీయోపనిషత్తులో "ఆ పరమాత్మ స్వయముగా నానాత్వమును పొందగోరెను. వెంటనే యీ యనేకత్వమును పొందెను. లేదా కల్పించెను" అని చెప్పబడియున్నది. ఆ భావమే యిచట యీ మంత్రములో ప్రతిధ్వనించుచున్నది.

సంగ్రహముగా చెప్పిన చివరకు స్థూలసూక్ష్మ జగత్తులో ననగా సమిష్టి వ్యష్టి రూపములలో నున్న జగత్తులో నా శాశ్వతతత్త్వమైన పరబ్రహ్మను సాధకుడు చూచుచున్నాడు. అవిద్యాబద్ధమైనపుడా పరబ్రహ్మ జీవుడుగను, మాయాబద్ధమైనపుడు హిరణ్యగర్భుడుగను తోచుచున్నాడు.

హిరణ్యగర్భునకును, జీవునకును, ఆ మాయా, అవిద్యలయొక్క బంధము తొలగినంతనే యీ పరబ్రహ్మైక్యమును పొందుచున్నాడు. ఇదియే యది - నీ వడిగినది.

శ్లో ॥ యా ప్రాణేన సంభవత్యదితిర్దేవతా మయీ ।
గుహాం ప్రవిశ్య తిష్ఠన్తీం యా భూతేభిర్వ్యజాయత ॥
ఏతద్వై తత్ ॥ ౭ ॥

సమస్తదేవతామయుడై, సమస్త ప్రాణములతోసహా యెవడుద్భ వించుచున్నాడో, హృదయకుహరమును ప్రవేశించి యచట నెవడు నివ సించుచున్నాడో, పంచభూతములతో సహా యెవడుద్భవించెనో వాని నెవడు తెలిసికొనుచున్నాడో వాడు తప్పక బ్రహ్మను తెలిసికొను చున్నాడు. ఇదియే అది.

ఇచట 'ప్రాణ' యనగా హిరణ్యగర్భుడని యర్థము. అనగా నెవడు ప్రాణరూపములో లేక హిరణ్యగర్భ రూపములో జన్మించెనో.

"దేవతామయీ - దేవతా రూపములో. దేవతల యాత్మగా." ఇచట దేవత యనగా యింద్రియముల కాధిపత్యము వహించు దేవత యని యర్థము. ఇంద్రియముల గ్రహణశక్తికి ప్రాణములే ముఖ్యాధారము.

"అదితి - తినువాడు" ఇచట హిరణ్యగర్భుడే సమస్త సూక్ష్మ ప్రపంచములోని ప్రాణరూపుడు గాన, అనగా నఖిలవ్యాపి మహాప్రాణుడు గాన, లేక విశ్వవ్యాపి మహాజ్ఞానరూపుడు గావున సమస్త విశ్వమును సూక్ష్మ రూపియై యనుభవించుచున్నాడు. ప్రతివ్యక్తిచేత ననుభవింపబడు నానం దము యీ విశ్వవ్యాపియైన సమిష్టిరూపములో స్థానమును పొందియున్నది.

శ్లో॥ అరణ్యోర్నిహితో జాతవేదా గర్భ ఇవ సుభృతో గర్భిణీభిః ।
దివే దివే ఈడ్యో జాగృవద్భిర్హవిష్మద్భిర్మనుష్యేభి రగ్నిః ॥ ఏతద్వైతత్ ॥ ౮ ॥

గర్భిణీ స్త్రీలచేత గర్భము జాగ్రత్తగా ధరింపబడునట్లు, రెండ రణుల మధ్యనున్న యగ్ని యప్రమత్తులైన ఋత్విక్కులచేత ప్రతిదినము ఆహుతులద్వారా పూజింపబడుచున్నది. ఇదియే అది.

అన్ని విధములైన పూజలు సర్వానుగ్రహ కారకుడైన యా పర మాత్మకే చెందుచున్నవి కావున జ్ఞానులయొక్క బ్రహ్మ, గృహస్థులయొక్క

యగ్నిహోత్రము రెండును సమానమైనవే. వేదోక్తమైన యజ్ఞములలో నగ్ని బొగ్గులతోగాని, నిప్పుపెట్టెవంటి మఱి యే యితర సాధనలచేగాని రగుల్కొలుపబడదు. మంగళకరమైన యాగాగ్ని రెండరణులచేత ననగా రెండు విశేషమైన కఱ్ఱముక్కలచేత రగుల్కొలుపబడుచున్నది. వర్తులాకారమైన కఱ్ఱకు ఒక రంధ్రమును పొడిచి గుండ్రని స్తంభాకారమైన మఱియొక కఱ్ఱను నందులో దూర్చి కవ్వమువలె త్రిప్పుటవలన యా రాపిడికి యగ్ని పుట్టును. ఒక ఋత్విక్కు కఱ్ఱముక్కల నట్లమర్చిన రెండవ బ్రాహ్మణుడు కవ్వపు త్రాడువలె, గుండ్రని స్తంభాకారపు కఱ్ఱకు ఒక త్రాడు కట్టి గిరగిర త్రిప్పును. ఆ గిన్నెవంటి యడుగుకఱ్ఱను ' అధరారణి ' యనియు, గుండ్రని స్తంభాకారపు కఱ్ఱను "ఉత్తరారణి" యనియు పిలుచుచున్నారు.

అధరారణిలో గిన్నెయంచున కొంత పత్తి యుంచబడును. ఆ యరణుల రెండును పరస్పర రాపిడిచే నుష్ణమును పుట్టించును. ఆ వేడి ప్రత్తి యంటుకొనుటకు చాలును. తరువాత నీ యగ్ని హోమకుండములో జాగ్రత్తపఱుపబడును. ఆ యగ్నిని యాగము పూర్తియై పూర్ణాహుతి యగు వఱకు నారిపోకుండ నతి జాగ్రత్తగా భద్రపఱచెదరు. తల్లి తన గర్భములోని శిశువును నన్నపానాదులలో నహా నెంత జాగ్రత్తగా చూచునో, నట్లే యీ యగ్నిని ఋత్విక్కులంత జాగ్రత్తగా నారిపోకుండ సర్వదా రాజబెట్టుచు, కాపాడెదరు. ఏ బ్రహ్మను మహర్షులు ధ్యానయోగములో తమ హృదయములో నారాధించుచున్నారో, యాబ్రహ్మనే గృహస్థులు అహుతులద్వారా యగ్నిరూపములో నారాధించుచున్నారు.

ప్రణవమునకు ప్రాధాన్యమిచ్చి, దాని ధ్యానముద్వారా యా పరమాత్మను సాధకు లారాధించుచున్నారు. గృహస్థు లా నత్యమునే తదంశమైన యగ్ని రూపములో నారాధించుచున్నారు. ఆరాధన యింద్రియ విషయములను స్థూలక్షేత్రములోని కర్మ గావున దానికొక యాధారముండవలెను గనుక, నట్టి యాధారము మహర్షికి ప్రణవము, గృహస్థుకు నగ్నియును నైయున్నది. ఓం నందలి, యగ్నియందలి నామరూపములను తొలగించిన, మిగిలినది పవిత్ర తత్త్వము. అదియే యా పరమసత్యము. అదియే ప్రణవమునకు, అగ్నికి రెండిటికి నేకైకమైన యాధారమగుచున్నది. అందులకే నీయుపనిషత్తు మహర్షి

చేత గృహస్థుచేత నారాధింపబడునది యొక్కటే యనియు, యిదియే యది యనగా నీ వడిగినదనియు చెప్పుచున్నది.

శ్లో॥ యతశ్చోదేతి సూర్యో అస్తం యత్ర చ గచ్ఛతి।
తం దేవాః సర్వే అర్పితా స్తదు నాత్యేతి కశ్చన॥
ఏతద్వైతత్ ॥ ౯ ॥

ఎచటనుండి సూర్యుడుదయించెనో, సూర్యుడు రేనియం దస్తమించునో దానిమీద నే దేవతలందరు నాధారపడియున్నారు. దానిని దాటి యెవ్వరును పోలేరు. ఇదియే యది.

అనిత్య పదార్థములన్నియు నాద్యంతములు గలవి. అనిత్యజీవులు జన్మించుచున్నారు. పుట్టిన కొంతకాలము తరువాత ప్రతిజీవియు తప్పక మరణించవలసినదే. సూర్యచంద్రనక్షత్రము లుత్పత్తిగలవే యనియు, మన భూగోళముకూడ నొకకాలమున నుత్పన్నమైనదే యనియు, నవీన ఖగోళ శాస్త్రజ్ఞులుకూడా పూర్వోక్త నిర్ణయమునకే వచ్చియున్నారు.

పాశ్చాత్యపండితులకు తెలిసిన నవీనమానవుని చరిత్రయొక్క ప్రారంభదశలో, నవీన ఖగోళశాస్త్రజ్ఞులు వారి పరిశోధనలను ప్రారంభింపక ముందే, నాటి యార్యులలో గల యాచార్యులు గంగానదీ పరిసరప్రాంతములలో స్వర్గమును సృష్టించుకొనిరి. తదనుగుణముగా దివ్యమైన నాగరికతను, పరమోత్కృష్టమైన మానవసంస్కృతిని తమలో నభివృద్ధిపఱచుకొనిరి. తత్ఫలితముగా సిద్ధించినదే యీ బ్రహ్మవిద్య. సమస్త విజ్ఞానమునకును విజ్ఞానరూపముగా నీ యుపనిషత్తులలో చర్చింపబడిన యీ బ్రహ్మవిద్యనే తాము పొంది యీనాడు మన మభ్యసించుటకొఱకు మన కనుగ్రహించిరి. ఉపనిషత్తులద్వారా మహర్షులు ప్రకటించునదేమనగా:— ఎచటనుండి సూర్యుడుదయించుచున్నాడో, యెచట నస్తమించుచున్నాడో, యాతనికట్టి శక్తిని యేదియిచ్చుచున్నదో యట్టి సత్యమే 'శుద్ధ అస్తిత్వము'. అదియే శుద్ధచైతన్యము అగుచున్నది. ఇచట సూర్యుడను పదము ప్రాతినిధ్య

నామవాచకమై యనిత్యప్రపంచములోని సమస్త పదార్థములను సూచించుచున్నది.

నిత్యపరిపూర్ణ శుద్ధ సత్త్వమునందె సమస్త దేవతలు నాధారపడి యున్నారు. ఇచట దేవతలనగా స్వర్గవాసులగు దేవతలు అని అర్థముకాదు. ఇచట దేవతలనగా మూలభూతమైన శక్తులు— సూక్ష్మరూపములైన పంచభూతములు. వేదాంతములో దేవతలనగా ఇంద్రియముల కాధిపత్యము వహించువారు.

నవీన కళాశాలా విద్యార్థులు అజ్ఞానముతో విజ్ఞానగర్వముతో మన ఇంద్రియములకు ప్రాతినిధ్యము వహించు దేవత లున్నారనిన సులభముగా పరిహసింతురు. ఇటువంటి దైవదూషణను మనమీనాడు వినుచున్నాము కావున నా ప్రశ్నను కొంచెము తరచి చూచి యిట్లు నమ్ముటలో నేదియైన సామంజస్యమున్నదా యని చూచెదముగాక!

పూర్వము చిన్మయానంద తానే శాస్త్రములోని యిటువంటి వాక్యములను చూచి దూషించువాడని యొప్పుకొనుచున్నాడు. కాని యజ్ఞానము ముందునకు వచ్చి జ్ఞానమువలె నటించదలచినచో అట్టి దుర్మార్గపు నటన అభిలషించ దగినదే. మన ఐరోపీయ పాఠకులు ఇట్టి బిగువు మాటలను విని యాశ్చర్యపడ నవసరము లేదు. ఆ కాలపువారిలో గొప్ప చింతకుడును, ఖగోళ శాస్త్రజ్ఞుడును అయినవానిని, "సూర్యుడు స్థిరముగా నిలుచువాడు, భూమియే తిరుగునది" అని ప్రకటించినందులకు, క్రైస్తవ ప్రపంచము, అది యానాటి వారి బైబిలు ప్రకటనలకు విరుద్ధముగా నున్నదని వానికి మరణశిక్ష విధించిన విషయమును మఱచినట్టి మనలోని కొద్దిమందికే యీ వాక్యములు అతిశయోక్తిగా నుండవచ్చును.

ఈ ఉపనిషత్తులోని యీ వివరణయొక్క తాత్పర్యమును, మన కాలపు విజ్ఞానావిష్కరణల మార్గముననే తెలిసికొందము. చెవి ఆకాశాధిపత్యము గలది. నవీన శాస్త్రజ్ఞులు ధ్వని ఆకాశములోనే పుట్టి ఆకాశము ద్వారానే ప్రసరింపగలదని యొప్పుకొన్న విషయమే. అచట ఆకాశమే లేని యెడల శబ్దము పుట్టదు, ప్రసరింపదు. ఆకాశముకన్న యీవలి ప్రపంచ

మున్న అది నిద్రా ప్రపంచమే. అచట శబ్దమునకు ప్రవేశము లేదు. ఈ విధముగా చూచిన యుపనిషత్తులలో "చెవి యాకాశము అధిదేవతగా గలది" యని చెప్పుటలో తప్పేమున్నది?

ఎంత గింజుకొన్నను చీకటిగదిలో మనము చీకటిని తప్ప మరి దేనిని చూడలేముగదా! కాని గదిని ప్రకాశింపజేసినచో నచటి వస్తువులను చూడగలుగుచున్నాము. కావున వస్తువు లెదుట నున్నప్పటికిని, ప్రకాశమున్ననే గాని కన్నులు వాటిని చూడలేవు. ఫలితమేమన ప్రకాశముద్వారానే సాధనములైన కన్నులు పనిచేయ కలుగుచున్నవి. మనకచీకటిలోకూడ కన్నులు సరిగా తమ పనిని నిర్వర్తించలేవు. విషయ మిట్టిదిగాన యుపనిషత్ ఋషులా కాలపువారి భాషలో పరికరమైన కంటికి ప్రత్యక్ష కారణమైన సూర్యు డధిదేవత యనిన యందులో తప్పేమున్నది?

కావున సానుభూతితో సర్థము చేసికొని, పరిశోధనా దృష్టితో కనుగొనుటకు ప్రయత్నించినయెడల, వేదములను చీరెకుచ్చెళ్ళలో, ప్రాచీనత యను పైటమడతలలో శాశ్వతముగా నానందించుచు, యమర యైన యా ముక్తికాంత సర్వమానవులకు, సర్వకాలములందును సర్వథా ప్రత్యక్షముకాగలదు. ఈ నాటి విద్యావంతులైన హిందువులు వారి స్వంత గ్రంథములనే నిందించి, పరిహసించుటకు సమీపించినయెడల, వారు వారి స్వంత యజ్ఞానమును, వాటి నర్థముచేసికొనుటలోని తమ యశక్తతను పరిహసించుకొనుచున్నారని జ్ఞాపకముంచుకొనుట మంచిది.

ఈ పంచ మహా భూతములు శుద్ధ సత్యమగు నా పరమాత్మయందు పూర్తిగా నాధారపడియున్నవని యీ మంత్రము ప్రకటించుచున్నది. చక్రములోని నడికండెలు మధ్యనున్న పిడి నాధారముగా చేసికొని యున్నట్లు, యీ పంచేంద్రియములయొక్క యధిదేవతలును యీ పరమ సత్యముమీదనే యాధారపడియున్నారు. ఆ మధ్యభాగమున యీ పిడియే లేకపోయినచో నా వివిధమైన నడికండెలు తమంతట తాము స్వతంత్రముగా నిలువలేవు సరికదా, యీ చక్రమునుకూడ బలపఱచి చక్రరూపములో నుంచలేవు.

సూక్ష్మమైన పంచభూతములకు నాధారమైనది ఇదియే అది (నీవడు గునది)

**6—9.** మానవహృదయములో నుండు ఆత్మ విశ్వాత్మయనియు దానినుండియే సృష్టి యుద్భవించుచున్నదనియు తెలియుచున్నది.

శ్లో॥ యదేవేహ తదముత్ర యదముత్ర తదన్వహ।
మృత్యోః సమృత్యుమాప్నోతి య ఇహ నానేవ
పశ్యతి ॥ ౧౦ ॥

ఇచట ఏది ప్రత్యక్ష జగద్రూపముగా నున్నదో, అదియే యచట యప్రత్యక్షమైన బ్రహ్మగానున్నది. అచట యేది యున్నదో ఇచటను నదియే ఉన్నది. ఎవరైతే యిచట నానాత్వమును చూచెదరో, వారు మృత్యువునుండి మృత్యువునకు పరిభ్రమించుచుందురు.

వివిధమైన తరంగము లన్నియును ఒక్క సముద్రమే. ఉన్నది సముద్రమొక్కటే. రజ్జుసర్పభ్రాంతిలో తోచుపామునకు అది పడగగాని, పొడవుగాని, తోకగాని, ఏదైనను, పాము వెనుకనున్న సత్యము రజ్జువు మాత్రమే. అట్లే తరంగములు వేరు కావు. అవి సముద్రమే. సర్పము ఏదియు కాదు. అది రజ్జువే, ఎండమావులు ఏవియుకాదు. అది ఎడారియే.

ఈ భావములోనే యిచటిమంత్రము మనకు ఆ పరమసత్యమునకు, ఈ భ్రాంతి కల్పిత నామరూపముల వెనుకనుండు సత్యమునకును భేదము ఏమాత్రము లేదని వివరించుచున్నది. ఆ సత్యమే లేనియెడల నీఅభివ్యక్తమగు విషయప్రపంచమే లేదు, ఈ కనబడునట్లున్న సమస్త భ్రాంతుల వెనుక నున్నది విశ్వవ్యాపియగు ఆ నిత్యసత్య పరమాత్మయే! కథ విషాదాంతమైనను సుఖాంతమైనను, కేవల మున్మాదగీతములతో గూడినదైనను, లేక యెటువంటి పద్ధతిలో ఎట్టి కథాగమనము గలదైనప్పటికిని సినిమా ఫిల్ము చీకటి వెలుతురులతో ఆ తెల్లతెరమీద ఆడిననేకదా ప్రేక్షకునకు, ఆ కథనుగూర్చిన సంపూర్ణభావము కలుగుట, సంభవించుచున్నది. కావున యా తెరయే లేక పోయిన కథ ఎట్టిదైనను ప్రదర్శించుట సంభవించదు.

ఆ పరమ ప్రకాశమైన జ్ఞానమును పొందిన తరువాత ఆత్మజ్ఞాని, జగత్తునకు నాధారమై, సత్యసిద్ధాంతమైన ఆ చైతన్య స్వరూపముగా గాక, వేఱొక విధముగా యీ జగత్తును చూడలేడు. ఆ జ్ఞానము పొందిన తరువాత యతని దృష్టి మాఱుచున్నది. దానివలన నా దేవమానవునకు హేయమైన పాపకృత్యముకూడ నా విశ్వవ్యాపి యగు నాత్మరూపమే యగుచున్నది. ఎట్టి పనినికూడ యాతడు నిందించుటగాని స్తుతించుట గాని చేయడు. అతనికి నన్నికర్మలు మాయాకల్పితములే యగుచున్నవి కాని యవే సమయమున నా కర్మలు వానికి నా పరమ సత్యమును గట్టిగా జ్ఞాపకము పఱచునట్టివై యున్నవి.

ఇందులో ప్రవేశము లేని యువకునికి నీ వివరణ గ్రహించి జీర్ణించి కొనుటకు చాల కఠినమైనదిగా నుండును. మనము దీనియొక్క యంత రార్థమును ఒక యుదాహరణద్వారా తెలిసికొనుటకు ప్రయత్నించెదము. అతి ప్రేమగల తండ్రులు తమ పిల్లలెంత యల్లరివారైనను, నణచ శక్యముగాని వారైనను, సంస్కృతి లేని వారైనను, నీ ప్రపంచములో వారి వంటి యాదర్శసంతాన మిప్పటికి జన్మించలేదని పొగడుకొనుటను మనము చూచుచుండుటలేదా! ఈ తండ్రులను మనము సూక్ష్మముగా పరిశీలించినచో పిల్లలనుగుఱించి వారెంత తెలివిగా విమర్శించగలరో విదితమగుచునే యున్నదిగదా! ఆ విధముగానే దేవమానవుడొకసారి యా సర్వవ్యాపియగు దివ్యసౌందర్యమును చూచినంతనే తానా శాశ్వత పరిపూర్ణత్వమును పొందు చున్నాడు. అటుపిమ్మట నాతడు దుఃఖసముద్రములో మునిగినప్పటికిని నచటకూడ నాత డాత్మానందమునే యనుభవించుచున్నాడు.

మహనీయమైన తన దృష్టిలో జ్ఞానికి నిక్కడ నీ ప్రపంచములో నేమున్నదో యది యక్కడ యా బ్రహ్మలో నున్నది. అక్కడ యేమున్నదో యదే యిక్కడకూడ యున్నది. ఇప్పటికిని యీ వివరణ నర్థము చేసి కొనుట యతీతమైనదిగా తోచినచో నది మీ స్థూలమైన మనోబుద్ధులు యీ సూక్ష్మమును గ్రహించి తెలిసికొనుటకు పైకెగురు శక్తి లేనివగుటచేతనే యని దృఢముగా చెప్పవచ్చును.

ఇంతకు నొకడా యాత్మైక్యదృష్టి నెందుకు పొందవలెను? దాని వలన యీ మానవులకేమి ప్రయోజనము? ఈ ప్రశ్నలే గాక మరికొన్ని యిట్టి ప్రశ్నలుకూడ దీనియందు ప్రవేశములేక దీనిని గ్రహించుటకు సిద్ధపడని విద్యార్థులయొక్క మనస్సులలోనే యుద్భవించుచున్న వన వచ్చును.

తన విద్యార్థులకు తోచినట్టి యీ సందేహముల కన్నిటికిని శ్రుతిమాత ప్రేమతో జవాబు చెప్పుచున్నది. ఒకడు తన జీవితములోని యీ పరమ లక్ష్యమును చేరుకొని యీ నిత్యసత్యమును స్వేచ్ఛగా, సదా, సర్వత్ర దర్శించనియెడల నట్టి పాపి యీ ప్రపంచమునే నానాత్వములో పడి పొర్లాడుచు జనన మరణ రూపమగు సుడిగుండమునందు మరలమరల పడుచున్నాడు.

"ఎవడైతే దివ్యమైన యీ యద్వైతస్థితిని యనుభవించగలుగు చున్నాడో యట్టివాడు సంసార సుఖదుఃఖములలో పడడు. మరియు జనన మరణ రూప దుఃఖములోనుండి విముక్తుడగును" అని యిచట సూచింపబడినది.

శ్లో॥ మనసైవేదమాప్తవ్యం నేహ నానాస్తి కించన ।
మృత్యోః స మృత్యుం గచ్ఛతి య ఇహ
నానేవ పశ్యతి ॥

మనస్సుచేతమాత్రమే యీ బ్రహ్మను పొందగలుగుచున్నాము. అప్పుడీ నానాత్వమే లేదు. ఎవడీ ప్రపంచమునందు వైవిధ్యమును చూచు చున్నాడో, వాడు జనన మరణ రూపసంసారములో పడిపోవుచున్నాడు.

ఎంత మహత్త్వము గలిగి యద్భుతమైనదైనను, నాచరణలో పెట్టు స్వభావము గల యార్యులమనస్సు కేవల మాదర్శభావములతోనే తృప్తి పడదు. ఆ వేదాంతములో చెప్పిన యీ ధర్మములు నిత్యజీవితములో నాచరణ యోగ్యములైననేగాని యెట్టి వేదాంతమును హిందుమతావలంబి యంగీక రించడు. ఆర్యులకు సహజమైనదై, యీ దేశస్థులకు స్వభావసిద్ధమైన యంతః

ప్రేరణను తృప్తిపఱచుటకే ముందరిమంత్రములో నా పరమసత్యమును వివరించి వెనువెంటనే యీమంత్రములో తన విద్యార్థులా సత్యమార్గమును తెలిసికొని యెట్లు తద్దర్శనమును తొందరగా పొందగలుగుదురో యను దానిని శ్రుతి వివరించుచున్నది

భగవంతుని తెలిసికొనుటకు మనస్సొక్కటియే సాధనము. "ఆత్మ జ్ఞానము మనోబుద్ధుల కతీతమైనది" యని ముందుమంత్రములో చెప్పిన దానికీ పై వాక్యము విరుద్ధముగా కనిపించుచున్నది. కాని యిది వైరుధ్యము కాదు. మనస్సొక్కటియే సాధన యని చెప్పుటలో, మనస్సును వశపఱచు కొని, దానిని కర్మలనుండి విముక్తిచేసి కడపట యా సంకల్ప వికల్పాత్మకమైన మనస్సే లేకుండచేయుటయే శ్రుతియొక్క యుద్దేశము. ఈ పద్ధతి హత్య ద్వారా గాక యాత్మహత్య ద్వారా జరుగవలసియున్నది యనగా సాధకుడు స్వయముగా తన స్వంతప్రయత్నములచేతనే యా మనస్సును నంతమొం దించుకొనవలెనేగాని, గురువుగాని శాస్త్రములుగాని యాతని మనస్సును నంతమొందించలేవు యని తాత్పర్యము.

మనసైవ ఇదం ఆప్తవ్యం - ఆధ్యాత్మిక తృష్ణ గల మనస్సు తదేక ధ్యానముచేతనే తనను తా నంతమొందించుకొనగలదు. పురాణ సంబంధమైన "ఫోనిక్సు" యను పక్షి తన మరణగీతమును తానే పాడుకొని యగ్నిలోపడి భస్మమైనట్లుగా మనస్సు తనకు తానై భస్మమైన యెడల యా భస్మమునుండి యొక సహజజ్ఞానము బయలువెడలును. దాని సహాయముతోనే సాధకుడా యాత్మను తెలిసికొనుచున్నాడు. ఇట్లు ధ్యానముద్వారా మనస్సు నశించిన పిమ్మట యాత్మ తనను తాను పూర్తిగా తెలిసికొనినచో నపుడీ జగత్తులో వైవిధ్యమే కన్పించదు.

ఇదియే తథ్యమని నొక్కిచెప్పుటకు శ్రుతి మఱల మఱల సత్యమార్గము ననుసరించని జీవి పడు బాధలను వివరించి, ఇదే జన్మలో నా లక్ష్యమును విజయవంతముగా పొందు విధమునుకూడ తెలియజేయుచున్నది. ఒక్క మాటలో శ్రుతి "ఇచట నానాత్వమును దర్శించువాడు మృత్యువునుండి మృత్యువునకే చేరుచున్నాడు" అని చెప్పుచున్నది.

యథార్థములో సమస్తజీవులు ఒక్కటే - అనగా ఏకం - ఏకరూపము గలవి. ఈ నానాత్వములో ఆ యేకత్వమును ననుభవింపలేక పోవుటయే మృత్యువగుచున్నది.

శ్లో॥ అంగుష్ఠమాత్రః పురుషో మధ్య ఆత్మని తిష్ఠతి।
ఈశానో భూత భవ్యస్య నతతో విజుగుప్సతే॥
ఏతద్వైతత్ ॥ ౧౨ ॥

అంగుష్ఠమాత్రుడైన పురుషుడు శరీరములో ననగా హృదయ మధ్యమున నివసించుచున్నాడు. అతడు భూతభవిష్యత్తులకు ప్రభువు. అట్టివానిని తెలిసికొనిన తరువాత సాధకుడు భయములేనివాడగుచున్నాడు. ఇదియే అది.

తనను సర్వాత్మగా భావించిననే మానవజీవితము మహనీయఫలముగా మారుటకు సంపూర్ణముగా వికసించుచున్నది. మనస్సును పూర్తిగా వశపఱచుకొని యంతమొందించిననే యట్టి భావన కలుగును. మనస్సు తన సహజమైన యల్లకల్లోలములను, సంశయములను, యుద్రేకములను నాదరించి స్థాన మిచ్చుచున్నంతవఱకే తాను నిలువగలదు. మనస్సు అంతమొందుట యనగా సంకల్ప వికల్పములు నశించుటయే యగును. ఇట్టి 'యమనస్క' స్థితిని పొందుటకు ఆత్మసంయమనము, వివేచన, విరతి, యిత్యాదులను నభ్యసించుటయే గాక యట్టి స్థితియందు పుట్టిన సహజజ్ఞానముతో నేకాగ్రత నవలంబించు శక్తినికూడ నార్జించుటకు యోగి ప్రయత్నించవలెను.

భక్తిమార్గము నవలంబించువారికి, సహజముగానే వారి యారాధ్యదైవముయొక్క నామరూపములు ధ్యానము చేయుటకును, నేకాగ్రత కలిగించుటకును నాలంబనముగా నుండనే యున్నవి. హఠయోగి పక్షములో నతనికి తన "కుండలిని" శక్తి యుండనే యున్నది. కర్మయోగి విషయములో "సర్వము వాసుదేవుడగు నారాయణుని కర్పణ" మను భావము సదా జ్ఞాపకములో నుండనే యున్నది. కఠినమై, యెక్కుడు గల

జ్ఞానమార్గమును నెవరైతే యవలంబించుచున్నారో అట్టి యుదుపైన యా కొద్దిమంది సాధకులకు ధ్యానముచేత నేకాగ్రతా శక్తిని యలవఱచుకొనుటకు తగినదై, బుద్ధికి సాధ్యమైన యవలంబనమును కల్పించుట మిక్కిలి దుష్కరముగా నున్నది.

ఉపనిషద్గ్రంథములు వేదాంతవిద్యార్థికి స్వయముగానే పరమాధార మగుచున్న వనుటలో సందేహము లేదు. ఆ దివ్యజ్యోతియైన యాత్మ తత్త్వము విషయమై వేదాంతచింతన చేయుటకు పూర్వ మాతనికి తగినంత యేకాగ్రశక్తి యుండవలెను కదా! శ్రుతి యీ మంత్రములో యీ యేకాగ్ర శక్తి నవలంబించుటకు ప్రారంభ విధానమును, సధ్యానక్రమమును చర్చించి వివరించుచున్నది. దయామతియైన శ్రుతి వేదాంతవిద్యార్థికి హృదయకుహరములో నున్న యంగుష్ఠమాత్ర ప్రమాణుడైన పురుషుని ధ్యానించవలసినదని బోధించుచున్నది.

సర్వవ్యాపి యైన సత్యమునకు, నంగుష్ఠమాత్ర పరిమితి కల్పించి మానవ హృదయమువంటి నియమితమైన సరిహద్దులలో నివాసము కల్పించుట దైవదూషణమువంటిది కాదా? కాని తన పిల్లలైన విద్యార్థులకొఱకు కొంచె మాలంబనము కల్పించి, దానినానుకొని ముందడుగు వేసి, విజ్ఞానాగారములోనికి జొరబడుటకు సహాయపడు నుద్దేశముతోనే శ్రుతి యిచట కేవలము స్వవచోవిరుద్ధమను మహాదోషములో మునుగుటకు తనను తానే యనుమతించుకొనుచున్నది.

ఈ యుపనిషత్తునందలి నాలుగవ వల్లిలోని యైదవ మంత్రము యొక్క యుత్తరార్ధము యీ మంత్రములోని యుత్తరార్ధమువలె యున్నది. వ్యాఖ్యానమున కచట చూడుడు.

శ్లో॥ అంగుష్ఠమాత్రః పురుషో జ్యోతిరివా ధూమకః।
ఈశానో భూతభవ్యస్య స ఏవాద్య స ఉశ్వః॥
ఏతద్వైతత్ ॥౧౩॥

అంగుష్ఠపరిమాణము గల పురుషుడు ధూమము లేనట్టి యగ్నివంటి వాడు. భూత భవిష్యత్తులకు ప్రభువు. నేడున్నాడు రేపు తప్పక యుండును. ఇదియే అది.

సాధకుని హృదయములో జ్యోతివలె నారాధింపబడు నా యంగుష్ఠ మాత్ర పురుషుడు సర్వకాలములయందు ననగా భూత భవిష్య ద్వర్త మానములందును నున్నాడు. అన్ని జీవులలోను నేడున్నాడు. రేపు రాబోవునన్ని రూపములలోను నిమిడియుండగలడు.

కొంతమంది సాధకులు యీ వాక్యమునకు యథాతథముగా నర్థము చేసికొని తమ హృదయమధ్యములో నొక జ్యోతి వెలుగుచున్నట్లు లూహించి, ధ్యానించుచున్నారు. ఈ సాధువునకే యట్టి యొక వ్యక్తిని తెలియును. అత డిరవైమూడు సంవత్సరము లీజ్యోతిని ధ్యానించి యీమధ్య నీ స్వామీజీ దగ్గఱకు వచ్చి, దైన్య విచారములను వ్యక్తపఱచు ముఖముతో, "తనకు నాధ్యాత్మికముగా పతనము కలిగినదనియు, నీ దినములలో సతనికి నాత్మ దర్శనము కాలేదనియు" చెప్పుకొనినాడు.

మిత్రులారా! తన భ్రాంతికల్పిత జ్యోతి స్వప్నమునే యాత్మగా నమ్ము మూఢ సాధకునియొక్క నిరుత్సాహస్థితియే యిది. యథార్థమైన మహాత్ములతో నిరంతర సత్సంగము, నిరంతర శాస్త్రపఠనము లేకుండ జ్ఞానమార్గము నవలంబించుట చాలా ప్రమాదకరమైనది. ఇచట మహాత్ము లనగా చెయిచూచి ఫలములను చెప్పువారు, తారాపథమును జూచి నక్షత్ర ఫలములను చెప్పువారు లేక ఓషధులననగా మందు మ్రాకులనిచ్చువారునై మన దురదృష్టపు దేశములోని నగర వీథులలో నీనాడు తిరుగువారు మాత్రము కారు. నేడు భారతీయ విశ్వవిద్యాలయములనుండి గుంపులు గుంపులుగా బయలువెడలు నజ్ఞాను లట్టి మహాత్ముల ననుసరింపనిండు. కాని నిజముగా మతము ననుసరించి, సత్యము నన్వేషించువానికి యట్టి మహాత్ములు గోముఖవ్యాఘ్రములు, ఋషులయొక్క యీ పవిత్ర భూమిలోని వాతావరణమును విషపూరితము చేయువారు. ప్రజలకు పుష్టిగా తిండిపెట్టి పనినిచ్చి పోషింపగల సమర్థమైన ప్రభుత్వమే మనకున్న

యెడల యిట్టి రాక్షసమూర్తులు మన బజారు దృశ్యమునుండి తొలగింప బడుదురు. అంతవఱకు ననివార్యమైన దీనిని సహించవలసినదే.

అంగుష్ఠమువంటి జ్యోతి - సాధనయొక్క ప్రారంభదశలో సాధకునకొక యాలంబనముకొఱకు మహర్షులచే నీ జ్యోతి యంగుష్ఠమాత్ర ప్రమాణము గలదని చెప్పబడినది. రాతి లింగము కేవలము రాయియైన పరమేశ్వరుడు కాదుకదా! అ విధముగనే యిచట జ్యోతి వేదాంతవిద్యార్థికి ధ్యానమాత్ర సహాయకమేగాని యదియే యాత్మకాదు. దేవాలయమునుండి యొక విగ్రహము దొంగిలింపబడినపుడు భగవంతుడు దొంగిలింపబడినాడని యర్థము కాదుకదా!

ఒక సాధకుడు తనలో నేకాగ్రతను సభివృద్ధిపఱచుకొని వివిధోపనిషత్తులలో శ్రుతిచే చెప్పబడిన ధ్యానముయొక్క యున్నతస్థితిలోనికి ప్రవేశించినయెడల నంతమున నతడు జ్యోతియు, శక్తియు, జ్ఞానమును, మూలకారణమునునైన తనలోని యాత్మతోనే తానైక్యము పొందినట్లు తెలిసికొనుచున్నాడు.

**12-13** శ్లో॥ ప్రారంభ సాధకునికి ధ్యానములో నాలంబనముకొఱకు ఆత్మ హృదయకుహరములో నివసించు నంగుష్ఠమాత్ర ప్రమాణ జ్యోతిగా వర్ణింపబడినది.

శ్లో॥ యథోదకం దుర్గే వృష్టం పర్వతేషు విధావతి ।
ఏవం ధర్మాన్ పృథక్ పశ్యన్ తానేవాను
విధావతి ॥ ౧౪ ॥

ఎట్లైతే కొండశిఖరమున పడిన నీరు పర్వత శిలలమీద పడి చెదరి నాలుగువైపుల ప్రవహించుచున్నదో, యట్లే విషయముల వైవిధ్యమును చూచువాడు స్థిరము లేక వాటి వెంబడి సదా పరుగెత్తుచున్నాడు.

ఇచట యుపన్యాసకులచేతను, లేఖకులచేతను, తఱచు నుదాహరింపబడు ప్రశస్తమైన యీ మంత్రమును నీ యుపనిషత్తులో చూచుచున్నాము.

ఆమానుషశక్తులతోను, దైవశక్తులతోను నిండిన యొక మహత్తర యంత్రమే మానవుని మనస్సు. అయినప్పటికిని సామాన్యమానవుడు దానిని వశపఱచుకొని యజమాని యగుటకు బదులు దానినే సేవించు బానిస యగుట చూచుచున్నాము. ఈ యంత్రయుగములో బాహ్యప్రపంచమున కూడ మానవుని కొక విధముగా నదే పద్ధతిలో నదే గతి పట్టుచున్నది. మానవునిచేత కనిపెట్టబడిన యంత్రములు వారిని సేవించుటకు బదులు, వారిమీద యినుప హృదయములు గల యజమానులై కూర్చున్నవి. సదా భ్రమించు వాటి చక్రములవద్ద మానవుడు నేడు బానిసమాత్రమే.

మానవుడు తన భ్రాంతిచేత, నజ్ఞానముచేత, హృదయముయొక్క ప్రొచ్చలమును, మనస్సుయొక్క కోరికలను నణచివేయు శక్తిని కోల్పోవుటయే మనలో నీ దురవస్థ సంభవించుటకు కారణమైయున్నది. ఆ పరమజ్ఞానము, ఆ పరమశక్తి, యజ్ఞానమనెడు కొండమీద పడి చెదరి వేలకొలది సెలయేరులుగా ప్రవహించి కడకు నగాధములో నంతమగుచున్నది. ఈ విషయమే 'వర్షము కొండమీద పడుట' యను సుందర సాదృశ్యము ద్వారా చక్కగా సూచింపబడినది. మనమేగాని యా నీటిని యా కొండ మీదనే చేర్చి ఆనకట్ట కట్టి యొక్క కాలువద్వారానే నెమ్మదిగా వదలిన యెడల దానిద్వారా చాలా యుపయోగమైన పనులను చేయించుకోవచ్చును. ఆ విధముగానే తన వివేకముచేత తన శక్తిని యనవసరముగా వ్యర్థము చేసికొనక జాగ్రత్తపఱచుకొని జ్ఞానముతో నా శక్తిని, "సరియైన జీవనము, ఉన్నత చింతనము" యను కాలువలద్వారా ప్రవహింపజేసినచో, సాధకుడా యంతః పరికరములద్వారానే, అతి సులువుగా, భూమిమీద దేవునియొక్క శక్తిని సామర్థ్యమును పొందగలుగుచున్నాడు. తనయొక్క శాశ్వత దివ్యత్వమును ఆత్మీయముగా ననుభవించుటద్వారా పొందిన పవిత్రజ్ఞానముచేత సత్య తత్త్వవిషయమైన యజ్ఞానమును తొలగించుకొనుటకు క్రమముగా నభ్యసించిననేగాని, యెట్టి మానవుడును తనను తాను ననుగ్రహించుకొన లేడు. అనుగ్రహించుకొనజాలడు.

శ్లో॥ యథోదకం శుద్ధే శుద్ధ మాసిక్తం తాదృగేవ భవతి ।
ఏవం మునేర్విజానత ఆత్మా భవతి గౌతమ ॥ ౧౫ ॥

శుభ్రమైన జలము శుద్ధమైన జలములోనే పోసిన యెట్లు శుద్ధము గానే యుండునో నట్లే గౌతమ! ఎట్లు సాధకుడు చింతించుచున్నాడో అట్లే తానగుచున్నాడు.

(రెండవ అధ్యాయములోని నాలుగవ వల్లి సమాప్తమైనది.)

ఈ చతుర్థవల్లియందలి యీ ముగింపుమంత్రము మానవునిలోని దివ్యసత్త్వముయొక్క యేకత్వమును, మరియు నా దివ్యత్వముయొక్క మహత్వము లేక విశ్వవ్యాప్తత్వమును దృఢపఱచుచున్నది.

మానవునిలోనుండి యహంకారమును తీసివేసిన దేవుడగుచున్నాడు. దేవునికి నహంకారము కలిపిన మానవుడగుచున్నాడు. మనలోని యహంకారమును నంతమొందించుటయే దివ్యత్వము. నిత్య సత్యముయొక్క జ్ఞానముతో భ్రాంతజీవితమందలి యబద్ధపు విలువలను, అపార్థములను, తొలగించినయెడల, పరిపూర్ణనత్యమును తన పవిత్రత, మహనీయతలలో వదలి "అహం" యనునది యావిరియై నశించును.

ఈ నమయములో వ్యక్తి తన యాత్మతత్త్వమును శుద్ధ చైతన్యముగా తెలిసికొనుచున్నాడు. ఇట్టి ఆత్మజ్ఞానముచే నతడు విశ్వవ్యాపి యగు నిత్య సత్యముతో నైక్యమును పొందుచున్నాడు. శుద్ధజలము శుద్ధజలములో పోసిన నక్కడ శుద్ధజలముమాత్రమే యుండును. అట్లే యొకడు తనను ఆ నిత్యతత్త్వముగా తెలిసికొన్నప్పుడు వెంటనే యేకైకమైన ఆ యేకత్వముతో తాను కలసిపోయినట్లుగా ననుభూతిని పొందుచున్నాడు. అప్పుడీ ప్రత్యగాత్మయే యీ పరమాత్మ యగుచున్నది.

ఇట్టి సుస్పష్ట వివరణల యనంతరముకూడ మనము శ్రుతియొక్క వాక్యములకు నిజమైన తాత్పర్యమును గ్రహించక నపార్థముచేసికొని, "వేదములనిండ విరుద్ధవాక్యములు అస్పష్టవివరణలు ఉన్న"వని హీనముగా తలచిన, మనము సహానుభూతి లేని పాఠకులమని మందబుద్ధి గల విద్యార్థులమని స్పష్టమగుచున్నది.

సంవత్సరములకొలది శాస్త్రపాఠములను నిర్లక్ష్యము చేయుటచేతను నేటి విద్యావంతులకు సరియైన గురువులు లేకపోవుటచేతను మన సనాతన

సంస్కృతి యణగారిపోవుచున్నది. ముఖ్యముగా ధనికవర్గమువారు మధ్యమ వర్గములోని పైతరగతివారు, మన హైందవ సంస్కృతిని నశింపజేయ లేకున్నను నణగద్రొక్కుటలో చాలావఱకు సఫలులైరి.

ఈ పై దురవస్థలే యీనాటి మన యీస్థితికి కారణము. హిందువుల దేశములో మనము నిజమైన హైందవుని యరుదుగానే చూచుచున్నాము. అందులో నుత్తములగువారు కూడ తమ మతగ్రంథమైన ఉపనిషత్తును చదివి యర్థముచేసికొన ప్రయత్నించుటకుకూడ భయపడుచున్నారు.

మానవ జీవితమును గుఱించి, ఆ జీవితపు విలువలను గుఱించి విజ్ఞాన శాస్త్రముద్వారా యింతవరకు కనిపెట్టని లేఖనగ్రంథములే మన యీ ఉపనిషత్తులు. ఉపనిషత్తులు లేకున్నచో హిందూమతమే లేదు.

14 - 15. శ్లో॥ విశ్వాత్మతో ప్రత్యగాత్మయొక్క సంపూర్ణ ఐక్యము, సాదృశ్యములద్వారా నొక్కి చెప్పబడినది. ఈ ఏకత్వముయొక్క దర్శనమే మృత్యువున కావలనున్న యీ యేకత్వమునకు దారితీయుచున్నది.

# పంచమవల్లి

## దేహములోని ఆత్మ - అంతస్థము అయినప్పటికి బాహ్యావ్యాప్తము.

శ్లో॥ పుర మేకాదశద్వార మజస్యావక్రచేతసః ।
అనుష్ఠాయ న శోచతి విముక్తశ్చ విముచ్యతే ॥
ఏతద్వైతత్ ॥ ౧ ॥

జన్మ లేనిదై స్థిరబుద్ధి గల బ్రహ్మయొక్క పురమునకు పదునొకండు ద్వారములు గలవు. అట్టి పురమునందున్న బ్రహ్మను ఆరాధించినవాడు దుఃఖములు పొందడు. మఱియు అజ్ఞానబంధమునుండి విముక్తుడై స్వతంత్రు డగుచున్నాడు. ఇదియే అది.

'పుర మేకాదశ ద్వారం - ఏకాదశ ద్వారములు గల పురము.' తెరవ బడిన పదునొకండు ద్వారములు గల యీ శరీరమే యిచట పురముగా వర్ణింపబడినది. మన తలలోనే సప్తరంధ్రములు గలవు. దేహములో మూడు గలవు. పదునొకొండవది సూక్ష్మమైనది. అదియే బ్రహ్మరంధ్రము. అది యోగశాస్త్రములో ప్రసిద్ధమైనది. అది నడినెత్తిన యున్నది.

పురముతో దేహమును పోల్చుట చాల యుక్తముగా నున్నది. ద్వారములు, ద్వారపాలకులు, అధికారులు, సందరికి పైన వారివారి కర్తవ్యములను క్రమబద్ధముగాను, నియతముగాను చేయునట్లు నాజ్ఞ నిచ్చు నధికారి, రాజు, మొదలగు నవన్నియు పట్టణములోను దేహములోను సమానముగానే యున్నవి. ఇంద్రియ రంధ్రములే ద్వారములు. ఇంద్రియాధిదేవతలే ద్వారపాలకులు. మనస్సు వీనిపై నుండు నధికారి. పురుషుడే రాజు.

అనుష్ఠాయ—ధ్యానించి, ఎవడైతే నిరంతరముగా హృదయాధిదేవత యగు పురుషుని ధ్యానించుచున్నాడో, యట్టివాడు అజ్ఞానముచేత, నజ్ఞాన

సృష్టమగు అహంకారముచేత విముక్తుడై యథార్థమైన ఆత్మతత్త్వమును తెలిసికొనుచున్నాడు. అటుపిమ్మట ఆతడు దుఃఖపడకుండుట సహజమే, అజ్ఞాన బంధములనుండి విడివడి జననమరణ జాలమునుండి విముక్తుడగుటయు కూడ సహజమే. ఇదియే—అది. నచికేతుడు మృత్యుదేవత నడిగినది.

శ్లో ॥ హంసః శుచిషద్ వసురన్తరిక్షసద్ హోతా వేదిష
దతిథిర్దురోణసత్ ।
నృషద్ వరసదృతసద్ వ్యోమసదబ్జా గోజా ఋతజా
అద్రిజా ఋతం బృహత్ ॥ ౨ ॥

సూర్యునివలె దివియందు నివసించును. వాయువువలె యాకాశమున నుండును. అగ్నివలె భూమియందుండును. అతిథివలె గృహమునందుండును. అతడు మానవులలోను, దేవతలలోను, యజ్ఞములలోను, సత్యములోను, అగ్నిలోనుకూడ వ్యాపించియుండును. జలములో జన్మించుచున్నాడు. భూమిలో పుట్టుచున్నాడు. కొండలలో నుద్భవించుచున్నాడు. అతడు సత్యస్వరూపుడు. అతడు మహత్స్వరూపుడు.

పూర్వమంత్రములో నెట్టి పురుషుడైతే పురములో నివసించువాడుగా వివరింపబడినాడో యట్టివాడిచట విశాలదృక్పథములో సమస్త రూపములలో నున్న కార్యములకు అధిపతి యని వివరింపబడుచున్నాడు. ఈ మంత్రములో మనోహరములైన జీవపరమాణువులయొక్కయు విశ్వములో వాని రూపముల యొక్కయు జాబితా ఈయబడియున్నది.

అబ్జ—(నీటిలో పుట్టిన) శంఖము, శుక్తి, గవ్వలు, చేపలు, జలకీటకములు, మరియు యితరమైన సమస్త జలచరములు.

గోజా—(భూమిలో పుట్టిన) సస్యములు, మొక్కలు, వృక్షములు మొదలైనవి.

అద్రిజా—(కొండలలో పుట్టినవి) నదులు, నదములు, జలధారలు మొదలైనవి.

శ్లో॥ ఊర్ధ్వం ప్రాణమున్నయత్యపానం ప్రత్యగస్యతి।
మధ్యం వామనమాసీనం విశ్వేదేవా ఉపాసతే ॥ ౬ ॥

పూజనీయుడైన యతడు మధ్యను కూర్చుండి ప్రాణమును ఊర్ధ్వము గాను అపానమును క్రిందకును పంపుచున్నాడు. సమస్త దేవత లతనిని యారాధించుచున్నారు.

జీవనకేంద్రమైన యాత్మ, దేహములో లేనియెడల దేహము ఊపిరి పీల్చుదన్న సంగతి స్పష్టమేకదా! కావుననే ఆత్మ లేదా పురుషుడు మన దేహములోని ప్రాణవాయువులను సరిగా నడిపించుచు అవి ఆ విధముగా దేహాంతమువఱకు చుఱుకుగా నడచుకొనునట్లు జాగ్రత్తపడుచున్నాడు.

ఈ భౌతికదేహమును నడపించు ప్రాణవాయువు లైదు విధములు. అవి సమానమైన సృష్టితత్త్వమునకు జెంది యేకత్వము కలిగినవైనప్పటికిని, అవి నిర్వర్తించు వివిధ వ్యాపారములనుబట్టి వివిధ నామములు గలిగి యున్నవి.

(1) ప్రాణము—ఊపిరితిత్తులలో ప్రవేశించి శ్వాసప్రవాహమును సరిదిద్దునది.

(2) అపానము—మూత్రపురీషాశయములందు పనిచేయునది.

(3) సమానము—జీర్ణకోశమునందు పనిచేయునది.

(4) ఉదానము—కంఠములోనుండి శబ్దము నుత్పత్తిచేయునది.

(5) వ్యానము—రక్తమును ప్రవహింపజేయునది.

కావున ప్రాణమనగా కేవల మూపిరియే కాదు అదియే ముఖ్యశక్తి. ఊపిరిదానియొక్క యంశముమాత్రమే.

దేవాః—(దేవతలు) దేవశబ్దమును పూర్వమంత్రములో వ్యాఖ్యానించితిమి. అచట దేవతలనగా స్వర్గవాసులు కాదనియు, మనలోని యింద్రియముల కధిదేవతలై, సూక్ష్మరూపమున నున్న పంచభూతము లనియు వివరింపబడెను.

ఇచట యింద్రియాధిదేవతలు పురుషుని సేవించుచున్నవని చెప్పబడి యున్నది. అసగా పురుషుని యనుగ్రహము లేనిదే యింద్రియములు పనిచేయలేవు గనుక మధ్యనున్న కేంద్రరూపుడగు పురుషుని తదధిదేవతలు సేవించుచున్నారు. అది సహజమేకదా!

శ్లో॥ అస్య విస్రంసమానస్య శరీరస్థస్య దేహినః ।
దేహాద్విముచ్యమానస్య కిమత్ర పరిశిష్యతే ॥
ఏతద్వైతత్ ॥ ౪ ॥

దేహములో నివసించు నిట్టి యాత్మ దేహమును విడిచిపోగా నచట యపుడు యేమి మిగులుచున్నది? ఇదియే అది.

ఇంద్రియము లెవనిమీద యాధారపడియున్నవో, ప్రాణవాయువు లెవరిచే నడుపబడి యీ దేహమున సంచరించుచున్నవో యట్టి యాత్మయే, ఏకాదశ ద్వారములు గల యీ దేహమునకు ప్రభువు. ఒక రాజు తన రాజధానిని వదలి మరియొక రాజధానిని కోరి యందు నివసించదలచిన, యతని పరివారము, ప్రజలుకూడ యతనినే యనుసరించి యా క్రొత్త రాజధానికే పోయెదరు. అట్లే యాత్మ యీ దేహమును వదలిన యా దేహమునకు సంబంధించిన సమస్త వ్యాపారములును ఆత్మతోపాటు యా దేహమును వదలిపోయినట్లు కనబడును.

జీవించియున్నప్పుడు ఒక వ్యక్తి యెంత గొప్పవాడైనప్పటికిని యా ప్రభువు దేహమును వదలిపెట్టగానే యతని దేహము కృశించి నశించిపోవుటయే గాక యంతమున యే పంచభూతములనుండి పుట్టినదో యా పంచభూతములలోనె కలిసిపోవుచున్నది.

కిమత్ర పరిశిష్యతే - (ఇచట యేమి మిగులును) ఆత్మ దేహమును విడిచిపెట్టగానే ఆ దేహములో యేమి మిగులును? ఈ ప్రశ్నచేత నిచట శ్రుతి "అచట గౌరవించి ప్రశంసించుటకు ఆ వ్యక్తి మృతదేహములో యేమియు యుండదు" అను సత్యమును చెప్పుచున్నది.

శ్లో॥ న ప్రాణేన నాపానేన మర్త్యో జీవతి కశ్చన।
ఇతరేణ తు జీవన్తి యస్మిన్నేతావుపాశ్రితౌ ॥ ౫ ॥

కేవల ప్రాణాపానములచే మర్త్యుడు జీవించుటలేదు. ఈ ప్రాణాపానములు రెండు దేనిమీద యాధారపడియున్నవో యట్టి మరియొకదానిచే మానవుడు జీవించుచున్నాడు.

మానవుడు కేవలము దేహ మనో బుద్ధి పరికరముల వ్యాపారముచేతను, ప్రాణవాయువుల వ్యాపారముచేతను జీవించలేదనియు సర్వవిధ జీవిత వ్యాపారములు నా యాత్మమీదనే యాధారపడియున్నవనియు, శ్రుతి చెప్పుచున్నది. ఇట్టి శ్రుతిమంత్రములను, ఇతఃపూర్వమైన మంత్రవ్యాఖ్యానములను ననుసరించినవారు దీనిని యర్థముచేసికొనుట దుష్కరముకాదు. దేహములో జీవమున్ననే ప్రాణవాయువులు పనిచేయుచున్నవి.

ఈ శ్లోకముయొక్క యర్థము సూటిగా స్పష్టముగా నున్నప్పటికిని హిందూశాస్త్రములయొక్క ప్రారంభవిద్యార్థికి శ్రుతిలోని వేదాంత సూచనలు క్రొత్తగానే యుండును.

ఒక సభను సమకూర్చు ప్రజలా సభలో భాగములగుచున్నారు కాని వారిమట్టుకు వారు స్వతంత్రులు కారు. వారట్లు కలిసి సభతో సంబంధము లేని మరియొకరికి సహాయపడు విధములో వారు సభ చేయుచున్నారు. ఉదాహరణకు - ఒక యింటిని తీసికొందము. స్తంభములు, గోడలు, యిటికలు, దూలములు మొదలైనవన్నియు గృహనిర్మాణమున కత్యంతావశ్యకములైనవే. కాని యా గోడలు, దూలములకొఱకే యా యిల్లు కట్టబడలేదు. అని యన్నియు నట్లొక్కటిగా గృహరూపములో చేరుట గృహయజమానికొఱకే. దాస్ యనునతడు తన యిష్టప్రకార మా యింటిలో బయటికిగాని, లోపలకుగాని సంచరించవచ్చును. కాని యా యిటికలు గోడలు అట్లు చేయలేవుకదా! అట్లే యింద్రియములు, శరీరావయములు మనస్సు, బుద్ధి మొదలైనవన్నియు దేహసభతో సంబంధించినవి. అవి పురుషునికొఱకే యుత్పన్నమైనవి. ఈ దేహము తన యిచ్ఛవచ్చినట్లు

నడువలేదు. కాని యా పురుషుడు మృత్యుసమయమున స్వేచ్ఛగా దానిని వదలిపోవుచున్నాడు. దాన్ పూర్తిగా గృహమును వదలివేసిన కొంతకాలమునకా గృహము శిథిలమైపోవును. అట్లే యాత్మ యీ దేహమును వదలి వెళ్ళగానే యీ దేహము నశించుచున్నది. జీవమునకు కారణము ప్రాణము కాదు. వానికి కారణభూతమైన యాత్మ తన యాలయమైన దేహమును విడచిపెట్టగానే ప్రాణములు తమంతటతామే నశించుచున్నవి.

శాస్త్రపరిభాషలో దేహ మనో బుద్ధుల వ్యాపారములను "ప్రాణవృత్తు" లందురు.

శ్లో॥ హన్త త ఇదం ప్రవక్ష్యామి గుహ్యం బ్రహ్మ సనాతనం।
యథా చ మరణం ప్రాప్య ఆత్మా భవతి గౌతమ ॥ ౬ ॥

ఓ గౌతముడా! సనాతనమై గుహ్యమైన యా బ్రహ్మనుగూర్చి నీకు చెప్పెదను. మరియు మరణముతరువాత ఆత్మ యేమగుచున్నదో కూడ వివరించెదను.

మృత్యుదేవత యింతవఱకు చెప్పినదంతయు "మరణముతరువాత ఆత్మ యేమగును" యను ప్రధానవిషయములోనికి ప్రవేశించుటకు ముందటి యవతారికవలె తోచుచున్నది. తన భ్రాంతిలో మరణావస్థ నొకసారి యనుభవించిన జీవుడు మరణానంతరము యేమి అగుచున్నాడో యని సంశయావిష్టుడైన నచికేతునకు మృత్యుదేవత కనికరముతో, ఈ జ్ఞానము నుపదేశించెద ననుచున్నాడు. "ఈ దేహము మంచువంటి మృత్యువుచే కౌగలింపబడినదై చల్లబడి జడమైపోయినపుడు ఆత్మ ఏమగును ?" అను విషయమునుగూర్చి చెప్పుటకు మృత్యుదేవతకన్న శ్రేష్ఠమైనవాడు మనకు మఱియొకడు లేడు.

ఆత్మ (జీవాత్మ) - అహంకారము. ఉపనిషత్తులోని మంత్రములలో ఆత్మ అను పదము కొన్నియెడల దేహమును, కొన్నియెడల మనస్సును,

యుంక కొన్నియెడల బుద్ధిని, మరికొన్నియెడల మనోనియమిత జీవరూప శుద్ధచైతన్యమును సూచించుట కుపయోగింపబడినవి. ఇచట యీ ప్రత్యేక మంత్రములో 'ఆత్మ' యను పదము అహంకారమును (జీవాత్మను) సూచించుటకే ఉపయోగింపబడినదిగాని ఆ పరమాత్మను సూచించుటకుగాదు. అట్లు గాక మన మీ యాత్మ యను పదమునకు వాచ్యార్థమే చెప్పికొనినచో యుపనిష ద్వేదాంతమునకే యీ మంత్రార్థము విరుద్ధమగుచున్నది. ఆ శుద్ధ చైతన్యమగు సత్యమునకు ఎప్పుడు ఏమియు కాదు. ఆకాశమంతట వ్యాపించి నను గృహములోని యాకాశమును గృహాకాశమన్నట్లుగానే యీ దేహ వ్యాపారములపై యాధిపత్యము వహించిన శుద్ధచైతన్యరూపమైన యాత్మను యీ దేహసంబంధమువలన 'ప్రత్యగాత్మ' యనుచున్నాము. ఎటుల గృహమునందలి గోడలే అవకాశములో (ఆకాశము) నిలిచియుండును గాన యథార్థములో నా మహాకాశము గోడలచేత పరిమితము చేయబడదు. అట్లే చైతన్యము లేక జ్ఞానము ఏకజాతీయమై యద్వితీయమైనది, దేహము నశించగానే దేహమునకు అధిపత్యము వహించిన ఆ దివ్యజ్యోతి - జీవన కేంద్రము మార్పుజెందదు. అట్లే శాశ్వతముగా నుండును. మరణము, మరణ సమయములో దేహమును వదలిపోయెనని తలచుట, జననము, జనన సమయములో దేహమునందు ప్రవేశించె ననుకొనుట, ఇత్యాదు లన్నియు అహంకారముయొక్క భ్రాంతిచే కల్పితములే!

మనో బుద్ధులలో ప్రతిబింబితమైన యీ పరమాత్మయే ఇదివఱకు తెలిసికొన్నట్టి జీవుడు - లేక అహంకారము.

ఈ అహంకారము, 'నేను - నాది' యను భావముతోకూడ మృతదేహమును వదలిపోవుచున్నది. కొంతకాలమువఱకు దేహము లేకయున్నదై యటుపిమ్మట దేహమును పొందవలెనను కోరికను కలిగించుకొన్నదై మరియొక దేహమును పొందును.

ఇట్లు "మరణము తరువాత ఆత్మ యేమగును?" అను విషయమును మృత్యుదేవత వివరించి చెప్పుటలో "నేను-నాది, యను యభిమానముతో నున్న జీవు డా దేహమును నశించుటకు విడచి మరియొక దేహములో ప్రవేశించుచున్నా డనియే" యతని తాత్పర్యము.

శ్లో॥ యోనిమన్యే ప్రపద్యన్తే శరీరత్వాయ దేహినః ।
స్థాణుమన్యేఽను సంయన్తి యథాకర్మ యథాశ్రుతం॥

తమతమ జ్ఞానము ననుసరించి, కర్మ ననుసరించి, కొన్ని జీవులు దేహమును ధరించుచున్నవి. కొన్ని జీవులు వృక్షాదులలో జన్మించుచున్నవి.

స్థాణు - స్థావరము - కదలనిది. వృక్షజాతి అయినా కావచ్చును లేదా రాళ్ళు రప్పలు వంటి జడపదార్థములైనను కావచ్చును. ఒకసారి జీవి మానవుడై పుట్టిన తరువాత తన జీవితములో నెటువంటి దుర్మార్గపు పని చేసి యుండినను పరిణామ మను నిచ్చెనలో రాళ్ళు రప్పలుగా మారునంత క్రిందకు దిగజారడని యనధికారమైన యాశాభావముతో మనము నిశ్చయించుకొనవచ్చును. ఆధ్యాత్మిక గురువులుకూడా కొంతమంది తమ శిష్యులను ప్రోత్సహించుటకొఱకు ఇట్టి యాశావాదమును సమర్థించుచున్నారు. మరియు వారు ఒకసారి మానవజన్మ యెత్తినతరువాత యెటువంటి పరిస్థితులలోను పశువుగాగాని జడమైన శిలలుగాగాని పుట్టునంతటి నీచత్వమునకు దిగజారరని వారు స్థిరముగా నొక్కి చెప్పెదరు. ఇట్టి భ్రమకల్పితమైన యాశావాదమును యీ యుపనిషత్తులోని యీ మంత్రవివరణ పూర్తిగా యణగద్రొక్కివేసినది.

ప్రథమవల్లి యారవ మంత్రములో "సస్యమివ పచ్యతే మర్త్యః సస్యమి వాజాయతే పునః" యని నచికేతుడు చెప్పినప్పుడే కర్మసిద్ధాంతము, పునర్జన్మ సిద్ధాంతముకూడ స్పష్టముగా సూచింపబడినవి.

జీవాత్మ యీ దేహమును విడచినతరువాత మరియొక దేహముతో సంబంధము కలుగువఱకు "ఒక భావరూపము"లో తేలుచుండును. అట్లు 'తేలుచున్న జీవుడు' మఱియొక కూడలిస్థానమును యెన్నుకొనుటలో, ఆ క్రొత్తరూపములో, క్రొత్తక్షేత్రములో, క్రొత్త పరిస్థితులలో తాననుభవించుటకు తగిన తన సంచిత కర్మఫలములే యతనికి సహాయపడుచున్నవి.

కర్మసూత్రము హిందువులుమాత్రమే యనుభవించు విశేషానుగ్రహము కావున తర్కముచే బిగువై హేతువాదములకు నిలువదగిన యిట్టి

వేదాంతభావము మరియొకటి లేదు. దురదృష్టవశాత్తు మనము మన స్వంత శాస్త్రగ్రంథముల నభ్యసించుట మానివేసి కేవలము కర్మసూత్రములను గుఱించిమాత్రమే చదువుటకు ప్రారంభించిన తత్ఫలితముగా మనకు నీరస వేదాంతమునకు రూపాంతరమైన" విధి నియమము" యను నొక భావము తోచినచో, అట్లు తోచుటకు ఉపనిషదృషుల తప్పు యెంతమాత్రము కాదు. సరిగా నర్థముచేసికొనిన మన భావి జీవితములను మనమే రూపొందించు కొనుటకు మన చేతికొక విశేషాధికారమును ఈ కర్మసూత్ర మిచ్చుచున్న దని మనకు తెలియగలదు.

యథాకర్మ -(కర్మ ననుసరించి) పూర్వము మనము చేసిన కర్మల కనుగుణముగా మనము భవిష్యత్తులో నా కర్మఫలము ననుభవించుటకు తగినట్టి రూపమును దాల్చి తదనుగుణ్యమగు పరిస్థితులలో జన్మ యెత్తు చున్నాము.

యథాశ్రుతం - (జ్ఞానము ననుసరించి) భవిష్యజ్జన్మ కేవలము మన పురాకృత కర్మఫలములమీదనే గాక మన మా జన్మలలో నార్జించిన యాత్మ జ్ఞానము మీదను, దానికి తగినట్టు గడపిన జీవనముమీదను కూడ యాధార పడియుండును. పూర్తివివరములకు బృహదారణ్యకోపనిషత్తును చూడుడు. 12-2-13.

శ్లో॥ య ఏషు సుప్తేషు జాగర్తి కామం కామం
పురుషో నిర్మిమాణః।
తదేవశుక్రం తద్బ్రహ్మ తదేవామృత ముచ్యతే॥
తస్మిన్లోకాః శ్రితాః సర్వే తదు నాత్యేతి కశ్చన॥
ఏతద్వైతత్ ॥ ౮ ॥

ఏది నిద్రలోకూడ సమస్తవిధములైన విషయేచ్ఛలను స్వప్నములోకి రూపొందించుచు మేలుకొనియుండునో అదియే పవిత్రమైన బ్రహ్మ. దానినే "అమృతము" యనికూడ పిలుచుచున్నారు. సర్వప్రపంచము దాని

మీద నే యాధారపడియున్నది. దీనిని దాటి యెవ్వరును పోలేరు. ఇదియే-అది (నీవడిగినది.)

ఈ దేహములో నా పరమజ్ఞానముయొక్క సాన్నిధ్యమున్ననే యింద్రియ విషయములయొక్క జాగృతి, వాని పరిజ్ఞానము సంభవించును. అట్టి జ్ఞానముచేత ప్రకాశమానమైననేగాని మన మా స్వప్నప్రపంచము ననుభవించుట కవకాశముండదని తెలిసికొంటిమి. గాఢసుషుప్తిలోకూడ వదలకుండ నాజ్ఞానము ప్రకాశించుచునే యుండును. కావుననే మనము 'నాకు తెలియదు' యను భావమును తెలిసికొనుచున్నాము. కావున శుద్ధ చైతన్యమగు ఆత్మ జాగ్రత్స్వప్న సుషుప్తు లనెడి మూడవస్థలలోను సదా సాక్షియై యున్నది. కాని యది మేలుకొనదు. స్వప్నమును చూడదు. మరియు సుషుప్తిని జెందదు. దాని సాన్నిధ్యములో నీ మూడవస్థలు వరుస పందెము నాడుచున్నవి.

కేనోపనిషత్తును చర్చించునపుడు మనము వీధిదీపపు సాదృశ్యము ద్వారా యీ విషయమును స్పష్టపరచితిమి. వీధిదీపముయొక్క ప్రకాశము తన పరిధిలోనికి వచ్చు ప్రతి వస్తువును ప్రకాశింపజేయును. ఆనందముతో నాడుచు పాడుచు వచ్చు నూతన దంపతులను ప్రకాశింపజేయును. ఇంకొక నిమిషమున త్రాగి తందానాలాడు త్రాగుబోతుగుంపును ప్రకాశింప జేయును. మరియొక నిమిషమున శవమును మోయుచు విచారించుచు వచ్చు జనశ్రేణిని ప్రకాశింపజేయును. కాని యీ మూడు సమయములలోను, అనగా నూతన దంపతుల యానందములో నానందించుటగాని, లేక త్రాగుబోతువారితో త్రాగి మత్తిల్లుట గాని, శవమును చూచి విచారించుటగాని యీ వీధిదీపమునకు సంభవించదుకదా!

అదే విధముగ మనలో నాధిపత్యమును వహించు నా పరమజ్ఞానము జాగ్రత్స్వప్న సుషుప్త్యవస్థలను తాను పొందకుండగనే వానిని ప్రకాశింప జేయుచున్నది.

మృత్యుదేవత నచికేతునకు ప్రస్తుత జన్మలోని యనుభవములను స్మరింపజేయుట ద్వారా యాత్మతత్త్వమును బోధింపతలచుచున్నాడు.

బడిలో నుపాధ్యాయుడు చిన్నపిల్లవానికి లెక్కలు చెప్పవలయుననిన కేవలము అంకెలమీదనే గాక యా బాలునికి పరిచయమైన వస్తువుల సహాయముతో కూడిక తీసివేత మొదలగు లెక్కలను చెప్పునుకదా! దానివలన బడిపంతులా బాలునికి జీవితములో పరిచయమై యనుభవించిన వస్తువులనే యుదాహరణగా తీసికొనునని తెలియుచున్నది. "నీవద్దఱ పది మామిడి పండ్లున్న వనుకొనుము," అని ప్రారంభించి "నీ స్నేహితునివద్ద నైదు మామిడిపళ్ళున్నయెడల మీ యిద్దరిదగ్గఱ మొత్తమెన్ని యున్నవి ?" యనును. ఇట్టి ప్రశ్నను వేయుట బడిపంతులు మామిడిపళ్ళ జమాఖర్చు లెక్కల నుంచుకొనుటకు కాదు. కాని యా పిల్లవానికి పరిచయమైన వస్తువులద్వారా గణితసిద్ధాంతమును నేర్పుటకొఱకే యట్లు చేయవలసివచ్చెను. అట్లే యుపనిషత్తులు తమ్ము శరణుపొందిన సాధకులకును నున్నతమైన యా పరిపూర్ణ సత్యపదమునకు చేర్చవలయుననిన చో యతనియొక్క యధికారమునుబట్టియే బోధనాపద్ధతి నవలంబింపవలసివచ్చును. ప్రతి దినము తాననుభవించుచున్న జాగ్రత్స్వప్నసుషుప్త్యవస్థలను తెలిసికొన కుండ నెట్టి మానవుడు నుండడు. ఇపుడు గురువు వచ్చి స్థిరమైన జ్యోతి యొకటున్నదనియు, దాని సాన్నిధ్యమువలననే మన మీ మూడవస్థలను గ్రహించి యనుభవించ గలుగుచున్నామనియును చెప్పిన మన మా నిత్యమైన యాత్మతత్త్వమును మనలోని యంతఃప్రేరణద్వారా యనుభవింప గలుగుచున్నాము.

ఆ వీధిదీపమువలె మన యాత్మకూడ పాప పుణ్యములయొక్క, నీచ కామేచ్ఛలయొక్క అసూయా స్వార్థములయొక్క సంపర్కముచేత మాలిన్యము పొందదు. అది ఏకైకసాక్షి. ఎల్లప్పుడు పవిత్రమైనది (శుక్రం) ఈ మంత్రములోని మిగిలిన పదములు మా విపుల వ్యాఖ్యానమును చదివిన వారికి వానియంతటవియే స్పష్టపడును.

1-8. శ్లో॥ శరీరపురమునకు ప్రభువైనవాడే జగదంతస్థుడైన ప్రభువు. ఆతడే ఆత్మ. ఆతడే శాశ్వతపరబ్రహ్మ. మనోబుద్ధ్యాది పరికరములచే నార్జించిన కర్మజ్ఞానముల కనుగుణముగా పునర్జన్మల నెత్తుచున్నాడు.

శ్లో॥ అగ్నిర్యథైకో భువనం ప్రవిష్టో రూపం రూపం
ప్రతిరూపో బభూవ।
ఏక స్తథా సర్వభూతా న్తరాత్మా రూపం రూపం
ప్రతిరూపో బహిశ్చ ॥ ౯ ॥

ఏకరూపమైన యగ్ని తానాశ్రయించు వస్తువులనుబట్టి యెట్లనేక రూపములతో నీ ప్రపంచములో ప్రవేశించుచున్నదో, యట్లే సర్వ దేహాంతర్భాతుడైన యాత్మ ఒక్కడేయైనను తాను ప్రవేశించిన దేహముల కనుగుణముగా వివిధ రూపములను ధరించుచున్నాడు. కాని తాను స్వయముగా రూపము లేనివాడు, రూపముల కతీతుడై యుండువాడు.

అష్టోత్తరశతోపనిషత్తులలోను శ్రావ్యమైన కావ్యగుణములు గలది అనగా ఇంపైన శబ్దములతో ననుప్రాసాద్యలంకారములతో కవితాభావములతో అర్థచిత్రములతో కూడినదైన యీ కఠోపనిషత్తువంటిది మరియొక యుపని షత్తు లేదనియే చెప్పవచ్చును. సంస్కృత సాహిత్యమునందు కఠోపనిషత్తు కవిత్వ వేదాంతములకు గీటురాయివంటిదని చెప్పుటలో నతిశయోక్తి లేదు. ఇట్టి పరిపుష్టమైన కవిత్వములో నిమిడ్చిన యిట్టి యుదారతయు భావౌన్నత్య మును ప్రపంచములోని మరియే యితర భాషలలోను చూడలేము. కవితా వనిత వేదాంతస్వరూపుడగు తన విటపుంగవుని కలిసికొని యానందించుటకు స్థానమై, ప్రేమోద్రేకమును ప్రజ్వలింపజేయు పూవుటీరమే యీ కఠోపనిషత్తు. ప్రస్తుతము చర్చించుచున్న మంత్రమే పై వాక్యమునకు సాక్ష్యము.

ఒకే రంగు గల ద్రావకము పొడుగుసీసాలో పోసిన పొడుగుగాను గుండ్రని సీసాలో పోసిన గుండ్రముగాను కనబడును. ఆ సీసాల ఆకారమును బట్టి మన మీ ద్రావకమునకు వివిధాకారములు కల్పించలేముగదా! అట్లే శక్తివంతమైన యా జీవనకేంద్ర మొకేవిధముగా నుండి వివిధరూపము లను ప్రకాశింపజేయుచున్నది. బాహ్యరూపములలోనే భేదముగాని లోని యాత్మతత్త్వము విశ్వమంతటను నొకే రూపమున నున్నది.

విద్యుచ్ఛక్తి యనునది యేకరూపమే యైనను నది ప్రవేశించు బల్బు (bulb) ఫేను (fan) రిఫ్రిజిరేటరు (refrigerator) హీటరు (heater) మొదలగు వస్తువులనుబట్టి అది ప్రకాశమునిచ్చునది, గాలినిచ్చునది, చల్లదనమును, వేడినిచ్చునదిగా రూపొందుచున్నది. అట్లే తాను వ్యవహరించు దేహాది పరికరముల యాకారములు వేరైనప్పటికిని యా యాత్మ తత్త్వ మొక్కటియే యగుచున్నది. నీవు నేను కాదు. నేను నీవు కాదు. మన మనస్తత్త్వములలో భేదమున్నది కాని మన యాత్మ యొక్కటియే.

బహిశ్చ - (బయలందు) సర్వవ్యాపియై సత్యమైన శుద్ధచైతన్య మన్ని రూపముల కాధిపత్యము వహించి వానిలోని ప్రతి జీవాణువునకు శక్తినిచ్చునదై యున్నప్పటికిని "ఆ సత్యము వ్యక్తజీవమును ఆవరించుటవఱకు పరిమితమైనది కాదు," అని శ్రుతి చెప్పుచున్నది. అనగా నది యపరిమితమైనది.

కోట్లకొలది విశ్వములలో నుండు జీవముల నన్నిటిని యొకచోట చేర్చి నప్పటికిని గీతలో శ్రీకృష్ణుడు చెప్పినట్లు, అది యీ దివ్యతత్త్వములో నాలుగవవంతు మాత్రమే. ఇచట నా పరమసత్యము ప్రత్యక్ష స్థూలప్రపంచము నందు, అప్రత్యక్ష సూక్ష్మప్రపంచమునందు వ్యాపించియుండుటయే కాక వానినన్నిటికి నతీతమై యతిశయించి యున్నదని శ్రుతి నొక్కి చెప్పుచున్నది. సంగ్రహముగా చెప్పిన నా పరమసత్యము జగదంతర్వ్యాప్తమైనది. జగదతీతమైనది. అని తెలియుచున్నది.

శ్లో॥ వాయుర్యథైకో భువనం ప్రవిష్టో రూపం రూపం
ప్రతిరూపో బభూవ ।
ఏకస్తథా సర్వభూతాన్తరాత్మా రూపంరూపం
ప్రతిరూపో బహిశ్చ ॥ ౧౦ ॥

ఒకే వాయువు జగత్తునందు ప్రవేశించి తాను పొందిన రూపాను గుణముగా నెట్లు వైవిధ్యమును పొందుచున్నదో, అట్లే సర్వజీవులలోని

యా ఆత్మ యొకటియే అయినప్పటికిని తాను ధరించు రూపముల కను గుణముగా వైవిధ్యమును పొందుచున్నది. కాని ఆత్మ జగదతీతమైనది.

పూర్వమంత్రములో చెప్పిన ఆత్మయొక్క ఏకత్వమును నిరూపించుటకు ఇచట మరియొక మనోహరమైన యుపమానము చెప్పబడినది. అగ్నికి బదులుగా నిచట మృత్యుదేవత వాయువుయొక్క ఉదాహరణద్వారా బోధించుచున్నాడు. అశ్వముగాని అత్తివృక్షముగాని, మానవుడుగాని, లత గాని, గాడిదగాని, అన్నియు ప్రాణవాయువుతోనే జీవించుచున్నవి. అట్లే విశ్వములో మనము చూచు ఎట్టి నామరూపాత్మకమైన విషయమైనను, ఆ యద్వితీయ బ్రహ్మతత్త్వముచేతనే నధిష్టింపబడి యున్నది.

ఇది యించుమించు ముందుశ్లోకముయొక్క పునరుక్తివలెనే యుండుటచే దీనిని శ్రుతి దృఢపఱచుటకే చెప్పినదిగాన మన మందులోని సౌందర్యము నాస్వాదించి తృప్తిపడెదము.

శ్లో॥ సూర్యోయథా సర్వలోకస్య చక్షు ర్నలిప్యతే
చాక్షుషైర్బాహ్యదోషైః।
ఏక స్తథా సర్వభూతా న్తరాత్మా న లిప్యతే
లోక దుఃఖేన బాహ్యః ॥ ౧౧ ॥

సర్వలోకచక్షువైన సూర్యు డేవిధముగా బాహ్యదృష్టిదోషముచే మలినుడు కాడో యట్లే సర్వభూతా న్తరాత్మయైన యాత్మ బాహ్యప్రపంచ దుఃఖాదులచేత మలినము కాదు.

సర్వలోకస్య చక్షుః—సూర్యకాంతి లేకపోయినచో ప్రపంచములోని విషయములయొక్క రూపములను వివరముగా వివేచించి చూచుటకు మన కన్నులుపయోగపడవు. సూర్యుడు తన కాంతిని ప్రతిఫలింపజేసి యుండనియెడల శుక్లపక్షములోనైన మనకు వెన్నెల నిచ్చుటకు చంద్రుడుండియుండడు. ఇది యిట్లుండుటచేత యుపనిషత్తులోని ప్రాచీన ఋషులు వేదకాలములోనే కాంతినిగుఱించిన వైజ్ఞానిక సిద్ధాంతమును

బాగుగా తెలిసికొని యుండియుండవలయును. కావుననే వారు నేత్రమునకధిదైవము సూర్యుడని చెప్పిరి. కావున సూర్యుని 'జగచ్చక్షువు' యనుట మిగుల యుక్తముగా నున్నది.

సూర్యకాంతి పరిపుష్టమైన పదార్థములను, క్షీణించు పదార్థములను కూడ సమానముగానే ప్రకాశింపజేయుచున్నది. సూర్యుడు ప్రశస్తమైన యాగదృశ్యమునుగాని, ఘోరమై గణింపదగ్గ పాపిష్ఠి దృశ్యమునుగాని ప్రకాశింపజేయునపుడు వాటియొక్క వివిధగుణములచే యనుగ్రహమునుగాని, యవజ్ఞనుగాని పొందడుకదా!

అట్లే యజ్ఞాన జనిత భ్రాంతిచేత యహంకారము గలిగి జీవించు జీవులయొక్క కామకర్మలనుండి పుట్టిన దుఃఖములచే ఆత్మ కళంకితము కాదు. అణప శక్యముగాని కోరికలచేతను, వానిని తీర్చుకొనుటకు విషయ ప్రపంచములో చేయు ప్రయత్నములచేతను సమస్త దుఃఖములు కలుగుచున్నవి. (కామకర్మోద్భవం దుఃఖం)

స్థాణువును చూచి పురుషుడని భ్రమించునపుడు స్థాణువునందు పురుషుని పరిస్థితి యెట్లున్నను స్థాణువునకుమాత్ర మెట్టి బాధయు లేదుకదా! రజ్జువులోని సర్ప మెంత భయంకరమైనదైనను రజ్జువునకు నెట్టి వికారము లేదు. ఎండమావులయొక్క నీటితల మెట్లున్నను యెడారికి నెట్టి చలనము లేదుకదా! అట్లే ప్రపంచ పరిస్థితి. దానిలో దేహధారులమైన మనయొక్క యనుభవము లెట్లున్నను, భ్రాంతికల్పిత జగద్రహస్యమునకు మూలాధారమైన సత్యపదార్థ మెట్టివిధముగాను వికారము జెందదు.

హిందూవేదాంతమున సత్యమునకు ప్రపంచమునకు సంబంధకల్పన విషయములో రెండు వాదములు గలవు. పాలు పెరుగైనట్టు ఆ పరమ సత్యమే ప్రపంచముగా పరిణమించినదని కొందరందురు. కాని వేదాంతులు తమ వాదప్రక్రియ ననుసరించి దీనియందు లోపము కలదని యీ పద్ధతిని తిరస్కరించిరి. ఆ పరమసత్యము పరిణామక్రమమును చెందవలయుననిన పాలు పెరుగైనప్పుడు తన పాల రూపము నెట్లు పోగొట్టుకొనుచున్నదో యట్లే యాత్మ జగత్తుగా పరిణమించినపుడు యాత్మ తాను అంతమొందవల

యును. అది అసంగతమే కదా! మరియు పరిణామవాదుల ప్రకారము ఆత్మ పరిణతి జెందుట యనిన యాత్మకు మార్పును సంగీకరించుటయే కదా. అట్టి మార్పు జెందు యాత్మ శాశ్వతముగా నుండనేరదు. అది తప్పక యనిత్యత్వపు సరిహద్దులలో పడి తీరవలసినదే. కావున పరిణామవాదము సంగీకరించినయెడల యా పరమసత్యమే యనిత్యమై నశించునదగును.

మాయ యనెడి మానసికపు గారడీ కారణముగా నా పరమసత్యము నందీ సృష్టి యధికముగా తెచ్చిపెట్టబడినది. ఈ వాదమును "వివర్త వాద"మని వేదాంతులందురు. ఇచట యా పరమాత్మ యెట్టి మార్పులను జెందక సహజ శాశ్వత దివ్యమహిమతోనే యుండును. బాటసారి కనుచీకటిలో త్రాడును చూచి పామని భ్రమించునపుడు ఆ త్రాడున కెట్టి మార్పును రాదు సరికదా యా భ్రాంతసర్పమునుండి యొక్క బొట్టు విషముకూడా దాని కంటదు.

ఈ మంత్రము సంపూర్ణముగా శంకరసిద్ధాంతమును సమర్ధించునదై యున్నది. ఏది యెట్లైనను సత్యాసత్య వివరణయందు వివర్తవాదముచేత పరిణామవాదము పరాస్తమైనది.

**9-11** శ్లో॥ అతడు సమస్త భూతములలో నుండు యంతరాత్మ. ఈ యంతరాత్మ అగ్ని, వాయువులవలె యంతర్వ్యాప్తుడై ప్రతి దేహముచేత కప్పబడియున్నాడు. మరియు యదే సమయమున నతడు జగదతీతుడై కూడ యున్నాడు. సూర్యునివలె యతడు సర్వమును ప్రకాశింపజేయుచు న్నప్పటికిని తాను వాటిచేత మలినుడు కాడు.

శ్లో॥ ఏకో వశీ సర్వభూతాన్తరాత్మా ఏకం రూపం
బహుధా యః కరోతి।
తమాత్మస్థం యేఽనుపశ్యన్తి ధీరా స్తేషాం సుఖం
శాశ్వతం నేతరేషాం ॥ ౧౨ ॥

'ఆ పరమేశ్వరుడు సర్వభూతాన్తరాత్మ తన ఏకరూపమును బహు విధములుగా వ్యక్తపరచుచున్నాడు' అని అతని దివ్యరూపమును ఏ జ్ఞానులు తెలిసికొనుచున్నారో వారే శాశ్వతమైన సుఖమును పొందు చున్నారు. తదితరులు పొందలేరు.

తమ యర్హతలకు మించి భావించు జీవులు, మనో బుద్ధులనెడి తునకలుజేయు పరికరములద్వారా తమను దర్శించుకొనినవారై తాము అనంతమైన నానాత్వముయొక్క శాశ్వత వైవిధ్యముకంటె మరియొకటి పవిత్రమైనది లేదని భావించుచున్నారు. తత్ఫలితముగా, స్వయంసృష్ట జీవితసమస్యలతో నిండిన బాధాకర జీవితములో బాధ ననుభవించు చున్నారు.

ఆ పరమాత్మని ప్రకాశవంతమైన యవిభక్త కిరణమొకటి ప్రసరింప గానే మనో బుద్ధి పరికరము సలుపలకల గాజుకడ్డీవలె ఆ ప్రకాశమునకు నానాత్వము కల్పించి రంగురంగులుగా ప్రతిబింబింపజేయును. ఈ దేహములో దాచబడినదివలె కనబడు ఆ జ్ఞానము సహాయకార్యదర్శియగు మనస్సుద్వారా ఇంద్రియవిషయ ప్రపంచమును చేరి దానిని తెలిసికొను చున్నది. కాని ధీమంతులు మనో బుద్ధ్యతీతులై సహజ జ్ఞానశక్తిద్వారా ఈ ప్రపంచమును చూచుటకు అభ్యసించుచున్నారు. సహజ జ్ఞానముతో జూచిన సర్వకాల సర్వావస్థలయందును ననుభవ మొకటిగానే కలుగు చున్నది.

ఆత్మ ప్రకాశమునకు కారణము. ఆ ప్రకాశము మనస్సు అను పలకలగాజుకడ్డీకి తగిలి లెక్కలేనన్ని చిత్రవిచిత్ర నామరూప సమూహముగా మారి జగద్రూపమును దాల్చుచున్నది. యోగియగువాడు తన వివేచనా బుద్ధితో అజ్ఞానసృష్టమైన నానాత్వముతో కలిసి భ్రాంతిచే విచ్చలవిడిగా తిరుగు మనస్సును మరలించుకొనును. అతని తీవ్ర ధ్యానసమయములో తనలోని చైతన్యము తన్ను ఆత్మస్వరూపముగా తెలిసికొనుచున్నది.

మన చైతన్యము 'తానే శుద్ధచైతన్యమగు ఆత్మ' యని తెలిసికొను క్షణమే ఆత్మజ్ఞానము లేక ఈశ్వరదర్శనముయొక్క సమయము. ఇట్టి

పరమానంద రూపమగు పరమజ్ఞానముయొక్క క్షణమును ననుభవించుట కొఱకు నొకడు తప్పక నున్నత పరిణామము పొందిన ధీరుడుగా నుండ వలయును. అట్టివారే నిత్యానందమును ననుభవించగలుగుచున్నారు. ఇచట శ్రుతి "అట్టివారిదే నిరంతరమై యనంతమైన యానందానుభవము" అని చెప్పుచున్నది. ఆత్మజ్ఞానమును పొందినట్టి ధీమంతులే యానందము ననుభవించువారు. తదితరులు కారు. ప్రాపంచిక మానవులు బాహ్యవిషయ ములయందు తగుల్కొని వివేచనాహీనులైనచో, వారికి యింద్రియముల ద్వారా యనంతానుభవమును పొందు నవకాశ మెన్నటికిని లేదని శ్రుతి యీ వాక్యమున తన యభ్యంతరమును వ్యక్తపఱచుచున్నది.

శ్లో॥ నిత్యోఽనిత్యానాం చేతనశ్చేతనానా మేకో

బహూనాం యో విదధాతి కామాన్ ।

తమాత్మస్థం యేఽనుపశ్యన్తి ధీరా స్తేషాం శాన్తిః

శాశ్వతీ నేతరేషాం ॥ ౧౩ ॥

అనిత్యములలో నిత్యమై, చేతనములలో చేతనమై, యేకమైనప్పటికిని యనేకమంది కోరికల తీర్చువానిని, తమ యాత్మయందున్నవానినిగా తెలిసికొనిన ధీరులే శాశ్వత శాంతిని పొందెదరు. ఇతరులు పొందలేరు.

పూర్వశ్లోకములో నవలంబింపబడిన 'ఉన్నది - లేదు' అను పద్ధతియే యిచట "వారికే శాశ్వత శాంతి యున్నది, ఇతరులకు లేదు," అని మఱల నిశ్చయపఱచునపుడు పునరుక్తమైనది.

మనలో ఆత్మగా దేనిని తెలిసికొనవలెనో యిచట చర్చింపబడినది. ఈ చర్చలలో ఆత్మతత్త్వమును సహజజ్ఞానముతో నర్థముచేసికొనుటకు తగిన సాధనము లీయబడినవి. ఇదియే యా బ్రాహ్మణ బాలసాధకుడు మృత్యు దేవత నడిగిన నూటిప్రశ్న యని మీకు జ్ఞాపకము రాగలదు. ఆత్మ స్వభావ మునుగూర్చి యింత సంపూర్ణముగా, నూటిగా నన్ని ముఖ్యాంశములతో వివ రించిన యీ మంత్రమునకు సాటియైన మరియొక మంత్రము హైందవా ధ్యాత్మిక వాఙ్మయమునం దెచ్చటను లేదని ఘంటాపథముగా చెప్పవచ్చును.

ప్రపంచ మస్థిరమైనది. అతిశయమైన నామ రూపములతో సదా మారుచునేయుండును. బ్రతికినంత కాలము మన భౌతికదేహముకూడ గంటగంటకు మారుచునేయున్నది. ప్రతి ఏడు సంవత్సరములకు మానవ దేహముయొక్క తత్త్వమే పూర్తిగా మారిపోవుచున్నదని యీనాటివారి వైద్యశాస్త్రము చెప్పుచున్నది. ప్రతిక్షణము ప్రాత జీవాణువులు నశించి క్రొత్తవి జన్మించుచున్నవి. వివిధ పరిస్థితులతోను, వివిధ మానవులతోను సంబంధము కలిగినపుడు క్షణక్షణమునకు భౌతికమైన యలవాట్లు, మానసిక భావములు, బుద్ధిలోని యభిప్రాయములు, ఆధ్యాత్మిక విలువలు, అన్నియు మారుచునేయున్నవి. ఇట్టి యభివృద్ధిక్రమము నెవ్వరును నాపలేరు.

ఈ నిరంతరమైన మార్పులో మనకొక నైరంతర్య భావనను కలిగింపవలయుననిన సదా స్థిరముగా నుండు నొక నిశ్చలమైన మానదండమువంటి దొకటి యుండవలెనుకదా! సినిమాహాలులో ఫిల్మునుండి ప్రసారితమైన కాంతిచ్ఛాయలతో కూడిన చిత్రమును చూచునపుడు ప్రేక్షకులలో నైరంతర్య భావము కలిగించుటకు ముఖ్యకారణము చిత్రమువెనుక నుండు తెర. ఆ తెర యనునదే లేనియెడల ప్రేక్షకులు కథనే చూచియుండరు. అట్లే అడుగున స్థిరమై శాంతమైన సముద్రపు లోతులున్ననే పెద్దయలలు, చిన్నయలలు, నురుగు, బుడగలు, మొదలగున వన్నియు మనముందఱ మనోహరముగా నాట్యముచేసి మన మనస్సును స్థిరముగా నుప్పొంగింపజేయగలవు. స్థిరమై, సత్యమైన త్రాడన్నది యున్ననే, సర్పభ్రాంతి గాని, లేక, భూమిపగులు, యినుపగజము మొదలైన యితర భ్రాంతులుగాని కలుగుటకు నవకాశమున్నది. స్థిరమై మార్పులేని పునాది యున్ననేగాని, యస్థిరమగు ప్రపంచముండుటకు నవకాశము లేదు. నదీగర్భమున్ననే గాని నది ప్రవహించలేదు.

"చేతనశ్చేతనానాం—చేతనములలో చైతన్యము." ఇనుపముక్క వ్రేలిని కాల్చిన మనము యినుములో కాల్చుటకు వేడి లేదనియు, అగ్నినుండి దానిని గ్రహించినదనియు, తెలిసికొనుచున్నాము. అట్లే కేవలము భౌతికపదార్థ రూపములగు నీ దేహ మనో బుద్ధిపరికరములు కొన్ని సమయ

ములలో నా దివ్యచైతన్యమును వ్యక్తపఱచినయెడల, నది సహజముగా శుద్ధచైతన్యమైన ఆత్మచైతన్యమునుండి యెరువు తెచ్చుకొనినవని మనము సులభముగా గ్రహింపవచ్చును.

'విదధాతి కామాన్—మానవుని కోరికలను తీర్చును.' ఆత్మ లేక యా పరమచైతన్యమే కర్మసిద్ధాంతమునకు వెనుకనున్న శక్తి యని విపులముగా వివరించుటలో కర్మసిద్ధాంత మిచట మరల సూచింపబడినది. దాని ప్రకారమే ప్రతియొక్క వ్యక్తి తన జీవితములో తనకు ప్రత్యేకించబడిన జ్ఞానము ననుభవించుటకు జన్మించుచున్నాడు.

సరిహద్దు ప్రాంతములలోని పల్లెలకు దూరముగా నుండు రాజధానిలో నివసించు దేశాధ్యక్షునివలె, సహజముగా శుద్ధచైతన్యమై, శాశ్వతమై, స్థిరమైన కర్మసూత్రమునకు వెనుకనుండు శక్తి, యెచటనో దూరముగా స్వర్గములో నుండి పాలించు దివ్యతత్త్వముమాత్రము కాదు. మానవుని వివేకమునకు పరాకాష్ఠయే వేదాంతము.

ఋషుల సత్యప్రకటనలు మానవాతీతమైన సాహసమునకు ప్రాతినిధ్యము వహించుచున్నవి. మఱియు మానవుడు తన స్వకీయ జీవనములో జొరబడి సర్వ కర్మలకు నుత్పత్తిస్థానమై, నిత్యమై, సదా శాశ్వతమై మార్పుజెందు మాయాకల్పిత జగత్తునకు వెనుకనున్న యాత్మను స్వయముగా కనుగొనుటకు నీ ఋషుల సాహసకరమైన సత్యప్రకటనలే కారణములై యున్నవి.

కావున హిందూమతగ్రంధములగు యుపనిషత్తులవలె పవిత్రమై, మహనీయమైన గ్రంథములు 'నభూతో న భవిష్యతి' యనుట సహజమే కదా. పరిపక్వత జెందని బుద్ధి గలిగి, యజ్ఞానులైన విదేశీయులు బలవంతముగా చొరవచేసికొని "ఈ మంత్రములు మానవజాతియొక్క చిన్నతనపు చిలిపిమాటలు" అని యనినచో మనము మన మహత్తరమగు వివేచనతో "దేవుడా? వారిని క్షమింపుము. వారేమి చేయుచున్నారో వారికి తెలియదు" అని ఏసుక్రీస్తు తనను నిందించి తిరస్కరించిన మూఢతరము వారినిగూర్చి యనిన మాటలనే యిచట చెప్పుకొందముగాక.

శ్లో॥ తదేతదితి మన్యన్తే అనిర్దేశ్యం పరమం సుఖం
కథం ను తద్విజానీయాం కిముభాతి విభాతి వా ॥ ౧౪ ॥

"ఇదియే అది. దానిని యెట్లు తెలిసికొనగలను? అది స్వయముగా ప్రకాశించుచున్నదా లేక యితర ప్రకాశముచేత ప్రకాశింపబడుచున్నదా?" అని నిర్దేశింప శక్యముగాని యీ పరమసుఖమును గూర్చి మహర్షులు తలచుచున్నారు.

రాబోవు మంత్రములో జవాబుచెప్పుటకు మృత్యుదేవత స్వయముగా వేసిన ప్రశ్నయే యీ మంత్రమని తలచవచ్చును. కాని చిన్మయానంద తనకుమాత్ర మిది వేదాంతములో నుత్కృష్టవిద్యార్థియైన నచికేతునిదే యీ హృదయపూర్వక ప్రశ్న యని యర్థము చెప్పుకొనుట కిష్టపడుచున్నాడు.

"ఆత్మ యింద్రియములచేత తెలిసికొనబడునది కాదనియు, మనోగ్రహణమునకు బుద్ధినిర్ణయములకు నతీతమైనదనియు," మృత్యుదేవత పూర్వశ్లోకములో చెప్పినప్పటికిని, యీ రెండు చివరి శ్లోకములలోను "ఆత్మజ్ఞానము కలవారు" స్థిరమై నిశ్చయమైన యానందమును పొందుచున్నారని వివరించుచున్నాడు. తెలివైన విద్యార్థు లిచట గాభరాపడుట సహజమే! కాబట్టి మృత్యుదేవత మఱల నీమంత్రముయొక్క పూర్వార్థములో నిట్లు వివరముగా చెప్పుచున్నాడు: "వివేచనాబుద్ధి గల మానవులు గాఢధ్యానములో 'సర్వవ్యాపి సత్యమును' ఆత్మీయముగా 'ఇదియే యది' యని తెలిసికొనుట యనెడి దివ్యసిద్ధిని పొందుచున్నారు" అని.

"తత్ ఏతత్ ఇతి - ఇదియే యది యని." సత్యము తెలిసికొన శక్యముకానిది, యనుభవింప శక్యముకానిది, నిర్ధారింప శక్యముకానిది- తెలిసికొనుట, యనుభవించుట, నిర్ధారించుట యనునవి వరుసగా యింద్రియ మనో బుద్ధి వ్యాపారములు. ఈ యింద్రియ మనో బుద్ధులు మూడును విషయ ప్రపంచము, చింతనలు, భావనలు అను నానాత్వస్థితిలోనే వ్యవహరించ గలవు. జ్ఞానియైన సాధువు ఈ మూడింటితోడి గల ఐక్యభావమును నుపసంహరించుకొనినచో, నట్టి యింద్రియ మనో బుద్ధ్యతీతావస్థయందు "తా

నిదివఱకు వెదకుచున్నది తనకు దగ్గఱగా తనలో నున్న తన యాత్మయే!" యని తెలిసికొనగలుగుచున్నాడు.

ఇట్టి సమయములో నింతవఱకు గురువు చెప్పిన చర్చల నన్నిటిని విని యర్థముచేసికొనినదానికి గుర్తుగా విద్యార్థియే యిట్టి ప్రశ్న వేయుచున్నాడు. "ఇంద్రియ మనో బుద్ధులను దాటిన తరువాత "ఇదియే అది" యని తెలిసికొను పరికరము, యట్టి పరికరము నుపయోగించి తెలిసికొనువాడు యెటువంటివారై యుందురు?" అని నచికేతుడు ప్రశ్నించుచున్నాడు. ఈ ప్రశ్నలోని పూర్తివివరములను మీలో నెవరైనా యీ సమయములో సభ నందింపగలిగినచో మీరుకూడ యింతవరకు శ్రుతిచే చేయబడిన చర్చలను సమగ్రముగా విని యనుసరింపగలుగు చున్నారని తలపవచ్చును.

ఒక పదార్థమును గ్రహించి తెలిసికొనుటకు కాంతి యెట్లావశ్యకమో యిదివఱకు చర్చలలో కనుగొంటిమి. స్థూలమైన ప్రాపంచిక పదార్థములను సూక్ష్మమైన మనోభావములను కనుగొనుటకు జ్ఞానమనెడి ప్రకాశమున్నదని కూడ తెలిసికొంటిమి. ఇంతవఱకు నచికేతుడుగూడ బాగుగా నర్థముచేసి కొనినట్లే కనబడుచున్నది. కాని "వేదాంతవిద్యార్థి మనోబుద్ధుల నధిగ మించిన తరువాతనే యాత్మను పొందగలుగుచున్నాడు" అని మృత్యుదేవత చెప్పగనే బ్రాహ్మణబాలుడైన యా నచికేతుడుకూడ కొంచెము తికమక పడినాడు.

"కిముభాతి - అది ప్రకాశించునా." తన ప్రకాశమున్ననే దీపము కనబడుచున్నది. దానిని జడపదార్థముల నెదుట పెట్టిన యవి యా దీపకాంతిని గ్రహించి తాము ప్రకాశించుచున్నవి.

వేదాంతమతములో గురువులు ప్రశ్నలకు విపుల వివరణముతో ప్రత్యుత్తర మిచ్చెదరు. ఆత్మ తన్ను తాను తెలిసికొను సందర్భ మిది. ధ్యాని యైనవాడు తన మనో బుద్ధుల నణచివేయుటలో సఫలుడైనట్లయితే, యా నిశ్శబ్దావస్థలో చైతన్యము తనను తానే తెలిసికొనుచున్నది. ఇట్లు తెలిసి కొనుట యనునది సహజ జ్ఞానానుభూతియే గాని భౌతికజ్ఞానముమాత్రము కాదు. ఇట్టి సన్నిహితమైన 'యాత్మయొక్క ఆత్మజ్ఞానమును' తెలుపుట

కొఱకే మనకీ మత(గంధములో 'ఇదియే అది' యని యనమానమైన భాషలో చక్కగా చెప్పబడినది.

ఆత్మ స్వయముగా జ్ఞానప్రకాశమగుటచే తనను ప్రకాశింప జేసి కొనుటకు తనకు మరియొక ప్రకాశ మావశ్యకము లేదు. ఆవరించిన మేఘములు తొలగిపోవగనే యా మేఘముల వెనుకనుండి సూర్యుడు బయల్పడిన మన కాతనిని చూచుటకు నెట్టి దీపమును నక్కరలేదుకదా! అట్లే యజ్ఞానముచే సృష్టింపబడినవై యావరణభూతములైన మనో బుద్ధ్యాదులు తొలగిపోయినంతనే స్వయంప్రకాశమైన యాత్మ స్వయముగానే ప్రకాశించును. జ్ఞానరూపమైన యాత్మను తెలిసికొనుటకు మరియొక జ్ఞాన మక్కరలేదు. తరువాతి మంత్రములో నీ మంత్రములోని ప్రశ్నకు జవాబు కలదు.

**12-14** శ్లో॥ ఆ నిత్యసత్య పరమాత్మ సర్వభూతాంతరాత్మగా ప్రకాశించుచున్నది. ధీమంతులు దీనిని తమ హృదయములో నున్నదానిని గానే తెలిసికొని శాశ్వతశాంతిని, యానందమును పొందుచున్నారు. అట్టి దృష్టి యెట్లు సాధ్యమగును? ఆత్మ జ్ఞానరూపము కావున దానిని పొందుట యనగా దానిని తెలిసికొనుట, దానిని యనుభవించుట.

శ్లో॥ న తత్ర సూర్యో భాతి న చన్ద్రతారకం నేమా
విద్యుతో భాన్తి కుతోఽయమగ్నిః।
తమేవ భాన్తమనుభాతి సర్వం తస్య భాసా
సర్వమిదం విభాతి ॥ ౧౫ ॥

సూర్యుడచట ప్రకాశింపడు. చంద్రుడు నక్షత్రములు, విద్యుత్తులు కూడ నచట ప్రకాశింపవనగా నింక యగ్నివిషయము వేఱుగా చెప్పనేల? ప్రకాశించుచున్న యాతని ననుసరించియే యివి యన్నియు ప్రకాశించుచున్నవి, యనగా యతని ప్రకాశముచేతనే యివి ప్రకాశింప గలుగుచున్నవి.

(ఇచట ద్వితీయాధ్యాయములోని పంచమవల్లి సమాప్తమైనది)

మన మతగ్రంథములైన యుపనిషత్తులను మఱచి చాలకాలమైన కూడ, దేవాలయములలోను, పూజాసమయములలోను హారతిచ్చిన తరువాతను, నేటికిని యీ మంత్రమును వినుచున్నాము. ఈ మంత్రమును పఠించకుండ నే పూజయు ముగియుటలేదు. అయినప్పటికి భక్తులుగాని పండితులుకాని యెవ్వరుకూడ యీ శ్లోకముయొక్క యర్థమును తెలిసికొనుటకుకూడ ప్రయత్నింపలేదు. కాని వారిలో యే కొద్దిమందిమాత్రము పైపై యర్థమును తెలుసుకొనుటవఱకే ప్రయత్నించి యాగిపోయిరి. మన మతము ప్రాధాన్యము తగ్గి బూటకమైన దనుటకు మనము దాని విషయమైన జ్ఞానము లేకుండ జీవించుటయే కారణము. మనకు తెలియని భాషలో నున్న శ్లోకములను నర్థముచేసికొనకుండ చిలుకలవలె కేవలము వినినదానిని మరల పలుకుటవలనమాత్రము మన కెట్టి ప్రయోజనమును కలుగదు. మంత్రములయొక్క యర్థమును, ప్రాముఖ్యమును, తెలిసికొనలేనప్పటికిని, కేవలము మాటిమాటికి యుచ్చరించుటచేతనే, యీ మంత్రములు కీర్తనలు తమ హక్కుగా భావించు కర్మిష్ఠులు, సనాతనులు కొంతమంది గలరు. కపటమై, బుద్ధిహీనమై, యసందర్భమైన యీ భాషణలను చిన్మయానంద యనుమోదించలేదు. అట్లే యనుమోదించినచో, సుందరగీతమును పాడు గ్రామఫోనుపెట్టెనైనా, చక్కని యుపన్యాసమును ప్రసారముచేయు రేడియోపెట్టెనైన యభినందించవచ్చునుకదా!

తత్ర - అక్కడ. పరిపూర్ణ జ్ఞానస్థానమైన యీ యాత్మసామ్రాజ్యమును 'తత్ర' యను పదముచే మృత్యుదేవత సూచించుచున్నాడు. ఆ పవిత్ర చైతన్యములో తనను ప్రకాశింపజేయుటకు మరియొక కాంతి యవసరము లేదు. "అచట సూర్య, చంద్ర, తారలుగాని విద్యుత్తుగాని లేవనిన యగ్ని విషయము చెప్పనేల?" యని మృత్యుదేవత చెప్పుటచే నా సత్యసామ్రాజ్యములో నీ భౌతికప్రకాశము లేవియు పనికిరావని యీ మంత్రము చాటి చెప్పుచున్నది. ప్రకాశములో తన ప్రకాశముకంటె వేరొక ప్రకాశముండదు కదా! సూర్యుని ప్రకాశింపజేయుటకు వేరొక కాంతి యక్కరలేదుకదా!

'అనుభాతి - అనుసరించి ప్రకాశించును.' దృశ్యమగు సమస్త వ్యవహారమునకును, మూలాధారము సత్యమే! జీవము పోయినతోడనే యింద్రియ మనో బుద్ధుల వ్యాపారము లంతమగుచున్నవి. మానవునిలోని యీ మూడు సామగ్రులు మఱగి చుట్టచుట్టుకొనినవానికి యనగా యింద్రియ మనో బుద్ధుల నుపసంహరించి యంతమొందించుకొనినవానికి సూర్య చంద్రాదులు లేరు. తనలో జీవమున్నంతవఱకే నాతడు భౌతికప్రపంచము లోని కాంతికారణములను తెలిసికొనుచున్నాడు. "వేదాంతరీత్యా స్పష్టమై, తార్కికముగా సిద్ధించినదై, వివేకమునకుకూడ వివేకమైన యీ యాత్మయే సూర్యచంద్రాదులకుకూడ ప్రకాశము నిచ్చువాడు" అని స్పష్టముగా వ్యక్తమగుచున్నది. కావుననే యీ ప్రకాశము ననుసరించి యన్నియు ప్రకాశించుచున్నవి. "తమేవ భాన్త మనుభాతి సర్వం" యని మృత్యు దేవత చెప్పుచున్నాడు.

ప్రతి హైందవకర్మలలోను, పవిత్రమై మతసంబంధమైన యుత్సవ ములలోను నీ మంత్రమును చదువుటచే, నీ మంత్రముయొక్క ప్రాముఖ్య మును తెలిసికొనుటయే గాక, యిందులో మాటలచే చెప్పలేనిది, గంభీరమై స్వయంవ్యక్తమైనది, యగు ధ్వని యున్నదని తోచుట సంభవించుచున్నది. ప్రధానమగు పది యుపనిషత్తులలో చేరినటువంటి మరి రెండుపనిషత్తులలో కూడ నీ శ్లోకము పునరుక్తమగుటవలన, దీని ప్రాముఖ్యము మఱింత దృఢ పడుచున్నది. మాండూక్యోపనిషత్తు 11-2-10 శ్వేతాశ్వతరోపనిషత్తు VL 14 లోని మంత్రమున్నది. భగవద్గీతలోకూడ (అధ్యాయము 15. శ్లో. 6.) యిదే పదములలో కాకపోయినను కొంచెము భిన్నపదములలో "ఆత్మ సమస్త ప్రకాశమునకు కారణమను" భావము సూచింపబడినది.

15 శ్లో॥ విద్యమానమైన ప్రకాశమున కంతటికిని యాత్మ యెట్లు మూలసూత్రమగుచున్నదో చెప్పబడినది. సమస్తమైన ప్రకాశక పదార్థముల చేతను యాత్మ ప్రకాశింపబడదనియు, యాత్మప్రకాశముచేతనే నివి యన్నియు ప్రకాశింప గలుగుచున్నవనియు తాత్పర్యము.

---

# షష్ఠవల్లి

## అధ్యాత్మయోగమార్గము మరికొంత విపులీకరింప బడుచున్నది.

శ్లో॥ ఊర్ధ్వమూలోఽవాక్శాఖ ఏషోఽశ్వత్థః సనాతనః।
తదేవ శుక్రం తద్బ్రహ్మ తదేవామృత ముచ్యతే।
తస్మిన్ లోకాః శ్రితాః సర్వే।
తదు నాత్యేతి కశ్చన॥ ఏతద్వైతత్ ॥ ౧ ॥

ఇది యూర్ధ్వమూలము అధఃశాఖలు గల యశ్వత్థవృక్షము. ఇది పవిత్రమైనది. ఇదియే బ్రహ్మ. ఇదియే యమృతమనికూడా చెప్పబడు చున్నది. దీనియందే సమస్త లోకములు నాధారపడియున్నవి. ఎవ్వడును దీనిని దాటిపోలేదు. ఇదియే అది.

ఎవరికైనా లేశమాత్రము సంస్కృతజ్ఞానము కలిగినను వారీ మంత్ర మునకు శ్రీ శంకరులు రచించిన వ్యాఖ్యానమును చదువవలసినదిగా సలహా నిచ్చుచున్నాము. ఇది యొక "యానందఘుటిక" ఈ మంత్రమునందలి గంభీరమైన ధ్వనిభావముల సౌందర్యమును, సుమనోహర సుస్పష్ట కావ్య సాహిత్యశైలియు మహా తత్త్వవేత్తయగు శ్రీ శంకరులనుగూడ యాకర్షించి నట్లు తోచుచున్నది.

మల్లెపూవుయొక్క మనోహరమైన తావి మన వైపునకు కొట్టుకొని వచ్చినయెడల వెంటనే యా మల్లెపొద మనకు ప్రత్యక్షమగుటయే కాక దాని వేళ్లుకూడ మన మనస్సునకు గోచరమగుచున్నవి. అట్లే శ్రుతి యీ నామరూపాత్మక జగత్తుయొక్క పైపై దృశ్యములకు వెనుకనున్న 'తల్లి వేరు'ను ఊహించదలచినది. కావున యిట్లు కనబడుచు, యనుభవింప బడుచున్న కార్యములకు కనబడని కారణమును సూచించుటకుగాను

యిచట శ్రుతి సత్యమునుండి వెలువడిన విశ్వమును యశ్వత్థవృక్షముతో పోల్చుచున్నది. భగవానుడగు శ్రీ వ్యాసమహర్షి తన యుత్తమ కావ్యమైన భగవద్గీతలోని పదునేనవ యధ్యాయములో యిదే యశ్వత్థవృక్షమును మూడు శ్లోకములలో వర్ణించెనని జ్ఞాపకముంచుకొనుట యప్రస్తుతము కాదు.

శ్రీశంకరులు తన వ్యాఖ్యానములో నీ సంసార మశ్వత్థవృక్షముతో నెందుకు పోల్చబడినదో తగిన కారణముకూడ నిచ్చియున్నారు. సంస్కృతములో 'వృశ్చనాత్ - వృక్షః' యనగా నఱుకబడునది యని యర్థము.

అశ్వత్థవృక్షమువలె విశాలముగా వ్యాపించి దృఢమైన మొదలు కలదై యెక్కువకాలము జీవించు చెట్టు సామాన్యముగా నందఱకు తెలిసినది మఱి యొకటి లేదు. అందువలననే నానాత్వము కలిగిన యీ ప్రపంచముతో పోల్చుటకు మరియొక చెట్టు తగినది లేదని శ్రుతికూడ తలచియుండ వచ్చును. సాధారణముగా డనముకొఱకు చవుకబజారువ్యాఖ్యానములను వ్రాయువారు పదముయొక్క వాచ్యార్థమునే తీసికొని యీ సంసారమను చెట్టుకు వేరు పైభాగమున నున్నదనియు, కొమ్మలు క్రింద వ్రేలాడుచున్న వనియు వివరించుచున్నారు. ఇది మిక్కిలి యసంగతమైనది. పండితులు శ్రుతివాక్యములను తప్పుగా చదివిన దాని ప్రకారము నపమార్గమును చూపు కళాకారులు రంగులచే నట్లే చెట్టును తలక్రిందుగా చిత్రించుచున్నారు. ఇది చాల యసంబద్ధమైనది. శ్రుతివాక్యములుకూడ నీ యశ్వత్థవృక్షమును 'శిరసాననము' వేయించలేవు. ఇట్టి యపార్థము కలుగునని శ్రీశంకరులవారు ముందుగా సూచించియేయున్నారు.

ఊర్ధ్వమూలం—తల్లివేరు పైభాగమున నున్నది. ఇచట 'ఊర్ధ్వ' యను పదమునకు రేఖాగణితప్రకారము "పైని" యను నర్థము కాదు. "గౌరవింపదగినది" యను నర్థములో నిది యుపయోగింపబడినది. ఆ సంసార వృక్షముయొక్క బహుభాగములలో మూలము చాలా ముఖ్యమైనది, పవిత్రమైనది కావున "ఊర్ధ్వ" యనబడుచున్నది. ఈ సంసార వృక్షముయొక్క మూలము ఆ విష్ణుపదమునుండి (తద్విష్ణోః పరమం పదం)

లేక విశ్వవ్యాపియగు పరమాత్మనుండి తన యాహారమును పీల్చి తన వృక్షమునకు నిచ్చుచున్నది.

ఈ యశ్వత్థవృక్షమునే యీ సంసారమునకు ప్రాతినిధ్యము వహించుటకుగాను శ్రుతి గ్రహించుటలో మరియొక కారణమున్నది. అశ్వత్థ యను పదమును పదచ్ఛేదము చేసిన అ+శ్వ+త్థ యని విడదీయవచ్చును. సంస్కృతములో శ్వ యనగా రేపు. (కావున రేపు లేనిది యని యర్థమగుచున్నది) ఎల్లప్పుడు మరణము, నాశనముతో కూడిన యనిత్య పదార్థములు గల ప్రపంచమును 'సంసారము' యను పదముచే సూచించుచున్నది. నశించు స్వభావము గల ప్రపంచమునకు 'అశ్వత్థ' యను పదముకంటె ప్రయోజనసూచకమైన పదము మరియొకటి లేదు. ఈ ప్రశస్తమైన కవిత్వమును, వేదాంతమును ప్రశంసాపాత్రము చేయుటకు తగిన కారణములను మన మెంత ప్రయత్నము చేసి కనుగొనినప్పటికిని మన హైందవసోదరులు తమ పక్షపాతబుద్ధిచే దానిని సరిగా నర్థముచేసికొనుటకు కష్టపడుచున్నారు. అంతేగాక యీ యుపనిషద్విషయము అంత సుగమములును కావు. ఈ సందర్భములో నట్టివారికి చిన్మయానంద యిచట మరియొక యుదాహరణ నిచ్చుటకు ప్రయత్నము చేయుచున్నాడు. మీ చరిత్రపుస్తకములలో రాజ వంశములయొక్క వంశపరంపర చెప్పుటకు వ్రాయు పట్టికను (geneology chart) చూచియుందురు. ఒక్కొక్కటి యొక మహాత్మునితో ప్రారంభించి యతని పుత్ర పౌత్ర ప్రపౌత్రులతో శాఖోపశాఖలుగా వ్యాపించుచు పోవుచుండును. ఈ ముద్రితపట్టికలు ఊర్ధ్వమూలముగా కనబడుటలేదా! ఇంగ్లీషుభాషలో కూడ దీనిని వంశవృక్షమనియే పిలుతురు. కవితావాసన లేని నవీనచారిత్రకులుకూడ కవితాభావముతో వంశవృక్షమని పేరిడగా యానాటి యుపనిషదృషులు వ్రాసినదానిని సహానుభూతితో కాకున్న వివేచనాబుద్ధితోనైన నర్థముచేసికొని సందేహమును తీర్చికొనగూడదా! యథార్థములో సంసారమను నీ యశ్వత్థవృక్షమునకు మూలము, ఆ పరమసత్యమనియు, ఆ పరమసత్యమునుండియే తనకు పుష్టినిచ్చు నాహారమును గ్రహించుచున్నదనియు, నీ యుపనిషత్తు చెప్పదలచినది. వృక్షము గావున నఱుకబడినది, యనగా వివేకమను గొడ్డలితో నీ

సంసారమను వృక్షము సఱుకబడి పూర్తిగా తొలగింపబడుచున్నది. (గీత. అ 15. శ్లో - 3)

శ్లో॥ యదిదం కిం చ జగత్సర్వం ప్రాణ ఏజతి నిఃసృతం ।
మహద్భయం వజ్రముద్యతం య ఏతద్విదురమృతాస్తే భవన్తి ॥ 2 ॥

ఈ సమస్త విశ్వము బ్రహ్మనుండి యుద్భవించినది. ఆ బ్రహ్మలోనే స్పందించుచున్నది. ఈ బ్రహ్మము వజ్రమును ధరించిన ప్రభువువలె మిక్కిలి భయంకరమైనది. దీనిని యెవరు తెలిసికొనుచున్నారో వా రమరత్వమును పొందుచున్నారు.

పూర్వమంత్రములో వివరింపబడిన యభిప్రాయమే యిచట మరికొంత స్పష్టముగాను వైజ్ఞానికభాషలోను వివరింపబడినది. బహుశః తానిచ్చిన యశ్వత్థవృక్ష సాదృశ్యములో వివరణ లెక్కువగా నుండుటచేత విద్యార్థి తికమకపడి "సంపూర్ణ సంసారవృక్షము పరమాత్మయే మూలముగా గలద"ను ముఖ్యవిషయమును గమనించడేమో యని యిచట శ్రుతి తలచియుండవచ్చును.

ప్రాణ - దీనిని ప్రథమావిభక్తిగాగాని, సప్తమీవిభక్తిగాగాని చెప్పకొన వచ్చును. "సమస్త ప్రపంచము బ్రహ్మనుండి పుట్టి ప్రాణముసందు చలించుచున్నది" యని సప్తమీ విభక్తిలోగాని 'ప్రాణే సతి-ప్రాణముండగ సమస్తప్రపంచము నతనిలోనుండి పుట్టి యతనిలోనే స్పందించుచున్నది" యని సతిసప్తమీచే ప్రథమావిభక్తిలోగాని యర్థము చెప్పకొనవచ్చును. ఇచట 'ప్రాణ' యనగా బ్రహ్మ. ఆ శాశ్వతసత్యమే యీ నామరూపాత్మక మైన ప్రపంచమునకు కారణము. ఈ కనబడు ప్రపంచ మందులోనుండి యావిర్భవించి కాలాంతమున నందులోనె లయమగుచున్నది.

ఏజతి - స్పందించుచున్నది. సృష్టియు, సృష్టింపబడిన ప్రపంచము కూడ యాత్మలోని "శక్త్యణువులు" యని భారతీయ వేదాంతమతము.

ఈ భౌతికప్రపంచము శాశ్వతస్పందనలో నతివేగముగా చలించు శక్తి పరమాణువులచే గూర్పబడినదియే యని పాశ్చాత్యదేశములోని నవీన వైజ్ఞానికులుకూడ యాప్రాచీన భారతీయుల నిర్ణయమునకే వచ్చియున్నారు. ఒక యణువును విభజించగా నది నిశ్చలకేంద్రక్లిబాణువులను (naotrons) నతివేగముగ చుట్టుచున్న విద్యుదణువులు (electrons) ప్రాణువులచే (protons) కూర్పబడినదని భౌతికవైజ్ఞానికులు కనుగొనిరి. ఒక మూల తత్త్వములో (element) ఊర్జాణువుయొక్క (energy particle) వైద్యుతణుస్పందనములయొక్క నిరంతరాయుత్వమును (frequency) పరివర్తన చేయగలిగినయెడల ఒక మూలకమును (element) నింకొక మూలకముగా మార్చవచ్చును. అణువులు కేవల ఊర్జాణుస్పందనమే యైన యెడల, మరియు పదార్థము వ్యూహాణువుల (molecules) యొక్క సమూహమే యైనయెడల నపుడా పదార్థము కేవలము ఊర్జాణుస్పందనము (Energy vibration) మాత్రమే యని చెప్పవచ్చును.

'సృష్టిశక్తి స్పందనము గలది లేక చలించునది' కావున యచలమై స్పందనరహితమైన ఆ పరిపూర్ణతత్త్వమునందే యట్టి స్పందన జరుగగలవని యీ మంత్రములోని వాక్యమున కర్థము. ఇట్టి యీ యర్థము నిపుడు నవీన హైందవుడు సులభముగా నర్థముచేసికొనగలడని తలచెదను.

నిరంతర చలనమే మనకు ఒక రూపముయొక్క భ్రమను కలిగించును. కాని యీ మార్పులు కలుగుటకు భ్రమణమున కొక స్థిరమైన యాధారము లేక కేంద్రముండవలెను. అగరువత్తిని వెలిగించి ఒకే కేంద్రమునుండి దానిని గిరగిర త్రిప్పినయెడల నది బంగారుచక్రముయొక్క యాకారమును పొందినట్లు మనము చూడగలము. ఆ వెలిగించిన యగరు వత్తి కొనయొక్క నిరంతర చలనమున్ననే యీ బంగారుచక్రమున కస్తిత్వము కలదు. ఆ విధముగానే స్థిరమైన కేంద్రపరిమితి యాధారముగా గల చలనము ఆ పరిపూర్ణశక్తిద్వారా పదార్థములతోను ప్రాణులతోను నిండిన యీ విషయప్రపంచమును మన కందించుచున్నది.

ఇటీవలనే కనిపెట్టబడినదనుకొను నీ యభిప్రాయము వేదకాలము లోని యార్యులకు నర్వసాధారణమైనదిగా నుండియుండవచ్చును. లేకున్న

శ్రుతి ప్రాణములో సమస్తప్రపంచము స్పందించుచున్నదని చెప్పుటతోనే తృప్తిపడి యుండదు. ఇంకను వివరించియేయుండును.

మహద్భయం - (మిక్కిలి భయంకరమైనది) ఈ విశ్వములో అస్తవ్యస్తముగా నడచున దేదియు లేదు. ప్రకృతి క్రమబద్ధముగానే నడచును. గ్రహతారాదులయొక్క గతినికూడ నొక దివ్యశాసనము పాలించుచున్నది. ఆ ప్రకృతి యా శాసనమును స్థిరముగా ననుసరించుచున్నది. తన వెనుక నొక శాసనకర్తయగు పాలకుడున్నట్లు ప్రతివిషయము ఒక దృఢ శాసనబద్ధమయ్యే నడచునట్లు తేచును. ఈ అభిప్రాయమునే శ్రుతి యిట్లు వివరించుచున్నది. "తనవెనుక యజమాని కొరడా పట్టుకొని నిలబడి యున్నట్లు యీ నామరూపాత్మకమైన జగత్తు సదా స్థిరమై ప్రతికార్యమును నతిశ్రద్ధతో చేయుచున్నది."

కొంతమంది బౌద్ధమతవాదులు భావించి పలించునట్లు సమస్తసృష్టికి కారణభూతమైనది కేవల మొక జడమైన "అభావము" కాదనియు, శుద్ధ జ్ఞానతత్త్వమైన యొక మహచ్ఛక్తియే 'అది' యనియు నీ మంత్రార్థము సూచించుచున్నది. ఇట్టి జగత్కారణుని, జగదాధారుని యా బ్రహ్మను యెవడు తెలిసికొనుచున్నాడో వాడు అమృతత్త్వమును పొందుచున్నాడు.

శ్లో ॥ భయాదస్యాగ్నిస్తపతి భయాత్తపతి సూర్యః ।
భయాదిన్ద్రశ్చ వాయుశ్చ మృత్యుర్ధావతి పంచమః
॥ 3 ॥

అతని భయమువలననే అగ్ని మండుచున్నది, సూర్యుడు ప్రకాశించుచున్నాడు, అతని భయమువలననే ఇంద్రుడు, వాయువు, అయిదవవాడైన మృత్యువుకూడ స్వకార్యములను నెఱవేర్చుచున్నారు.

తనను వశముచేసికొని, పాలించి, శాసించుటకు, ఆ పరమసత్యమే గాని లేనట్లైన యీ ప్రకృతిలో నిట్టి క్రమబద్ధమైన శాస్త్రీయమైన స్థైర్యమే యుండియుండదు. ఆ యతిశయిత సత్పదార్థమే లేనట్లైన, మన కీనాడు

విజ్ఞానగ్రంథములే కాదు, ప్రాణికోటికూడా నుండుటయే సంభవించి యుండదు. ఉదాహరణకు అగ్నియే తన స్వభావమునుండి విరామము పొందిన దనుకొనుడు. అప్పుడు పొయ్యిమీద పెట్టిన పాలు యెంతసేపు కాచుకొనియుండినను వేడి యెక్కువ సరిగదా మరింత చల్లబడియే యుండును. అట్లే గ్రహములు తమతమ యిచ్చవచ్చినట్లుగా నాకాశములో సంచరించిన భూమిపై నేయొక్క జీవియు, సరియైన, తిన్ననైన జీవితమును గడపలేకపోవచ్చును. ఈనాడు యవకతవక యైన యేర్పాట్లు గల యీ దురదృష్టపు ప్రపంచములో జరుగు విమానపతనములు, రయిలుబళ్ళు ఢీ కొనుటలు, మోటారుప్రమాదములవలె నాగ్రహ తారాదులుకూడ నొకదానితో నొకటి ఢీకొనియుండును. కాని యట్లున్నను ప్రమాదములులేవు సరికదా, మీదు మిక్కిలి యే ఒడుదుడుకులు లేకుండ ప్రశాంతముగా సంపూర్ణ క్రమ పద్ధతిలో నీ విశ్వము నడచుచున్నది. ఇంద్రాగ్ని వాయు సూర్యులును, మృత్యువును నొకే సామూహికోత్సాహముతో పనిజేయుచున్నారు.

"ప్రకృతి యీ శాశ్వత శాసనమునకు భయముతో సర్వదా లొంగి యనుసరించుచున్నది" అను నీ భావము ఈ పదములలో గాకపోయినను, వేఱువిధముగా తైత్తరీయోపనిషత్తులో చెప్పబడినది. తైత్తరీయోప నిషత్తు—శ్లో॥ భీషాఽస్మాద్వాతఃపవతే భీషోదేతిసూర్యః భీషాఽస్మాదగ్ని శ్చేన్ద్రశ్చ మృత్యుర్ధావతిపంచమ ఇతి ॥

పంచమః - అయిదవవాడు ఇంద్రాగ్నివాయుసూర్యుల తరువాత మృత్యువు యని చెప్పబడుటచే సహజముగానే యాతడు క్రమసంఖ్యలో నయిదవవాడగుచున్నాడు.

1-3 శ్లో ॥ ప్రపంచమునకు ప్రసిద్ధమైన యశ్వత్థవృక్షముతోడి సాదృశ్యము. అదృశ్యముగానుండి యీ ప్రపంచమునకు పుష్టినిచ్చి రక్షించు బ్రహ్మయే 'తల్లివేరు'.

శ్లో ॥ ఇహ చేదశకద్బోద్ధుం ప్రాక్శరీరస్య విస్రసః ।
తతః సర్గేషు లోకేషు శరీరత్వాయ కల్పతే ॥ ४ ॥

ఈ జీవితములోనే మరణమునకు ముందుగా బ్రహ్మను తెలిసికొను వాడు సంసారబంధమునుండి విముక్తుడగుచున్నాడు. ఆ రీతిగా జీవితములో నా బ్రహ్మను తెలిసికొనలేనియెడల నీ సృష్టమైన ప్రపంచములలో దేహధారియై జన్మింపవలసివచ్చును.

అజ్ఞానము జ్ఞానముచేతనే నశించును. జ్ఞానాజ్ఞానములు రెండును నొకే స్థలములో, నొకే సమయములో నుండజాలవు. ప్రకాశముచే నంధ కారము నశించునట్లు జ్ఞానముచే నజ్ఞానము నశించుచున్నది.

ఆత్మైక్యజ్ఞానము లేకపోవుటచేతనే మనకీ దేహ మనో బుద్ధ్యాదులతోడి యైక్యము కలుగుచున్నది. తత్ఫలితముగా పరిమితులు బాధలు గల యహంకారప్రధాన జీవితము ప్రారంభమగుచున్నది.

మానవుడుగా జన్మించిన సాధకునకు, ఆ యపరిమిత పరిపూర్ణ యాత్మ తత్త్వముతోడి యైక్యమును తెలిసికొనుటకంటె యుజ్జ్వలమై పవిత్రమైన సాధన మరియొకటి లేదు.

ఆత్మైక్యము ననుభవించువాడు పరిపూర్ణ శాశ్వతపదమును పొందు చున్నాడు. ఇట్లే యాత్మతత్త్వమును పూర్తిగా తెలిసికొనినవానికి జనన మరణరూప దుఃఖము లుండవు. స్వప్నములో తనను చంపవచ్చు పులిని కాల్చుటకు మేలుకొనినతరువాత నొకడు తుపాకివద్దకు పరుగెత్త నక్కరలేదుగదా? స్వప్నములో గుఱ్ఱపుస్వారి చేసినవాడు స్వప్నాంతమున నా యశ్వమును నీరు త్రాగించనక్కరలేదుకదా! అట్లే యహంకారముతో కూడిన బాధలనెడు స్వప్నములనుండి యాత్మజ్ఞానముచేత మేలుకొనిన దివ్యమానవుడు జనన మరణరూప సంసారడోలికలయం దూగులాడడు. ఊగులాడనక్కరలేదు.

ఒక వ్యక్తి తన జీవితకాలములోనే బ్రహ్మను తెలిసికొనలేనియెడల నతడు మరణానంతరము పరిమితమై, యనిత్యరూపమైన నీ జగత్తులో మఱల జన్మింపవలసివచ్చును. ఇది నిజమే! సర్వజగత్కారణమైన యాత్మతత్త్వముతో తనయొక్క యైక్యమును తెలిసికొనినపుడే యా జీవునకు దేహ మనో బుద్ధ్యాదులతో గల యైక్యభావ మంతమగుచున్నది.

ఆత్మైక్యమును ఆత్మీయముగా తెలిసికొననియెడల నీ జీవుడు మరణ సమయములో 'నేను-నావి' యను భావమును నీ దేహములో వదలి కొంత కాలము 'భావ'రూపములో నుండి పిమ్మట తా నెన్నుకొనిన దేహములో ప్రవేశించి యుండు నీ యహంకారము నభివృద్ధిపఱచుకొనుచున్నాడు.

హృదయపూర్వకముగా సాధనల చేయగోరు సాధకులకు 'నెచట చేరిన మరల జన్మ లేదో' నట్టి యున్నతమై, శాశ్వతమైన యాత్మతత్త్వమును తెలిసికొనుము''ని యిచట శ్రుతి ప్రోత్సహించుచున్నది. ఈ పరమగమ్యమే పరిణామ మనెడి పోరాటములో పరమవిజయము. తార్కికముగాను, నిర్ణయాత్మకముగాను తన పరిణామమునకు తొందరపడుటకు తగిన మానసిక పరికరములతో సృష్టింపబడిన జీవి ప్రపంచములో మానవుడొక్కడే. ఇట్లు పరిణామ పరాకాష్ఠ నందుకొనుటకు త్వరపడగల జీవి మానవునికన్న సృష్టిలో మరియొకటి లేదు.

శ్లో॥ యథాదర్శే తథాత్మని యథాస్వప్నే తథా పితృలోకే।
యథాప్సు పరీవ దదృశే తథాగన్ధర్వలోకే ఛ్ఛాయా
తపయోరివ బ్రహ్మలోకే ॥ ౫ ॥

అద్దమునందువలె ప్రతివ్యక్తియొక్క యంతరంగములోను, బ్రహ్మ స్పష్టముగా ప్రతిబింబించుచున్నాడు. స్వప్నమందువలెనే పితృలోకమందును, జలమందువలెనె గంధర్వలోకమందును, వెలుగు నీడలయందు వలెనె బ్రహ్మలోకమునందును ఆ బ్రహ్మ వ్యక్తమగుచున్నాడు.

మన యథార్థతత్త్వమును తెలిసికొనుటయే మన జీవితమందలి మహత్తరసిద్ధి యని పూర్వమంత్రమందు తెలిసికొంటిమి. ఇపుడీ మంత్రములో మృత్యుదేవత తన శిష్యుడైన నచికేతునకు, ఇతర జీవితములో సంభవించుట కవకాశము గల యాత్మజ్ఞానముకన్న మానవజీవితములో గలుగు ఆత్మజ్ఞాన మెంతయో పవిత్రమైనదని వివరించుటకు ప్రయత్నించుచున్నాడు.

మానవులుగా మనము చేతనావస్థలో జీవించుచున్నాము. ఇంద్రియ మనో బుద్ధులద్వారా మన కనేక రకములైన యనుభూతులు బాహ్యప్రపంచ మునుగూర్చి యేర్పడుచున్నవి. నిద్ర యనెడి ప్రపంచమందలి మన యనుభూతులు జాగ్రదవస్థలోని ప్రపంచానుభూతులతో సమానము గావు. అట్లే వివిధ చైతన్యలోకములలోను మనకు గలుగు ననుభూతులలో భేద ముండును. ఇట్లే పితృలోకమునందుండు వ్యక్తికి మనో బుద్ధి పరికరము లున్నవి గాని భౌతికదేహము లేదు. అందువలన నక్కడి సూక్ష్మశరీరము పొందు ననుభూతులు, యిక్కడ మన యనుభూతులకంటె భిన్నమై యుండుట సహజమేకదా! దేహమునకు ప్రత్యేకమైన కోరికలు, సంతోషములు, దుఃఖములు, నున్నవనుట మన యనుభవము చెప్పనేచెప్పుచున్నదిగదా! ఇదేవిధముగ గంధర్వలోకమందలి యనుభూతులు, హిరణ్యగర్భ లోక బ్రహ్మలోకమని పిలువబడు చైతన్యస్థితిలోని యనుభూతులును, యితర ప్రపంచానుభూతులకంటె తప్పక భిన్నము కావలసియున్నవి. ఇక సాధకునకు వివిధములలోను వివిధమైన యనుభూతులు కలుగుచున్నవి. ఆ యను భూతుల తారతమ్యపద్ధతిలో నా పరబ్రహ్మ జ్ఞానమును పొందు మార్గములను శ్రుతి వివరించి స్పష్టతను చేకూర్చుచున్నది.

యథాదర్శే - అద్దమునందువలె - మానవుడు మర్త్యజీవితమును గడుపుచు నీ ప్రపంచమునందే కొన్ని ముఖ్యకర్మలవలన నా సంపూర్ణ సత్య మును నవగతము చేసికొనుచున్నాడు. సాధకుడు మనో బుద్ధి క్షేత్రముల నధిగ మించి సహజముగానే యాత్మతో ముఖాముఖిని కలుసుకొనుచున్నాడు. ఈ స్థితిలో ప్రతి విద్యార్థికి ముఖ్యమగు సందేహ మొకటి పొడముచున్నది. మనో బుద్ధుల నధిగమించిన తరువాత మన జీవితకేంద్రమగు సద్దానిని ముఖాముఖి నెదుర్కొనుటకు అహంభావ మెట్లుండును? ఈ ప్రశ్న తెలి వైనది, తార్కికమైనది, సరియైనది, సూటియైనది. ఈ ప్రశ్నకు సమా ధానమే యతి సులభముగా నద్దమందు ప్రతిబింబమును చూచుకొనుటతో పోల్చి వివరింపబడినది.

మిత్రులారా! అద్దమును చూచుకొనుట మీకందరికి యలవాటైనదే గదా! స్వయముగా క్షురకర్మ చేసికొను నీ రోజులలో నొక్కనాడు యద్దము

చూడకుండ గడపదుకదా! కాని మీరు మీ ప్రతిబింబమును నర్థముచేసి కొనిన యాకీణమును విశ్లేషించి యుండబోరు. ఈ సాధువు కొంత సహాయ పడుటకు ప్రయత్నించనిండు!

కొంతకాలము మీరు అద్దముముందు నిలుపబడియున్నా రను కొనుడు. మీరు మీ ప్రతిబింబమును చూచుకొని తెలిసికొనునదేమి? ఉదాహరణకు, మీరు క్షౌరము చేసికొనవలసినదని తెలిసిన దనుకొనుడు. మీరు మంగలికత్తిని ప్రతిబింబముపైన పెట్టెదరా లేక మీ ముఖముననా? అనగా నద్దములోని ప్రతిబింబమును చూచుటవలన మిమ్ములనే మీరు తెలిసికొను చున్నారు గాని ప్రతిబింబమును కాదు.

ఇట్లే యుజ్జ్వలమైన ధ్యానోపసాన సమయములో మనో బుద్ధుల నధిగమించినపుడు, వైయక్తిక యహంకారము తన పరిమితులనుండి తొంగి చూచి శాశ్వతమైన యా యాత్మను ముఖాముఖిని చూచుచున్నది. అనగా పరిణతి పొందిన యహంకార మను జీవాత్మ నిత్యసత్యమగు జ్ఞాన రూపమును ప్రతిబింబింపజేయుచున్నది. ఆ ప్రతిబింబమును తెలిసి కొనుట యను పద్ధతిలో లీనమై యా జీవాత్మ యాత్మతో యేకీభావ మును పొందుచున్నది. ప్రతిబింబమును చూచుటవలన దానినే గాక దానికి కారణభూతమైన మన ముఖమునే సరిగా నర్థము చేసికొను చున్నాము.

మన మీ విషయమును స్పష్టముగ దానిలో నిమిడియున్న భావముతో సహ యర్థముచేసికొనినచో వివిధ స్థితులలో విషయస్పష్టీకరణముకొఱకు వాడిన యుపమానముల నన్నిటిని పోల్చుకొనగలము. ఈ యుపమానముల సహాయముతో సాధకుడు వివిధ చేతనావస్థలయందున్ను తన యాత్మయొక్క స్వరూపమును తెలుసుకొనగలుగుచున్నాడు.

ఈ యజ్ఞములోని చర్చలను నెడతెగక వినువారు "కలలోవలెనె పితృ లోకమందును. జలములోవలె గంధర్వలోకమందును" అను నుపమాన ములను తప్పక యర్థముచేసికొనగలరు. చిన్మయానందుడు పునరుక్తదోష మును చేయదలచుటలేదు.

ఛాయాతపయోరివ—వెలుగునీడలవలె. తెల్లని కాగితముపై నల్లని యక్షరములవలె బ్రహ్మలోకములో సుస్పష్టముగా యాత్మజ్ఞానము వ్యక్త మగునని శ్రుతి చెప్పుచున్నది. అనగా మహత్తత్వ ప్రపంచములో బ్రహ్మ జ్ఞానము స్పష్టతమమగునని శ్రుతి నొక్కిచెప్పుచున్నదని తాత్పర్యము. కర్మో పాసనల రెండింటి సంయోగముచే కలుగు నాధ్యాత్మయోగము నభ్యసించు నహంకారయుత జీవుల కుద్దేశింపబడినదైన యీ చైతన్యస్థితి పొందుటకు కష్టతమమైనదని మనము మఱువరాదు. శాస్త్రప్రకారము బ్రహ్మలోకమును చేరిన వ్యక్తి యచట సూక్ష్మాతిసూక్ష్మములైన యానందముల ననుభవించి, సృష్టికర్త మార్గదర్శకుడు కాగా చివరకు ఆత దమృతత్వమును పొందు చున్నాడు. అంతట నీ చైతన్యావస్థ ప్రళయసమయమందు పరమాత్మలో లీనమగును. వేదాంతగ్రంథములో నీపద్ధతిచే నాత్మజ్ఞానమును పొందు విధాన మునకు "క్రమముక్తి" అని పేరున్నది.

1-5. శ్లో॥ ఆత్మజ్ఞానముచే సత్యోస్నత స్థితిని పొందుట. ఆత్మతత్త్వము తానే కాబట్టి యీ జ్ఞానమును నెట్టి సమయమందైనను పొందవచ్చును. కాని యిచటనే యీ దేహములో నుండగానె దానిని తెలిసికొనుట దాని యొక్క పరిపూర్ణస్థితిని పొందుట.

శ్లో॥ ఇన్ద్రియాణాం పృథగ్భావ ముదయా స్తమయౌ చ యత్ ।
పృథక్ ఉత్పద్యమానానాం మత్వా ధీరో న శోచతి ॥ ౬ ॥

తన మనో బుద్ధీంద్రియములు ఆత్మకంటె యితరమైనవని తెలిసికొని వానియొక్క వృద్ధి క్షయములను స్పష్టముగా గ్రహించినపుడా జ్ఞాని దుఃఖములను పొందడు.

పూర్వమంత్రమును చదివి బాగుగా నర్థముచేసికొనినవాడు "ఈ జీవితమందే యాత్మజ్ఞానమును పొందుట కెందులకు ప్రయత్నింపవలెను ?" అని ప్రశ్న వేయ మొదలిడుచున్నాడు. జ్ఞానేంద్రియములు సత్యమై, శాశ్వత

మైన యీ పరమాత్మనుండి వేరైనవి. ఈ మనో బుద్ధీంద్రియములు కారణ జన్యములగుటచేత కారణాతీతమైన యాత్మకంటె నవి భిన్నములగుచున్నవి. మరియు నీ జ్ఞానేంద్రియములును ఒకదానితో నొకటి పోలికలు గలవి కావు సరికదా, పంచభూతములనుండి యుద్భవించిన వగుటచేత వాని మూల కారణములలోనే నవి పృథగ్భావము కలవగుచున్నవి.

అవి పృథక్కారణములు కలిగి పరస్పరము భిన్నములగుటయే గాక విషయప్రపంచములో విభిన్నమార్గగాములుగా కూడ నగుచున్నవి. మరియు వివిధ విషయములయందు సంబంధములు కలిగినపుడు కూడ నవి ప్రతిక్షణమును భిన్నత్వము వహించుచునే యున్నవి. మానవుడు జాగ్రదవస్థలో నున్నపుడు యవి పూర్ణమైన గ్రహణశక్తి గలిగి తమ ప్రత్యేక కార్యములందు పనిచేయుగలిగినవిగా నగుచున్నవి. కాని మనము సుషుప్తిలో నున్నపుడు ఆ మనో బుద్ధీంద్రియములు తమ శక్తి నుపసంహరించుకొని జడమైయుండి మనము జాగృతి పొందిన తక్షణమునవే నవి చైతన్యము వహించి పైకురుకును.

వివేచనాబుద్ధి గల మానవుడు, ఆత్మయొక్క శాశ్వతత్వమును, ఇంద్రియములయొక్క చంచలత్వమును తెలిసికొనినవాడై యిక మరి దుఃఖములను పొందడు. తాను జీవాత్మయే యనుకొని, తనను తానపార్థము చేసికొని, మానసిక సంకల్పములకు, బుద్ధిలోని నిర్ణయములకు, యింద్రియముల యభిరుచులకు లొంగిపోవుటవలననే ఈ జీవితము దుఃఖదాయక మగుచున్నది. ఈ పరిమితులను దాటుటకు సంపూర్ణ స్వాతంత్ర్యము యొక్క జ్ఞానము కలిగిన మనము సుఖదుఃఖాతీతమైన యీ శాశ్వతానంద స్థితిని పొందగలము. ఇంతకు పూర్వము రెండు మంత్రములలో సూచించిన విధముగా నొక మానవుడు యీ జన్మలోనే సునిశిత జ్ఞానమార్గముద్వారా నాత్మను తెలిసికొనినయెడల, దుఃఖవాసన లేని పరిపూర్ణమైన యానంద యుతపదవిని పొందునని శ్రుతి యిచ్చట నిశ్చయముగా చెప్పుచున్నది. మన వేదశాస్త్ర గ్రంథములలో 'నాత్మజ్ఞాని శాశ్వతముగా దుఃఖవిముక్తుడగును' నను వాక్యము పలుసార్లుచ్చరింపబడినది. మరియొక యుపనిషత్తు "ఆత్మ జ్ఞాని దుఃఖసముద్రమును దాటుచున్నాడని" చెప్పుచున్నది.

శ్లో॥ ఇంద్రియేభ్యః పరం మనో మనసః సత్త్వముత్తమం ।
సత్త్వాదధి మహానాత్మా మహతోఽవ్యక్తముత్తమం

శ్లో॥ అవ్యక్తాత్తు పరఃపురుషో వ్యాపకోఽలిఙ్గ ఏవ చ
యం జ్ఞాత్వా ముచ్యతే జన్తురమృతత్వం చ గచ్ఛతి
॥ ౮ ॥

౭. ఇంద్రియములకంటె పరమైనది మనస్సు. దానికంటె పరమైనది బుద్ధి. ఆ బుద్ధికన్న పరమైనది మహత్తత్త్వము. దానికంటె సూక్ష్మమైనది అవ్యక్తము.

౮. అవ్యక్తముకంటె పరమైనవాడు పురుషుడు. అతడు సర్వవ్యాపి. లింగరహితుడు. అట్టి యతనిని తెలిసికొనినవాడు సంసారము నుండి విముక్తుడై యమృతత్వమును పొందుచున్నాడు.

ఈ రెండు మంత్రములకు నిదివఱకే మూడవ వల్లిలో విపులముగా వ్యాఖ్యానము చేసియుండుటచే నీ రెండును నొకేచోట సంగ్రహింపబడినవి. ఇచట మరల స్థూలతమమైన యింద్రియములనుండి సూక్ష్మతమమైన ఆత్మను చేర్చు నంతరమార్గము మఱల వివరింపబడినది. సూక్ష్మాతి సూక్ష్మమైన యా పురుషతత్త్వము యిచట సర్వవ్యాపిగను, లింగరహిత ముగను వర్ణితమైనది. సూక్ష్మాతిసూక్ష్మమైన దగుటచేత యిదివరకు చెప్పి నట్లుగా నది తప్పక సర్వవ్యాపకత్వమును కలిగినదై యుండవలెను.

తర్కశాస్త్రములో 'లింగము' అను పదము ప్రత్యేకమైన యర్థము కలిగియున్నను వేదాంతచర్చలలో నది తన భావమును వ్యక్తపఱచు ప్రత్యేక సాంకేతిక పదముగ వాడబడుచున్నది. చాలవఱకు మన జ్ఞానము అనుమాన ప్రమాణముమీదనే యాధారపడియున్నది. ఇంద్రియగోచరము కాని యించుమించు సమస్త వస్తుజ్ఞానమును నీ యనుమాన ప్రమాణము చేతనే తెలిసికొనుచున్నాము. దూరమున నున్న పర్వతశ్రేణిలో

దట్టమైన పొగను చూడగనే మనకు నచట నగ్ని యున్నదను అనుమితి - ఊహ కలుగుచున్నది. ఏ చిహ్నమును (పొగను) చూచి మనమట్టి నిర్ణయమునకు వచ్చుచున్నామో, దానిని తర్కశాస్త్ర పారిభాషిక పదములలో 'లింగము' అందురు. ఈ పదముయొక్క యిట్టి నిర్దిష్టభావమును తెలిసికొనిన శ్రుతి "పురుషతత్త్వము అలింగము" అనునపుడు ఆ పదములోని యర్థమును మనము సులభముగా గ్రహించగలుగుచున్నాము. ఆ యాత్మను సూటిగా సూచించి, గ్రహింపజేయునట్టి సంజ్ఞలుండుటకు, ఆత్మకు ప్రత్యేకమైన లక్షణముగాని, గుణములుగాని లేవని యర్థము. కాబట్టి యది "అలింగము."

ఈవిధముగ నాత్మను స్వకీయానుభవముచే నెవడు తెలిసికొనుచున్నాడో, యట్టివాడు సంసారబంధములనుండి విముక్తుడగుటయే గాక శాశ్వతమైన యస్తిత్వమందలి యా యమరత్వస్థితిని పొందుచున్నాడని శ్రుతి నిర్ధారించుచున్నది.

"బ్రహవిద్ బ్రహ్మైవ భవతి" - బ్రహ్మను తెలిసికొనినవాడు బ్రహ్మయే యగుచున్నాడు. అనునది సమస్త శ్రుతులయొక్క నిరంతరమైన ఘోషణ యగుచున్నది.

6-8 శ్లో॥ ఈ యాంతరయాత్రలో గంభీరసారమై, పురుషతత్త్వమగు ఆత్మను చెందుటకుగాను నొక సాధకుడు యింద్రియప్రేరణములను, మనోబుద్ధులను, అవ్యక్తమును దాటిపోవలసియున్నది. యమృతత్వమును పొందుటయే యీ యాంతరయాత్రయొక్క ముగింపు. అదియే విముక్తి.

శ్లో॥ న సన్దృశే తిష్ఠతి రూపమస్య న చక్షుషా పశ్యతి కశ్చనైనం ।
హృదా మనీషా మనసాభిక్లృప్తో య ఏతద్విదురమృతాస్తే భవన్తి ॥ ౯ ॥

ఆతని రూపము ప్రత్యక్షము కాదు. కావున నతనిని యెవడును కంటితో చూడలేడు. వివేచనాబుద్ధిచేత మనస్సును వశపఱచుకొని, నిరంతరధ్యానము చేసిన యీ యాత్మ బయలుపడును. ఎవరైతే యిట్టి బ్రహ్మతత్వమును తెలిసికొనుచున్నారో వా రమృతత్వమును పొందుచున్నారు.

వివిధ మంత్రములలో నిదివరకే యాత్మ యింద్రియ మనో బుద్ధ్యతీతమైనదని శ్రుతి చాలసార్లు చెప్పియున్నది. ఆత్మను గ్రహించి, యనుభవించి, తెలిసికొనుటకీ యింద్రియ మనో బుద్ధిసాధనము లుపయోగపడకపోయిన నజ్ఞాని యగు సాధకుడు శ్రుతులచే ప్రతిజ్ఞాతమైన యీ దివ్యజీవితమును గడపుటకు నిరుత్సాహియై, యది యసంభవమని తలచి తన సమస్త ప్రయత్నములనుండి విరమించుచున్నాడు. అందువలననే యీ మంత్రము, ధ్యానముద్వారా మనో బుద్ధులను దాటి యీ సత్యప్రపంచమును జేరుటకు చివరి సోపానమును సూచించుచున్నది.

న చక్షుషా పశ్యతి - నేత్రములతో చూడలేడు. ఇచట నేత్రేంద్రియము సమస్త ఇంద్రియములకు ఉపలక్షణముగా నున్నది. భగవంతుడు తన్ను జూచుటకు భక్తుల చర్మ చక్షువుల నెదుటబడడని స్పష్టముగా, సూటిగా వివరించుటకు సాహసించుచున్నది. ఇంద్రియగోచరములగు సమస్తజ్ఞానము ఎంత దివ్యమై తృప్తినిచ్చెడిదని తోచినప్పటికిని, అవన్నియు మానవ మనోభ్రాంతి కల్పితములనియే చెప్పనగును.

మానవుని బుద్ధిలో నవ్యక్తముగా నున్న యీ సహజ జ్ఞానమొకటియే సాధకునకు ఆత్మను తెలిసికొను మార్గము. శ్రుతి ప్రకారము, బుద్ధి మానవ మనోవృత్తులను వశపఱచుకొని మహనీయమైన హృదయకుహరమునందు వసించుచున్నది. మనస్సు అణగియున్ననే బుద్ధి ప్రశాంతిని పొందగలదు. ఇట్టి బుద్ధి నూతనజాతమైన సహజజ్ఞానమును సృష్టించి తాను నశించి అంతర్ధానమగుచున్నది. ఇట్టి సహజజ్ఞానముచేతనే సాధకుడు ఆత్మను తెలిసికొనుచున్నాడు.

సహజజ్ఞాన మనగా జ్ఞానమును తెలిసికొను శక్తియేగాని వేఱొకటి కాదు. మరియు నాత్మను తెలిసికొనుట యనగా తనను తాను తెలుసుకొనుటయే.

ఎవడైతే యీ జీవితములోనే తనలోనుండు నాత్మ శుద్ధచైతన్యముకంటె వేరైనది కాదని తెలిసికొనుచున్నాడో అతడు జనన మరణ రూపమైన సుడిగుండము నుండి బయటపడి యమృతత్వమును పొందుచున్నాడు.

శ్లో॥ యదాపంచావతిష్ఠన్తే జ్ఞానాని మనసా సహ ।
బుద్ధిశ్చ న విచేష్టతే తామాహుః పరమాం గతిం
॥ ౧౦ ॥

ఈ పంచ జ్ఞానేంద్రియములు మనో బుద్ధులతో కూడ విశ్రాంతి పొందిన యట్టి స్థితి అత్యున్నతమైనది. దానినే వారు "పరమగతి" అనుచున్నారు.

ప్రత్యగాత్మ పరమాత్మలో నైక్యముగునపుడు 'సమాధి' అనబడు ఆ శాశ్వత, దివ్యానుభవ స్థితి, బాష వర్ణించుటకు, బుద్ధి ఊహించుటకు తగినంత సుస్పష్టమయిన రీతిని యిచట చెప్పబడినది. ఈ పంచ జ్ఞానేంద్రియములను సంపూర్ణముగా వశపఱచుకొనునపుడు సహజముగానే మనస్సు మూడువంతులు ముప్పాతిక నిష్క్రియముగుచున్నది. మనస్సు ఆతురత పొందుటకు మిగిలిన ఆ పాతిక భాగమేదనగా సంచిత పూర్వస్మృతులు, స్వయంసృష్టమైన ఊహలు అని చెప్పవచ్చును. ఈ అతురతలుకూడ అణచివేయబడిన, మంత్రములో చెప్పిన రీతిగా నింద్రియములతో కూడిన మనస్సు విశ్రాంతిచెందిన స్థితిని పొందుచున్నది. ఇట్టి స్థితిని పొందుటకూడ చాలదు. ఏలన ఇట్టి స్థితిలోకూడ తన అభిప్రాయములతోను అదర్శముల తోను అరాటపడుచు నీరసించినప్పటికిని బుద్ధి యనునది యుండనే యున్నది. కావున ఇంద్రియ మనో బుద్ధులు విశ్రాంతిచెందిన స్థితిని మనము పొందవలెనని ఉపనిషత్తు కోరుచున్నది ఆ పరిపూర్ణ పరమసత్యమైన అత్మానుభవమును ఈ స్థితి కలిగియున్నదని శ్రుతి నిర్వచించుచున్నది.

సాధారణముగా నింద్రియ మనో బుద్ధులు విశ్రాంతి చెందిన స్థితిని మన మప్పుడప్పు డనుభవించుచునే యున్నాముగదా! సుషుప్త్యవస్థలో నీ ఇంద్రియ మనో బుద్ధులయొక్క భయంకరనృత్యములు ముగియుటచే నట్టి

యవస్థను పొందునపుడా పరమసత్యమును ననుభవించుచునే యున్నాము గదా! ఐతే శ్రుతి "ఈ సుషుప్త్యవస్థనే యా పరమసత్యమని చెప్పుచు మనలను జీవితములో నిద్రాబద్ధకస్థులనుగా చేయదలచినదా?" అని నాస్తికు లడుగుచున్నారు.

ఇందులో ప్రవేశము లేనివాడెవడైన ప్రస్తుతము చర్చించుచున్న యీ మంత్రమును పైపైగా చదివి అర్థముచేసికొనిన మరికొన్ని యిట్టి ప్రశ్న లుద్భవింపగలవు. ముందుగా మృత్యుదేవత జేసిన చర్చలను సంపూర్ణముగా గ్రహించి యర్థముచేసికొననియెడల నీ మంత్రమునకు అస్తిత్వమే ఉండదు. కావున యీ మంత్రమును ముఖ్యముగా పూర్వమంత్రపు పరిజ్ఞానముతో ప్రత్యేకించి చదువవలెను.

ఆత్మైక్యస్థితికి, సుషుప్త్యవస్థకును చాలా భేదమున్నది. సమాధిస్థితిని సాధారణముగా నిద్రావస్థకు చేరువగా నున్నదని చెప్పుచున్నాము. చైతన్యము యొక్క స్థూలరూపములో మన ముండుటవలన ఆ ఉపనిషద్ఋషులు మనకు వాడుకయైన పరిమితజ్ఞానములోనే నీ యతిశయానుభవమును బోధించుచున్నారు. మానవానుభవములో సమాధిస్థితికి దగ్గరగా నుండి యింద్రియ మనో బుద్ధులు విశ్రాంతిచెందిన స్థితి యీ సుషుప్తియేగదా! ఈ సుషుప్తికంటె సమాధిస్థితికి పోల్చదగిన యుపమానము మరియొకటి లేదని వారు భావించిరి. ఇట్టి సామాన్య సాదృశ్యమును వివరించువరకే యీ ఉపమాన మిచట చెప్పబడినది. ఆ దివ్యచైతన్యావస్థలో, ఆ శాశ్వతజ్ఞాన మును చెందుట కాతడు మనో బుద్ధ్యాదులను నధిగమించియున్నాడు. కాని యీ సుషుప్త్యవస్థలో నున్న మానవుడు మనో బుద్ధ్యాదులు జడమైనందువలన తాత్కాలికముగా నచేతనాంధకారస్థితిని పొందుచున్నట్లు భావించుకొను చున్నాడు. కావున నా సుషుప్త్యవస్థలో నాత డజ్ఞానాంధకారములో మునిగి యున్న, యీ సమాధ్యవస్థలో నాతడు జ్ఞానసూర్యప్రకాశములో తేలి యాడు చున్నాడు. వ్యతిరేకమగు సుషుప్త్యవస్థలో మానవుడు బానిసయైన, యను కూల సమాధ్యవస్థలో నతడు తనకు తానే యజమాని యగుచున్నాడు. ఈ రెండు మంత్రముల మధ్య వివరణము చేయకుండగనే యీ భావము సూచింపబడెను.

అతి గభీరమైన లోతులకు ప్రవేశించి, ఆత్మైక్యమును పొందుటకు సాధనమగుచు, మనో బుద్ధ్యాదులను ప్రజ్వరిల్లజేయు నా సహజజ్ఞానాగ్నిని తాను తనలో రగుల్కొలుపుటకు సాధకుడైన యొకడు యెట్టి మార్గము ననుసరించవలెను? ఈ ప్రశ్నకు ప్రత్యుత్తరము రాబోవు మంత్రములో నున్నది.

శ్లో॥ తాం యోగమితి మన్యన్తే స్థిరామిన్ద్రియధారణాం ।
అప్రమత్తస్తదా భవతి యోగో హి ప్రభవాప్యయౌ
॥ ౧౧ ॥

చిత్తవృత్తులను నిరోధించుటయే యోగము. కావున నట్టి యోగము నార్జించిన యోగి యింద్రియములను సంపూర్ణముగా వశపఱచుకొని మానసికబాధలనుండి విముక్తిచెంది అమరుడగును.

సహజజ్ఞానము నభివృద్ధిపఱచుకొని, దానిద్వారా యాత్మను తెలిసికొని, యమరత్వమును పొందు సాధనమే యిచట వేదాంతవిద్యార్థికొఱకు వివరింపబడినది. యోగమనగా యాత్మాభివృద్ధి లేదా ఆత్మసిద్ధి. దీనిని యథార్థముగా సాధన చేసినయెడల యా పరమలక్ష్యమగు దైవత్వమును పొందగలడని. యోగికి యోగము వాగ్దత్తము చేయుచున్నది. ఆచరణయోగ్యమైన యోగమనగా నింద్రియములను సంపూర్ణముగా వశపఱచుకొనుటయే యని యుపనిషత్తు యుచ్చైఃస్వరముతో స్పష్టీకరించుచున్నది. ఉన్నతజీవనమును గడుపుటచే కొంతవఱకు నింద్రియనిగ్రహమున కలవాటుపడిన, యతడు యితరులను చూచి వ్యామోహపడిన తన మనస్సు తనను యున్నతజీవనము వైపు యాకర్షించుచున్నప్పటికిని, సాధకుడు తనలో నుండు పశుత్వము పూర్తిగా బయటపడి పరారియగుట కొప్పుకొనడు. తన కాలమునందలి ధర్మముల ననుసరించి నొక వ్యక్తికి పూర్తిగా నాత్మనిగ్రహము కలుగుటకీ యోగము నిస్సంశయముగా సహాయముచేయునదియై యున్నది.

ఈనాటి విశ్వవిద్యాలయములనుండి వెలువడిన మన విద్యార్థులలో మన తాతముత్తాతలయందలి వాటికన్న పశుత్వముయొక్క మోతాదు

హెచ్చుగా నున్నదనిన, నేటి విద్యావంతుల వర్గములో వ్యతిరేక భావనలు కలిగించు వశుత్వమే దానికి కారణమని చెప్పవచ్చును. ఈ కాలతత్త్వములో జన్మించిన యమాయకులగు మన బాలబాలికలు నేటి భోగాధిక్యములచే వ్యామోహితులైన, యది వారి తప్పుగాదు. మనయొక్క కార్యాకార్య ములచేత నేటి వాతావరణమును విషపూరితము చేయుచున్నాము గావున మన పిల్లలను నిందించుకొనుటకు బదులు మనలనే మనము గర్హించు కొనుట మంచిది. సత్యమును మభ్యపఱచి, నీతి ధర్మములను నిరాకరించి, దురహంకారముతో మనము తెలిసి చేసిన కర్మలే యీనాటి కాలతత్త్వమును నాదర్శశిఖరములనుండి నిరుత్సాహపు పాతాళపు లోతులకు పడునట్లు చేయుచున్నది.

అదృష్టవశాత్తు వేదకాలములో వారు ధర్మమును దృఢముగా పాలించిరి. ఆనాటి కాలతత్త్వము సనాతనధర్మముతో కూడినది. ఈనాటివరకు వచ్చిన వారి వంశీయులు, ఉత్తమమైన జాతీయజీవనము కలవారై, యున్నతమై, క్రమబద్ధమైన సాంఘికపద్ధతుల ననుసరించువారై, యీ సనాతన ధర్మ తత్త్వమును రక్షించుటకు ప్రయత్నించుచున్నారు. ఈ నాటికిని దారిద్ర్య ముతోను, యాకలి మంటలతోను, జరామరణములతోను వేలాది భారతీయ పల్లీయులు వ్యక్తిగతముగా యాంతరికమైన యానందము ననుభవించు చున్నారనగా అన్నికాలములకు నిలిచి యనుగ్రహరూపమైన మన పూర్వీకుల సనాతన ధర్మ జీవనమే యభినందింపదగిన కారణము. న్యూయార్కు మహానగరములో నపరిమిత భోగముల ననుభవించు అమెరికాసోదరునికంటె మన భారతీయపల్లెలలో నివసించు పేదరైతు యెక్కువ యాంతరంగికమైన యానందమును నెప్పటికైన యనుభవించువాడని దృఢముగా చెప్ప వచ్చును. కామ ప్రవృత్తినుండి జనించు నింద్రియానందముకంటె యాత్మతృప్తియే యెక్కువ శాంతి నిచ్చునది.

ఇట్టి విషయాంతర ప్రవేశమును క్షమింపగోరుచున్నాము. తాను జీవించియున్న కాలతత్త్వముమీదనే, తన యింద్రియనిగ్రహముచే కలిగిన యానందము ననుభవించుట నాధారపడియున్నది. ఆత్మాభివృద్ధి పొందు స్థితికి కొంచెము ముందరగానే సాధకు డాత్మనిగ్రహముద్వారా యింద్రియ

ములు నధికాధికముగ నణపగలుగుచున్నాడు. సంపూర్ణముగా నాత్మతత్త్వమును గ్రహించిన క్షణములోనే యాతడు పూర్తిగా నింద్రియముల నణచివేయ గలుగుచున్నాడు. "పరం దృష్ట్వా నివర్తతే."

వేదాంత విద్యార్థికి యాత్మసంయమనముతో యోగము ప్రారంభించి పరిణమించుచున్నది. అట్టి యోగికి యింద్రియనిగ్రహముద్వారా కలుగు నేకాగ్రతయొక్క యత్యంతాభివృద్ధియే మహా తపస్సు. (ఏకాగ్ర్యం పరమం తపః.)

ఇంద్రియనిగ్రహ మనగా నింద్రియములను నింద్రియవిషయముల నుండి బలవంతముగ మరలించుట యను వ్యతిరేకభావము కాదు. ఇది సగము పోరాటముమాత్రమే. ఏకాగ్ర ధ్యానముద్వారా మనము ఆత్మయందు దృఢముగా స్థిరపడిననే యాత్మసంయమనములో నత్యంత విజయమును పొందగలుగుచున్నాము. ఇట్టి యాత్మపరిణామస్థితిలో యోగి తన మనస్సును విషయలోలత్వము పొందకుండ నుండుటకై జాగ్రత్తపడుచున్నాడు.

వేదాంతవిద్యార్థి తానార్జించిన మనోనిగ్రహాదులను పూర్తిగా రక్షించుకొనిననేగాని యింద్రియాదు లేనాటికైనను తన చేయి జారి వ్యామోహములలో పడునని పూర్తిగా తెలిసికొనుచున్నాడు. ముఖ్యముగా నలవాటుపడిన విషయప్రపంచములో జీవించునపుడే యోగి మరికొంచెము విశేషముగా జాగ్రత్తపడుచున్నాడు. కావున యోగమున నత్యున్నతస్థితి పొంది, యాత్మవిజయము నార్జించి యభివృద్ధిస్థితి పొందినప్పటికిని యోగి యగువాడొక్క క్షణ మేమరినట్లయిన యాతడు విషయములలో నెట్లు తగుల్కొనిపోవుచున్నాడో శ్రుతి ప్రేమతో హెచ్చరించుచున్నది. జ్ఞానమార్గము 'అసిధారవలె' ప్రమాదకరమైనను త్వరలో సిద్ధిని పొందించును. కావున యొకసారి జాఱుపాటు కలిగిన చాలును, సర్వనాశనమగుచున్నది.

శ్లో॥ నైవవాచా న మనసా ప్రాప్తుం శక్యో న చక్షుషా।
అస్తీతి బ్రువతోఽన్యత్ర కథం తదుపలభ్యతే ॥ ౧౨ ॥

ఆత్మ చక్షురింద్రియ మనో వాగతీతమైనది. కావున దాని యస్తిత్వమునుగూర్చి "అది ఉన్నది" యని చెప్పువారినుండి గాక యాత్మ యెట్లు లభ్యమగును ?

జీవితయంత్రమును త్రిప్పునది యాత్మయే. ఒక డ్రైవరు తాను నడపు మోటారును తనమీదికే తాను పోనిచ్చుకోలేడుగదా! అట్లే యింద్రియ మనో బుద్ధులు జీవితకేంద్రముచే నడుపబడునవై, గ్రహించి, యనుభవించి, తెలిసికొనునట్టి యితర విషయములవలె, యాత్మవైపు తిరిగి దానిని తెలిసికొనలేవు !

కాబట్టి మృత్యుదేవత తన ప్రియశిష్యునికి "ఆత్మను తెలిసికొనుటకు సిద్ధఋషుల జీవితచిహ్నములవలె నున్న వేదరూపమైన శబ్దప్రమాణముకంటె మరియొక ప్రమాణము లేదని" యుచ్చైఃస్వరముతో ఘోషించుచున్నాడు. ఆత్మను సర్వభూతాంతరాత్మగా నిర్ధారణచేయుటకు నీ వెన్ని వాదములు చేసినప్పటికిని, యాత్మాభావమును స్థాపించుటకుకూడ, వివేకముతో సమర్థించగల తగినన్ని యాదిభౌతిక వాదములున్నవి. ఇట్టి భౌతిక వాదముల నెన్ని చేసినను సాధకుడా పరమసత్యమును తెలిసికొనలేడు. కాబట్టి ధైర్యముతోను, గురువాక్యములందలి విశ్వాసముతోను, శ్రద్ధతోను తన యాత్రను ప్రారంభింపవలెను.

శ్లో ॥ అస్తీత్యేవోపలబ్ధవ్య స్తత్త్వభావేన చోభయోః ।
అస్తీత్యేవోపలబ్ధస్య తత్త్వభావః ప్రసీదతి ॥ ౧౩ ॥

ఆత్మ 'అస్తి' యనగా 'ఉన్నది' యని యొకడు తొలుత తెలిసికొనవలెను. తరువాత దాని తత్త్వభావమును తెలిసికొనవలెను. ఆ రెండింటిలో నెవడు "అది ఉన్నది" యని తెలిసికొనుచున్నాడో యాతనికి ఆత్మయొక్క తత్త్వభావము స్వయముగా వ్యక్తమగును.

ఇందులో ప్రవేశము లేనివానికీ శ్లోక మొక సమస్యవలె తోచినను, శాస్త్రజ్ఞానము కలిగినవాని కిది సూటియైన వివరణయే యగుచున్నది. ఈ యజ్ఞశాలలో గూడిన మీరందరు సంపూర్ణ వేదాంతులు గావున మీకందరికీ

శ్లోకము స్వయంవ్యక్త మగుసని యీ సాధువు నమ్ముచున్నాడు. ఈ యాత్మచైతన్యము అభివ్యక్తప్రపంచముద్వారాగానీ లేక నిర్గుణమై సర్వ సాక్షియైన శుద్ధచైతన్యముద్వారాగాని తెలిసికొనవచ్చును. 'ఓం' యను దానిని సగుణమైన సత్యచిహ్నముగా భావించిన హిరణ్యగర్భస్థితియందలి యానందమును పొందుచున్నాడనియు, యా 'ఓం'నే నిర్గుణబ్రహ్మగా భావించిన తానే యా శుద్ధచైతన్యమై సర్వవ్యాపి యగు నాత్మతత్త్వముగా నగుచున్నాడనియు, మృత్యుదేవత నచికేతునితో వివరించి చెప్పుచున్నాడు. ఈ శ్లోకవ్యాఖ్యానములో శ్రీశంకరులవారు పూర్తిగా గ్రంథములోని యీ భావమునే వ్యక్తపఱచిరి. హృషీకేశములోని యోగవేదాంతారణ్య విశ్వ విద్యాలయపు ప్రచురణలనుగాని, రామకృష్ణమఠ ప్రచురణలనుగాని యను సరించినయెడల, వారు శ్రీశంకరభాష్యములో కనిపెట్టిన యనావశ్యక దోష ములను గూర్చి తెలిసికొనియేయుందురు. కాని వారిచే సూచింపబడిన యీ సవరణలను మన మంగీకరించుటకు కష్టమగుచున్నది.

ఈ మంత్రముపై వ్యాఖ్యానించుచున్న శ్రీశంకరులు 'ఓం' ను వ్యక్త ప్రపంచములో సగుణారాధన చేయుటకన్న నిర్గుణమై, యవ్యక్తమైన, యా పరమసత్యముసందు ధ్యానించుటయే యుత్తమమని భావించునట్లు శ్రుతి యిచట సాధకుని హెచ్చరించుచున్నది. పైగ్రంథము ననుసరించి చూడగా శ్రీశంకరులవారి వ్యాఖ్యానమే సూటిగా సంగ్రహముగా తోచుచున్నది. కావున యా పరమసత్యమును కొంతమంది భారతీయ నైయాయికులు, బౌద్ధ వేదాంతులు సూచించిన విధముగా 'నాస్తి' యని గాక 'అస్తి' యనియే ధ్యానించవలసినదని శ్రుతి హెచ్చరించుచున్నది.

ఆత్మను తత్త్వసారమైన సత్పదార్థముగా నెవడు తెలిసికొను చున్నాడో వాడే నిజముగా నాత్మజ్ఞానము గలవాడు. ఇట్లు ఆత్మను శుద్ధ అస్తిత్వముగాను, సర్వజీవకారణముగను, తెలిసికొనిన విజయి యగు సాధకుడు దానితో నైక్యమును పొందుచున్నాడు. దానియొక్క 'తత్త్వ భావము' అను పద మా శుద్ధసత్తునుండి సగుణత్వమును వేఱుపరచుట కుపయోగింపబడినది. సగుణత్వము మనకు బాగుగా తెలిసియేయున్నది. కాని ఇక్కడ అది సగుణమై నియమితమై ఉన్నట్లు తెలిసికొనుచున్నాము

"అదియే తత్త్వభావము" అను స్వకీయమయిన సత్యజ్ఞానమే ఆ పరిపూర్ణతత్త్వముయొక్క స్వభావమైయున్నది. ఆత్మజ్ఞానము కలిగిన క్షణములోని స్థితి "కేవల అస్తిత్వభావము" అని ఉపనిషత్తు ప్రకటించు చున్నది. ఇట్టి జ్ఞానస్థితిని పొందినవాడు జీవిత పరమగమ్యమును చేడుకొని ప్రాతమనిషివలె గాక భూమిమీద దేవమానవునివలె ధ్యానమునుండి పైకి లేచుచున్నాడు.

**9—13.** ఈ ఆత్మజ్ఞానము బాహ్యవిషయమయినది గాక అంతర విషయమును కనుగొనునదియై యున్నది. విషయములనుండి మనస్సును ఇంద్రియములను నుపసంహరించుకొనిన వివేచన యణగిపోవుచున్నది. అట్టి క్షణములో సర్వశక్తులు ప్రశాంతముగా అణచివేయబడినవై లోనికి మళలి మనలను ఆత్మను కనుగొన చేయకలుగుచున్నవి.

శ్లో॥ యదా సర్వే ప్రముచ్యన్తే కామా యేఽస్య హృది
శ్రితాః ।
అథ మర్త్యోఽమృతో భవత్యత్ర బ్రహ్మ సమశ్నుతే
॥ ౧౪ ॥

మనస్సులోని సమస్త కోరికలను నశింపజేసిన మానవుడు అమరత్వ మును పొంది యీజన్మలోనే బ్రహ్మైక్యమును పొందుచున్నాడు.

ఇట్టి నిష్కామస్థితియే 'కైవల్యస్థితి' లేక 'ప్రకాశస్థితి' అని చెప్పబడు చున్నది. అట్టి స్థితిని దేహధారియైన వ్యక్తి ఈ జీవితములోనే పొందగలుగు చున్నాడు. ఇచట అద్వైతుల హక్కైన జీవన్ముక్తిని మానవుడు తన దివ్యత్వములో నిచటనే పొందగలడని శ్రుతి ధ్రువపఱచుచున్నది. మనము కేనోపనిషత్తు చర్చలలో "ఆత్మను కనుగొనినప్పటికి దేహాంతమునందే సిద్ధి కలుగుచున్నదనియు," "సిద్ధి పొందిన వెంటనే దేహము పడిపోవు చున్నదనియు" చెప్పు నొక మతమువారిని గూర్చి సూచించితిమి. ఈ వర్గమువారు దీనిని 'విదేహ ముక్తి' అని అనుచున్నారు. (దేహాంతము ననే ముక్తి)

శ్లో॥ యదా సర్వే ప్రభిద్యన్తే హృదయస్యేహ గ్రన్థయః।
అథ మర్త్యోఽమృతో భవత్యేతావదనుశాసనం ॥౧౫॥

ఈ జీవితములోనే హృదయగ్రంథులను ఛేదించిన మానవుడు అమరత్వమును పొందునని సమస్త వేదాంతమును బోధించుచున్నది.

ఈ శ్లోకము ముందరి శ్లోకముతోకూడ చదువదగినది. హృదయ గ్రంథి—ఇది వేదాంతుల పారిభాషిక పదము. 'ఆత్మ విస్మృతి' అను అవిద్యయే సమస్త భ్రాంతులకు మాయలకు కారణమని వారు చెప్పుచున్నారు. చీకటిలో మనము త్రాడును చూచి పామని భ్రమించుచున్నాము. ఇచట సర్పభావము త్రాడుయొక్క యథార్థజ్ఞానమును తెలిసికొనకపోవుట వలన కలిగినది. అట్టి సర్పభావము కలిగినవెనుక పరుసగా దాని పొడవు, పడగ, ఎత్తు, లావు అన్నియు నా అభావసర్పమునందు కల్పించుచున్నాము. అట్లే మానవుడు తన యథార్థతత్త్వమునందలి యజ్ఞానముచేత తన యాత్మ తత్త్వమును తెలిసికొననివాడై ఆతురతపడి, కోరికలను కల్పించుకొని, ఆ కోరికలను విషయప్రపంచములో పూర్తిచేసుకొనుటకు ప్రయత్నములను, అనగా కర్మలను చేయుచున్నాడు. ఈవిధముగా నాధ్యాత్మికస్థితిలో అవిద్య గాను, మానసిక స్థితిలో కోరికలుగాను ఉండి, ఆ యజ్ఞానమే బాహ్యవిషయ ప్రపంచములో కర్మలుగా రూపొందుచున్నది. ప్రతి కర్మకు నొక ప్రతిఫల మున్నది. దానిని యనుభవించుటకు జీవాత్మ మృత్యువనెడు వెనుకద్వారము ద్వారా తప్పించుకొని మఱల క్రొత్త రూపములలో జన్మ యనెడు సింహ ద్వారమున ప్రవేశించుచున్నాడు.

అవిద్యా, కామ, కర్మలనే, వేదాంతమతములో హృదయగ్రంథు లని పిలుచుచున్నారు.

మానవుడీ గ్రంథులను ఈ జీవితములోనే ఛేదించిన అతని యజ్ఞానము నశించుచున్నది. అజ్ఞానము జ్ఞానముచేతనే నశించుచున్నది. గాన జ్ఞానో దయముతో హృదయగ్రంథులు ఛేదింపబడుచున్నవి. ఈ జ్ఞానముచేతనే (జ్ఞానేనైవతు కైవల్యం) కైవల్యమును పొందకలుగుచున్నాడు.

శ్రీ శంకరులు, వారి అనుచరులును, అనుసరించిన జీవన్ముక్తిపద్ధతిని శ్రుతి ఇచట తిరిగి ధ్రువపఱచుచున్నది. అస్థిమాంసయుతమైన యీ దేహములో నివసించుచుండగనే తన స్వప్రయత్నములచేత నార్జించిన యీ పరిపూర్ణ జ్ఞానము గల మానవుడే భూమిమీద దేవుడు.

14—15. హృదయగ్రంథులు వేరువేరుగా ఛేదించిన తత్త్వాన్వేషి యాత్మ నొక విషయముగా గాక తన సంపూర్ణస్వభావమైనదిగానే యీ ఆత్మతత్త్వమును తిరిగి కనుగొనుచున్నాడు.

శ్లో॥ శతం చైకా చ హృదయస్య నాడ్యస్తాసాం మూర్ధా
నమభి నిఃసృతైకా ।
తయోర్ధ్వమాయన్నమృతత్వమేతి విష్వఙ్ఙన్యా
ఉత్క్రమణే భవన్తి ॥ ౧౬ ॥

హృదయనాడులు నూటయొకటి యున్నవి. అందులో నొకటి నడినెత్తికి పోవుచున్నది. దాని ద్వారా పైకి పోయినవాడే అమృతత్వమును పొందుచున్నాడు. మిగిలినవారు వివిధముగా విభక్తులగుచున్నారు.

యోగమతములో గంభీరమై దృఢమైన పునాది గల ఈ మంత్రము ఈపాటి స్వల్ప వేదాంతజ్ఞానము కలిగిన మీకు అర్థముచేసికొనుట సులభము కాదు. ఈ దేహములో నుండు ఆత్మతత్త్వము మరికొన్ని ఉపనిషత్తులలో, మరింత వివరముగ విశ్లేషింపబడినది. ఈ జ్ఞానమునకు విశేషప్రచారము కలిగియుండుటచేతనే ఇచట మృత్యుదేవత దీనిని యథాలాపముగ సూచించి యుండవలయును. ఈ రాబోవు రెండు మంత్రములు వివరించుటకు ఒకే రోజు ఉన్నదిగావున ఈ ఉపనిషత్తులను గూర్చి విపులముగా చర్చించుటలో మీకెట్టి ప్రయోజనము కలగదని చిన్మయానంద తలచుచున్నాడు. అయినప్పటికిని తొందరలో, దానిని స్పృశించి వదలుదము. దేహములోని అధ్యాత్మిక సూక్ష్మశరీరము, ఎట్టి శస్త్రచికిత్సకుడును కంటితో చూడలేని, కత్తితో కోయలేని, నూటఒక్క సూక్ష్మనాడులు కలిగియున్నవి. వాని

యన్నింటిలో వెన్నెముకద్వారా దాని శిఖరమున చేరి అచటనుండి బ్రహ్మ రంధ్రమును తాకుచున్న సుషుమ్నానాడి ముఖ్యమయినది. అనాది నడినెత్తి యొక్క మార్దవమును మనంతట మనమే తెలిసికొనగలుగుచున్నాము. ముఖ్యముగా చంటిపిల్లలలో నడినెత్తిని (తాలువు) నాడి కొట్టుకొనుట కనుగొనుచున్నాము. మీరు మీ మనస్తత్త్వము ననుసరించి యీ జ్ఞానమార్గము గూర్చి యెట్టి యభిప్రాయము గలవారైనను ఆ పరబ్రహ్మను తెలిసికొన్న జ్ఞానియొక్క జీవాత్మ, మరణ సమయములో ఈ సుషుమ్నానాడిద్వారా పైకి వెడలి, బ్రహ్మలోకమును జేరి, ప్రళయముపరకు నచట ఉండి, తర్వాత ఆత్మజ్ఞానస్థితిని పొందుచున్నది.

శాశ్వతమై సర్వవ్యాపియైన నిర్గుణపరబ్రహ్మతత్త్వమును ఎవడు తెలుసుకొనుచున్నాడో వాడు ఈ జీవితములోనే జీవన్ముక్తిని పొందుచున్నాడు. అట్టి జ్ఞానికి శ్రుతికూడా ప్రాణోత్క్రమణమును నిరాకరించుచున్నది. నతస్య ప్రాణా ఉత్క్రమన్తి) బ్రహ్మను తెలిసికొనుటచేత అతడు బ్రహ్మయే అగుచున్నాడు. అట్టి సంపూర్ణమయిన ముక్తిని "కైవల్యముక్తి" అందురు.

శ్లో॥ అంగుష్ఠమాత్రః పురుషోఽన్తరాత్మా సదా జనానాం
హృదయే సన్నివిష్టః ।
తం స్వాచ్ఛరీరాత్ ప్రవృహేన్ముఞ్జాదివేషీకాం
ధైర్యేణ ।
తం విద్యాచ్ఛుక్రమమృతం తం విద్యాచ్ఛుక్రమ
మృతమితి ॥ ౧౭ ॥

హృదయకుహరమందు నివసించు ఆ అంగుష్ఠమాత్ర పురుషుని మెల్లగా మృదువుగా తామరతూడులోని సూత్రమును తీసినట్లుగా తీయవలెను. వానిని పవిత్రమైనవానిగను అమృతునిగను తెలిసికొనవలెను.

ఇదివరకే మనము పూర్వమంత్రములలో నా పరమసత్యమును హృదయకుహరములో నుండు అంగుష్ఠరూపునిగా తెలిసికొంటిమి. ధ్యాన

మార్గములో తొట్టతొలుత నాలంబనముకొఱకు ఆ ఆత్మను అట్టివానినిగా యనగా, నియమితస్వరూపునిగా వర్ణించితిమి. ఆత్మకు నామరూపములు వర్ణింపబడినను యథార్థములో ఆత్మ రూపరహితమైనది. కాని యీ రూప మిచట సాధకుల మనస్సునకు నేకాగ్రత కలిగించుటకుగాను కల్పితమై యాలంబనమైనది.

దాగుడుమూత లాడు నీ బాహ్యపదార్థావరణలనుండి తప్పించుకొని నిత్యమై సత్యమైన యీ పరమాత్మను, తన హృదయకుహర మధ్యలో నున్న ఆత్మనుగా అనుసంధించి, వివేచనతో, ఆ పరమ దివ్యసత్యమును తెలిసికొన వలసినదని, సూటిగా నచికేతునకు మృత్యుదేవత చెప్పట చాలా యుక్త ముగా నున్నది. ఈ పంచకోశముల కావల ఆత్మ ఉన్నది. ఇక్కడ నీ సాదృశ్యము ఉపనిషత్తుల శైలికి ఆనుగుణ్యమునై స్పష్టముగా నున్నది. వివేచనా ధ్యానముల నభ్యసించుటద్వారా ఈ భ్రాంతికల్పిత దేహాత్మ భావమునుండి ఆ పరిపూర్ణమైన చిత్స్వరూపమును, విడదీయవలసిన దని నచికేతునకు—నచికేతునివంటి యితర సాధకులకు శ్రుతి బోధించు చున్నది.

ఇట్లు ధ్యానసమయములో తనను నెక్కువగా అయాసపఱచుకొన వద్దని తామరతూడులోని సూత్రమును తీయునట్లు అతిమృదువైన పద్ధతి ద్వారా నభ్యసించవలసినదని చెప్పుచున్నది. ఆ తామరతూడే చాలా మృదువైనది అంతకన్న మృదువైనది. దానిలోనిసూత్రము. ఇట్టి నునుపై మృదువైన ఆ సూత్రమును దాని బాహ్యావరణములనుండి సున్నితముగా నేర్పుతో తీయవలయునని చెప్పుచున్నది.

దేహ మనో బుద్ధులను వశపఱచుకొని నడపునట్టి ఆ శుద్ధచైతన్యమే మానవులలోని ఆత్మతత్త్వము. దానిని పవిత్రమైనదానినిగాను, అమృతమైన దానినిగాను, మఱలమఱల చెప్పుటతో ఉపనిషత్తు సమాప్తమగుచున్నది.

కామ క్రోధ లోభాదు లనునటువంటి మాలిన్యములు లేకపోవుటచే ఆతడు అజుడు, నిత్యుడు, సత్యస్వరూపుడు, సర్వవ్యాపి, అభివ్యక్త. ప్రపంచమునకు అకారణకారణు డగుటచే నతడు అమృతుడు.

శ్లో॥ మృత్యుప్రోక్తాం నచికేతోఽథ లబ్ధ్వా విద్యామేతాం
యోగవిద్యాంచ కృత్స్నం।
బ్రహ్మప్రాప్తో విరజోఽభూద్వి మృత్యురన్యోఽప్యేవం
యో విదధ్యాత్మమేవ ॥ ౧౮ ॥

నచికేతుడు మృత్యుదేవత చెప్పిన ఈ జ్ఞానమును యోగపద్ధతిని తెలిసికొని సమస్త మాలిన్యములనుండి మరణమునుండి విముక్తుడై బ్రహ్మైక్యమును పొందుచున్నాడు. అట్లే యితరులు దీని ననుసరించిన ఆత్మజ్ఞానమును పొందుదురు.

(ఈ విధముగా రెండవ అధ్యాయములో షష్ఠివల్లి సమాప్తమైనది)

పూర్వశ్లోకములోని పాదాంతముయొక్క పునరుక్తి చేతను 'ఇతి' అను ప్రత్యయము నుపయోగించియుండుటచేతను ఉపనిషత్తు సమాప్తమైనదని సూచించుచున్నది. కావున నీ మంత్రమును శ్రుతిభగవతి చెప్పినదని మన మనుకొనవచ్చును. నచికేతుడు తన గురువునుండి సంపూర్ణ ఉపనిషత్తును విని ఆత్మపరిపూర్ణత్వమును గలిగించు యోగవిధి జ్ఞానమును పొందిన తరువాత ఆ ఆత్మతత్త్వమును స్వయముగా ననుభవించుటకు ఒక వివిక్త స్థలము చేరి అచట ధ్యానముద్వారా మనో బుద్ధులను పవిత్రముచేయుటకు బ్రహ్మవిద్య నభ్యసించి ఆత్మతత్త్వమును తెలిసికొనెను.

విరజ—(పాపవిముక్తుడు. రజోగుణరహితుడు. అమలినుడు.)

శక్తివంతమైన వివేచనచేతను, మనస్సుయొక్క శిక్షణచేతను విషయములనుండి ఇంద్రియములను మరల్చి వశపఱచుకొనుటయే జ్ఞానసాధన. దీనివలన మనస్సు అహంకార మమకారములనుండి, కామక్రోధముల నుండి, స్వార్థమునుండి విడిపడుచున్నది. అట్టి యా మనస్సు ఒక విధమైన భావముమీదగాని, రూపముమీదగాని స్థిరముగా నిలచిన ఏకాగ్రత అభివృద్ధి అగుచున్నది. ఇట్లు క్రొత్తగా అభివృద్ధిపఱచబడిన శక్తులు ఈ పంచకోశములద్వారా లోపలికి చొచ్చుకొనిపోయి శుద్ధచైతన్యమై, శాశ్వ

తమై, పరిపూర్ణమైన ఆత్మతో ఐక్యమును పొందుటకు నుపయోగపడు చున్నవి.

కావున వేదకాలములో దివ్యాతీతమైన గురువగు మృత్యుదేవత అనుగ్రహముచేత ఒక సాధకుడు ఆత్మను తెలిసికొనెననిన విషయము హఠాత్సంభవమనియు, అన్ని కాలములలో అంతమంది సాధకులకు అట్టి గురువు లభింపదనియు మనలో చాలామందికి తోచవచ్చును. తన చదువరులలో నుండు నీ సంశయమును తీర్చుటకు అట్టి ఆత్మజ్ఞానము పొందిన ప్రతి వ్యక్తియు ముక్తిని పొందుచున్నాడని శ్రుతి యిచట దృఢముగా చెప్పు చున్నది. ఈ నాటికిని ఉపనిషత్తులలో చెప్పబడిన ఆవశ్యకమైన లక్షణములు కలిగియుండి నచికేతునివంటి శ్రద్ధాళువై బ్రహ్మవిద్య నభ్యసించిన సాధకుడు ఆ ఆత్మను తెలిసికొని అత్మైక్యమును పొందుచున్నాడు. అతడే భూమిమీద దేవమానవుడు.

**16-18.** ఈ రెండు శ్లోకములు తరువాతి కాలములో చేర్చబడినవని కొంతమంది నిర్ణయించియున్నారు.

సహ నావవతు । సహనౌ భునక్తు । సహ వీర్యం కరవావహై ।
తేజస్వి నా వధీతమస్తు । మా విద్విషా వహై ।

ఓం శాంతిః శాంతిః । శాంతి ॥

ఆ పరమాత్మ మనలతో కూడనుండి మనలను రక్షించుగాక । ఆ పరమాత్మ మనతో కూడనుండియే మనకు సుఖమును కలిగించుగాక । మన విద్యకు (అధీతిబోధలకు) బలము కలుగునట్లుగా మనము కలసి ప్రయత్నించుదము । మన అధ్యయనము ఆచరణ ప్రచారములు కలుగునది అగుగాక । మనము ద్వేషభావము లేనివారమై ఉందుముగాక ।

ఓం శాంతిః । శాంతి । శాంతిః ॥

ఈ శాంతిపాఠము విద్యాబోధన విద్యాభ్యాస విషయకముగా యానాటి గురు శిష్యులకు గల సామూహికోత్సాహమును, వారికిగల పరస్పర సంబంధమును తెలియజేయుచున్నది. ఈనాటి గురు శిష్యుల సంబంధము నకును, అనాటి వారి సంబంధమునకును యెంతటి భేదమున్నది!

ఈనాడు గురువు యేదో యొక విధముగా తన పనిని ముగించు కొనుటకు చూచుకొనునప్పుడు శిష్యుడు తన హాజరు పడినదా లేదా యనే యాతురతతో తరగతిలోనికి ప్రవేశించును. అట్టి పరిస్థితిలో గురువునకు శిష్యు డొక యనివార్యమగు విసుగు కలిగించు వ్యక్తి. శిష్యునకు గురువు కళాశాలా జీవితమనే పూలసెజ్జలో కంటకమువంటివాడు.

బ్రహ్మవిద్యలోమాత్రము గురుశిష్యుల పరస్పర సహకారము, శ్రద్ధ యనునది లేకున్న యభివృద్ధి కలుగనేరదు. కావుననే "మావిద్విషావహై" యను ప్రత్యేక ప్రార్థన యీ శాంతిపాఠములో చేర్చబడినది. వ్యర్థమై, యడుగడునకు వినాశహేతువులగు నపార్థములకు యనర్థములకు దారి తీయు శ్రుతిమంత్రముల పాఠమందు చవట చప్పిడి వాదనలకు అవకాశమున్నది కావున యీ ప్రార్థన యట్టివానిని వారించి గురుశిష్యులమధ్య పరస్పర సహకారము కలిగియుండుటకై శాంతిపాఠములో చేర్చబడినది.

విద్యాధ్యయన ప్రారంభములోను అంతమందుకూడ యీ శాంతి పాఠము గురుశిష్యులచే ప్రతిదినము పఠింపబడును. ఈనాటికిని వేదాధ్య యనము చేయు చోట్ల యీ పాఠము తప్పనిసరిగా చదువబడుచునే యున్నది.

హరిః ఓం తత్ సత్ ॥

---

PRINTED AT THE B. N. K. PRESS (PRIVATE) LTD., MADRAS-26.

శ్రీ ర స్తు.

# క ఠో ప ని ష త్తు

అనుభూతిప్రకాశ, ఆత్మపురాణ సహిత

కృష్ణయజుర్వేదాంతర్గతము.

శ్రీమచ్ఛంకరభగవత్పాదభాష్యమునను సరించి

శ్రీ కనుపర్తి మార్కండేయశర్మగారిచే

వ్రా యఁ బ డి న

సాంధ్రటీకాతాత్పర్యము.



చె న్న పు రి:

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారిచే

ప్ర క టి త ము.

 [వెల రు. 2—0—0

# ఉపోద్ఘాతము.



వేదములు ఋక్, యజుస్, సామ, అథర్వము లను పేరులతో ౪ అని వ్యవహరింపఁబడుచున్నవి. వేదైకదేశములగు ఉపనిషత్తులు వేదములకు శిరోభూతములగుటచేత వేదాంతములని చెప్పఁబడుచున్నవి. ప్రకృతమయిన ఈకఠోపనిషత్తు యజుర్వేదమునకుసంబంధించినది. యజుర్వేదముమఱల కృష్ణమనియు, శుక్లమనియు రెండుగా విభజింపఁబడియున్నది. కృష్ణ శుక్లాత్మకమగు యజుర్వేదమంతయు కలసి ౮౬ శాఖలని కొందఱున్నూ, ౧౦౧ శాఖలని కొందఱున్నూ తలంచుచున్నారు. ౮౬శాఖలనువారిమతమునందు కృష్ణయజుస్సునకు ౭౧ శాఖలు, శుక్లయజుస్సుకు ౧౫ శాఖలు అనియు, ౧౦౧ శాఖలనువారిమతమునందు కృష్ణయజుర్వేదమునకు ౮౬ శాఖలనియు, శుక్లయజుర్వేదమునకు ౧౫ శాఖలనియు నెఱుంగవలయును. కృష్ణయజుర్వేదముయొక్క శాఖలలో దాదాపు ౨౭ శాఖలయొక్క పేరులు మాత్రమే తెలియవచ్చుచున్నవి. వానిలో చరకశాఖలు ౧౨, మైత్రాయణీయశాఖలు ౭, తైత్తిరీయశాఖలు ౮ మొత్తము ౨౭ శాఖలయొక్క నామములే చరణవ్యూహాది గ్రంథములందు గల్గవు. ప్రకృతమయిన కఠోపనిషత్తు చరకశాఖలయొక్క ౧౨ శాఖలలో నొకటియగు కఠశాఖకు చేరినదని గ్రహించవలయును.

దీనిని కఠోపనిషత్తనియు, కాఠకోపనిషత్తనియు వ్యవహరించెదరు. సుప్రసిద్ధములగు దశోపనిషత్తులలో నీకఠోపనిషత్తు మూఁడవది. ఇందు రెండధ్యాయములుగలవు. ఒక్కొక అధ్యాయమునకు మూఁడేసి వల్లులుచొప్పున మొత్తము ౬ వల్లులుగా గ్రంథము విభక్తము. ముద్రితాముద్రితగ్రంథములందు వల్లులు వేర్వేఱుగ పరిగణింపఁబడియున్నను శ్రీమచ్ఛంకరభగవత్పాదాచార్యులవారి కాఠకోపనిషద్భాష్యమునందు "సంసారకార్యవృక్షావధారణేన తన్మూలస్య బ్రహ్మణః స్వరూపావధారయిషయేయం షష్ఠీ వల్ల్యారభ్యతే" అని చెప్పియుండుటచేత ప్రథమాదిపరిగణనమే భాష్యకారునకు అభిప్రేతమని తెలియవచ్చుచున్నది.

## కఠోపనిషత్తు—భగవద్గీతలు—బ్రహ్మగీతలు.

బ్రహ్మసూత్రములందు ఉపనిషత్తులకు శ్రుతియనియు, భగవద్గీతలకు స్మృతియనియు తఱుచుగ వ్యవహరింపఁబడియున్నది. శ్రుతిప్రతిపాదితమయినవిషయమునే స్మృతియు ప్రతిపాదించునని శాస్త్రజ్ఞుల సిద్ధాంతము. భగవద్గీతయందు ఇతరోపనిషత్తులందు ప్రతిపాదింపఁబడినవిషయము లనేకములు చెప్పఁబడియున్నను కఠోపనిషత్తునందుగలవిషయములు చాల వఱకు సంగ్రహింపఁబడినవి. కొన్ని మంత్రములుకూడ అట్లే భగవద్గీతయందును బ్రహ్మగీతలయందును గైకొనఁబడినవి చూడుఁడు:—

ఇంద్రియేభ్యః పరాహ్యర్థా అర్థేభ్యశ్చ పరం మనః,
మనసస్తు పరాబుద్ధి ర్బుద్ధే రాత్మా మహా న్పరః. కఠ. ౧-౩-౧౦.

ఇంద్రియాణి పరాణ్యాహు రింద్రియేభ్యః పరం మనః,
మనసస్తు పరాబుద్ధి ర్యో బుద్ధేః పరతస్తు సః. భగవద్గీత. ౩-౪-౨.

ఊర్ధ్వమూలోఽవాక్ శాఖ ఏషోఽశ్వత్థస్సనాతనః,
తదేవ శుక్రం తద్బ్రహ్మ తదేవామృతముచ్యతే,
తస్మిన్ లోకాః శ్రితా స్సర్వే తదు నాత్యేతికశ్చన. కఠ. ౨-౩-౧.
ఏతద్వైతత్.

ఊర్ధ్వమూల మధశ్శాఖ మశ్వత్థం ప్రాహు రవ్యయం,
ఛందాంసి యస్య పర్ణాని యస్తం వేద స వేదవిత్. భగవద్గీత. ౧౫-౧.

న జాయతే మ్రియతే వా విపశ్చిన్నాయం కుతశ్చి న్న బభూవ కశ్చిత్,
అజో నిత్య శ్శాశ్వతో ఽయం పురాణో న హన్యతే హన్యమానే శరీరే.
కఠ. ౧-౨-౧౮.

న జాయతే మ్రియతే వా కదాచి
న్నాయం భూత్వా భవితా వా న భూయః,
అజో నిత్య శ్శాశ్వతో ఽయం పురాణో
న హన్యతే హన్యమానే శరీరే. భగవద్గీత. ౨-౨౦.

హంతా చే న్మన్యతే హంతుగ్ం హతశ్చే న్మన్యతే హతం,
ఉభౌ తౌ న విజానీతో నాయం హంతి న హన్యతే. కఠ. ౧-౨-౧౯.

య ఏనం వేత్తి హంతారం యశ్చైనం మన్యతే హతం,
ఉభౌ తౌ న విజానీతః నాయం హంతి న హన్యతే. భగవద్గీత. ౧-౧౯.

ఇట్లనేకమంత్రము లీయుపనిషత్తునుండి భగవద్గీతల యందు పరిగ్రహింపఁబడియున్నవి. గ్రంథవిస్తరభీతిచేత బ్రహ్మగీతలనుండి యుద్ధరింపలేదు.

## కఠోపనిషత్తు—బ్రహ్మసూత్రములు.

ఈయుపనిషన్మంత్రములలో కొన్నిమంత్రములు బ్రహ్మసూత్రములందు విషయవాక్యములుగా పరిగ్రహింపఁబడినవి.

మఱికొన్ని సూత్రార్థవిమర్శయందు ప్రమాణార్థము గైకొనఁబడినవి. వానిని పాఠకులయుపయోగార్థ మిట ప్రదర్శించుచున్నాఁడను:—

౧ మం. యస్య బ్రహ్మచ క్షత్రంచ, కఠ. ౨-౨౦ మంత్రమును,

సూ. అత్తా చరాచరగ్రహణాత్. ౧-౨-౯ సూత్రమునందును,

౨. మం. ఋతం పిబంతౌ ౩-౧ మంత్రమును,

సూ. గుహాం ప్రవిష్టా వాత్మానౌ హి తద్దర్శనాత్. ౧-౨-౧౧ సూత్రము నందును,

౩. మం. ఇంద్రియేభ్యః పరాహ్యర్థాః. ౩-౧౦ మంత్రమును,

సూ. ఆధ్యానాయ ప్రయోజనాత్. ౩ సూత్రమునందును,

౪. మం. మహతః పరమవ్యక్తం. ౩-౧౧ మంత్రమును,

సూ. ఆనుమానిక మప్యేకేషామితిచేన్న శరీరరూపకవిన్యస్త గృహీతే ర్దర్శయతిచ. ౧-౪-౧ సూత్రమునందును,

౫. మం. న తత్ర సూర్యోభాతి, ౫-౧౫ మంత్రమును,

సూ. అనుకృతేస్తస్యచ. ౧-౩-౨౨ సూత్రమునందును,

౬. మం. అంగుష్ఠమాత్రః పురుషః, ౪-౧౨ మంత్రమును,

సూ. శబ్దాదేవ ప్రమితః. ౧-౩-౨౪ సూత్రమునందును,

౭. మం. యదిదం కించ. ౬-౨ మంత్రమును,

సూ. కంపనాత్ ౧-౩-౩౯ సూత్రమునందును,

౮. మం. అశబ్ద మస్పర్శ మరూపమవ్యయం. ౬-౧౫ మంత్రమును,

సూ. వదతీతిచేన్న ప్రాజ్ఞోహి తత్ప్రకరణాత్. ౧-౪-౫

సూ. అరూపవదేవహి తత్ప్రధానత్వాత్. ౩-౨-౫ అను సూత్రములందున్నూ

౯. మం. ౧. సత్వమగ్నిం స్వర్గ్యమధ్యేషి మృత్యో. కఠ. ౧-౧౩;

౨. యే యం ప్రేతే విచికిత్సామనుష్యే ౧-౨౦;

3. అన్యత్ర ధర్మా దన్యత్రాధర్మాత్ ౨-౧౪;
౪. లోకాదిమగ్నింతమువాచ తస్మై ౧-౧౫;
౫. న జాయతే మ్రియతే వా ౨-౧౮;
౬. హంతత ఇదం ప్రవక్ష్యామి ౫-౬;
౭. యోనిమన్యే ప్రపద్యంతే ౫-౭;
౮. స్వప్నాంతం జాగరితాంతం ౪-౪;
౯. యదేవేహ తదముత్ర ౪-౧౦;
౧౦. తం దుర్దర్శం గూఢమనుప్రవిష్టం. ౨-౧౨. అను మంత్రములను,
సూ. త్రయాణా మేవ చైవ ముపన్యాసః ప్రశ్నశ్చ ౧-౪-౬ అనుసూత్రమునందును,
౧౦. మం. ౧. బుద్ధే రాత్మా మహాన్పరః కఠ. 3-౧౦;
౨. మహాంతం విభుమాత్మానం. కఠ. ౨-౨౨. అనుమంత్రములను,
సూ. మహద్వచ్చ. ౧-౪-౭ అనుసూత్రమునందును,
౧౧. మం. బుద్ధింతు సారథిం విద్ధి. కఠ. 3-3 మంత్రమును,
సూ. అంతరావిజ్ఞానమనసీక్రమేణ తల్లింగాదితిచేన్నా విశేషాత్. ౨-3-౧౫ అనుసూత్రమునందును,
౧౨. మం. ఏకస్తథా సర్వభూతాంతరాత్మా. ౫-౧౧ మంత్రమును,
సూ. స్మరంతిచ ౨-3-౪౭ సూత్రమునందును,
౧3. మం. న సాంపరాయః ప్రతిభాతిబాలం. కఠ. ౨-౬ మంత్రమును,
సూ. సంయమనే త్వనుభూయైతరేషా మారోహావరోహౌ తద్గతిదర్శనాత్. 3-౧-౧3 సూత్రమునందును,
౧౪. మం. ౧. య ఏషసుప్తేషు జాగర్తి. ౫-౮;
౨. శతాయుషః పుత్రపౌత్రాన్. ౧-౨3;
3. కామానాం త్వాకామభాజం. ౧-౨౪ మంత్రములను,

సూ. నిర్మాతారం చైకే పుత్రాదయశ్చ. 3-౨-౨ సూత్రమునందును,

౧౫. మం. మనసైవేదమాప్తవ్యం. ౪-౧౧ మంత్రమును,

సూ. అపిచైవ మేకే. 3-౨-౧3 సూత్రమునందును,

౧౬. మం. పరాంచి ఖాని వ్యతృణత్స్వయంభూః. ౪-౧ మంత్రమును,

సూ. అపిచ సంరాధనే ప్రత్యక్షానుమానాభ్యామ్. 3-౨-౨౪ సూత్రము నందును,

౧౭. మం. ౧. సర్వే వేదా యత్పద మామనంతి. కఠ. ౨-౧౫.

౨. మహద్భయం వజ్రముద్యతం ౬-౨ మంత్రములను,

సూ. దర్శయతి చ 3-3-౪ సూత్రమునందును,

౧౮. మం. ౧. ఏష సుప్తేషు భూతేషు. కఠ. 3-౧౨;

౨. యచ్ఛే ద్వాఙ్మనసీ ప్రాజ్ఞః 3-౧3 మంత్రములను,

సూ. ఆత్మశబ్దాచ్చ. 3-3-౧౫ సూత్రమునందును,

౧౯. మం. ౧. ఋతం పిబంతౌ సుకృతస్య. కఠ. 3-౧.

౨. అన్యత్ర ధర్మా దన్యత్రాధర్మాత్. ౨-౧౪.

3. యస్సేతు రీజానానాం. 3-౨ మంత్రములను,

సూ. ఇయ దామననాత్. 3-3-3౪ సూత్రమునందును,

౨౦. మం. శ్రవణాయాపి బహుభిర్యోనలభ్యః. కఠ. ౨-౭ మంత్రమును,

సూ. ఐహిక మప్యప్రస్తుతప్రతిబంధే తద్దర్శనాత్. 3-౪-౫౧ సూత్రము నందును,

౨౧. మం. యోనిమన్యే ప్రపద్యంతే. కఠ. ౫-౭ మంత్రమును,

సూ. తదాఽపీతే స్సంసారవ్యపదేశాత్. ౪-౨-౮ సూత్రమునందును,

౨౨. మం. యథోదకం శుద్ధే శుద్ధం. కఠ. ౪-౧౫ మంత్రమును,

సూ. అవిభాగేన దృష్టత్వాత్ ౪-౪-౪ సూత్రమునందును,

౨3. మం. న తత్ర సూర్యోభాతి ౫-౧౫ మంత్రమును,

సూ. దర్శయతశ్చైవం ప్రత్యక్షానుమానే ౪-౪-౨౦ సూత్రమునందును,

౨౪. మం, ౧. తయోర్ధ్వమాయన్నమృతత్వమేతి. కఠ. ౬-౧౬ మంత్రమును,

సూ. అనావృత్తి శ్శబ్దాదనావృత్తిశ్శబ్దాత్. ౪-౪-౨౨ సూత్రమునందును చర్చించియున్నారు.

ఈమంత్రములన్నియు ఆయాసూత్రములందు చక్కఁగా నిరూపింపబడియున్నవి.

## నచికేతుఁడు—ప్రాచీనగ్రంథములు.

ఈయుపనిషత్తునందు బ్రహ్మజిజ్ఞాసతో సదాచార్యుని ఆశ్రయించి కృతార్థుఁడయిన నచికేతునియొక్క చరిత్రము చెప్పఁబడినది. కృష్ణయజుర్వేదమునందును ఇతనిచరిత్ర మిట్లు చెప్పఁబడినది:—

ఉశన్ హవై వాజశ్రవస స్సర్వవేదసం దదౌ । తస్యహ నచికేతా నామ పుత్ర ఆస । తగ్ంహవై కుమారగ్ంసన్తం । దక్షిణాసు నీయమానాసు శ్రద్ధా వివేశ । సహోవాచ । తత కస్మై మాందాస్యసీతి । ద్వితీయం తృతీయం। తం హ పరీత ఉవాచ । మృత్యవేత్వా దదామీతి । తగ్ంహ స్మోత్థితం వాగభివదతి. ౪౨. గౌతమకుమార మితి । సహోవాచ । పరేహి మృత్యోర్గృహాన్। మృత్యవేవై త్వాఽదా మితి । తం వై ప్రవసన్తం గంతాఽసీతిహోవాచ । తస్యస్మతిస్రోరాత్రీ రనాశ్వాన్ గృహే వసతాత్ । స యదిత్వాపృచ్ఛేత్ । కుమార కతిరాత్రీ రవాత్సీరితి । తిస్రఇతి ప్రతిబ్రూతాత్ । కిం ప్రథమాగ్ం రాత్రి మాశ్నాఇతి. ౪౩. ప్రజాంతఇతి । కింద్వితీయామితి । పశూగ్ంస్తఇతి। కింతృతీయామితి । సాధుకృత్యాం తఇతి । తం వై ప్రవసన్తం జగామ । తస్య హాతిస్రోరాత్రీరనాశ్వాన్గృహ ఉవాస । తమాగత్య పప్రచ్ఛ । కుమార

కతిరాత్రీ రవాత్సీ రితి । తిస్ర ఇతి ప్రత్యువాచ. ౪౪. కింప్రథమాగ్ం రాత్రి మాశ్నా ఇతి । ప్రజాం త ఇతి । కిం ద్వితీయామితి । పశూగ్ స్త ఇతి । కిం తృతీయామితి । సాధుకృత్యాంత ఇతి । నమస్తే అస్తు భగవ ఇతిహోవాచ । వరం వృణీష్వేతి । పితరమేవ జీవన్నయానీతి । ద్వితీయం వృణీష్వేతి. ౪౫. ఇష్టాపూర్తయోర్మే క్షితిం బ్రూహీతిహోవాచ । తస్మైహైతమగ్నిం నాచికేత మువాచ । తతో వై తస్యేష్టాపూర్తే నాక్షీయేతే । నాస్యేష్టా పూర్తేక్షీయేతే । యోఽగ్నిం నాచికేతం చినుతే । య ఉచైన మేవం వేద । తృతీయం వృణీష్వేతి । పునర్మృత్యోర్మే ఽపజితిం బ్రూహీతి హోవాచ।తస్మై హైతమగ్నిం నాచికేత మువాచ । తతో వై సోఽపపునర్మృత్యుమజయత్. ౪౬. అపపునర్మృత్యుంజయతి । యోఽగ్నిం నాచికేతం చినుతే । య ఉచైన మేవం వేద.

తై. బ్రా. 3 అష్ట. ౧౧ ప్రశ్న. ౮. అనువాకము.

౧. తా. వాజశ్రవసుఁడు విశ్వజిద్యాగము చేసెను అతనికి నచికేతుఁ డను పుత్త్రుఁ డుండెను. తండ్రి యాగదక్షిణను ఋత్విగాదుల కిచ్చునప్పుడు నాయనా! నన్ను ఎవ్వరికిచ్చెదవు? అని రెండుమూఁడుపర్యాయములు అడిగెను. ఆమాటవిని తండ్రి కోపముగలవాఁడై మృత్యుదేవత కిచ్చెదనని చెప్పెను. కుమారుఁడు సరియని మృత్యుదేవతదగ్గఱకు పోవుటకు బయలుదేరగా ఆకాశవాణి యిట్లు పలికినది. నీవు యమధర్మరాజు ఊళ్లో లేనపుడు అతనియింటికిపోయి ౩ రోజులు అతనియింట పస్తుపడియుండుము. అతఁ డింటికివచ్చినతర్వాత నాయింటికివచ్చి, ఎన్నాళ్లు అయినది అని యముఁడు నిన్ను అడుగును. అప్పుడు 3 రోజులు అయినది అని నీవు బదులుచెప్పుము. మొదటిరోజున ఆహారమేమి ? యని యడుగును. నీప్రజలను భక్షించితినని చెప్పుము. రెండవరోజునయేమి భుజించితివని యడుగును. నీపశు

వులను భక్షించితినని చెప్పుము. మూఁడవరోజున యేమితిన్నావని యడుగును నీవొనర్చిన సత్కార్యమును భక్షించితినని చెప్పుము. అంతట నచికేతుడు అట్లే యమధర్మరాజు గ్రామములో లేనప్పుడు అతనియింటికిపోయి ఆకాశవాణి చెప్పినప్రకారమే చేసి యముఁడువచ్చియడుగగా ఆకాశవాణి చెప్పుమనినట్లే యమునకు సమాధానము చెప్పెను. అంతట యముఁడు వినయపూర్వకముగా నచికేతునకు నమస్కరించి మూఁడువరము లొసంగుచున్నాను. వలయువానిని కోరుకొనుము అని చెప్పెను. అంతట ౧ ఈశరీరముతోడనే నేను తిరిగి నాతండ్రి కడకు పోవునటులను, ౨ ఇష్టాపూర్తకర్మల నెల్లప్పుడు నేను చేయుచుండునట్లును, 3 మృత్యుజయమును అనుగ్రహింపవలయును అని కోరెను. యముఁడట్లే యొసంగెను. కనుక నాచికేతాగ్నిచయన మొనర్చినవాఁడు ఇష్టాపూర్తకర్మలతో సర్వదా ప్రకాశించుచు మృత్యువును జయించి అమృతత్వమునందును, ఈవిషయము నెఱింగిన వానికికూడ ఇట్టిఫలము లభించును.

౨. మహాభారతము అనుశాసనపర్వము ౧౦౬-వ అధ్యాయమంతయు ఈనచికేతునిగూర్చియే చెప్పఁబడినది. ఈనచికేతుఁడున్నూ ఔద్దాలకియే. కాని అచ్చట కథ మఱొకవిధముగ నున్నది. తండ్రి దీక్షావంతుఁడయి నదీతీరమునందు జపాదికమొనర్చి యింటికివచ్చెను. ఇంటికివచ్చినతర్వాత తనకమండలువు, ఇధ్మలు, దర్భలు, పుష్పములు మొదలయినవానిని నదీతీరమునందే పెట్టి మరిచివచ్చినసంగతిని గ్రహించినవాఁడయి వానిని తీసికొనిరమ్మని కుమారుఁడగు నచికేతుని పంపెను. నచికేతుఁడు నదీతీరమునకు పోవులోపలనే నదీప్రవాహామువచ్చుటచేత ఆ

కమండలువు మున్నగునవి నదిలోకొట్టుకొనిపోయెను. కుమారుఁడింటికి తిరిగివచ్చి తండ్రితో యీసంగతి చెప్పఁగా ఆకలితో మండుచున్న ఔద్దాలకి మృత్యులోకమునకుపొమ్మని కొడుకును తిట్టెను. ఆమాట అనఁగానే నచికేతుఁడు మూర్ఛితుఁడయి క్రిందపడిపోయెను. నచికేతునియాత్మ యమలోకమునకు పోగానే దివ్యదృష్టిగలయముఁడు నచికేతుని గౌరవించినవాఁడయి మీతండ్రి కోపముతో చెప్పినమాటప్రకారము నిన్నిచ్చటికి రప్పించితిని. నీకింకా ఆయుస్సు ఉన్నది కనుక మఱల భూలోకమునకుపొమ్ము అని నచికేతునితో చెప్పెను. అంతట పుణ్యకర్మలనొసర్చి స్వర్గలోకసౌఖ్యము ననుభవించుచున్న మహాత్ములను చూడవలయుననుకోరిక నాకు కలదని నచికేతుఁడు చెప్పఁగా అట్లే యని యముఁడు చూపించును. ఒకచోట మహావైభవముతో సౌఖ్యము ననుభవించుచున్న వారిని గాంచి వీరెవ్వరని యడుగగా గోదానమునొసంగినవారని చెప్పి యతనికి గోదానమాహాత్మ్యమును బోధించును. తర్వాత నచికేతుఁడు యమునిచేత అనుజ్ఞాతుఁడయి మఱల స్వగృహాభిముఖుఁడయినవెంటనే గృహమునందు విసంజ్ఞమయిపడియున్న నచికేతునిశరీరము చైతన్యముకలిగి లేచికూర్చుండెను. తండ్రి ఆశ్చర్యముగలవాఁడయి పుత్రునియడుగగా పుత్రుఁడు తాను యమలోకమునకు పోయినదిమొదలుకొని తిరిగి యింటికివచ్చిన వఱకుగల సమాచారమును తండ్రి కెఱిగించెను.

3. ఈయుపనిషత్తునందు చెప్పఁబడినకథ సుప్రసిద్ధమగుట చేత మఱల దాని నిచట వివరింపలేదు. తైత్తిరీయబ్రాహ్మణము

నందలికథ ఉపనిషత్ప్రతిపాదితమయినకథకు చాలవఱకు అన్ని విషయములందును సరిపోవుచున్నది. భారతోక్తము కొన్ని విషయములందుమాత్రము సరిపోవును.

## కఠోపనిషత్తు—ఇతరగ్రంథములు.

ఈకఠోపనిషదర్థము ఆత్మపురాణము౯-వ అధ్యాయము నందున్నూ, అనుభూతిప్రకాశమునందు ౧౧-వ అధ్యాయము నందున్నూ వివరింపఁబడియున్నది. ఈగ్రంథాంతమునందు పై రెండధ్యాయములను చేర్చి ముద్రించియున్నారము. సూతసంహితయందుగల బ్రహ్మగీతయందు ఈకఠోపనిషద్వివరణము ౧౦-వ అధ్యాయమునందు గలదు. ఈకఠోపనిషన్మంత్రములు చాలవఱకు యథాప్రకారము గైకొనఁబడినవి.

పరమేశ్వరునియనుగ్రహాతిశయమువలన ఈశ, కేన, కఠ, ప్రశ్న, ముండక, మాండూక్య, తైత్తిరీయోపనిషత్తు లీవిధముగ ఆంధ్రటీకాసహితముగ ప్రకటింపఁబడినవి. శ్వేతాశ్వతరము ముద్రింపఁబడుచున్నది. ఛాందోగ్య, బృహదారణ్యకోపనిషత్తులుకూడ త్వరలో ముద్రింపఁబడును. గుణదోషజ్ఞులగు విద్వాంసులు ప్రమాదాజ్ఞానసంభవములగుదోషములను తెలిపినయెడల కృతజ్ఞతాపూర్వముగ గ్రహించి ధన్యవాదపురస్సరముగ ద్వితీయముద్రణమునందు సంస్కరించుకొందుము. ఇట్టియుద్గ్రంథములను సర్వాంగసౌష్ఠవముగ ముద్రించి ప్రకటించుచున్న శ్రీ వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండుసన్స్

సంస్థకు అధిపతులును, శ్రీ వావిళ్ల రామస్వామిశాస్త్రులవారి పుత్త్రులును మామిత్రులును అగు శ్రీవావిళ్ల వేంకటేశ్వరశాస్త్రి గారికి సత్కార్యప్రోత్సాహకుఁడగు పరమేశ్వరుఁడు ఇతోఽ ప్యధికముగ ఐశ్వర్యాద్యభివృద్ధుల నొసంగి పరిపూర్ణాయు రారోగ్యముల నొసంగుఁగాక.

ఇట్లు,

౨౩-౧౨-౩౨
కీలుపాకు, మదరాసు.

కసువర్తి మార్కండేయశర్మ,
స్వధర్మప్రకాశినీసంపాదకుఁడు.

# విషయసూచిక.

## ప్రథమాధ్యాయము. ప్రథమవల్లి. పుట. ౧-౪౪.

## ప్రథమాధ్యాయము-తృతీయవల్లి, పుట. ౮౨-౧౦౪.



## ద్వితీయాధ్యాయము-౧౦౫-౧౭౧. పుటలు.

## ప్రథమ (చతుర్థ) వల్లి-౧౦౫-౧౨౩.

# అకారాదివర్ణానుక్రమేణ మంత్రప్రతీకసూచికా.

---

| మంత్రప్రతీకాని. | అధ్యాయ. | వర్గ. | మంత్ర. | పుట. |
|---|---|---|---|---|
| భ | | | | |
| భయాదస్యాగ్నిస్తపతి | ౨ | ౩ | ౩ | ౧౫౧ |
| మ | | | | |
| మనసైవేదమాప్తవ్యం | ౨ | ౧ | ౧౧ | ౧౧౮ |
| మహతః పరమవ్యక్తం | ౧ | ౩ | ౧౧ | ౯౪ |
| మృత్యుప్రోక్తాం నచికేతః | ౨ | ౩ | ౧౮ | ౧౭౦ |
| య | | | | |
| య ఇమం పరమం | ౧ | ౩ | ౧౭ | ౧౦౩ |
| య ఇమం మధ్వదం | ౨ | ౧ | ౫ | ౧౧౨ |
| యఏషసుప్తేషుజాగర్తి | ౨ | ౨ | ౮ | ౧౩౪ |
| యచ్ఛేద్వాఙ్మనసీప్రాజ్ఞః | ౧ | ౩ | ౧౩ | ౯౩ |
| యతశ్చోదేతిసూర్యః | ౨ | ౧ | ౯ | ౧౧౬ |
| యథాఽఽదర్శేతథా | ౨ | ౩ | ౫ | ౧౫౩ |
| యథా పురస్తాద్భవితా | ౧ | ౧ | ౧౧ | ౧౯ |
| యథోదకం దుర్గేవృష్టం | ౨ | ౧ | ౧౪ | ౧౨౨ |
| యథోదకం శుద్ధేశుద్ధం | ౨ | ౧ | ౧౫ | ౧౨౧ |
| యదా పంచావతిష్ఠంతే | ౨ | ౩ | ౧౦ | ౧౫౯ |
| యదా సర్వే ప్రభిద్యంతే | ౨ | ౩ | ౧౫ | ౧౧౪ |
| యదా సర్వే ప్రముచ్యంతే | ౨ | ౩ | ౧౪ | ౧౬౩ |
| యదిదం కించ జగత్సర్వం | ౨ | ౩ | ౨ | ౧౫౦ |
| యదేవేహ తదముత్ర | ౨ | ౧ | ౧౦ | ౧౧౭ |
| యస్త్వవిజ్ఞానవాన్ | ౨ | ౩ | ౬ | ౯౧ |
| ,, | ౨ | ౩ | ౮ | |

మంత్రప్రతీకానాం అకారాదివర్ణానుక్రమణీ

సమాప్తా.

శ్రీ ర స్తు.

# క ఠో ప ని ష త్తు

## [కృష్ణయజుర్వేదాంతర్గతము]

## ఆంధ్రటీకాతాత్పర్యవివరణసమన్వితము.

---

### పూర్వశాంతిపాఠమంత్రము.

ఓం. సహ నా వవతు, సహ నౌ భునక్తు, సహ వీర్యం కరవావహై, తేజస్వి నావధీత మస్తు, మా విద్విషావహై.

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః.

పద. సహ నౌ అవతు, సహ నౌ భునక్తు, సహ వీర్యం కరవావహై, తేజస్వి నౌ అధీతం అస్తు, మా విద్విషావహై, ఓం శాంతిః శాంతిః శాంతిః.

టీక. నౌ = శిష్యాచార్యులమగు మమ్ములనిద్దఱను, సహ = కూడా, అవతు = (బ్రహ్మము) సంరక్షించుఁగాక. నౌ = శిష్యాచార్యులమగు మమ్ములనిద్దఱను, సహ = కూడా, భునక్తు = (బ్రహ్మము) పరిపాలించుఁగాక. వీర్యం = విద్యానిమిత్తమగు సామర్థ్యమును, సహ = కూడా, కరవావహై = మేమిద్దఱము చేసెదముగాక. నౌ = శిష్యాచార్యులమగు మాయిద్దఱియొక్క, అధీతం = అధ్యయనముచేయఁబడిన ఉపనిషద్విద్య, తేజస్వి = తేజోవంతమైనది, అస్తు = అగుఁగాక. మావిద్విషావహై = (ప్రమాదకృతా పరాధాదికమువలన) మాయిద్దఱకు ద్వేషముకలుగకయుండుఁగాక.

ఓం = ప్రణవప్రతిపాదితమగు బ్రహ్మము మాయందనుగ్రహముంచుఁ గాక.

శాంతిః=ఆధ్యాత్మిక తాపశాంతి యగుఁగాక.
శాంతిః=అధిభౌతిక తాపశాంతి యగుఁగాక.
శాంతిః=అధిదైవిక తాపశాంతి యగుఁగాక.

తా. శిష్యాచార్యులమగు మమ్ములనిద్దఱను పరబ్రహ్మము సంరక్షించుఁగాక. శిష్యాచార్యులమగు మాకు ఆత్మసుఖానుభవము కలుగుఁగాక. శిష్యాచార్యులమగు మాకిద్దఱకు విద్యాసంబంధమయినసామర్థ్యము చక్కఁగా నుండుఁగాక. మేము అధ్యయనమొనర్చిన బ్రహ్మవిద్య తేజోవంతమయి వెలయుంఁగాక. ప్రమాదకృతాపరాధాదికమువలన శిష్యాచార్యుల మగు మాలో మాకు పరస్పరము ద్వేషము లేక యుండుఁగాక. మాయందు ప్రణవప్రతిపాదితబ్రహ్మము అనుగ్రహము కలిగియుండుఁగాక. ఆధ్యాత్మిక, అధిభౌతిక, అధిదైవికములను త్రివిధతాపములు మాకు శమించుఁగాక.

వివరణము:—శాంతియొక్క ప్రయోజన మేమనఁగా, చెప్పఁబోవునట్టి నిర్గుణసగుణరూపబ్రహ్మవిద్యోపదేశసమయమునందు విఘ్నములు కలుగకుండుటయే యగుచున్నది. బ్రహ్మవిద్యయన్నను ఆత్మవిద్యయన్నను ఒక్కటియే, ఆత్మవిద్యాప్రాప్తియే మోక్షము. అట్టి ఆత్మవిద్య నిర్విఘ్నముగ లభించుటకు శాంతిపాఠము అత్యావశ్యకమని శిష్టులు తలంచుచున్నారు.

"సహ నౌ భునక్తు భోజయతు" అని భాష్యమునం దుండుటచేతను, వ్యాఖ్యాతలు 'పాలయత్విత్యర్థః' అని వ్రాయుటచేతను 'పరిపాలించుఁగాక' యని అర్థమును వ్రాసినాఁడను "గురు వైవిధముగా ఆలస్యము లేక యుపదేశించునో, ఆయుపదేశించిన విషయమును నేను అజ్ఞానముచేత గ్రహింపలేక పోవుటగాని లేక విపరీతజ్ఞానముచేత వేఱుగా గ్రహించుటగాని లేక ఉన్నది ఉన్నట్టుగా, గ్రహించునటుల చేసి మమ్ములను పరిపాలించుఁగాక" యని మఱొకవ్యాఖ్యాత వివరించెను.

వీర్యమనఁగా విద్యానిమిత్తమయిన సామర్థ్యము—అనఁగా ఊహాపోహాదికము, విషయపరిగ్రహణసామర్థ్యము మున్నగునవి యనిగ్రహించునది.

## శంకరకృత కాఠకోపనిషద్భాష్యపీఠిక

షడ్గుణైశ్వర్యసంపన్నుఁడగుటచేత భగవానుఁడని వ్యవహరింపఁబడుచున్న వాఁడును, వైవస్వతుఁడును, బ్రహ్మవిద్యాచార్యుఁడును అగు యమునకు— మృత్యుదేవతకు, నచికేతసునకును నమస్కారము.

కఠోపనిషత్తుయొక్క భావార్థము సులభముగా తెలియుటకుఁగాను అల్పగ్రంథమగువృత్తిని రచించుచున్నాము.

### ఉపనిషచ్ఛబ్దార్థము.

౧. ఉపనిషత్పదము 'షద్ ౢ' విశరణగత్యవసాదనేషు, అను ధాతువునకు ఉప, ని, అను ఉపసర్గలుచేరగా క్విప్ ప్రత్యయాంతమయినప్పుడేర్పడును. ఉపనిషత్పదము చేత వ్యాఖ్యానము చేయఁదలఁచిన గ్రంథమునందు చెప్పఁబడి నట్టియు, తెలిసికొనవలసినవస్తువునకు సంబంధించినట్టియు, విద్య, చెప్పఁబడు చున్నది. ఉపనిషత్తనఁగా బ్రహ్మవిద్యయని మీరెట్లు చెప్పుచున్నారను నెడల అందులకు సమాధానము నాలకింపుడు. మోక్షేచ్ఛులయిన మహానుభావులు ఇహపరలోకసుఖవిముఖులయినవారలయి ఉపనిషచ్ఛబ్దవాచ్యమయినట్టియు, వక్ష్యమాణలక్షణమయినట్టియు, బ్రహ్మవిద్యను ఆచార్యోపదేశముచేత పొంది తన్నిష్ఠులయి నిశ్చయముగా పరిశీలించినయెడల అట్టిపరిశీలనముగలవారియొక్క సంసారబీజమగు అవిద్యాదికమును సమూలముగ నశింపఁజేయుచున్నదను అర్థ సంబంధమువలన బ్రహ్మవిద్య ఉపనిషత్తని వ్యవహరింపఁబడుచున్నది. ఇదేవిషయ మీయుపనిషత్తునందే ముందు.—

"నిచాయ్య తం మృత్యుముఖాత్ప్రముచ్యతే."

కఠ. ౧ అధ్యా. 3 వల్లీ. ౧౫ మం.

అనుమంత్రముచేత చెప్పఁబడుచున్నది.

౨. పూర్వోక్తవిశేషణముచేత ముముక్షువులగువారిని పరబ్రహ్మమును పొందించుచున్నది కావున బ్రహ్మమును పొందించుచున్నదనుసంబంధము చేత

బ్రహ్మవిద్య ఉపనిషత్తని వ్యవహరించబడుచున్నది. ఈవిషయము నీ యీ కఠోప
నిషత్తునందే ముందు ఇట్లని చెప్పఁబడినది:—

"బ్రహ్మప్రాప్తో విరజోఽభూ ద్విమృత్యుః"

కఠ. అధ్యా ౨. వల్లీ. 3. మం. ౧౮.

3. భూరాదిలోకములకు ఆదియును—అనఁగా ప్రథమజుఁడును, హిరణ్యగర్భునివలన జన్మించినవాఁడును అగు అగ్నియొక్క విషయికమగు నట్టియు, నచికేతసునిచేత రెండవవరముగా ప్రార్థింపఁబడినట్టియు అగ్నివిద్యస్వర్గలోకఫలప్రాప్తికి హేతుభూతమయి లోకాంతరములందు తఱచుగా పొందఁబడుచున్న గర్భవాస, జన్మ, జరాద్యుపద్రవములను సడలించి నాశనమునర్చుచున్నదికావున ధాత్వర్థసంబంధముచేత అగ్నివిద్యసైతము ఉపనిషత్తని వ్యవహరింప నర్హమగుచున్నది. అగ్నివిద్య ఇట్టి యమృతత్వము నొసంగుచున్నదని యీ కఠోపనిషత్తునందే చెప్పఁబడుచున్నది:—

స్వర్గలోకా అమృతత్వం భజంతే"

కఠ. అధ్యా. ౧. వల్లీ. ౧. మం. ౧౩.

పూర్వ:—బ్రహ్మవిద్యాధ్యేతలు ఉపనిషత్పదమును గ్రంథపరముగా వ్యవహరించుచున్నారు. "ఉపనిషత్తులను చదువుచున్నాము. ఉపనిషత్తులను బోధించుచున్నారము" అని లోకవ్యవహారము సర్వత్ర సుప్రసిద్ధముగదా.

సమా:—ఇదొకదోషము కాఁజాలదు. అవిద్యాది సంసారహేతునాశనరూపమగు షదిధాత్వర్థము గ్రంథమాత్రమునందసంభవము కావునను, బ్రహ్మవిద్యయందే అట్టియర్థము సంభవమగుటచేతను ముఖ్యముగా బ్రహ్మవిద్యయే ఉపనిషచ్ఛబ్దవాచ్యమయినను గ్రంథమునం దట్టివిషయమే నిరూపింపఁబడియుండుటచేత "ఆయుర్వై ఘృతం" అనుచోటవలె గ్రంథమునందు ఉపనిషచ్ఛబ్దము ప్రయోగింపఁబడినది. కావున బ్రహ్మవిద్యయందు ముఖ్య

వృత్తిగను, గ్రంథమునందు గౌణవృత్తిగను ఉపనిషచ్ఛబ్దము ప్రయుక్తమగు చున్నది.

ఉపనిషచ్ఛబ్ద నిర్వచనముచేతనే ఉపనిషద్విద్యాధికారి యిట్టివాఁడని నిర్ణయింపఁబడినది. ప్రత్యగాత్మభూతమయిన పరబ్రహ్మమే బ్రహ్మవిద్యకు విషయమనియు, ప్రయోజనము ఆత్యంతికసంసారనివృత్తిరూపమగు బ్రహ్మప్రాప్తి యనియు, సంసారనివృత్త్యాదిప్రయోజనమే బ్రహ్మవిద్యకు సంబంధమనియు ఎఱుంగవలయును. కావున యథోక్తలక్షణములుగల అధికారి, విషయ, ప్రయోజన సంబంధములుగల బ్రహ్మవిద్యను కరతలామలకమువలె ప్రకాశింపఁజేయుటచేత నీకఠోపనిషత్తునందుఁ గల వల్లులన్నియు యథోక్త అధికారి, విషయ, ప్రయోజన సంబంధములు గలవియే కావున వానిని మాకు తెలిసినంతమట్టుకు వ్యాఖ్యానము నొనర్చుచున్నారము.

---

టీక. ఉపనిషచ్ఛబ్దము "షద్లృ విశరణ గత్యవసాదనేషు" అను ధాతువునుండి పుట్టినది. ఆధాతువునకు.—

౧. విశరణము=హింసించుట, నశింపఁజేయుటయు,

౨. గతి=గమనము, పొందించుట.

3. అవసాదనము=సడలింపఁజేయుట.

అనునూఁదర్థములు గలవు. పైత్రివిధములగు అర్థములకు సంబంధించునట్టుల నీవిధమయినవ్యుత్పత్తిని భాష్యకారులవారొనర్చిరని ఎఱుంగునది.

---

# కఠోపనిషత్తు

## ప్రథమాధ్యాయము—ప్రథమవల్లి.

---

౧-వ మంత్రము.

మూ. ఓం. ఉశన్హ వై వాజశ్రవస స్సర్వవేదసం దదౌ,
తస్య హ నచికేతానామ పుత్ర ఆస. ౧

పద. ఉశన్ హ వై వాజశ్రవసః సర్వవేదసమ్ దదౌ, తస్య హ నచికేతాః నామ పుత్త్రః ఆస. ౧

టీక. వాజశ్రవసః=వాజశ్రవునిపుత్త్రుఁడగు వాజశ్రవసుఁడు, ఉశన్= (విశ్వజిద్యాగాచరణమువలన లభించెడిఫలమును) అభిలషించినవాఁడై (విశ్వజిద్యాగమునొనర్చెను. ఆయాగమునం దతఁడు) సర్వవేదసం = తనయొక్క సర్వస్వమున్ను, దదౌ=(యాగదక్షిణగా) ఇచ్చెను. తస్య=ఆవాజశ్రవసునకు, నచికేతానామ=నచికేతుఁడను పేరుగల, పుత్త్రః=పుత్త్రుఁడు, ఆస=ఉండెను.

తా. ఉపనిషదారంభమునందు చెప్పఁదలఁచినవిషయమును ప్రథమమున తెలుపక వాజశ్రవసుఁడను ఒకమహర్షి యుండెను. అతనికి నచికేతుఁడనుపుత్త్రుఁడొకఁ డుండెనని ఆఖ్యాయికను ప్రారంభించిచెప్పుట ప్రతిపాదింపఁ బోవునట్టి విద్యయొక్క స్తుత్యర్థమని యెఱుంగవలయును.—వాజశ్రవుఁడను ఒక మహర్షి యుండెను. అతఁడు విశ్వజిద్యాగఫలము నభిలషించిన వాఁడయి విశ్వజిద్యాగము నొనర్చెను. ఆవిశ్వజిద్యాగము నొనర్చిన వాజశ్రవసుఁడు విశ్వజిద్యాగమునకు విహితమయిన సర్వస్వదక్షిణను ఋత్విక్కులకొసంగెను. ఆవిశ్వజిద్యాగము ననుష్ఠించిన యజమానుఁడగు వాజశ్రవసునకు నచికేతుఁడను పుత్త్రుఁడొకఁ డుండెను.

వివరణము.—వాజశ్రవసశబ్ద నిర్వచనము.—

వాజం=అన్నం, తద్దానాదినిమిత్తం శ్రవః = యశః యస్య సః వాజశ్రవాః, రూఢితో వా, వాజశ్రవసః అపత్యం, వాజశ్రవసః.

అర్థ. వాజమనఁగా అన్నము. అట్టి అన్నముయొక్క దానాదికముచేత లభించిన శ్రవస్సు—అనఁగా కీర్తిగలవాఁడు. వాజశ్రవుఁడు (ఇది యౌగికార్థము) లేక, వాజశ్రవుఁడను రూఢినామముగలవాఁడు. వాజశ్రవుని పుత్త్రుఁడు వాజశ్రవసుఁ డనంబడును.

విశ్వజిద్యాగము.—ఈయాగము నాచరించినయజమానుఁడు తన దగ్గఱ అప్పుడు నిల్వయున్నధనమంతయు ఋత్విక్కులకు యాగదక్షిణగా నిచ్చితీరవలయునని విధిగలదు.

౨-వ మంత్రము.

తꣳహ కుమారꣳ సన్తం దక్షిణాసు నీయమానాసు శ్రద్ధాఽఽవివేశ సోఽమన్యత. ౨

పద. తం హ కుమారం సంతం దక్షిణాసు నీయమానాసు శ్రద్ధా ఆవివేశ సః అమన్యత. ౨

టీక. దక్షిణాసు=(ఋత్విక్కులకును, సదస్యులకును విడివిడిగా విభజించి యిచ్చిన) దక్షిణలు, నీయమానాసు=తీసికొనిపోఁబడుచున్నవగుచుండఁగా, కుమారంసంతం=బాలుఁడుగానున్న, తంహ = ఆనచికేతసుని, శ్రద్ధా=ఆస్తిక్యబుద్ధి, ఆవివేశ = ప్రవేశించెను. (ఇటుల ఆస్తిక్యబుద్ధికలుగుటచేత) సః = ఆనచికేతసుఁడు, అమన్యత=(ఈచెప్పఁబోవురీతిగా) ఆలోచించెను.

తా. తండ్రియగువాజశ్రవసుఁడు విశ్వజిద్యాగమునకు సంబంధించిన ఋత్విక్కులకున్నూ సదస్యులకున్నూ వేఱువేఱుగావిభజించి దక్షిణార్థమిచ్చిన గోవులను వారు తీసికొనిపోవుచుండఁగా ఆవాజశ్రవసునిపుత్త్రుఁడగు నచికేతసుఁడు ప్రజననసామర్థ్యములేని బాల్యవయసునం దున్నను తండ్రికి మేలు

చేయవలయును సనుతలంపుతో శ్రద్ధ—అనఁగా ఆస్తిక్యబుద్ధి అనునది కలిగెను. ఇటుల ఆస్తిక్యబుద్ధిగలవాఁడైన నచికేతసుఁ డీచెప్పఁబోవురీతిగా ఆలోచించెను.

వివరణము:—మంత్రమునందుఁ గల కుమారం, అను పదమునకు "కుమారం ప్రథమవయసం అప్రాప్తప్రజననశక్తిం బాలం ఏవ" అని భాష్యకారులవారు వివరణ మొనర్చిరి. అనఁగా యౌవనముగాని బాలుఁడని తద్వ్యాఖ్యానము.

3-వ మంత్రము.

మూ. పీతోదకా జగ్ధతృణా దుగ్ధదోహా నిరింద్రియాః,
అనందా నామ తే లోకా స్తాన్స గచ్ఛతి తా దదత్. 3

పద. పీతోదకాః జగ్ధతృణాః దుగ్ధదోహాః నిరింద్రియాః అనందాః నామ తే లోకాః తాన్ సః గచ్ఛతి తాః దదత్. 3

టీక. పీతోదకాః = త్రాఁగఁబడిన ఉదకములుకలిగినట్టియు, జగ్ధతృణాః = తినఁబడినగడ్డికలిగినట్టియు, దుగ్ధదోహాః = పితుకఁబడిన పాలుకలిగినట్టియు, నిరింద్రియాః=ఈనెడిశక్తినశించినట్టియు, (ఏయావులు గలవో) తాః = అట్టి గోవులను, దదత్=దానముగా నేయజమానుఁడిచ్చునో, సః=వాఁడు, అనందాః నామ = సుఖములేనట్టి వగుటచేత 'అనందము' లని పిలువఁబడుచున్న, తే = ఆప్రసిద్ధములగు, లోకాః=ఏలోకములుగలవో, తాన్=ఆ అనందలోకములను అనగా అసౌఖ్యప్రదములగునరకములను, గచ్ఛతి=పొందుచున్నాఁడు.

తా. నచికేతసుఁడు చింతించినవిధము చెప్పఁబడుచున్నది:—వాజశ్రవసుఁడు యజ్ఞదక్షిణగా నిచ్చినగోవు లెట్టివో చెప్పఁబడుచున్నవి. త్రాగఁబడిన యుదకములుగలగోవులు పీతోదకములని చెప్పఁబడుచున్నవి. తినఁబడిన తృణములుగలగోవులు జగ్ధతృణములని చెప్పఁబడుచున్నవి. పిండఁబడినపాలు గలగోవులు దుగ్ధదోహములని చెప్పఁబడును. ముసలి అగుటకు తగిన దేహదార్ఢ్యములేనిగోవులు నిరింద్రియములని చెప్పఁబడును. ఇట్టి యావులను దక్షిణార్థ

నుగా తనతండ్రి ఋత్విక్కులకిచ్చినాడు. ఇట్టిగోవులను దానమొసంగిన యజమానుఁడు నిరంతరము దుఃఖమునను భవించుటకయి యేర్పడిన నరకలోకములను పొందును. (అని చాల విచారించెను.)

వివరణము:—'పీతోదకాః'=పీతముదకం ప్రాగేవ, నోత్తర కాలం పానశక్తి రస్త్యాస్తీత్యర్థః. ఏవం దానోత్తరకాలే తృణభక్షణే దోహనే వత్స ప్రసవే చ న శక్తి రిత్యర్థో ద్రష్టవ్యః.

అర్థము. త్రాఁగదగినయుదకముల నిదివఱకే ఆగోవులు త్రాగెను. ఇఁక మీఁదట నీళ్లు త్రాగుటకుకూడ ఆయావులకు శక్తిలేదని భావము.

ఇదేవిధముగ దానోత్తరకాలమునందు గడ్డినమలుటకుఁగాని, పాలు పిండుటకుగాని యీనుటకుగాని శక్తిలేనివని భావము.

### ౪-వ మంత్రము.

మూ. సహోవాచ పితరం తత కస్మై మాం దాస్యసీతి ద్వితీయం తృతీయం తగ్ంహోవాచ మృత్యవే త్వా దదామీతి. ౪

పద. సః హ ఉవాచ పితరం తత కస్మై మాం దాస్యసి ఇతి ద్వితీయం తృతీయం తం హ ఉవాచ మృత్యవే త్వా దదామి ఇతి.

టీక. తాత=నాయనా!, మాం=నన్ను, కస్మై=ఎవరికొఱకు, దాస్యసి=ఇవ్వగలవు. ఇతి=ఇట్లని, సః=ఆనచికేతసుఁడు, పితరం = తండ్రినిగూర్చి, ఉవాచహ= పలికెనుగదా. (ఈవిధముగా తండ్రినిసంబోధించి ఆనచికేతుఁడు అడిగినను తండ్రియగువాజశ్రవసుఁడు కుమారునిమాటను వినియు విననివానివలె ఉపేక్షించి ఊరకయుండఁగా మఱల) ద్వితీయం=రెండవపర్యాయము, తృతీయం=మూడవపర్యాయము, ఉవాచహ=(తండ్రినిగూర్చి) పలికెను. (ఇట్లు రెండుమూడుసారులు కుమారుఁడు పలికినమాటలకు వాజశ్రవసుఁడు కోపముగలవాఁ

డై.) త్వా=నిన్ను, మృత్యవే = మృత్యుదేవతకొఱకు. దదామి ఇతి = ఇచ్చుచున్నానని, ఉవాచ=పలికెను.

తా. తండ్రియగు వాజశ్రవసుఁడు విశ్వజిద్యాగదక్షిణార్థము శల్యమాత్రావశిష్టములగు గోవులనొసంగుటచేత తనతండ్రి చేసినయాగము సంపూర్తి కాలేదనియు, అందువలన తనతండ్రికి నరకముప్రాప్తించుననియు, తండ్రిని నరకమునుండి తరింపఁజేయుటచేత పుత్త్రుఁడను పేరు సంభవించుచున్నదనియు నెఱిఁగినవాఁడు కావున పుత్త్రుఁడగుతాను ఆత్మప్రదానమొనర్చియయినను తండ్రియొక్కయాగమును పరిపూర్తిచేయవలయు నను సత్సంకల్పము నచికేతుఁడుగలవాఁడై తండ్రికడకుఁబోయి 'నాయనా! నన్ను ఏఋత్విక్కునకు యాగదక్షిణగా నిచ్చెదవు' అని యడిగెను. పుత్త్రుఁడగు నచికేతుఁ డడిగిన యీమాటను తండ్రియగువాజశ్రవసుఁడు వినియు విననివానివలె బదులుచెప్పక ఉపేక్షించియుండఁగా నచికేతుఁ డూరకుండక 'నాయనా! నన్నేఋత్విక్కునకు యాగదక్షిణగా నిచ్చెదవు' అని రెండుమూడుసారు లడిగెను. అడిగిన మాటకు బదులుచెప్పనియెడల నూరకుండుట బాలస్వభావము. వీఁ డిట్లూరకుండక తనకు సంబంధములేని ఇట్టివిషయములో నాకు సభలో బుద్ధిచెప్పుటకువచ్చినాఁడని వాజశ్రవసుఁడు కోపముగలవాఁడై నిన్ను మృత్యువుకొఱకు— అనఁగా వైవస్వతునికొఱకు ఇచ్చుచున్నానని పుత్త్రునకు బదులుచెప్పెను.

వివరణము:— 'తాత' యనుటకు 'తత' యని హ్రస్వముగా చెప్పుట ఛాందసము.

### ౫-వ మంత్రము.

అవ. ఈవిధముగా తండ్రి కోపముగలవాఁడై 'మృత్యువునకు నిన్నిచ్చుచున్నానని' పలికినమాటకు నచికేతుఁడు దుఃఖించుచున్నాఁడు.—

మూ. బహూనా మేమి ప్రథమో బహూనా మేమి మధ్యమః।
కిꣳస్వి ద్యమస్య కర్తవ్యం యన్మయా౽ద్య కరిష్యతి॥

పద. బహూనాం ఏమి ప్రథమః బహూనాం ఏమి మధ్యమః, కింస్విత్ యమస్య కర్తవ్యం యత్ మయా అద్య కరిష్యతి. ౫

టీక. (అహం=నేను) బహూనాం = అనేకులయిన శిష్యులలోపల లేక పుత్త్రులలోపల, ప్రథమః = మొదటివాఁడనుగా, ఏమి = వచ్చుచున్నాను. బహూనాం = అనేకులయిన శిష్యులలోపల లేక పుత్త్రులలోపల, మధ్యమః= మధ్యముఁడనుగా, ఏమి=వచ్చుచున్నాఁడను. యమస్య=యమునకు, కర్తవ్యం= నాచేత చేయఁదగినది? కింస్విత్ = ఏమియున్నది? మయా = దానముగా నివ్వఁబడిన నాచేత, అద్య=ఇప్పుడు, (అయముఁడు) కింకరిష్యతి = ఏమిచేయఁగలఁడు?

తా. అనచికేతుఁడు దుఃఖించినవిధాన మెట్లనఁగా.—నేను నా తండ్రికడనున్న శిష్యులలోపల శిష్యోచితవృత్తి మున్నగువాని నాచరించుట యందు అందఱికంటె మొదటివాఁడుగనే ఉంటున్నాఁడనే. కొన్నివిషయ ములందు, అనేకులయినవారిలోపల మధ్యముఁడనై మధ్యమవృత్తితో చరించు చున్నానుగాని అధమవృత్తిగా నేనెప్పుడు చరించలేదే. ఇట్టి సద్గుణవంతుఁ డను పుత్త్రుఁడను అగునన్ను నిన్ను మృత్యువున కిచ్చెదనని నాతండ్రిపల్కెనే దక్షిణగా నొసంగఁబడిననేను యమున కేమి చేయవలయును? యముఁడు నన్నెందుల కుపయోగించుకొనును? విచారించిచూడగా నాయం దేదోషము లేదు. నాతండ్రి నేను ౨-౩ పర్యాయము లడిగినదానికి ఆగ్రహముగలవాఁడై యిట్లుపలికినాడు అని నిర్ణయించుకొన్నవాఁడయి అయినప్పటికిన్ని తనతండ్రి పలికినమాట అబద్ధముకాకూడదు అని నిశ్చయించుకొని, నాయనా! నేనేమి పలికితినని దుఃఖముతో తండ్రి నడిగెను.

వివరణము.—శిష్యుల ప్రవర్తనము, ముఖ్య, మధ్యమ, అధమ భేదము లతో త్రివిధము.

౧. ముఖ్యవృత్తి=యథావసరం జ్ఞాత్వా శుశ్రూషణే ప్రవృత్తిరూపా

అర్థ. ఏయేసమయములం దేపని యాచరణీయమో యని తానే స్వయముగా తెలిసికొని ఆయాపనుల నాచరించుచుండుట ముఖ్యవృత్తి.

౨. మధ్యమవృత్తి=ఆజ్ఞాదివశేన శుశ్రూషణే ప్రవృత్తిః

అర్థము. గుర్వాదుల యాజ్ఞననుసరించి వారుచెప్పినపనుల నాచరించుట మధ్యమవృత్తి.

౩. అధమవృత్తి=గుర్వాదిభిః కోపితస్సన్ శుశ్రూషాకరణే ప్రవృత్తి రూపా.

అర్థ. గుర్వాదులు కోపించిచెప్పఁగా వారుచెప్పినపనుల నాచరించుట అధమవృత్తి.

౬వ మంత్రము.

మూ. అనుపశ్య యథాపూర్వే ప్రతిపశ్య తథాఽపరే,
సస్య మివ మర్త్యః పచ్యతే సస్య మివాఽఽజాయతే పునః.

పద. అనుపశ్య యథా పూర్వే ప్రతిపశ్య తథా అపరే, సస్యం ఇవ మర్త్యః పచ్యతే సస్యం ఇవ అజాయతే పునః.

టీక. పూర్వే = మనపూర్వులగు తాతముత్తాతలు మున్నగువారలు, యథా=ఏవిధముగా ప్రవర్తించిరో, (దానిని) అనుపశ్య=దీర్ఘముగా ఆలోచించుకొనుము. తథా = అదేవిధముగా, అపరే = ఇతరులు (అనఁగా ఈకాలమునందున్న పెద్దలు ప్రవర్తించుచున్నారో, దానిని) ప్రతిపశ్య = ఆలోచించుకొనుము, మర్త్యః=మరణమే స్వభావముగాఁగలిగిన మనుష్యుఁడు, సస్యంఇవ = పైరువలె, పచ్యతే = జీర్ణుఁడయి మరణించుచున్నాఁడు. పునః=మరల, సస్యం ఇవ=పైరువలెనే, జాయతే=పుట్టుచున్నాఁడు.

తా. నచికేతసుఁడు తనతండ్రియగు వాజశ్రవసుఁడు తన్ను (అనఁగా నచికేతసుని) మృత్యువున కిచ్చెదనని పలికినమాట ప్రయోజనము నుద్దేశించి కాదనియు, ఆగ్రహముతో పలికినాఁడనియు నిశ్చయించుకొన్నవాఁడై

ఆగ్రహముతో చెప్పినప్పటికిన్ని తనతండ్రియొక్క మాట అసత్యముకాకూడదనుతలంపుతో ఆతఁ డన్నమాటను నెరవేర్పవలసినదిగా అతనికి ప్రబోధము నొనర్చుచున్నాఁడు.—ఓతండ్రీ! ఏవిధముగా నీతండ్రి తాత మున్నగు పూర్వులు తాము పలికినపలుకులు సత్యములుగా నొనర్చినవారై ఇహలోకయాత్రను సంపూర్తిచేసికొని ఇహలోకమునుండి తరలిపోయిరో. ఆవిషయమును బాగుగా ఆలోచించుకొని వారినిచూచి నీవున్నూ ఆదేవిధముగా సంచరించుటయుక్తము. అప్పుడేగాక ఈకాలమునందున్నూ గలపెద్దలు సంచరించుచున్న రీతినికూడ గమనించిచూడుము. గతించిన మనపూర్వులందుఁగాని ఇప్పుడున్న పెద్దలందుగాని అసత్యవచన మనునది లేనేలేదు. ఆడినమాటను తప్పుట యనునది దుష్టాత్ములకృత్యము. ఆడినమాటను వమ్ముచేసినంతమాత్రమున నెవ్వఁడున్నూ జరామరణవిరహితుఁడయి శాశ్వతుఁడుగా నుండఁబోవునదిలేదు గదా. ఏలయనఁగా, మర్త్యుఁడనుమాటకు మరణమే ధర్మముగాఁ గలవాఁడని అర్థము. అట్టిమర్త్యుఁడు—అనఁగా మనుష్యుఁడు పైరు పండివాడబారి యేవిధముగా నశించిపోవుచున్నదో అట్లే జరాజీర్ణదేహుఁడయి చచ్చిపోవుట తప్పనిసరి. రాలిపోయినగింజలు మఱల పైరగునట్టుల మరణించిన మనుష్యుఁడు మరల నీ యనిత్యమయిన ప్రాణిలోకమునందే పుట్టుచున్నాఁడు. జన్మమరణము లిట్లందఱకు తప్పనిసరిగా ఉండఁగా వ్యర్థముగా అసత్యమాడుటవలన కలిగెడి లాభ మేమి? నీవన్నమాటను కాపాడుము. అనఁగా నన్ను యమునకిచ్చెదనని పలికితివి కావున నన్ను యమునికడకుఁ బంపుము.

౭-వ మంత్రము.

మూ. వైశ్వానరః ప్రవిశత్యతిథి ర్బ్రాహ్మణో గృహాన్,
తస్యైతాగ్ం శాంతిం కుర్వంతి హర వైవస్వతోదకమ్.

పద. వైశ్వానరః ప్రవిశతి అతిథిః బ్రాహ్మణః గృహాన్, తస్య ఏతాం శాంతిం కుర్వంతి హర వైవస్వత ఉదకమ్.

టీక. వైశ్వానరః=అగ్నిహోత్రుఁడు, బ్రాహ్మణః = బ్రాహ్మణుఁడగు, అతిథిః = అతిథిరూపముగలవాఁడై, ప్రవిశతి = (సాగ్నిగృహస్థులగువారియొక్క గృహములను) ప్రవేశించుచున్నాఁడు. తస్య = ఆబ్రాహ్మణాతిథిరూపియగు అగ్నిహోత్రునకు, ఏతాం=ఈ, శాంతిం = (పాద్య, ఆసన దానాదిరూపమగు) శాంతిని, కుర్వంతి = (గృహస్థులగువారలు చేయుచున్నారు. (కావున) వైవస్వత=ఓవైవస్వతుఁడా! ఉదకం = పాద్యార్ఘ్యముజలమును, హర=తీసికొనిరమ్ము. (అని వైవస్వతునిభార్యగాని అమాత్యులో వైవస్వతునితో పలికిరి.)

తా. పుత్రుఁడగు నచికేతసుఁడు చెప్పినమాటను తండ్రియగు వాజశ్రవసుఁ డాలకించినవాఁడయి తనసత్యభాషణమును కాపాడుకొనుటకయి పుత్రుఁడగు నచికేతసుని యమునికడకు పంపెను. నచికేతసుఁడు తన గృహమునుండి బయలువెడలి యమునిగృహమునకుఁబోయెను. నచికేతసుఁడు యమునియింటికిపోయినసమయమందు యము డెచ్చటికో పోయియుండెను. 3 దినములకు తర్వాత యముఁడు యింటికి మరలివచ్చెను. నచికేతసుఁడు ఆమూడురోజులు యమునియింటనే యుండెను. ఇంటికివచ్చిన యమునితో అతని అమాత్యులో భార్యగాని యిట్లనిపలికిరి:—బ్రాహ్మణుఁడగు అతిథి యింటికి వచ్చుచున్నాఁడనఁగా సాక్షాత్తుగ అగ్నిహోత్రుఁడే యింటికివచ్చుచున్నాఁడని తలంచవలయును. సాక్షాత్తుగ అగ్నిస్వరూపుఁడగు నతనివల్లనుండి తమగృహాదికమునకు నేవిధమగు కీడుకలుగకుండుటకయి శాంతిని చేయువారివలెనే తత్తద్గృహాధీశులగు యజమానులు పాద్యము, ఆసనదానము మున్నగుప్రకారములుగల శాంతినిచేయుచున్నారు కావున ఓవైవస్వతుఁడా! మనయింటికి అతిథిగావచ్చిన యీబ్రాహ్మణబాలునకు— నచికేతసునకు పాదప్రక్షాళనార్థముదక మొసంగి యథోచితముగ సత్కరింపుము. లేనియెడల ప్రత్యవాయము కూడ కలుగుచున్నదని శ్రుతియే చెప్పుచున్నదిగదా.

వివరణము.—గృహాగతుఁడగు అతిథిని యథోచితముగ సత్కరించుట శిష్టాచారప్రాప్తముమాత్రమే కాదనియు, శ్రుతివిహితమనియు నెఱుంగునది.

"యస్యాగ్నిహోత్ర, మదర్శ, మపౌర్ణమాస మచాతుర్మాస్య మనాగ్ర యణ, మతిథివర్జితంచ అహుతమవైశ్వదేవ మవిధినాహుత మాసప్తమాంస్తస్య లోకాన్ హినస్తి" అని శ్రుతి.

ముండకోపనిషత్. ౧ ముండకము. ౨ వ ఖండము. 3 మంత్రం.

పైశ్రుతి అతిథిపూజారహితునకు సద్గతులు నశించుచున్నవని అర్థమ యొఱుంగవలయును.

౮-వ మంత్రము.

మూ. ఆశాప్రతీక్షే సంగతగ్ం సూనృతాం
చేష్టాపూర్తే పుత్రపశూగ్ంశ్చసర్వాన్,
ఏత ద్వృంక్తే పురుషస్యాల్పమేధసో
యస్యానశ్నన్ వసతి బ్రాహ్మణో గృహే. ౮

పద. ఆశాప్రతీక్షే సంగతం సూనృతాం చ ఇష్టాపూర్తే పుత్రపశూన్ చ సర్వాన్, ఏతత్ వృంక్తే పురుషస్య అల్పమేధసః యస్య అనశ్నన్ వసతి బ్రాహ్మణః గృహే.

టీక. యస్య=ఏ, అల్పమేధసః=అల్పప్రజ్ఞగల, పురుషస్య = పురుషుని యొక్క, గృహే = గృహమునందు, బ్రాహ్మణః = బ్రాహ్మణుఁడు, అనశ్నన్ = భుజింపక, వసతి = నివసించుచున్నాఁడో, ఏతత్ = ఈవిధముగా బ్రాహ్మణుఁడొకనియింట భుజింపకయుండుట యనునది (తస్య = ఆగృహయజమానియగు పురుషునియొక్క), ఆశాప్రతీక్షే = ఆశాప్రతీక్షలను, సంగతం=సత్పురుషుల సహవాసమువలన అంతకుముందువాఁడు సంపాదించియుంచినసత్ఫలమును, సూనృతాం = సత్యవాఙ్నియమజన్యఫలమును, ఇష్టాపూర్తే = ఇష్టాపూర్తముల నాచరించుటవలన కలిగినఫలమును, పుత్రపశూన్ చ = పుత్రపశువులను, సర్వాన్=అంతయు, వృంక్తే=నాశనమొనర్చుచున్నది.

తా. అతిథిని సత్కరింపనందువలన కలిగెడి ప్రత్యవాయమును చెప్పఁబడుచున్నది.—ఏ మందభాగ్యుని యొక్క గృహమునందు బ్రాహ్మణుఁడు భుజింపక నిలిచియుండునో అట్టి దౌర్భాగ్యుఁడీ విధముగా నష్టము ... ను.—అతని యొక్క ఆశాప్రతీక్షలు నశించును. (ఆశ యనఁగా అనేకముగా తెలియని గొప్పవస్తువు తనకు లభింపవలయునని యెడి ఇచ్ఛ. అనఁగా ... తనకు దొరకవలయునని తలంచుట మున్నగునవి ప్రతీక్ష యనఁగా ప్రత్యక్షముగా తాను చూచుచున్న గొప్పపదవి తనకు లభింపవలయునని కోరుట. అనఁగా తనకు రాజ్యము రావలయునని కోరుట మున్నగునవి) సంగతి యనఁగా సత్పురుషుల సహవాసవశమువలన లభించిన పుణ్యము, ... నశించును. సత్యవచనప్రియసంభాషణమువలన కలిగిన సుకృతము నశించును. ఇష్టములనఁగా యజ్ఞయాగాదుల నాచరించుట. పూర్తమనఁగా వాపీకూపతటాకాదుల త్రవ్వించుట, సత్రములు మున్నగునవి కట్టించుట. ఇట్టి ఇష్టాపూర్తములవలన ఇతనికి కలిగియున్న సుకృతము నశించును. పశుపుత్త్రపౌత్త్రాదికములగు ఐహికసౌఖ్యము నశించును. వేయేల వానికి సంబంధించిన శ్రేయస్సంతతియు నశించును.

వివరణము.—౧. ఆశాలక్షణము = అనిర్జ్ఞాతప్రాప్యేష్టార్థప్రార్థనా ఆశా అని భాష్యము. అనిర్జ్ఞాతః=అత్యంతమజ్ఞాతః, ప్రాప్యః =ప్రాప్తుం యోగ్యః కనకాచలాదిః, తస్య ప్రార్థనా=మమ భూయాదితీచ్ఛా. అని గోపాలేంద్రయతిటీక. ప్రతీక్షాలక్షణము=నిర్జ్ఞాతప్రాప్యార్థప్రతీక్షణం ప్రతీక్షా, అని భాష్యము.

నితరాం ప్రత్యక్షాదినా జ్ఞాతః ప్రాప్యోఽర్థః రాజ్యాదిః యస్యాస్సా ప్రతీక్షా. అని గోపాలేంద్రయతి టీక.

౯-వ మంత్రము.

మూ. తిస్రో రాత్రీర్యదవాత్సీర్గృహే మే
ఽనశ్నన్బ్రహ్మన్నతిథిర్నమస్యః,

నమ స్తేఽస్తు బ్రహ్మన్ స్వస్తి మేఽస్తు
తస్మాత్ప్రతి త్రీన్వరాన్వృణీష్వ. ౯

పద. తిస్రః రాత్రీః యత్ అవాత్సీత్ గృహే మే అనశ్నన్ బ్రహ్మన్ అతిథిః నమస్యః, నమః తే అస్తు బ్రహ్మన్ స్వస్తి మే అస్తు తస్మాత్ ప్రతి త్రీన్ వరాన్ వృణీష్వ. ౯

టీక. బ్రహ్మన్=ఓబ్రాహ్మణోత్తముఁడా! యత్ = ఏ కారణమువలన, మే=నాయొక్క, గృహే = గృహమునందు, నమస్యః = నమస్కరించఁదగిన, అతిథిః=అతిథివిగావచ్చినవాఁడవై, అనశ్నన్ = భుజింపకయే, తిస్రఃరాత్రీః = మూఁడుదినములు. అవాత్సీః = నివసించియున్నాఁడవో, తత్ = ఆకారణము వలన, తే=నీకు, నమః= నమస్కారము, అస్తు = అగుఁగాక. బ్రహ్మన్ = ఓనచికేతసుఁడా! మే=నాకు, స్వస్తి=మంగళము, అస్తు=అగుఁగాక. తస్మాత్=అందువలన (అనఁగా మూఁడుదినములు నాయింటభుజింపకయున్నందువలన) ప్రతి= అందులకుబదులుగ, త్రీన్వరాన్ = మూఁడువరములను, వృణీష్వ = నాకడ్డనుండి కోరుకొనుము.

తా. వైవస్వతునియింటియందున్న అమాత్యాదులు అతని (వైవస్వతుని)యింటికి నచికేతుఁడు అతిథిగావచ్చి మూఁడురోజులుగా నిరాహారుఁడై యున్నవిషయమును, అతిథిపూజ నాచరింపనియెడల కలిగెడికీడును వైవస్వతునకు విన్నవింపఁగా వైవస్వతుఁడు అర్ఘ్యపాద్యాదిపూజాద్రవ్యపురస్సరముగ నచికేతసుని సమీపించి ఓబ్రాహ్మణోత్తమా! నచికేతా! నీవు నమస్కారార్హుఁడవగు అతిథివి. అట్టి నీవు నాయింటికి విచ్చేసి మూఁడునాళ్లు నిరాహారుఁడవైయుంటివి. నీకు నమస్కారముచేయుచున్నాఁడను. ఓబ్రాహ్మణోత్తముఁడా! యోగ్యుఁడవగు నీవు ఆహారములేక నాయింటియం దుండుటచేత తద్గృహస్వామినైన నాకు సంభవించెడికీడును నానమస్కారముచేత సుప్రీతుఁడవై నాకు కలుగకుండ ననుగ్రహింపుము. నీవనుగ్రహపూర్వకముగ నుండుట.

చేతనే నాకు క్షేమము నిరాటంకముగ కలిగినను నిన్ను మఱింత సంతోష పెట్టుటకయి నాయింట ఆహారములేక నివసించియున్న మూడురోజులకుఁగాను నీకిష్టములయిన మూడువరములను నీకిచ్చెదను. నీకభిమతములయినవానిని కోరుకొనుము.

౧౦-వ మంత్రము.

మూ. శాంతసంకల్ప స్సుమనా యథా స్యా
ద్వీతమన్యు ర్గౌతమో మాఽభిమృత్యో!,
త్వత్ప్రసృష్టం మాఽభివదేత్ప్రతీత
ఏత త్త్రయాణాం ప్రథమం వరం వృణే. ౧౦

పద. శాంతసంకల్పః సుమనాః యథా స్యాత్ వీతమన్యుః గౌతమః మా అభి మృత్యో, త్వత్ప్రసృష్టం మా అభివదేత్ ప్రతీతః ఏతత్ త్రయాణాం ప్రథమం వరం వృణే. ౧౦

టీక. మృత్యో=ఓమృత్యుదేవా! గౌతమః = గౌతమగోత్రోత్పన్నుఁడగు నాతండ్రి, మా అభి = నన్నుఁగూర్చి, శాంతసంకల్పః = నాకుమారుని యమునిదగ్గఱకు పంపితినిగదా వాఁడక్కడ యేమిచేయుచుండును ? అను మున్నగుతలంపులులేనివాఁడయి, సుమనాః = ప్రసన్నహృదయుఁడయి, మా అభి=నన్నుఁగూర్చి, వీతమన్యుః = పోయినరోషముగలవాఁడు, యథాస్యాత్ = ఏవిధముగానగునో, త్వత్ప్రసృష్టం = నీచేత విడువఁబడి యింటికిపంపఁబడిన, మా = నన్నుఁగూర్చి, ప్రతీతః = పొందఁబడిన స్మృతిగలవాఁడయి. (అనఁగా ఈవచ్చినబాలుఁడు ఇదివఱకు నాచేత యమునియింటికి పంపఁబడిన నచికేతసుఁడే సుమీ యని తలంచుటయే ఇచట స్మృతియని చెప్పఁబడినది.) అభివదేత్=పలుకునో, ఏతత్=ఇదియే, త్రయాణాం=నీవు ఇచ్చెదనన్న మూడువరములలో, ప్రథమంవరం=మొదటివరమునుగా, వృణే=వరించుచున్నాఁడను.

తా. (అర్ఘ్యపాద్యాదిసత్కారములొనర్చిన వైవస్వతుఁడు మూఁడు వరములను నీకిచ్చెదను కోరుకొనుమని నచికేతసునితో అనియున్నాడు కావున) నచికేతసుఁ డడుగుచున్నాఁడు. ఓవైవస్వతా! నీవు వరములను నాకివ్వఁదలఁచినయెడల మాతండ్రియగుగౌతముఁడు "కోపముతో పుత్రుని యమునియింటికి పంపితినే,వాఁడు యమునియింటికిపోయి ఏమిచేయుచున్నాఁడో" అనిపలువిధములుగా తలంచుచుండును. కావున నాతండ్రి అట్టిచింతలేక సంతుష్టుఁడయియుండుఁగాక. నాయందు అతనికి కోపములేకపోవుఁగాక. నీచేత మఱల యింటికిపంపఁబడిన నన్నుచూచి ఈవచ్చినబాలకుఁడు నాపుత్త్రుఁడగు నచికేతసుఁడే సుమీయని అతనికి బాగుగ జ్ఞాపకశక్తి కలిగియుండునటుల అనుగ్రహింపుము. దీనిని నీవు నాకిచ్చిన 3 వరములలో ప్రథమవరమునుగా నేను నిన్ను కోరుచున్నాఁడను. నాతండ్రిని సంతోషపెట్టుటయే నాకు మొదటివరము.

వివరణము.—యమలోకమునకుఁ బోయి తిరిగి వచ్చినవానిని జూచుట పాపము కావున వీనిని చూడఁగూడదని మాతండ్రి భీష్మించుకొని యుండక నన్నుఁగూర్చి కోపములేక సంతోషముతో నుండునటుల చేయుటయే అనఁగా తండ్రిని సంతోషపెట్టుటయే వరములలో మొదటివరము.

౧౧-వ మంత్రము.

మూ. యథా పురస్తా ద్భవితా ప్రతీత
ఔద్దాలకి రారుణి ర్మత్ప్రసృష్టః,
సుఖగ్ం రాత్రీ శ్శయితా వీతమన్యు
స్త్వాం దదృశివా న్మృత్యుముఖా త్ప్రముక్తమ్. ౧౧

పద. యథా పురస్తాత్ భవితా ప్రతీతః ఔద్దాలకిః ఆరుణిః మత్ప్రసృష్టః, సుఖం రాత్రీః శయితా వీతమన్యుః త్వాం దదృశివాన్ మృత్యుముఖాత్ ప్రముక్తమ్. ౧౧

టీక. (మృత్యుదేవతచెప్పుచున్నవాక్యమిది) ఔద్దాలకిః = ఔద్దాలకి యనియు, ఆరుణిః = అరుణియనియు పేరుగలవాజశ్రవసుఁడు, మత్ప్రసృష్టః= సాక్షేత ననుజ్ఞాతుఁడై, ప్రతీతః=ప్రీతిగలవాఁడై, యథాపురస్తాత్ =ఇదివఱకు ఏవిధముగా నీయందు ప్రీతికలిగియున్నాఁడో, తథా=అదేవిధముగా నీయందు ప్రీతిగలవాఁడు, భవితా=కాఁగలఁడు. సుఖం=సుఖముగా, రాత్రీః = రాత్రులను, శయితా=నిద్రించఁగలఁడు. మృత్యుముఖాత్ = మృత్యుముఖమునుండి, ప్రముక్తం=వదలఁబడిన, త్వాం=నిన్ను, దదృశివాన్ = చూచినవాఁడై, వీతమన్యుః=(నిన్నుఁగూర్చి) కోపములేనివాఁడు, భవితా=కాఁగలఁడు.

తా. నచికేతసుఁ డడిగిన ప్రథమవరమునకు అంగీకారమును మృత్యుదేవత యొసంగుచున్నది. నీవు నన్నుకోరినప్రకారము నీయందు యిదివఱకు నీతండ్రి ఎట్టి ప్రేమకలిగియుండెనో అట్టిప్రేమయే ఇఁకమీఁదకూడ నీతండ్రి నీయందు కలిగి యుండుఁగాక. నాయనుగ్రహమువలన మనస్సునం దేసంకటములులేక సుఖముగా రాత్రిళ్లు నీతండ్రికి నిద్రపట్టుఁగాక. మృత్యుముఖమునుండి విడువఁబడి తిరిగి యింటికి వచ్చిన నిన్నుఁ గాంచి క్రోధములేక ప్రీతిపూర్వకముగా నుండుఁగాక.

వివరణము.—మూలమునందుఁగల ఔద్దాలకిశబ్దము, ద్వివిధముగా భాష్యమునందు వ్యాఖ్యాతము.

౧. ఉద్దాలక ఏవ ఔద్దాలకిః. స్వార్థే. ఉద్దాలకుఁడే ఔద్దాలకి యనఁబడును.

౨. ఉద్దాలకస్యాపత్యం పుమాన్ ఔద్దాలకిః=ఇది తద్ధితాంతము. ఉద్దాలకుని పుత్త్రుఁడని యర్థము.

ఆరుణిః=అరుణస్యాపత్యం ఆరుణిః, అరుణునిపుత్త్రుఁడు ఆరుణి.

వాజశ్రవసుని ఔద్దాలకియనియు, అనఁగా ఉద్దాలకునిపుత్త్రుఁడనియు, ఆరుణి అనియు-అనఁగా అరుణునిపుత్త్రుఁడనియు చెప్పుట అయుక్తముగదా

యని తలంచి తన్నివారణార్థము ద్వ్యాముష్యాయణుఁడు, అని భాష్యకారుల వారు సమర్థించిరి. ద్వ్యాముష్యాయణుఁ డనఁగా కన్యాదానకాలమునం దపుత్త్రుఁడయినవాఁడు తనపుత్త్రికను కన్యాదానము చేయునప్పుడు అల్లునితో ఈకన్యకకు జన్మించునట్టిపుత్త్రుఁడు నాకున్నూ పుత్త్రునివలె పారలౌకిక క్రియల నాచరించవలయునను షరతును ఏర్పాటు చేసికొని అతని యంగీకారమును బడసినయెడల ఆపిల్లకు పుట్టినపుత్త్రుఁ డుభయులకు పుత్త్రుఁడగు చున్నాఁడు. ఇట్టివానిని ద్వ్యాముష్యాయణుఁ డందురు.

౧౨-వ మంత్రము.

మూ. స్వర్గే లోకే న భయం కించనాస్తి
న తత్ర త్వం న జరయా బిభేతి,
ఉభే తీర్త్వా అశనాయాపిపాసే
శోకాతిగో మోదతే స్వర్గలోకే. ౧౨

పద. స్వర్గే లోకే న భయం కించన అస్తి న తత్ర త్వం న జరయా బిభేతి, ఉభే తీర్త్వా అశనాయాపిపాసే శోకాతిగః మోదతేస్వర్గలోకే. ౧౨

టీక. (నచికేతసుఁడు రెండవవరము నడుగఁదలచి స్వర్గలోకస్థితిని వర్ణించుచున్నాఁడు.—) స్వర్గేలోకే=స్వర్గలోకమునందు, భయం = రోగాది నిమిత్తమయినభయము, కించన=కొంచెమైనను, నాస్తి = లేదు. తత్ర=ఆస్వర్గ లోకమునందు, త్వం=నీవు, న = లేదు. జరయా = ముదిమిచేతను, నబిభేతి = భయంపడుటలేదు. అశనాయాపిపాసే = ఆకలిదప్పికలను, ఉభే = రెంటిని, తీర్త్వా=దాటి, శోకాతిగః =బాహ్యమానస శోకవిరహితుఁడై, స్వర్గలోకే=స్వర్గ లోకమునందు, (ఉన్నవాఁడు) మోదతే=సంతోషించుచున్నాఁడు.

తా. (నచికేతసుఁ డడుగుచున్నాఁడు.—) స్వర్గలోకమునందు రోగాదినిమిత్తములవలన కలుగఁదగిన భయమేమియుం కలుగఁజాలదు. భూలోకమునందు జరాదులచేత ఆక్రమింపఁబడినవారలు నిన్నుఁగాంచి యెటుల

కఠ—4

భయంపడుదురో ఆవిధముగా స్వర్గలోకమునం దెవ్వరివల్లనుండియు భయ మెవ్వరికిని కలుగఁజాలదు. స్వర్గలోకమునందుండువారికి ఆఁకలిగాని దప్పికగాని ఏమియుం నుండఁజాలవు. వారికి బాహ్యామానసికములగు శోకము లేమియుం కలుగఁజాలవు.

వివరణము.—మొదటివరము తనతండ్రికి తనయందు కోపములేక యుండుట. ఆవరము నొసంగినతరువాత స్వర్గసాధనమగు అగ్నివిజ్ఞానమును రెండవ వరముగా అడుగఁదలఁచి ప్రథమమున స్వర్గవర్ణన మీమంత్రమునందు చెప్పఁబడినది.

౧౩-వ మంత్రము.

మూ. స త్వ మగ్నిం స్వర్గ్య మధ్యేషి మృత్యో<br>ప్రబ్రూహి త్వగ్ం శ్రద్దధానాయ మహ్యం,<br>స్వర్గలోకా అమృతత్వం భజంతే<br>ఏత ద్ద్వితీయేన వృణే వరేణ. ౧౩

పద. సః త్వం అగ్నిం స్వర్గ్యం అధ్యేషి మృత్యో ప్రబ్రూహి త్వం శ్రద్దధానాయ మహ్యం, స్వర్గలోకాః అమృతత్వం భజంతే ఏతత్ ద్వితీయేన వృణే వరేణ. ౧౩

టీక. మృత్యో = ఓమృత్యుదేవా! సః = ఆ, త్వం=నీవు, స్వర్గ్యం = స్వర్గసాధనభూతమయిన, అగ్నిం=అగ్నివిజ్ఞానమును, అధ్యేషి=గుర్తెఱుంగుదువు. శ్రద్దధానాయ=శ్రద్ధగల, మహ్యం=నాకొఱకు, ప్రబ్రూహి=బోధింపుము(యేన= ఏఅగ్నిచయనమునాచరించుటచేత యజమానులయినవారలు) స్వర్గలోకాః = స్వర్గలోకమును పొందినవారలయి, అమృతత్వం=మరణరాహిత్యమును-దేవత్వమును, భజంతే=పొందుచున్నారో, ఏతత్=అట్టి అగ్నివిజ్ఞానమును, ద్వితీయేన =రెండవదియగు, వరేణ=వరముచేత. వృణే=వరించుచున్నాఁడను.

తా. పూర్వమంత్రోక్తములగు జరా మరణ, అశనాయా పిపాసాది బాధలులేక నిత్యసంతోషముగా నుండుటయే స్వభావముగాఁగల స్వర్గలోక ప్రాప్తికి సాధనభూతమగు అగ్నిచయనమునుగూర్చి నీవు బాగుగా నెఱింగి యున్నాఁడవు కావున ఆయగ్నివిజ్ఞానమును అనఁగా అగ్నిచయనమును శ్రద్ధావంతుఁడనయి ప్రార్థించుచున్న నాకు ఉపదేశింపుము. ఏయగ్నిచయన మొనర్చిన యజమానులయినవారలు జరామరణవిరహితులయి దేవత్వమును పొందుచున్నారో అట్టి అగ్నిచయనమును నాకుపదేశింపమని రెండవవరముగా నడుగుచున్నాఁడను.

౧౪-వ మంత్రము.

మూ. ప్ర తే బ్రవీమి తదు మే నిబోధ
స్వర్గ్య మగ్నిం నాచికేతః ప్రజానన్,
అనంతలోకాప్తి మథో ప్రతిష్ఠాం
విద్ధి త్వమేతం నిహితం గుహాయామ్. ౧౪

పద. ప్ర తే బ్రవీమి తత్ ఉ మే నిబోధ స్వర్గ్యం అగ్నిం నాచికేతః ప్రజానన్, అనంతలోకాప్తిం అథో ప్రతిష్ఠాం విద్ధి త్వం ఏతం నిహితం గుహాయామ్.

టీక. నాచికేతః = ఓనచికేతసుఁడా! స్వర్గ్యం=స్వర్గప్రాప్తికి సాధన భూతమగు, అగ్నిం=అగ్నిచయనమును, ప్రజానన్ = బాగుగా నెఱింగిన నేను, తే=నీకు, తత్ ఉ = ఆయగ్నిచయనవిజ్ఞానమును, ప్రబ్రవీమి = ఉపదేశించు చున్నాఁడను. మే = నాయొక్క ఉపదేశమువలన, నిబోధ = తెలిసికొనుము. ఏతం = ఈయగ్నిని, అనంతలోకాప్తిం = అంతములేనిలోకముయొక్క ప్రాప్తికి సాధనభూత మయినదానినిగను, అథో = మఱియు, ప్రతిష్ఠాం = జగత్తుయొక్కస్థితికి ఆశ్రయభూత మయినదానిగను, గుహాయాం = విద్వాం

సులయొక్క బుద్ధిగుహాయందు, నిహితం = ఉన్నదానిగను, త్వం = నీవు, విద్ధి = తెలిసికొనుము.

తా. నచికేతసుఁడడిగిన రెండవవరమును మృత్యు వొసంగుట.— ఓనచికేతసుఁడా! నీవు నన్నుప్రార్థించిన రెండవవరమునుకూడ నేను నీకిచ్చు చున్నాఁడను. అనఁగా నీవడిగిన అగ్నివిజ్ఞానమునుగూర్చి నీకు బోధించు చున్నాఁడను. నీవేకాగ్రమయిన మనస్సుగలవాఁడవై గ్రహింపుము. స్వర్గ సాధనభూతమయిన అగ్నిచయనవిజ్ఞానమును నేను బాగుగానెఱింగి నీకుపదే శించుచున్నాఁడను. "నేనుపదేశించుచున్నాను. సావధానముగా గ్రహింపు" మనిచెప్పుట శిష్యబుద్ధి సమాధానార్థము. ఈయగ్నివిజ్ఞానము స్వర్గలోకప్రాప్తికి సాధనభూతము. మఱియు విరాడ్రూపమున జగత్తునకు ఆశ్రయభూతము. అట్టి యగ్నినిగూర్చియే నేనుపదేశించుచున్నాఁడను కావున నీవు ఆయగ్నిని ఎఱుంగుము. ఈయగ్ని మఱియు విద్వాంసులగువారియొక్క బుద్ధిగుహాయం దుండునది.

వివరణము.—'సత్రేధాఽఽత్మానం వ్యాకురుతే' అనుశ్రుతివలన సమష్టి రూపుఁడగు విరాట్పురుషుఁడే అగ్ని, వాయు, ఆదిత్యరూపములచేత వెలయు చున్నాఁడని శ్రుతియే చెప్పుచున్నది కావున విరాడ్రూపమయిన అగ్ని జగ త్తునకు ప్రతిష్ఠయని తెలియవచ్చుచున్నది.

౧౫-వ మంత్రము.

మూ. లోకాది మగ్నిం త మువాచ తస్మై
యా ఇష్టకా యావతీర్వా యథా వా,
సచాపి తత్ప్రత్యవద ద్యథోక్త
మథాస్య మృత్యుః పునరేవాహ తుష్టః. ౧౫

పద. లోకాదిం అగ్నిం తం ఉవాచ తస్మై యాః ఇష్టకాః యావతీః వా యథా వా, సః చ అపి తత్ ప్రత్యవదత్ యథోక్తం అథ, అస్య మృత్యుః పునః ఏవ ఆహ తుష్టః. ౧౫

టీక. (యమః=యముఁడు,) లోకాదిం=విరాడ్రూపమున ప్రపంచమునకు ఆదిపురుషుఁడును, తం=నచికేతసునిచేత ప్రార్థితుఁడయినట్టివాఁడును (అగు), అగ్నిం=అగ్నినిగూర్చి-అనఁగా అగ్నిచయనవిజ్ఞానమునుగూర్చి, తస్మై=ఆనచికేతసునికొఱకు, ఉవాచ=పలికెను-ఉపదేశించెను. యాః ఇష్టకాః=ఏస్వరూపముగల ఇష్టకలుకావలయునో, యావతీః=ఎన్నిసంఖ్యకలవికావలయునో, యథా వా=ఏవిధముగా ఆయిష్టకలను చయనముచేయవలయునో, (దీనిని ఆనచికేతసునకుపదేశించెను) సః చ అపి=ఆనచికేతసుఁడుచున్నూ, యథోక్తం=యముఁడుపదేశించినదానిని ఉపదేశించినవిధముగా, ప్రత్యవదత్ = మఱల ఒప్పచెప్పెను. అథ=తరువాత, అస్య=ఈనచికేతసునియొక్క (ప్రత్యుచ్చారణముచేత), తుష్టః =సంతుష్టుఁడయిన, మృత్యుః=యముఁడు, పునః ఏవ=మఱల, ఆహ=(నచికేతసునిగూర్చి యీచెప్పఁబోవురీతిగ) పలికెను.

తా. (వేదపురుషునివాక్యము) అగ్నిహోత్రుఁడు విరాట్పురుషస్వరూపుఁడు కావున అతఁడు లోకాది యనంబడుచున్నాఁడు. అట్టి అగ్నినిగూర్చి అనఁగా అగ్నిచయనవిజ్ఞానమునుగూర్చి నచికేతసునిచేత ప్రార్థితుఁడయినవైవస్వతుఁడు-యముఁడు నచికేతసునకుపదేశించెను. మఱియు ఆయగ్నిచయనమునం దేయేస్వరూపముగలఇష్టకలను, ఎన్నిసంఖ్యగలవానిని ఏవిధముగా చయనము-పేర్చుట-చేయవలయునో ఆవిషయమునుగూడ బాగుగా బోధించెను. శ్రద్ధాభక్తులుగల ఆనచికేతసుఁడు యముఁడు తనకుబోధించిన అగ్నిచయనవిజ్ఞానమును యముఁడుబోధించినదంతయు మనస్సునందవగాహనముచేసుకొని తనకు బాగుగా తెలిసినదనువిషయమును ఆచార్యుఁడగు యమునకు తెలుపుటకుగాను మఱల యమునకు ఆయగ్నిచయనమును ఒప్పగించెను. సకృచ్ఛ్రవణముచేతనే ఇటుల చక్కఁగా గ్రహించి మఱల చక్కఁగాచెప్పినందులకు యముఁడు సంతుష్టుఁడయి నచికేతసుఁడడిగిన మూఁడువరములకంటె వేఱయిన మఱియొకవరము నివ్వఁదలచినవాఁడై ఇట్లని పలికెను.

౧౬-వ మంత్రము.

మూ. త మబ్రవీ త్ప్రీయమాణో మహాత్మా
వరం తవేహాద్య దదామి భూయః,
తవైవ నామ్నా భవితాఽయ మగ్నిః
సృంకాం చేమా మనేకరూపాం గృహాణ. ౧౬

పద. తం అబ్రవీత్ ప్రీయమాణః మహాత్మా వరం తవ ఇహ అద్య దదామి భూయః, తవ ఏవ నామ్నా భవితా అయం అగ్నిః సృంకాం చ ఇమాం అనేకరూపాం గృహాణ. ౧౬

టీక. మహాత్మా=మహాత్ముఁడగుఆయముఁడు, ప్రీయమాణః=నచికేతసుని యందు ప్రీతిగలవాఁడయి, తవ = నీకు, ఇహ=ఇక్కడ, అద్య=ఇప్పుడే, భూయః=తిరిగి, వరం=(మఱొకశ్రేష్ఠ) వరమును, దదామి=ఇచ్చుచున్నాను. అని, తం=ఆనచికేతసునిగూర్చి, అబ్రవీత్=పలికెను. అయంఅగ్నిః=ఈ చయనాగ్ని, తవనామ్నా ఏవ=నీయొక్క పేరుచేతనే, భవితా=కాగలదు. అనేకరూపాం= అనేకరూపములుగల-అనఁగా విచిత్రమయిన, ఇమాం = ఈ, సృంకాం=రత్నమాలను, గృహాణ=గ్రహింపుము.

తా. ఆమృత్యుదేవత సంతుష్టుఁడయిపలికినవిధము చెప్పఁబడుచున్నది:- ఆనచికేతసునియందు శిష్యుఁడగువానికి ఉండవలసిన సుగుణములన్నియు సమగ్రముగ నున్నందులకు యముఁడు సంతుష్టుఁడై ఉదారబుద్ధిగల మహానుభావుఁడు కావున శిష్యుఁడగు నచికేతసుఁడడిగిన 3 వరములకంటె అధికముగ నాల్గవవరము తనయొక్క ప్రీతికి సూచకముగా నివ్వఁదలచినవాఁడై నీవడిగినవరము కాక మఱొకవరమును నీకిచ్చుచున్నాను అని ఇట్లనిచెప్పెను. నేను నీకుబోధించిన అగ్నిచయనము నీపేరుతోడనే లోకమునందు వెలయుఁగాక. అనఁగా నాచికేతచయనమని లోకమునందు ప్రసిద్ధి నందుఁగాక. చిత్రవిచిత్రమయినట్టియు, శబ్దించుచున్నట్టియు, రత్నఖచితమును అగు నీసృంకను - అనఁగా

రత్నమాలనుకూడ స్వీకరింపుము. లేక సృంకమనఁగా అనుల్సితమయిన కర్మసంబంధమయిన విజ్ఞానమనియుం నర్థము. దానినికూడ గ్రహింపుము. అనేకఫలహేతుభూతమయిన కర్మవిజ్ఞానమునుగూడ గ్రహింపుమని భావము.

౧౭-వ మంత్రము.

మూ. త్రిణాచికేత స్త్రిభిరేత్య సంధిం
త్రికర్మకృ త్తరతి జన్మమృత్యూ,
బ్రహ్మజజ్ఞం దేవమీడ్యం విదిత్వా
నిచాయ్యేమాగ్ం శాంతిమత్యంత మేతి. ౧౭

పద. త్రిణాచికేతః త్రిభిః ఏత్య సంధిం త్రికర్మకృత్ తరతి జన్మమృత్యూ, బ్రహ్మజజ్ఞం దేవం ఈడ్యం విదిత్వా నిచాయ్య ఇమాం శాంతిం అత్యంతం ఏతి.

టీక. (మఱల అగ్నిచయనకర్మస్తుతి చెప్పఁబడుచున్నది.) త్రిణాచికేతః=మూఁడుపర్యాయములు నాచికేతాగ్నిచయనమొనర్చినవాఁడు, లేక నాచికేతాగ్నిచయనవిధి నెఱింగి తన్మంత్రాధ్యయనమొనర్చి ఆచయనవిధి ననుష్ఠించినవాఁడు. త్రిభిః = తల్లి తండ్రి ఆచార్యుఁడు అనుమువ్వురిచేత, సంధిం=సంబంధమును, ఏత్య=పొంది, త్రికర్మకృత్=యాగము స్వాధ్యాయము దానము అనుమూఁడుకర్మలనొనర్చుచున్న(యెడల)వాఁడు, జన్మమృత్యూ=జన్మమరణములను, తరతి = అతిక్రమించుచున్నాఁడు. బ్రహ్మజజ్ఞం=హిరణ్యగర్భునివల్లనుండి పుట్టినవాఁడును సర్వజ్ఞుఁడును, ఈడ్యం = కొనియాఁడదగినవాఁడును అగు, దేవం=దేవుని, విదిత్వా=తెలిసికొని, నిచాయ్య = శాస్త్రప్రమాణముతోఁ చూచి, ఇమాం=ఈ, శాంతిం=శాంతిని, అత్యంతం=మిక్కిలి, ఏతి=పొందుచున్నాఁడు.

తా. మఱల నీమంత్రమునందు కర్మస్తుతిచేయఁబడుచున్నది.-త్రిణాచికేతుఁడు అనఁగా మూఁడుపర్యాయములు నాచికేతాగ్నిచయనమొనర్చిన

వాఁడు లేక నాచికేతాగ్నిచయనవిజ్ఞానమెఱింగి, తన్మంత్రముల నధ్యయన మొనర్చి, ఆచయనము ననుష్ఠించినవాఁడు. ముగ్గురిచేతను అనఁగా తల్లి, తండ్రి, ఆచార్యుఁడు అనుముగ్గురిచేతను అనుశాసనమును యథావిధిగాపొంది, ఈవిషయమునే "మాతృమా న్పితృమా నాచార్యవాన్బ్రూయాత్," (బృహ ౬-౧-౨) అనుశ్రుతి సూచించుచున్నది. లేక వేద, స్మృతి, శిష్టులచేతను లేక ప్రత్యక్షానుమానాగమములచేతను బోధింపఁబడియూడుకర్మలను అనఁగా ఇజ్యాధ్యయనదానములనొనర్చువాఁడు జన్మమృత్యువులను అతిక్రమించుచున్నాఁడు. మఱియు బ్రహ్మజజ్ఞుఁడును, (బ్రహ్మజుఁడనఁగా హిరణ్యగర్భునివల్లనుండి పుట్టినవాఁడు, జ్ఞుఁడనఁగా సర్వజ్ఞుఁడును,) ప్రకాశించుచున్న జ్ఞానాదిగుణములుగలవాఁడగుటచేత దేవశబ్దవాచ్యుఁడును, కొనియాడఁదగినవాఁడును అగువానిని శాస్త్రప్రమాణముచేత నెఱింగి ఆత్మభావముచేత స్వబుద్ధిప్రత్యక్షమైనయీ శాంతిని-అనఁగా ఉపరతిని అత్యంతము పొందుచున్నాఁడు. జ్ఞానకర్మసముచ్చయానుష్ఠానమువలన వైరాజపదమును పొందుచున్నాఁడని భావము.

వివరణము.—నాచికేతాగ్నిచయనమునకు ఇష్టకలు, ౭౨౦ సంఖ్యగలవి. సంవత్సరమునకు సాయంప్రాతఃకాలములందు చేయఁబడుచున్న అగ్నిహోత్రములుకూడ ౭౨౦ సంఖ్యగలవి యగుచున్నవి. ఇట్టి సంఖ్యగలసంవత్సరాత్మకుఁడ నగునేనున్నూ అగ్నియున్నూ ఒక్కటేయనుభావము కలిగియుండుటయే ఆత్మభావమని యెఱుంగవలయును.

౧౮-వమంత్రము.

మూ. త్రిణాచికేత స్త్రయ మేత ద్విదిత్వా
యఏవం విద్వాం శ్చినుతే నాచికేతం,
సమృత్యుపాశా న్పురతః ప్రణోద్య
శోకాతిగో మోదతే స్వర్గలోకే. ౧౮

పద. త్రిణాచికేతః త్రయం ఏతత్ విదిత్వా యః ఏవం విద్వాన్ చినుతే నాచికేతం, సః మృత్యుపాశాన్ పురతః ప్రణోద్య శోకాతిగః మోదతే స్వర్గలోకే.

టీక. త్రిణాచికేతః = త్రిణాచికేతుఁడగు, యః విద్వాన్=ఏవిద్వాంసుఁడయినవాఁడు, ఏతత్ త్రయం= ఈచెప్పఁబడినమూఁడింటిని, విదిత్వా= తెలుసుకొని, నాచికేతం = నాచికేతాగ్నిని, చినుతే = చయనము నొనర్చుచున్నాఁడో, సః=వాఁడు, మృత్యుపాశాన్ = మృత్యుపాశములను, (అధర్మ, అజ్ఞాన, రాగ, ద్వేషాదిగుణస్వరూపములగువానిని)పురతః=ముందుగా, ప్రణోద్య = తనశరీరమునుండి దూరముగా తీసివేసుకొన్నవాఁడై, శోకాతిగః=మానసదుఃఖరహితుఁడై, స్వర్గలోకే = వైరాజమగు స్వర్గలోకమునందు విరాడాత్మస్వరూపమును పొందుటచేతను, మోదతే=ఆనందించుచున్నాఁడు.

తా. త్రిణాచికేతుఁడగు ఏవిద్వాంసుఁడు ఈనాచికేతాగ్నిచయనమునకు ఎన్నియిష్టకలో, ఆయిష్టకలు ఏవిధముగానుండవలయునో, వానిని ఎటుల చయనమొనర్పవలయునో చక్కఁగా నెఱింగి నాచికేతాగ్నిచయన మొనర్చిన యెడల వాఁడు అధర్మ, అజ్ఞానరాగద్వేషాదిలక్షణములగు మృత్యుపాశములను ఈదేహముండఁగనే తీసివేసికొని శోకవిరహితుఁడై విరాడాత్మస్వరూపముగలవాఁడయి వైరాజమను స్వర్గలోకమునందు ఆనందించుచున్నాఁడు.

వివరణము.——త్రిణాచికేతుఁడనఁగా 3 పర్యాయములు నాచికేతాగ్నిచయనమొనర్చినవాఁడు లేక ఆనాచికేతాగ్నిచయన విధినెఱింగి, తన్మంత్రములనధ్యయన మొనర్చి తత్క్రతువునొనర్చినవాఁడు. నాచికేతాగ్నిచయనమున కుపయోగించు ఇష్టక (ఇటుకరాయి)లెట్టియాకారముగలవిగా నుండునో, ఎన్నిసంఖ్యలుగల ఎన్ని ఇష్టకలు కావలయునో, వానిని యెటుల క్రతువునందుపయోగించవలయునో ఆవిషయముల నెఱుంగవలయుననిభావము. అధర్మ, అజ్ఞానాదులను మృత్యుపాశములనఁగా నిరూపించుట బాధకత్వగుణసంబంధముభయత్ర తుల్యమగుటచేతనని యెఱుంగవలయును.

౧౯-వ మంత్రము.

మూ. ఏష తే ఽగ్ని ర్నచికేతః స్వర్గ్యో
యమవృణీథా ద్వితీయేన వరేణ,
ఏతమగ్నిం తవైవ ప్రవక్ష్యంతి జనాస
స్తృతీయం వరం నచికేతో వృణీష్వ. ౧౯

పద. ఏషః తే అగ్నిః నచికేతః స్వర్గ్యః యం అవృణీథాః ద్వితీయేన వరేణ, ఏతం అగ్నిం తవ ఏవ ప్రవక్ష్యంతి జనాసః తృతీయం వరం నచికేతః వృణీష్వ. ౧౯

టీక. నచికేతాః=ఓనచికేతసుఁడా! ద్వితీయేన వరేణ=రెండవదియగు వరముచేత, యం = నాచికేతాగ్ని చయనరూపమగు ఏయగ్నివిజ్ఞానమును, అవృణీథాః = వరమునుగా వరించితివో, స్వర్గ్యః=స్వర్గప్రాపకమగు, ఏషః=ఈ, అగ్నిః = నాచికేతాగ్ని, తే=నీకు సంబంధించినది యగుఁగాక. జనాసః = జనులందఱు, ఏతం అగ్నిం=ఈయగ్నిచయనమును, తవఏవ=నీకు సంబంధించిన దానినిగానే, (అనఁగా నాచికేతాగ్నియని) ప్రవక్ష్యంతి = పలుకగలరు. నచికేత = ఓనచికేతుఁడా! తృతీయం వరం=మూఁడవవరమును, వృణీష్వ = వరింపుము.

తా. ఓనచికేతుఁడా రెండవవరముచేత స్వర్గప్రాపకమగు ఏనాచికేతాగ్నిచయన విజ్ఞానరూపమగు వరమును నావలన నీవు పొందియున్నాఁడవో అట్టి స్వర్గప్రాప్తిసాధనభూతమగు నాచికేతాగ్నిచయనవిజ్ఞానము నీకు సంబంధించినదే. ఇదిమొదలుకొని జనులందఱు ఈ నాచికేతాగ్నిచయనవిజ్ఞానమును నీకు సంబంధించిన దానినిగానే (నాచికేతాగ్నిచయనమని) చెప్పుచుందురు. నీకు నేను ఇచ్చెదనన్న మూఁడవవరమునుకూడ నీవునన్ను కోరుకొనుము. ఆమూఁడవ వరమును నేను నీకిచ్చువఱకు నేను నీకు ఋణపడియుందునని భావము.

వివరణము.—లోకమునందు విద్యోపదేశమును ప్రార్థితుఁడయి చేయ వలయునుగాని స్వయముగా ప్రేరణమొనర్చి యుపదేశించుట అనుచితమయి నను యముఁడు స్వయముగా అతనికి 3 వరముల నివ్వవలసినవాఁడు అగుట చేత నచికేతసునకు ఋణపడియున్నాఁడు కావున నచికేతసుఁడు త్వరపడి యడుగకపోయినను యముఁడుఁ దాను ఋణపడియున్న దానిని తీర్చుకొనుటకు, నచికేతుఁడు ఉపదేశమునకు అర్హుఁడని యెంచి ప్రేరణ మొనర్చుట ఉచితమే యగుచున్నది.

౨౦-వ మంత్రము.

అవ. ఇంతవఱకుచెప్పఁబడిన మంత్రబ్రాహ్మణరూపమయిన దానిచేత తెలియుచున్న విషయమేమనఁగా నచికేతునకు యముఁడొసంగిన రెండువర ములకు సంబంధించినవిషయము ఆత్మతత్త్వవస్తుయాథాత్మ్యవిజ్ఞానమునకు సంబంధించినదికాదని తెలిసినది. విధిప్రతిషేధరూపముతో క్రియాకారక ఫలాధ్యారోపలక్షణములతో ఆత్మయం దారోపితమయిన అజ్ఞానరూప సంసారబీజముయొక్క నివృత్తికొఱకు క్రియాకారక ఫలాధ్యారోప లక్షణ శూన్యమును అత్యంతిక నిశ్శ్రేయసప్రయోజనమును అగు ఆత్మతత్త్వమును బోధించుటకు ఉత్తరగ్రంథము ప్రారంభింపఁబడుచున్నది. అట్టియాత్మతత్త్వము నచికేతుఁడడిగిన రెండవవరముయొక్క ప్రాప్తిచేతకూడ పూర్తికాలేదనియు, తదర్థము మూఁడవవరముచేత ఆత్మజ్ఞానమును ప్రత్యేకముగా అడుగుచున్నాఁ డనియు నీఆఖ్యాయికచేత స్పష్టీకరింపఁబడుచున్నది.—

మూ. యేయం ప్రేతే విచికిత్సా మనుష్యే
ఽస్తీత్యేకే నాయ మస్తీతి చైకే,
ఏత ద్విద్యా మనుశిష్ట స్త్వయాఽహం
వరాణా మేష వర స్తృతీయః. ౨౦.

పద. యా ఇయం ప్రేతే విచికిత్సా మనుష్యే అస్తి ఇతి ఏకే న

అయం అస్తి ఇతి చ ఏకే, ఏతత్ విద్యాం అనుశిష్టః త్వయా అహం వరాణాం ఏషః వరః తృతీయః. ౨౦

టీక. మనుష్యే=మనుష్యుఁడు, ప్రేతే=మరణించినవాఁ డగుచుండఁగా, అయం అస్తి ఇతి ఏకే = దేహేంద్రియములకు భిన్నముగ ఆత్మయనువాఁ డొకఁడు ఉన్నాఁడని కొందఱున్నా, అయం న అస్తి ఇతి చ ఏకే=ఆత్మయను వాఁడు దేహేంద్రియములకు భిన్నముగ లేఁడని కొందఱున్నా (పలుకు చున్నారు.) త్వయా = నీచేత, అనుశిష్టః = శాసింపఁబడిన, అహం = నేను, ఏతత్=దీనిని, విద్యాం= తెలిసికొనియెదను. వరాణాం = మీరు నాకిచ్చెదనని పలికిన మూఁడువరములలో, ఏష వరః = ఈవరము, తృతీయః = మూఁడవది యగుఁగాక.

తా. కర్మగోచరమయినట్టియు, సాధ్యసాధనలక్షణ మయినట్టియు, అనిత్యమయినట్టియు సంసారమునుండి విరక్తిని పొందినవానికే ఆత్మజ్ఞానము నందు అధికారమగువిషయమును తెలుపుటకయి సంసారముయొక్క నిందను వ్యక్తీకరించుటకయి ఆసంసారసుఖముయొక్క ప్రలోభనము, తదుపరి తన్నిందమున్నగునవి ప్రథమవల్లియొక్క చివరవఱకు క్రమముగ వ్యక్తీకరింపఁబడు చున్నది.— మూఁడవవరమును కోరుకొనుము| అని యమునిచేత నాచికేతుఁడు చెప్పఁబడినవాఁడయి ఇట్లని మూఁడవవరమును అడిగెను—మనుష్యుఁడు మరణించినతరువాత శరీరేంద్రియమనోబుద్ధులకు వ్యతిరిక్తముగ నీదేహమునుండి మఱొకదేహాంతరమును పొందునట్టి ఆత్మయనువాఁ డొకడున్నాఁడని కొందఱున్నా లేఁడని కొందఱున్నా పలుకుచున్నారుగదా! ఈరెండుపక్షములలో నెయ్యది న్యాయమో ఆవిషయమును ప్రత్యక్షప్రమాణముచేతగాని అనుమానప్రమాణముచేతగాని ఎఱుంగుటకు వీలులేకయున్నది. ఈవిషయము తెలిసినగాని తక్కినవిషయములనుగూర్చి చర్చించుటకే అవకాశములేదు. సర్వజ్ఞుఁడవగు నీవలన నాకీసంశయము నివర్తింపవలయును. నీవిచ్చెదనన్న మూఁడువరములలో మిగిలియున్న మూఁడవవరముగా నీవిషయమును నాకు బోధింపుము.

వివరణము.—ఇదివఱకు ఇచ్చిన రెండువరములలో మొదటి వరము తండ్రికి తనయందు మంచితలంపు కలుగవలయుననియు, రెండవవరము, స్వర్గలోకమునుపొందుటకు తగినసాధనమును నిరూపించుటయు అగుచున్నవి. ఈ రెండువరములున్నూ సంసారమునకు సంబంధించినవిగాని, సంసారమును అతిక్రమించినవి కావు. ౩-వ వరముమాత్రము ఆత్మతత్త్వవిషయము అని గ్రహించవలయును. ఇదిమొదలుకొని యీవల్లియొక్క అంతమువఱకు ఆత్మతత్త్వమును గూర్చి తెలిసికొనుట దుశ్శకము కావున మఱొకవరమును కోరుకొనుము అని యముఁడు క్రొత్తక్రొత్త ప్రలోభనములను చెప్పుటయు, నచికేతసుఁడు ఆ ప్రలోభనములకు లోఁబడక ఆత్మతత్త్వమునే తనకు ౩-వ వరముగా బోధించుమని చివరవఱకు దృఢముగానుండి యడిగినటుల వల్లి సమాప్తమగుచున్నది. ౨-వ వల్లియొక్క ఆరంభమునుండి యముఁడు ఆత్మతత్త్వము నుపదేశించును.

౨౧-వ మంత్రము.

అవ. ఈనచికేతుఁడు నిశ్శ్రేయసమునకు సాధనభూతమగు ఆత్మజ్ఞానమునకు అర్హుఁడగునా కాఁడా యను పరీక్షణార్థము యముఁ డిట్లు పలుకుచున్నాఁడు:—

మూ. దేవైరత్రాపి విచికిత్సితం పురా
న హి సుజ్ఞేయ మణురేష ధర్మః,
అన్యం వరం నచికేతో వృణీష్వ
మా మోపరోత్సీ రతిమాసృజైనమ్. ౨౧.

పద. దేవైః అత్ర అపి విచికిత్సితం పురా న హి సుజ్ఞేయం అణుః ఏషః ధర్మః, అన్యం వరం నచికేతః వృణీష్వ మా మా ఉపరోత్సీః అతి మా సృజ ఏనమ్. ౨౧

టీక. ఓనచికేతుఁడా! అత్ర = ఈయాత్మతత్త్వముయొక్కవిషయమునందు, పురా = పూర్వకాలమునందు, దేవైః అపి = దేవతలచేతనున్నూ, విచి-

కిత్సితం=సంశయింపఁబడినది, సుజ్ఞేయం=సుఖముగా తెలిసికొనఁదగినది, నహి=కాదు. ఏషః ధర్మః=ఈ యాత్మధర్మము, అణుః = మిక్కిలిసూక్ష్మమయినది. (కావున) నచికేతః = ఓనచికేతుఁడా! అన్యం = వేఱయిన, వరం=వరమును, వృణీష్వ=వరింపుము. మా=నన్ను, మా ఉపరోత్సీః = నిర్బంధింపవలదు. మా=నన్నుఁగూర్చి, ఏనం=ఈవరమును, అతిసృజ=వదలుము.

తా. పూర్వకాలమునందు దేవతలుకూడా ఈయాత్మతత్త్వవస్తువును గూర్చి సంశయముగలవారలయి విచారించిరి. ఈవిషయము సులభముగా తెలియునదికాదు. ఈయాత్మధర్మము మిక్కిలిసూక్ష్మమయినది కావున ప్రాకృతులగుజనులకు గోచరించునదికాదు. కనుక చెప్పినను తెలుసునో తెలియదో యను సందేహముగల యీవిషయమునువదలి అసందిగ్ధఫలముగల మఱొకవరమును నీవు కోరుకొనుము. ఋణగ్రస్తుని ఉత్తమర్ణుఁడు (అప్పుయిచ్చినవాఁడు) నిర్బంధించునటుల నీవు నన్నీవరము నిమిత్తము బాధింపకుము. ఈవరమును వదలి మఱొకవరమును నన్ను అడుగుము.

వివరణము:—దేవతలు అప్రతిహతజ్ఞానులుగదా. వారికిఁగూడా ఈ విషయమునుగూర్చి సంశయముగలదా యను ఆక్షేపనిరాసార్థము 'పురా' యని చెప్పఁబడినది. అనఁగా సృష్టికాలమునందు దేవతల కిట్టిసంశయము కలిగి యుండెను. తరువాత ప్రబోధితులయి వారీవిషయము నెఱింగిరి.

ఆత్మధర్మము 'అణువు' అని చెప్పఁబడినదిగదా. అణుపరమాణు మని తదర్థముకాదు. అణువనఁగా సూక్ష్మమని యిచట గ్రహించవలయును.

౨౨-వ మంత్రము.

అవ. యముఁడు చెప్పినదానికి నచికేతునియొక్క ప్రత్యుత్తరము:—

మూ. దేవైరత్రాపి విచికిత్సితం కిల
త్వం చ మృత్యో య న్న సుజ్ఞేయమాత్థ,

వక్తా చాస్య త్వాదృ గన్యో న లభ్యో
నాన్యో వర స్తుల్య ఏతస్య కశ్చిత్. ౨౨

పద. దేవైః అత్ర అపి విచికిత్సితం కిల త్వం చ మృత్యో యత్ న సుజ్ఞేయం ఆత్థ, వక్తా చ అస్య త్వాదృక్ అన్యః న లభ్యః న అన్యః వరః తుల్యః ఏతస్య కః చిత్." ౨౨

టీక. అత్ర = ఈయాత్మవస్తువునుగూర్చి, దేవైః అపి = దేవతలచేత కూడా, విచికిత్సితం కిల = సంశయింపఁబడినదిగదా. మృత్యో = ఓయమధర్మ రాజా! యత్=ఏకారణమువలన త్వంచ=నీవున్ను, న సుజ్ఞేయం=సుఖముగా తెలిసికొనుటకు శక్యముకానిదని, ఆత్థ = పలికియున్నావుగదా. అస్య=ఈఆత్మ తత్త్వముయొక్క, వక్తా = చెప్పునట్టివాఁడు, త్వాదృక్ = నీవంటి, అన్యః= మఱొకఁడు, నలభ్యః=లభింపఁడు. ఏతస్య=ఈవరమునకు, తుల్యః=సమానమగు, అన్యః=మఱొక, వరః=వరము, నకశ్చిత్=ఒకటియులేదు.

తా. ఈయాత్మధర్మమునుగూర్చి దేవతలుకూడా సంశయగ్రస్తులయి విచారణ సలిపియుండిరని నీవే చెప్పుచున్నావుగదా. ఈయాత్మతత్త్వము సులభముగా తెలియునట్టిదికాదనియు నీవే చెప్పియున్నావు. గొప్పగొప్ప పండితులకుఁగూడా యీవిషయము అనఁగా ఆత్మతత్త్వము సులభముగా తెలియునది కాదు. ఈయాత్మతత్త్వమును బోధించుటకు నీకంటె భిన్నుఁడగు మఱొకబ్రహ్మవేత్త లభింపఁజాలఁడు. నిశ్శ్రేయసప్రాప్తికి హేతుభూతమగు నీవరమునకు సమానమయిన మఱొకవరముకూడ లేదు. ఏలయనఁగా నిశ్శ్రేయసప్రాప్తికంటె భిన్నమయినసకలవరములు అనిత్యఫలప్రదములు కావున ఇతరవరములు నాకక్కఱలేదని భావము.

౨౩-వ మంత్రము.

అవ. నచికేతుఁ డిట్లుచెప్పినను యముఁడు మఱల ఇట్లు 3 మంత్రములతో ప్రలోభించుచున్నాఁడు:—

మూ. శతాయుషః పుత్రపౌత్రాన్వృణీష్వ
బహూన్పశూన్హస్తిహిరణ్య మశ్వాన్,
భూమే ర్మహదాయతనం వృణీష్వ
స్వయంచ జీవ శరదో యావ దిచ్ఛసి. ౨౩

పద. శతాయుషః పుత్రపౌత్రాన్ వృణీష్వ బహూన్ పశూన్ హస్తిహిరణ్యం అశ్వాన్, భూమేః మహత్ ఆయతనం వృణీష్వ స్వయం చ జీవ శరదః యావత్ ఇచ్ఛసి. ౨౩

టీక. శతాయుషః = నూరుసంవత్సరములు ఆయుస్సుగల, పుత్రపౌత్రాన్=పుత్త్రులను పౌత్త్రులను, వృణీష్వ = వరింపుము. బహూన్=అనేకములగు, పశూన్ = గవాదిలక్షణములగుపశువులను, హస్తిహిరణ్యం=ఏనుఁగులను బంగారమును, అశ్వాన్ = అశ్వములను, భూమేః = భూమియొక్క, మహత్=గొప్పదయిన, ఆయతనం=ఆశ్రయమగుమండలమును లేక సామ్రాజ్యమును, వృణీష్వ=వరింపుము. స్వయం చ = స్వయముగా నీవున్నూ, యావత్ శరదః=ఎన్నిసంవత్సరములు, ఇచ్ఛసి=జీవించియుండుటకు ఇచ్ఛయించుచున్నావో (అంతకాలము) జీవ=జీవించియుండుము.

తా. (యముఁడు నచికేతసుని ప్రలోభించుటకు మఱల నిట్లుపలుకుచున్నాఁడు:—నూరుసంవత్సరములు జీవించియుండునట్టి పుత్రపౌత్రాదులు కలిగియుండవలయు నను వరమును కోరుకొనుము. అసంఖ్యాకమగు గవాది లక్షణమగు పశుసంపదను కోరుకొనుము. ఏనుఁగులు, గుఱ్ఱములు, బంగారము మున్నగువానిని కోరుకొనుము. మఱియు నీభూతలముకంటె విస్తారమయిన రాజ్యము కావలయునని కోరుకొనుము. ఇన్నియున్నను నేను అల్పాయుస్సు కలిగియుందునేని వీనివలన నాకు కలుగఁబోవు ప్రయోజనమేమియని నీవు తలంచెదవేని నీవెంతకాలము సకలేంద్రియసామర్థ్యసహితుఁడవయి జీవించియుండవలయునని తలంచెదవో అంతకాలము సుఖముగా జీవించియుండు నటుల వరమును కోరుకొనుము.

వివరణము:—ఆయతన మనఁగా మండలమని చెప్పఁబడుచున్నది. ౪౦ యోజనముల పరిమాణముగల భూభాగము మండలము. సామ్రాజ్య మనఁగా జనపదసంరక్షణమని భావము.

౨౪ -వ మంత్రము.

మూ. ఏత త్తుల్యం యది మన్యసే వరం
వృణీష్వ వి_త్తం చిరజీవికాం చ,
మహాభూమౌ నాచికేత_స్త్వమేధి
కామానాం త్వా కామ భాజం కరోమి. ౨౪

పద. ఏతత్తుల్యం యది మన్యసే వరం వృణీష్వ వి_త్తం చిరజీవికాం చ, మహాభూమౌ నాచికేతః త్వం ఏధి కామానాం త్వా కామభాజం కరోమి.

టీక. ఏతత్ తుల్యం = నేనిదివఱకుచెప్పినవానితో సమానమయిన, వరం =మఱొకవరమును, మన్యసేయది=నీవుతలంచినయెడల, వృణీష్వ = వరింపుము. వి_త్తం=విస్తారమయిన హిరణ్యరత్నాదిద్రవ్యమును, చిరజీవికాంచ = చిరజీవిత్వ మునున్ను, వృణీష్వ=వరింపుము. నాచికేతః=ఓనచికేతుఁడా! మహాభూమౌ = విశాలమయిన యీభూలోకమునందు, త్వం= నీవు, ఏధి=రాజుగానుండుము. త్వాం=నిన్ను, కామానాం = దివ్యమానుషకామములలో, కామభాజం=కోరిక లన్నిటిని పొందినవానినిగా, కరోమి=చేయుచున్నాఁడను.

తా. నేనిదివఱకు నీ కొసంగెదననిచెప్పిన వరములుమాత్రమేగాక ఆ వరములతో సమానమయిన మఱొకవరమునుగూడ నీవు కోరుకొనుము. మఱియుఁ విస్తారమగు బంగారము రత్నములు మున్నగుధనమున్నూ, అట్టి సంపదతోఁగూడిన చిరజీవిత్వమునున్నూ నీవు వరముగా నడుగుము. వేయి మాటలెందుకు? ఈ భూమండలమునకు సార్వభౌముఁడవయి యుండునట్టి వరమును కోరుము. నేను సత్యసంకల్పుఁడను కావున మానుషములును, దివ్యము లును అగు నేయే కామములుగలవో ఆ కామములలో నేవి నీకుకావలయునో

వానిని కోరుకొనుము. నీవుకోరిన దివ్యమానుషకామముల నన్నిఁటిని నీ కొసంగెదను.

వివరణము.—ఇదివఱకు నూరుసంవత్సరములు ఆయుస్సుగల పుత్త్రపౌత్త్రాదులను, పశువులను, రాజ్యమును అని విడివిడిగా చెప్పఁబడినది. ఈ మంత్రమునందు అవన్నియు సముచ్చయముగా చెప్పఁబడినది.

౨౫-వ మంత్రము.

మూ. యే యే కామా దుర్లభా మర్త్యలోకే
సర్వా న్కామాగ్ శ్ఛందతః ప్రార్థయస్వ,
ఇమా రామా స్సరథా స్సతూర్యా
న హీదృశా లంభనీయా మనుష్యైః,
ఆభి ర్మత్ప్రత్తాభిః పరిచారయస్వ
నచికేతో మరణం మాఽనుప్రాక్షీః. ౨౫

పద. యే యే కామాః దుర్లభాః మర్త్యలోకే సర్వాన్ కామాన్ ఛందతః ప్రార్థయస్వ, ఇమాః రామాః సరథాః సతూర్యాః న హి ఈదృశాః లంభనీయాః మనుష్యైః, ఆభిః మత్ప్రత్తాభిః పరిచారయస్వ నచికేతః మరణం మా అనుప్రాక్షీః. ౨౫

టీక. మర్త్యలోకే = మనుష్యలోకమునందు, యేయేకామాః = ఏయే కోరికలు, దుర్లభాః = దుర్లభములో, సర్వాన్ కామాన్ = ఆకోరికలన్నిఁటిని, ఛందతః = నీయిష్టానుసారము, ప్రార్థయస్వ = ప్రార్థింపుము. ఇమాః = ఈ, రామాః=అప్సరసలు, సరథాః = రథముతోఁగూడుకొన్నవారున్నూ, సతూర్యాః=వాద్యధ్వనులుగలవారున్నూ (అయియున్నారు), ఈదృశాః=ఇట్టిదివ్యస్త్రీరత్నములు, మనుష్యైః = మనుష్యులచేత, న లంభనీయాః = పొందుటకు సాధ్యముకాదు, మత్ప్రత్తాభిః = నాచేత నీకొసంగఁబడిన, ఆభిః = ఈయప్సరస్త్రీరత్నములచేత, పరిచారయస్వ = పాదప్రక్షాళనాదిరూపమగు సేవను

చేయించుకొనుము. నచికేతః=ఓనచికేతుఁడా! మరణం=మరణానంతరసంబంధమగు ప్రశ్నను గూర్చి, మానుప్రాక్షీః=అడుగవద్దు.

తా. మనుష్యలోకమునందు ఏయేకోరికలు ప్రార్థింపఁదగియుండునో, ఏకోరికలు మనుష్యలోకమునందు దుర్లభములో ఆకోరికల నన్నిఁటిని నీవు స్వేచ్ఛగా నడుగుము. ఇదియునుగాక పురుషులను సంతోషపెట్టునట్టి ఈదివ్యస్త్రీరత్నములను రథములతోను, మంగళవాద్యములతోను నీకొసంగుచున్నాను. మావంటివారి యనుగ్రహములేనియెడల ఇట్టిదివ్యస్త్రీరత్నములు మనుష్యుల కెన్నఁడును లభింపరు. నేను నీయందనుగ్రహబుద్ధితో నిట్టిదివ్యస్త్రీరత్నముల నీకు నొసంగుచున్నాఁడను. నీకు నేనొసంగిన యీదివ్యస్త్రీలచేత పాదప్రక్షాళనాదిరూపమగు పరిచర్యను చేయించుకొనుము. మరణమయినతర్వాత శరీరేంద్రియవిలక్షణముగ ఆత్మయనువస్తువు ఒకటి ఉండునా లేదా? యను 'కాకదంతపరీక్షా' తుల్యమగు ప్రశ్నను మాత్రము నీవు నన్నడుగకుము.

౨౬-వ మంత్రము.

అవ. ఈవిధముగా యముఁడు ప్రలోభించుచున్నను నచికేతుఁడు ఇంచుకయినను మహాహ్రదమువలె చలింపక అట్లనే నిశ్చలుఁడయి యిట్లు బదులు చెప్పుచున్నాఁడు.—

మూ. శ్వోభావా మర్త్యస్య యదంతకైత
త్సర్వేంద్రియాణాం జరయంతి తేజః,
అపి సర్వం జీవిత మల్పమేవ
తవైవ వాహా స్తవ నృత్యగీతే. ౨౬

పద. శ్వోభావాః మర్త్యస్య యత్ అంతక ఏతత్ సర్వేంద్రియాణాం జరయంతి తేజః, అపి సర్వం జీవితం అల్పం ఏవ తవ ఏవ వాహాః తవ నృత్యగీతే.

టీక. మర్త్యస్య=ప్రాణులకు, అంతక = అంతకుఁడవగు ఓయమరాజా! (ఈభోగములు) శ్వోభావాః=నశ్వరములు, యత్=ఏకారణమువలన, ఏతత్= ఈయప్సరసలు మున్నగుభోగజాతము, సర్వేంద్రియాణాం తేజః = సకలేంద్రియములయొక్క శక్తిని, జరయంతి=కృశింపఁజేయుచున్నవి. సర్వంజీవితమపి= సకలమయినజీవితమున్నూ అనఁగా బ్రహ్మయొక్క ఆయుస్సున్నూ, అల్పం ఏవ =అల్పమే, వాహాః=గుఱ్ఱములు మున్నగునవి, తవ ఏవ=నీకే ఉండుఁగాక. నృత్యగీతే=నాట్యము గానమున్నూ, తవ ఏవ=నీకే యుండుఁగాక.

తా. ఓయమధర్మరాజా! నీవిప్పుడు నాకొసంగెదనని చెప్పినభోగము లన్నియు శ్వోభావములే—అనఁగా నేఁడనుభవించుచున్నవి రేపుకూడ అనుభవమునకు నిలిచియుండునా ఉండవా యనుసందేహముగలవి అయియున్నవి. మఱియు అప్సరసలు మున్నగు దివ్యస్త్రీరత్నముల నొసంగెదనని చెప్పియున్నాఁడవుగదా. కాని ఇట్టిభోగమువలన ధర్మ, వీర్య, ప్రజ్ఞా, తేజో, యశః ప్రముఖములగు నవి యన్నియు నశించి పోవును. మఱియు దీర్ఘాయుస్సు నొసంగెదనని నీవు చెప్పుచున్నావు. ఇట్టిభోగముల ననుభవించుచుండుటకు బ్రహ్మదేవుని యొక్క ఆయుఃపరిమాణమంత ఆయుస్సుఅయినను అల్పముగానే తోఁచును. నావంటివారికి నీవంటివారి అనుగ్రహమువలనలభించెడి దీర్ఘాయుస్సు ఒక లెక్కయా? కావున నీవిచ్చెదనన్నగుఱ్ఱములు రథములు, నీకేయుండుఁగాక నృత్యములు గీతములు నీకే యుండుఁగాక.

౨౭-వ మంత్రము.

మూ. న విత్తేన తర్పణీయో మనుష్యో
లప్స్యామహే విత్తమద్రాక్ష్మ చేత్త్వా,
జీవిష్యామో యావదీశిష్యసి త్వం
వరస్తు మే వరణీయస్స ఏవ. ౨౭

పద. న విత్తేన తర్పణీయః మనుష్యః లప్స్యామహే విత్తం అద్రాక్ష్మ చేత్ త్వా, జీవిష్యామః యావత్ ఈశిష్యసి త్వం వరః తు మే వరణీయః సః ఏవ. ౨౭

టీక. మనుష్యః=మనుష్యుఁడు, విత్తేన = విస్తారమయినధనముచేత, నతర్పణీయః=తృప్తిపొందించఁదగినవాఁడు, న = కాఁడు. త్వా=నిన్ను, అద్రాక్ష్మచేత్ = చూచినయెడల, విత్తం = ధనమును, లప్స్యామహే=పొందఁగలము. త్వం=నీవు, యావత్=ఎంతకాలము, ఈశిష్యసి=తలంచెదవో, (అంతకాలము) జీవిష్యామః=బ్రతుకఁగలము. మే = నాకు, వరణీయః=వరించఁదగిన, వరస్తు = వరమైతే, సఃఏవ=ఆవరమే.

తా. మఱియు అధికమయినధనముచేత మనుష్యునకు సంతృప్తికలుగునను ఓట అసంభవము. ద్రవ్యలాభమువలన సంతృప్తికలిగినవాఁడు లోకమునం దెవ్వఁడు గనంబడుటలేదు. మాకు ధనమే కావలసినయెడల నీవంటివారి సందర్శనమువల్లనే మాకు ధనము వలసినంత లభించును. లోకమునకు ప్రభువగునీవు మే మెంతకాలము జీవించియుండవలయుననితలంతువో అంతకాలము మేము నిరాఘాటముగ జీవించియుందుము. ఏలయనఁగా నీవంటివాని సందర్శనము లభించిన మనుష్యమాత్రునకు అల్పాయుస్సు అల్పధనము ఉండుననుట అసంభవముగదా. కనుక నాకీవరములు ఏమియుం అక్కఱలేదు. నేను ఆత్మవిజ్ఞానమునుగూర్చి నిన్నడిగినవరమే నాకు కావలయును గాని వేఱువర మక్కఱలేదని భావము.

వివరణము;—దేవతలయొక్క సందర్శనమువలననే సకలాభీష్టములు సిద్ధించుచుండుట శ్రుతిస్మృత్యనుభవప్రసిద్ధవిషయము. ఇట్టిండ దేవతాసందర్శనమై తదనుగ్రహమునకు పాత్రుఁడై, తత్సంభాషణాదికము నొనర్చినవానికి ధనాయుస్సులు అల్పముగా నుండఁజాలవని వేఱుగా చెప్పనక్కఱలేదు కావున ఆవేవియుం నాకక్కఱలేదు. కనుకనే నిన్ను మొదట అడిగినవరమునే నాకొసంగుము.

౨౮-వ మంత్రము.

మూ. అజీర్యతా మమృతానా ముపేత్య
జీర్య న్మర్త్యః క్వధస్థః ప్రజానన్,
అభిధ్యాయ న్వర్ణరతిప్రమోదా
నతిదీర్ఘే జీవితే కో రమేత. ౨౮

పద. అజీర్యతాం అమృతానాం ఉపేత్య జీర్యన్ మర్త్యః క్వధస్థః ప్రజానన్, అభిధ్యాయన్ వర్ణరతిప్రమోదాన్ అతిదీర్ఘే జీవితే కః రమేత. ౨౮

టీక. అజీర్యతాం = వయోహానిలేనట్టి, అమృతానాం = దేవతల యొక్క, (అనుగ్రహమును) ఉపేత్య = పొంది, జీర్యన్ = కృశించుచున్న, మర్త్యః = మనుష్యుఁడు, క్వధస్థః = భూమియందున్నవాఁడై, వర్ణరతి ప్రమోదాన్ = నృత్యగీతసంభోగాది సుఖములను, అభిధ్యాయన్ = కోరు చున్నవాఁడై, అతిదీర్ఘే జీవితే = చిరకాలజీవితమునందు, కః = ఎవ్వఁడు? రమేత = రమించును.

తా. ఇదియునుఁగాక వయోహానియనునది లేక అమరణధర్ములగు దేవతలయొక్క అనుగ్రహమునకు పాత్రుఁడయిన జరామరణధర్మములుగల భూలోకవాసియగు మనుష్యుఁడు తాను పొందఁదగిన శ్రేష్ఠమయిన ప్రయోజనాంతరమునకు ప్రయత్నించవలయును. లోకమునం దందఱు తామున్న స్థితికంటె ఎక్కువస్థితికిరావలయునని కోరుకొందురుగాని తక్కువస్థితికి వ్యయముగా పోవలయునని యెవ్వరును కోరుకొనరు కావున శతాయుష్షులగు పుత్త్రపౌత్త్రాదిప్రలోభనములకు ధన సామ్రాజ్యాప్సరస్త్రీజనాది ప్రలోభనములకు నేను లోఁబడఁజాలను. నిలకడలేనట్టి అప్సరస్త్రీలసౌఖ్యమును, నృత్యగీతాదికములను, దీర్ఘాయుస్సు మున్నగువానిని వివేకియగువాఁడు కోరఁజాలఁడు కావున నాకవి అక్కరలేదని భావము.

వివరణము.—ఈమంత్రమునందు రెండవపాదమునందు "క్వతదాస్థః ప్రజానన్" అని పాఠాంతరముగలదు. అప్పుడు శ్లోకార్థము నిట్లు చెప్పుకొన వలయును:—

తేషు=పుత్రాదిషు, ఆస్థా=ఆస్థితిః - తాత్పర్యేణవర్తనం యస్యసః తదాస్థః, తతః అధికతరం పురుషార్థం అభిప్రేప్సుః క్వ తదాస్థో భవేత్, న కశ్చిత్ తదసారాభిజ్ఞః తదర్థీ స్యాదిత్యర్థః.

ఆజీర్యతాం అమృతానాం (దేవానాం అనుగ్రహం) ఉపేత్యజీర్యన్ మర్త్యః (ఇంతవఱకు అర్థముపైవలెనే) తదాస్థః=అపుత్రదారాదులందే ఆస్థ గలవాఁడు క్వ (భవేత్) = ఎక్కడ అగును? కాడని భావము. అంతకంటె ఎక్కువ అయిన పురుషార్థము నభిలషించువాఁడు అంతకు తక్కువయినదానిని కోరడుగదా. దేనిని అసారమని యెవ్వఁడెఱుంగునో దానిని వాఁడు కోరుట లేదని భావము.

౨౯-వ మంత్రము.

మూ. యస్మి న్నిదం విచికిత్సంతి మృత్యో
య త్సాంపరాయే మహతి బ్రూహి న స్తత్,
యోఽయం వరో గూఢ మనుప్రవిష్టో
నాన్యం తస్మా న్నచికేతా వృణీతే. ౨౯

ఇతి కాఠకోపనిషది ప్రథమాధ్యాయే
ప్రథమావల్లీ సమాప్తా.

పద. యస్మిన్ ఇదం విచికిత్సంతి మృత్యో యత్ సాంపరాయే మహతి బ్రూహి నః తత్, యః అయం వరః గూఢం అనుప్రవిష్టః న అన్యం తస్మాత్ నచికేతాః వృణీతే. ౨౯

కఠోపనిషది ప్రథమాధ్యాయే ప్రథమావల్లీ సమాప్తా.

టీక. మృత్యో=ఓయమధర్మరాజా! మహతి=గొప్పదియగు సాంపరాయే=పరలోకమునందు, యస్మిన్=మరణించినతర్వాతగల యేఆత్మవిషయమై, ఇదం = ఈసంశయమునుగూర్చి, విచికిత్సంతి = సంశయితులయి విచారించుచున్నారో, తత్=ఆవిషయమునుగూర్చి, నః=మాకు, బ్రూహి = పలుకుము. యః = ఏ, అయం=ఈ, వరః=వరము, గూఢం = గూఢమని, అనుప్రవిష్టః = తెలుపఁబడినది. తస్మాత్ = అందువలన, నచికేతాః = నచికేతుఁడు, అన్యం = మఱొక, వరం=వరమును, నవృణీతే=వరింపఁడు.

తా. (వివేకియగుమనుష్యుఁడు దీర్ఘాయుస్సుమున్నగు అల్పఫలప్రదములగు కామములను కోరఁడని వెనుకమంత్రమునందు చెప్పఁబడియున్నది.) కావున అనిత్యములగు కామోపభోగములనుగూర్చి యుపన్యసించి నన్ను పరీక్షించుటమాని మనుష్యుఁడు మరణించినపిదప దేహేంద్రియవ్యతిరిక్తముగ పరలోకమునందు అనుభవించునట్టి తత్త్వమొక్కటిగలదా లేదా యను ఏసంశయమును దేవతలుకూడా సంశయితచిత్తులయి విచారించుచుండిరో అట్టిఆత్మనిర్ణయమును—ఆవిషయమునకు గూర్చిననిర్ణయమును నాకు చెప్పవలయును. ఈయాత్మవిజ్ఞానవిషయము అతిసూక్ష్మమనియు, దుర్వివేకమనియు నీవేచెప్పియున్నాఁడవు కావున అవివేకులగువారలు కోరునట్టి అనిత్యవిషయకములగువరములను మనస్సునందైనను నచికేతుఁడభిలాషపడఁడు కావున నేనడిగిన వరమునే నాకు ఇవ్వవలయును.

కఠోపనిషత్తు ప్రథమాధ్యాయమునందు ప్రథమవల్లి సమాప్తము.

ఈవల్లికిసంబంధించిన వివరణ గ్రంథభాగము:—

అనుభూతిప్రకాశము. ౧౧ అధ్యా. శ్లో. ౧-౬.

---

# కఠోపనిషత్తు

## ప్రథమాధ్యాయము—ద్వితీయవల్లి.

---

౧-వ మంత్రము.

అవ. ప్రథమవల్లియొక్క ౨౧ మంత్రము మొదలుకొని ఆవల్లి యొక్క సమాప్తిపర్యంతముగల తొమ్మిదిమంత్రములచేతను శిష్యుఁడగు నచికేతుని వైవస్వతుఁడు పరీక్షించిచూడగా నచికేతుఁడు బ్రహ్మ విద్యోపదేశమునకు యోగ్యుఁడను విషయము నిర్ణయమగుటచేత వైవస్వతుఁ డిట్లు పలుకు చున్నాఁడు.—

మూ. అన్యచ్ఛ్రేయోఽన్య దుతైవ ప్రేయ
స్తే ఉభే నానార్థే పురుషగ్ంసినీతః,
తయోశ్శ్రేయ ఆదదానస్య సాధు
భవతి హీయతేఽర్థాద్య ఉ ప్రేయో వృణీతే. ౧

పద. అన్యత్ శ్రేయః అన్యత్ ఉత ఏవ ప్రేయః తే ఉభే నానార్థే పురుషం సినీతః, తయోః శ్రేయః ఆదదానస్య సాధు భవతి హీయతే అర్థాత్ యః ఉ ప్రేయః వృణీతే. ౧

టీక. శ్రేయః=నిశ్శ్రేయసము-మోక్షమనునది, అన్యత్ = వేఱయినది, ఉత ఏవ=మఱియు, ప్రేయః = ప్రేయస్సు-అభ్యుదయమనునది, అన్యత్ = వేఱయినది, తే ఉభే=ఆశ్రేయఃప్రేయస్సులు రెండున్నూ, నానార్థే = భిన్నభిన్న ప్రయోజనములుగలవియగుచు, పురుషం = (వర్ణాశ్రమవిశిష్టుఁడును, అధికారి యుఁనగు) పురుషుని, సినీతః = బంధించుచున్నవి, తయోః = ఆశ్రేయఃప్రేయ

స్సులను రెంటిలోపల, శ్రేయః = శ్రేయస్సును, ఆదదానస్య = గ్రహించునట్టి వానికి, సాధు = శుభము, భవతి = అగుచున్నది. యః ఉ = ఎవ్వఁడు, ప్రేయః = ప్రేయస్సును, వృణీతే ఉ = వరించునో, సః=వాఁడు, అర్థాత్ = పరమపురుషార్థమునుండి, హీయతే=విడువఁబడుచున్నాఁడు.

తా. శ్రేయస్సు-అనఁగాని శ్రేయస్సు, అనునదియు, ప్రేయస్సు అనగా అభ్యుదయము అనునదియు వేఱువేఱు అయియున్నవి. ఆశ్రేయః ప్రేయస్సుల యొక్క ప్రయోజనములుకూడ వేఱువేఱుగానున్నవి. ఈశ్రేయఃప్రేయస్సులు వర్ణాశ్రమాదివిశిష్టుఁడగు అధికారియగుపురుషుని రెంటిలో ఒకదానినిచేయవలసి నటుల బంధించుచున్నవి. అనఁగా నిశ్శ్రేయసము నభిలషించువాఁడు శ్రేయస్సును-అనగా మోక్షసాధనమగు జ్ఞానమును, అభ్యుదయమును-అనగా స్వర్గాది సుఖమును అభిలషించువాఁడు ప్రేయస్సును అనఁగా కర్మమార్గమును అవలంబించుచున్నాఁడు కావున శ్రేయఃప్రేయస్సులను రెంటిచేతను పురుషులందఱు బద్ధులయియున్నారని చెప్పఁబడుచున్నది. విద్యాఽవిద్యారూపములగు ఆశ్రేయః ప్రేయస్సులు రెండున్నూ భిన్నభిన్నములగు వేర్వేఱు పురుషార్థములకు సంబంధించినవగుటచేత అన్యోన్యము విరుద్ధగుణములు గలవియగుచున్నవి కావున వీనిలో ఒకదానిని వదలి మఱొకదానిని ఒక్క పురుషుఁ డాచరింపశక్యమగును కాని రెంటిని ఒక్కపురుషుఁ డాచరింపశక్యము కానందువలన ఆశ్రేయః ప్రేయస్సులను రెంటిలో అవిద్యారూపమగు ప్రేయస్సును వదలి శ్రేయస్సును మాత్రము పరిగ్రహించి ఆచరించువానికి సాధువు అనఁగా శుభమగు మోక్షము కలుగుచున్నది. ఎవ్వఁడు దూరదృష్టి విరహితుఁడయి ప్రేయస్సును మాత్రమే పరిగ్రహించునో అట్టి మూఢుఁడు శ్రేయోరూపమయి నట్టియు, పారమార్థిక ప్రయోజనరూపమయినట్టియుం పరమపురుషార్థమునుండి తొలఁగిపోవుచున్నాఁడు.

వివరణము.—వర్ణాశ్రమాది విశిష్టుఁడగు అధికారిని శ్రేయఃప్రేయస్సులు రెండును బంధించుచున్నవనుటకు ఉదాహరణములు.

౧. వర్ణవిశిష్టత్వమున కుదాహరణము—'బ్రాహ్మణో బృహస్పతి సవే నయజేత' రాజారాజసూయేనయజేత (అర్థ. బ్రాహ్మణుఁడు బృహస్పతి సవ మనుయాగము నాచరింపవలెను, రాజు రాజసూయము నాచరింపవలెను.) మున్నగు శాస్త్రప్రమాణములు.

౨. ఆశ్రమవిశిష్టత్వమున కుదాహరణము—'గృహస్థ స్సదృశీంభార్యా ముపేయాత్', (అర్థ. గృహస్థాశ్రమాభిలాషి తనజాతిగలదానిని భార్యగా పరిగ్రహింపవలయును) మున్నగునవి.

ఆదిశబ్దము చేత వయోఽవస్థాదికమునుకూడ పరిగ్రహించునది —

3. వయోవిశిష్టత్వమున కుదాహరణము.—జాతపుత్రః కృష్ణకేశోఽగ్నీనాదధీత (అర్థ. పుత్రసంతానముకలిగి నల్లని తలవెండ్రుకలుగలవాఁ డగ్నుల నాధానము చేయవలయును.) మున్నగునవి.

౪. అవస్థావిశిష్టత్వమున కుదాహరణము.—'అవిచికిత్స్యవ్యాధే ర్వాం ప్రవేశోవా' మున్నగునవి.

శ్రేయః ప్రేయస్సులు రెండున్నూ పురుషుని బంధించుచున్నవని చెప్పఁబడియున్నది కాని పైరెంటిలో అవిద్యాకర్మరూపమగు ప్రేయస్సు జన్మాది హేతుకమగుటచేత బంధకము కావచ్చును కాని విద్యారూపమగు శ్రేయస్సు బంధనివర్తకమగుట న్యాయమైయుండఁగా బంధకమని చెప్పుట అసంగతమని సంశయము కలుగవచ్చును కాని ఇచట విద్యయొక్క బంధకత్వము విద్యయొక్క అలాభము చేతనని ఎఱుంగవలయును.

## ౨-వ మంత్రము.

అవ. శ్రేయః ప్రేయస్సులురెండున్నూ ఆచరించుటకు మనుష్యునకు స్వాధీనములే అయియుండగా లోకమునం దత్యధికసంఖ్యాకులు శ్రేష్ఠమయిన శ్రేయస్సునువదలి నికృష్టమైన ప్రేయస్సునే ఆచరించుచున్నారని చెప్పఁబడు చున్నది.—

మూ. శ్రేయశ్చ ప్రేయశ్చ మనుష్య మేత
స్తౌ సంపరీత్య వివినక్తి ధీరః,
శ్రేయోహి ధీరోఽభిప్రేయసోవృణీతే
ప్రేయో మందో యోగక్షేమా ద్వృణీతే. ౨

పద. శ్రేయః చ ప్రేయః చ మనుష్యం ఏతః తౌ సంపరీత్య వివినక్తి ధీరః, శ్రేయః హి ధీరః అభి ప్రేయసః వృణీతే ప్రేయః మందః యోగక్షే మాత్ వృణీతే. ౨

టీ. శ్రేయః = శ్రేయస్సున్నూ, ప్రేయశ్చ = ప్రేయస్సున్నూ, మనుష్యం = మనుష్యుని, ఏతః = పొందుచున్నవి. ధీరః = విద్వాంసుఁడగు వాఁడు, తౌ = ఆశ్రేయఃప్రేయస్సులను, సంపరీత్య = మనసుచేత బాగుగా విచారించి, వివినక్తి = ఎయ్యదిశ్రేష్ఠమో ఎయ్యది నికృష్టమో అని విభజించు చున్నాఁడు. ధీరః=ధీరుఁడగువాఁడు, ప్రేయసః = ప్రేయస్సుకంటె, శ్రేయః = శ్రేయస్సునే, అభివృణీతే=వరించుచున్నాఁడు. మందః = అల్పబుద్ధిగలవాఁడు, యోగక్షేమాత్ = దేహాదిసంరక్షణ నిమిత్తమువలన, ప్రేయః = పశుపుత్త్రాది లక్షణమగు ప్రేయస్సునే, వృణీతే=వరించుచున్నాఁడు.

తా. శ్రేయఃప్రేయస్సు లనునవి రెండున్నూ మనుష్యులకు స్వాధీనము లయి వారివారి యిష్టానుసారము ఎవరికి యుక్తమనితోఁచిన దానిని వారు పొందుటకు ఆటంకమేమియు లేనివిషయము సత్యమైనప్పటికిన్ని సాధనము వల్లను ఫలమువల్లను మందబుద్ధులగువారలకు విభజించుటకు అత్యంతదుర్విజ్ఞే యములయి అన్యోన్యము కలిసియున్నవానివలె ఆశ్రేయః ప్రేయస్సులు మనుష్యుని పొందుచున్నవి. (అనఁగా మందబుద్ధిగలవారికి ఇదిశ్రేయస్సు ఇది ప్రేయస్సు అని విభజించి తెలుసుకొనుటకు వీలుకానంత క్లిష్టములయియుండు చున్నవని భావము.) కావున హంసము నీటినుండి క్షీరమును వేఱుచేసినవిధ ముగా విద్వాంసుఁడగువాఁడు మనస్సుతో శ్రేయఃప్రేయస్సులు రెంటిని బాగుగా

ఆలోచించి నిర్ణయించుకొని ఎయ్యది గుణభూయిష్ఠమో, ఎయ్యది గుణవిహీనమో అను విషయము తెలియంగఁగలఁడు. ఇటుల శ్రేయఃప్రేయస్సులయొక్క గురులాఘవములతెలిసినవాఁడు ప్రేయస్సుకంటె గుణాధిక్యము కలదియగుటచేత శ్రేయస్సునే కోరుకొనుచున్నాఁడు. మందబుద్ధియగువాఁడు గురులాఘవవివేకసామర్థ్యము లేనివాఁడగుటవలన శరీరేంద్రియాదుల సంరక్షణాది నిమిత్తము శ్రేయస్సును విడనాడి పశుపుత్త్రాదిలక్షణరూపమగు ప్రేయస్సునే కోరుకొనుచున్నాఁడు.

వివరణము—శ్రేయఃప్రేయస్సులయొక్క గురులాఘవముల తెలియంగుట. యనఁగా—

౧. కర్మాచరణమువలన ఆయాసము అధికము. ఫలమో దుఃఖసంవలితమగు సుఖాభాసలేశము.

౨. విద్యాప్రాప్తివలన ఆయాసము అల్పము. ఫలము అనంతనిరతిశయానందప్రాప్తి. ఇటుల తారతమ్యభావము తెలియంగుట.

౧-వ అధ్యా. ౨-వ వల్లి, ౩-వ మంత్రము.

మూ. స త్వం ప్రియా న్ప్రియరూపాంశ్చ కామా
నభిధ్యాయ న్నచికేతో ఽత్యస్రాక్షీః,
నైతాగ్ంసృంకాం విత్తమయీ మవాప్తో
యస్యాం మజ్జంతి బహవో మనుష్యాః. 3

పద. సః త్వం ప్రియాన్ ప్రియరూపాన్ చ కామాన్ అభిధ్యాయన్ నచికేతః అత్యస్రాక్షీః, న ఏతాం సృంకాం విత్తమయీం అవాప్తః యస్యాం మజ్జంతి బహవః మనుష్యాః.

టీక. నచికేతః=ఓనచికేతుఁడా!, సః = ఆ, త్వం=నీవు, ప్రియాన్ = ప్రియులగు పుత్త్రాదులను, ప్రియరూపాన్ = మనోహరరూపిణులగు అప్సర

సలు తద్భోగములు మొదలగు, కామాన్ చ=కామములను, అభిధ్యాయన్ = బాగా ఆలోచించుకొన్నవాఁడవై, (అనఁగా ఈఅప్సరస్త్రీలు మున్నగుభోగజాతము అనిత్యమని వివేకముచేత గ్రహించినవాఁడవై) అత్యస్రాక్షీః = వదలినాఁడవు. బహవః = అనేకులగు, మనుష్యాః = (మూఢులగు) మనుష్యులు, యస్యాం = ఏసంసారమునందు, మజ్జంతి = మునిఁగిపోవుచున్నారో, (అట్టి) విత్తమయీం = ధనప్రాయమయినట్టి, ఏతాం=ఈ, సృంకాం = (సంసారరూపమగు) కుత్సితమార్గమును, న అవాప్తః=పొందకపోతివి.

తా. నేను 'ఇహపరలోకములందుగల భోగభాగ్యములన్నియుం నీకొసంగుచున్నాఁడను. ఈదివ్యభోగములను యథేచ్ఛగా ననుభవింపుము' అని మాటిమాటికి నిన్ను మోహపెట్టుచున్నను నీవు వానికి లోఁబడక ప్రియంలగు పుత్త్రాదులను, ప్రియమునుకలుగఁజేయునట్టి అప్సరస్త్రీలు మున్నగులక్షణములుగాఁగల సకలకామములను-ఇవియన్నియుం అశాశ్వతములనియుం నిస్సారములనియుం నెఱింగినవాఁడవై తుచ్ఛములయిన ఆయభిలాషల నన్నిఁటిని వదలినవాఁడవైతివి. నీబుద్ధిమత్త్వమును గాంచి నాకు చాలా ఆశ్చర్యమగుచున్నది. అధికసంఖ్యాకులగు పామరజను లెట్టిసంసారమార్గమునందు వ్యామోహముకలిగి మునిఁగిపోయి దుఃఖించుచున్నారో ధనప్రాయమైన మూఢజనసేవితమయిన అట్టి ఈసంసారలక్షణమగు కుత్సితమార్గమును నీవు అనుసరింపవైతివి.

వివరణము:—'ఆత్మావై పుత్త్రనామాసి' అనుశ్రుత్యనుసారము పుత్త్రుఁడు గౌణముగ ఆత్మస్వరూపుఁడగుటచేతను, అన్నిఁటికంటె ఆత్మ అందఱకు ప్రియతమమగుటచేతను ప్రియులనఁగా పుత్రాదులని భాష్యమునందు వ్యాఖ్యాతము. ప్రియరూపశబ్దము 'అప్సరఃప్రభృతిలక్షణాన్' అని భాష్యమునందు వ్యాఖ్యాతము. ప్రియరూపాన్ = ప్రియంరూప్యతే =జన్యతే యైః, తేఽప్సరఃప్రభృతిలక్షణాః తదాదిస్వరూపాన్' అని గోపాలేంద్రయతీశ్వరకృతభాష్యటీక.

౧-వ అధ్యా. ౨-వ వల్లి, ౪-వ మంత్రము.

అవ. ఈద్వితీయవల్లియొక్క ఆరంభమునందు 'తయోః శ్రేయ ఆద దానస్యసాధు భవతి హీయతేఽర్థాద్యఉప్రేయో వృణీతే' అనిచెప్పఁబడియు న్నది. అట్లుచెప్పుటకు హేతువు ఏమి? అనువిషయ మీమంత్రమునందు చెప్పఁ బడుచున్నది:—

మూ. దూర మేతే విపరీతే విషూచీ
అవిద్యా యా చ విద్యేతి జ్ఞాతా,
విద్యాఽభీప్సినం నచికేతసం మన్యే
న త్వా కామా బహవో ఽలోలుపంత. ౪

పద. దూరం ఏతే విపరీతే విషూచీ అవిద్యా యా చ విద్యా ఇతి జ్ఞాతా, విద్యాఽభీప్సినం నచికేతసం మన్యే న త్వా కామాః బహవః అలో లుపంత. ౪

టీక. యా= ఎయ్యది, అవిద్యా=అవిద్యయనియు, యాచ = ఎయ్యది, విద్యాఇతి=విద్యయనియు, జ్ఞాతా= తెలిసికొనఁబడుచున్నదో, ఏతే = ఈరెండు న్నూ, దూరం=దూరముగా, విపరీతే= వేఱువేఱుఅయినవియు, విషూచీ=విభిన్న ప్రయోజనములుగలవియు (అగుచున్నవి). నచికేతసం = నచికేతసుఁడవని పిలువఁబడుచున్ననిన్ను, విద్యాఽభీప్సినం = విద్యనుకోరుచున్నవానినిగా, మన్యే = నేను తలంచుచున్నాఁడను. (కావుననే) త్వా = నిన్ను, బహవః కామాః = అనేకములగు కోరికలు, న అలోలుపంత = లోభమును కలుగఁజేయఁజాలక పోయెను.

తా. ఈశ్రేయఃప్రేయస్సు లనునవి రెండున్నూ వివేక, అవివేకాత్మక ములగుటచేత చీఁకటి వెలుతురులవలె పరస్పరము భిన్నభిన్నమయిన రూప ములుగలవి, మఱియు నానాగతులుగలవి, సంసారమునకు మోక్షమునకు హేతువులగుటచేత పరస్పరము విభిన్నఫలములుగలవి. ఈశ్రేయఃప్రేయస్సులనే

పండితులగువారలు విద్యయనియుఁ, అవిద్యయనియుఁ చెప్పుచున్నారు. నేను నచికేతసుఁడ వనెడి నిన్ను ప్రలోభించుటకు అనేకవిధములగు కామములనుచూపి ఆశగొల్పినను ఆకామములకు నీవేమియుఁ వశుఁడవు కాలేదు. నచికేతసుఁడ వనంబడు నిన్ను విద్యాఽభీప్సుగల విద్యార్థినిగ శ్రేయోభాజనునిగ నేను తలంచుచున్నాఁడను.

౧-వ అధ్యా. ౨-వ వల్లి, ౫-వ మంత్రము.

మూ. అవిద్యాయా మంతరే వర్తమానాః
స్వయంధీరాః పండితంమన్యమానాః,
దంద్రమ్యమాణాః పరియన్తి మూఢాః
అంధేనైవ నీయమానా యథాఽంధాః. ౫

పద. అవిద్యాయాం అంతరే వర్తమానాః స్వయంధీరాః పండితంమన్యమానాః, దంద్రమ్యమాణాః పరియంతి మూఢాః అంధేన ఏవ నీయమానాః యథా అంధాః. ౫

టీక. అవిద్యాయాం ,అంతరే = అవిద్యయందు - సంసార మధ్యభాగమునందు, వర్తమానాః=ఉన్నటువంటివారై, స్వయంధీరాః=తామే బుద్ధిమంతులమనియుఁ, పండితంమన్యమానాః = శాస్త్రజ్ఞులమనియుఁ తలంచుచున్నవారలయి,దంద్రమ్యమాణాః=అనేకరూపములయిన కుటిలగతులనుపొందుచున్నవారలయిన, మూఢాః=మూఢులు, అంధేన = గ్రుడ్డివానిచేత, నీయమానాః = నడిపించుకొని తీసికొనిపోఁబడుచున్న, అంధాఃయథా=గ్రుడ్డివారివలె, పరియంతి =(దుఃఖితులయి) అంతటతిరుగుచుందురు.

తా. (విద్యయందు-జ్ఞానమునందు స్థిరబుద్ధికలుగుటకుగాను అవిద్యాధికారులగువారిని వారియొక్క గతియు నిరూపింపఁబడుచున్నది:—) ఎవ్వరు అవిద్యారూపమగు సంసారమును అభిమానించుచున్నారో వారు ఘనీభూతమయిన గాఢాంధకారమధ్యమునందువలె అవిద్యామధ్యమందు-అనఁగా-సంసార

మధ్యమునం దున్నవారలయి, పుత్ర, పశ్వాద్యాశలనుపాశశతములచేత చుట్టఁబడినవారలయి తామే ప్రజ్ఞగలవారలమనియు, పండితులము-శాస్త్రజ్ఞులము అనియు తలంచుచున్నమూఢులు మిక్కిలి కుటిలమయినట్టియు అనేకరూపమయినట్టియు గతిని ప్రార్థించుచున్నవారలయి గ్రుడ్డివాఁడగుమార్గదర్శకునిచేత మిట్టపల్లములుగలమార్గమునందు పిలుచుకొని పోఁబడుచున్న గ్రుడ్డివారేవిధముగా ఆమార్గమునం దనేకకష్టములకు పాలగుచున్నారో ఆదేవిధముగా జరామరణరోగాద్యనేకదుఃఖములకు లోనగుచు అంతట తిరుగుచుందురు.

వివరణము:—అనేకరూపమయినగతిని ప్రార్థించుటయనఁగా శాస్త్రములం దచ్చటచ్చట చెప్పిన దక్షిణాయనోత్తరాయణమార్గములు మున్నగువానిని అభిలషించుట. అంతట తిరుగుటయనఁగా స్వకృతపుణ్యాపాప కర్మానుసారము స్వర్గమర్త్యాదిలోకములందు పరిభ్రమించుచుండుటయని గ్రహించవలయును.

౧-వ అధ్యా. ౨-వ వల్లి. ౬-వ మంత్రము

మూ. న సాంపరాయః ప్రతిభాతి బాలం
ప్రమాద్యంతం విత్తమోహేన మూఢం,
అయం లోకో నాస్తి పర ఇతిమానీ
పునః పునర్వశమాపద్యతే మే. ౬

పద. న సాంపరాయః ప్రతిభాతి బాలం ప్రమాద్యంతం విత్తమోహేన మూఢం, అయం లోకః న అస్తి పరః ఇతి మానీ పునః పునః వశం ఆపద్యతే మే. ౬

టీక. సాంపరాయః = పరలోకగమనసాధనవిశేషము, ప్రమాద్యంతం = (పుత్రపశ్వాదిప్రయోజనములందుగల ఆసక్తిచేత) ప్రమాదముపొందుచున్నట్టియు, విత్తమోహేన = ధనమోహముచేత, మూఢం = (అజ్ఞానముచేత) కప్పఁబడియున్న, బాలం ప్రతి = వివేకహీనునిగూర్చి, న భాతి = ప్రకాశింపదు. (వివేకరహితునకు పరలోకవిషయముస్ఫురింపదు) అయం = ఈగనంబడుచున్న

(స్త్ర్యన్నపానాదివిశిష్టమగునదియే) లోకః=లోకము, పరః = పరలోకమనునది, న అస్తి = లేదు ఇతి = ఈవిధముగా, మానీ = తలంచువాఁడు, పునః పునః= మాటిమాటికి, మే = నాయొక్క, వశం = అధీనమును, ఆపద్యతే = పొందు చున్నాఁడు.

తా. (వెనుకటిమంత్రమునందు సంసారాంధకారమునందుఁబడి కష్ట ముల పాలగుచున్నవారివిషయము చెప్పఁబడినది. అట్టివారలు) మూఢులు కావున వారికి సాంపరాయము ప్రకాశింపదు. 'సమ్యక్ పరే కాలే ఈయత ఇతి సంపరాయః' అనువ్యుత్పత్తిచేత దేహపాతానంతరమునందు పొందఁబడు నది సంపరాయము - అనఁగాపరలోకము. అట్టిపరలోకప్రాప్తియే ప్రయోజనము గాఁగల శాస్త్రీయమగు సాధనవిశేషము సాంపరాయ మనంబడును. అట్టిసాంప రాయము బాలునకు-అనఁగా వివేకహీనునకు ప్రకాశింపదు. వివేకరహితుఁడు పరలోకప్రాప్తిసాధనమును పొందఁజాలఁడనిభావము. పుత్రపశ్వాదిప్రయోజ నములం దాసక్తికలిగియుండుటచేత ప్రమాదమునుపొందుచున్నవానిని, ధన నిమిత్తమయిన అవివేకముచేత మూఢుఁడయినవానిని బాలుఁడని గ్రహించుట యుక్తమేగదా. స్త్రీలు, ధనము, అన్నపానములు మున్నగువానితోఁగూడి కొనియున్న ఈలోకమే లోకముగాని ఇంతకంటెవేఱుగా అదృష్టముగా పర లోకమనునది లేదని తలంచుచున్నవాఁడు మాటిమాటికి పుట్టుచు గిట్టుచు మృ త్యువునగు నాయొక్క అధీనమును పొందును.—అనఁగా జననమరణాదిలక్షణ మగు దుఃఖప్రవాహమునంబడి యల్లాడుచుండుననిభావము. సాధారణముగ జనసామాన్యమంతయుఁ ఈవిధముగానే-అనఁగా కామాద్యాసక్తికలిగియుండుట ప్రసిద్ధమేగదా.

వివరణము:—సాంపరాయశబ్దవ్యుత్పత్తులు:—

౧. సమ్యక్పరే కాలే ఈయత ఇతి సంపరాయః. తత్ప్రయోజనః సాంపరాయః.

అర్థ. దేహపాతానంతరకాలమునందు పొందఁబడునది, సంపరాయము = పరలోకము. ఆపరలోకప్రాప్తియే ప్రయోజనముగాఁగల సాధనవిశేషము, సాంపరాయము.

౨. పరే కాలే దేహపతనా దూర్ధ్వం సమ్యగీయతే గమ్యత ఇతి సంపరాయః.

అర్థ. మొదటిదానితో సమానము.

౩. సమ్యక్ పరాకాలే దేహపాతా దూర్ధ్వమేవేయతే గమ్యత ఇతి సంపరాయః.

అర్థ. పైదానితో సమానము.

౪. అథవా సమ్యక్పర ఇత్యుపలక్షణం, పరాపరబ్రహ్మప్రాప్తికాలే ప్రారబ్ధవిగమనానంతర మిత్యర్థః. తత్ప్రాప్తిప్రయోజనః పరావరబ్రహ్మప్రాప్తిః ప్రయోజనం యస్య స తథా, సాధనవిశేషశ్చోంకారధ్యానాదిః శాస్త్రీయః ప్రసిద్ధః.

అర్థ. ప్రారబ్ధఫలానుభవానంతరము యోగ్యతానుసారము పరావరబ్రహ్మలను పొందింపఁజేయునట్టి ఓంకారధ్యానాదిరూపమగు శాస్త్రీయసాధనవిశేషము సాంపరాయమని గ్రహింపవలయును.

లోకమునందుఁగల జనులలో అధికసంఖ్యాకులు ధర్మార్థకామాసక్తులగుట వాస్తవమైనను విద్యాభిలాషులగువారలుకూడ అత్యల్పసంఖ్యాకులయినను ఉండుటసంభవము కావున తదర్థ ముపనిషత్తులు సార్థకము లనువిషయమును తెలుపుటకే తాత్పర్యమునందు 'సాధారణముగ' అనుపదముదాహృతము.

౧-వ అధ్యా. ౨-వ వల్లి, ౭-వ మంత్రము.

మూ. శ్రవణాయాపి బహుభిర్యో న లభ్యః
శృణ్వంతో౽పి బహవో యం న విద్యుః,

ఆశ్చర్యో వక్తా కుశలో ఽస్య లబ్ధా
ఽఽశ్చర్యో జ్ఞాతా కుశలానుశిష్టః. 2

పద. శ్రవణాయ అపి బహుభిః యః న లభ్యః శృణ్వంతః అపి బహవః యం న విద్యుః, ఆశ్చర్యః వక్తా కుశలః అస్య లబ్ధా ఆశ్చర్యః జ్ఞాతా కుశలానుశిష్టః. 2

టీక. యః = ఏయాత్మ, బహుభిః = అనేకులచేత, శ్రవణాయఅపి= శ్రవణమునకున్నూ, న లభ్యః=పొందఁబడుటలేదు. యం = ఏయాత్మను, బహవః=అనేకులు, శృణ్వంతః అపి = వినుచున్నను. నవిద్యుః = తెలిసికొనఁజాలరు. అస్య=ఈఆత్మయొక్క, వక్తా=చెప్పువక్తవాఁడు, ఆశ్చర్యః = అరుదు. (అస్య = ఈయాత్మయొక్క) కుశలః లబ్ధా=నిపుణముగా గ్రహించినవాఁడున్నూ, ఆశ్చర్యః=అరుదు. కుశలానుశిష్టః = నిపుణుఁడయిన ఆచార్యునిచేత శిక్షితుఁడయిన, జ్ఞాతా=జ్ఞాతయు, ఆశ్చర్యః=అరుదు.

తా. లోకమునందుగల కోట్లకొలదిసంఖ్యగల జనసముదాయమునం దెవ్వఁడో యొకఁడే నీవంటివాఁడు ఆత్మజిజ్ఞాసకలవాఁడు కావున పరమాత్మను గూర్చి వినుటకుకూడ అనేకులకు అవకాశముండదు. పరమాత్మనుగూర్చి వినుచున్నవారిలో అనేకులకు - అసంస్కృతాత్ములగువారికి ఆత్మతత్త్వమనునది ఏమియో గోచరింపఁజాలదు. ఇట్టియాత్మతత్త్వమునుగూర్చి యుపదేశించువాఁడుకూడ అనేకులలో ఒకఁడే లభించును ఇట్టియాత్మనుగూర్చి యుపదేశింపఁబడుచున్న విషయము నాలకించుచున్నవారిలో ఒక్కఁడే చక్కఁగా ఆయాత్మతత్త్వమును గ్రహించువాఁడుండును. యోగ్యుఁడగు ఆచార్యుని చేత చక్కఁగా ఆత్మతత్త్వమును బోధింపఁబడినవాఁడు కూడ ఒకఁడే యుండును.

వివరణము:—అనేకజన్మార్జిత సుకృతపరిపాకమువలన సంస్కృతచిత్తుఁడగువాఁడు కామాదిసుఖానుభవమునందు విరక్తికలిగి బ్రహ్మవిద్యాభి

ముఖుఁడగును. ఇట్టివాఁడు వేలకొలదిజనులయం దొక్కఁడే లభించును. అనేక వస్తువులందు ఆశ్చర్యకరమయినవస్తువు ఒక్కటి ఏవిధముగానుండునో అట్లే జనసముదాయమునందు బ్రహ్మవిద్యాభిముఖుఁడయినవాఁ డొక్కఁడే యుండుట లోకప్రసిద్ధముగా నున్నది కావున ఆశ్చర్యమని చెప్పఁబడినది.

౧-వ అధ్యా. ౨-వ వల్లి, ౮-వ మంత్రము.

మూ. న నరేణావరేణ ప్రోక్త ఏష
సువిజ్ఞేయో బహుధా చింత్యమానః,
అనన్యప్రోక్తే గతి రత్ర నా
స్త్యణీయా న్హ్యతర్క్య మణుప్రమాణాత్. ౮

పద. న నరేణ అవరేణ ప్రోక్తః ఏషః సువిజ్ఞేయః బహుధా చింత్యమానః, అనన్యప్రోక్తే గతిః అత్ర న అస్తి అణీయాన్ హి అతర్క్యం అణుప్రమాణాత్. ౮

టీక. ఏషః= ఈయాత్మ, అవరేణ = హీనుఁడైన, నరేణ=మనుష్యుని చేత, ప్రోక్తః = చెప్పఁబడినవాఁడై, బహుధా = అనేకవిధములుగా, చింత్యమానః= చింతింపఁబడుచున్నవాఁడై, సువిజ్ఞేయః = సుఖముగా తెలిసికొనఁదగినవాఁడు, న=కాఁడు. అనన్యప్రోక్తే=ఆత్మసాక్షాత్కారముగల ఆచార్యుని చేత చెప్పఁబడిన, అత్ర = ఈయాత్మయందు, గతిః = అస్తి నాస్తి ఇత్యాదికమగు వికల్పరూపమగుగతి, నాస్తి=లేదు. (ఆత్మా=ఆత్మ) అణుప్రమాణాత్ = అణుప్రమాణము కంటె, అణీయాన్ హి = అణుతరుఁడుగదా. (కావున) అతర్క్యం = (స్వబుద్ధిచేత) ఊహించుటకు అలవికాదు.

తా. నీవు నన్నడిగిన ఆత్మతత్త్వము ప్రాకృతబుద్ధిగల ఆచార్యునిచేత ఉపదేశింపఁబడినయెడల తెలిసికొనుటకు శక్యముకాదు. ఏలయనఁగా ఆయాత్మ 'అస్తి. నాస్తి, కర్తా, అకర్తా, శుద్ధః, అశుద్ధః' మున్నగువిభేదములతో అనేకవిధములుగా శాస్త్రజ్ఞులగువారలు పరస్పరము వాదించుకొను

చున్నారు. ఇట్లు పరస్పరము వాదించుకొనుచుండు ఆచార్యులందఱు ప్రాకృత బుద్ధులని యెఱుంగవలయును.

౧. ఎటులయినయెడల ఆత్మ సుజ్ఞేయుఁ డగుననఁగా పృథగ్దర్శనుఁడు కానట్టియు బ్రహ్మాత్మభూతుఁడయినట్టియు ఆచార్యునిచేత ఉపదిష్టమయినఆత్మ యందు 'అస్తి, నాస్తి' మున్నగు వికల్పజాల ముండఁజాలదు కావున సుజ్ఞేయ మగును. సర్వవికల్పములకు అతీతమయినది ఆత్మతత్త్వమను విషయము సుప్రసిద్ధముగదా.

౨. లేక అనన్యభూతము, అనఁగా స్వాత్మభూతమగు ఆత్మమునందు జ్ఞేయాంతరము లేకపోవుటచేత గతి అనగా అన్యావగతిలేదనియు అర్థమును గ్రహింపవచ్చును. ఆత్మైకత్వవిజ్ఞానమే జ్ఞానమునకు పరాకాష్ఠగదా. అనఁగా శ్రేష్ఠస్థితి. ఆత్మైకత్వవిజ్ఞానము దృఢమయినప్పుడు అవగంతవ్యము = పొందఁదగి నది లేక తెలిసికొనఁదగినది లేకపోవుటవలన గతియనునది ఉండఁజాలదు. అనన్యమయినఆత్మ సద్గురువుచేత ఉపదేశింపఁబడినయెడల సంసారావగతి— అనఁగా సంసారము సత్యమను తలంపు నిలువఁజాలదు.

3. లేక ఉపదేశింపఁబడనున్న బ్రహ్మముయొక్క స్వరూపుఁడగు. అనఁగా బ్రహ్మాత్మభూతుఁడగు ఆచార్యునిచేత ఉపదేశింపఁబడిన ఆత్మయందు అగతియనఁగా తెలిసికొనఁజాలకపోవుట యుండఁజాలదు. అనఁగా బ్రహ్మాత్మ భూతుఁడగు ఆచార్యుఁడు 'తదనన్యోఽహం, (ఆ బ్రహ్మముకంటె నేను వేఱయిన వాఁడను కాను) అని యెటుల యెఱింగెనో అట్లే శ్రోత యగు శిష్యుఁడున్నూ 'తదనన్యోఽహం' అని తెలిసికొనును.

౪. ప్రాకృతబుద్ధిగాక అగమ్యుఁడు, ఉపనిషత్ప్రమాణశరణుఁడు నగు ఆచార్యునిచేత స్వాత్మకంటె వేఱుగాదని యుపదేశింపఁబడిన ఆత్మయే సువిజ్ఞేయమ్ము, సుఖముగా తెలిసికొనుటకు శక్యమయినది అగుచున్నది. లేని యెడల ఆత్మ అణుప్రమాణముకంటె అణుతరము అగుచున్నది కావున ఆత

ర్క్యము అగుచున్నది. అణుప్రమాణమయినవస్తువు స్వబుద్ధిచేత ఊహింపఁబడు నట్టి కేవలతర్కముచేత ఊహింపఁదగదు. లేక ఒక్కతార్కికుఁడు ఆత్మ అణుపరిమాణమని స్థాపించగా మఱొకతార్కికుఁడు అణుతరమనియు, తద్భిన్నుఁడగు తార్కికుఁడు అణుతమమనియు స్థాపించుటకు ప్రయత్నించును. ఈవిధముగా తర్కమునకు అంతములేదని గ్రహించవలయును.

అని భాష్యమునందు ४ విధములుగా వ్యాఖ్యాతమయియున్నది.

వివరణము:—ప్రాకృతబుద్ధి యనఁగా:—

ప్రకృతిత అగలేషు పశ్వాదిషు అభిమానరూపా బుద్ధి ర్యస్య సః ప్రాకృతబుద్ధిః.

(అర్థ. ప్రకృతిసంబంధమయిన పశ్వాదిరూపమయిన సంసారమునందు అభిమానరూపమయిన బుద్ధిగలవాఁడు.

మంత్రముయొక్క మూడవపాదమునందుగల "అనన్యప్రోక్తే గతిరత్ర నాస్తి" అనుమంత్రభాగమునందు "అనన్యప్రోక్తే గతిః అత్ర న అస్తి" అని ప్రథమమున వ్యాఖ్యాతమయినది. ఇప్పుడు "అనన్యప్రోక్తే అగతిః అత్ర న అస్తి" అని పదవిభాగముచేసి భాష్యకారులవారు "అథవా ప్రోచ్యమాన బ్రహ్మాత్మభూతేన ఆచార్యేణప్రోక్తే ఆత్మని అగతిః=అనవబోధః—అపరిజ్ఞానం అత్రనాస్తి" అని వికల్పముగా వ్యాఖ్యానమొనర్చిరి.

తర్కేణజ్ఞేయః తర్క్యః, న తర్క్యః, అతర్క్యః,

(అర్థ. తర్కముచేత తెలిసికొనుటకు సాధ్యమయినదితర్క్యము. అట్టు సాధ్యముకానిది అతర్క్యము. ఆత్మ అతర్క్యమగుచెడల "మంతవ్యో నిదిధ్యాసితవ్యః" అనుశ్రుతి వేదాంతములను 'మంతవ్యః' అనితర్కించుటకు అవకాశము నొసంగుచున్నదిగదా యని యందురేని అశ్రుతిశ్రుత్యనుకూలతర్కమును ప్రతిపాదించుచున్నది గాని శ్రుతివిరహితమగు కుతర్కమును నిషేధించుచున్నది.)

౧-వ అధ్యా. ౨-వ వల్లి, ౯-వ మంత్రము.

మూ. నైషా తర్కేణ మతిరాపనేయా
ప్రోక్తాఽన్యేనైవ సుజ్ఞానాయ ప్రేష్ఠ,
యాం త్వ మాపః సత్యధృతి ర్బతాసి
త్వాదృఙ్నో భూయా న్నచికేతః ప్రష్టా. ౯

పద. న ఏషా తర్కేణ మతిః ఆపనేయా ప్రోక్తా అన్యేన ఏవ సుజ్ఞానాయ ప్రేష్ఠ, యాం త్వం ఆపః సత్యధృతిః బత అసి త్వాదృక్ నః భూయాత్ నచికేతః ప్రష్టా.

టీక. ఏషా=ఈ, మతిః=బుద్ధి, (అనఁగా ఆత్మ ఆగమప్రతిపాద్యుఁడు అనుబుద్ధి) తర్కేణ = తర్కముచేతను - స్వబుద్ధిచేత ఊహించుటమాత్రము చేతను, న ఆపనేయా = పొందింపశక్యముగాదు. (లేక, ఏషా=మతిః = ఆత్మ ఆగమప్రతిపాద్యుఁడు అను) దృఢబుద్ధి, తర్కేణ=స్వబుద్ధ్యధీనతర్కముచేత, ఆపనేయా=తీసివేయఁదగినది,న=కాదు. ప్రేష్ఠ=ప్రియుఁడవయిన ఓనచికేతుఁడా! అన్యేన=(తార్కికునికంటె) అన్యుఁడయిన, ఆగమజ్ఞుఁడగు ఆచార్యుని చేతను, ప్రోక్తాఏవ = చెప్పఁబడినదే, సుజ్ఞానాయ = సుజ్ఞానముకొఱకు, (అగు చున్నది). త్వం=నీవు, యాం=ఏబుద్ధిని, ఆపః=పొందితివో, (కనుకనే నీవు) సత్యధృతిః=సత్యమయినధృతిగలవాఁడవు, అసి=అయితివి. బత = ఆశ్చర్యము. నచికేతః=ఓనచికేతుఁడా! త్వాదృక్=నీవంటి, ప్రష్టా = ప్రచ్ఛకుఁడు-శిష్యుఁడు, నః=మాకు, భూయాత్=కలుగుఁగాక.

తా. ఆత్మ ఆగమప్రతిపాద్యుఁడను ఏబుద్ధి నీకు సహజముగాకలిగియున్నదో ఆట్టిబుద్ధి తర్కాదికముచేత లభించునది మాత్రముకాదు. లేక ఆగమప్రతిపాద్యమైన ఆత్మతత్త్వవిషయికబుద్ధిని కుతర్కముచేత నిరసింపవలదు. ఆగమమును-ఉపనిషచ్ఛాస్త్రము కొఱుంగని తార్కికుఁడు స్వబుద్ధిపరికల్పితమయిన దానినే యేదో యొకదానిని పలుకుచుండును. కనుక ఆగమోత్పన్నమయిన

యీబుద్ధి తార్కికునికంటె విభిన్నుఁడగు అగమజ్ఞుఁడగు ఆచార్యునిచేత ఉప దేశింపఁబడిననే సుజ్ఞానముకొఱకు — అనఁగా మోక్షముకొఱకు అగును. తర్కమునకు పొందశక్యముకాని ఆబుద్ధి యెట్టిదనఁగా? చెప్పఁబడుచున్నది:— నేను నీకిచ్చినవరదానముచేత నీవెట్టిబుద్ధినిపొందితివో అట్టిబుద్ధి తర్కగమ్యముకాదు. నీవు సత్యధృతివి-సత్యధృతియనఁగా. శాశ్వతమయినదానియందు బుద్ధిగలవాఁడు. బత అనునది ఆశ్చర్యమును అనుకంపనుసూచించును. ఉపదేశింపఁబోవు ఆత్మ విజ్ఞానస్తుత్యర్థము నచికేతునిగూర్చి యిటుల పలుకఁబడినది. నీవంటిశిష్యుఁడు మఱొక్కఁడు మాకులభించుగాక. అనఁగా నీవంటి సద్విషయశ్రవణాభిలాష గల పుత్త్రుఁడో శిష్యుఁడో ప్రష్ట-ప్రశ్నించువాఁడు మాకు కలుగుఁగాక.

౧-వ అధ్యా. ౨-వ వల్లి, ౧౦-వ మంత్రము.

అవ. సంతుష్టుఁడయిన వైవస్వతుఁ డీవిధముగా మఱల పలుకుచున్నాఁడు:—

మూ. జానామ్యహꣳ శేవధి రిత్యనిత్యం
న హ్యధ్రువైః ప్రాప్యతే హి ధ్రువం తత్,
తతో మయా నచికేత శ్చితోఽగ్ని
రనిత్యై ర్ద్రవ్యైః ప్రాప్తవా నస్మి నిత్యమ్. ౧౦

పద. జానామి అహం శేవధిః ఇతి అనిత్యం న హి అధ్రువైః ప్రాప్యతే హి ధ్రువం తత్, తతః మయా నచికేతః చితః అగ్నిః అనిత్యైః ద్రవ్యైః ప్రాప్తవాన్ అస్మి నిత్యమ్. ౧౦

టీక. నచికేతః = ఓనచికేతుఁడా! శేవధిః = కర్మఫలలక్షణమగు నిధి, అనిత్యంఇతి = శాశ్వతమయినదికాదని, అహంజానామి = నేనుఎఱుంగుదును. అధ్రువైః=అనిత్యములయినవానిచేత, నప్రాప్యతేహి=(ఆత్మతత్త్వము) పొందఁబడఁజాలదుగదా. తత్=ఆయాత్మతత్త్వము, ధ్రువంహి = శాశ్వతమైనదిగదా. తతః=అందువలన, మయా=నాచేత, అగ్నిఃచితః=అగ్నిచయనముచేయఁబడినది.

అనిత్యైః = అనిత్యములయిన, ద్రవ్యైః=ద్రవ్యములచేత, నిత్యం=నిత్యమయిన దానిని, ప్రాప్తవాన్ అస్మి=పొందినవాఁడనయితిని.

తా. కర్మఫలము లక్షణముగాఁగల నిధి అనిత్యమనువిషయమును నే నెఱుంగుదును. అనిత్యములగుకర్మఫలములు మున్నగుసాధనములచేత నిత్యము అయినది పొందఁబడఁజాలదుగదా. అనఁగా పరమాత్మయను నిధి అనిత్యములగు కర్మఫలసాధన రూపోపాయములచేత పొందఁబడఁజాలదు. అనిత్య సుఖాత్మక మయిన నిధియే అనిత్యద్రవ్యములచేతను పొందఁబడును. ఓనచికేతుఁడా! నిత్యమయినబ్రహ్మము అనిత్యములగు అజ్య చరు పురోడాశాది రూపసాధన ములచేత పొందఁబడఁజాలదనువిషయము నెఱిఁగియుం నేను అనిత్యసాధనముల చేత స్వర్గాది సుఖసాధనభూతమగు అగ్నిచయనము నొనర్చితిని. కావుననే నేను ఆయగ్నిచయనానుష్ఠానముచేత నిత్యమయినట్టియుం, స్వర్గాఖ్యమైనట్టియుం నీయామ్యస్థానమును పొందినాఁడను. యామ్యస్థానము నిత్యమనునది ఆపేక్షిక నిత్యమని యెఱుంగవలయును.

వివరణము:—వైవస్వతుఁడు నచికేతునిచూచి సంతుష్టి నందుటకు కారణమేమనఁగా అనిత్యసాధనములచేత నిత్యమగుబ్రహ్మము లభింపఁజాలదను విషయము నెఱిఁగియుం ఆతఁడు బహ్వాయాససాధ్యమగు కర్మనొనర్చెను. అట్టి బహ్వాయాససాధ్యమగు కర్మఫలమును నీకు యిచ్చెదనని యముఁడు చెప్పు చున్నను నచికేతుఁడు పరిగ్రహింపకున్నాఁడు కనుక నాకంటె నీవే అధిక ప్రజ్ఞగలవాఁడవని యముఁడు నచికేతుని ప్రశంసించుచున్నాఁడు.

అగ్నిచయనరూపమగు సత్కార్మాచరణముచేతనే వైవస్వతుఁడు జంతు వులకు తత్కృతధర్మాధర్మానుసారము ఫలము నొసంగి నియమించునట్టి యామ్యాధికారమును—యమాధికారమును పొందినాఁడు. ఈయామ్యపద వియుం అనిత్యమయినను నిత్యమనిచెప్పుట ఆపేక్షికనిత్యమేగాని నిరపేక్ష నిత్యముకాదు.

౧-వ అధ్యా. ౨-వ వల్లి, ౧౧-వ మంత్రము.

మూ. కామస్యాప్తిం జగతః ప్రతిష్ఠాం
క్రతో రనన్త్య మభయస్య పారం,
స్తోమమహ దురుగాయం ప్రతిష్ఠాం దృష్ట్వా
ధృత్యా ధీరో నచికేతోఽత్యస్రాక్షీః ౧౧.

పద. కామస్య ఆప్తిం జగతః ప్రతిష్ఠాం క్రతోః అనన్త్యం అభయస్య పారం, స్తోమమహత్ ఉరుగాయం ప్రతిష్ఠాం దృష్ట్వా ధృత్యా ధీరః నచికేతః అత్యస్రాక్షీః. ౧౧

టీక. నచికేతః=ఓనచికేతుఁడా! కామస్య=కామముయొక్క, ఆప్తిం=సమాప్తిని, జగతః=జగత్తుయొక్క, ప్రతిష్ఠాం=ప్రతిష్ఠను, క్రతోః=సత్కర్మాచరణముయొక్క, అనన్త్యం = (ఫలరూపమగు) అనన్తమైన (హిరణ్యగర్భపదవిని), అభయస్య = అభయమగుదానియొక్క, పారం = పరమమయిననిష్ఠను, స్తోమమహత్ = కొనియాడఁదగిన అణిమాద్యైశ్వర్యమహిమను, ఉరుగాయం = విస్తీర్ణమయినగతిని, ప్రతిష్ఠాం=ప్రతిష్ఠను, ధీరః=ధీరుఁడవయిన, (త్వం=నీవు,) దృష్ట్వా=చూచి, ధృత్యా=ధైర్యముచేత, అత్యస్రాక్షీః=వదలినాఁడవు.

తా. నీవు కామమునకు సమాప్తిని, ఆధ్యాత్మిక, అధిభౌతిక, అధిదైవిక భేదవిశిష్టమగు జగత్తుయొక్క ఆశ్రయత్వమును, ఉపాసనాదుల నాచరించుట వలనకలిగెడి అనంతమయిన హిరణ్యగర్భపదవిని, అభయముయొక్క పారమును, కొనియాడఁదగిన అణిమాద్యైశ్వర్యసంపదను, విస్తీర్ణమయినగతిని, ఆత్మయొక్క శ్రేష్ఠమయినస్థితిని గాంచి ధైర్యముగలవాఁడవగుటచేత బుద్ధిమంతుఁడవై యీనిని వదలినాడవు. ఈచెప్పఁబడినదంతయుం సంసారభోగము నకు సంబంధించినదేగాని పరతత్త్వసంబంధమైనది గాదనుతలంపుతో వదలిన వాఁడవైతివి. నీవంటి ఉత్తమగుణముగలవాఁడు మఱొకఁడు లభింపఁజాలఁడు. కదా.

వివరణము:—హిరణ్యగర్భపదవివఱకుఁగల సర్వవిధకామములను వదలిన వాఁడే బ్రహ్మవిద్యకు ముఖ్యాధికారి యనువిషయమును సూచించుటకయి అట్టిధీరుఁడగు నచికేతుని యీమంత్రమునందు వైవస్వతుఁడు స్తుతించి యున్నాఁడు.

౧-వ అధ్యా. ౨-వ వల్లి, ౧౨-వ మంత్రము.

మూ. తం దుర్దర్శం గూఢమనుప్రవిష్టం
గుహాహితం గహ్వరేష్ఠం పురాణం,
అధ్యాత్మయోగాధిగమేన దేవం
మత్వా ధీరో హర్షశోకౌ జహాతి. ౧౨

పద. తం దుర్దర్శం గూఢం అనుప్రవిష్టం గుహాహితం గహ్వరేష్ఠం పురాణం, అధ్యాత్మయోగాధిగమేన దేవం మత్వా ధీరః హర్షశోకౌ జహాతి. ౧౨

టీక. దుర్దర్శం = (అతిసూక్ష్ముఁడయినవాఁ డగుటచేత) చూచుటకు శక్యము కానివాఁడున్ను, గూఢం = గూఢమయినదానిని, అనుప్రవిష్టం = ప్రవేశించినవాఁడున్ను, గుహాహితం = ప్రాణులయొక్క బుద్ధిగుహయందున్న వాఁడున్ను, గహ్వరేష్ఠం = అతికష్టమైన ప్రదేశమునందున్నవాఁడున్ను, పురాణం=పురాతనుఁడయినట్టియు, (అగు) దేవం=దేవుని, అధ్యాత్మయోగాధిగమేన = అధ్యాత్మయోగప్రాప్తిచేత, ధీరః = ధీరుఁడయినవాఁడు, మత్వా = తలంచి, హర్షశోకౌ=హర్షశోకములను, జహాతి=వదలుచున్నాఁడు.

తా. నీవు తెలిసికొనఁదలఁచిన ఆత్మనుగూర్చి చెప్పుచున్నారము. అతిసూక్ష్ముఁడగుటచేత దుర్దర్శుఁడును, దుర్దర్శుఁడనఁగా అతికష్టముచేత తెలిసికొనఁదగినవాడు, ప్రకృతిసంబంధమయిన శబ్దాదివిషయ వికారవిజ్ఞానములచేత మరుగుపఱచబడినవానివలె ఉన్నవాఁడును, ప్రాణులయొక్క బుద్ధిగుహాయందున్నవాఁడును, అనఁగా అచటలభించుటచేత అచ్చట ఉన్నవాఁడుగ వరి

గ్రహించుచున్నారని భావము. విషమమయి అనేకానర్థములకు ఆకరమయిన యీశరీరమునందు ఉన్నవాఁడగుటచేత గహ్వరేష్ఠుఁడును, పురాతనుఁడగుటచేత పురాణుఁడును అగుదేవుని ధీరుఁడయినవాఁడు అధ్యాత్మయోగముచేత— (మనస్సును విషయములనుండి మరలించి ఆత్మయందు ప్రవేశపెట్టుటయే అధ్యాత్మయోగము) తెలంచినవాఁడయి ఆత్మకు ఉత్కర్షాపకర్షములు లేక పోవుటచేత హర్షశోకములను వదలుచున్నాఁడు.

వివరణము:—దేహవ్యతిరిక్తమగు ఆత్మనుగూర్చి నీవు ప్రశ్నించినాఁడవు. ఆయాత్మయొక్క పరమార్థస్వరూపవిజ్ఞానమే సంసారనివర్తకమును పరమానందప్రాప్తికి ధర్మ్యమగుసాధనము అగుచున్నది. నీవడిగినదానికంటె వేఱగు శ్రేయస్సాధనములేదు కావున నీవడిగినదానిని చెప్పుచున్నాఁడనని ప్రష్టయొక్క ప్రశ్న ప్రశంసింపఁబడినది.

దుర్దర్శమనఁగా:—దుఃఖేన = అత్యంతాయాసేన దర్శన మస్యేతి దుర్దర్శః.

అర్థ. అనఁగా అత్యంతాయాసముచేత తెలిసికొనఁబడునదియని భావము.

గహ్వరేష్ఠశబ్దమునకు—గహ్వరే=విషమే అనేకానర్థసంకటే తిష్ఠతీతి గహ్వరేష్ఠః=అని భాష్యమునందువ్యాఖ్యాతము. దానికి 'అనర్థాః రాగద్వేషాదయః తైః సంకటే అత్యాయాసజనకే కార్యకారణసంఘాతే ఇత్యర్థః' అని టీకగలదు. కావున గహ్వరేష్ఠుఁడనఁగా రాగద్వేషాద్యనర్థములచేత అత్యంతాయాసజనకమయిన యీదేహమునందున్నవాఁడని తాత్పర్యము.

౧-వ అధ్యా. ౨-వ వల్లి, ౧౩-వ మంత్రము.

మూ. ఏతచ్ఛ్రుత్వా సంపరిగృహ్య మర్త్యః
ప్రవృహ్య ధర్మ్యమణుమేతమాప్య,
స మోదతే మోదనీయꣳ హి లబ్ధ్వా
వివృతꣳ సద్మ నచికేతసం మన్యే. ౧౩

పద. ఏతత్ శ్రుత్వా సంపరిగృహ్య మర్త్యః ప్రవృహ్య ధర్మ్యం అణుం ఏతం ఆప్య, సః మోదతే మోదనీయం హి లబ్ధ్వా వివృతం సద్మ నచికేతసం మన్యే. ౧౩

టీక. మర్త్యః = మనుష్యుఁడు, ఏతత్ = ఈచెప్పఁబోవునట్టి యాత్మతత్త్వమును, శ్రుత్వా=విని, సంపరిగృహ్య = ఆత్మభావముతో బాగుగా పరిగ్రహించి, ధర్మ్యం=ధర్మసంబంధమయిన దీనిని, ప్రవృహ్య = శరీరాదికమునుండి వేఱుపఱిచి, అణుం = అతిసూక్ష్మమైన, ఏతం=ఈయాత్మతత్త్వమును, ఆప్య=పొంది, సః = ఆవిద్వాంసుఁడు, మోదనీయం = సంతసింపఁదగినదానిని, లబ్ధ్వా=పొంది, మోదతేహి=సంతసించుచున్నాఁడుగదా. నచికేతసం = నచికేతునిబాగ్గి, సద్మ = బ్రహ్మలోకము, వివృతం = తెఱచి యుంచబడినదిగా, మన్యే=నేను తలంచుచున్నాఁడను.

తా. నేను చెప్పఁబోవునట్టి యీయాత్మతత్త్వమును ఆచార్యానుగ్రహముచేత ఆలకించి ఆత్మభావమును పొందిన మనుష్యుఁడు ధర్మ్యమును అతిసూక్ష్మమును అగు నీయాత్మతత్త్వమును శరీరాదికమునుండి వేఱుపఱిచి గ్రహించినవాఁడయి దేనినిపొందుటచేత అవశ్యము సంతోషముకలుగునో అట్టి యాత్మతత్త్వమునుపొంది సంతసించును. ప్రస్తుతము శిష్యుఁడును అగు నచికేతుఁడు అట్టివాఁడగుటచేత ఈనచికేతునకు బ్రహ్మలోకము ద్వారముతెఱచి స్వాగతమొసంగుచున్నది. ఈనచికేతుఁడు మోక్షార్హుఁడని నేను తలంచుచున్నానని భావము.

వివరణము:—ఆచార్య ప్రసాదముచేతనే ఆత్మతత్త్వము గ్రహింపశక్యముకాని స్వయముగా గ్రంథాధ్యయనాదికముచేత బ్రహ్మతత్త్వము అలభ్యమని నివారింపఁబడినది. శాస్త్రాధికారులు సాధారణముగ మనుష్యులే కావున 'మర్త్యః' అని మూలమునందు ప్రయోగింపఁబడినది. నచికేతుఁడు

అర్హుఁడగుటచేత బ్రహ్మము అభిముఖీభూతమయి స్వాగత మొసంగుచున్నదని యెఱుంగునది.

౧-వ అధ్యా. ౨-వ వల్లి, ౧౪-వ మంత్రము.

అవ. యమునివాక్యము నాలకించి నచికేతుఁడిట్లుపలుకుచున్నాఁడు:—

మూ. అన్యత్ర ధర్మాదన్యత్రాధర్మా
దన్యత్రాస్మాత్కృతాకృతాత్,
అన్యత్ర భూతాచ్చ భవ్యాచ్చ
యత్తత్పశ్యసి తద్వద. ౧౪

పద. అన్యత్ర ధర్మాత్ అన్యత్ర అధర్మాత్ అన్యత్ర అస్మాత్ కృతాకృతాత్, అన్యత్ర భూతాత్ చ భవ్యాత్ చ యత్ తత్ పశ్యసి తత్ వద. ౧౪

టీక. ధర్మాత్=శాస్త్రవిహితమయిన ధర్మముకంటె, అన్యత్ర=వేఱయినచోట, అధర్మాత్ = అధర్మమునకంటె, అన్యత్ర = వేఱయినచోట, కృతాకృతాత్=కార్యకారణభూతమయిన. అస్మాత్=దీనికంటె, అన్యత్ర=వేఱయినచోట, భూతాచ్చ = జరిగినదానికంటెను, భవ్యాత్ చ = జరుగఁబోవుదానికంటెను, వర్తమానము అయినదానికంటెను, అన్యత్ర=వేఱయినచోట, యత్=ఎయ్యదిగలదో, తత్=దానిని, పశ్యసి = నీవు ఎఱుంగుచున్నాఁడవు. తత్ = దానిని, వద=నీవు పలుకుము.

తా. నేను బ్రహ్మవిద్యోపదేశమునకు యోగ్యుఁడనై యున్నయెడల, నీవు నాయందనుగ్రహము కలిగియున్నయెడల 'ఎయ్యది శాస్త్రవిహితమయిన ధర్మానుష్ఠానముకంటెను, తత్ఫలముకంటెను, తత్కారకములకంటెను వేఱయినదియో, అధర్మానుష్ఠానముకంటెను, అధర్మానుష్ఠానఫలముకంటెను, తత్కారకములకంటెను వేఱయినదియో, కార్యకారణములకంటెను వేఱయినదియో, భూతభవిష్యద్వర్తమానకాలములకంటె వేఱయినదియో కాల

త్రయముచేతను అపరిచ్ఛిన్నమయినదనునది ఎయ్యదిగలదో సర్వవ్యవహారగోచరమునకు అతీతమయిన అట్టిదానిని నీవెఱింగియున్నాఁడవు, కావున అట్టిదానినే నాకును బోధింపుము.

వివరణము:—"యేయం ప్రేతేవిచికిత్సా మనుష్యే" (కఠ.౧.౧.౨౦) అనుమంత్రమునందు చెప్పఁబడినది. దేహవ్యతిరేకముగ ఆత్మయనునది ఒక్కటి యున్నదా? లేదా? యని యడిగిన ప్రశ్నముయొక్కవివరమేగాని వేఱుగాదని యెఱుంగవలయును.

౧-వ అధ్యా. ౨-వ వల్లి, ౧౫-వ మంత్రము.

అవ. ఈవిధముగా ప్రశ్నమొనర్చిన నచికేతునకు యముఁడు అట్టి వస్తువును సవిశేషణముగ చెప్పఁదలఁచి యిట్లనిచెప్పుచున్నాడు:—

మూ. సర్వే వేదా యత్పదమామనన్తి
తపాగ్ంసి సర్వాణి చ యద్వదంతి,
యదిచ్ఛంతో బ్రహ్మచర్యం చరన్తి
తత్తే పదగ్ం సంగ్రహేణ బ్రవీమ్యోమిత్యేతత్. ౧౫

పద. సర్వే వేదాః యత్ పదం ఆమనన్తి తపాంసి సర్వాణి చ యత్ వదంతి, యత్ ఇచ్ఛంతః బ్రహ్మచర్యం చరంతి తత్ తే పదం సంగ్రహేణ బ్రవీమి ఓం ఇతి ఏతత్. ౧౫

టీక. సర్వే వేదాః=వేదములన్నియు, యత్=ఏవస్తువును, పదం=పొందఁదగినదానినిగ, ఆమనంతి = ఏకగ్రీవముగ పలుకుచున్నవో, సర్వాణి తపాంసి=తపస్సులన్నియు, యత్=దేనిని, వదంతి = చెప్పుచున్నవో, యత్=ఏవస్తువును, ఇచ్ఛంతః=కోరుచున్నవారలయి, బ్రహ్మచర్యం = గురుకులవాసరూపము లేక బ్రహ్మప్రాప్త్యర్థమగుదానిని, చరంతి = చేయుచున్నారో, తత్=అ, పదం = వస్తువును, తే=నీకు, సంగ్రహేణ=సంగ్రహముగ, బ్రవీమి = చెప్పుచున్నాఁ

డను. ఏతత్=నీవెఱుంగఁదలఁచిన యావస్తువు, ఓం ఇతి=ఓం అని (గ్రహింప వలయును.)

తా. వేదములన్నియు ఏవస్తువుపొందఁదగినదని ఏకగ్రీవముగ చెప్పుచున్నవో, కృచ్ఛ్రచాంద్రాయణాదిరూపములగు తపస్సులన్నియుం ఏవస్తువును పొందుటయే ప్రయోజనములుగాఁగలిగి ఆచరింపఁబడుచున్నవో, గురుకుల వాసరూపమును లేక బ్రహ్మప్రాప్త్యర్థమగు ఉపాయాంతరమును దేనిని కోరుచున్నవారై ఆచరించుచున్నారో, నీవేవస్తువు నెఱుంగవలయునని కోరుచున్నాఁడవో అట్టివస్తువును సంగ్రహముగ చెప్పుచున్నాఁడను. అది, 'ఓం'అని చెప్పఁబడును. నీవెఱుంగఁదలఁచినవస్తువు ఓంకారశబ్దవాచ్యము లేక 'ఓం' శబ్దమే ప్రతీకముగా గలదని గ్రహింపుము.

వివరణము:—గురుకులవాసమనఁగా నైష్ఠికబ్రహ్మచర్యమని యెఱుంగ వలయును. ఇంద్రవిరోచనాఖ్యాయికయందు బ్రహ్మవిద్యాంగముగ మందాధి కారులగువారికి జ్ఞానప్రాప్తిసాధనభూతముగ బ్రహ్మచర్యమొకటి విధింపఁబడి యున్నది కావున అట్టిబ్రహ్మచర్యము నిట గ్రహించునది.

ఓంకారవాచ్యమనఁగా ఏపదము నుచ్చరించుటచేత ఏవస్తువు శ్రోతకు స్ఫురించునో ఆవస్తువు ఆపదమునకు వాచ్యమగును. సమాహితచిత్తునకు ఓంకార ముచ్చరింపబడినయెడల సత్త్వప్రధానమాయావచ్ఛిన్నమగు ఓంకారోపా ధికమగుబ్రహ్మమే స్ఫురించును. కావున బ్రహ్మము 'ఓంకారవాచ్యము' అని గ్రహించునది. మందాధికారియగువాఁడు సాలగ్రామమునందు విష్ణుభావనను చేయునటుల ప్రణవమునందు బ్రహ్మదృష్టి నుంచుచున్నాఁడు, కావున బ్రహ్మము ఓంకారప్రతీకమని యెఱుంగవలయును.

౧-వ అధ్యా. ౨-వ వల్లి, ౧౬-వ మంత్రము.

మూ. ఏతద్ధ్యేవాక్షరం బ్రహ్మ ఏతద్ధ్యేవాక్షరం పరం,
ఏతద్ధ్యేవాక్షరం జ్ఞాత్వా యో యదిచ్ఛతి తస్య తత్. ౧౬

పద. ఏతత్ హి ఏవ అక్షరం బ్రహ్మ ఏతత్ హి ఏవ అక్షరం పరం, ఏతత్ హి ఏవ అక్షరం జ్ఞాత్వా యః యత్ ఇచ్ఛతి తస్య తత్. ౧౬.

టీక. ఏతత్ హి అక్షరం ఏవ=ఈయక్షరమే, బ్రహ్మ=అపరబ్రహ్మము, ఏతత్ హి ఏవ అక్షరం=ఈయక్షరమే, పరం = పరబ్రహ్మము. (అనఁగా పర అపరబ్రహ్మలకు ఈప్రణవముప్రతీకము) ఏతత్ = ఈ, అక్షరం ఏవహి=ప్రణవమునే, యః=ఎవ్వఁడు, జ్ఞాత్వా = బ్రహ్మమనిఎఱింగి ఉపాసించునో, యః= ఎవ్వఁడు, యత్ ఇచ్ఛతి = దేనినికోరుచున్నాఁడో, తస్య = వానికి, తత్ = అయ్యది (సిద్ధించుచున్నది).

తా. (తత్త్వవిచారానధికారులకు ఓంకారోపాసనమును గతమంత్రమునందు శ్రుతి విధించియున్నది. ఈమంత్రమును ఆప్రణవోపాసనాఫలమును తెలుపుచు ఓంకారమును శ్రుతి స్తుతించుచున్నది:—) అందువలన—అనఁగా ఓంకారము పర అపరబ్రహ్మవాచకమును, పర అపరబ్రహ్మప్రతీకమును అగుటవలన ఈప్రణవమే-ఓంకారమే అపరబ్రహ్మము, ఈఓంకారమే పరబ్రహ్మము. అనఁగా పరాపరబ్రహ్మములకు ప్రణవము—ఓంకారమను అక్షరము ప్రతీకము. ఈప్రణవమును-ఓంకారాక్షరమును బ్రహ్మమని ఉపాసించువారలు పరబ్రహ్మమునో, అపరబ్రహ్మమునో, ఎవ్వరు దేనినికోరుదురో వారి కయ్యది లభించును. అనఁగా పరబ్రహ్మమని తెలిసి ఉపాసించినయెడల తెలిసికొనుచున్నాఁడు. అపరబ్రహ్మమని తెలిసికొని ఉపాసించునెడల పొందుచున్నాఁడు.

వివరణము.—పరాపరోపాసనలకు బ్రహ్మప్రాప్తిఫలమగునెడల సమ్యక్జ్ఞానము వ్యర్థమేగదా యనుసంశయము కలుగును. తత్సంశయనిరాసార్థము పరోపాసనమువలన ఉపాస్యమగుపరబ్రహ్మము ఓంకారాలంబనమని తెలిసికొనుటయే ఫలము. అపరోపాసనవలన అపరబ్రహ్మమును పొందుటయేఫలము అని ఫలవిభాగము తెలుపఁబడినది.

౧-వ అధ్యా. ౨-వ వల్లి, ౧౭-వ మంత్రము.

మూ. ఏతదాలంబనగ్ం శ్రేష్ఠమేతదాలంబనం పరం,
ఏతదాలంబనం జ్ఞాత్వా బ్రహ్మలోకే మహీయతే. ౧౭

పద. ఏతత్ ఆలంబనం శ్రేష్ఠం ఏతత్ ఆలంబనం పరం, ఏతత్ ఆలంబనం జ్ఞాత్వా బ్రహ్మలోకే మహీయతే. ౧౭

టీక. ఏతత్=ఈఓంకారరూపమగు, ఆలంబనం = బ్రహ్మ ప్రాప్తిసాధనము, శ్రేష్ఠం = (బ్రహ్మప్రాప్త్యుపాయభూతాలంబనము లన్నిటిలోపల) శ్రేష్ఠమయినది. ఏతత్ ఆలంబనం = ఈయోంకారరూపమగు ఆలంబనమే, పరం = పరాపరబ్రహ్మసంబంధమయినది. ఏతత్ ఆలంబనం = ఈయోంకారరూపమగు ఆలంబనమును, జ్ఞాత్వా=ఎఱింగి, బ్రహ్మలోకే = బ్రహ్మలోకమునందు, మహీయతే=పూజ్యుఁడగుచున్నాఁడు.

తా. ఈయోంకారము పరాపరబ్రహ్మప్రాప్తి సాధనభూతమగుటచేత బ్రహ్మ ప్రాప్త్యాలంబనములన్నిటిలోపల నియ్యది మిక్కిలిశ్రేష్ఠమైనది. ఈయోంకారాలంబనము పరాపరబ్రహ్మప్రాప్తికి సాధనభూతమగుటవలన బ్రహ్మలోకమునందు పూజ్యుఁడగుచున్నాఁడు. పరబ్రహ్మమునందు అపరబ్రహ్మమునందున్నూ బ్రహ్మమువలెనే ఉపాస్యుఁ డగుచున్నాఁడు.

వివరణము:—బ్రహ్మలోకశబ్దమునకు "బ్రహ్మైవలోకః బ్రహ్మలోకః" బ్రహ్మమే లోకము కావున బ్రహ్మలోకము అని టీకయందు వివరింపఁబడినది.

౧-వ అధ్యా. ౨-వ వల్లి, ౧౮-వ మంత్రము.

అవ. 'అన్యత్ర ధర్మాత్' అన్యత్రఅధర్మాత్' (కఠః వల్లి. ౨. ౧౪.) అనుమంత్రమునందు అశేషవిశేషణరహితముగ అడుగఁబడినఆత్మకు ఆలంబనముగ ప్రతీకముగ ఓంకారము నిర్దేశింపఁబడినది. (అదేవిధముగ) మందమధ్యమాధికారులగువారి యుపయోగార్థము అపరబ్రహ్మమునకు ఆలంబనముగను ప్రతీకముగను ఓంకారము నిర్దేశింపఁబడినది. ఇఁకమీఁదట ఓంకారాలంబనమగు

బ్రహ్మముయొక్క ఉపాసనార్థము తత్స్వరూపమును నిర్ణయించవలయుననుతలం పుతో నీవిషయము చెప్పఁబడుచున్నది:—

మూ. న జాయతే మ్రియతే వా విపశ్చి
న్నాయం కుతశ్చిన్న బభూవ కశ్చిత్,
అజో నిత్యశ్శాశ్వతో ఽయం పురాణో
న హన్యతే హన్యమానే శరీరే. ౧౮

పద. న జాయతే మ్రియతే వా విపశ్చిత్ న అయం కుతః చిత్ న బభూవ కః చిత్, అజః నిత్యః శాశ్వతః అయం పురాణః న హన్యతే హన్యమానే శరీరే. ౧౮

టీక. విపశ్చిత్=సర్వజ్ఞమగు, అయం=ఈయాత్మ, నజాయతే=పుట్టుట లేదు. నమ్రియతే=చచ్చుటయు లేదు. కుతఃచిత్ = మఱియొకనివల్లనుండి, లేక మఱొక కారణమువల్లనుండి, నబభూవ=కాలేదు. కశ్చిత్ నబభూవ = ఒక్కటియుఁ కాలేదు. అయం = ఈయాత్మ, అజః = పుట్టుకలేనిది, నిత్యః=నిత్యమయినది, శాశ్వతః=అపక్షయవిరహితమయినది, పురాణః = పురాణమయినది, శరీరే =దేహము,హన్యమానే = శస్త్రాదికముచేత కొట్టఁబడుచున్నప్పటికిన్నీ, (అయం =ఈయాత్మ) నహన్యతే=చంపఁబడదు.

తా. ఉత్పత్తిగలవస్తువు అనిత్యము. అట్టిఅనిత్యమయినవస్తువు అనేక వికారగుణములు కలిగియుండును. ఆవికారగుణములలో ఆది, అంతము అను నట్టివిక్రియాగుణములురెండును ఆత్మకులేవనిచెప్పుటకుగానున జాయతే—పుట్టుటలేదు, నమ్రియతే-చచ్చుటలేదని చెప్పఁబడినది. ఈయాత్మఎల్లప్పుడుచైతన్య విశిష్టుఁడయియుండుటవలన సర్వజ్ఞుఁడగుచున్నాఁడు. ఈయాత్మకు కారణభూతమగు మఱొకవస్తువులేదు, ఈయాత్మవల్లనుండి మఱొకటియేమియుఁ పుట్టినది లేదు, కావున ఈయాత్మఅజుఁడు, నిత్యుఁడు, శాశ్వతుఁడు—అనఁగా అపక్షయవర్జితుఁడు. అశాశ్వతమయినది నశించునుగాని శాశ్వతమయినది నశిం

పదు. ఈయాత్మ శాశ్వతమగుటచేత పురాణమే. పురాణమనఁగా పూర్వకాలమందున్న దైనను నవమయిన దే. ఎయ్యది అవయవవృద్ధిచేత నిర్మితమగునో అది ఇప్పుడు కుంభాదికమువలె నవమని చెప్పఁబడును. ఆత్మ కుంభాదికమువలె నవము గాక పురాణము—వృద్ధివివర్జితమగుచున్నది. ఆత్మ ఇట్టిదగుటచేత ఖడ్గాద్యాయుధములచేత శరీరము నరుకఁబడుచున్నను అశరీరాంతర్భాగమునందున్న ఆత్మ ఆకాశమువలె హింసింపఁబడఁడు.

వివరణము:—ఆత్మ ఇట్టిదగుటవలన అనుటకు భావమేమనఁగా ఆత్మ అజత్వ, నిత్యత్వ, శాశ్వతత్వాదిగుణములుగలది యగుటచేత పుట్టుట పెరుగుట మున్నగునవి శరీరధర్మములుకాని ఆత్మధర్మములుకాఁజాలవు. శరీరమునకు శస్త్రాఘాతము కలిగినయెడల శరీరమునందు కలసియున్నగర్భమునకుగూడ క్షతి కలుగుట లోకప్రసిద్ధముగదా. అట్లే శరీరాంతర్వర్తియగు ఆత్మకు శరీరాఘాతమువలన క్షతి కలుగవచ్చునను సంశయమునకు! ఆకాశమునకు శస్త్రాదికము వలన క్షతి యెట్టులలేదో అట్లే ఆత్మకుకూడ క్షతిలేదని సమాధానము.

౧-వ అధ్యా. ౨-వ వల్లి, ౧౯-వ మంత్రము.

మూ. హంతా చేన్మన్యతే హంతుగ్ం హతశ్చేన్మన్యతే హతం,
ఉభౌ తౌ న విజానీతో నాయగ్ం హంతి న హన్యతే.

పద. హంతా చేత్ మన్యతే హంతుం హతః చేత్ మన్యతే హతం, ఉభౌ తౌ న విజానీతః న అయం హంతి న హన్యతే. ౧౯

టీక. హంతా=చంపునట్టివాఁడు, హంతుం = చంపుటకు, మన్యతేచేత్ = తలఁచినయెడల, హతః = చంపఁబడినవాఁడు, హతం = చంపఁబడినవానినిగా, మన్యతేచేత్ = తలంచినయెడల, తౌ ఉభౌ = వారిద్దఱు, న విజానీతః= తెలిసికొననివారలుగారు, అయం = ఇతఁడు, నహంతి = చంపుటలేదు, నహన్యతే= ఇతరునిచేత చంపఁబడుటయుం లేదు.

తా. అసంగస్వభావుఁడగు నిట్టియాత్మను శరీరమాత్రదృష్టిగలవాఁ డెవ్వఁడైనను నేనుచంపెదనని తలంచినయెడలను, (చంపెదననితలంచువానిని) ఎవ్వఁడు నిషేధించునో, ఎవ్వఁడు తాను చంపఁబడుచున్నటుల తలంచునో వీరు ఆత్మయనఁగా నేమియో తెలియనివారుగా తలంచవలయును. ఏల యనఁగా ఆత్మ ఆకాశమువలె .వికారరహితుఁడగుటచేత ఆత్మ ఒక్కనిచంపుట లేదు, ఒకనిచేత చంపఁబడుటయు లేదు. కనుక ధర్మాధర్మాదిలక్షణమగు సంసార మంతయు అనాత్మజ్ఞవిషయముకాని బ్రహ్మజ్ఞవిషయముమాత్రము కాదు. శ్రుతి ప్రామాణ్యమువల్లను, న్యాయమువల్లను, బ్రహ్మజ్ఞునకు ధర్మాధర్మాదికము కలుగఁ జాలదు.

వివరణము:— ఆత్మ అవిక్రియుఁడయినయెడల ధర్మాచరణమున కధికారి యగువాఁ డుండఁజాలఁడుగదా. అప్పుడు సంసారమే యుండఁజాలదుగదా అను ఆశంకకు సమాధానము ధర్మాధర్మాదిలక్షణమగుసంసారము అనాత్మజ్ఞ విషయము అనిచెప్పఁబడినది. వివేకియగువాఁడు సర్వదాముక్తుఁడుకావున అట్టి వానికి ధర్మాధర్మాద్యాచరణరూపమగు సంసారమేలేదు. ఈవిషయ మిట్లు తెలుపఁ బడినది:—

శ్లో. వివేకీ సర్వదా ముక్తః కుర్వతో నాస్తి కర్తృతా,
అలేపవాదమాశ్రిత్య శ్రీకృష్ణజనకౌ యథా. ౧౯

అనాత్మజ్ఞుఁ డనఁగా దేహాదికమునందు తాదాత్మ్యాద్యభిమానముగల వాఁడు.

౧-వ అధ్యా. ౨-వ వల్లి, ౨౦-వ మంత్రము.

అవ. ఆత్మనేవిధముగా తెలిసికొనవలయునో ఆవిషయము చెప్పఁబడు చున్నది:—

మూ. అణోరణీయాన్మహతో మహీయా
నాత్మాఽస్య జంతోర్నిహితో గుహాయాం,

తమక్రతుః పశ్యతి వీతశోకో
ధాతుప్రసాదాన్మహిమానమాత్మనః. ౨౦

పద. అణోః అణీయాన్ మహతః మహీయాన్ ఆత్మా అస్య జంతోః నిహితః గుహాయాం, తం అక్రతుః పశ్యతి వీతశోకః ధాతుప్రసాదాత్ మహిమానం ఆత్మనః. ౨౦

టీక అణోః = సూక్ష్మపరిమాణముగల శ్యామాకాదికముకంటె, అణీయాన్ = మిక్కిలి సూక్ష్మమయినట్టియు, మహతః = మహాపరిమాణముగల పృథివ్యాదికముకంటె, మహీయాన్ = మిక్కిలి గొప్పదైనట్టియు, ఆత్మా = ఆత్మ, అస్య = ఈ బ్రహ్మాదిస్తంబపర్యంతమయిన, జంతోః = ప్రాణిజాతముయొక్క, గుహాయాం = బుద్ధిగుహాయందు, నిహితః = ఉంచబడియున్నాఁడు. తం = అట్టియాత్మను, అక్రతుః = దృష్టాదృష్టబాహ్యవిషయోపరతబుద్ధిగలవాఁడు (చూచుచున్నాఁడు) ధాతుప్రసాదాత్ = మనస్సు మున్నగు ఇంద్రియసముదాయముయొక్క ప్రసన్నత్వమువలన, ఆత్మనః=ఆత్మయొక్క, మహిమానం = మాహాత్మ్యమును, పశ్యతి=చూచుచున్నాఁడు. వీతశోకః=శోకరహితుఁడున్నా (అగుచున్నాఁడు.)

తా. ఆత్మతత్త్వము మిక్కిలి అల్పపరిమాణముగల శ్యామాకాదికముకంటె మిక్కిలి సూక్ష్మమయినది. మిక్కిలి గొప్పపరిణామముగల పృథివ్యాదికముకంటె మిక్కిలి మహత్తరమయినది. అణుపరిమాణమో లేక మహత్పరిమాణమోగల ఏవస్తువు లోకమునందు గనంబడుచున్నదో అది నిత్యమగు ఆత్మచేతనే స్థితిగలది యగుచున్నది. ఆత్మవిరహితమగువస్తువు అసత్తగుచున్నది. ఈయాత్మ సర్వనామరూపవస్తూపాధిక మగుటచేత అణుపరిమాణ మయినదానికంటె అణుతరమును, మహాపరిమాణమయినదానికంటె మహత్తరమును అగుచున్నది. అట్టియాత్మ బ్రహ్మాది స్తంబపర్యంతమగు ప్రాణిజాతముయొక్క బుద్ధిగుహాయందు ఆత్మభూతమయి ఉన్నది. దర్శన,

శ్రవణ, మనన, విజ్ఞానములే లింగములుగాఁగల అట్టియాత్మను అక్రతువు— అనఁగా నిష్కాముఁడు — దృష్టాదృష్టబాహ్యవిషయోపరతబుద్ధిగలవాఁడు మాత్రమే గాంచుచున్నాఁడు. ఎప్పు డిట్టిజ్ఞానము లభించునో అప్పుడు ధాతువులు అనఁగా మనస్సు మున్నగుఇంద్రియములు (శరీరమును ధరించుచుండుటచేత యౌగికముగా ధాతుశబ్ద మిట యింద్రియవాచకము) ప్రసన్నములయియుండుటచేత ఆత్మయొక్క మహిమను—కర్మనిమిత్తమయిన వృద్ధిక్షయరహితమునుఅయినదానిని 'అయ మహ మస్మి' అని సాక్షాత్తుగా నెఱుంగును. ఈవిధముగా నెఱుంగుటవలన గతించినశోకముగలవాఁ డగుచున్నాఁడు.

వివరణము:— ఒకేవస్తువు అణువున్నూ మహత్తున్నూ అగుట అసంభవము అందుచేత అణుత్వ మహత్త్వములు పరమార్థముగా ఆత్మకు లేవని చెప్పఁబడినది.

ధాతుశబ్దము దేహాంతర్గతశరీరాదివాచకమైనను ఇచట యౌగికార్థమును గ్రహించి భాష్యకారులగు శంకరభగవత్పాదులవారు ఇంద్రియవాచకముగ గ్రహించిరి. విద్యారణ్యులవారుకూడ ఇట్లే గ్రహించిరి:—

శ్లో. శ్యామాకాదేరణోఽపీయాం స్తత్రాణు కల్పనాత్,
మహీయాన్మహతః ఖాదే స్తత్రాకాశాది కల్పనాత్. ౨౯
స్థితో జంతోర్హృద్గుహాయాం తం నిష్కామస్తు పశ్యతి,
ఇంద్రియాణాం ప్రసన్నత్వాద్వీతశోక స్తదా భవేత్. ౩౦
అనుభూతిప్రకాశము. ౧౧-వ అధ్యాయము.

౧-వ అధ్యా. ౨-వ వల్లి ౨౧-వ మంత్రము.

అవ. అట్లుకానియెడల ప్రాకృతబుద్ధిగల కాముకులగు పురుషులచేత ఆత్మ దుర్విజ్ఞేయుఁ డగుచున్నాఁడని చెప్పఁబడుచున్నది. ఎలయనఁగా:—

మూ. ఆసీనో దూరం వ్రజతి శయానో యాతి సర్వతః,
కస్తంమదామదం దేవం మదన్యో జ్ఞాతుమర్హతి. ౨౧

పద. ఆసీనః దూరం వ్రజతి శయానః యాతి సర్వతః, కః తం మదామదం దేవం మదన్యః జ్ఞాతుం అర్హతి. ౨౧

టీక. (అయాత్మతత్త్వము) ఆసీనః=ఒక్కచోటనే ఉన్నదై—అచలమయి, దూరం=దూరముగా, వ్రజతి=పోవుచున్నది. శయానః=నిద్రించుచున్నదానివలెఉన్నదై, సర్వతః = అన్నివైపుల, యాతి = పోవుచున్నది. తం=ఆః మదామదం=సంతోషవిషాదాత్మకుఁడగు, దేవం = దేవుని, మదన్యః = నాకంటె అన్యుఁడగు, కః=ఎవ్వఁడు, జ్ఞాతుం=తెలిసికొనుటకు, అర్హతి=తగును ?

తా. ఈయాత్మ ఒక్కచోటనే ఉన్నవాఁడై అచలుఁడై దూరముగా పోవుచున్నాఁడు. శయానుఁడై - పరుండియున్నవాఁడై అంతట వ్యాపించుచున్నాఁడు. ఈవిధముగా నీయాత్మ మదామదుఁడైయున్నాఁడు. మదమనఁగా సంతోషము. అమదమనఁగా దుఃఖము. మదుఁడనఁగా సంతోషము గలవాఁడు. అమదుఁడనఁగా సంతోషరహితుఁడు. సంతోష, తదభావములను విరుద్ధధర్మములు గలవాఁడగుటచేత తెలిసికొనుటకు శక్యముకానట్టి అట్టిదేవుని నాకంటె భిన్నుఁడగు వాఁడెవ్వఁడు తెలిసికొనఁగలఁడు? నావంటి వారివలె సూక్ష్మబుద్ధిగలపండితునకే ఆత్మ సువిజ్ఞేయుఁడు. ఈయాత్మ స్థితి, గతి, నిత్య, అనిత్యాది, విరుద్ధానేక ధర్మోపాధికుఁడగుటచేతను, విరుద్ధధర్మములు గలవాఁడగుటచేతను విశ్వరూపునివలెను చింతామణివలెను ప్రకాశించుచున్నాఁడు. కావున నాకంటెవేఱయినవాఁ డెవ్వఁడెఱుంగఁగలఁడు? అని ఆత్మ దుర్విజ్ఞేయుఁడను విషయము ప్రకటింపఁబడినది.

వివరణము:—'ఆసీనో దూరం వ్రజతీ' త్యాదిమంత్రార్థమును అనుభూతిప్రకాశమునందు శ్రీమద్విద్యారణ్యులవారు మనోరంజకముగ నిట్లునిరూపించియున్నారు:—

శ్లో. అంతర్ముఖోఽహం పశ్యామి మత్తోఽన్యో బాహ్యధీః పుమాన్,
జ్ఞాతుమర్హతి కోవా తం విరుద్ధాత్మత్వభాసినమ్. ౩౧

దూరం గచ్ఛేదిహాసీనః శయానో యాతి సర్వతః,
సమదో విమదశ్చాత్మా దుర్జ్ఞేయోఽవ్యావివేకిభిః. 32
వనే ధ్యాతుం సమాసీనో దేహం సంకల్ప్య మానసం,
తేనైవ నగరం గత్వా కరోతి క్రయవిక్రయౌ. 33
శయానో మంచకేఽత్రైషు విలీనేషు నిరాకృతిః,
ఆకాశవత్సర్వగతః ఏక స్సుప్తోఽవతిష్ఠతే. 34
ధనవిద్యాదిభిర్మత్తః పాండిత్యం సదసి బ్రువన్,
వైరాగ్యనటనేనాసౌ లక్ష్యతే మదహీనవత్. 35
ఏవం విరుద్ధధర్మత్వాత్ స భావః కోఽస్య వాస్తవః,
ఇతి జ్ఞాతుమశక్యత్వా దంతర్దృష్ట్యైవ మీక్షతామ్. 36

అనుభూతిప్రకాశము. ౧౧-వ అధ్యాయము.

౧-వ అధ్యా. ౨-వ వల్లి, ౨౨-వ మంత్రము.

అవ. ఆ యాత్మవిజ్ఞానమువలననే శోకాత్యయము, శోకనాశనము కలుగునని నిరూపించుచున్నాఁడు:—

మూ. అశరీరగ్ం శరీరేష్వనవస్థేష్వవస్థితం,
మహాంతం విభుమాత్మానం మత్వా ధీరో న శోచతి. ౨౨

పద. అశరీరం శరీరేషు అనవస్థేషు అవస్థితం, మహాంతం విభుం ఆత్మానం మత్వా ధీరః న శోచతి. ౨౨

టీక. ధీరః=బుద్ధిమంతుఁడు, ఆత్మానం=ఆత్మను, అశరీరం = శరీరవిరహితునిగను, అనవస్థేషు=అనిత్యములగు, శరీరేషు= శరీరములందు, అవస్థితం=ఉన్నవానిగను, మహాంతం=గొప్పవానిగను, విభుం=వ్యాపనముగలవానిగను, మత్వా=తలంచి, న శోచతి=దుఃఖింపఁడు.

తా. ఆత్మస్వరూపముచేత ఆకాశతుల్యుఁడు కావున అశరీరి యనంబడుచున్నాఁడు. అనిత్యములగు దేవ, పితృ, మనుష్యాది శరీరములందున్నవాఁ

డును, అనఁగా నిత్యుఁడును, వికారరహితుఁడు నని భావము. గొప్పవానిగను, విభువుగను, సర్వవ్యాపిగను, ఆత్మను (ఇచట ఆత్మశబ్దమును ప్రత్యగాత్మవాచకముగ తలంచుటయే ముఖ్యము) తలంచి అనఁగా "అయం అహం ఇతి=నేనే పరబ్రహ్మమని" తలంచుచున్న విద్వాంసుఁడు శోకింపఁడు. ఇట్టివాఁడయిన ఆత్మవేత్తకు శోకములేదని భావము.

వివరణము:—ఆత్మకు సశరీరత్వము అభిమానికమేగాని స్వాభావికము కాదని ఎఱుంగవలయును.

౧-వ అధ్యా. ౨-వ వల్లి, ౨౩-వ మంత్రము.

అవ. ఆత్మ దుర్విజ్ఞేయమయినను ఉపాయముచేత సువిజ్ఞేయము—సుఖముగా తెలిసికొనుటకు శక్యమే యని చెప్పఁబడుచున్నది:—

మూ. నాయమాత్మా ప్రవచనేన లభ్యో
న మేధయా బహునా శ్రుతేన,
యమేవైష వృణుతే తేన లభ్య
స్తస్యైషఆత్మా వివృణుతే తనూగ్ం స్వామ్. ౨౩

పద. న అయం ఆత్మా ప్రవచనేన లభ్యః న మేధయా బహునా. శ్రుతేన, యం ఏవ ఏషః వృణుతే తేన లభ్యః తస్య ఏషః ఆత్మా వివృణుతే తనూం స్వాం. ౨౩

టీక. అయంఆత్మా = ఈయాత్మ, ప్రవచనేన = అనేకవేదాధ్యయనముచేత, న లభ్యః = పొందుటకు వీలయినవాఁడుకాఁడు, మేధయా=గ్రంథార్థధారణాశక్తిరూపమగు మేధచేత, నలభ్యః = పొందుటకు వీలయినవాఁడు కాఁడు. బహునాశ్రుతేన = కేవలమయిన విశేషపాండిత్యముచేత, న లభ్యః = పొందుటకువీలయినవాఁడు కాఁడు. ఏషః = ఈసాధకుఁడు, యంఏవ = ఏయాత్మను, వృణుతే = వరించుచున్నాఁడో, తేన = వానిచేత, లభ్యః = పొందఁదగినవాఁడు. తస్య = ఆత్మకాముఁడగు అట్టివానికి, ఏషఃఆత్మా = ఈ

యాత్మ, స్వాంతనూం = పారమార్థికమగు తనస్వరూపమును, వివృణుతే = ప్రకాశింపఁజేయుచున్నాఁడు.

తా. అనేక వేదముల నధ్యయనమొనర్చుట చే ఆత్మనుపొందుటకు శక్యముకాదు. గ్రంథార్థధారణాశక్తిరూపమగు మేధ చేతను ఆత్మప్రాప్తి సాధ్యముకాదు. కేవలమయిన విశేష పాండిత్యముచేతను ఆత్మనుపొందుట సాధ్యముకాదు. ఇఁక దేనిచేత ఆత్మప్రాప్తిలభ్యమగునందురా, సాధకుఁడగువాఁ డెవ్వఁడు స్వాత్మభూతుఁడగు ఆత్మను పొందవలయునని కోరునో అట్టివాని చేతనే స్వయముగా ఆత్మ లభ్యుఁడగునని తెలిసికొనవలయును. నిష్కాముఁడయి ఆత్మనుమాత్రమే ప్రార్థించునట్టివానికే ఆత్మలభ్యుఁడని ఎఱుఁగవలయును. ఎట్లు లభ్యుఁడగుననఁగా చెప్పఁబడుచున్నది—అట్టి ఆత్మకాముఁడగు సాధకునకు ఈయాత్మయే స్వకీయమయిన పారమార్థికస్వరూపమును ప్రకటింపఁ జేయును.

వివరణము;—ఆత్మతత్త్వము ఉపనిషద్విచారవ్యతిరిక్త శాస్త్రాంతరాధ్యయనముచేతగాని, గురూపదేశము, గుర్వనుగ్రహము, ఈశ్వరానుగ్రహము లేని కేవలమయిన ఉపనిషద్విచారణముచేతగాని లభ్యము కాదనియు, ఆచార్య, పరమేశ్వరానుగ్రహపూర్వకమయిన ఉపనిషచ్ఛ్రవణ, మనన, నిదిధ్యాసనములచేతనే లభించుననియు గ్రహించునది.

౧-వ అధ్యా. ౨-వ వల్లి, ౨౪-వ మంత్రము.

మూ. నావిరతో దుశ్చరితాన్నాశాంతో నాసమాహితః,
నాశాన్తమనసో వాఽపి ప్రజ్ఞానేనైనమాప్నుయాత్.

పద. న అవిరతః దుశ్చరితాత్ న అశాంతః న అసమాహితః, న అశాంతమనసః వా అపి ప్రజ్ఞానేన ఏనం ఆప్నుయాత్. ౨౪

టీక. దుశ్చరితాత్ = శ్రుతిస్మృత్యవిహితమయినట్టియు నిషిద్ధమయినట్టియు పాపకర్మమునుండి, అవిరతః=విరమింపనివాఁడు, ఏనం=ఈయాత్మను,

న ఆప్నుయాత్ = పొందజాలఁడు. అశాంతః = ఇంద్రియచాపల్యము గల వాఁడు, న ఆప్నుయాత్ = ఈయాత్మను పొందఁజాలఁడు. అసమాహితః = ఏకాగ్రచిత్తములేనివాఁడు - విక్షిప్తమనస్కుఁడు, న ఆప్నుయాత్ = ఈ యాత్మను పొందఁజాలఁడు. అశాంతమానసః వా అపి = బహువిషయము లందు వ్యాప్తమయిన మనస్సుగలవాఁడున్నూ, న ఆప్నుయాత్ = ఈయాత్మను పొందఁజాలఁడు. ప్రజ్ఞానేన = బ్రహ్మవిజ్ఞానముచేతనే, ఏనం = ఈయాత్మను, ఆప్నుయాత్ = పొందును.

తా. దుశ్చరితమనఁగా శ్రుతిస్మృతులందు నిషిద్ధమయినట్టి పాపము. శ్రుతిస్మృతులందు విహితకర్మము చేయనిదికూడ దుశ్చరితమే. ఇట్టి పాపకర్మమునుండి విరమించనివాఁ డీయాత్మను పొందఁజాలఁడు. ఇంద్రియములకు సంబంధించిన విషయసుఖములనుండి శాంతిని పొందనివానికి ఆత్మప్రాప్తి శక్యము కాదు. ఏకాగ్రచిత్తము లేక అనేకవిషయములందు వ్యాపించిన చిత్తముగలవానికి కూడ ఆత్మప్రాప్తి శక్యము కాదు. సమాహితచిత్తుఁడయినను సమాధానఫలార్థి యగువానికికూడ ఆత్మప్రాప్తి శక్యముకాదు. ఇఁకదేనిచేత ఆత్మప్రాప్తి శక్యమగు ననఁగా? ప్రజ్ఞానేన అనఁగా బ్రహ్మవిజ్ఞానముచేతనే ఆత్మప్రాప్తి శక్యమగును. ఎవ్వఁడు శ్రుతిస్మృత్యవిహితమయినట్టియు, శ్రుతిస్మృతిప్రతిషిద్ధమయినట్టియుం పాపకర్మమునుండి విముఖుఁడగునో, ఎవ్వఁడు ఇంద్రియచాపల్యవిముఖుఁడో, ఎవ్వఁడు సమాహితచిత్తుఁడో, ఎవ్వఁడు సమాహితచిత్తత్వమునకు ఫలరూపమగు లోకములనుకూడ అభిలషింపఁడో అట్టివానిచేతనే గుర్వనుగ్రహముచేత ఆత్మప్రాప్తి పొందఁబడుచున్నదని భావము.

వివరణము:—దుశ్చరితమనఁగా కాయికమగు పాపాచరణము.

ఈశ్వరానుగ్రహముచేత లభింపఁదగిన ప్రసాదచిత్తత్వముకలిగి, అనేకవిధ సాధనసంపత్తి కలవాని చేతనే ఆత్మపొందుటకు శక్యముకాని తదితరులకు ఆత్మప్రాప్తి అశక్యమని భావము.

కఠ ఉ. ద్వి. అ. వ వల్లి, ౨౫-వ మంత్రము.

మూ. యస్య బ్రహ్మచ క్షత్రంచ ఉభే భవత ఓదనః,

మృత్యుర్యస్యోపసేచనం క ఇత్థా వేద యత్ర సః ౨౫

ఇతి కాఠకోపనిషది ప్రథమాధ్యాయే
ద్వితీయా వల్లీ సమాప్తా.

పద. యస్య బ్రహ్మ చ క్షత్రం చ ఉభే భవతః ఓదనః, మృత్యుః యస్య ఉపసేచనం కః ఇత్థా వేద యత్ర సః. ౨౫

ప్రథమాధ్యాయే ద్వితీయా వల్లీ సమాప్తా.

టీక. యస్య=ఏయాత్మకు, బ్రహ్మ చ క్షత్రం చ=బ్రహ్మక్షత్రత్వములు, ఉభే=రెండున్నూ, ఓదనః భవతః=అశనముగా అగుచున్నవో, యస్య = ఏయాత్మకు, మృత్యుః=మృత్యువు, ఉపసేచనం=ఉపసేచనమో, యత్ర = ఎచ్చట-స్వమహిమయందు, సః=ఆయాత్మయుండునో. (తం=అట్టియాత్మను), ఇత్థా =ఈవిధముగా, కః=ఎవ్వఁడు, వేద=తెలిసికొనును ?

తా. ఎవఁడు పూర్వోక్తానేకవిధసాధనవిరహితుఁడో, అట్టిప్రాకృతబుద్ధిగలవాఁడు సర్వధర్మవిధారకములును, సర్వరక్షణసమర్థములును అగుబ్రహ్మక్షత్రములు రెండున్నూ ఎవనికి అశనము లగుచున్నవో, సర్వసంహారకమగు మృత్యువెవ్వనికి అన్నభక్షణమునకు సాధనభూతమగు ఉపసేచనమో అట్టియాత్మను సాధనవిశిష్టుఁడగువానివలె ఎఱుంగఁజాలఁడు.

వివరణము;—ఉపసేచనమనఁగా అన్నమునకు సాధనభూతమగుశాకము మున్నగునది. సర్వసంహారకమగు మృత్యువు ఎవ్వనికి అన్నముకూడ కాఁజాలక తదుపసేచనమయి యున్నదో అట్టియాత్మను సాధనసంపత్తిగలవాఁడే ఎఱుంగఁగలడు కాని ప్రాకృతబుద్ధిగలవాఁ డెఱుంగఁజాలఁడని భావము.

కఠోపనిషత్తు. ౧-వ అధ్యాయము. ౨-వ వల్లి సమాప్తము.

ఈవల్లికిసంబంధించిన గ్రంథభాగములు:—

అనుభూతిప్రకాశము. ౧౧ అధ్యా. శ్లో. ౭-౪౧.

ఆత్మపురాణము. ౯ అధ్యా. శ్లో. ౨౭౫—౪౫౧.

# కఠోపనిషత్తు

## ప్రథమాధ్యాయము—తృతీయవల్లి.

---

౧-వ అధ్యా. 3-వ వల్లి, ౧-వ మంత్రము.

అవ. 'ఋతం పిబంతౌ' అనెడి ఈ 3-వ వల్లియొక్క సంబంధము చెప్పఁబడుచున్నది. విద్య, అవిద్యయనునది రెండున్నూ పరస్పరవిరుద్ధధర్మములు గలవనిమాత్రమే వెనుకటి రెండువల్లులందు చెప్పఁబడినదికాని స్పష్టముగా వానిని నిరూపింపలేదు. ఆవిషయమును నిరూపించుటకు సులభగ్రహణార్థము రథరూపకల్పనము చేయఁబడుచున్నది. ఆకల్పనానుసారము ప్రాప్తృ, ప్రాప్య, గంతృ, గంతవ్యవివేకార్థము ఆత్మద్వయ మువన్యసింపఁబడుచున్నది:—

మూ. ఋతం పిబంతౌ సుకృతస్య లోకే
గుహాం ప్రవిష్టౌ పరమే పరార్థ్యే,
ఛాయాఽఽతపౌ బ్రహ్మవిదో వదంతి
పంచాగ్నయో యే చ త్రిణాచికేతాః. ౧

పద. ఋతం పిబంతౌ సుకృతస్య లోకే గుహాం ప్రవిష్టౌ పరమే పరార్థ్యే, ఛాయాఽఽతపౌ బ్రహ్మవిదః వదంతి పంచాగ్నయః యే చ త్రిణాచికేతాః.

టీక. యేచ=ఎవ్వరు, త్రిణాచికేతాః = త్రిణాచికేతులో, పంచాగ్నయః=పంచాగ్నులో, తే=అట్టి, బ్రహ్మవిదః = బ్రహ్మవేత్తలు, సుకృతస్య = స్వయంకృతమగుకర్మయొక్క, ఋతం = ఋతమును-ఫలమును, పిబంతౌ = అను

భవించుచున్నవారును, లోకే = శరీరమునందుగల, పరమే=శ్రేష్ఠమయిన, పరార్థ్యే=బ్రహ్మస్థానమగు, గుహాం=బుద్ధిగుహను, ప్రవిష్టౌ=ప్రవేశించినవారుగను, (ఉన్నఆత్మలను) ఛాయాఽఽతపౌ = నీడయెండలవలె (పరస్పరమువిలక్షణ ధర్మముగలవారినిగా), వదంతి=(బ్రహ్మవేత్తలు) చెప్పుచున్నారు.

తా. ఋతమనఁగా సత్యము, కర్మఫలము అవశ్యము అనుభవించితీరవలసినది కావున ఋతశబ్దముచేత ఇట కర్మఫలముగ్రహింపఁబడుచున్నది. జీవాత్మ పరమాత్మలను వారిద్దఱిలో నొక్కఁడగు జీవాత్మ మాత్రమే కర్మఫలము ననుభవించుచున్నప్పటికిన్నీ జీవాత్మసంబంధముచేత ఛత్రిన్యాయముననుసరించి 'పిబంతౌ' అని ద్వివచనముచెప్పఁబడినది. సుకృతమనఁగా స్వయంకృతమగుకర్మము. ఋతమనఁగా స్వయంకృతమగుకర్మఫలము, దీనినిఅనుభవించుచున్నారని అన్వయము. దేహాశ్రయమగు ఆకాశప్రదేశముకంటె శ్రేష్ఠమయినట్టి బ్రహ్మమునకు స్థానభూతమయిన శరీరమునందుగల బుద్ధిగుహయందు ప్రవేశించినవారిగను, సంసారిత్వ, అసంసారిత్వవిభేదముచేత ఛాయాతపములవలె – నీడయెండలవలె పరస్పరము విలక్షణధర్మములుగలవారిగను జీవాత్మపరమాత్మలను బ్రహ్మవేత్తలగువారలు పలుకుచున్నారు. ఈవిషయము నీవిధముగా అకర్మకులగుబ్రహ్మవేత్తలు మాత్రమే పలుకుటలేదు. కర్మకులగు పంచాగ్నులగు గృహస్థులున్నూ, మూఁడు పర్యాయములు నాచికేతాగ్నిచయనము నాచరించుటచేత త్రిణాచికేతులని పిలువంబడుచున్న గృహస్థులున్నూ పైనబ్రహ్మవేత్తలుచెప్పినవిధముగనే చెప్పుచున్నారు.

వివరణము:—మూలమునందు 'ఋతం పిబంతౌ' కర్మఫలముననుభవించునట్టియిద్దఱు అని ద్వివచనముమాత్రమే చెప్పఁబడియుండఁగా 'జీవేశ్వరులని' వివరణమొనర్చుటకు కారణమేమనఁగా కర్మఫలానుభోక్తయగువాఁడు చేతనుఁడగు జీవుఁడొకఁడని సహజముగానే సిద్ధించుచున్నది. ఇఁక రెండవవానిని గూర్చి విచారించుట యుక్తము. లెక్కకు తీసికొనునప్పుడు పూర్వోక్తునితో

సమానస్వభావముగలవానినే పరిగ్రహించుటయుక్తము కావున సమానస్వభావముగల పరమాత్మయే రెండవవాఁడుగ ప్రకృతానుసారముగ నిట పరిగ్రహింపఁ బడినాఁడని గ్రహించునది.

ప్రాప్తృ, ప్రాప్య, గంతృ, గంతవ్య వివేకమనఁగా:—

ప్రాప్తయనఁగా బ్రహ్మప్రాప్తికి ప్రయత్నించునట్టిజీవుఁడు.

ప్రాప్యమనఁగా పొందఁదగినట్టి బ్రహ్మము.

గంతయనఁగా తెలిసికొనఁదగిన ఆత్మను తెలిసికొనుటకు ప్రయత్నించునట్టి జీవుఁడు.

గంతవ్యమనగా తెలిసికొనఁదగిన లేక పొందఁదగిన బ్రహ్మము.

వైశేషయస్వయము లివియని తెలిసికొనుటయే ప్రాప్తృ, ప్రాప్య, గంతృ, గంతవ్య వివేకమని యెఱుఁగవలయును.

ఛత్రిన్యాయానుసరణమనఁగా:—

ఛత్రధారియగు రాజు సపరివారుఁడయి పోవునప్పుడు 'ఛత్రిణో గచ్ఛంతి' అని ప్రయోగించుచుందురు. ఆసమూహమునందు గొడుగులున్న వారున్నూ లేనివారున్నూ ఉన్నప్పటికిన్నీ అట్టివిధసముదాయమునందున్నూ 'ఛత్రిణః' అనుపదము లోకమునందు ప్రయోగింపఁబడుచున్నది. అదేవిధము గా ఋతపానము జీవమాత్రనిష్ఠమైనను అవస్థితిసంబంధముచేత జీవాత్మపరమాత్మలిద్దఱియందును 'పిబంతౌ' అని ద్వివచన మిట ప్రయుక్తమయినదని యెఱుంగునది.

పరార్ధమనఁగా-పరస్య బ్రహ్మణః స్థానం పరార్థం. తస్మిన్ హి పరం బ్రహ్మోపలభ్యతే. అత స్తస్మిన్ పరమే పరార్థే హార్దాకాశే'యనిభాష్యమునందు వ్యాఖ్యాతమగుటచేత హార్దాకాశము పరార్థశబ్దమునకు వాచ్యమని గ్రహించవలయును. "పరార్థ్యమ్" అని మూలమునందు పాఠభేదముగలదు.

పంచాగ్నులనఁగా, గార్హపత్య, ఆహావనీయ, దక్షిణాగ్ని, సభ్య, ఆవసథ్యములను ఏదు అగ్నులను వ్రేల్చుచుండువారు. గార్హపత్య, ఆహావనీయ, దక్షిణాగ్నులు త్రేతాగ్నులనంబడును. అగ్నిపంచకము నారాధించువారు పంచాగ్నులనంబడుదురు. అగ్నిత్రయము నారాధించువారు త్రేతాగ్నులనంబడుదురు. వేదమునం దీపక్షద్వయము ప్రతిపాదింపఁబడియున్నది. ఇప్పటివారలు అగ్నిత్రయమును మాత్రమే ఉపాసించుచున్నను, రెండుపక్షములున్నూ శ్రుతి ప్రతిపాదితములగుటచేత శ్రుతిప్రతిపాదితమగు పంచాగ్నిపక్షము ననుసరించు వారిని ఇట శ్రుతియుదహరించుచున్నదని ఎఱుంగవలయును.

౧-వ అధ్యా. 3-వ వల్లి, ౨-వ మంత్రము.

**మూ.** యస్సేతు రీజానానా మక్షరం బ్రహ్మ యత్పరం,
అభయం తితీర్షతాం పారం నాచికేతగ్ంం శకేమహి. ౨

పద. యః సేతుః ఈజానానాం అక్షరం బ్రహ్మ యత్ పరం, అభయం తితీర్షతాం పారం నాచికేతం శకేమహి.

టీక. యః=ఏనాచికేతాగ్ని, ఈజానానాం=కర్మ తులలుయినయజమానులకు, సేతుః = సేతువువలెనుండెనో (అట్టి) నాచికేతం = నాచికేతాగ్నిని, (వయం) శకేమహి = మేము తెలిసికొనుటకున్నూ, చయనమొనర్చుటకున్నూ శక్తిగలవారమైతిమి. అభయం=భయములేనటుల, పారం=సంసారముయొక్క పారమును, తితీర్షతాం=దాటుటకు అభిలషించునట్టిబ్రహ్మవేత్తలకు, (ఆశ్రయభూతమయిన) యత్=ఏ, అక్షరం పరంబ్రహ్మ =,అక్షరమగుపరబ్రహ్మముగలదో (దానిని తెలిసికొనుటకు) శకేమహి=శక్తిగలవారలమైతిమి.

తా. ఏనాచికేతాగ్ని కర్మఠులగు యజమానులకు దుఃఖసంతరణార్థము సేతువుగా నున్నదో, అట్టినాచికేతాగ్నిని తెలిసికొనుటకున్నూ చయనమొనర్చుటకున్నూ మేము సమర్థులమైతిమి. భయములేనటుల సంసారసముద్రముయొక్కపారమును తరింపనిచ్ఛగల బ్రహ్మవేత్తలకు మిక్కిలి ఆశ్రయభూత

మగు నేయక్షరమగు పరబ్రహ్మముగలదో దానిని తెలిసికొనఁగలిగితిమి. కర్మఠు లగు బ్రహ్మవేత్తలకు ఆశ్రయభూతములగు పరాపరబ్రహ్మలను రెంటినిన్నీ తెలిసి కొనవలయును. 'ఋతంపిబంతౌ' అను వెనుకటిమంత్రమునందు యీపరాపర బ్రహ్మలవిషయమై బోధింపఁబడినది.

వివరణము:—కర్మఠులకు ఆశ్రయము అపరబ్రహ్మమనియు, బ్రహ్మ వేత్తలకు ఆశ్రయము పరబ్రహ్మమనియు నెఱుంగవలయును.

౧-వ అధ్యా. 3-వ వల్లి, 3-వ మంత్రము.

మూ. ఆత్మానగ్ం రథినం విద్ధి శరీరగ్ం రథ మేవ తు,
బుద్ధిం తు సారథిం విద్ధి మనః ప్రగ్రహ మేవచ 3

పద. ఆత్మానం రథినం విద్ధి శరీరం రథం ఏవ తు, బుద్ధిం తు సారథిం విద్ధి మనః ప్రగ్రహం ఏవ చ. 3

టీక ఆత్మానం = (శరీరాధిష్ఠితుఁడును, సంసారియునగు) ఆత్మ, రథి నం=రథము నధిష్ఠించియున్నవానినిగ, విద్ధి = తెలిసికొనుము, శరీరం = శరీర మును, రథం ఏవతు=రథమునుగా, (విద్ధి=తెలిసికొనుము), బుద్ధింతు = (అధ్యవ సాయలక్షణమగు) బుద్ధిని, సారథిం = సారథినిగా, విద్ధి=తెలిసికొనుము, మనః= మనస్సును. ప్రగ్రహంఏవచ=పగ్గమునుగా ఎఱుంగుము.

తా. వారిలో - అనఁగా ఆజీవాత్మపరమాత్మలలో ఉపాధికృతుఁడగు సంసారి - జీవుఁడు విద్యావిద్యలకు అధికృతుఁడగుచున్నాఁడు. అట్టిఅధికారి యగుజీవునకు మోక్షగమనమునకును సంసారగమనమునకును (ప్రయత్నాను సారము ఉపయోగపడునట్టి) రథము కల్పింపఁబడుచున్నది. ఆరథమునకు ఋతువుఁడును, సంసారియు, శరీరాధిష్ఠితుఁడును అగుజీవాత్ముని (రథతాదా త్మ్యాభిమానిని) రథస్వామినిగా నెఱుంగుము. రథమునకు కట్టిన అశ్వస్థానీయము లగు ఇంద్రియములచేత దేహము నలువైపుల ఆకర్షింపఁబడుచున్నది కావున శరీరమును రథమునుగా నెఱుంగుము. శరీరము బుద్ధినేతృప్రధానమగుటచేత

అధ్యవసాయలక్షణమగుబుద్ధిని (శరీరమనురథమునకు) సారథినిగా తలంపుము. రథము ఎటులసారథినేతృప్రధానమో (అట్లేశరీరరథముకూడ బుద్ధినేతృప్రధానము) తెలియుచుగదేహసంబంధమగు కార్యజాతమంతయు బుద్ధిచేతనే ఆచరింపఁబడుచుండుట లోకప్రసిద్ధమేగదా. సంకల్పవికల్పాదిలక్షణమగు మనస్సును పగ్గమునుగా నెఱుంగుము. పగ్గములయొక్క ఆకర్షణవికర్షణముల ననుసరించి గుఱ్ఱములెట్లు నడుచుచున్నవో అట్లే శ్రోత్రాదీంద్రియములుకూడా మనస్సుచేత ప్రగృహీతములయి తత్తత్కార్యములందు ప్రవర్తించుచున్నవనువిషయము సుప్రసిద్ధముగదా.

౧-వ అధ్యా. ౩-వ వల్లి, ౪-వ మంత్రము.

మూ. ఇంద్రియాణి హయానాహుర్విషయాఁస్తేషు గోచరాన్,
ఆత్మేంద్రియమనోయుక్తం భోక్తే త్యాహుర్మనీషిణః. ౪

పద. ఇంద్రియాణి హయాన్ ఆహుః విషయాన్ తేషు గోచరాన్, ఆత్మేంద్రియమనోయుక్తం భోక్తా ఇతి ఆహుః మనీషిణః. ౪

టీక. మనీషిణః=వివేకశీలురగుజ్ఞానులు, ఇంద్రియాణి=చక్షురాదీంద్రియములను, హయాన్=గుఱ్ఱములనుగా, ఆహుః = పలుకుదురు, తేషు=ఆనేత్రాదీంద్రియము లందుఁగల, విషయాన్=రూపాదివిషయములను, గోచరాన్ = మార్గములనుగా, ఆహుః = (జ్ఞానులు) పలుకుచున్నారు. ఆత్మేంద్రియమనోయుక్తం=శరీరేంద్రియ మనస్సులతోఁగూడుకొనియున్న ఆత్మను, భోక్తాఇతి= భోక్తయని, ఆహుః=(జ్ఞానులు) చెప్పుదురు.

తా. రథకల్పనమునందు నేర్పరులగువిద్వాంసులు శరీరమను రథమును నలువైపులకు ఆకర్షించుటకు సామర్థ్యముగలవియగుటచేత నేత్రాదీంద్రియములను గుఱ్ఱములని చెప్పుచున్నారు. గుఱ్ఱములనుగా భావించిన ఇంద్రియములందుఁగల రూపాదివిషయములను మార్గములనుగా చెప్పుదురు. శరీరేంద్రియమనస్సహితుఁడగు జీవాత్మను భోక్తయని—సంసారియని వివేకులు పలుకుదురు.

ఆత్మకు భోక్తృత్వమనునది బుద్ధ్యుపాధికృతమేగాని కేవలాత్మకు—అనఁగా బుద్ధ్యుపాధిరహితాత్మకు భోక్తృత్వమేలేదు. 'ధ్యాయతీవ, లేలాయతీవ, యను బృహదారణ్యకశ్రుతి బుద్ధ్యుపాధిరహితాత్మకు భోక్తృత్వము లేదని నిరూపించుచున్నది. ఇట్లయినప్పుడే—అనఁగా జీవాత్మకు భోక్తృత్వము ఉపాధికృతముయినప్పుడే చెప్పఁబడుచున్న రథకల్పనము ననుసరించి మోక్షప్రాప్తి పొందుటకు శక్యమగును కాని లేనియెడల—అనఁగా సంసారిత్వ—భోక్తృత్వములే జీవునకు స్వాభావికము లయినయెడల పారమార్థికమగు స్వభావము అనతిక్రమణీయము కావున మోక్షప్రాప్తియే లేకపోవును.

౧-వ అధ్యా. ౩-వ వల్లి, ౫-వ మంత్రము.

మూ. య స్త్వవిజ్ఞానవాన్ భవత్యయుక్తేన మనసా సదా,
తస్యేన్ద్రియాణ్యవశ్యాని దుష్టాశ్వా ఇవ సారథేః. ౫

పద. యః తు అవిజ్ఞానవాన్ భవతి అయుక్తేన మనసా సదా, తస్య ఇన్ద్రియాణి అవశ్యాని దుష్టాశ్వాః ఇవ సారథేః. ౫

టీక. యఃతు=బుద్ధియనెడి ఏసారథి, సదా = ఎల్లప్పుడు, అయుక్తేన= అసమాహితము ఐన, మనసా=మనస్సుచేత, అవిజ్ఞానవాన్ భవతి=వివేకహీనుఁడు అగుచున్నాఁడో, తస్య=అట్టిఅవివేకికి, ఇంద్రియాణి = ఇంద్రియములు, సారథేః=(నేర్పరిగాని) సారథికి, దుష్టాశ్వాఃఇవ = దుష్టములయిన గుఱ్ఱములవలె, అవశ్యాని=స్వాధీనముకానివి (భవంతి=అగుచున్నవి.)

తా. ఇట్లగుటచేత—(అనఁగా ఆత్మకు సంసారిత్వము అస్వాభావికమగుటచేత నని భావము) బుద్ధియనెడి సారథి ప్రవృత్తియందు గాని నివృత్తియందు గాని చక్కనివివేకము లేనివాఁడగునెడల రథమును నడపించుటయందు నేర్పరితనము లేనట్టియు సమాహితచిత్తుఁడు కానట్టియు సారథికి దుష్టాశ్వము లెటుల స్వాధీనములు కావో అదేవిధముగా ఇంద్రియాశ్వములనుకూడ అసమాహితబుద్ధిగలవాఁడు కుమార్గమునుండి మఱలింపఁజాలఁడు.

౧-వ అధ్యా. 3-వ వల్లి, ౬-వ మంత్రము.

మూ. యస్తు విజ్ఞానవాన్ భవతి యుక్తేన మనసా సదా,
తస్యేన్ద్రియాణి వశ్యాని సదశ్వా ఇవ సారథేః. ౬

పద. యః తు విజ్ఞానవాన్ భవతి యుక్తేన మనసా సదా, తస్య ఇన్ద్రియాణి వశ్యాని సదశ్వాః ఇవ సారథేః. ౬

టీక. యః తు = ఏబుద్ధియనెడి సారథి, యుక్తేన = సమాహితమయిన, మనసా=మనస్సుచేత, సదా=ఎల్లప్పుడు, విజ్ఞానవాన్ భవతి = నేర్పరియగుచున్నాఁడో, తస్య=అట్టివానికి, ఇంద్రియాణి=ఇంద్రియములు, సారథేః=(నేర్పరియగు) సారథికి, సదశ్వాః ఇవ=మంచిగుఱ్ఱములవలె, వశ్యాని=స్వాధీనములయినవి. (భవంతి=అగుచున్నవి.)

తా. ఏబుద్ధియనుసారథి వెనుకటివలె వివేకవిహీనుఁడు కాక వివేకియై సర్వదా సమాహితచిత్తుఁడైయుండునో అట్టివానికి అశ్వస్థానీయములగు ఇంద్రియములుకూడ బుద్ధ్యనుసారము ఆయావిషయములందు ప్రవర్తించుటకును నివర్తించుటకును, నేర్పరియగుసారథికి మంచిగుఱ్ఱములువలె అణఁగియుండును.

౧-వ అధ్యా. 3-వ వల్లి, ౭-వ మంత్రము.

అవ. వివేకవిహీనుఁడగు బుద్ధి సారథిగాఁగలవాఁడు పొందెడిఫలము చెప్పఁబడుచున్నది:—

మూ. యస్త్వవిజ్ఞానవాన్ భవత్యమనస్కః సదా ఽశుచిః,
న స తత్పదమాప్నోతి సꣳసారం చాధిగచ్ఛతి ౭

పద. యః తు అవిజ్ఞానవాన్ భవతి అమనస్కః సదా అశుచిః, న సః తత్ పదం ఆప్నోతి సంసారం చ అధిగచ్ఛతి.

టీక. యః తు=ఎవ్వఁడయితే, అవిజ్ఞానవాన్ భవతి=వివేక విహీనుఁడు అగుచున్నాఁడో, అమనస్కః = వశపఱచుకొనని చిత్తముగలవాఁడుగను,

సదా=ఎల్లప్పుడు, అశుచిః=అపవిత్రుఁడుగ నుండునో, సః = అట్టిసారథి, తత్ పదం = అక్షరమగు ఆమోక్షమనుస్థానమును, న ఆప్నోతి = పొందఁజాలఁడు, సంసారంచ=జననమరణాది లక్షణమగుసంసారమునుకూడ, అధిగచ్ఛతి=పొందు చున్నాఁడు.

తా. ఎవ్వఁడు వివేకవిహీనుఁ డగుచున్నాఁడో అమనస్కుఁడో— ఇంద్రియచాంచల్యమును జయింపలేడో కావుననే సర్వదా అపవిత్రుఁడయి యుండునో, అట్టిరథియగువాఁడు అట్టిసారథిసహాయముతో—అనఁగా వివేక విరహితమయినబుద్ధితో కైవల్యమును— మోక్షమును పొందఁడు సరిగదా జన్మ మరణలక్షణమగు సంసారమునకు కూడ పాల్పడును.

వివరణము. అవివేకియగువానికి మనోనిగ్రహములేనియెడల ఇంద్రియ చాపల్యమునకు లోఁబడును. ఇంద్రియచాపల్యమువలన పాపకృత్యముల నాచ రించును. సర్వదా పాపకృత్యచింతనమువలన దూషితాంతఃకరణుఁడు అశుచి యయి జన్మమరణముల నందుచుండుట సుప్రసిద్ధముగదా.

౧-వ అధ్యా. 3-వ వల్లి, ౮-వ మంత్రము.

మూ. యస్తు విజ్ఞానవా న్భవతి సమనస్కస్సదా శుచిః,
స తు తత్పదమాప్నోతి యస్మా ద్భూయో న జాయతే.

పద. యః తు విజ్ఞానవాన్ భవతి సమనస్కః సదా శుచిః, స తు తత్ పదం ఆప్నోతి యస్మాత్ భూయః న జాయతే. ౮

టీక. యఃతు=ఎవ్వఁడయితే, విజ్ఞానవాన్ = జ్ఞానముగలవాఁడున్నూ, సమనస్కః=యుక్తమయిన మనస్సుగలవాఁడున్నూ, సదా=ఎల్లప్పుడు, శుచిః= పవిత్రుఁడును అగుచున్నాఁడో, సః తు = అట్టివాఁడు, యస్మాత్ = పొందఁబడిన యేస్థానమునుండి, భూయః=మరల, నజాయతే=పుట్టఁజాలఁడో, తత్ పదం=ఆ స్థానమును, ఆప్నోతి=పొందుచున్నాఁడు.

తా. ఎవ్వఁడువిజ్ఞానవంతుఁడో (విజ్ఞానమనఁగా ఇగిచేయఁదగినపని ఇది చేయరానిపని యనిఎఱుంగుట) జ్ఞానముగలసారథితోడఁ గూడియుండునో అట్టిరథికుఁడు అనఁగా విద్వాంసుఁడు మనోనిగ్రహముగలవాఁడు కావుననే సర్వదా శుచియౌ వాఁడు ఏయాత్మపదమును పొందుటవలన మఱల అచటి నుంచి ప్రచ్యుతి లేనివాఁడయి జననమరణరూపసంసారమునందు పుట్టఁజాలఁడో అట్టి మోక్షరూపమయిన స్థానమును పొందును.

౧-వ అధ్యా. 3-వ వల్లి, ౯-వ మంత్రము.

అవ. ఆపద మేమియో తెలుపఁబడుచున్నది.

మూ. విజ్ఞానసారథి ర్యస్తు మనః ప్రగ్రహవా న్నరః,
సో ఽధ్వనః పార మాప్నోతి తద్విష్ణోః పరమం పదమ్.౯

పద. విజ్ఞానసారథిః యః తు మనః ప్రగ్రహవాన్ నరః, సః అధ్వనః పారం ఆప్నోతి తత్ విష్ణోః పరమం పదమ్. ౯

టీక. యః నరః తు=ఏమనుష్యుఁడయితే, విజ్ఞానసారథిః = వివేకయుక్తమయినబుద్ధియే సారథిగాఁగలవాఁడో, మనః ప్రగ్రహవాన్=మనస్సను పగ్గము గలవాఁడో, అనఁగా స్వాధీనమయిన మనస్సుగలవాఁడో, సః = అట్టిమనుష్యుఁడు, అధ్వనః=మార్గముయొక్క, పారం = పారమును, ఆప్నోతి=పొందుచున్నాఁడు, తత్ =అదియే, విష్ణోః = వ్యాపనశీలుఁడగు పరమాత్మయొక్క, పరమం పదం=శ్రేష్ఠమయిన స్థానము.

తా. ఎవ్వఁడు విజ్ఞానసారథియో—అనఁగా వివేకసమన్వితమగుబుద్ధియే సారథిగాఁగలవాఁడో, ఎవ్వఁడు మనస్సును స్వాధీనపఱచుకొని సమాహితచిత్తుఁడయియుండునో అట్టివిద్వాంసుఁడు సంసారసాగరముయొక్క అవతలి ఒడ్డును-అనఁగా పొందఁదగినట్టి పరబ్రహ్మమును పొందుచున్నాఁడు. సర్వవిధ సంసారబంధములనుండి విముక్తుఁడగుచున్నాఁడు. ఇదియే వ్యాపనశీలుఁడును

పద. ఇన్ద్రియేభ్యః పరాః హి అర్థాః అర్థేభ్యః చ పరం మనః, మనసః చ పరాబుద్ధిః బుద్ధేః ఆత్మా మహాన్ పరః.

టీక. అర్థాః = శబ్దాదివిషయములు, ఇంద్రియేభ్యః = ఇంద్రియముల కంటె, పరాః=సూక్ష్మములయినవి, మనః=మనస్సు, అర్థేభ్యఃచ=శబ్దాది విషయములకంటెను, పరం=సూక్ష్మతరమయినది. మనసఃచ=సంకల్ప వికల్ప లక్షణమగు మనస్సుకంటె, బుద్ధిః=అధ్యవసాయాత్మకమగుబుద్ధి, పరా=సూక్ష్మతరమయినది. బుద్ధేః=అధ్యవసాయాత్మక మగుబుద్ధికంటె, మహాన్ ఆత్మా=సర్వమహత్త్వమగు హిరణ్యగర్భాఖ్యతత్త్వము, పరః=సూక్ష్మతరమయినది.

తా. ఇంద్రియములను ప్రథమమున స్థూలములనుగా గ్రహించునది. ఈయింద్రియములకు కారణభూతములగు శబ్దాదివిషయములు స్వకార్యములగు ఇంద్రియములకంటె సూక్ష్మములును ప్రత్యగాత్మభూతములును అగుచున్నవి. ఆశబ్దాదివిషయములకంటె ప్రత్యగాత్మభూతమగు మనస్సు మహత్తైనది. మనస్సనఁగా ఇచట మనస్సునకు ఆరంభకమగుభూతసూక్ష్మమని యెఱుంగవలయును. సంకల్పవికల్పాద్యారంభకమగు మనస్సుకంటె బుద్ధి సూక్ష్మతరము, మహత్తరము ప్రత్యగాత్మభూతమని యెఱుంగవలయును. బుద్ధియనఁగా అధ్యవసాయాద్యారంభకమగు భూతసూక్ష్మము. అట్టిబుద్ధికంటె ఆత్మ సర్వప్రాణిబుద్ధులకు ప్రత్యగాత్మభూత మగుటచేత మహత్తరము. సర్వమహత్త్వమును ప్రథమజాతమును హిరణ్యగర్భనామకమును బోధాబోధాత్మకమును అగుఆత్మ బుద్ధికంటె పరతత్త్వమని గ్రహించవలయును.

౧-వ అధ్యా. ౩-వ వల్లి, ౧౧-వ మంత్రము.

మూ. మహతః పరమవ్యక్తమవ్యక్తాత్పురుషః పరః,
పురుషాన్న పరం కించిత్సా కాష్ఠా సా పరా గతిః ౧౧

పద. మహతః పరం అవ్యక్తం అవ్యక్తాత్ పురుషః పరః, పురుషాత్ న పరం కించిత్ సా కాష్ఠా సా పరా గతిః.

టీక. మహతః=మహత్తత్త్వముకంటె, అవ్యక్తం = అవ్యక్తము, పరం= మహత్తరమైనది, అవ్యక్తాత్ = ఆయవ్యక్తముకంటె, పురుషః = పురుషుఁడు, పరః=మహత్తరుఁడు, పురుషాత్=పురుషునికంటె, పరం = మహత్తరమయినది, కించిత్ న=కొంచెమైనను లేదు. సా = అదియే, కాష్ఠా = అంతమైనది. (సా= అదియే,) పరా గతిః=శ్రేష్ఠమయినగతి.

తా. పూర్వమంత్రోక్తమగు మహత్తత్త్వముకంటె అవ్యక్తము సర్వ మహత్తరమగు ప్రత్యగాత్మభూతము. ఈయవ్యక్తము సర్వజగత్తునకు బీజ భూతము. అవ్యాకృత నామరూపములే స్వరూపముగాఁగలది సర్వకార్య కారణశక్తి సమాహారరూపమయినది. అవ్యక్త, అవ్యాకృత, ఆకాశాది నామ వాచ్యము. వటబీజమునందు వటవృక్షశక్తివలె పరమాత్మయందు ఓతప్రోత భావముచేత ఆశ్రయించి యుండునది. అట్టి అవ్యక్తముకంటె పురుషుఁడు సర్వకారణుఁడగుటచేత పరుఁడును, సూక్ష్మతరుఁడును ప్రత్యగాత్మయును నగుచు న్నాఁడు. సర్వపరిపూరకుఁడగుటచేత పురుషుఁడని చెప్పఁబడుచున్నాఁడు. అతని కంటె వేఱయిన పరుఁడయినవాఁడు లేఁడని నివారించుచున్నాఁడు:—చిన్మాత్ర ఘనుఁడగు అట్టి పురుషునికంటె పరమయిన వస్త్వంతరమే లేదు. కావున సూక్ష్మత్వ, మహత్త్వ, ప్రత్యగాత్మత్వ భూతములయిన వానిలో అదియే పరా కాష్ఠ అనఁగా పర్యవసానభూతమయినది. ఇచట ఇంద్రియములను ప్రారంభించి పురుషపర్యంతము సూక్ష్మత్వము పరిసమాప్తి చేయఁబడినది. కావుననే సర్వవిధ మయినగతిగలసంసారులకు ఈపురుషుఁడే పరాగతి—అనఁగా శ్రేష్ఠమయిన గతి. "యద్గత్వా ననివర్తంతే తద్ధామ పరమం మమ" అను స్మృతివాక్య మీ విషయమునే బోధించుచున్నది.

౧-వ అధ్యా. ౩-వ వల్లి, ౧౨-వ మంత్రము.

మూ. ఏష సర్వేషు భూతేషు గూఢోఽఽత్మా న ప్రకాశతే,
దృశ్యతేత్వగ్ర్యయా బుద్ధ్యా సూక్ష్మయా సూక్ష్మదర్శిభిః.

౧౨. ఏషః సర్వేషు భూతేషు గూఢః ఆత్మా న ప్రకాశతే, దృశ్యతే తు అగ్ర్యయా బుద్ధ్యా సూక్ష్మయా సూక్ష్మదర్శిభిః.

టీ. ఏషః=ఈ, పురుషుఁడు, సర్వేషు భూతేషు = సకలప్రాణులందు, గూఢః=గూఢముగా నున్నవాఁడై, ఆత్మా = ఆత్మగా, న ప్రకాశతే = ప్రకాశించుట లేదు. (ఏషః=ఈపురుషుఁడు) అగ్ర్యయా=ఏకాగ్రత్వము కలిగినటు వంటిన్ని, సూక్ష్మయా = ('ఇంద్రియేభ్యః పరా హ్యర్థాః' అనుమంత్రాను సారము ఇంద్రియాదికముకంటె క్రమముగ) సూక్ష్మమయినవస్తు నిరూపణ పరమయిన, బుద్ధ్యా = బుద్ధితో, సూక్ష్మదర్శిభిః = సూక్ష్మమయిన ఆత్మవస్తువును చూచుటయందు సమర్థులగు పండితులచేతనే, దృశ్యతేతు = చూడఁబడు చున్నాఁడు.

తా. పూర్వ:—వెనుకటిమంత్రములందు "సా కాష్ఠా సా పరాగతిః" 'స తు తత్పదమాప్నోతి' మున్నగునవి చెప్పఁబడినాయి. ఎచ్చట గతి యనునదిసంభవించుచున్నదో అచ్చట తప్పక 'ఆగతి' కూడ ఉండితీరవలయును. ఇట్లుండఁగా ("యస్మాద్భూయో న జాయతే. కఠ. ౧-౩-౮) అనిచెప్పుట అసంగతముగదా.

సమా:—పురుషుఁడు—పరమాత్మ సర్వమునకు ప్రత్యగాత్మభూతుఁ డగుటచేత సర్వప్రత్యగాత్మగా అవగతి—అనఁగా ఎఱుంగుటయే ఇచటగతి యని ఉపచారముగా చెప్పఁబడినది. "ఇంద్రియేభ్యః పరాహ్యర్థాః. కఠ. ౧-౩-౧౦. అనుమంత్రమునందు ఇంద్రియమనోబుద్ధులకుపరునిగా-ప్రత్యగా త్మగా పురుషుని చెప్పియున్నారు. 'అనధ్వగాః అధ్వనః పారయిష్ణవః, మున్నగు శ్రుతు లీయర్థమునే ప్రకటించుచున్నవి. సర్వమునకు నీపురుషుఁడే ప్రత్యగాత్మ భూతుఁడనువిషయము తెలుపఁబడుచున్నది. బ్రహ్మాది స్తంబపర్యంతములగు సకలప్రాణులందు గూఢముగా నున్నవాఁడై దర్శనశ్రవణాదికర్మ గలవాఁడై అవిద్యామాయాచ్ఛన్నుఁడయి ఆత్మగా నెవ్వనికి ప్రకాశించుటలేదు. మాయా

వైచిత్ర్యము అతిగంభీరమై తెలిసికొనుటకు అశక్యమయి విచిత్రముగానున్నది గదా. ఏమియాశ్చర్యము. లోకమునందుఁగల ప్రాణిజాతమంతయుఁ వాస్తవముఁనను పరమార్థస్వరూపమైనను "అహం పరమాత్మా = నేనేపరమాత్మస్వరూపుఁడను" అని బోధింపఁబడుచున్నప్పటికిన్ని ఆత్మను గ్రహించుటలేదు. ఘటాదికమువలె గనంబడుచున్న దేహేంద్రియాదిసంఘాతమును ఆత్మగా గ్రహించుచు చెప్పకపోయినప్పటికిన్ని 'నేను యజ్ఞదత్తుని పౌత్రుఁడను, దేవదత్తుని పుత్త్రుఁడను' అని గ్రహించుచున్నది. +నిజముగా ఆపరాత్పరుని మాయచేతనే మోహితమయి ప్రాణిజాతమంతయుఁ నిటులపరిభ్రమణమొనర్చుచున్నది. ఈ విషయమునే

స్మృతి:—నాహం ప్రకాశస్సర్వస్య యోగమాయాసమావృతః

(అర్థ. యోగమాయచేత కప్పివేయఁబడిన నేనందఱకుఁ గనంబడుట లేదు.)

అని స్మృతి ప్రకటించుచున్నది.

పూర్వ:—మీరుచెప్పుచున్నది పరస్పర విరుద్ధముగనున్నది.

'మహాంతం విభుమాత్మానం మత్వా ధీరో న శోచతి. (కఠ ౧ ౨-౨౨)

అని యొకచోట

ఏష సర్వేషు భూతేషు గూఢోత్మా న ప్రకాశతే.|(కఠ.౧-3-౧౨)

అని మఱొకచోట చెప్పుట ఉచితముగాలేదు.

సమా:—ఈవిషయము మీరుతలఁచినట్లు పరస్పరవిరుద్ధముగలది కాదు. అసంస్కృతచిత్తునకు అవిజ్ఞేయమగుటచేత 'న ప్రకాశతే' యని చెప్పఁబడినది, సంస్కృతమైనట్టియుఁ, ఏకాగ్రతకలిగినట్టియుఁ, సూక్ష్మవస్తునిరూపణపరమయినట్టియుఁ బుద్ధిచేత "ఇంద్రియేభ్యః పరా హ్యర్థాః" అను క్రమము ననుసరించి పరమయినట్టియుఁ సూక్ష్మమయినట్టియుఁ బ్రహ్మమునెఱుంగుటయే ఎవ్వరికి స్వభావముగాఁ గలిగియున్నారో అట్టిసూక్ష్మదర్శులగువారిచేత చూచుటకు శక్యమగుటచేత 'ధీరో న శోచతి' అని చెప్పఁబడియున్నది.

౧-వ అధ్యా. 3-వ వల్లి, ౧3-వ మంత్రము.

అవ. ఆత్మప్రాప్త్యుపాయము చెప్పఁబడుచున్నది:—

మూ. యచ్ఛేద్వాఙ్మనసీ ప్రాజ్ఞస్తద్యచ్ఛేత్ జ్ఞాన ఆత్మని,
జ్ఞానమాత్మని మహతి నియచ్ఛేత్తద్యచ్ఛేచ్ఛాన్త ఆత్మని.

పద. యచ్ఛేత్ వాక్ మనసి ప్రాజ్ఞః తత్ యచ్ఛేత్ జ్ఞానే ఆత్మని జ్ఞానం ఆత్మని మహతి నియచ్ఛేత్ తత్ యచ్ఛేత్ శాన్తే ఆత్మని.

టీక. ప్రాజ్ఞః = పండితుఁడు, వాక్ = వాగాదిసకలేంద్రియ వ్యాపారమును, మనసి=మనస్సునందు, యచ్ఛేత్=ఉపసంహారము చేయవలయును. తత్ =ఆమనస్సును, జ్ఞానే = ప్రకాశస్వరూపమగు, ఆత్మని = బుద్ధ్యాత్మయందు, యచ్ఛేత్=నియమింపవలయును. జ్ఞానం = ప్రకాశస్వరూపమగుబుద్ధిని, మహతి ఆత్మని = మహదాత్మకుఁడగు ఆత్మయందు-ప్రథమజుఁడగు హిరణ్యగర్భుని యందు, నియచ్ఛేత్ = నియమింపవలయును. తత్ = ఆహిరణ్యగర్భబుద్ధిని, శాంతే=సర్వవికారశూన్యమగు, ఆత్మని=ముఖ్యాత్మయందు-పరబ్రహ్మమునందు, యచ్ఛేత్=నియమింపవలయును.

తా. వివేకియగువాఁడు వాగాదిజ్ఞానకర్మేంద్రియవ్యాపారసహితముగ ఇంద్రియాత్మను సంకల్పవికల్పాత్మకమగు మనస్సునందు ఉపసంహరించ వలయును. మూలమునందుగల 'వాక్' అనుపదమును ఉపలక్షణముగా గ్రహించవలయును. కావున సవ్యాపారములగు సకలేంద్రియములను గ్రహించవలయును. అట్టిమనస్సును ప్రకాశస్వరూపమగు బుద్ధ్యాత్మయందు ఉపసంహరించవలయును. 'ఆప్నోతీతి ఆత్మా' యను వ్యుత్పత్తి ననుసరించి మనస్సు మున్నగు కరణములను పొందియుండును కావున ఆత్మశబ్ద మిట బుద్ధివాచకము. అట్టి బుద్ధిని మహత్తగుఆత్మయందు అనఁగా ప్రథమజుఁడగు హిరణ్యగర్భునియందు ఉపసంహరించవలయును. అనఁగా హిరణ్యగర్భునియొక్క స్వచ్ఛస్వభావమగు విజ్ఞానమువలె ఆత్మయొక్క విజ్ఞానము నొనర్పవలయునని భావము. అట్టిమహా

పాత్మక ఆత్మను సర్వవిశేషశూన్యమును వికారరహితమును సర్వాంతరమును సర్వప్రత్యయసాక్షియు నగు ముఖ్యాత్మయందు - పరమాత్మయందు ఉపసంహరింపవలయును.

౧-వ అధ్యా. ౩-వ వల్లి, ౧౪-వ మంత్రము.

మూ. ఉత్తిష్ఠత జాగ్రత
ప్రాప్య వరాన్నిబోధత,
క్షురస్య ధారా నిశితా దురత్యయా
దుర్గం పథ స్తత్కవయో వదన్తి. ౧౪

పద. ఉత్తిష్ఠత జాగ్రత ప్రాప్య వరాన్ నిబోధత, క్షురస్య ధారా నిశితా దురత్యయా దుర్గం పథః తత్ కవయః వదన్తి.

టీక. (ఆదిలేని అవిద్యయందు నిద్రించుచున్న ఓప్రాణులారా! మీరు) ఉత్తిష్ఠత = లెండు, జాగ్రత = (అజ్ఞాననిద్రనుండి) మేల్కొనుఁడు, వరాన్ = శ్రేష్ఠులగుగురువులను, ప్రాప్య = పొంది, నిబోధత = తెలిసికొనుఁడు. యథా = ఏ ప్రకారము, క్షురస్య = కత్తియొక్క, నిశితా = పదునుగల, ధారా = ధార, దురత్యయా = (పాదములచేత) పొందుటకు శక్యముకానిదో, తథా = ఆదేవిధముగా, తత్ పథః = ఆయాత్మతత్త్వస్వరూపభూతమగుమార్గము, దుర్గం = దుర్గముగా - దుఃఖముచేత పొందఁదగినదిగా, కవయః = విద్వాంసులు, వదంతి = పలుకుచున్నారు.

తా. వెనుకటి మంత్రమునందు ఇంద్రియములను మనస్సునందు, మనస్సును బుద్ధియందు, బుద్ధిని మహత్తత్త్వమునందు, మహదాత్మను నిర్గుణాత్మయందు ప్రవిలాపము చేయవలసిన క్రమ ముపదేశింపఁబడియున్నది. మరీచ్యుదక, రజ్జుసర్ప, ఆకాశమలినములు, మరీచి, రజ్జు, ఆకాశస్వరూప పరిజ్ఞానముచేత ఎటుల నశించుచున్నవో అట్లే క్రియాకారక ఫలలక్షణమును, నామరూప కర్మాశ్రయమును, మిథ్యాజ్ఞాన విజృంభితమును అగు సర్వప్రపంచమును స్వాత్మ

యథార్థజ్ఞానముచేత పురుషశబ్దవాచ్యుఁడగు ఆత్మయందు లయింపఁజేసిన వాఁడు స్వస్థుఁడును, ప్రశాంతాత్మయు కృతకృత్యుఁడును అగుచున్నాఁడు. కావున అట్టియథార్థాత్మ సందర్శనార్థము అనాద్యవిద్యయందు నిద్రించుచున్న ఓప్రాణులారా! మీరు మేల్కొనుఁడు—అనఁగా ఆత్మజ్ఞానాభిముఖులుకండు. మేల్కొనుఁడు. అనఁగా సర్వానర్థములకు బీజభూతమును, ఘోరరూపమును అగు అజ్ఞానమనెడి నిద్రనుండి మేల్కొనుఁడు-అజ్ఞాననిద్రను పోఁగొట్టుకొనుఁడు. అజ్ఞాననిద్రను పోఁగొట్టుకొనుటకు మార్గమును చెప్పుచున్నాము:—సాక్షాత్కారానుభవముగల గురువర్యులనాశ్రయించి వారిచేత ఉపదేశింపఁబడిన సర్వాంతరభూతుఁడగు ఆత్మను 'అయమహమస్మి' యని తెలిసికొనుఁడు. ఉపేక్షించి కాలము గడుపుచుండవలదని భగవతియగు శ్రుతి దయగల తల్లివలె యుపదేశించుచున్నది. జ్ఞేయమగువస్తువు—అనఁగా తెలిసికొనవలసిన ఆత్మవస్తువు అతిసూక్ష్మమగు బుద్ధికి మాత్రమే విషయమగునది. యగుటచేత ఎటులసూక్ష్మభూతమో దృష్టాంతపురస్సరముగఁ జెప్పఁబడుచున్నది. పదునుగలకత్తియొక్క అంచుయొక్క పైభాగమునందు పాదము త్రొక్కి నడచుటయనఁగా ఎంతకష్టమో అదేవిధముగా తత్త్వజ్ఞానమునకు సంబంధించినమార్గముకూడ అంతకష్టముగా ఉన్నది అని మేధావంతులు పల్కుచున్నారు. అనఁగా తెలిసికొనవలసిన ఆత్మతత్త్వము అతిసూక్ష్మమగునది అగుటచేత ఆ యాత్మతత్త్వము తెలిసికొనుటకు యోగ్యమయిన జ్ఞానమార్గమును సంపాదించుటయే చాలకష్టమని యభిప్రాయము.

౧-వ అధ్యా. ౩-వ వల్లి, ౧౫-వ మంత్రము.

అవ. అతిసూక్ష్మమగు ఆయాత్మను ఎఱుఁగుట యెట్లను విషయము చెప్పఁబడుచున్నది. శబ్దస్పర్శరూపరసగంధాత్మకమును, సర్వేంద్రియ విషయభూతమును అగు ఈభూమి స్థూలమయినది. అదేవిధముగ ఈశరీరమున్నూ; జలాగ్ని వాయ్వాకాశములందు గంధాదికములగు ఒక్కొకగుణము తగ్గియుం

డుటచేత సూక్ష్మత్వ మహత్త్వ విశుద్ధత్వ నిత్యత్వాదులందు తారతమ్యము గనంబడుచున్నది. గంధాదిశబ్దాంతములగు స్థూలత్వాది వికారములలో ఒక్కటిఅయినను ఎచ్చటలేదో అట్టివస్తువు నిరతిశయ సూక్ష్మ మయినదని శ్రుతియే చెప్పుచున్నది;—

మూ. అశబ్దమస్పర్శ మరూప మవ్యయం
తథాఽరసం నిత్యమగన్ధవచ్చయత్,
అనాద్యనంతం మహతః పరం ధ్రువం
నిచాయ్య తం మృత్యుముఖా త్ప్రముచ్యతే. ౧౫

పద. అశబ్దం అస్పర్శం అరూపం అవ్యయం తథా అరసం నిత్యం అగన్ధవత్ చ యత్, అనాది అనన్తం మహతః పరం ధ్రువం నిచాయ్య తం మృత్యుముఖాత్ ప్రముచ్యతే. ౧౫

టీక. యత్ =ఏయాత్మతత్త్వము, అశబ్దం = శబ్దరహితమును, అస్పర్శం=స్పర్శరహితమును, అరూపం = రూపరహితమును, అవ్యయం=నాశరహితమును, తథా=అదేవిధముగా, అరసం = రసరహితమును, అగంధవచ్చ = గంధరహితమును, నిత్యం=నిత్యమును, అనాది = ఆదిలేనిదియును, అనంతం=అంతములేనిదియును, మహతః=బుద్ధియను పేరుగలమహత్తత్త్వముకంటె, పరం=విలక్షణమయినదియును (గలదో), తం = అట్టియాత్మతత్త్వమును, ధ్రువం=శాశ్వతమయినదానినిగా, నిచాయ్య=ఎఱింగి, మృత్యుముఖాత్ = అవిద్యాకామకర్మలక్షణమగు మృత్యుముఖమునుండి, ప్రముచ్యతే = వదలంబడుచున్నాఁడు.

తా. బ్రహ్మము, అశబ్దము, అస్పర్శము, అరూపము, అవ్యయము, అరసము, అగంధము, నిత్యము అగుచున్నది. లోకమునందు శబ్దాదిమత్త్వమయినపదార్థము వ్యయమగుచున్నది. వ్యేతి=క్షీయత ఇతి వ్యయం న వ్యయం అవ్యయం అని శబ్దార్థము. కావుననే అవ్యయ మనఁగా నిత్య మయినదని

భావము. మఱియు అనాది "అవిద్యమానం ఆదిః కారణం యస్య తదిదం అనాది" యని అనాదిశబ్దార్థమగుటచేత ఎయ్యది ఆదిమత్తో—అనఁగా ఆది గలదో, అది కార్యమగుటచేత అకార్యము దానికి కారణమయినదానియందు లయించిపోవును. పృథివ్యాదికమువలె అని దృష్టాంతము. ఈబ్రహ్మము సర్వమునకు కారణభూతమగుటచేత అకార్యము—అనఁగా ఏదో ఒకకారణము యొక్క కార్యము కాఁజాలదు. అకార్యమగుటచేత నిత్యము, కారణములేనిదగుటచేత కారణభూతమగు దానియందు లయించుటయులేదు. ఆదేవిధముగా అనంతము. 'అవిద్యమానః అంతః కార్యం యస్య తదనంతం' కార్యభూతమయిన మఱొకవస్త్వంతరములేదు కావున అనంతమని చెప్పఁబడుచున్నది. లోకమునందు కదళ్యాదికమునకు ఫలాది కార్యోత్పాదనమును చూచి, అనిత్యత్వమును మనము తలంచుచున్నాము. అట్టి అంతవత్త్వముకూడా బ్రహ్మమునకు లేదు కావున నిత్యము అని చెప్పఁబడుచున్నది. బ్రహ్మము నిత్యవిజ్ఞప్తిస్వరూపమగుటచేత బుద్ధియనుపేరుగల మహత్తత్త్వముకంటె విలక్షణమయినదియు సర్వభూతాత్మక మగుటవలన సర్వసాక్షియు నగుచున్నది. "ఏష సర్వేషు భూతేషు" (కఠ. ౧. ౩. ౧౨) అనుశ్రుతి యీయర్థమునే వివరించుచున్నది గదా. పృథివ్యాదికమువలె ఆపేక్షిక నిత్యముకాక కూటస్థనిత్యమయిన బ్రహ్మమును ఈవిధముగా నెఱింగినయెడల అవిద్యాకామకర్మాదిలక్షణమగు మృత్యుముఖమునుండి వడలఁబడుచున్నాఁడు.

౧-వ అధ్యా. ౩-వ వల్లి, ౧౬-వ మంత్రము.

అవ. శ్రుతి ఆత్మవిజ్ఞానమును స్తుతించుచున్నది:—

మూ. నాచికేతముపాఖ్యానం మృత్యుప్రోక్తగ్ం సనాతనమ్,
ఉక్త్వా శ్రుత్వా చ మేధావీ బ్రహ్మలోకే మహీయతే.

పద. నాచికేతం ఉపాఖ్యానం మృత్యుప్రోక్తం సనాతనం, ఉక్త్వా శ్రుత్వా చ మేధావీ బ్రహ్మలోకే మహీయతే.

టీక. నాచికేతం = నచికేతునివలన పొందఁబడినదియు, మృత్యుప్రోక్తం=వైవస్వతునివలన ఉపదేశింపఁబడినట్టియు, సనాతనం = వైదికముగుట చేత చిరంతనమునుఅగు, ఉపాఖ్యానం=వల్లీత్రయసమన్వితమగు ఈఉపాఖ్యానమును, ఉక్త్వా=బ్రాహ్మణులకు ఉపదేశించి, శ్రుత్వాచ=ఆచార్యునివలన వినియు, బ్రహ్మలోకే = బ్రహ్మమనులోకమునందు, మహీయతే = ఆత్మభూతుఁడయి ఉపాస్యుఁడగుచున్నాఁడు.

తా. నచికేతునివలన పొందఁబడినట్టియు, మృత్యుదేవునిచేత ఉపదేశింపఁబడినట్టియు, వైదికముగుటచేత పురాతనమైనట్టియు, వల్లీత్రయసమన్వితమయినట్టియు ఈయుపాఖ్యానమును యోగ్యులగు బ్రాహ్మణులకు ఉపదేశించినవాఁడున్ను, సదాచార్యునివల్లనుండి ఉపదేశమునుపొందినవాఁడున్ను బ్రహ్మలోకమునందు పూజనీయులయి వెలయుదురు.

వివరణము:—ఈమంత్రమునందు 'బ్రహ్మైవ లోకః' బ్రహ్మలోకః అని సమాసముగాని 'బ్రహ్మణః లోకః=బ్రహ్మలోకః' అనిసమాసము మాత్రము గాదు అని భాష్యమునందు వ్యాఖ్యాతమైనది.

౧-వ అధ్యా. ౩-వ వల్లి, ౧౭-వ మంత్రము.

మూ. య ఇమం పరమం గుహ్యం శ్రావయే ద్బ్రహ్మసంసది,
ప్రయత శ్శ్రాద్ధకాలే వా తదానన్త్యాయ కల్పతే.
తదానన్త్యాయ కల్పతఇతి. ౧౭

పద. యః ఇమం పరమం గుహ్యం శ్రావయేత్ బ్రహ్మసంసది, ప్రయతః శ్రాద్ధకాలే వా తత్ ఆనన్త్యాయ కల్పతే. తత్ ఆనన్త్యాయ కల్పతే ఇతి.

ఇతి కాఠకోపనిషది ప్రథమాధ్యాయే
తృతీయావల్లీ సమాప్తా.

టీక. యః=ఎవ్వఁడు? పరమం=శ్రేష్ఠమయినట్టియు, గుహ్యం=గోపనీయమయినట్టియు, ఇమం=ఈగ్రంథమును, బ్రహ్మసంసది=బ్రాహ్మణసభయందు,

శ్రావయేత్ =వినిపించునో, ప్రయతః=శుచియై, శ్రాద్ధకాలేవా=శ్రాద్ధకాలము నందు (బ్రాహ్మణభోజనసమయమునందు వినిపించునో,) తత్ = అటుల బ్రాహ్మణులకు వినిపించుట, ఆనన్త్యాయ=అనంతమయిన ఫలము నొసంగుటకు, కల్పతే= సమర్థమగును. తత్ = అటుల సభయందును, శ్రాద్ధకాలమునందును బ్రాహ్మణులకు వినిపించుట, ఆనన్త్యాయ=అనంతమయినఫలమునొసంగుటకు, కల్పతే= సమర్థమగును.

తా. ఎవ్వఁడు శ్రేష్ఠమయినట్టియు రహస్యమైనట్టియు నాచికేతోపాఖ్యానమునుఅర్థపురస్సరముగఁగాని గ్రంథముగఁగాని బ్రాహ్మణసభయందో, లేక శ్రాద్ధకాలమునందు బ్రాహ్మణభోజనసమయమునందో శుచియై వినిపించునో అట్లు వినిపించుటవలన ఆశ్రాద్ధము అనంతఫలప్రదమగును. 'తదానంత్యాయ కల్పతే తదానంత్యాయ కల్పతే' అని రెండుపర్యాయములుచెప్పుట అధ్యాయపరిసమాప్తిసూచకము.

కఠోపనిషత్తు. ౧-వ అధ్యాయము. ౩-వ వల్లి సమాప్తము.

ప్రథమాధ్యాయము సమాప్తము.

అనుభూతిప్రకాశము ౧౧-వ అధ్యాయమునందు, ఆత్మపురాణము ౯-వ అధ్యాయమునందును, ఈవల్లియొక్క వివరణముగలదు.

# కఠోపనిషత్తు.

## ద్వితీయాధ్యాయము—ప్రథమవల్లి.

---

(గ్రంథాదిపరిగణము ననుసరించి చతుర్థవల్లి.)

౨-వ అధ్యా. ౧.వ వల్లి, ౧-వ మంత్రము.

అవ. "ఏష సర్వేషు భూతేషు గూఢోఽఽత్మా న ప్రకాశతే, దృశ్యతే త్వగ్ర్యయా బుద్ధ్యా సూక్ష్మయా సూక్ష్మదర్శిభిః." కఠ. ౧-౩-౧౨. అని ప్రథమాధ్యాయ తృతీయవల్లియందు ఆత్మతత్త్వమునుగూర్చి చెప్పఁబడినది. సూక్ష్మబుద్ధితో ఆత్మనుగాంచుటకు శక్యమయినయెడల అట్లేచూడవచ్చునుగదా. అట్లు చూడకపోవుటకు ప్రతిబంధకమేమి? యను ప్రశ్న ముదయించుచున్నది కావున శ్రేయస్సును అడ్డుపెట్టునట్టి కారణమిదియని తెలిసికొనినయెడల అట్టి యడ్డును తొలఁగించుకొనుటకు శక్యమగును. లేనియెడల శ్రేయఃప్రతిబంధ కారణ మట్లే నిలిచియుండును కావున ఆత్మను చూడకుండుటకుఁ గల ప్రతిబంధక కారణమును తెలుపుటకై యీవల్లి ఆరంభింపఁబడినది:—

మూ. పరాఞ్చి ఖాని వ్యతృణత్స్వయంభూ
స్తస్మాత్పరాఙ్ పశ్యతి నాన్తరాత్మన్,
కశ్చిద్ధీరః ప్రత్యగాత్మాన మైక్ష
దావృత్తచక్షు రమృతత్వ మిచ్ఛన్. ౧

పద. పరాఞ్చి ఖాని వ్యతృణత్ స్వయంభూః తస్మాత్ పరాఙ్ పశ్యతి న అన్తరాత్మన్, కః చిత్ ధీరః ప్రత్యగాత్మానం ఐక్షత్ ఆవృత్త చక్షుః అమృతత్వం ఇచ్ఛన్. ౧

టీక. స్వయంభూః=పరమేశ్వరుఁడు, ఖాని=ఇంద్రియములను, పరాంచి =పరాగ్విషయాభిముఖ స్వభావముగలవానినిగా, వ్యతృణత్ = హింసించెను. తస్మాత్ =అందువలన (ఆయింద్రియములు), పరాఙ్ పశ్యతి = శబ్దాదివిషయజాతమునే గాంచుచున్నవి. అంతరాత్మన్=అంతరాత్మను, న=చూచుటలేదు. కశ్చిత్ ధీరః=ఒకానొకవివేకి, అమృతత్వం=మోక్షమును, ఇచ్ఛన్ =కోరుచున్నవాఁడయి, ఆవృత్తచక్షుః=(విషయములనుండి) మఱలింపఁబడిన ఇంద్రియసమూహముగలవాఁడై, ప్రత్యగాత్మానం = పరమాత్మను, ఐక్షత్ = చూచెను.

తా. శ్రోత్రాదీంద్రియసమూహము శబ్దాదివిషయములను ప్రకాశింపఁజేయుటకే ప్రవర్తించుచున్నది. ఈశ్రోత్రాదీంద్రియములను పరమేశ్వరుఁడిట్టిస్వభావముగలవానినిగా నిర్మించెను కావున వానిని హింసించినట్లే యగుచున్నది. కాని వేఱుకాదుగదా. ఇట్టినిర్ణయమునొనర్చినవాఁడు స్వయంభువు. అనఁగా సర్వదా తానే స్వతంత్రుఁడుగానుండి ఒకప్పుడైనను పరతంత్రుఁడుగాని పరమాత్మయే. కావుననే ఆయింద్రియములు అనాత్మభూతములగు శబ్దాదివిషయములనే పొందుచున్నవిగాని అంతరాత్మను గాంచుటలేదు. లోకమునం దిట్టిప్రవర్తనము సహజమయినను ఉపాయశాలియగువాఁడు ధీరుఁడయినవాఁడునదీప్రవాహమున కెదురీదినటుల వివేకియగువాఁడు గొప్పప్రయత్నముచేత ఇంద్రియములయొక్క స్వాభావికప్రవృత్తిని నిరోధించినవాఁడై అనఁగా ఆయింద్రియప్రవృత్తిని ఆత్మాభిముఖముగా నొనర్చినవాఁడయి ప్రత్యగాత్మను గాంచుచున్నాడు. ప్రత్యగాత్మశబ్దము నిచట పరమాత్మవాచకముగా గ్రహించవలయును. ఆత్మశబ్దముయొక్క వ్యుత్పత్తికూడ నీవిషయమునే దృఢపఱుచును:—

శ్లో. యచ్చాప్నోతి యదాదత్తే యచ్చాత్తి విషయా నిహ,
యచ్చాస్య సంతతో భావః తస్మాదాత్మేతి కీర్త్యతే.

'ఐక్షత్' అను లకారము భూతకాలికమయినను వైదికప్రయోగమగుటచేత నిట వర్తమానార్థముగా గ్రహింపఁబడినది.

బాహ్యావిషయములందు ప్రవర్తించుచుండుట ప్రత్యగాత్మనుగాంచుట యనువిషయముల నొక్కఁడాచరింపఁజాలఁడు కావున బాహ్యానుగు జ్ఞాన కర్మేంద్రియవిషయజాతమునుండి విముఖుఁడయి అంతర్ముఖుఁడయి మహాయాస పూర్వకమగు ప్రయత్నముతో నదీప్రవాహమున కెదురీదినటుల ప్రవర్తించు నట్టివానికే అమృతత్వప్రాప్తి-మోక్షప్రాప్తికాని తదితరులకు లేదనిభావము.

౪-వ అధ్యా, ౧-వ వల్లి, ౨-వ మంత్రము.

మూ. పరాచః కామా ననుయన్తి బాలా
స్తే మృత్యో ర్యన్తి వితతస్య పాశమ్,
అథ ధీరా అమృతత్వం విదిత్వా
ధ్రువమధ్రువేష్విహ న ప్రార్థయన్తే. ౨

పద. పరాచః కామాన్ అనుయన్తి బాలాః తే మృత్యోః యన్తి వితతస్య పాశం, అథ ధీరాః అమృతత్వం విదిత్వా ధ్రువం అధ్రువేషు ఇహ న ప్రార్థయన్తే.

టీక. బాలాః=అల్పప్రజ్ఞులు, పరాచః=బహిర్గతములగు, కామాన్ = కోరఁదగినవిషయములను, అనుయంతి = అనుసరించుచున్నారు. తే = (అవిధ ముగా బహిర్గతకామవిషయాభిలాషగల) వారు, వితతస్య=అంతటవ్యాపించి యున్న, మృత్యోః=మృత్యువుయొక్క, పాశం=(సంసారలక్షణమగు) పాశ మును, యంతి = పొందుచున్నారు. అథ=అందువలన, ధీరాః=వివేకవంతులు, అమృతత్వం = ప్రత్యగాత్మావస్థాన లక్షణమగు ముక్తిని, ధ్రువం = శాశ్వత మయినదానినిగ, విదిత్వా=ఎఱింగి, ఇహ = ఈసంసారమునందుగల, అధ్రు వేషు=అనిత్యపదార్థములందు (కించిత్ అపి=కొంచెమైనను) న ప్రార్థయంతే= ప్రార్థింపరు.

తా. ఆత్మదర్శనమునకు అనభిముఖముగానుండుటయే లోకస్వభావ ముగానున్నది. అటుల ఆత్మదర్శనమునకు ప్రతిబంధకారణము అవిద్య. అవిద్యా

సంబంధములయిన దృష్టాదృష్టభోగములందు ఆసక్తికలుగుట. తృష్ణ, అల్ప ప్రజ్ఞగలవారలు ఇట్టి యవిద్యాతృష్ణలవలన ప్రతిబద్ధమయిన ఆత్మదర్శనము గలవారలయి బహిర్గతములయిన కామ్యవిషయములనే కోరుచుందురు. అట్టి ప్రజ్ఞావిహీనులు అవిద్యాకామ కర్మసముదాయరూపమగు మృత్యువుయొక్క సర్వవ్యాప్తమయిన పాశమునకు గురియగుచున్నారు. ఇచట పాశమనఁగా దేహేంద్రియాది సంయోగవియోగలక్షణమని ఎఱుంగవలయును. జనన మరణములని భావము. నిరంతరము జన్మజరామరణ రోగాద్యనేకానర్థ పరంపరలకు లోనగుచుందురు. అవిద్యాతృష్ణాసంబంధ మిట్టిదుఃఖములకు కారణ మనియెఱింగిన వివేకవంతులు ప్రత్యగాత్మావస్థానలక్షణమగుముక్తియే శాశ్వత మనియెఱింగినవారలయి ఇంద్రత్వాదిపదవులుకూడ అధ్రువములనియు ప్రత్యగాత్మావస్థాన లక్షణరూపమగుముక్తి "నకర్మణా వర్ధతే నో కనీయాన్" (అర్థ. కర్మలచేత పెఱుగుటగాని తగ్గుటగానిలేదు) అనిశ్రుతి కావున ఇదియే ధ్రువ మనియు, కూటస్థమనియు, అచంచలమనియు తెలిసికొన్నవారలయి ఈసంసారమునందుగల సర్వపదార్థములను అనిత్యములని ఎఱింగినవారలయి సంసారమునందున్న ఏపదార్థమునుగాని ప్రత్యగాత్మదర్శనమునకు ప్రతికూలమనుతలంపుతో కోరుటలేదు. అనఁగా దారేషణ, ధనేషణ, పుత్త్రేషణలను ఈషణాత్రయమును విసర్జించి బ్రహ్మవిద్యాభిలాషు లగుచున్నారు.

౨-వ అధ్యా. ౧-వ వల్లి, 3-వ మంత్రము.

అవ. బ్రహ్మవేత్తలగువారలు దేనిని ఎఱుంగుటవలన మఱొక్కదానిని దేనిని కోరరో అట్టిదానిని పొందుట యెట్లు? అనువిషయము చెప్పఁబడు చున్నది:—

మూ. యేన రూపం రసం గన్ధం
శబ్దాన్ స్పర్శాగ్ శ్చ మైథునాన్,
ఏతేనైవ విజానాతి
కిమత్ర పరిశిష్యతే; ఏత ద్వై తత్. 3

పద. యేన రూపం రసం గంధం శబ్దాన్ స్పర్శాన్ చ మైథునాన్, ఏతేన ఏవ విజానాతి కిం అత్ర పరిశిష్యతే, ఏతత్ వై తత్. 3

టీక. యేన=విజ్ఞానమేస్వభావముగాఁగల ఏ, ఏతేన ఏవ = దేహాదివ్యతిరిక్తమయిన యీఆత్మ యనుసాధనముచేతనే, (సర్వః లోకః=ప్రాణిసముదాయమంతయుం) రూపం=రూపమును, రసం=రసమును, గంధం=గంధమును, శబ్దాన్ =శబ్దములను, స్పర్శాన్ = స్పర్శములను, మైథునాన్ = సంభోగవిషయకసౌఖ్యములను, విజానాతి=చక్కఁగా తెలుసుకొనుచున్నది. అత్ర=ఈప్రపంచమునందు, కింపరిశిష్య తే=ఏమిమిగిలియుండును? విజ్ఞానస్వభావముగల ఆత్మచేత తెలిసికొనుటకు శక్యముకానిది ఏదియు మిగిలియుండలేదనిభావము.) తత్ =అది (అనఁగా ధర్మాధర్మాదికముకంటె భిన్నమయినట్టి ఆత్మతత్త్వమును నాకుపదేశింపుము అని నచికేతుఁ డడిగినదియుం, దేవతలందఱు దేనిస్వరూపమిట్టిదని తెలిసికొనఁజాలక సంశయించుచుండిరో అది), ఏతత్ వై = ఇదియే (అని ఎఱుంగవలయును.)

తా. విజ్ఞానమే స్వభావముగాఁ గలిగినట్టియుం, దేహేంద్రియాదులకు విలక్షణమయినట్టియు ఏయాత్మయను సాధనముచేత ప్రపంచమునందుఁగల ప్రాణిసమూహమంతయు, శబ్ద, స్పర్శ, రూప, రస, గంధ సంభోగాదివిషయజాతమును చక్కఁగా తెలిసికొనుచున్నదో అదియే ఆత్మ. ధర్మాధర్మాదికముకంటె భిన్నమయినది ఎయ్యది? అని నచికేతుఁడు ప్రశ్నించినదియుం, దేవతలు సైతము తెలిసికొనవలయునని విచారించుచున్నదియు, పరమపదమని లోకమునందు వ్యవహరింపఁబడుచున్నదియుం అది ఇదియే యని యెఱుంగవలయును.

పూర్వ:—దేహాదివిలక్షణమయినఆత్మచేత శబ్ద స్పర్శ రూప రస గంధానందములను విషయములను అనుభవించుచున్నామని లోకమునం

దెవ్వరు తలంచుటలేదు. అనఁగా దేహాదిలక్షణమయిన ఆత్మచేతనే శబ్దాదివిష యములను తెలిసికొనుచున్నామని తలంచుట లోకప్రసిద్ధి.

సమాధానము:—అట్లనరాదు. దేహాదిసంఘాతమెట్లో అట్లే శబ్దాది విషయములున్నూ దృశ్యము లగుటచేత విజ్ఞేయములేగాని విజ్ఞాతృత్వమని చెప్పుట యుక్తముకాదు. దేహాదిసంఘాతము రూపాద్యాత్మకమయి రూపా దుల నెఱుంగునెడల బాహ్యములయిన రూపాదులుకూడ అన్యోన్యము తమ స్వస్వరూపము నెఱుంగవలయును. కాని ఇట్లెఱుంగుటలేదు. కనుక దేహాది లక్షణములగు రూపాదికములను దేహాది వ్యతిరిక్తమయినట్టియు, విజ్ఞానస్వభావ మయినట్టియు ఆత్మచేతనే జనులందఱు తెలిసికొనుచున్నారు. ఈప్రపంచ మునందు దేహాదిసంఘాతమునకు విలక్షణుఁడగు విజ్ఞానస్వభావుఁడగు ఆత్మకు తెలిసికొనుట శక్యముకానిది ఎయ్యదియు మిగిలియుండఁజాలదు. ప్రపంచ మునం దున్నదంతయు ఆత్మకు విజ్ఞేయము-అనఁగా; తెలిసికొనుటకు వీలయినదే గాని శక్యముకానిది ఏదియులేదు. ఏయాత్మకు అవిజ్ఞేయమయినది లోకము నందేదియులేదో అట్టియాత్మయే సర్వజ్ఞుఁడుగదా. ఇదియే అది.

'అన్యత్ర ధర్మా దన్యత్రాధర్మాత్'(కఠ. ౧-౨. ౧౪) అని నచికేతుఁడు ప్రశ్నించినట్టియు;

'దేవైరత్రాపి విచికిత్సితం' కిల (కఠ. ౧. ౧. ౨౧.) అనిదేవతలకుకూడ తెలిసికొనఁదగినది అయినట్టియు;

'సోఽధ్వనః పారమాప్నోతి తద్విష్ణోః పరమంపదం' (కఠ.౧.౩. ౯) అని వ్యాపనశీలుఁడగుటచేత విష్ణువని వ్యవహరింపఁబడుచున్న ఆత్మకు పరమపద మనియు;

'యస్మాత్ పరం నాపర మస్తి కించిత్'అని వేదాంతశాస్త్రములం దుప దిష్టమయినదియును అగుఆత్మతత్త్వము ఇదియే.

౨-వ అధ్యా. ౧-వ వల్లి, ౪-వ మంత్రము.

అవ. ఆత్మతత్త్వము అతిసూక్ష్మమగుటచేత దుర్విజ్ఞేయము కావున చెప్పినవిషయమే ప్రకారాంతరముగా మఱల నిరూపింపఁబడుచున్నది:—

మూ. స్వప్నాన్తం జాగరితాన్తం చోభౌ యేనానుపశ్యతి,
మహాన్తం విభు మాత్మానం మత్వా ధీరో న శోచతి. ౪

పద. స్వప్నాన్తం జాగరితాన్తం చ ఉభౌ యేన అనుపశ్యతి, మహాన్తం విభుం ఆత్మానం మత్వా ధీరః న శోచతి. ౪

టీక. స్వప్నాంతం=స్వప్నమధ్యమును - అనఁగా స్వప్నవిజ్ఞేయమును, జాగరితాంతంచ=జాగరితమధ్యమును-అనఁగా జాగరితవిజ్ఞేయమును, ఉభౌ=ఈరెంటిని, యేన=ఏఈ (విజ్ఞానస్వభావమయినట్టి దేహాదివిలక్షణమయినట్టి) ఆత్మచేత (లోకః=ప్రాణిసమూహము), అనుపశ్యతి=చూచుచున్నదో (తం=అట్టియాత్మను), మహాంతం=గొప్పవానిగను, విభుం=సర్వవ్యాపునిగను, ధీరః=జ్ఞానియగువాఁడు, మత్వా = తలంచి (అనఁగా ఆత్మభావముచేత నేనే అట్టియాత్మయనియెఱింగి), న శోచతి=దుఃఖింపఁడు.

తా. (వెనుకటిమంత్రమునందు ఆత్మతత్త్వ మిట్టిదని చెప్పినప్పటికిన్ని విషయము దుర్విజ్ఞేయమగుటచేత ౪-వ మంత్రము దనుక ప్రకారాంతరములతో ఆయాత్మతత్త్వమే మఱల నిరూపింపఁబడుచున్నది;—) ప్రపంచమునందుఁగల ప్రాణిజాతము స్వప్నాంతమును-అనఁగా స్వప్నమునందు తెలిసికొనఁదగిన విషయమును, జాగరితాంతమును—అనఁగా జాగరితమునందు తెలిసికొనఁదగిన విషయమును—అనఁగా రెండైన స్వప్నజాగరితాంతములను-స్వప్నజాగరిత విజ్ఞేయములను దేహేంద్రియాది విలక్షణమయినట్టియు విజ్ఞానస్వభావమయినట్టియు ఏఆత్మ చేత తెలిసికొనుచున్నదో, 'అట్టియాత్మతత్త్వమును గొప్పదానిగను, సర్వవ్యాపిగను' తెలిసికొన్నజ్ఞాని అట్టియాత్మయే సాక్షాత్తుగ నేనగుచున్నాను, నేనేపరమాత్మను అనితలంచువాఁడు (సాక్షాత్కారరూపమగు ధైర్యముగలవాఁడు కావున) శోకింపఁడు.

౨-వ అధ్యా. ౧-వ వల్లి. ౫-వ మంత్రము.

మూ. య ఇమం మధ్వదం వేద
ఆత్మానం జీవమన్తికాత్,
ఈశానం భూతభవ్యస్య
న తతో విజుగుప్సతే; ఏతద్వైతత్. ౫

పద. యః ఇమం మధ్వదం వేద ఆత్మానం జీవం అన్తికాత్, ఈశానం భూతభవ్యస్య న తతః విజుగుప్సతే, ఏతత్ వై తత్.

టీక. యః = ఎవ్వడు? మధ్వదం = కర్మఫలమును అనుభవించుచున్న ఇమం=ఈ, జీవం=జీవస్వరూపుఁడగు, ఆత్మానం=ఆత్మను, అంతికాత్ = సమీపమునందు, భూతభవ్యస్య=కాలత్రయమునకు, ఈశానం=నియామకునిగా, వేద=తెలిసికొనుచున్నాఁడో, తతః=అందువలన, నవిజుగుప్సతే = సంరక్షించుకొనుటకుకోరఁడు, ఏతత్ = ఇదియే, తత్=అది. (అనఁగా నీవడిగిన యాత్మయే ఇది.)

తా. కర్మఫలభోక్త యగునట్టియుం ప్రాణాదిసమూహమునకు ధారకుఁడయినట్టియుం జీవుని నిత్యసన్నిహితునిగను, కాలత్రయ నియామకునిగను ఎవ్వఁడెఱుంగునో అట్టివాఁడు, తద్విజ్ఞానానంతరము ఇతరులనుండి తనకు భయముకలుగఁగలదను తలంపుతో ఇతరులనుండి తన్ను సంరక్షించుకొనుటకయి ప్రయత్నింపఁడు. ఎంతవఱకు తాను భయపడవలసిన అవసరము గలదనియుం, తాను అనిత్యుఁడననియుం తలంచుకొనుచుండునో అంతవఱకు ఇతరులనుండి తన్ను కాపాడుకొనుచుండుట లోకస్వభావమయి యున్నది. ఎప్పుడయితే ఆత్మను అద్వయునిగను, నిత్యునిగను తెలిసికొనుచున్నాఁడో అప్పుడు రెండవవాఁడు లేనేలేదను దృఢవిశ్వాసము కలుగుటచేత భయంపడవలసిన యవసరమే లేదుగదా.

౨-వ అధ్యా, ౧-వ వల్లి, ౬-వ మంత్రము.

అవ. ఏప్రత్యగాత్మ ఈశ్వరభావముచేత నిర్దేశింపఁబడెనో అతఁడే సర్వాత్మయనువిషయ మీమంత్రమునందు తెలుపఁబడుచున్నది:—

మూ. యః పూర్వం తపసో జాత
మద్భ్యః పూర్వ మజాయత,
గుహాం ప్రవిశ్య తిష్ఠంతం
యో భూతేభి ర్వ్యపశ్యత. ఏత ద్వై తత్. ౬

పద. యః పూర్వం తపసః జాతం అద్భ్యః పూర్వం అజాయత, గుహాం ప్రవిశ్య తిష్ఠంతం యః భూతేభిః వ్యపశ్యత. ఏతత్ వై తత్. ౬

టీక. యః=ఏముముక్షువు, పూర్వం=ముందుగా, తపసః = జ్ఞానాది లక్షణమగు బ్రహ్మమువల్లనుండి, అద్భ్యః = జలములతోఁ గూడిన పంచభూతములకంటె, పూర్వం=ముందుగా, అజాయత = ఉద్భవించెనో (అటుల ఉత్పన్నుఁడయి దేవాదిశరీరములను నిర్మించి ఆప్రాణులయొక్క), గుహాం=హృదయాకాశమును, ప్రవిశ్య=ప్రవేశించి, తిష్ఠంతం = ఉన్నట్టియు, భూతేభిః = కార్యకారణలక్షణములగు భూతములతోఁటి, తిష్ఠంతం=ఉన్నట్టిబ్రహ్మమును, యః=ఎవ్వఁడు? వ్యపశ్యత=చూచెనో (ఎవ్వఁ డిటుల చూచుచున్నాఁడో అట్టివాఁడు చూచునట్టి), తత్ = ఆబ్రహ్మము, ఏతత్ వై=ఇదియే గదా.

తా. జ్ఞానాదిలక్షణమగు బ్రహ్మమునుండి పంచభూతసృష్టికంటె ముందుగా హిరణ్యగర్భుఁ డనుపేర ఎవ్వఁడు జన్మించెనో, ప్రథముఁడగు ఏహిరణ్యగర్భుఁడు దేవాదిశరీరముల నిర్మించి వానియొక్క హృదయగుహ నాశ్రయించియున్నాఁడో, ఎవ్వఁడు కార్యకారణలక్షణభూతములగు పంచభూతములతోడ కలసియున్నటుల చూడఁబడుచున్నాఁడో - అతఁడే యాత్మ, అనఁగా అతఁడు చూచుచున్నట్టి యాత్మయే నీవు తెలిసికొనవలయునని ప్రశ్నించిన యాత్మ.

వివరణము—లోకమునందు బంగారుతో చేయఁబడిన కుండలాద్యలంకారములు బంగారమే అగుచున్నటుల బ్రహ్మమువల్లనుండి పుట్టిన హిరణ్యాగర్భుఁడుకూడ బ్రహ్మాత్మకుఁడే యని తలంచవలయును.

౨-వ అధ్యా, ౧-వ వల్లి, ౭-వ మంత్రము.

మూ. యా ప్రాణేన సంభవ
త్యదితి ర్దేవతామయీ,
గుహాం ప్రవిశ్య తిష్ఠన్తీ
యా భూతేభి ర్వ్యజాయత. ఏత ద్వై తత్. ౭

పద. యా ప్రాణేన సంభవతి అదితిః దేవతామయీ, గుహాం ప్రవిశ్య తిష్ఠన్తీ యా భూతేభిః వ్యజాయత. ఏతత్ వై తత్.

టీక. అదితిః = శబ్దాదిసర్వకర్మలను అనుభవించుటచేత అదితియని చెప్పఁబడుచున్నట్టియు, దేవతామయీ = సర్వదేవతాస్వరూపిణియు నగు, యా=ఎయ్యది? ప్రాణేన=హిరణ్యాగర్భునితోడ, సంభవతి=పరబ్రహ్మమువల్లనుండి పుట్టుచున్నదో, (ఏశక్తి) భూతేభిః=భూతములతోడ, వ్యజాయత=పుట్టెనో, యా=ఎయ్యది? గుహాం = ప్రాణులయొక్కహృదయాకాశమును, ప్రవిశ్య = ప్రవేశించి, తిష్ఠంతీ=ఉంటున్నదో, ఏతత్ = ఇది, తద్వై = అదియేగదా.

తా. సర్వదేవతాస్వరూపిణియగు నెయ్యది హిరణ్యగర్భరూపముతో పరబ్రహ్మమునుండి పుట్టుచున్నదో, సర్వకర్మఫలమును భక్షించుచుండుటచేత ఎయ్యది అదితి యని పిలువఁబడుచున్నదో, ఎయ్యది భూతములతో కలిసినదై పుట్టెనో, ఎయ్యది ప్రాణులయొక్కబుద్ధిగుహాయందు ప్రవేశించియుంటున్నదో అదియే-అశక్తియే యీయాత్మతత్త్వము.

౨-వ అధ్యా, ౧-వ వల్లి, ౮-వ మంత్రము.

మూ. అరణ్యో ర్నిహితో జాతవేదా
గర్భ ఇవ సుభృతో గర్భిణీభిః,

దివేదివ ఈడ్యో జాగృవద్భి
ర్హవిష్మద్భి ర్మనుష్యేభి రగ్నిః. ఏత ద్వై తత్. ८

పద. అరణ్యోః నిహితః జాతవేదాః గర్భః ఇవ సుభృతః గర్భిణీభిః, దివేదివే ఈడ్యః జాగృవద్భిః హవిష్మద్భిః మనుష్యేభిః అగ్నిః. ఏతత్ వై తత్. ८

టీక. గర్భిణీభిః=గర్భిణీస్త్రీలచేత, సుభృతః=బాగుగా కాపాడఁబడుచున్న, గర్భః ఇవ=గర్భమువలె, యః=ఏ, జాతవేదాః=అగ్ని, అరణ్యోః=అరణులందు, నిహితః=ఉంటున్నదో, అగ్నిః=ఏయగ్ని, దివేదివే=ప్రతిదినము, జాగృవద్భిః=జాగరణశీలురైనట్టియు, హవిష్మద్భిః=హవిస్సుకలిగినట్టియుం, మనుష్యేభిః=మనుష్యులచేత, ఈడ్యః = కొనియాడఁదగియున్నాఁడో, ఏతత్ = ఈ అగ్నియే, తద్వై=ఆబ్రహ్మముగదా.

తా. గర్భిణీస్త్రీలు తమగర్భమునందుండు శిశువున కెట్టిఅపాయము రాకుండుటకయి శుచిహితమితాహారముల నొనర్చుచు నెటులకాపాడెదరో ఆచేవిధముగా అధియజ్ఞుఁడగు ఈఅగ్నియుం, ఉత్తరారణి, అధరారణులందు కాపాడఁబడుచున్నాఁడు. ఈయగ్నియే సర్వహవిస్సులకు భోక్త. అధియజ్ఞుఁడగు అగ్నిని ఋత్విక్కు లిటుల కాపాడుచుందురు. అధ్యాత్ముఁడగు జాతరాగ్నిని యోగులు అనిందితాన్నపానాదికముచేత కాపాడుచుందురు. ఇట్టి అధియజ్ఞాగ్నిని ప్రతినిత్యము కర్మఠులగు యజమానులు ఋత్విక్కులు కొనియాడుచు, ఆజ్యాదిహవిస్సుల నొసంగుచు కాపాడుచుందురు. అధ్యాత్మాగ్నిని యోగులయినవారలు అప్రమత్తులయి పూజించుచుందురు. ఇట్టిఅగ్నియే బ్రహ్మము.

వివరణము——విరాడ్రూపమున అగ్నిగానుండెడి అపరబ్రహ్మమున్నూ తత్కారణభూతమగు పరబ్రహ్మమున్నూ ఒక్కటియేయని భావము.

౨-వ అధ్యా, ౧-వ వల్లి, ౯-వ మంత్రము

మూ. యత శ్చోదేతి సూర్యో
అ స్తం యత్ర చ గచ్ఛతి,
తం దేవా స్సర్వేఽర్పితా
స్తదు నాత్యేతి కశ్చన. ఏత ద్వై తత్. ౯

పద. యతః చ ఉదేతి సూర్యః అస్తం యత్ర చ గచ్ఛతి, తం దేవాః సర్వే అర్పితాః తత్ ఉ న అత్యేతి కః చ న, ఏతత్ వై తత్.

టీక. సూర్యః = సూర్యుఁడు, యతః చ=ప్రాణాత్మకుఁడగు ఏహిరణ్యగర్భునివల్లనుండి, ఉదేతి=ఉదయించుచున్నాఁడో, (సూర్యః = సూర్యుఁడు) అస్తం=లయమును, యత్రచ = ఏహిరణ్యగర్భునియందు, గచ్ఛతి = పొందుచున్నాఁడో, సర్వేదేవాః = దేవతలందఱు, తం = అట్టి హిరణ్యగర్భునిగూర్చి, అర్పితాః (ఇవ) =అర్పించబడినవారివలె ఉంటున్నారో, కఃచన = ఒక్కఁడున్నూ, తత్ ఉ = ఆహిరణ్యగర్భుని, నఅత్యేతి = అతిక్రమించియుండఁజాలఁడో, ఏతత్ =అట్టి ఇదియే, తత్ వై=ఆబ్రహ్మతత్త్వముగదా.

తా. ప్రాణుఁడనుపేరుగల ఏహిరణ్యగర్భునివల్లనుండి సూర్యుఁ డుదయించుచున్నాఁడో, అట్లే ఏహిరణ్యగర్భునియందు ప్రతినిత్యము అస్తమించుచున్నాఁడో, ప్రాణనామకుఁడగు ఏహిరణ్యగర్భునియందు రథచక్రమునందు అరములువలె సకలదేవతలు ప్రతిష్ఠితులయి యున్నారో, అతఁడే బ్రహ్మము, అతఁడే సర్వాత్మకుఁడగు బ్రహ్మము. ఇంతకంటె భిన్నమయినది మఱొకటి యుండఁజాలదు. ఇదియే నీవడిగిన బ్రహ్మతత్త్వము. అధిదైవుఁడగు హిరణ్యగర్భునియందు అగ్న్యాదిసర్వదేవతలు రథనాభియందు అరములు-బండిఆకులు అర్పితములయియున్నటుల అధ్యాత్ముఁడగు హిరణ్యగర్భునియందు వాగాదీంద్రియసమూహము అర్పితమయి యున్నదని గ్రహించవలయును.

౨-వ అధ్యా, ౧-వ వల్లి, ౧౦-వ మంత్రము.

అవ. బ్రహ్మాదిస్థావరాంతమగు ప్రాణిజాతమునందు ఉన్నట్టియు, అవిద్యాయుపాధిసంబంధము చేత బ్రహ్మముకంటె భిన్నముగ భాసించుచున్నట్టియు సంసారి పరబ్రహ్మముకంటె భిన్నమయినదని ఎవ్వరయినఁ దలఁచెదరేమో యని యీ క్రిందివిషయము చెప్పఁబడుచున్నది:—

మూ. యదేవేహ తదముత్ర యదముత్ర తదన్విహ,
మృత్యోస్స మృత్యుమాప్నోతి య ఇహ నానేవ పశ్యతి.

పద. యత్ ఏవ ఇహ తత్ అముత్ర యత్ అముత్ర తత్ అను ఇహ, మృత్యోః సః మృత్యుం ఆప్నోతి యః ఇహ నానా ఇవ పశ్యతి. ౧౦

టీక. ఇహ=ఇచ్చట, యత్ ఏవ=ఎయ్యదిగలదో, తత్ = అయ్యదియే, అముత్ర=అచ్చటనుగలదు. యత్=ఎయ్యది? అముత్ర=అచ్చటగలదో, ఇహ=ఇచ్చట, తత్ అను=అదియుఁగలదు. యః=ఎవ్వఁడు? ఇహ = ఇచ్చట, నానా ఇవ=అనేకముపలె, పశ్యతి = చూచుచున్నాఁడో, సః = వాఁడు, మృత్యోః=మృత్యువువల్లనుండి, మృత్యుం=మరణమును (అనగా మాటిమాటికి పుట్టుటచచ్చుచుండుట యనుసంసారమును), పశ్యతి= చూచుచున్నాఁడు.

తా. కార్యకారణోపాధిసమన్వితమయి అవివేకులకు సంసారధర్మములం గలదానివలె ఎయ్యదిగనంబడుచున్నదో ఏతత్త్వమిచటయీజీవునియందుగలదో ఆతత్త్వమే నిత్యవిజ్ఞానఘనస్వభావుఁడును, సర్వసంసారధర్మవివర్జితుఁడును అగు ఆత్మయందు గలదు. ఏతత్త్వము ఈయాత్మతత్త్వమునందుగలదో ఆతత్త్వమే నామరూపకార్యకారణోపాధికుఁడగు జీవునియందున్నూ వెలయుచున్నదేగాని వేఱుగానేమియులేదు. వస్తుస్థితియిట్లుండఁగా ఉపాధిస్వభావభేదలక్షణమగు అవిద్యచేత మోహితుఁడయినవాఁడయి అద్వితీయమయిన బ్రహ్మమునందు "నేను పరబ్రహ్మముకంటె వేఱయినవాఁడను, బ్రహ్మము నాకంటెవేఱయినది" అని భిన్నముగా నెవ్వఁడు చూచుచుండునో అట్టివాఁడు మృత్యువువల్లనుండి

మృత్యువును-అనఁగా మాటిమాటికి పుట్టుట చచ్చుటయనుసంసారమును పొందు చున్నాఁడు కావున అట్టిభేదదృష్టితో చూడవలదు. విజ్ఞానైకరసమును, నిరంతరముఁగ ఆకాశమువలె సర్వత్రపరిపూర్ణమును అగుబ్రహ్మమే నేననుదృష్టితో డనే చూడవలయుననని మంత్రార్థము.

౨-వ అధ్యా, ౧-వ వల్లి, ౧౧-వ మంత్రము.

మూ. మనసైవేదమాప్తవ్యం నేహ నానాఽస్తి కించన,
మృత్యోస్స మృత్యుం గచ్ఛతి య ఇహ నానేవ పశ్యతి.

పద. మనసా ఏవ ఇదం ఆప్తవ్యం న ఇహ నానా అస్తి కించన, మృత్యోః సః మృత్యుం గచ్ఛతి యః ఇహ నానా ఇవ పశ్యతి. ౧౧

టీక. ఇదం=ఈబ్రహ్మము, మనసాఏవ = మనస్సుచేతనే, ఆప్తవ్యం = పొందఁదగినది, ఇహ=ఈబ్రహ్మమునందు, నానా = భేదము. (అనేకత్వము) కించన=కొంచెమైనను, న అస్తి=లేదు. యః=ఎవ్వఁడు? ఇహ = ఈబ్రహ్మమునందు, నానాఇవ=అనేకముఉన్నదానివలె, పశ్యతి = చూచుచున్నాఁడో, సః =వాఁడు, మృత్యోః = మృత్యువువల్లనుండి, మృత్యుం = (పునఃపునర్జన్మమరణరూపసంసారలక్షణమగు) మరణమును, గచ్ఛతి=పొందుచున్నాఁడు.

తా. బ్రహ్మైకత్వవిజ్ఞానముకంటె పూర్వమునందు సదాచార్యోపదేశశాస్త్రసంస్కృతమయిన మనస్సుచేతనే ఏకరసమయినబ్రహ్మమేయుంగఁదగినది. అనఁగా బ్రహ్మమొక్కటే వాస్తవమయినది, తద్భిన్నముఁగ నేమియుం లేదు. అట్టి బ్రహ్మైకత్వవినిశ్చయబుద్ధిప్రాప్తమయినదగుచుండఁగా నానాత్వబుద్ధిని స్ఫురింపఁజేయునట్టి అవిద్య నివర్తించిపోవుచున్నది కావున బ్రహ్మమునందణుమాత్రమైనను నానాత్వముండఁజాలదు. వస్తుస్థితి యిట్లుండఁగా అవిద్యాతిమిరదృష్టితో బ్రహ్మమునందు నానాత్వదృష్టి నెవ్వఁడు చూచుచుండునో అట్టివాఁడు అణుమాత్రపుభేదదృష్టిని గాంచినను పునఃపునఃజన్మమరణరూపమగు సంసారమునకు గురి యగుచుండును.

వివరణము:—బ్రహ్మము ఏకరసమగుటయే వాస్తవమగునెడల జ్ఞాతృజ్ఞేయభావము అనుపపన్నముగదా యనుసంశయమునకు అయ్యది—అనఁగా జ్ఞాతృజ్ఞేయభావము అజ్ఞునకు విషయము సుగమముగ బోధించుటకుఁగాను కల్పితమని సమాధానము. వస్తుస్థితియందు జ్ఞాతృజ్ఞేయవిభాగముఅనుపపన్నమే.

౨-వ అధ్యా, ౧-వ వల్లి, ౧౨-వ మంత్రము.

అవ. మఱల ప్రకృతమగుబ్రహ్మమే భంగ్యంతరముగ నిర్దేశింపఁబడుచున్నది:—

మూ. అఙ్గుష్ఠమాత్రః పురుషో మధ్య ఆత్మని తిష్ఠతి,
ఈశానం భూతభవ్యస్య నతతో విజుగుప్సతే. ఏతద్వై తత్.

పద. అఙ్గుష్ఠమాత్రః పురుషః మధ్యే ఆత్మని తిష్ఠతి, ఈశానం భూతభవ్యస్య న తతః విజుగుప్సతే. ఏతత్ వై తత్. ౧౨

టీక. అంగుష్ఠమాత్రః=అంగుష్ఠపరిమాణముగల, పురుషః = పురుషుఁడు, మధ్యేఆత్మని=శరీరమధ్యభాగమునందు, తిష్ఠతి = ఉంటున్నాఁడు. (తం=అట్టియాత్మను) భూతభవ్యస్య = కాలత్రయమునకు, ఈశానం = నియామకునిగా, విదిత్వా = ఎఱింగి, తతః = అతనివల్లనుండి, నవిజుగుప్సతే=రక్షించుకొనుటకు కోరఁడు. ఏతత్=ఇదియే, తద్వై=ఆబ్రహ్మతత్త్వముగదా.

తా. అంగుష్ఠమాత్రుఁడనఁగా అంగుష్ఠపరిమాణముగలవాఁడు. హృదయకమలము అంగుష్ఠపరిమాణముగలది. ఆహృదయచ్ఛిద్రస్థమగు ఆకాశముకూడ అంగుష్ఠపరిమాణముగలది. ఆట్టియంతఃకరణోపాధిగల పురుషుఁడు - జీవుఁడు అంగుష్ఠమాత్రుఁడనంబడును. పురుషుఁడనఁగా 'పూర్ణ మనేనసర్వం ఇతి పురుషః' అను వ్యుత్పత్తిచేత అంతట నిండియున్నాఁడని చెప్పఁబడుచున్నాఁడు. ఇట్టి పురుషుఁడు శరీరమధ్యభాగమునం దుంటున్నాఁడు. ఈపురుషుఁడే కాలత్రయమునకు నియామకుఁడు. ఇట్టిపురుషుఁడే కాలత్రయమునకు నియామకుఁడనువిషయము నెఱింగినవాఁడు. అట్టి యాత్మభూతుఁడగు పురుషునివల్లనుండి తనకు

భయమురాగలదని తలంపఁడు కావున అట్టివానినుండి రక్షణమును కోరఁడు. ఇట్టిపురుషుఁడే నీవు తెలిసికొనఁదలఁచిన బ్రహ్మతత్త్వము.

౨-వ అధ్యా, ౧-వ వల్లి, ౧౩-వ మంత్రము.

మూ. అఙ్గుష్ఠమాత్రః పురుషో జ్యోతిరివాధూమకః,
ఈశానో భూతభవ్యస్య సఏవాద్య స ఉశ్వః, ఏతద్వైతత్.

పద. అఙ్గుష్ఠమాత్రః పురుషః జ్యోతిః ఇవ అధూమకః, ఈశానః భూతభవ్యస్య సః ఏవ అద్య సః ఉ శ్వః. ఏతత్ వై తత్. ౧౩

టీక. అంగుష్ఠమాత్రః=అంగుష్ఠపరిమాణముగల, పురుషః=పురుషుఁడు జ్యోతిః ఇవ=జ్యోతిస్సువలె, అధూమకః = ధూమములేనివాఁడు, సః=అపురుషుఁడే, భూతభవ్యస్య=కాలత్రయమునకు, ఈశానః=ప్రభువు, నియామకుఁడు. అద్య=నేఁడు (ఉన్నప్రాణులందుండువాఁడు) సః ఏవ = ఆపురుషుఁడే, శ్వః= రేపు, (ఉండఁగలప్రాణులందుండువాఁడున్నూ) సఃఏవ=ఆపురుషుఁడే. ఏతత్= ఈపురుషుఁడే, తత్ వై =నీవుకోరిన ఆబ్రహ్మము గదా.

తా. అంగుష్ఠపరిమాణముగలవాఁడుగా ప్రతిపాదింపఁబడినపురుషుఁడు జ్యోతిస్సువలె ధూమములేనివాఁడు. ఏపురుషుఁడు ఇటుల హృదయాకాశాంతర్గతచ్ఛిద్రాంతర్వర్తియనియు, కాలత్రయనియామకుఁడనియు యోగీశ్వరులచేత గురూపదేశాగమానుభవములచేత లక్షింపఁబడుచున్నాఁడో ఆపురుషుఁడే నిత్యుఁడు, కూటస్థుఁడు. ఈవర్తమానకాలమునందున్న ప్రాణులందున్నవాఁడా పురుషుఁడే, భవిష్యత్కాలమునందుండఁబోవు ప్రాణులందుండఁగలవాడున్నూ ఆపురుషుఁడే. అతనితో సమానుఁడగువఁడొక్కఁడు పుట్టఁబోవునది లేదు. ఇట్లు చెప్పుటచేత 'నాయమస్తీత్యేకే' (అనఁగాదేహాభిన్నముగ ఆత్మయనువాఁ డొకఁడు లేఁడు) అనుపక్షము న్యాయానుసారము ప్రాప్తింపకపోయినను శ్రుతియే స్వశబ్దముగా ఆపక్షమునున్నూ క్షణభంగవాదమునున్నూ నిషేధించుచున్నది.

వివరణము:—ఆదియందు నచికేతుఁడు "యేయం ప్రేతే విచికిత్సా మనుష్యే అస్తీత్యేకే నాయమస్తీత్యేకే" అనిపక్షద్వయమును ప్రశ్నించియున్నాఁడు. ఆపక్షద్వయమునందు 'అస్తీత్యేకే' యనుపక్షమునను సరించి 'యేనరూపం రసంగంధం' అను ౨. ౧. ౩. మంత్రముమొదలుకొని అంగుష్ఠమాత్రఃపురుషో మధ్యఆత్మని తిష్ఠతి. కఠ ౨.౧.౧౨ మంత్రమువఱకుఁగల ౧౦ మంత్రములందు వివరింపఁబడినది. ఈమంత్రమునందు 'నాయమస్తీత్యేకే' అనువారి పక్షము అసంగతమని నిరాకరింపఁబడినదని యెఱుంగవలయును.

౨-వ అధ్యా, ౧-వ వల్లి, ౧౪-వ మంత్రము.

అవ. బ్రహ్మము భేదదర్శనమునకు విరుద్ధమని నిరూపించుచున్నాఁడు.—

మూ. యథోదకం దుర్గే వృష్టం పర్వతేషు విధావతి,
ఏవం ధర్మాన్ పృథక్ పశ్యం స్తానేవానువిధావతి. ౧౪

పద. యథా ఉదకం దుర్గే వృష్టం పర్వతేషు విధావతి, ఏవం ధర్మాన్ పృథక్ పశ్యన్ తాన్ ఏవ అను విధావతి. ౧౪

టీక. దుర్గే=దుర్గమమయిన పర్వతాద్యుచ్చప్రదేశమునందు, వృష్టం = కురిసిన, ఉదకం=జలము,పర్వతేషు=పర్వతనిమ్నప్రదేశములందు, యథా=ఎట్లు, విధావతి=ప్రవహించుచున్నదో, ఏవం=ఈవిధముగా, ధర్మాన్=ఆత్మకంటెభిన్నములగు,ధర్మములను, పృథక్=వేఱువేఱుగా, పశ్యన్ = చూచుచున్నవాఁడై, తాన్ ఏవ=ఆశరీరభేదములనే, అనువిధావతి=అనుసరించుచున్నాఁడు.

తా. దుర్గమములయినపర్వతాద్యుచ్చప్రదేశములందు వర్షించినయుదకము పర్వతగతములగు నిమ్నప్రదేశములకు ప్రవహించుచున్నదై అభిన్నమై యొటులకలసిపోవుచున్నదో అదేవిధముగా ఆత్మకంటెభిన్నములయినధర్మములను ప్రతిశరీరమునందు వేఱువేఱుగా చూచుచున్నవాఁడయి ఆధర్మములనే అనుసరించుచున్నాఁడు. అనఁగా శరీరభేదమునే మాటిమాటికి పొందుచున్నాఁడు.

౨-వ అధ్యా, ౧-వ వల్లి, ౧౫-వ మంత్రము.

అవ. ఉపాధికృతమగు భేదదృష్టి నశించినట్టియుఁ, విశుద్ధవిజ్ఞాన రసైకఘనుఁడగు అద్వయాత్మదర్శనము కలిగినట్టియు, విద్యావంతుఁడయి నట్టియు, మననశీలుఁడయినట్టియు జ్ఞానికి ఆత్మస్వరూప మేవిధముగా ప్రాప్తించు ననువిషయము తెలుపఁబడుచున్నది:—

మూ. యథోదకం శుద్ధే శుద్ధమాసిక్తం తాదృగేవ భవతి,
ఏవం మునే ర్విజానత ఆత్మా భవతి గౌతమ. ౧౫

పద. యథా ఉదకం శుద్ధే శుద్ధం ఆసిక్తం తాదృక్ ఏవ భవతి, ఏవం మునేః విజానత ఆత్మా భవతి గౌతమ. ౧౫

కాఠకోపనిషత్తు ద్వితీయాధ్యాయమునందు
ప్రథమవల్లి సమాప్తము.

టీక. గౌతమ=ఓనచికేతుఁడా! శుద్ధే = పరిశుద్ధమయిన జలమునందు, ఆసిక్తం = పోయఁబడిన, ఉదకం = ఉదకము, తాదృక్ఏవ = అదేవిధముగా పరిశుద్ధమయినది, యథాభవతి = ఏవిధముగా అగుచున్నదో, ఏవం = అదేవిధముగా, విజానతః = జ్ఞానియగు, మునేః = మననశీలునియొక్క, ఆత్మా=ఆత్మ, భవతి=నిర్మలమయినది అగుచున్నది.

తా. పరిశుద్ధమయిన నీటియందు పరిశుద్ధమయిన నీటినిపోసినయెడల ఆజల మేవిధముగా నిర్మలముగా ఏకవిధముగా నుంటున్నదో, అదేవిధముగా మననశీలుఁడయిన ఏకత్వవిజ్ఞానముగల జ్ఞానియొక్కఆత్మయు ఏకరసమయి యుండుననిభావము. కావున కుతార్కికులయొక్క భేదదృష్టిని, నాస్తిక దృష్టినివదలి మనయొక్కమాతాపితృసహస్రులకంటె అధికముగ మనహితమును అభిలషించుచున్న వేదముచేత ఉపదేశింపఁబడిన ఆత్మైకత్వదర్శనమును నిరహంకారులయి ఆదరించవలయుననని భావము.

వివరణము:—లోకమునందు ఇతరాపేక్షచేత తల్లితండ్రులకే తమ సంతానమునందు ప్రీతికలిగియుండుట సర్వానుభవసిద్ధము. ఎయ్యది ప్రాణులకు హితమో, ఎయ్యది అహితమో అనువిషయము నెఱుంగుటకు సామర్థ్యము శ్రుతికంటె తద్భిన్నుల కుండఁజాలదు. తల్లితండ్రులకంటె వేయిరెట్లధికముగ సకలప్రాణులయందు వేదము హితము కలిగియున్నది కావున అట్టివేదమాత యుపదేశమును నిరసించుట శుభావహముకాదని భావము.

కాఠకోపనిషత్తునందు ఆంధ్రటీకాతాత్పర్యవివరణసహితమగు
ద్వితీయాధ్యాయమునందు ప్రథమవల్లి సమాప్తము.

ప్రథమాదిపరిగణనముచేత చతుర్థవల్లి సమాప్తము.

ఈవల్లికిసంబంధించిన వివరణగ్రంథభాగము
అనుభూతిప్రకాశము-౧౧ అధ్యాయము.
ఆత్మపురాణము-౯ అధ్యాయము.

---

# కఠోపనిషత్తు

## ద్వితీయాధ్యాయము—ద్వితీయవల్లి.

(ప్రథమాదిపరిగణనముచేత పంచమవల్లి)

౨-వ అధ్యా, ౨-వ వల్లి, ౧-వ మంత్రము.

అవ. బ్రహ్మతత్త్వము తెలిసికొనుట అధికకష్టమగుటచేత మఱల ప్రకారాంతరముగ నీయధ్యాయమునందు నిరూపింపఁబడుచున్నది:—

మూ. పురమేకాదశద్వార
మజస్యావక్రచేతసః,
అనుష్ఠాయ న శోచతి
విముక్తశ్చ విముచ్యతే. ఏతద్వైతత్. ౧

పద. పురం ఏకాదశద్వారం అజస్య అవక్రచేతసః, అనుష్ఠాయ న శోచతి విముక్తః చ విముచ్యతే. ఏతత్ వై తత్. ౧

టీక. ఏకాదశద్వారం=పదునొకండు ద్వారములుగల, పురం=నగరము, అవక్రచేతసః = అకుటిలమయిన - ఏకరూపమయిన విజ్ఞానముగల, అజస్య = ఏపరమాత్మకుఁగలదో (అట్టిపరమాత్మను), అనుష్ఠాయ = ధ్యానించి, నశోచతి= దుఃఖింపఁడు. విముక్తఃచ=రాగద్వేషాదికముచేత వినిర్ముక్తుఁడయి, విముచ్యతే =సంసారబంధమునుండి విముక్తుఁడగుచున్నాఁడు. ఏతత్=ఈమంత్రోక్తమయిన తత్త్వము, తత్ వై=నీవు ప్రశ్నించిన ఆయాత్మతత్త్వమే.

తా. పురమనఁగా ఇచట శరీరమని గ్రహించవలయును. ఈశరీరమునకు పురమునకు సమానధర్మములు చాలగలవు. పురమునకు ద్వారములు, ద్వార

పాలకులు, పురాధ్యక్షుండు మున్నగు అనేకోపకరణము లుండును. అట్లే ఈ శరీరమునకుకూడ ద్వారములు, ద్వారపాలకులు, అధ్యక్షుండు మున్నగు అనేకోపకరణములుండుటచేత దీనిని పురమనిచెప్పుటయం దనుపపత్తి యేమియు లేదు. లోకమునందుఁగల ఉపకరణసమన్వితమగు పురసామాన్యము పురమునకంటె భిన్నుఁడగు అధిపతియొక్క అనుభవార్థమనుట ఎట్లు లోకానుభవప్రసిద్ధమో అట్లే పురమువలెనే అనేకోపకరణసమన్వితమగు ఈశరీరముకూడ శరీరవిభిన్నుఁడును, రాజస్థానీయుఁడును అగు అధిపత్యర్థమేయనుట యుక్తమగుచున్నది. అనఁగా శరీరమనెడి యీపురము ఏకాదశద్వారములు కలిగియున్నది. శీర్షణ్యములగు 7 సప్తద్వారములును, నాభితోకలసి అధోభాగమునందుగల 3 ద్వారత్రయమున్ను, శిరస్సునం 1 దొకటియుఁగలసి 11 ద్వారము లగుచున్నవి. ఈపురము రాజస్థానీయుఁడును, జన్మాదివిక్రియారహితుఁడును, పురధర్మ విలక్షణుఁడును అగు ఆత్మకు సంబంధించినదని యెఱుంగవలయును. 'అవక్రచేతసః' అనువిశేషణపదమునకు అర్థాంతరముచెప్పఁబడుచున్నది. అవక్రమనఁగా కుటిలముకానిది——స్వాభావికమయినదని భావము. సూర్యప్రకాశమువలె స్వాభావికము——నిత్యమయిన చేతస్సు——అనఁగా ఏకరూపమయిన విజ్ఞానముగల రాజస్థానీయుఁడగు ఆత్మయొక్క అని గ్రహించవలయును. ఏ యాత్మకు ఇట్టి ఏకాదశద్వారములు గలపురము గలదో అట్టిపురమునకు అధిపతియగు పరమేశ్వరుని ధ్యానించి——అనఁగా సమ్యక్ జ్ఞానపూర్వముగా ధ్యానించి సర్వేషణావిరహితుఁడయి ఆట్టిపరమాత్మను సమునిగను, సర్వభూతస్థునిగను తలంచునట్టివాఁడు శోకింపఁడు. పరమార్థవిజ్ఞానమువలన అభయప్రాప్తి కలుగుచున్నది. అభయప్రతిష్ఠ కలిగినప్పుడు శోకావసరముగాని భయదర్శనముగాని కలుగఁజాలదు. ఈశరీరావస్థానసమయమునందే అవిద్యాకృత కామకర్మబంధనములచేత విముక్తుఁడగుచున్నాఁడు. ఇటుల అవిద్యాకృత కామకర్మబంధనములవల్లనుండి విముక్తుఁడయి మఱల శరీరమును ధరింపఁడు. జన్మరాహిత్యమగు మోక్షమును పొందుచున్నాఁడని భావము.

వివరణము:— ఆత్మతత్త్వమునుగూర్చి యిదివఱకు ఎన్నియో విధములుగా నిరూపింపఁబడియున్నదిగదా, మఱల ఆత్మతత్త్వమునుగూర్చియే యీ వల్లియందు యేల వివరింపవలయునని సంశయము కలుగవచ్చునుకాని 'భూయోఽపి పథ్యం వక్తవ్యం' అనున్యాయముననుసరించి మంచివిషయమును గూర్చి చెప్పునప్పుడు ఆవిషయమును సులభముగా గ్రహించుటకు తగినరీతిగా బోధించవలయునేగాని పునరుక్తిదోషము మున్నగువానిని పాటించుట అనావశ్యకమని న్యాయజ్ఞులు తలంచుచున్నారుకావున భంగ్యంతరముగ నిర్దేశింపఁబడుచున్నది.

ఏకాదశద్వారముల వివరణము:—

శీర్షణ్యములు ౭;—నేత్రద్వారములు ౨; శ్రోత్రద్వారములు ౨; నాసికాద్వారములు ౨; ముఖద్వారము ౧=మొత్తము. ౭

నాభితోఁడ అధోద్వారములు 3:—నాభి ౧. గుదము ౧. ఉపస్థ ౧. మొత్తము 3.

బ్రహ్మకపాలము. ౧.

అన్నియుంకలసి మొత్తము ౧౧ ద్వారములని యెఱుంగునది.

శరీరమునకున్నూ శరీరాధిష్ఠితునకున్నూ గల సంబంధము పుర, పురస్వాములకుఁ గలసంబంధమువంటిదని చెప్పుటచేత పురముయొక్క వృద్ధిక్షయముల వలన పురస్వామికి వృద్ధిక్షయము లెటులకలుగఁజాలవో అట్లే శరీరముయొక్క వృద్ధిక్షయములవలన శరీరాధ్యక్షునకుకూడ ఉపచయాపచయములు కలుగఁజాలవని గ్రహించవలయును.

శరీరాధిష్ఠితుఁడు జీవుఁడుగదా, అతనిని ఈశ్వరునిగా నిర్దేశించిచెప్పుట అసంగతముగదా యని సంశయముకలుగవచ్చునుకాని, ఇచట పురస్వామియగు జీవునిగూర్చిచెప్పునప్పుడు 'అజస్య, అవక్రచేతసః' అను ఈశ్వరత్వధర్మములను ర్దేశించిచెప్పుటచేత ప్రత్యగభిన్నుఁడగు ఈశ్వరునకు పురస్వామిత్వముకూడ

సంగతమేయగుచున్న దనుతలంపుతో చెప్పఁబడినది. మూలమునందు 'విముక్త శ్చవిముచ్యతే' అని పునరుక్తిగా చెప్పఁబడినటుల తోఁచుచున్నది. కాని తత్పున రుక్త్యాభాసపరిహారార్థము భాష్యమునందు "ఇహైవావిద్యాకృత కామకర్మ బంధనైః విముక్తోభవతి; విముక్తశ్చసన్ విముచ్యతే=పునఃశరీరం న గృహ్ణాతీత్యర్థః" అని పదద్వయమునకు అర్థభేదము పరిగ్రహింపఁబడినది.

౨-వ అధ్యా, ౨-వ వల్లి, ౨-వ మంత్రము.

అవ. ఆయాత్మ పురశబ్దవాచ్యమగు నీదేహమునందుమాత్రమే యుం డుటలేదు. ఇఁకనేమనఁగా సర్వపురవర్తి యనువిషయమే యీమంత్రమునందు ప్రతిపాదింపఁబడుచున్నది.

మూ. హగ్ంస శ్శుచిష ద్వసు ర న్తరిక్షస
ద్ధోతా వేదిష దతిథి ర్దురోణసత్,
నృష ద్వరస దృతస ద్వ్యోమస
దబ్జా గోజా ఋతజా అద్రిజా ఋతం బృహత్. ౨

పద. హంసః శుచిషత్ వసుః అన్తరిక్షసత్ హోతా వేదిషత్ అతిథిః దురోణసత్, నృషత్ వరసత్ ఋతసత్ వ్యోమసత్ అబ్జాః గోజాః ఋతజాః అద్రిజాః ఋతం బృహత్. ౨

టీ. శుచిషత్ = నిష్కళంకమయిన ఆకాశమునందున్నట్టి, హంసః = ఆదిత్యుఁడును, అంతరిక్ష సత్ = అంతరిక్షమునందుండువాఁడును, వేదిషత్ = అగ్నిహోత్రవేదియందున్న, లేక పృథివియందున్న, హోతా=అగ్నిస్వరూపుఁ డును, దురోణసత్=ద్రోణకలశమునందున్న, అతిథిః=సోమరసస్వరూపుఁడును, లేక దురోణసత్ = గృహములందు, అతిథిః = అతిథియయిన బ్రాహ్మణుఁడుగా వచ్చినవాఁడును, నృషత్=మనుష్యులందు అంతర్యామిస్వరూపుఁడుగా నుండు వాఁడును, వరసత్ = దేవతలం దంతర్యామిస్వరూపుఁడుగా నుండువాఁడును, ఋతసత్ = సత్యమునందు లేక యజ్ఞమునం దధిష్ఠితుఁడయియుండువాఁడును,

వ్యోమసత్ = ఆకాశమునందుండువాఁడును, అబ్జాః = శంఖశుక్తి మకరాదిరూపమున జలములం దుద్భవించువాఁడును, గోజాః = భూమియందు వ్రీహియవాదిరూపమున జనించువాఁడును, ఋతజాః = యజ్ఞాంగరూపమున జన్మించువాఁడును, అద్రిజాః = పర్వతములనుండి నద్యాదిరూపమున జన్మించు వాఁడును, ఋతం = సర్వాత్మకుఁడయ్యును అవితథస్వభావుఁడును, బృహత్ = సర్వకారణుఁ డగుటచేత అందఱికంటె గొప్పవాఁడును, (పైయాత్మ అగుచున్నాఁడు.)

తా. శుచియనఁగా నిర్మలము, అట్టిప్రదేశమునందుండు ఆదిత్యస్వరూపముతో చరించువాఁడు శుచిషత్తు - హంసస్వరూపుఁడు. వసువనఁగా అంతట నివసించువాఁడు, లేక అందఱకు నివాసభూతుఁడు. వాయుస్వరూపమున అంతరిక్షమున చరించువాఁడు అంతరిక్షసత్తు. వేదియనఁగా అగ్నిహోత్రవేది, లేక భూభాగము, అచటనుండువాఁడు వేదిషత్తుహోత యనఁగా అగ్ని. శ్రు. 'అగ్నిర్వై హోతా; వేదిర్వై పరోఽంతః పృథివ్యాః' అని శ్రుతిప్రమాణ మిట గ్రహించునది. దురోణమనఁగా ద్రోణకలశము, అట్టిద్రోణకలశమునందు సోమరసరూపముననుండు వాఁడు దురోణస త్తనంబడును. లేక దురోణమనఁగా గృహము. గృహమునకు అతిథిస్వరూపమున వచ్చినబ్రాహ్మణస్వరూపుఁడు. మనుష్యులం దంతర్యామిస్వరూపముననుండువాఁడు నృష త్తనంబడును. వరులనఁగా మనుష్యులకంటె శ్రేష్ఠులయిన దేవతలు, వారియం దంతర్యామిస్వరూపముననుండువాఁడు వరస త్తనంబడును. ఋతమనఁగా సత్యము లేక యజ్ఞము, దానియందుండు వాఁడు ఋతస త్తనంబడును. వ్యోమమనఁగా ఆకాశము, అచటనుండువాఁడు వ్యోమస త్తనంబడును. అప్పులనఁగా జలములు అట్టి అప్పులందు శంఖ, శుక్తి, మకరాదిరూపమున జన్మించువాఁడు అబ్జుఁడనంబడును. గోవనఁగా భూమియందు వ్రీహియవాదిరూపమున జన్మించువాఁడు గోజుఁడనంబడును. ఋతమనఁగా యజ్ఞాంగము, తద్రూపమున జన్మించువాఁడు ఋతజుఁ డనంబడును. అద్రులనఁగా పర్వతములు, అట్టిపర్వతములనుండు

వాఁడు వ్యోమస త్తనంబడును. అప్పు లనఁగా జలములు. అట్టి అప్పులందు శంఖ, శుక్తి, మకరాదిరూపమున జన్మించువాఁడు అబ్జుఁ డనంబడును. గో వనఁగా భూమి, ఆభూమియందు వ్రీహియవాదిరూపమున జన్మించువాఁడు గోజుఁడనంబడును. ఋతమనఁగా యజ్ఞాంగము, తద్రూపమున జన్మించువాఁడు ఋతజుఁ డనంబడును. అద్రు లనఁగా పర్వతములు, అట్టి పర్వతములనుండి నద్యాదిస్వరూపమున జన్మించువాఁడు అద్రిజుఁ డనంబడును. ఇట్లు సర్వాత్మకుఁ డగుటయేగాక ఋత మనఁగా అవితథము—అనఁగా సత్యము, అట్టి స్వభావముగలవాఁడు. బృహత్తనఁగా సర్వమునకు కారణభూతుఁ డగుటచేత బృహత్తనంబడును.

ఈమంత్రమునకు వ్యాఖ్యానభూతమగు బ్రాహ్మణమునందు "అసౌ వా ఆదిత్యో హంస శ్శుచిషత్" అని ఆదిత్యపరముగా అర్థము ప్రతిపాదింపఁబడి యున్నదిగదా. ఆత్మపరముగా నిచట వ్యాఖ్యాన మొనర్చుట యుక్తమేనా? అని కొందఱనునెడల అట్లయినను మేముచెప్పినవిషయమునం దసంగత మేమియు లేదు. ఆత్మ సర్వస్వరూపుఁడనియే మేము చెప్పుచున్నారము కావున ఆత్మస్వరూపుఁడగు ఆదిత్యునిగూర్చియే యీమంత్రమునందు వివరింపఁబడినదని తలంచవచ్చును. జగత్తునందు సర్వవ్యాపియగు ఆత్మ యొక్కఁడేకాని ఆత్మభేదముమాత్రము లేదని మంత్రార్థము.

వివరణము:—యజ్ఞమునందు సోమరసమునుంచునట్టి పాత్రవిశేషమునకు ద్రోణకలశ మనిపేరు. దురోణమను మూలపదమునకు 'ద్రోణ' మని యర్థాంతరము ఆచార్యులవారిచేత గైకొనఁబడినది.

౨-వ అధ్యా, ౨-వ వల్లి, 3-వ మంత్రము.

అవ. ఆత్మస్వరూపప్రాప్తికి తగినసాధనము చెప్పఁబడుచున్నది:—

మూ. ఊర్ధ్వం ప్రాణ మున్నయత్యపానం ప్రత్యగస్యతి,
మధ్యే వామనమాసీనం విశ్వేదేవా ఉపాసతే. 3

పద. ఊర్ధ్వం ప్రాణం ఉన్నయతి అపానం ప్రత్యక్ అస్యతి, మధ్యే వామనం ఆసీనం విశ్వే దేవాః ఉపాసతే.

టీక. (యః=ఎవ్వఁడు), ప్రాణం=ప్రాణవృత్తిని, ఊర్ధ్వం=హృదయము కంటె ఊర్ధ్వముగా, ఉన్నయతి = పొందించుచున్నాఁడో, (అదేవిధముగా) అపానం = అపానవృత్తిని, ప్రత్యక్ అస్యతి = అధోభాగమునకు నెట్టివేయుం చున్నాఁడో, మధ్యే=హృదయకమలముయొక్క మధ్యభాగమునందు, ఆసీనం= ఉన్నవాఁడున్నూ, వామనం=అందఱిచేత పొందఁదగిన (తం=అట్టియాత్మను), విశ్వే దేవాః=దేవతలందఱు, ఉపాసతే=ఉపాసించుచున్నారు.

తా. ఏఆత్మ హృదయకమలమునుండి ప్రాణవృత్తిని ఊర్ధ్వభాగమును పొందించుచున్నాడో, అదేవిధముగా అపానవృత్తిని అధోభాగమునకు పొం దించుచున్నాడో అట్టియాత్మ హృదయకమలాంతర్వర్తియగు దహరాకాశము నందు నివసించుచున్నాఁడు. ఆయాత్మ అందఱకు సేవింపఁదగినవాఁడు. అట్టి యాత్మనే దేవతలందఱు ఉపాసించుచున్నారు. ఇది అధిదేవార్థము. అధ్యాత్మ పరము—దేవతలనఁగా చక్షురాదీంద్రియములు (సామాన్యజనులు సార్వ భౌముని కానుకలను చేతియందుంచుకొని యెటుల సేవించుచున్నారో అదే విధముగా) రూపాదివిజ్ఞానరూప మగు బలిని ఆత్మకు సమర్పించుచున్నవై సర్వదా సేవించుచున్నవి. దీనివలన రూపాదివిజ్ఞానకర్తకంటె భిన్నుఁడయి ఆత్మ ప్రకాశించుచున్నాఁడని సిద్ధించుచున్నది.

౨-వ అధ్యా, ౨-వ వల్లి, ౪-వ మంత్రము.

మూ. అస్య విస్రంసమానస్య శరీరస్థస్య దేహినః,
దేహా ద్విముచ్యమానస్య కి మత్ర పరిశిష్యతే.
ఏతద్వై తత్.

పద. అస్య విస్రంసమానస్య శరీరస్థస్య దేహినః, దేహాత్ విముచ్య- మానస్య కిం అత్ర పరిశిష్యతే, ఏతత్ వై తత్.

టీక. దేహినః=దేహముగలవాఁడై, శరీరస్థస్య=దేహమునందున్నవాఁడై, విస్రంసమానస్య=దేహమునుండి జారిపోవుచున్న, అస్య=ఈయాత్మ, దేహాత్=దేహమునుండి, విముచ్యమానస్య (సతః) = విముక్తమగుచుండఁగా, అత్ర=ఈ దేహమునఁదు, కిం పరిశిష్యతే=ఏమి మిగిలియుండును. ఏతత్=ఇది, తత్ వై=అదియేగదా.

తా. ఈదేహము నాశ్రయించియున్న యాత్మ యీదేహమును వదలి పోయినపిదప యీదేహమునందు మఱేమి నిలిచియుండును? ఏమియు నిలిచి యుండఁజాలదని భావము. ఆపత్సమయమునందు నగరాధ్యక్షుఁడగు రాజు నగరమునువిడిచి పారిపోయినాఁడను విషయము తెలిసిన వెంటనే నగరవాసులగు ప్రజలందఱును భయంపడి యెట్లుల పారిపోవుచున్నారో అదేవిధముగా దేహమను నగరమునకు అధిపతియగు ఆత్మ దేహమును వదలిపోవుచుండగనే కార్యకరణ కలాపరూపమగు ప్రాణాదికమంతయు హతబలమయి కూలిపోవు చున్నదని యెఱుంగవలయును. దీనివలన ప్రాణాదికముకంటె ఆత్మ అన్యుఁడని సిద్ధించుచున్నది.

౨-వ అధ్యా, ౨-వ వల్లి, ౫-వ మంత్రము.

మూ. న ప్రాణేన నాపానేన మర్త్యో జీవతి కశ్చన,
ఇతరేణ తు జీవన్తి యస్మిన్నేతావుపాశ్రితౌ. ౫

పద. న ప్రాణేన న అపానేన మర్త్యః జీవతి కః చ న, ఇతరేణ తు జీవన్తి యస్మిన్ ఏతౌ ఉపాశ్రితౌ.

టీక. ప్రాణేన = ప్రాణముచేతఁగాని, అపానేన = అపానముచేతఁగాని, కశ్చనమర్త్యః=ఒకానొకమనుష్యుఁడున్నూ, నజీవతి=జీవించుటలేదు. యస్మిన్ = ఏయాత్మయుండఁగా, ఏతౌ = ఈప్రాణాపానములు, ఉపాశ్రితౌ = ఆశ్రయించియున్నవో, (అట్టి) ఇతరేణతు=ప్రాణాపానవ్యతిరిక్తమయిన ఆత్మచేతనే, జీవంతి=(మర్త్యులు) ప్రాణములను ధరించుచున్నారు.

తా. లోకమునందు ప్రాణులెవ్వరు, ప్రాణవాయువుచేతగాని లేక అపానవాయువుచేతగాని లేక చక్షురాదీంద్రియములచేతగాని జీవించుటలేదు. పరార్థము కలసియున్న ప్రాణాపానచక్షురాదిక మెప్పుడును జీవనహేతుకము కాఁజాలదు. సంఘాతమయిన గృహాదికము పరప్రేరితముగ లోకమునందు గనంబడుచున్నదేగాని స్వతంత్రముగ నెచ్చటను గనంబడుచుండుటలేదు. కావున అదేవిధముగా సంఘాతములయిన ప్రాణాపానచక్షురాదికములుకూడ ప్రాణాదికముకంటె విభిన్నుఁడగు ఆత్మచేతనే జీవించుచున్నవి. ప్రాణాపానచక్షు రాది విలక్షణుఁడగు ఏయాత్మ యుండుటచేతనే ప్రాణాపానాదికములు చక్షు రాదిసంహాతమునందు చేరి ఈ సంఘాతమునందు చేరని ఆత్మను స్వస్వవ్యాపా రములతో సేవించుచున్నవో అట్టియాత్మ యీసంఘాతముకంటె విభిన్నుఁడను విషయము స్పష్టముగనే సిద్ధించుచున్నదిగదా.

౨-వ అధ్యా, ౨-వ వల్లి, ౬-వ మంత్రము.

మూ. హన్త త ఇదం ప్రవక్ష్యామి గుహ్యం బ్రహ్మ సనాతనం,
యథా చ మరణం ప్రాప్య ఆత్మా భవతి గౌతమ.

పద. హన్త త ఇదం ప్రవక్ష్యామి గుహ్యం బ్రహ్మ సనాతనం, యథా చ మరణం ప్రాప్య ఆత్మా భవతి గౌతమ.

టీక. గౌతమ = ఓనచికేతుఁడా! (ఏబ్రహ్మతత్త్వమును తెలిసికొనని యెడల) మరణం = మరణమును, ప్రాప్య=పొంది, ఆత్మా = దేహము, యథా= ఏవిధముగా, భవతి=కలుగుచున్నదో, (తథా=అట్టి.) సనాతనం = అతిప్రాచీన మును, గుహ్యం=అతిరహస్యమునుఅగు, ఇదం=ఈ, బ్రహ్మ=బ్రహ్మమునుగూర్చి, హంత=ఇప్పుడు, తే=నీకు ప్రవక్ష్యామి=చెప్పఁగలను.

తా. ఓగౌతముఁడా! ఏబ్రహ్మమును ఎఱింగినయెడల సంసారము యొక్క ఉపరతి కలుగుచున్నదో, ఏబ్రహ్మము నెఱుంగనియెడల మరణమును పొంది జననమరణరూపమగు సంసారమును నిరంతరము పొందుచుండునో.

అట్టి అతిప్రాచీనమును అతిరహస్యమును అగుబ్రహ్మమును నీకు బోధింపఁ గలను.

వివరణము:—'యేయం ప్రేతే విచికిత్సా మనుష్యే' అని ప్రశ్నించి నప్పుడు పరలోకాస్తిత్వవిషయమై నచికేతునకు సంశయము కలిగియుండెను. తత్సంశయనిరాసార్థ మీమంత్రము చెప్పఁబడినది.

౨-వ అధ్యా, ౨-వ వల్లి, ౭-వ మంత్రము.

మూ. యోనిమన్యే ప్రపద్యన్తే శరీరత్వాయ దేహినః,
స్థాణుమన్యేఽనుసంయన్తి యథాకర్మ యథాశ్రుతమ్.

పద. యోనిం అన్యే ప్రపద్యన్తే శరీరత్వాయ దేహినః, స్థాణుం అన్యే అను సంయన్తి యథాకర్మ యథాశ్రుతం.

టీక. యథాకర్మ = వారువారు జన్మాంతరములందుచేసిన పుణ్యపాప కర్మము ననుసరించియును, యథాశ్రుతం = వారువారుపొందిన విజ్ఞానము ననుస రించియు, అన్యేదేహినః=కొందఱుజీవులు, శరీరత్వాయ=శరీరగ్రహణార్థము, యోనింప్రపద్యంతే=గర్భవాసమును పొందుచున్నారు. అన్యే దేహినః=కొందఱు జీవులు, స్థాణుం=వృక్షాదిస్థావరభావమును, అనుసంయంతి=పొందుచున్నారు.

తా. పూర్వజన్మమునం దెవ్వరెట్టి కర్మల నాచరించిరో, ఎవ్వరెట్టి ఉపాసనాదికము నాచరించిరో అట్టిప్రాణులు తాము జన్మాంతరములం దొన ర్చిన పుణ్యపాపకర్మలకు ఉపాసనలకు తగినటుల తిరిగి శరీరమును పొందుట కయి మాతా పితృ గర్భవాసము ననుభవించి (మనుష్యాదులుగనో పశుపక్ష్యా దులుగనో) పుట్టుచున్నారు. అధములయినవారలు వృక్షాదిస్థావరభావమును పొందుచున్నారు. 'యథా ప్రజ్ఞం హి సంభవాః' అను శ్రుత్యంతరముకూడ ఈవిషయమునే ప్రతిపాదించుచున్నది.

వివరణము:—౧ శ్రు. తద్య ఇహ రమణీయచరణాః అభ్యాశోహ యత్తే రమణీయాం యోని మాపద్యేరన్ బ్రాహ్మణయోనిం వా క్షత్రియ

యోనింవా వైశ్యయోనిం వాऽథ య ఇహ కపూయచరణా అభ్యాశోహ యత్తే కపూయాం యోని మాపద్యేరన్ శ్వయోనిం వా సూకరయోనిం వా చాండాలయోనిం వా. ఛాందో ౫. ౧౦. ౭.

౨. శ్రు. తం విద్యాకర్మణీ సమన్వారభేతే పూర్వప్రజ్ఞా చ.

3. స్మృతి:—వర్ణా ఆశ్రమాశ్చ స్వకర్మనిష్ఠాః ప్రేత్య కర్మఫల మనుభూయ తతశ్శేషేణ విశిష్టదేశ జాతికులరూపాయుశ్శ్రుతవృత్త విత్త సుఖమేధసో జన్మ ప్రతిపద్యంతే. గౌతమధర్మ సూత్ర. ౨. ౧౧. ౨౯.

మున్నుగు శ్రుతిస్మృతు లనేకము లీయర్థమును అనువదించుచున్నవి.

పాపములు ౧. వాచికములు, ౨. మానసములు, 3. శారీరకములు అని త్రివిధములు. అందులో శరీరసంబంధములయిన పాపకార్యములను అధికముగా నొనర్చినయెడల స్థావరజన్మమును, వాచికపాపాధిక్యముచేత పక్షిమృగాదిజన్మమును, మానసపాపాధిక్యముచేత అంత్యజాతిత్వమును పొందునని మనుస్మృతియం దిట్లు చెప్పఁబడినది:—

శ్లో. శరీరజైః కర్మదోషైః యాతి స్థావరతాం నరః,
వాచికైః పక్షిమృగతాం మానసై రన్త్యజాతితామ్.

(మనుస్మృతి. ౧౨. ౯)

౨-వ అధ్యా, ౨-వ వల్లి, ౮-వ మంత్రము.

అవ. "గుహ్యం బ్రహ్మ ప్రవక్ష్యామి" యని ౬-వ మంత్రమునందు చేసినప్రతిజ్ఞ ననుసరించి ఆబ్రహ్మమునుగూర్చి చెప్పుచున్నారు:—

మూ. య ఏష సుప్తేషు జాగర్తి
కామం కామం పురుషో నిర్మిమాణః,
త దేవ శుక్రం తద్బ్రహ్మ
తదేవామృతముచ్యతే,

తస్మింల్లోకా శ్శ్రితా స్సర్వే
తదు నాత్యేతి కశ్చన. ఏతద్వై తత్

పద. యః ఏషః సుప్తేషు జాగర్తి కామం కామం పురుషః నిర్మిమాణః, తత్ ఏవ శుక్రం తత్ బ్రహ్మ తత్ ఏవ అమృతం ఉచ్యతే, తస్మిన్ లోకాః శ్రితాః సర్వే తత్ ఉ న అత్యేతి కః చ న, ఏతత్ వై తత్.

టీక. సుప్తేషు = (అంతఃకరణవ్యతిరిక్తములయిన ప్రాణాదిసకలేంద్రియములు) నిద్రించిన వగుచుండఁగా, కామంకామం=అయా కామములను, నిర్మిమాణః=నిర్మించుచు, యః=ఏ, ఏషః=ఈ, పురుషః=పురుషుఁడు, జాగర్తి =మేల్కొనుచున్నాఁడో, (తానుమాత్రము నిద్రింపఁడో) తదేవ = ఆపురుషుఁడే, శుక్రం=పరిశుద్ధమయిన, తత్ బ్రహ్మ=ఆబ్రహ్మము, తత్ ఏవ = అదియే (ఆబ్రహ్మమే), అమృతం=అమృతమని, ఉచ్యతే=చెప్పఁబడుచున్నది. తస్మిన్= ఆబ్రహ్మమునందే, సర్వేలోకాః=పృథివ్యాదిలోకములన్నియు, శ్రితాః=ఆశ్రయించియున్నవి, కశ్చన=ఒక్కటియును, తత్ = దానిని, న అత్యేతి ఉ = అతిక్రమింపఁజాలదుగదా. ఏతత్=ఇది, తద్వై=నీవడిగిన ఆబ్రహ్మమేగదా.

తా. అంతఃకరణ వ్యతిరిక్తములగు ప్రాణాదీంద్రియములు నిద్రించుచుండఁగా తానుమాత్రము నిద్రింపక జాగరూకుఁడయి అవిద్యచేత ప్రకల్పించిన వనితాద్యభీష్టజాతమును ఏపురుషుఁడు నిర్మించుచున్నాఁడో అతఁడే పరిశుద్ధమయినట్టియు నిగూఢమయినట్టియు పరబ్రహ్మము, ఇంతకంటె భిన్నముగ బ్రహ్మమనునది లేదు. ఇదియే అమృతము—అనఁగా వినాశరహితమని సర్వశాస్త్రములందు చెప్పఁబడుచున్నది. పృథివ్యాది సకలలోకములు సర్వలోకములకు కారణభూతుఁడగు ఆబ్రహ్మమునందే ఆశ్రయించియున్నవి. అట్టిబ్రహ్మముకంటె భిన్నముగనుండునట్టి వస్తువే లేదు. ఇదియే నీవడిగిన బ్రహ్మము.

౨-వ అధ్యా, ౨-వ వల్లి, ౮-వ మంత్రము.

అవ. ఆత్మైకత్వవిజ్ఞానమునుగూర్చి ఇదివఱకు బోధించియున్నను కుతార్కికులగు వారలు వచించెడి యుక్త్యాభాసములచేత సంశయితచిత్తులగు

వారినిమిత్తమయి బ్రహ్మైకత్వవిజ్ఞానమును పునరుక్తిదోషమును పాటింపక పలుసారులు బోధించవలయునని కుతూహలముగల భగవతియగు శ్రుతి మఱల ఆత్మైకత్వవిజ్ఞానమును యీ క్రిందిమంత్రములతో ప్రతిపాదించుచున్నది:—

మూ. అగ్ని ర్యథైకో భువనం ప్రవిష్టో
రూపం రూపం ప్రతిరూపో బభూవ,
ఏక స్తథా సర్వభూతాన్తరాత్మా
రూపం రూపం ప్రతిరూపో బహిశ్చ. ౯

పద. అగ్నిః యథా ఏకః భువనం ప్రవిష్టః రూపం రూపం ప్రతిరూపః బభూవ, ఏకః తథా సర్వభూతాన్తరాత్మా రూపం రూపం ప్రతిరూపః బహిః చ.

టీక. యథా=ఏవిధముగా, ఏకః=ఒక్కఁడైన, అగ్నిః=అగ్ని, భువనం=లోకమును, ప్రవిష్టః=ప్రవేశించినదై, రూపంరూపం = దాహ్యమగు ప్రతిదార్వాదిభేదమునుగూర్చి, ప్రతిరూపః = ఆయాదాహ్యమునకుతగిన రూపముగలది, బభూవ = ఆయెనో, తథా = ఆదేవిధముగా, ఏకః=ఏకవిధుఁడగుపురుషుఁడే, సర్వభూతాంతరాత్మా = సర్వభూతములకు అంతరాత్మయై, బహిఃచ=వెలుపలనున్నూ, రూపంరూపం = ప్రతిరూపమునుగూర్చి, ప్రతిరూపః=సమానమయిన రూపముగలవాఁడు, (బభూవ=ఆయెను.)

తా. ప్రకాశస్వభావుఁడగు అగ్నియొక్కఁడే లోకమునందుగల దాహ్యమగు దార్వాదికమును ప్రవేశించి ఆయాదాహ్య పదార్థమునకుఁదగిన రూపముగలవాఁ డెట్లగుచున్నాఁడో-అనఁగా ఎట్టికాష్ఠమును కాల్చునో ఆకాష్ఠముయొక్క వక్రత్వాదికము ననుసరించి అగ్నికూడ వక్రత్వాదిగుణములు కలిగియున్నటుల యెటులగనంబడుచుండునో, ఆదేవిధముగా ఒక్కఁడే అయిన ఆత్మయే సర్వభూతములందు సర్వదేహములందు అతిసూక్ష్మరూపమున అంతరాత్మభూతుఁడయి ప్రవేశించి ఆయాదేహములకు తగినరూపముగల

వాఁడు అగుచున్నాఁడు. ఆకాశమువలె వికారరహితుఁడయి లోపలవెలుపల ప్రకాశించుచున్నాఁడు.

౨-వ అధ్యా, ౨-వ వల్లి, ౧౦-వ మంత్రము.

అవ. మఱొకదృష్టాంతము చెప్పఁబడుచున్నది:—

మూ. వాయు ర్యథైకో భువనం ప్రవిష్టో
రూపం రూపం ప్రతిరూపో బభూవ,
ఏక స్తథా సర్వ భూతా న్తరాత్మా
రూపం రూపం ప్రతిరూపో బహిశ్చ. ౧౦

పద. వాయుః యథా ఏకః భువనం ప్రవిష్టః రూపం రూపం ప్రతిరూపః బభూవ, ఏకః తథా సర్వభూతాన్తరాత్మా రూపం రూపం ప్రతిరూపః బహిః చ. ౧౦

టీక. యథా = ఏవిధముగా, ఏకఃవాయుః = ఒక్కటియగువాయువు, భువనంప్రవిష్టః=లోకమును ప్రవేశించినదై, రూపంరూపం = ప్రతిదేహమును గూర్చి, ప్రతిరూపః = సమానమయినరూపముగలది, బభూవ = ఆయెనో, తథా=అదేవిధముగా, ఏకః = ఒక్కఁడయిన ఆత్మయే, సర్వభూతాంతరాత్మా= అంతరాత్మస్వరూపములో సర్వభూతము లందున్నవాఁడయి, బహిఃచ = వెలుపలను ఉన్నవాఁడయి, ప్రతిరూపః = సమానమయిన రూపముగలవాఁడు, బభూవ=ఆయెను.

తా. ఓనచికేతుఁడా! ఒక్కటియగువాయువు, ప్రాణాత్మకముచేత సకలప్రాణుల దేహమునందు ప్రవేశించి ఆయాప్రాణులకు తగినటుల ఆయా రూపములు గలిగి యెటుల నున్నదో ఆదేవిధముగా ఒక్కఁడేయగుఆత్మయు సకలభూతాంతరాత్మయై వెలయుచు లోపలవెలుపల ఆయారూపములకు తగిన రూపములు గలవానివలె ప్రకాశించుచున్నాఁడు.

౨-వ అధ్యా, ౨-వ వల్లి, ౧౧-వ మంత్రము.

అవ. ఒక్కఁడే సర్వాత్మకుఁడయినయెడల అప్పుడు సంసారిత్వము దుఃఖిత్వము పరుఁడగు పురుషునకే సంభవించునని సిద్ధించుచున్నదిగదాయని సంశయించి అట్టిదిలేదనుటకుగాను యీమంత్రము చెప్పఁబడుచున్నది:—

మూ. సూర్యో యథా సర్వలోకస్య చక్షుః
నలిప్యతే చాక్షుషై ర్బాహ్యదోషైః,
ఏక స్తథా సర్వభూతా న్తరాత్మా
న లిప్యతే లోకదుఃఖేన బాహ్యః.

పద. సూర్యః యథా సర్వలోకస్య చక్షుః న లిప్యతే చాక్షుషైః బాహ్యదోషైః, ఏకః తథా సర్వభూతాన్తరాత్మా న లిప్యతే లోకదుఃఖేన బాహ్యః.

టీక. సూర్యః=సూర్యుఁడు, సర్వలోకస్య = సకలప్రాణులకు, చక్షుః = నేత్రభూతుఁడైనను, చాక్షుషైః = నేత్రసంబంధములయిన, బాహ్యదోషైః = అశుచ్యాది పదార్థదర్శనసంబంధములగు బాహ్యదోషములచేత, యథా = ఏవిధముగా, నలిప్యతే=తాఁకఁబడఁడో, తథా = అదేవిధముగా, ఏకః=ఒక్కఁడగు, సర్వభూతాంతరాత్మా=సర్వభూతములం దంతరాత్మస్వరూపమున నుండు పురుషుఁడు, లోకదుఃఖేన = లోకసంబంధమయిన దుఃఖము చేత, నలిప్యతే = స్పృశింపఁబడఁడు. (సః=అదుఃఖము) బాహ్యః = వెలుపలిది (బ్రహ్మమునకు సంబంధించినది కాదనుట.)

తా. సూర్యుఁడు ప్రాణిసమూహముయొక్క చక్షురింద్రియమునకు దర్శనోపకారము నొనర్చుచున్నవాఁడయి అపవిత్రపదార్థములగు మూత్రపురీషాదులనుకూడ గాంచుచున్నను అశుచ్యాదిదర్శననిమిత్త దోషములచేత నెటులతాఁకబడుటలేదో అదేవిధముఁగా ఒక్కఁడయిన ఆత్మ సర్వభూతాంతర్వర్తియైనను లోకదుఃఖముచేత స్పృశింపఁబడుటలేదు. ఈలోకదుఃఖము

బాహ్యముగాని ఆత్మకు సంబంధించినదికాదు. లోకమునందుగల ప్రాణిసమూహము అవిద్యావిమోహితమయి కామకర్మోద్భవమగు దుఃఖమును తనయందారోపించుకొని దుఃఖించుచున్నది. నిజముగా పరమాత్మకు దుఃఖమనునది లేదు. రజ్జువునందు సర్పమున్నూ, ముత్తెపుచిప్పయందు వెండియున్నూ, మరుమరీచికలందు ఉదకమున్నూ, ఆకాశమునందు కమలమున్నూ వాస్తవముగా లేకపోయినప్పటికిన్నీ అవిద్యానిమిత్తమయిన విపరీతబుద్ధిచేత ఆయాసర్పాదికమున్నటుల అజ్ఞులచేత భావింపఁబడుచున్నది. ఆవిపరీత బుద్ధ్యధ్యస్తములయిన సర్పాదులచేత రజ్జ్వాదికములకు సంభవించిన దోషమేమియుం లేదు. సర్పాద్యధ్యాసము బాహ్యమేగాని రజ్జ్వాదినిష్ఠముగాదు. అదేవిధముగా నిర్వికారుఁడును నిర్మలుఁడును అగుఆత్మయందు అజ్ఞానవిమోహితమగు లోకమంతయుం క్రియాకారక ఫలాత్మకమును సర్పాదిస్థానీయమును అగువిజ్ఞానమును, విపరీతముగ తన్నిమిత్తముగా జన్మజరామరణాది దుఃఖమును అనుభవించుచున్నది. ఆత్మ సర్వలోకములకు స్వరూపభూతుఁడయినను విపరీతాధ్యారోపనిమిత్తమగు లోకదుఃఖముచేత స్పృశింపఁబడఁడు. ఏలయనఁగా ఈలోకదుఃఖము బాహ్యమేగాని ఆత్మసంబంధముకాదు. రజ్జ్వాదికమునందు విపరీతబుద్ధిచేత కల్పితమయిన సర్పాదికము రజ్జుసంబంధముగాక రజ్జువుకంటె బాహ్యమెటుల యగుచున్నదో అట్లే లోకదుఃఖము బాహ్యమేగాని ఆత్మకు సంబంధించినదికాదు.

౨-వ అధ్యా, ౨-వ వల్లి, ౧౨-వ మంత్రము.

మూ. ఏకో వశీ సర్వభూతాన్తరాత్మా
ఏకం రూపం బహుధా యః కరోతి,
తమాత్మస్థం యే ఽనుపశ్యన్తి ధీరా
స్తేషాం సుఖం శాశ్వతం నేతరేషామ్.

౧౨. ఏకః వశీ సర్వభూతాన్తరాత్మా ఏకం రూపం బహుధా యః కరోతి, తం ఆత్మస్థం యే అనుపశ్యంతి ధీరాః తేషాం సుఖం శాశ్వతం న ఇతరేషామ్.

టీక. ఏకః = (తనకంటె అల్పుఁడును, అధికుఁడును, తనతో సమానుఁడును అగువాఁడు) మఱియొకఁడు లేనివాఁడును, వశీ=సర్వజగత్తు స్వాధీనముగాఁ గలవాఁడును, సర్వభూతాంతరాత్మా = సర్వభూతములకు అంతరాత్మస్వరూపుఁడును (అగు) యః=ఏయాత్మ, ఏకంరూపం=శుద్ధవిజ్ఞానఘనరూపుని, బహుధా = అనేకవిధములుగలవానినిగా, కరోతి = చేయుచున్నాఁడో, యే ధీరాః=ఏవిద్వాంసులు, ఆత్మస్థం = స్వశరీరహృదయాకాశాంతర్గతమగు, బుద్ధిగుహాయందున్న, తం=ఆయాత్మను, అనుపశ్యంతి = చూచుచున్నారో, తేషాం =వారికే, శాశ్వతం సుఖం=శాశ్వతమయిన సుఖము, ఇతరేషాం = ఇతరులకు, న=అట్టిసుఖము లేదు.

తా. ఆపరమేశ్వరుఁడు సర్వగతుఁడు, స్వతంత్రుఁడు, అతనికి సముఁడుగాని అతనికంటె అధికుఁడుగాని అల్పుఁడుగాని మఱియొకఁడు లేఁడు. అతని యధీనమునందే సకలజగత్తు గలదు. ఏలయనఁగా అతఁడు సర్వభూతములకు అంతరాత్మభూతుఁడగుటచేత, అతఁడు తాను విశుద్ధవిజ్ఞానఘనస్వరూపముతో అద్వితీయుఁడైనను నామరూపాద్యశుద్ధోపాధిసంబంధముచేత అనేకప్రకారములుగా నొనర్చుచున్నాఁడు. ఇటుల అతఁడొనర్చుట తనయొక్క అచింత్యమహిమచేతనేగాని సాధనాంతరసహాయముచేత మాత్రముగాదు. స్వశరీరహృదయాకాశము నందుండువానిని - అనఁగా బుద్ధియందు చైతన్యాకారముతో వెలయుచువానిని, ఆత్మ ఆకాశమువలె అమూర్తగుణము గలవాఁడగుటచేత ఆత్మకు శరీరము ఆధారమనిచెప్పుట యుక్తముకాదుగదా. ఇందులకు దృష్టాంతము 'ఆదర్శస్థం ముఖం' అనఁగా అద్దమునందు ముఖమున్నది. అట్టియీయాత్మను ధీరులయినఏవిద్వాంసులు బాహ్యవిషయములనుండి విముఖములయిన ఇంద్రియవృత్తులుగలవారలయి ఆచార్య, శాస్త్రోపదేశ,

స్వానుభవములతోఁ గాంచుచున్నారో, ఈశ్వరతుల్యులగు అట్టివిద్వాంసులకు వారికే శాశ్వతసుఖము—అనఁగా ఆత్మానందలక్షణమగు సుఖము కలుగునుగాని తదితరులకు అనఁగా బాహ్యవిషయాసక్తబుద్ధులగు అవివేకులకు శాశ్వతసుఖము స్వాత్మభూతమయినప్పటికిన్ని అవిద్యా వ్యవధానమువలన కలుగఁజాలదు.

౨-వ అధ్యా, ౨-వ వల్లి, ౧౩-వ మంత్రము.

మూ. నిత్యోఽనిత్యానాం చేతనశ్చేతనానా
మేకో బహూనాం యో విదధాతి కామాన్,
త మాత్మస్థం యేఽను పశ్యన్తి ధీరా
స్తేషాం శాన్తి శ్శాశ్వతీ నే తరేషామ్. ౧౩

పద. నిత్యః నిత్యానాం చేతనః చేతనానాం ఏకః బహూనాం యః విదధాతి కామాన్, తం ఆత్మస్థం యే అనుపశ్యన్తి ధీరాః తేషాం శాన్తిః శాశ్వతీ న ఇతరేషామ్. ౧౩

టీక. ఏకః=ఒక్కఁడగు, యః=ఏపరమేశ్వరుఁడు, బహూనాం = అనేకులకు, కామాన్ = (వారివారి కర్మలకు తగిన) ఫలములను, విదధాతి = ఇచ్చుచున్నాఁడో, సః = ఆపరమేశ్వరుఁడు, నిత్యానాం = అవినాశులయిన వానిలోపల, నిత్యః=నిత్యమైనటువంటివాఁడు, చేతనానాం=చైతన్యముగల బ్రహ్మాదిస్తంబపర్యంతము గలప్రాణులలోపల, చేతనః = చేతనస్వరూపుఁడు. ఆత్మస్థం= ఆత్మ యనఁగా స్వశరీర హృదయాకాశాంతరస్థబుద్ధిగుహాయందు అభివ్యక్తిగల, తం = ఆయాత్మను, యేధీరాః = ఏవిద్వాంసులు, అనుపశ్యంతి=చూచుచున్నారో, తేషాం = అట్టివారికే, శాశ్వతీశాంతిః = నిత్యమయిన శాంతిసుఖము, ఇతరేషాం = తద్భిన్నులయినవారికి, న = అట్టి శాశ్వతమయినశాంతిసుఖములేదు.

తా. ఆపరమేశ్వరుఁడు వినాశరహితములగు పదార్థములలోపల నిత్యుఁడు, చైతన్యముగల బ్రహ్మాదిప్రాణులకు చేతనభూతుఁడు. అగ్నిభిన్నములగు ఉద

కాదికములకు ఉష్ణత్వము, అగ్నినిమిత్తము అని ఎట్లుసిద్ధించుచున్నదో అట్లే బ్రహ్మావిభిన్నము లగుపదార్థములకు చైతన్యత్వము ఆత్మచైతన్యనిమిత్తమేయని యెఱుంగవలయును. ఆపరమేశ్వరుఁడు, సర్వజ్ఞుఁడు, సర్వేశ్వరుఁడు. అతఁడు తానొక్కఁడే యయ్యును అనేకులగు సంసారులకు వారివారి కర్మలకుతగినఫలమును - స్వానుగ్రహనిమిత్తమయినదానిని అనాయాసముగా ఇచ్చుచుండును. హృదయాకాశాంతస్థుఁడగు అట్టియాత్మను ఏవిద్వాంసులు స్వానుభవపూర్వకముగ గురుశాస్త్రోపదేశసహాయమున నెఱుంగుదురో అట్టివారికే శాశ్వతానందముగాని తద్భిన్నులకు శాశ్వతానందము లేదని భావము.

౨-వ అధ్యా, ౨-వ వల్లి, ౧౪-వ మంత్రము.

మూ. తదేతదితి మన్యన్తే ఽనిర్దేశ్యం పరమం సుఖం,
కథన్ను తద్విజానీయాం కిము భాతి విభాతి వా.

పద. తత్ ఏతత్ ఇతి మన్యన్తే అనిర్దేశ్యం పరమం సుఖం, కథం ను తత్ విజానీయాం కిం ఉ భాతి విభాతి వా.

టీక. అనిర్దేశ్యం=ఇట్టిదని నిర్ణయించిచెప్పుటకు శక్యముకాని, పరమం=శ్రేష్ఠమయిన, సుఖం=సుఖమనునది ఎయ్యదిగలదో, తత్=ఆసుఖము, ఏతత్ ఇతి=ఇయ్యది అని, మన్యంతే = (బ్రహ్మవేత్తలు) తలంచుచున్నారు. తత్ = అది, భాతివాకిము = ప్రకాశించుచున్నదా? విభాతివాకిము = అస్మదాది బుద్ధిగోచరముగా స్పష్టముగా ప్రకాశించుచున్నదా? (అనువిషయము:ను) కథంను=ఏప్రకారముగా, విజానీయాం=నేను తెలిసికొనఁగలను ?

తా. ఈయాత్మవిజ్ఞానమను సుఖము ఇట్టిదని నిర్ణయించిచెప్పుటకు శక్యమయినదికాదు, మఱియు మిక్కిలిశ్రేష్ఠమయినది. ఇది ప్రాకృతపురుషులకు అవాఙ్మానసగోచరమైనను బాహ్యవిషయములనుండి మఱలింపఁబడిన ఇంద్రియవృత్తులు గలవారగుటచేత ఈషణాత్రయవివర్జితులయిన బ్రహ్మవేత్తలకుమాత్రము కరతలామలకమువలె ప్రత్యక్షముగ గోచరీభూతమగు

చున్నది. అట్టి నిరతిశయసుఖమును నేనెట్లుపొందఁగలను? అనఁగా ఈషణాత్రయవిరహితులగు బ్రహ్మవేత్తలు అట్టి శాశ్వతసుఖము ఇట్టిదని స్వానుభవపూర్వకముగా నెట్లెఱింగిరో అట్టి స్వాత్మానుభవము నాకెట్లు ప్రాప్తించును? ప్రకాశాత్మకమగుటచేత అది ప్రకాశించుచునే యుండుట సహజమేగాని అయ్యది సాధారణుఁడనగు నాయొక్కబుద్ధికి గోచరమగునది ఎట్లు? లేక నావంటివానిబుద్ధికి ప్రకాశింపదా?

౨-వ అధ్యా, ౨-వ వల్లి, ౧౫-వ మంత్రము.

అవ:—వెనుకయడిగినప్రశ్నమునకు 'భాతి, విభాతిచ' యని ఉత్తరము చెప్పఁబడుచున్నది. ఎట్లనఁగా:—

మూ. న తత్ర సూర్యో భాతి న చన్ద్రతారకం
నేమా విద్యుతో భాన్తి కుతో ఽయమగ్నిః,
తమేవ భాన్తమనుభాతి సర్వం
తస్య భాసా సర్వమిదం విభాతి.

పద. న తత్ర సూర్యః భాతి న చన్ద్రతారకం న ఇమాః విద్యుతః భాన్తి కుతః అయం అగ్నిః, తం ఏవ భాన్తం అనుభాతి సర్వం తస్య భాసా సర్వం ఇదం విభాతి.

కాఠకోపనిషత్తు ద్వితీయాధ్యాయమునందు
ద్వితీయవల్లి సమాప్తము.

టీక. తత్ర = స్వాత్మభూతమగు అపరబ్రహ్మమునందు, సూర్యః = సూర్యుఁడు, న భాతి=ప్రకాశించుటలేదు. చంద్రతారకం=చంద్రుఁడు నక్షత్రములు, నభాతి=ప్రకాశించుటలేదు. ఇమాః విద్యుతః=ఈమెరుపులు, నభాంతి=ప్రకాశించుటలేదు. అయం అగ్నిః=ఈయగ్ని, కుతః = ఎట్లు ప్రకాశించును? సర్వం=సూర్యచంద్రాగ్న్యాది సర్వతేజస్సు, భాంతం = ప్రకాశించుచున్న, తం ఏవ = అపరబ్రహ్మమునే, అనుభాతి = అనుసరించి ప్రకాశించుచున్నది. తస్య

భాసా=ఆబ్రహ్మముయొక్క కాంతిచేతనే, ఇదంసర్వం=ఈసూర్యచంద్రాది తేజస్సమూహమంతయు, విభాతి=మిక్కుటముగ ప్రకాశించుచున్నది.

తా. ఓగౌతమా! స్వాత్మభూతుఁడగు ఆబ్రహ్మమునందు ప్రపంచమునందుగల సకలపదార్థములను ప్రకాశింపఁజేయు సామర్థ్యముగల సూర్యుఁడు ప్రకాశించుటలేదు. అనఁగా బ్రహ్మమును సూర్యుఁడు ప్రకాశింపఁజేయఁజాలఁడు. అదేవిధముగా చంద్రుఁడుగాని. నక్షత్రములుగాని, మెరుపులుగాని ఆత్మను ప్రకాశింపఁజేయఁజాలవు. ఇఁక మనదృష్టిగోచరమునందున్న అగ్ని ఎట్లు ప్రకాశింపఁజేయఁగలఁడు? విశేషించిచెప్పుటవలన ప్రయోజనమేమిగాని సూర్యచంద్ర నక్షత్రాదికమెయ్యది ప్రకాశించుచున్నటుల మనకు గోచరమగుచున్నదో అయ్యది ఆపరమేశ్వరుని అనుసరించియే ప్రకాశించుచున్నది. ఆపరమేశ్వరుని ప్రకాశముచేతనే సూర్యాదితేజస్సమూహము ప్రకాశించుచున్నది. కావుననే ఆబ్రహ్మము 'భాతి విభాతి' అని చెప్పఁబడుచున్నది. అనఁగా కార్యగతమయిన వివిధప్రకాశముచేత బ్రహ్మముయొక్క ప్రకాశరూపత్వము స్వయముగా తెలియఁబడుచున్నది. తనకు స్వయముగా ప్రకాశించు సామర్థ్యములేనివాఁడు ఇతరునకు ప్రకాశమునొసంగుటకు సాధ్యముకాదుగదా. లోకమునందుకూడ ప్రకాశనస్వరూపములగు ఆదిత్యాదులకు భాసనరూపము గనంబడుచున్నదిగాని ఘటాదికమునకు అన్యావభాసకత్వము గనంబడుటలేదు.

ఆంధ్రటీకాతాత్పర్యవివరణసహితమగు కాఠకోపనిషత్తునందు

ద్వితీయాధ్యాయమునందు ద్వితీయవల్లి సమాప్తము.

ప్రథమాదిపరిగణనము చేత పంచమవల్లి సమాప్తము.

ఈవల్లికిసంబంధించిన వివరణగ్రంథభాగము

అనుభూతిప్రకాశము-౧౧వ అధ్యాయము. శ్లో. ౭౦-౯౪.

ఆత్మపురాణము-౯వ అధ్యాయము. శ్లోకము. ౬౫౦-౭౪౩.

శ్రీగురుభ్యోనమః.

# కఠోపనిషత్తు

## ద్వితీయాధ్యాయము—తృతీయవల్లి.

---

(ప్రథమాదిపరిగణనముచేత షష్ఠవల్లి.)

౨-వ అధ్యా, 3-వ వల్లి, ౧-వ మంత్రము.

అవ. బూరగచెట్టు మున్నగు వృక్షజాతముయొక్క తూలమును-దూది పింజను చూచి తద్వృక్షబీజము నేత్రేంద్రియగోచరము కాకపోయినను ఆవృక్షమునకు బీజమున్నదని లోకమునందు లోకులెట్లు నిర్ణయించుకొనుచున్నారో అదేవిధముగా సంసారకార్య వృత్త్యావధారణముచేత తత్సంసారమునకు మూలమయిన బ్రహ్మముయొక్కస్వరూపమును నిర్ణయించుతలంపుతో నీయాఱవవల్లి ప్రారంభింపఁ బడుచున్నది:—

మూ. ఊర్ధ్వమూలో అవాక్ శాఖ ఏషో ఽశ్వత్థ స్సనాతనః,
తదేవ శుక్రం తద్బ్రహ్మ తదేవామృతముచ్యతే.
తస్మిఁల్లోకా శ్శ్రితా స్సర్వే తదు నాత్యేతి కశ్చన.
ఏత ద్వై తత్.

పద. ఊర్ధ్వమూలః అవాక్ శాఖః ఏషః అశ్వత్థః సనాతనః, తత్ ఏవ శుక్రం తత్ బ్రహ్మ తత్ ఏవ అమృతం ఉచ్యతే, తస్మిన్ లోకాః శ్రితాః సర్వే తత్ ఉ న అత్యేతి కః చ న, ఏతత్ వై తత్. ౧

టీ. ఊర్ధ్వమూలః = సర్వశ్రేష్ఠమయినబ్రహ్మమే మూలముగాఁ గలిగినట్టియు, అవాక్ శాఖః = స్వర్గనరకాదులను అడ్డముగా వ్యాపించినశాఖలుగల

దియు, ఏషః=ఈ, అశ్వత్థః = సంసారమను అశ్వత్థవృక్షము, (న శ్వః అపి స్థాస్యతీతి-అశ్వత్థః=రేపునిలుచుట యనునది లేదు కావున అశ్వత్థమనంబడును.) తత్ ఏవ = ఆసంసారాశ్వత్థవృక్షమునకు మూలమయినదియే, శుక్రం = పరిశుద్ధము, తత్ ఏవ=అదియే, బ్రహ్మ=బ్రహ్మము, తత్ ఏవ = అయ్యదియే, అమృతం=అమృతము (అని), ఉచ్యతే=చెప్పఁబడుచున్నది. తస్మిన్=ఆసంసారాశ్వత్థవృక్షమునకు మూలమయిన బ్రహ్మమునందే, సర్వేలోకాః = లోకములన్నియు, శ్రితాః=ఆశ్రయించియున్నవి. కశ్చన=ఒక్కటియు, తత్=దానిని, న అత్యేతి ఉ=అతిక్రమింపఁజాలదు. ఏతత్=ఇదియే, తత్=ఆ నీవడిగిన బ్రహ్మము.

తా. అవ్యక్తాదిస్థావరాంతమగు సంసారమను అశ్వత్థవృక్షము ఊర్ధ్వమూలము. ఊర్ధ్వమనఁగా 'తద్విష్ణోః పరమం పదం' అని ప్రతిపాదింపఁబడిన బ్రహ్మమే మూలముగాఁగలది. జ్ఞానఖడ్గము చేత ఛేదింపఁదగినదగుటచేత వృక్షత్వమిట యుక్తమే యగుచున్నది. ఈసంసారమును అశ్వత్థవృక్షముతోఁ బోల్చుటకు మఱికొన్ని హేతువులుఁగూడఁగలవు. ఆ హేతువు లివి:—

జన్మ జరా మరణ శోకాద్యనేకానర్థ పరంపరలతో సర్వదా గూడికొనియుండునది క్షణక్షణమునకు మారుచుండు స్వభావముకలది, ఇంద్రజాలము, ఎండమావులనీరు, గంధర్వనగరము మున్నగువానివలె కనంబడుచున్నటుల తోఁచి నశించిపోవునది, చివరకు వృక్షమువలె అభావాత్మకము, కదళీస్తంభము, (అరటిచెట్టు)వలె సారవిహీనము, వేలకొలదిగానుండు పాషండులయినవారిచేత స్వస్వబుద్ధ్యనుసారము నిర్ణీతమగుచున్నదియు, తత్త్వజిజ్ఞాసువు లగు వారలకుఁగూడ ఇట్టిదని నిర్ణయించుటకు వీలుకానిదియు, వేదాంతము (ఉపనిషత్తు) లందు నిర్ధారితమయిన బ్రహ్మమే మూలసారముగాఁగలదియు, అవిద్యా కామబీజా వ్యక్తబీజముచేత పుట్టినదియు, అపరబ్రహ్మ (విజ్ఞానక్రియాశక్తి ద్వయాత్మకుఁడగు హిరణ్యగర్భుఁడు) అంకురముగాఁగలదియు, సర్వప్రాణుల లింగశరీరములే స్కంధములుగాఁగలదియు, తృష్ణయను నీరుపోసి పెంచుటచేత ఎదుపుగా పెఱుగుచున్నదియు, బుద్ధీంద్రియవిషయ

ములను చిగురుటాకులుగలదియు, శ్రుతిస్మృతి న్యాయవిద్యోపదేశములను ఆకులుగలదియు, యజ్ఞము దానము తపస్సు మున్నగు అనేకసత్క్రియలే పుష్పములుగాఁగలదియు, సుఖదుఃఖసంవేదనలు రసముగాఁగలదియు, ప్రాణ్యుప జీవ్యంత ఫలములుగలదియు, ఆప్రాణులయొక్క తృష్ణయను నీరుపోయుటచేత బాగుగా ఎదిగి వెనవేసికొని బిగిసిపోయిన కర్మవాసనాదికములను అవాంతర మూలములుగలదియు, సత్యనామాది సప్తలోకములును, బ్రహ్మాదిభూతగణము అనియెడి పక్షిసమూహములకు నివాసభూతమయినదియు, ఆయా ప్రాణిజాత ములు సుఖదుఃఖానుభవసమయములందు చేసెడి హర్షశోక జాత నృత్యగీత వాదిత్ర క్ష్వేళితా స్ఫోటిత హసితాకృష్ట రుదితహాహా ముంచ ముంచేత్యాద్యనేక విధశబ్దకృత తుములీభూతమహారావముగలదియు, (అనఁగా సంతోషమువచ్చి నప్పుడు సంతోషసూచకముగ నృత్యగీతాద్యాడంబరములు, దుఃఖము సంభ వించినప్పుడు 'హహ్యో మెట్టో' యని దుఃఖించి ఏడ్చుచుండుట మున్నగునవి) ఉపనిషత్ప్రతిపాదితమగు బ్రహ్మాత్మదర్శనమను .అసంగశస్త్రముచేత తెగనఱుక బడఁదగినదియునై ఈసంసారాశ్వత్థవృక్షము వెలయుచున్నది. ఈసంసారమే అశ్వత్థవృక్షముగా నిట నిరూపింపఁబడినది. ఈసంసారమను అశ్వత్థవృక్షము కామకర్మలను గాలిచేత కంపితమయి నిత్యప్రచలిత స్వభావమైయున్నది. స్వర్గనరకతిర్యక్ప్రేతాదులను శాఖోపశాఖలు కలిగియున్నది. సనాతనము— అనఁగా అనాదియగుటచేత చిరప్రవృత్తమయినది. ఇట్టి యీసంసారవృక్షము నకు మూలమేయ్యదియో అదే శుద్ధమయినది. చైతన్యాత్మజ్యోతిస్వభావ మయినది. అదియే అన్నిటికంటె మహత్తైనదగుటవలన బ్రహ్మమని చెప్పఁబడు చున్నది. అదియే అవినాశిస్వభావము కలదియగుటచేత అమృతమని చెప్పఁ బడుచున్నది. 'వాచాఽఽరంభణం వికారో నామధేయ మనృత మన్యదతో మర్త్యం' అను శ్రుతిననుసరించి పరమార్థసత్యభూతుఁడగు బ్రహ్మమునందు లోకములు గంధర్వనగర, మరుమరీచ్యుదక, మాయాసమములయి పరమార్థ దర్శనము లేకపోవుటచేత ఉత్పత్తిస్థితిలయములు గలవానివలెఁ గనంబడు

చుండును. ఘటాదికార్యము మృదాదికారణమును అతిక్రమించి యెటుల యుండఁజాలదో అదేవిధముగ ఒక్కటి అయినను ఆబ్రహ్మము నతిక్రమించి యుండఁజాలదు. ఈబ్రహ్మమునే నీవు తెలుసుకొనవలయునని నన్నడిగి నాఁడవు.

వివరణము:—భగవద్గీత సర్వోపనిషత్సార భూతమయినను కఠోప నిషత్తునకు చాలసన్నిహితసంబంధము కలిగియున్నది. ఈయుపనిషత్తునందుఁగల చాలమంత్రము లున్నవిఉన్నట్లే భగవద్గీతయందు మఱల పఠింపఁబడియున్నవి. భగవద్గీతయొక్క ౧౮ అధ్యాయములలో 'పురుషోత్తమప్రాప్తియోగము' అను పేరుగల ౧౫-వ అధ్యాయము చాలగౌరవము కలిగియున్నది. ౧౮ అధ్యాయములు పారాయణముచేయుటకు అవకాశములేనివారి ౧౫-వ అధ్యాయమునైనను తప్పక పారాయణము చేయుదురు. ఈ 'ఊర్ధ్వమూలోఽవాక్శాఖ' అను మంత్రముయొక్క వివరణము భగవద్గీత ౧౫-వ అధ్యాయమునందు మొదటి నాలుగుశ్లోకములం దిట్లు గలదు:—

శ్రీ భగవానువాచ:—

శ్లో. ఊర్ధ్వమూలమధశ్శాఖ మశ్వత్థం ప్రాహురవ్యయం,
ఛందాంసి యస్య పర్ణాని యస్తం వేద స వేదవిత్. ౧.
అధశ్చోర్ధ్వం ప్రసృతాస్తస్య శాఖా గుణప్రవృద్ధా విషయప్రవాలాః,
అధశ్చమూలా న్యనుసంతతాని కర్మానుబంధీని మనుష్యలోకే. ౨.
న రూపమస్యేహ తథోపలభ్యతే నాంతో న చాదిర్నచ సంప్రతిష్ఠా,
అశ్వత్థమేనం సువిరూఢమూలమసంగశస్త్రేణ దృఢేన ఛిత్వా. 3
తతః పదం తత్పరిమార్గితవ్యం యస్మిన్గతా న నివర్తంతి భూయః,
తమేవ చాద్యం పురుషం ప్రపద్యే యతః ప్రవృత్తిః ప్రసృతా పురాణీ. ౪
నిర్మానమోహా జితసంగదోషా
అధ్యాత్మదృష్ట్యా వినివృత్తకామాః,

ద్వంద్వై ర్విముక్తా స్సుఖ దుఃఖ సంజ్ఞై
ర్గచ్ఛంత్యమూఢాః పద మవ్యయం తత్. ౫

భగవద్గీత. ౧౫-వ అధ్యాయము.

శ్రీమచ్ఛంకరభగవత్పాదాచార్యులవారు ఈ మంత్రభాష్యమునందు ఈగీతాశ్లోకములయొక్క అర్థమునుకూడ చాలవఱకు అనువదించియున్నారు. భగవద్గీతాభాష్యమునం దిట్లు వ్రాసియున్నారు:—

పురాణేచ—

శ్లో. అవ్యక్త మూల ప్రభవస్తస్యైవానుగ్రహోత్థితః,
బుద్ధిస్కంధమయశ్చైవ ఇంద్రియాంతర కోటరః.
మహాభూత విశాఖశ్చ విషయైః పత్రవాంస్తథా,
ధర్మాధర్మ సుపుష్పశ్చ సుఖదుఃఖ ఫలోదయః.
ఆజీవ్య స్సర్వభూతానాం బ్రహ్మవృక్ష స్సనాతనః,
ఏతద్బ్రహ్మవనం చైవ బ్రహ్మా చరతి నిత్యశః.
ఏతచ్ఛిత్వా చ భిత్వా చ జ్ఞానేన పరమాసినా,
తత శ్చాత్మరతిం ప్రాప్య యస్మాన్నావర్తతే పునః. ఇత్యాది.

వేదాంతముక్తావళి యనుపేరుతో శ్రీ బెల్లంకొండ రామారాయ కవీంద్రులవారొనర్చిన శ్లోకరూపమగు ఉపనిషద్వివరణ గ్రంథమునందు కఠోపనిషద్వివరణము శ్లో. ౧౮—౫౯ లందుఁ గలదు. అం దీమంత్రార్థము భాష్యగత వివరణముతోడ చేర్చి లలితమయిన శైలియందు మననయోగ్యముగ గ్రథిత మయినది. పాఠకులకు హృదయంగమముగ నుండునను తలంపుతో ఏతన్మంత్రార్థమును ప్రతిపాదించిన శ్లోకద్వయము నుదహరించుచున్నాఁడను:—

శ్లో. మాయాబీజభవ స్స ఏవ మహాంబుకలితో బ్రహ్మాంకురః ప్రాణభృ
ల్లింగస్కంధధరః స్స్వరాదిమ తనూశాఖ స్త్రయీపత్రభృత్,

సై కాత్మా విషయ ప్రవాళకలితో యజ్ఞాదిపుష్ప స్సుకై
ర్దుఃఖై శ్చాపి ఫలై ర్యుతో ఒఖిల జగన్నీడశ్చ భూతాండజః. ४२
నానాశబ్ద సమాగమాతి తుములధ్వానశ్చ కర్మానిలై
ర్నున్న శ్చంచల ఏష సంసృతిమహీజో ఒస్తేహ్యాభావాత్మకః,
సమ్యక్ జ్ఞానమయాసినా సుకరణీయో చ్ఛేద ఏతస్య త
స్మూలం బ్రహ్మ సదేవ శుక్రమమృతం మిత్యేష మర్త్యః పురః. ४ః

౨-వ అధ్యా, ౩-వ వల్లి, ౨-వ మంత్రము.

మూ. యదిదం కిం చ జగత్సర్వం
ప్రాణ ఏజతి నిస్సృతం,
మహద్భయం వజ్రముద్యతం
య ఏత ద్విదు రమృతా స్తే భవన్తి. ౨

పద. యత్ ఇదం కించ జగత్ సర్వం ప్రాణే ఏజతి నిస్సృతమ్, మహా-ద్భయం వజ్రం ఉద్యతం యే ఏతత్ విదుః అమృతాః తే భవన్తి.

టీక. యత్కించ=స్వల్పమగు, ఇదం=ఈ, సర్వంజగత్=జగత్తంతయు, ప్రాణే=పరమాత్మయందే, నిస్సృతం=బయలువెడలినది. ఏజతి = ఆబ్రహ్మమును గాంచి భయంపడుచున్నది. (ఆబ్రహ్మము,) ఉద్యతం వజ్రం=వజ్రాయుధమును ఎత్తి చేతియందు ధరించినవాని(వలె), మహత్ భయం=గొప్పభయమునుకలుగc జేయుచున్నది. యే=ఎవ్వరు? ఏతత్ = దీనిని, విదుః = తెలిసికొనుచున్నారో (తే=వారు), అమృతాః=మరణరహితులు, భవంతి=అగుచున్నారు.

తా. "ఏబ్రహ్మము నెఱుంగుటవలన అమృతత్వమును పొందుచున్నా రని చెప్పcబడియున్నదో అట్టి జగత్తునకు మూలమయిన బ్రహ్మమనునది లేనే లేదు, ఈ ప్రపంచము అసత్తునుండియే పుట్టుచున్నది" అని వాదించువారిపక్షము అప్రామాణికమని నిరసించి జగన్మూలము బ్రహ్మమనువిషయ మీమంత్రమునందు

స్థాపింపఁబడుచున్నది. దృగ్గోచరమగు బ్రహ్మాదిస్థావరాంతమగు నీప్రపంచ మంతయుం ఆపరబ్రహ్మముచేత సృష్టమయి ఆపరమేశ్వరుని యస్తిత్వము ననుస రించియే స్థితికలిగి వెలయుచున్నది. ఆపరమేశ్వరునియాజ్ఞకు భయంపడియే నియమముగ నడచుచున్నది. కావుననే జగదుత్పత్తి స్థితిలయములకు కారణ మగు బ్రహ్మము వజ్రధారియగు ప్రభువు సేవకులకువలె జగత్తునకంతయుం భయ కారణము—అనఁగా వజ్రధరుఁడయిన ప్రభువును గాంచి సేవకులు సభయులయి తదాజ్ఞ నెటుల నియమముగనిర్వర్తించెదరో అదేవిధముగా సూర్యచంద్రగ్రహ నక్షత్రతారకాది సమన్వితమగు జగత్తు ఈశ్వరాధిష్ఠిత మగుటచేతనే నియమ ముగా క్షణకాలమయినను విశ్రాంతిలేక తమతమ కృత్యజాతమును నిర్వహించు చున్నది. ప్రపంచమునకంతయుం ఇటుల సాక్షిభూతమయిన బ్రహ్మము అనునది ఒక్కటికలదను విషయము నెఱింగినవారలు అమృతులు. అనఁగా మోక్షము నందినవార లగుచున్నారు.

౨-వ అధ్యా, 3-వ వల్లి, 3-వ మంత్రము.

అవ. పరమేశ్వరుని భయమువలన జగత్తెటుల ప్రవర్తించుచున్నది చెప్పఁబడుచున్నది:—

మూ. భయాదస్యాగ్ని స్తపతి భయాత్తపతి సూర్యః,
భయా దిన్ద్రశ్చ వాయుశ్చ మృత్యుర్ధావతి పఞ్చమః.

పద. భయాత్ అస్య అగ్నిః తపతి భయాత్ తపతి సూర్యః,భయాత్ ఇన్ద్రః చ వాయుః చ మృత్యుః ధావతి పఞ్చమః. 3

టీక. అస్య=ఈపరమేశ్వరునియొక్క, భయాత్=భయమువలన, అగ్నిః =అగ్నిహోత్రుఁడు, తపతి=దహించుచున్నాఁడు. భయాత్=ఈపరమేశ్వరుని యొక్క భయమువల్లనుండియే, సూర్యః = సూర్యుఁడు, తపతి = ప్రకాశించు చున్నాఁడు. ఇంద్రశ్చ=ఇంద్రుఁడున్నూ, వాయుశ్చ = వాయువున్నూ, పంచ మః=ఐదవవాఁడగు, మృత్యుశ్చ = మృత్యువున్నూ, భయాత్ చ=ఈపరమేశ్వ

రునియొక్క భయమువల్లనుండియే, ధావతి=స్వస్వవ్యాపారనిర్వహణమునందు నియతముగ ప్రవర్తించుచున్నారు.

తా. ఓనచికేతుఁడా! ఆపరమేశ్వరునియొక్క భయమునుండియే అగ్ని ఆయాపదార్థములను దహించుచున్నాఁడు. సూర్యుఁడు తపించుచున్నాఁడు. ఇంద్రుఁడు దేవలోకమును పరిపాలించుచున్నాఁడు. వాయువు వీచుచున్నాఁడు. మృత్యువు శరీరధారులను వారివారి కాలనియత్యనంతరము యమలోకమును పొందించుచున్నాఁడు. సమర్థులయిన లోకపాలకులు తమకు పైన ప్రభువను వాఁడొకఁడు దండహస్తుఁడయియుండుటచేతనే తమకు తమకు విహితములయియున్న కృత్యములను సేవకులవలె భయంపడి నియతముగ నిర్వహించుచున్నారు కాని లేనియెడల జగత్ప్రవృత్తి నియతముగ నుండఁజాలదని భావము.

౨-వ అధ్యా, ౩-వ వల్లి, ౪-వ మంత్రము.

మూ. ఇహ చే దశకద్బోద్ధుం ప్రాక్ఛరీరస్య విస్రసః,
తత స్సర్గేషు లోకేషు శరీరత్వాయ కల్పతే. ౪

పద. ఇహ చేత్ అశకత్ బోద్ధుం ప్రాక్ శరీరస్య విస్రసః, తతః సర్గేషు లోకేషు శరీరత్వాయ కల్పతే. ౪

టీక. (తత్=అట్టిబ్రహ్మమును) శరీరస్య = దేహముయొక్క, విస్రసః ప్రాక్=పడిపోవుటకంటెముందు, ఇహ=ఈలోకమునందే, బోద్ధుం=తెలిసికొనుటకు, అశకత్ చేత్ = అసమర్థుఁడయినయెడల, సర్గేషు లోకేషు = పృథివ్యాదిలోకములందు, శరీరత్వాయ = శరీరభావముకొఱకు, కల్పతే = సమర్థుఁడగుచున్నాఁడు. (అనఁగా జన్మించుచున్నాఁడు.)

తా. అగ్ని, సూర్య, ఇంద్ర, వాయ్వాది సకలదేవతాసమూహమునకు భయకారణమయిన బ్రహ్మమును ఈశరీరము పడిపోవుటకంటె ముందే యీలోకమునందే తెలిసికొన్నయెడల అట్టివాఁడు సంసారబంధమునుండి విముక్తుఁ

జగును. అట్టిశరీరపాతమునకులోపల సకలదేవతలకుకూడ భయకారణమగు బ్రహ్మమును తెలిసికొననియెడల అట్టివాఁడు పృథివ్యాదిలోకములందు మఱల మఱల పుట్టుచుగిట్టుచు సంసారబంధమునందు తగుల్కొనును కావున పాంచ భౌతికమగు నీశరీరము పడిపోవుటకుముందే ఆత్మావబోధప్రయత్నము చేయఁ దగినదని భావము.

వివరణము:—సర్గములనఁగా పృథివ్యాదిలోకములని చెప్పఁబడినది. సర్గశబ్దమునకు వ్యుత్పత్తి భాష్యమునం దిట్లు చెప్పఁబడినది:—

'సృజ్యంతే యేషు స్రష్టవ్యాః ప్రాణిన ఇతి సర్గాః పృథివ్యాదయో లోకాః.'

అర్థ. వేనియందు సృజింపఁదగినట్టి ప్రాణులు సృజింపఁబడుచున్నారో అట్టి పృథివ్యాదిలోకములు సర్గములనంబడును.

౨-వ అధ్యా, 3-వ వల్లి, ౫-వ మంత్రము.

అవ. ఈభూలోకమునందే అద్దమునందు తనముఖము స్పష్టముగాఁ గనంబడినట్లు ఆత్మయొక్క దర్శనము సుకరముగాని బ్రహ్మలోకముకంటె విభిన్నములయిన దేవగంధర్వాది లోకములందు ఆత్మదర్శనము స్పష్టముగా కాదు. బ్రహ్మలోకమునందు ఆత్మదర్శనము సులభముగా సంభవించునుగాని అట్టిబ్రహ్మలోకము దుష్ప్రాపము అనువిషయ మీమంత్రమునందు చెప్పఁబడు చున్నది:—

మూ. యథాఽఽదర్శే తథాఽఽత్మని యథా
స్వప్నే తథా పితృలోకే,
యథాఽప్సుపరీవదదృశే తథా
గన్ధర్వలోకే ఛాయాఽఽతపయో రివ బ్రహ్మలోకే. ౫

పద. యథా ఆదర్శే తథా ఆత్మని యథా స్వప్నే తథా పితృలోకే, యథా అప్సు పరి ఇవ దదృశే తథా గన్ధర్వలోకే ఛాయాఽఽతపయోః ఇవ బ్రహ్మలోకే. ౫

టీక. యథా=ఏవిధముగా, ఆదర్శే = అద్దమునందు (తనప్రతిబింబము స్పష్టముగాఁ గనంబడుచున్నదో), తథా=అదేవిధముగా, ఆత్మని=నిర్మలమయిన తనబుద్ధియందు (ఈభూలోకమునందు ఆత్మదర్శనము సులభముగాఅగుచున్నది), యథా = ఏవిధముగా, స్వప్నే=స్వప్నమునందో (అనఁగా జాగ్రద్వాసనాను భూతమయిన పదార్థము స్వప్నమునందు ఏవిధముగా చూడఁబడుచున్నదో, తథా=అదేవిధముగా), పితృలోకే=పితృలోకమునందు (ఆత్మదర్శనము అస్పష్ట ముగఁ గనంబడుచున్నది), అప్సు = జలములందు, యథా = ఏవిధముగా (తన ప్రతిబింబము స్పష్టముగాని సంకీర్ణమయిన అవయవములుగలదిగా), పరిఇవ దృశ్యతే = అంతటచూడఁబడుచున్నదో, తథా=అదేవిధముగా, గంధర్వలోకే= గంధర్వలోకమునందు, పరిదృశ్యతే=చూడఁబడుచున్నది. బ్రహ్మలోకే=బ్రహ్మ లోకమునందు, ఛాయాఽఽతపయోః ఇవ = నీడయెండలయందువలె, (ఆత్మ దర్శనము స్పష్టముగాఁ గనంబడుచున్నది.)

తా. అద్దమునందు తనముఖముయొక్క ప్రతిబింబమును స్పష్టముగా జను లెట్లుచూచుచున్నారో అదేవిధముగా ఈభూలోకమునందు నిర్మలీభూత మయిన తనబుద్ధియందు సాధకుఁడగువాఁడు ఆత్మదర్శనమును స్పష్టముగాఁ గాంచును. జాగ్రద్వాసనోద్భూతమగు స్వప్నమునందు జాగ్రద్వాసనలను అస్పష్టముగ నెట్లు గాంచుచున్నాఁడో అట్లే పితృలోకమునందు ఆత్మదర్శ నము స్పష్టముగఁ గలుగజాలదు. ఏలయనఁగా పితృలోకమునందు జీవుఁడు కర్మఫలోపభోగాసక్తుఁ డయియుండును. నీటియందు తనముఖప్రతిబింబము స్పష్టముగాఁ దెలియక అవిభక్తావయవమయి యెట్లు గనంబడుచుండునో అట్లే గంధర్వలోకమునందుకూడ ఆత్మదర్శనము స్పష్టముగాఁ గలుగఁజాలదు. పితృ, గంధర్వాది లోకములందు ఆత్మదర్శన మిట్లుండునని శాస్త్రప్రమాణమువలన తెలియవచ్చుచున్నది. ఒక్కబ్రహ్మలోకమునందే ఛాయాఽఽతపములవలె బ్రహ్మదర్శనము స్పష్టముగాఁ గనంబడునుగాని అట్టిబ్రహ్మలోకము అతిశ్రేష్ఠ మయిన కర్మోపాసనాజ్ఞాన ఫలసాధ్యముగాని సామాన్యమయిన కర్మోపాసనల

చేత లభ్యముకాదు. కావున ఆత్మదర్శనార్థ మీజన్మమునందే ప్రయత్నవిశేషము నొనర్పవలయును.

వివరణము:—ఈమంత్రార్థమును శతాధికగ్రంథకర్తలును, సర్వతంత్రస్వతంత్రులును, హయగ్రీవపాదారవిందధ్యానతత్పరులును, బ్రహ్మణ్యులును అగు శ్రీబెల్లంకొండ రామారాయకవీంద్రులవారు వేదాంతముక్తావళియను పేర తామొనర్చిన ఉపనిషదర్థవివరణరూప శ్లోకరూపగ్రంథమునం దిట్లు ప్రతిపాదించియున్నారు:—

శ్లో. ఏతత్సాధ్వసకారణం కలయితుం ప్రాగ్దేహపాతాద్బుధ
శ్చేచ్ఛక్నోతి విముచ్యతే న యది హా సర్గేష్వధీ ర్జాయతే,
ఆదర్శే ముఖమీక్షతే హి పురుషః స్పష్టం న తోయే పున
స్తద్వ త్స్వానవజన్మని స్ఫుటతరం నాన్యత్ర సద్దర్శనమ్. ౫౧
వేదాంతముక్తావళి, పూర్వార్థము.

౨-వ అధ్యా, 3-వ వల్లి, ౬-వ మంత్రము.

అవ. ఆయాత్మ నెట్లెఱుంగవలయును, అతనిని తెలిసికొనుటవలన కలిగెడి ప్రయోజనమేమి? యను విషయము చెప్పఁబడుచున్నది.—

మూ. ఇన్ద్రియాణాం పృథగ్భావ
ముదయాస్తమయౌ చ యత్,
పృథగుత్పద్యమానానాం
మత్వా ధీరో న శోచతి,

పద. ఇన్ద్రియాణాం పృథగ్భావం ఉదయాస్తమయౌ చ యత్, పృథక్ ఉత్పద్యమానానాం మత్వా ధీరః న శోచతి. ౬

టీక. ధీరః=జ్ఞానియగువాఁడు, పృథక్ ఉత్పద్యమానానాం = వేఱుగా పుట్టియున్న, ఇంద్రియాణాం = ఇంద్రియములయొక్క, పృథగ్భావం=భిన్న

భావమును, ఉదయాస్తమయౌచ=ఉత్పత్తివినాశములను, మత్వా=తెలిసికొని, న శోచతి=దుఃఖింపఁడు.

తా. స్వస్వవిషయగ్రహణప్రయోజనార్థము స్వస్వకారణములగు ఆకాశాదికముచల్లనుండి వేఱుగా పుట్టింపఁబడిన శ్రోత్రాదీంద్రియములు అత్యంత విశుద్ధుఁడు చిన్మాత్రుఁడు కేవలుఁడు అగు ఆత్మకంటె వేఱయినవనియు, ఉత్పత్తి ప్రళయములు జాగ్రత్స్వప్నములు ఇంద్రియములకేగాని ఆత్మకులేవనియు వివేకముతో నెఱింగిన ధీరుఁడు శోకింపఁడు. నిత్యైకస్వభావుఁడగు ఆత్మ యెల్లప్పుడు ఒక్కవిధముగనేయుండుటవలన శోకమునకు కారణమే లేదు.

శ్రుతి. "తరతి శోకమాత్మవిత్". అను శ్రుతి యీవిషయమునే ప్రతిపాదించుచున్నది.

౨-వ అధ్యా, 3-వ వల్లి, 2-వ మంత్రము.

అవ. ఆత్మ ఇంద్రియములకంటె విభిన్నుఁడని చెప్పఁబడినది కావునను ఇతఁడు అందఱకు ప్రత్యగాత్మ కావునను వెలుపలను పొందఁజాలఁడు గదా! అట్టియాత్మను పొందుట యెట్లను విషయము చెప్పఁబడుచున్నది:—

మూ. ఇన్ద్రియేభ్యః పరం మనో మనసస్సత్త్వముత్తమం,
సత్త్వా దధి మహా నాత్మా మహతోఽవ్యక్తముత్తమమ్.

పద. ఇన్ద్రియేభ్యః పరం మనః మనసః సత్త్వం ఉత్తమం, సత్త్వాత్ అధి మహాన్ ఆత్మా మహతః అవ్యక్తం ఉత్తమమ్. 2

టీక. ఇంద్రియేభ్యః = ఇంద్రియములకంటె, మనః=మనస్సు, పరం=శ్రేష్ఠమయినది, మనసః=మనస్సుకంటె, సత్త్వం=బుద్ధి, ఉత్తమం = శ్రేష్ఠమయినది, సత్త్వాత్=బుద్ధికంటె, మహాన్ ఆత్మా = మహత్తను ఆత్మ, అధి=అధికము, మహతః=మహత్స్వరూపమగు ఆత్మకంటె, అవ్యక్తం=అవ్యక్తము, ఉత్తమం=శ్రేష్ఠమయినది.

తా. ఇంద్రియములకంటె మనస్సు శ్రేష్ఠమయినది, ఆమనస్సుకంటె సత్త్వము-అనఁగా బుద్ధి శ్రేష్ఠమయినది. ఆబుద్ధికంటె మహాదాత్మ శ్రేష్ఠమయినది. ఆమహాదాత్మకంటె సర్వకారణమగు అవ్యక్తము శ్రేష్ఠమయినది. ఇచట ఇంద్రియముల తరువాత విషయములను గుఱించి చెప్పుట యుక్తముకాని విషయములు ఇంద్రియసమానజాతీయము లగుటచేత ఇంద్రియగ్రహణముచేతనే విషయములుకూడ గ్రహింపఁబడినట్లే యనుతలంపుతో ఉపేక్షింపఁబడినది.

వివరణము:—ఏతత్సమానార్థకమగు మంత్ర మీయుపనిషత్తునందే ౧ అధ్యా-3 వల్లి. ౧౦-వ మంత్రముగా నిట్లుగలదు:—

మం. ఇంద్రియేభ్యః పరా హ్యర్థా అర్థేభ్యశ్చపరం మనః,
మనసస్తు పరా బుద్ధి ర్బుద్ధే రాత్మా మహా న్పరః.

ఇచట ఇంద్రియములతర్వాత అర్థములు—విషయములు చెప్పఁబడినవి. ఈవల్లియందు విషయము లుపేక్షితములని యెఱుఁగునది.

౨-వ అధ్యా, 3-వ వల్లి, ౮-వ మంత్రము.

మూ. అవ్యక్తాత్తు పరః పురుషో వ్యాపకో ఽలిఙ్గ ఏవ చ,
య జ్జ్ఞాత్వా ముచ్యతే జన్తు రమృతత్వం చ గచ్ఛతి.

పద. అవ్యక్తాత్ తు పరః పురుషః వ్యాపకః అలిఙ్గః ఏవ చ, యత్ జ్ఞాత్వా ముచ్యతే జన్తుః అమృతత్వం చ గచ్ఛతి. ౮

టీక. జంతుః=మానవుఁడు, యత్ = ఏయాత్మపురుషుని, జ్ఞాత్వా = తెలిసికొని, ముచ్యతే=అవిద్యావిలసితమగు సంసారబంధమునుండి, విముచ్యతే=వదలఁబడుచున్నాఁడో, అమృతత్వంచ=అమృతత్వమునున్నూ, గచ్ఛతి=పొందుచున్నాఁడో, (అట్టి) పురుషః=పురుషుఁడు, అవ్యక్తాత్ తు=అవ్యక్తముకంటె, పరః=శ్రేష్ఠుఁడు, వ్యాపకః = సర్వవ్యాపకుఁడు, అలింగః ఏవచ=లింగవిరహితుఁడున్నూ అగుచున్నాఁడు.

తా. ఓనచికేతుఁడా! అవ్యక్తముకంటె పురుషుఁడు శ్రేష్ఠుఁడు. ఈ పురుషుఁడే సర్వమునకు కారణభూతుఁడగుటవలన వ్యాపకమయిన ఆకాశాదికముకంటె వ్యాపకుఁడు. మఱియు అలింగుఁడు-లింగవిరహితుఁడు, అనఁగా సర్వసంసారధర్మవివర్జితుఁడని భావము. సర్వసంసారధర్మవివర్జితుఁడగు ఈపురుషుని ఆచార్యశాస్త్రసహాయమువలన తెలిసికొన్నవాఁడు శరీరముతోఁడ జీవించియున్నప్పుడే అవిద్యాదిహృదయగ్రంథులనుండి విముక్తుఁడగుచున్నాఁడు. దేహపాతానంతరము అమృతత్వమును అనఁగా పునరావృత్తిరహితమగు విదేహకైవల్యమును పొందుచున్నాఁడు.

౨-వ అధ్యా, ౩-వ వల్లి, ౯-వ మంత్రము.

అవ. అలింగుఁడగు పురుషుని దర్శించుట యెట్లనువిషయము చెప్పఁబడుచున్నది.—

మూ. న సందృశే తిష్ఠతి రూపమస్య
న చక్షుషా పశ్యతి కశ్చనైనం,
హృదా మనీషా మనసాఽభిక్లృప్తో
య ఏతద్విదు రమృతాస్తే భవన్తి. ౯

పద. న సంధృశే తిష్ఠతి రూపం అస్య న చక్షుషా పశ్యతి కః చ న ఏనం, హృదా మనీషా మనసా అభిక్లప్తః యే ఏతత్ విదుః అమృతాః తే భవన్తి. ౯

టీక. అస్య = ఈప్రత్యగాత్మయొక్క, రూపం=రూపము, సందృశే = దర్శనవిషయమునందు, నతిష్ఠతి=ఉండదు. కశ్చన = ఒక్కఁడున్నూ, ఏనం=ఈ పురుషుని, చక్షుషా=నేత్రముచేత, నపశ్యతి=చూడఁడు. మనసా = మననరూపమయిన, మనీషా=సంకల్పాదిరూపమయిన మనస్సును నియమించునట్టి, హృదా= హృదయమునందుండు బుద్ధిచేత, అభిక్లప్తః = (ఆయాత్మ) సందర్శింపఁబడును. యే=ఎవ్వరు? ఏతత్ = ఈపరమాత్మను, విదుః = తెలిసికొనుచున్నారో, తే = వారు, అమృతాః భవంతి=మరణవిరహితులగుచున్నారు.

తా. ప్రత్యగాత్మయగు ఈపురుషునియొక్క స్వరూపము నేత్రాదీంద్రియగణమునకు గోచరము కాఁజాలదు. ఇచట చక్షుర్గ్రహణ ముపలక్షణము. ఒక్కఁడున్నూ యీయాత్మతత్త్వమును ఇంద్రియములతో గ్రహింపఁజాలఁడు. ఇఁక ఆ యాత్మను గాంచువిధాన మెట్లనఁగా సంకల్పాదికమును నియమించుటచేత వికల్పరహితమయినట్టి మననరూపమయిన హృదయస్థమయిన బుద్ధిచేతనే ఆత్మస్వరూపము అభిప్రకాశితమగును. ఇట్టియాత్మను-బ్రహ్మమును ఎవ్వరెఱుంగుదురో అట్టివారు అమృతులు-మరణరహితులు అయ్యెదరు.

౨-వ అధ్యా, ౩-వ వల్లి, ౧౦-వ మంత్రము.

అవ. శ్రవణమననములచేత ఆత్మతత్త్వము పరిజ్ఞాతమయినప్పటికిన్నీ చిత్తమునకు ఏకాగ్రత్వము లేనియెడల తదనుభవము శూన్యమగుచున్నది కావున తదర్థము యోగ ముపదేశింపఁబడుచున్నది:—

మూ. యదా పఞ్చావతిష్ఠన్తే జ్ఞానాని మనసా సహ,
బుద్ధిశ్చ న విచేష్టతే తామాహుః పరమాం గతిమ్.

పద. యదా పఞ్చ అవతిష్ఠన్తే జ్ఞానాని మనసా సహ, బుద్ధిః చ న విచేష్టతే తాం ఆహుః పరమాం గతిమ్. ౧౦

టీక. యదా=ఏకాలమునందు, పంచ జ్ఞానాని=ఐదైన జ్ఞానేంద్రియములు, మనసాసహ=మనస్సుతోకూడా, అవతిష్ఠంతే = (ఆత్మయందే) ఉంటున్నవో, బుద్ధిశ్చ=అధ్యవసాయాత్మకమగుబుద్ధికూ, నవిచేష్టతే = వ్యాపారాంతరములందు చలింపదో, తాం=అట్టిస్థితిని, పరమాంగతిం=శ్రేష్ఠమయిన గతినిగా, ఆహుః=బ్రహ్మవేత్తలు పలుకుదురు.

తా. ఏకాలమునందు శ్రోత్రాదిజ్ఞానేంద్రియములు స్వవిషయముల నుండి మఱలినవై సంకల్పవికల్పవిముఖమయిన మనస్సుతోడ ఆత్మయందే నిలిచియుండునో, ఎప్పుడు అధ్యవసాయలక్షణాత్మకమగు బుద్ధి స్వవ్యాపారమునుండి

విముఖమయి చేష్టావిరహితమయియుండునో అట్టిస్థితియే ఉత్కృష్టఫలసాధన మయిన దగుటచేత పరమగతియని విద్వాంసులు పల్కుదురు.

౨-వ అధ్యా, 3-వ వల్లి, ౧౧-వ మంత్రము.

మూ. తాం యోగమితి మన్యన్తే స్థిరామింద్రియధారణాం,
అప్రమత్తస్తదా భవతి యోగోహిప్రభవాప్యయౌ.

పద. తాం యోగం ఇతి మన్యన్తే స్థిరాం ఇంద్రియధారణాం, అప్రమత్తః తదా భవతి యోగః హి ప్రభవాప్యయౌ. ౧౧

టీక. స్థిరాం=స్థిరమయిన, తాం=ఆ, ఇంద్రియధారణాం = బాహ్యాంతరింద్రియధారణను, యోగంఇతి = యోగమని, మన్యంతే = (విద్వాంసులు) తలంచుచున్నారు. తదా=ఆకాలమునందు-అనఁగా యోగప్రవృత్తుఁడైనప్పుడు, అప్రమత్తః=ప్రమాదములేనివాఁడు, భవతి=అగుచున్నాఁడు. యోగః=యోగమనఁగా, ప్రభవాప్యయౌ హి=జననాపాయధర్మములు గలదిగదా.

తా. స్థిరమయిన బాహ్యాంతరింద్రియముల ధారణను యోగమని పెద్దలు పలుకుచున్నారు. సర్వానర్థసమూహము యోగాభ్యాసముచేత నిరాకృతమగుచున్నది. ఇట్టియోగావస్థయందు ఆత్మయందు అవిద్యచేత అధ్యారోపితమయిన అనృతస్వరూపములు నశించును కావున ఆత్మ పరిశుద్ధుఁడయియుండును. యోగాభ్యాసకాలమునందు ప్రమాదవిరహితుఁడయి సమాధినిమిత్తము ప్రయత్నశీలుఁడయి యుండవలయును. బుద్ధ్యాదికము చేష్టావిరహిత మయియున్నయెడల ప్రమాదము కలుగఁజాలదు. యోగసిద్ధిసమయమునందు బుద్ధ్యాదికము చేష్టావిరహితమయియుండును కావున అప్రమాదత్వము సిద్ధించుచునేయున్నది. లేక ఇంద్రియములకు స్థిరమయినధారణ యెప్పుడుకలుగునో అప్పుడే అప్రమత్తత్వము తప్పక కలుగుచున్నది. ఏలయనఁగా యోగము ప్రభవాప్యయములు-అనఁగా ఉపజనాపాయ ధర్మములు గలది కావున అపాయపరిహారార్థము ప్రమాదరహితుఁడయి యుండవలయునని యభిప్రాయము.

వివరణము:—ఉపజనాపాయధర్మములు గలది యనఁగా ఉపజన మనఁగా పుట్టుక, అపాయమనఁగా నాశము అను ధర్మములుగలది. యోగా భ్యాసమువలన అంతకుముందు శరీరమునందున్న రాగద్వేషచిత్తవిక్షేపాది దుష్టగుణములు నశించుటయు, సత్వశుద్ధి, చిత్తవిక్షేపరాహిత్యము మున్నగు సత్వగుణములు పుటుటయుం కలుగును కావున యోగము ఉపజనాపాయధర్మ ములు గలదని చెప్పఁబడినది.

౨-వ అధ్యా, 3-వ వల్లి, ౧౨-వ మంత్రము.

అవ. బ్రహ్మము 'ఇది అది' యని బుద్ధ్యాదికమునకు విషయమగునెడల గ్రహించుటకు శక్యమగును. బుద్ధ్యాదిక ముపరతమయినపిదప గ్రహణకార ణము లేదు కావున బ్రహ్మము పొందఁబడఁజాలదు కావున బ్రహ్మమును లేనట్లే తలంచవలయును. లోకమునందు కారణగోచరమగునదియే ఉన్నదని ప్రసిద్ధి కలిగియుంటున్నది. కారణగోచరముకాని దానికి అసత్తనియే ప్రసిద్ధి కావున యోగము నిష్ప్రయోజనము. బుద్ధ్యాదికమునకు లభింపనందువల్ల బ్రహ్మమను నది లేదనుటయే యుక్తమని సిద్ధించుచుండుటచేత తన్నిరాసార్థ మిట్లు చెప్పఁ బడుచున్నది:—

మూ. నైవ వాచా న మనసా ప్రాప్తుం శక్యో న చక్షుషా,
అస్తీతి బ్రువతోఽన్యత్ర కథం తదుపలభ్యతే. ౧౨

పద. న ఏవ వాచా న మనసా ప్రాప్తుం శక్యః న చక్షుషా, అస్తి ఇతి బ్రువతః అన్యత్ర కథం తత్ ఉపలభ్యతే. ౧౨

టీక. ఆత్మా=ఆత్మ, వాచా=వాక్కుచేత, ప్రాప్తుం శక్యః = పొందుటకు తగినవాఁడు, న ఏవ=కాఁడు. మనసా న=మనస్సుచేతపొందుటకు శక్యమయిన వాఁడుకాఁడు. నచక్షుషా=నేత్రముచేతపొందుటకు శక్యమయినవాఁడుకాఁడు, అస్తిఇతి బ్రువతః=ఉన్నాఁడు అని చెప్పువానివలన (పొందుటకు శక్యమగును),

అన్యత్ర=ఉన్నాఁడని చెప్పువానికంటె వేఱయినవానిచేత, అనఁగా నాస్తికుని చేత, తత్=ఆబ్రహ్మము, కథం ఉపలభ్యతే=ఎట్లు పొందఁబడును.

తా. బ్రహ్మము వాక్కుచేతఁగాని మనస్సుచేతఁగాని నేత్రముచేతఁగాని లేక ఇతరేంద్రియములచేతఁగాని పొందుటకు శక్యమయినదికాదు. బ్రహ్మమిట్లు సర్వవిశేష విరహితమయినదయ్యును జగత్తునకు మూలమని తెలియవచ్చుచుండుటచేత కార్యప్రవిలాపనముచేత నెఱుంగవచ్చును. నిజముగా జగత్తునకు మూలమే లేనియెడల ఈకార్యముకూడా అసత్తనియే పిలువఁబడుచుండును. ఇట్లుగాక సత్తనియే - ఉన్నదనియే లోకమునందు వ్యవహారముకలుగుచున్నది. మృత్కార్యమగు ఘటాదికము మృదాదిసమన్వితముగనే చూడఁబడుచున్నది. కావున జగత్తునకు మూలభూతమగు ఆత్మ యనువాఁడు కలఁడనియే . మనము గ్రహించితీరవలయును. ఏలయనఁగా శాస్త్రానుసారముగ ఆత్మ యనువాఁడున్నాఁడని పలికెడి ఆస్తికునికంటె భిన్నుఁడగునాస్తికుఁడు జగత్తునకు మూలభూతుఁడగు ఆత్మ లేఁడనియు, ఈకార్యమగు ప్రపంచము అభావాంతముగా విలయమందుననియుం తలంచును కావున అట్టివిపరీతదర్శికి బ్రహ్మము వాస్తవముగాఁ గనంబడఁజాలదని భావము.

౨-వ అధ్యా, 3-వ వల్లి, ౧3-వ మంత్రము.

మూ. అస్తీత్యేవోపలబ్ధవ్య స్తత్త్వభావేన చోభయోః,
అస్తీత్యేవోపలబ్ధస్య తత్త్వభావః ప్రసీదతి. ౧3

పద. అస్తి ఇతి ఏవ ఉపలబ్ధవ్యః తత్త్వభావేన చ ఉభయోః, అస్తి ఇతి ఏవ ఉపలబ్ధస్య తత్త్వభావః ప్రసీదతి. ౧3

టీ. ఉభయోః = అస్తిత్వ నాస్తిత్వ భావములు రెంటిలోపల, తత్త్వభావేన=తత్త్వభావముచేత, అస్తి ఇతి ఏవ=ఉన్నదనియే, ఉపలబ్ధవ్యః=పొందఁదగినది. అస్తిఇతి=ఉన్నాఁడని, ఉపలబ్ధస్యైవ = నిర్ణయమునుపొందినవానికే, తత్త్వభావః=తత్త్వభావము, ప్రసీదతి=ప్రసన్నమగుచున్నది.

తా. పూర్వమంత్రమునందు చెప్పఁబడిన పక్షద్వయమునందు అసుర మగు నాస్తికవాదమును వదలి అస్తిత్వవాదమునే ఆశ్రయింపవలయును. సత్కార్యమునందు బుద్ధ్యాదికము ఉపాధిగా గ్రహింపఁబడుచున్నది. ఎప్పుడు ఉపాధిరహితుఁడో అప్పుడు ఆత్మ వికారరహితుఁడనియు, కార్యము కారణ వ్యతిరేకముగా లేదనియు, నిరుపాధికమును అలింగమును సర్వకారణమును సదసదాది ప్రత్యయవర్జితమును అగు ఆత్మయొక్క తత్త్వము స్ఫురించును. అట్టి రూపముచేతనే ఆత్మతత్త్వము పొందఁదగినదని సిద్ధించుచున్నది. ఇచటగల 'ఉభయోః' అనుపదము సోపాధిక, నిరుపాధికములగు అస్తిత్వతత్త్వభావ ములయొక్క నిర్ధారణార్థమని యెఱుంగునది. పూర్వమునందు 'అస్తి' అని పొందఁబడిన ఆత్మకే—అనఁగా సత్కార్యమయిన ఉపాధికృతమయిన జ్ఞానముచేత పొందఁబడిన ఆత్మకే పిమ్మట నశించిన నామరూపోపాధులుగల ఆత్మయొక్క తత్త్వభావము స్ఫురించును. ఈతత్త్వభావము వెనుకచెప్పినవిధ ముగా విదితావిదితములకంటె వేఱయినది, అద్వయస్వభావమయినది. 'నేతి నేతి' (ఇదిగాదు, ఇదిగాదు) 'అస్థూలం, అనణు, అహ్రస్వం' మున్నగుశ్రుతుల చేత నిర్ణీతమయినది అభిమతమగును. తత్పూర్వము 'అస్తి' యను జ్ఞానమును పొందినదే ఆత్మతత్త్వము ప్రకాశించునుగాని తద్భిన్నునకు ఆత్మతత్త్వము ప్రకాశింపదు.

౨-వ అధ్యా, 3-వ వల్లి, ౧౪-వ మంత్రము.

మూ. యదా సర్వే ప్రముచ్యన్తే కామా యేఽస్య హృది శ్రితాః,
అథ మర్త్యోఽమృతో భవత్యత్ర బ్రహ్మ సమశ్నుతే. ౧౪

పద. యదా సర్వే ప్రముచ్యన్తే కామాః యే అస్య హృది శ్రితాః, అథ మర్త్యః అమృతః భవతి అత్ర బ్రహ్మ సమశ్నుతే. ౧౪

టీక. యదా=ఏకాలమునందు, అస్య=ఈ బ్రహ్మవేత్తయొక్క, హృది= హృదయమునందు, శ్రితాః = ఆశ్రయించియున్న, యే=ఏ, కామాఃసర్వే=

కోరికలన్నియు, ప్రముచ్యంతే = వదలిపోవుచున్నవో, అథ=పిమ్మట, మర్త్యః=మనుష్యుఁడు, అమృతఃభవతి=మరణరహితుఁడగుచున్నాఁడు. అత్ర=ఇచ్చటనే, బ్రహ్మ=బ్రహ్మమును, సమశ్నుతే=పొందుచున్నాఁడు.

తా. పరమార్థదర్శియగు విద్వాంసునియొక్క సమస్తమయిన కామములు ఆత్మప్రబోధమునకు ముందు విద్వాంసునియొక్క బుద్ధియందు ఆశ్రయించియున్నవి. ఆత్మప్రబోధానంతరము కోరఁదగిన అన్యపదార్థము లేకపోవుటచేత స్వయముగా ఆకామములు బుద్ధిని వదలిపోవుచున్నవి. 'కామః సంకల్పః' అను శ్రుత్యంతరమువలన కామాదికమునకు ఆశ్రయము బుద్ధిగాని ఆత్మకాదు. ఆత్మ విజ్ఞానప్రబోధముకంటె ముందు మరణధర్ముఁడు అయినను అట్టిఆత్మయే విజ్ఞానప్రబోధానంతరము అవిద్యాకామకర్మలక్షణమగుమృత్యువు నశించుటచేత అమృతుఁడు-మరణరహితుఁ డగుచున్నాఁడు. గమనప్రయోజకమయిన మృత్యువు నశించిపోవుటచేత ఆత్మవేత్తకు అన్యత్రగమనము అనుపపన్నము అగుచున్నది. దీపము ఉన్నచోటనే చల్లారిపోవునటుల సర్వబంధములు నశించుటచేత ఇచ్చటనే బ్రహ్మస్వరూపుఁ డగుచున్నాఁడు.

౨-వ అధ్యా, 3-వ వల్లి, ౧౫-వ మంత్రము.

అవ. కామములకు సమూలవినాశ మెప్పు డనువిషయము చెప్పఁబడుచున్నది:—

మూ. యదా సర్వే ప్రభిద్యన్తే హృదయస్యేహ గ్రన్థయః,
అథ మర్త్యో ఽమృతో భవత్యేతావదనుశాసనమ్. ౧౫

పద. యదా సర్వే ప్రభిద్యన్తే హృదయస్య ఇహ గ్రన్థయః, అథ మర్త్యః అమృతః భవతి ఏతావత్ అనుశాసనమ్. ౧౫

టీక. యదా=ఎప్పుడు, ఇహ=ఇచటజీవించియుండఁగనే, హృదయస్య గ్రంథయః=హృదయగ్రంథులు, సర్వే=అన్నియు, ప్రభిద్యంతే=నశించిపోవు

చున్నవో, అథ=పిమ్మట, మర్త్యః=మనుష్యుఁడు, అమృతః భవతి=మరణరహితుఁడగుచున్నాఁడు. ఏతావత్=ఇదియే, అనుశాసనం=సర్వవేదాంతములయొక్క ఉపదేశము, లేక ఆజ్ఞ.

తా. ఓ నచికేతుఁడా! ఈశరీరము నేను, ఈధనాదికము నాది, నేను సుఖిని, దుఃఖిని, ప్రభువును అని తలంచుట మున్నగునవి అవిద్యాగ్రంథులు, "నేను శరీరముగాను బ్రహ్మాత్మభూతుఁడను, అఖండాత్మస్వరూపుఁడను, అసంసారిని" అను దృఢభావనకలుగుటతోడనే పూర్వోక్తములయిన అవిద్యాగ్రంథులు అన్నియుం ఈశరీరమునందే జీవించియుండఁగనే నశించిపోవును. అవిద్యాగ్రంథులు నశించినవెంటనే అవిద్యాగ్రంథులే నిమిత్తములుగాఁగల కామములుకూడ సమూలముగ నశించును. కామములన్నియుం నశించినవెంటనే మరణధర్ముఁడయిన జీవుఁడు అమృతుఁడు అగుచున్నాఁడు. ఉపనిషత్తులు అనుశాసించునది - ఆజ్ఞాపించునది ఇంతియ. అనుశాసనమనఁగా అనుశిష్టి—ఉపదేశము. సర్వోపనిషత్తులం దుపదేశింపఁబడినతత్త్వ మిదియే యనిభావము.

వివరణము:—సర్వకామములు నశించుటయే అమృతత్వమయినయెడల అట్టి సర్వకామప్రవిలాపము—నాశనము సుషుప్తియందుఁగూడ సంభవించుచున్నది కావున అసుషుప్తస్థితినిగూడ అమృతత్వ మనవలసివచ్చును, కాని అట్లనఁగూడదనియుం బ్రహ్మాత్మైకత్వవిజ్ఞానముచేత అవిద్యాగ్రంథులు నశించుటయే అమృతత్వమనియు ఇట ప్రతిపాదింపఁబడినది.

౨-వ అధ్యా, ౩-వ వల్లి, ౧౫-వ మంత్రము.

అవ. అఖండ బ్రహ్మైకత్వప్రాప్తివలన అవిద్యా వికల్పితహృదయగ్రంథులన్నియుం నశించిపోవుటచేత ఈదేహమునందు జీవించియున్నప్పుడే బ్రహ్మీభూతుఁడయిన విద్వాంసునకు లోకవ్యవహారగోచరమగు మరణకాలము

నందు ఇతరులకువలె ప్రాణములకు అన్యత్రగతియనునది లేదనియుం 'అత్ర బ్రహ్మ సమశ్నుతే. కఠ. 3-౬-౧౪.' అని చెప్పఁబడినది. 'నతస్యప్రాణా ఉత్క్రామంతి; బ్రహ్మైవసన్ బ్రహ్మాప్యేతి. బృహ-౪-౪-౬' మున్నగు శ్రుతులుకూడా యీవిషయమునే బలపఱుచుచున్నవి. ఇఁక ఎవ్వరు 'అత్ర బ్రహ్మ సమశ్నుతే' అను మంత్రార్థమునకు గోచరులగు ఉత్తమాధికారులుకాక ఎవ్వరు మందాధికారులో లేక ఉపాసనాదులచేత బ్రహ్మలోకమును పొందుచున్నారో; లేక ఎవ్వరు తద్విపరీతులయి సంసారభాక్కులో వారివారికి రాఁబోవుగతి విశేషము ఉత్తమమధ్యమాది బ్రహ్మవిద్యాఫలప్రాప్తి స్తుతినిమిత్తము చెప్పఁబడుచున్నది. ఇవియునుగాక అగ్నివిద్యనుగూర్చి నచికేతుఁడు ప్రశ్నించియున్నాఁడు. తద్విద్యయొక్క ఫలప్రాప్తిప్రకారముకూడ యీమంత్రమునందు చెప్పఁబడుచున్నది:—

మూ. శతం చైకా చ హృదయస్య నాడ్య-
స్తాసాం మూర్ధానమభి నిస్సృతైకా,
తయోర్ధ్వమాయన్న మృతత్వమేతి
విష్వఙ్ఙన్యా ఉత్క్రమణే భవన్తి. ౧౬

పద. శతం చ ఏకా చ హృదయస్య నాడ్యః తాసాం మూర్ధానం అభినిస్సృతా ఏకా, తయా ఊర్ధ్వం ఆయన్ అమృతత్వం ఏతి విష్వఙ్ అన్యాః ఉత్క్రమణే భవన్తి. ౧౬.

టీక. హృదయస్య=హృదయముయొక్క, నాడ్యః=నాడులు, శతంచ ఏకాచ = నూటయొక్కటి, తాసాం = ఆనూటయొక్కనాడులలో, ఏకా = ఒక్కటియగు సుషుమ్నయనునాడి, మూర్ధానం = మూర్ధనుగూర్చి, అభినిస్సృతా = బయలువెడలినది, తయా = ఆసుషుమ్నానాడిచేత, ఊర్ధ్వం=ఊర్ధ్వమునుగూర్చి, ఆయన్ = వచ్చినవాఁడయి, అమృతత్వం = అమృతత్వమును, ఏతి=పొందుచున్నాఁడు. అన్యాః=ఇతరనాడులు, ఉత్క్రమణే = ఉత్క్రమ

ణామునందు నిమిత్తములయినయెడల, విష్వఙ్ = నానావిధగతులు, భవంతి = అగుచున్నవి.

తా. (ఇతరులకంటె యోగాభ్యాసపరుఁడగువానికి ప్రాణోత్క్రమణ సమయము ముందుగా తెలియును. కావున అతఁడా సమయమునందు చేయవలసినవిధాన మిటచెప్పఁబడుచున్నది:—) హృదయమునందు నాడులు నూటయొకసంఖ్య గలిగియున్నవి. ఆ నూటయొక్కనాడులలో సుషుమ్నయను ఒక్కనాడి హృదయమునుండి బయలువెడలి శిరస్సును పొందుచున్నది. అవసానకాలమునందు శిరస్సువఱకు వ్యాపించియున్న ఆసుషుమ్నానాడీమార్గముగా హృదయమునందు ఆత్మను వశీకారముచేసుకొని ఊర్ధ్వమార్గముగా బ్రహ్మరంధ్రమునుండి ప్రాణములు వెలుపలికిపోవునటుల చేయవలయును. ఇటుల చేసినయెడల ఆదిత్యమార్గముగా అమృతత్వమునుపొందును. ఇచట అమృతత్వమనునది ఆపేక్షికము. 'ఆభూతసంప్లవం స్థానం అమృతత్వం హి భాష్యతే' యని స్మృతిచెప్పుచున్నది. బ్రహ్మలోకమునందు బ్రహ్మదేవునితోడ నిరుపమానభోగముల ననుభవించుచు ఆబ్రహ్మతోడ కాలాంతరమునందు ముఖ్యమయిన అమృతత్వమును పొందుచున్నాఁడు. ఇతరనాడులద్వారా ప్రాణోత్క్రమణమయిన యెడల నానావిధమయిన సంసారగతులనుపొందును.

వివరణము:—''ఇచటచెప్పఁబడిన సుషుమ్నానాడీమార్గముగా ప్రాణోత్క్రమణమును పొందుట, దానివలన అమృతత్వమును పొందుట మున్నగునది మందబ్రహ్మవిద్యాధికారుల విషయమని భాష్యకారులవారు చెప్పిరి. కాని ఇట్లుచెప్పుట అసంగతమనియు, ప్రకరణమననుసరించి ఇది ముఖ్యబ్రహ్మవేత్తకు సంబంధించినదేయనియు భాస్కరుఁడు చెప్పినాడు. కాని ఆభాస్కరునిమతము యుక్తియుక్తము కాదు. ఏలయందురా? గమనము చెప్పఁబడుటచేత; గమనమనునది పరిచ్ఛిన్నమయిన ప్రదేశమున కగునుగాని సార్వత్రికము కాఁజాలదు. నాడ్యంతరములగతియు బ్రహ్మవేత్తకు సంబంధించినదిగా ప్రకరణము ననుసరించి చెప్పవచ్చును. అది శ్రుతివిరుద్ధమయిన అతిప్రసంగము కావున ప్రబల

మయిన లింగముచేత ఇచట దుర్బలమగు ప్రకరణము నిరాకృతమని యెఱుంగ వలయును. యోగాభ్యాసరహితుఁ డగుపురుషుఁడు తనయిష్టానుసారము సుషుమ్నానాడీమార్గముగా ప్రాణములను బ్రహ్మరంధ్రమునుండి బయటికి వెడలింపఁ జేయఁజాలఁడుకావున ప్రయాణకాలముకంటె పూర్వము తప్పక యోగాభ్యాసమును సాధించుట కర్తవ్యమనియుఁ సూచితమగుచున్నది.

౨-వ అధ్యా, 3-వ వల్లి, ౧౭-వ మంత్రము.

అవ. ఇప్పుడు సర్వవల్లులయందు ప్రతిపాదింపఁబడిన విషయ ముప సంహరింపఁబడుచున్నది:—

మూ. అఙ్గుష్ఠమాత్రః పురుషోఽన్తరాత్మా
సదా జనానాం హృదయే సన్నివిష్టః,
తం స్వాచ్ఛరీరా త్ప్రవృహే
న్ముఞ్జాదివేషీకాం ధైర్యేణ
తం విద్యాచ్ఛుక్ర మమృతం
తం విద్యాచ్ఛుక్ర మమృతమితి. ౧౭

పద. అఙ్గుష్ఠమాత్రః పురుషః అన్తరాత్మా సదా జనానాం హృదయే సన్నివిష్టః, తం స్వాత్ శరీరాత్ ప్రవృహేత్ ముఞ్జాత్ ఇవ ఇషీకాం ధైర్యేణ, తం విద్యాత్ శుక్రం అమృతం తం విద్యాత్ శుక్రం అమృతం ఇతి. ౧౭

టీక. అంగుష్ఠమాత్రః=అంగుష్ఠపరిమాణముగల, పురుషః=పురుషుఁడు, అన్తరాత్మాసన్ = అంతరాత్మస్వరూపుఁడయి, సదా=ఎల్లప్పుడు, జనానాం = జనులయొక్క, హృదయే=హృదయమునందు, సన్నివిష్టః=ప్రవేశించియున్నాఁడు. తం =చిన్మాత్రుఁడగు అట్టియాత్మను, ముంజాత్ = ముంజయనుతృణవిశేషమునుండి, ఇషీకాంఇవ = ఆముంజయొక్క మధ్యభాగమునందుండు ఇషీకను

(గడ్డిపరకను) వలె, ధైర్యేణ = ప్రమాదవిరహితమయిన జ్ఞానముచేత, స్వాత్ శరీరాత్ = స్వకీయమయిన దేహమునుండి, ప్రవృహేత్ = వేఱుపరచవలయును. తం=ఆచిన్మాత్రుఁడగు ఆత్మను, శుక్రం=శుద్ధమయిన, అమృతం=బ్రహ్మమునుగా, విద్యాత్ = తెలిసికొనవలయును. తం=ఆయాత్మనే, శుక్రం అమృతం=శుద్ధమయిన బ్రహ్మము, ఇతి=అని, విద్యాత్ = తెలిసికొనవలయును. ఇచట ద్విరుక్తి ఉపనిషత్సమాప్తిసూచకము.

తా॥ అంగుష్ఠమాత్రపరిమాణముగల హృదయకమల ఛిద్రాంతర్గతాంతఃకరణోపాధియగు పురుషుఁడు అంగుష్ఠమాత్రుఁ డనంబడును. అట్టియాత్మ సర్వకాలసర్వావస్థలయందు ప్రాణులయొక్క హృదయమునందు సన్నిహితుఁడయి యుంటున్నాఁడనువిషయ మిదివఱకు చక్కఁగా ప్రతిపాదింపఁబడినది. అట్టి యంగుష్ఠమాత్రపురుషుని ముంజ యను తృణవిశేషమునుండి తదంతర్గతమగు ఇషీకను-పరకను వెలుపలకులాగునటుల స్వశరీరమునుండి ప్రమాదరహితమయిన జ్ఞానముచేత వేఱుపఱచవలయును. శరీరమునుండి వేఱుపఱచిన చిన్మాత్రుఁడగు ఆయాత్మనే శుద్ధమయిన బ్రహ్మమునుగా నెఱుంగవలయును. ఆతనినే పరిశుద్ధమయిన బ్రహ్మమునుగా నెఱుంగవలయును. ఈద్విరుక్తి ఉపనిషత్సమాప్తి ద్యోతకము.

వివరణము:—ఈమంత్రమునందు గ్రంథసమాప్తిసూచకమగు ద్విరుక్తియు, ఇతికరణము చెప్పఁబడినది. అయినను మఱొకమంత్రము తర్వాత చెప్పఁబడియున్నది. ఆమంత్రము ఫలశ్రుతియగుటచేతను, ఉపనిష దుపదేశ మీమంత్రముతోనే సమాప్తమగుచుండుటచేతను ఇట ద్విరుక్తి సమంజసమే యగుచున్నది.

౨-వ అధ్యా, 3-వ వల్లి, ౧౮-వ మంత్రము.

అవ. విద్యాస్తుత్యర్థము ఆఖ్యాయికోపసంహార మిప్పుడు చెప్పఁబడు చున్నది:—

మూ. మృత్యుప్రోక్తాం నచికేతో ఽథ లబ్ధ్వా
విద్యామేతాం యోగవిధిం చ కృత్స్నం,
బ్రహ్మప్రాప్తో విరజో ఽభూ ద్విమృత్యు
రన్యోఽప్యేవం యో వి దధ్యాత్మమేవ. ౧౮

పద. మృత్యుప్రోక్తాం నచికేతః అథ లబ్ధ్వా విద్యాం ఏతాం యోగవిధిం చ కృత్స్నం, బ్రహ్మ ప్రాప్తః విరజః అభూత్ విమృత్యుః అన్యః అపి ఏవం యః విత్ అధ్యాత్మం ఏవ. ౧౮

టీక. నచికేతః = నచికేతుఁడు, మృత్యుప్రోక్తాం = యమధర్మరాజు చేత ఉపదేశింపఁబడిన, ఏతాం = ఈ, విద్యాం = బ్రహ్మవిద్యను, కృత్స్నం= సోపకరణమయిన, యోగవిధించ = యోగవిధిని, లబ్ధ్వా = పొంది, విరజః = పాపవిరహితుఁడయి, విమృత్యుః = కామావిద్యాదిరూపమగు మృత్యువిరహితుఁడయి, బ్రహ్మ=బ్రహ్మమును, ప్రాప్తః=పొందెను. ఏవం=ఈవిధముగా, అన్యః= ఇతరుఁడు, యఃఅపి=ఎవ్వఁడయినను, అధ్యాత్మంఏవ=ఆత్మనే, విత్=ఎఱుంగుచున్నాఁడో, సఃఅపి = వాఁడున్నూ, విరజుఁడున్నూ విమృత్యువున్నూ అయి బ్రహ్మమును పొందుచున్నాఁడు.

తా. ఈవిధముగా యమధర్మరాజు బోధించిన బ్రహ్మవిద్యను సోపకరణమగు యోగవిధిని వరప్రదానపూర్వకముగా నచికేతుఁడు పొందినవాఁడయి పిమ్మట విద్యాప్రాప్తిచేత ధర్మాధర్మవిరహితుఁడయి పాపరహితుఁడై కామావిద్యాత్మకమృత్యువిరహితుఁడయి బ్రహ్మమును పొందినవాఁడాయెను. అనఁగా ముక్తుఁడయ్యెను. ఇట్టిబ్రహ్మవిద్యవలన నచికేతుఁడొక్కఁడే ముక్తుఁడగుటకాదు. నచికేతునివలె ఇతరుఁడుకూడ ఎవ్వఁడు పూర్వోక్తప్రకారముగా అధ్యాత్మస్వరూపుఁడగు ఆత్మనెఱుంగునో అట్టివాఁడుకూడ విరజుఁడు పాపరహితుఁడును, విమృత్యువున్నూ మరణరహితుఁడున్నూ అయి ముక్తుఁడగుచున్నాఁడు.

వివరణము:—అధ్యాత్మస్వరూపుఁడగు బ్రహ్మము నెఱింగినవాఁడే విముక్తుఁడగునుగాని అన్యరూపుఁడగు బ్రహ్మమును - అనఁగా అర్చిరాదిమార్గగమ్యుఁడగు బ్రహ్మమును పొందినవాఁడు విముక్తుఁడు కాజాలఁడనిభావము.

ఈవల్లికి సంబంధించిన ఇతరగ్రంథభాగము.

అనుభూతిప్రకాశము:—౧౧-అధ్యాయము. శ్లోకము ౯౫-౧౨౦.

ఆత్మపురాణము:—౯-అధ్యాయము. శ్లోకము ౭౪౪-౮౪౮.

౨-వ అధ్యా, ౩-వ వల్లి, ౧౯-వ మంత్రము.

## ఉత్తరశాంతిపాఠమంత్రము.

ఓమ్. సహనావవతు, సహనౌభునక్తు, సహవీర్యం కరవావహై, తేజస్వి నావధీతమస్తు, మావిద్విషావహై.

ఓం శాన్తి శ్శాన్తి శ్శాన్తిః.

హరిః ఓమ్ ఓం తత్సత్.

పద. సః హ నౌ అవతు, సహ నౌ భునక్తు, సహ వీర్యం కరవావహై, తేజస్వినౌ అధీతం అస్తు, మా విద్విషావహై,

ఓం శాన్తిః శాన్తిః శాన్తిః.

ఇతి కఠోపనిషది ద్వితీయాధ్యాయే

తృతీయావల్లీ (షష్ఠీవల్లీ) సమాప్తా.

కఠవల్ల్యుపనిషత్సమాప్తా.

టీక. ఉత్తరశాంతిపాఠముయొక్క టీకాతాత్పర్యములను ఉపనిషదాదియందుగల పూర్వశాంతిపాఠ మంత్రములకువలెనే యని యెఱుంగవలయును.

కఠోపనిషత్తు ద్వితీయాధ్యాయము తృతీయవల్లిసమాప్తము.

ఆంధ్రటీకాతాత్పర్యవివరణసమన్వితమగు కఠవల్ల్యుపనిషత్తు

సర్వము సమాప్తము.

---

శ్రీగురుభ్యో నమః.

అనుభూతిప్రకాశే

# కఠవల్ల్యుపనిషద్వివరణరూపః.

---

## ఏకాదశోఽధ్యాయః.

శ్లో. యాజుష్యాం కఠశాఖాయాం విద్యాం యాం నచికేతసే, యమః ప్రోవాచ తాం సర్వాం సంగ్రహేణ బ్రవీమ్యహమ్. ౧. నచికేతాః కుమార స్సన్ స్వపిత్రా ప్రేషితో యమం, గత్వా తం తోషయిత్వా ఽఽత్మజ్ఞానం వర మయాచత. ౨. ప్రేతే మనుష్యే సందేహో భూయా న్మతవిభేదతః, పారలౌకిక ఆత్మా ఽస్తి నాస్తి వా నిర్ణయం వద. ౩. చార్వాకా దేహ మేవాహుః కర్మిణః స్వర్గగామినం, ముముక్షవో ముచ్యమాన మిత్యుక్తో గురు రాహ తమ్. ౪. దుర్విజ్ఞేయ మణుత్వా త్త ద్దేవైశ్చ విచికిత్సితం, త్యక్త్వైత త్పుత్రవిత్తాదీన్వృణీష్వేత్యుక్త ఆహ తమ్. ౫. పుత్రాద్యా నశ్వరాః క్లేశ హేతవ శ్చాత్ర దుర్గమం, తత్త్వం వక్తుం త్వాదృశో ఽన్యో నేత్యాత్తైవ త్వయోచ్యతామ్. ౬. శృణు ప్రియం హితం చేతి పురుషై రర్థ్యతే ద్వయమ్.

## ప్రథమాధ్యాయము - ద్వితీయవల్లియొక్క వివరణము.

ప్రియాః పుత్రాదయ స్త్వాత్మా హితో దుఃఖవివర్జితః. ౭. అవివేక వివేకౌ ద్వౌ మార్గౌ తత్రావివేకినః, ప్రియార్థిన స్త్వంతు నైవం మత్తో జ్ఞానం హితం భజ. ౮. మూఢాతిమూఢౌ న సహ త్వయా ఽత్యంతవివేకినా, మూఢ స్త్వివషద్వివేకీ స స్స్వర్గ మిచ్ఛతి నైహికమ్. ౯. తద్గురుశ్చ తథైతౌ

ద్వా వంధసీతాంధవ త్థిసైతౌ, ఆత్మతత్త్వానభిజ్ఞత్వా దవిద్యాభ్యంతరే స్థితౌ. ౧౦. అతిమూఢో ధనార్థీ స న్ప్రిష్టామాత్యాదికాన్యపి, కరోతి పరలోక స్తు న తస్య ప్రతిభాసతే. ౧౧. చార్వాకైః కర్మిభి శ్చాత్మా శ్రవణాయాపి దుర్లభః, ముముక్షవో ఽపి బహవః శ్శృణ్వంతో ఽపి న జానతే. ౧౨. హవి ర్భుజాం హి దేవానామప్రియం మర్త్యవేదనం, మర్త్యా స్తత్త్వం న జానంతి విఘ్నై ర్దేవకృతై ర్హతాః. ౧౩. ఆచార్యశిష్యయో ర్దోషా స్త్వేవా ఉత్పాదయంతి హి, వాగ్దోషా ద్బుద్ధిదోషా ద్వా వక్తుం శక్నోతి నో గురుః. ౧౪. అవిశ్వాసా త్కుతర్కా ద్వా శిష్యో బోద్ధుం న శక్నుయాత్, ఈశ్వ రానుగ్రహా ద్దేవా విహంతుం శక్నువంతి నో. ౧౫. సహనావిత్యాదిశాంతి జపేనేశప్రసాదతః, నిర్విఘ్నా గురుశిష్యా స్త స్తాదృశౌ దుర్లభౌ ఖలు. ౧౬. శబ్దార్థజ్ఞః స్వాత్మతత్త్వానుభవీ చ గురు ర్ద్వివిధా, ఆద్యో నరో న తు బ్రహ్మ నరత్వభ్రాంత్యనాశనాత్. ౧౭. తేనోక్తే సంశయా ఏవ స్యు ర్వాచా బహు యోజనాత్, బ్రహ్మైవానుభవీ తేన బ్రహ్మ ప్రోక్తం విబుధ్యతే. ౧౮. కుతర్కా న్నశ్యతే విద్యా తార్కికో న గురు స్తతః, ఆగమే చానుభూతే చ కుశలో ఽత్ర గురు ర్భవేత్. ౧౯. శిష్యో బహిర్ముఖో న స్యాదధ్యాత్మం యోగమాచరన్, దుర్దర్శత్వాదిసంయుక్తమప్యాత్మానం ప్రపశ్యతి. ౨౦. బాహ్యేంద్రియైర్న దృశ్యోఽయం గూఢస్థానప్రవేశతః, పంచకోశగుహాం తస్థో గహ్వరే తమసి స్థితః. ౨౧. యోగేనాంతర్ముఖా బుద్ధి స్తమో నాశయతే తతః, దేవం జ్ఞాత్వా హర్షశోకౌ త్యజే త్తద్యోగ్యతా ఽస్తి తే. ౨౨. యోగ్యోఽహం చే త్తర్హి తత్త్వరహస్యం యత్త్వమీక్షసే, తద్బ్రూహి సర్వ సంసారగుణాతీతం విముక్తయే. ౨౩. ధర్మాధర్మౌ కార్యహేతూ తథా భూత భవిష్యతీ, అన్యచ్చ సర్వం నో యత్ర తదేవాపేక్షితం మమ. ౨౪. సర్వ వేదేషు యద్వేద్యం తపాంసి యదవాప్తయే, బ్రహ్మచర్యం చ తద్వస్తు ప్రణ వేనాభిధీయతే. ౨౫. ప్రణవో వాచక స్తస్య స్యాత్ప్రతీక ముపాస్తయే, తేన బోద్ధు ర్భవే న్ముక్తి ర్బ్రహ్మలోకో ఽప్యుపాసితుః. ౨౬. న జాయతే న

మ్రియతే ప్రణవార్థ శ్చిదాత్మకః, పురాణోఽసౌ వజత్యేన నిత్య స్స్వాత్ర దమృతత్వతః. ౨౭. కారణం నాస్య కార్యం వా దేహఘాతే ఽపి నో హాతిః, దేహో దేహాంతరం హంతి న చి ద్ధంతి న హన్యతే. ౨౮. శ్యామా కాదే రణో రేషోఽణీయాం స్తత్రాణుకల్పనాత్, మహీయాన్మహతః ఖాదే స్తత్రాకాశాదికల్పనాత్. ౨౯. స్థితో జంతో ర్హృద్గుహాయాం తం నిష్కామ స్తు పశ్యతి, ఇంద్రియాణాం ప్రసన్నత్వా ద్వీతశోక స్తదా భవేత్. ౩౦. అంతర్ముఖోఽహం పశ్యామి మత్తో ఽన్యో బాహ్యధీః పుమాన్, జ్ఞాతు మర్హతి కో వా తం విరుద్ధాత్మత్వభాసినమ్. ౩౧. దూరం గచ్ఛేదిహాసీనః శయానో యాతి సర్వతః, సమదో విమద శ్చాఽతో దుర్జ్ఞేయోఽవ్యావివేకిభిః. ౩౨. వనే ధ్యాతుం సమాసీనో దేహం సంకల్ప్య మానసం, తేనైవ నగరం గత్వా కరోతి క్రయవిక్రయౌ. ౩౩. శయానో మంచకే ఽక్షేషు విలీనేషు నిరాకృతిః, ఆకాశవ త్సర్వగత ఏకః స్ఫుష్టో ఽవతిష్ఠతే. ౩౪. ధనవిద్యాదిభి ర్మత్తః పాండిత్యం సదసి బ్రువన్, వైరాగ్యనటనేనాసౌ లక్ష్యతే మద హీనవత్. ౩౫. ఏవం విరుద్ధధర్మత్వాత్ స భావః కోఽస్య వాస్తవః, ఇతి జ్ఞాతు మశక్యత్వా దంతర్దృష్ట్యైవ మీక్షితమ్. ౩౬. అశరీరం శరీరేష్వ నవస్థేష్వవ్యవస్థితం, సర్వగం బహుభావాధిష్ఠానం మత్వా న శోచతి. ౩౭. నాయమాత్మా బహోః పాఠా ద్బహు శ్రుత్వా చ మేధయా, లభ్యో బహిర్ముఖస్యాస్య నేశ్వరానుగ్రహే యతః. ౩౮. యమంతర్ముఖ మీశో ఽను గృహ్ణీతే తేన లభ్యతే, తస్యేశః స్వాత్మనో రూపం భాసయత్యఖిలం స్ఫుటమ్. ౩౯. పాపం క్రోధమశైకాగ్ర్యం యోగసిద్ధిం చ నైతి యః, త మీశ్వరో న గృహ్ణాతి స జ్ఞానేనైన మాప్నుయాత్., ౪౦. బ్రాహ్మణాదిజగన్మృత్యు సహితం యస్తు సంహరేత్, సోఽయముగ్రః కథం బోద్ధుం శక్యస్స్వ ప్నియతిం వినా._౪౧.

## ప్రథమాధ్యాయము - తృతీయవల్లియొక్క వివరణము.

కో బోద్ధా కశ్చ బోద్ధవ్య ఇతిచే త్తా వృథా శృణు, బుద్ధిప్రవిష్టౌ జీవేశౌ బోద్ధృబోద్ధవ్యతాం గతౌ. ౪౨. అవచ్ఛిన్నో భవే జ్జీవో ఽనవచ్ఛిన్నో మహేశ్వరః, రథస్వామీ చ గంతవ్యదేశో యద్వ దుభౌ యథా. ౪౩. జీవం తం రథినం విద్ధి శరీరం రథ మేవ తు, జీవోపాధి మహంకారం సారథిం ప్రగ్రహం మనః. ౪౪. ఇంద్రియాణి హయా జ్ఞేయా విషయా గమ్యభూమయః, సారథ్యధీనా స్సర్వత్ర రథినః స్సదసద్గతిః. ౪౫. కర్తా సారథి రశ్మీణి నియమ్య మనసా క్రమాత్, గచ్ఛ న్నంతర్ముఖో మార్గపారం విష్ణుపదం వ్రజేత్. ౪౬. ఇంద్రియాది ర్విష్ణుతత్త్వపర్యంతో వ్యాంతరక్రమః, ఇంద్రియేభ్యో భౌతికేభ్యో భూతేష్వాంతరతా స్థితా. ౪౭. తద్భూతేభ్యః స్సూక్ష్మభూతకార్యత్వా న్మన ఆంతరం, తతో ఽతిసూక్ష్మకార్యత్వా త్కర్తృతోపాధి రాంతరః. ౪౮. సమష్టికర్తృతోపాధి రాంతరో వ్యష్టికర్తృకః, సమష్ట్యాఖ్యమహత్తత్వా త్తద్ధేత్వవ్యక్త మాంతరమ్. ౪౯. మాయాఖ్యా ఽవ్యక్తతో ఽప్యస్యాధారః పురుష ఆంతరః, పురుషా న్నపరం కించి త్సర్వం తేనైవ పూరితమ్. ౫౦. సద్రూపః పురుష స్తస్య సత్వేనాన్యత్ర పూరణాత్, అస్తీతి నిఖిలం భాతి పూరకః పురుషో మతః. ౫౧. వస్తుతత్త్వవిచారో ఽతః పురుషే ఽస్మి న్సమాప్యతే, గంతవ్యతత్త్వసీమత్వా ద్రథీ గచ్ఛతి తం క్రమాత్. ౫౨. రథినో వాస్తవం రూపం పూర్ణత్వం తదబోధతః, అవచ్ఛిన్నత్వ మేతచ్చ తద్బోధేన నివర్తతే. ౫౩. ఆత్మా సర్వేషు దేహేషు భ్రాంత్యా గూఢో న భాసతే, ఏకాగ్రయా సూక్ష్మయైతం పశ్యే త్తాచ్ఛీల్యవాన్ ధియా. ౫౪. ధియ స్తథాత్వం యోగీస్స్యా ద్యోగో భూమిచతుష్కవాన్, వాగ్ధీకర్తృసమష్టీనాం నిరోధా ద్భూమయో ఽభవన్. ౫౫. వాగాదికం బాహ్యమక్షం నిరుంధన్ శోషయే న్మనః, మనో నిరుంధ న్కర్తారం శోషయే ద్వ్యష్టిరూపిణమ్. ౫౬. సవికల్పక మేతచ్చ నిరుంధ న్నిర్వికల్పకం, ఆస్మీత్యేత న్మాత్రరూపం మహాంత మవశేషయత్. ౫౭. త మప్యంతే నిరుంధ్యాథ

శాంతాత్మా శిష్యతే స్వయం, క్షురధారేవ విషమో యోగో మందమతే రయమ్. ౧౮. క్షురో ఽతిలగ్నో దేహఘ్నో న లగ్న శ్ఛే ద్వపేత నో, సమాహితం మనో ఽప్యేవం నిద్రాం కుర్యా ద్బహి ర్వ్రజేత్. ౧౯. కౌశలం యోగినో ఽపేక్ష్యం నాపితస్య యథా క్షురే, నివార్య లయవిక్షేపౌ సమా దధ్యా త్పరాత్మని. ౨౦. శబ్దస్పర్శాదిహీనాత్మా సౌక్ష్మ్యా త్సూక్ష్మధియేక్ష్యతే, ఖంవాయ్వగ్ని జలోర్వీణాం స్థౌల్యం శబ్దాదిమత్త్వతః. ౨౧. శబ్దస్పర్శౌ రూప రసౌ గంధో భూతగుణా ఇమే, ఏకద్విత్రిచతుఃపంచగుణా వ్యోమాదయః క్రమాత్. ౨౨. గుణాధిక్యే స్థౌల్యవృద్ధి స్సౌక్ష్మ్యవృద్ధి ర్గుణక్షయాత్, నిర్గుణం చాతిసూక్ష్మత్వా దతిసూక్ష్మధియేక్ష్యతే. ౨౩. విద్యాయోగౌ యమేనోక్తౌ వైరాగ్యం నచికేతసే, స్వతఏవాస్త్యుపాఖ్యానం నాచికేత మిదం శుభమ్. ౨౪.

## ద్వితీయాధ్యాయము - ప్రథమ (చతుర్థ)వల్లియొక్క వివరణము.

ఏతదేవాతివిస్పష్టం పునశ్చాత్ర ప్రపంచ్యతే, శ్రూయతాం నచికేతో ఽత్ర విద్యాయాః ప్రతిబంధకమ్. ౨౫. ఇంద్రియాణి బహిర్ద్రష్టుం ససృజే పరమేశ్వరః, అత స్తైః ప్రత్యగాత్మానం న కశ్చి దపి వీక్షతే. ౨౬. సకామం చ మన స్తద్వ న్నిష్కామం చాత్మశుద్ధయే, సృష్టం తయో ర్యోగయుక్త మనసా ఽఽత్మా ఽవలోక్యతే. ౨౭. యచ్చైతన్యానుగ్రహేణ రూపాదీ నింద్రియైః పుమాన్, జానాతి యేన స్వప్నాది దృశ్యతే తద్విచివ్యతామ్. ౨౮. చైతన్యేన జడం జ్ఞేయ మిత్యుక్తే శిష్యతే ఽత్ర కిం, అజ్ఞానం నిఖిలం ప్రజ్ఞం చైతన్యం బ్రహ్మవస్తు హి. ౨౯. యద్వేదై రపి సందిగ్ధం య త్పృష్టం నచికేతసా, ధర్మాధర్మాద్యతీతం య త్తదిదం బ్రహ్మ వర్ణితమ్. ౩౦. యః కర్మఫలభోక్తా ఽస్తి జీవః ప్రాణాదిధారకః, ఉపాధితో వివిచ్యైతం జ్ఞాత్వే శం న జుగుప్సతే. ౩౧. జుగుప్సా యోనిసంప్రాప్తి ర్నాఽసౌ వేతస్య విద్యతే,

జగత్కర్తృతయా లక్ష్య ఈశో ఽయం తస్య కా జనిః. ౨౨. యద్దేహేఽస్తి తదేవైషు వేదేషు బ్రహ్మ గీయతే, మృత్యోస్స మృత్యు మాప్నోతి యో ఽత్ర నానేవ పశ్యతి. ౨౩. మనసైవేద మాప్తవ్య మేకాగ్రేణచ జీవయోః, తత్త్వ మద్వైత మేతస్మి న్యోగ భేదం న పశ్యతి. ౨౪. హృన్నిష్ఠో బుద్ధ్యవచ్ఛిన్నో జీవో హ్యంగుష్ఠమాత్రకః, ఉపాధ్యపగమే సో ఽయ మీశానో భూతభవ్యయోః. ౨౫. వృష్టం జలం పర్వతాగ్రే బహుధాఽధోగతిం వ్రజేత్, జీవేశభేదదృక్చైవం బహుయోనిషు జాయతే. ౨౬. వృష్టంతు నిర్మలే కూపే సుస్థితం పీయతేఽమృతం, తథైవ బ్రహ్మతాం స్వస్య విజాన న్ముచ్యతే సుధీః.

## ద్వితీయాధ్యాయము-ద్వితీయ (పంచమ) వల్లీవివరణము.

పురమేకాదశద్వారం నాభిమూర్ధన్యసంయుతం, దేహాఖ్యం యస్య తం దృష్ట్వా విముక్తస్స న్విముచ్యతే. ౨౮. జీవ స్నవిద్యా కామాదిబంధై ర్ముక్తో ఽమృతః పునః, శరీరగ్రహణాభావా ద్విదేహస్స న్విముచ్యతే. ౨౯. ప్రాణ మూర్ధ్వం నయత్యాత్మాఽపానవాయుం నయత్యధః, తత్సేవకా శ్చక్షురాద్యా లింగేనాత్మా ఽనుమీయతామ్. ౩౦. సకర్తృకాః ప్రాణచక్షురాద్యాః స్యుస్సాధనత్వతః, కుఠారవ త్తతో నాయ మస్తీత్యేత న్నిరాకృతమ్. ౩౧. ప్రాణాపానవశా ద్దేహీ జీవతీతి యదుచ్యతే, త న్న ప్రాణాద్యాశ్రయో యః కర్తా తేనైవ జీవతి. ౩౨. స కర్తా ఽస్మి న్మృతే దేహే స్వకర్మవశతః పునః, విప్రాదియోనిమాప్నోతి లతావృక్షాదివా మతః. ౩౩. దేహా నీచోత్తమా తాదృక్కర్మకర్తృపురస్సరా, నీచోత్తమత్వా త్ప్రాసాదపర్ణశాలా యథాతథా. ౩౪. సుప్తేష్వక్షేషు యః స్వప్నే కామం కామం సృజత్యయం, దేహాతిరిక్త స్తం కో వా నిరాకర్తుం ప్రభు ర్భవేత్? ౩౫. జీవాత్మానం ప్రసాద్యైవం తస్యైవోపాధ్యపాయతః, బ్రహ్మతాం వేత్తి జగత ఆధారత్వేన లక్షితామ్. ౩౬. అగ్ని ర్యథైకః కాష్ఠేషు ప్రవిశ్య బహుధా భవేత్, తథాఽఽత్మా త్వేక ఏవైషు దేహేషు బహుధోచ్యతే.

౮౭. వాయుశ్చైకోఽపి దేహేషు ప్రవిశ్య ప్రాణరూపతః, బహుధా భాత్యేవ మాత్రా ప్రత్యుపాధి పృథగ్భవేత్. ౮౮. సర్వచక్షుఃస్థరూపోఽపి న రవి ర్నేత్రరోగభాక్, సర్వాత్మత్వేఽపి తద్బ్రహ్మ తథా దుఃఖైర్న లిప్యతే. ౮౯. సర్వభూతాంతరాత్మైకః స్వతంత్రో మాయయాఽఽవృతః, ఏకం స్వం బహుధా కుర్యాద్బహురూపో యథా నటః. ౯౦. మాయోపాధిక ఈశోఽయం బుద్ధ్యుపాధిమతాం నృణాం, కర్మానుసారిణః కామా న్విదధాత్యుపభుక్తయే. ౯౧. స్వచిత్తస్థం సాక్షిరూప మీశం పశ్యంతి యే నరాః, తేషాం నిత్యా దుఃఖశాంతి ర్బ్రహ్మానందశ్చ శాశ్వతః. ౯౨. అనిర్దేశ్యం తమానందం ప్రత్యక్షం మన్వతే బుధాః, సదృశో వా స్వప్రకాశ ఇతిచే న్నస దృశ్యతే. ౯౩. న భాసయంతి సూర్యాద్యా బుద్ధ్యాద్యా శ్చ స్వయంప్రభం, కింతు భాంతం త మన్వేతే భాంతి భాసా తదీయయా. ౯౪.

## ద్వితీయాధ్యాయము-తృతీయ (షష్ఠ) వల్లీవివరణము.

సర్వోత్తమత్వా దూర్ధ్వం త న్మూలం సంసారశాఖినః, దేవమానుషపశ్వాద్యాః శాఖా స్తస్యాధమా మతాః. ౯౫. యన్మూలం తత్స్వయం జ్యోతి స్తదేవామృత ముచ్యతే, తస్మిన్ లోకాః శ్రితా స్సర్వే తచ్చ నాత్యేతి కశ్చన. ౯౬. మాయాశక్తియుజా తేన జగ త్సర్వం నియమ్యతే, అగ్ని సూర్యాదయ స్తస్మా ద్భీతా స్సంత శ్చరంతి హి. ౯౭. నరదేహస్య పాతా త్ప్రాక్ త ద్బోద్ధుం శక్నుయా న్న చేత్, జన్మాంతరేషు తద్బోధః ప్రాయేణాత్యంతదుర్లభః. ౯౮. స్వప్నవ త్పితృలోకస్య స్వాతంత్ర్యం నాస్తి కించన, గంధర్వలోకే భోగేచ్ఛావశా ద్ధీ రతిచంచలా. ౯౯. బ్రహ్మలోకేఽస్త్యేవ బోధః సలోకః సులభో న హి, ఆదర్శవ చ్ఛుద్ధచిత్తే నరేణాత్మేక్ష్యతే స్ఫుటమ్. ౧౦౦. ఇంద్రియాణా మనాత్మత్వ మాగమాపాయదర్శనాత్, బుద్ధ్వా తత్సాక్షిణి స్వస్మిన్ బ్రహ్మత్వం బుధ్యతే సుఖమ్. ౧౦౧. మందశ్చేదక్షధీకర్తృసమష్ట్యవ్యక్తరూపతః, క్రమా ద్వివిచ్య మూఢ స్సన్ వీక్ష్యతే

సూక్ష్మయా ధియా. ౧౦౨. బాహ్యేషు విషయేష్వాత్మస్వరూపం న హి తిష్ఠతి, నివృత్తాక్షో నిరుద్ధేన సూక్ష్మేణ మనసేక్షతే. ౧౦౩. అప్రమత్తోఽఖిలాక్షాణి సకర్త్రాణి యదా పుమాన్, నిరుణద్ధి తదా యోగం తా మవస్థాం ప్రచక్షతే. ౧౦౪. సర్వాక్షాగోచరత్వేఽపి స్వాత్మా ఽస్తీత్యాహ తత్త్వవిత్, కారణస్యాత్మనోఽసత్త్వే శూన్యం కార్యం జగద్భవేత్. ౧౦౫. అస్తిత్వే నోపలబ్ధవ్యో నాయమస్తీతి న త్వయా, సర్వత్రానుగతం యత్త త్తన్నాస్తీత్యుచ్యతే కథమ్. ౧౦౬. సోపాధికం తావదాదౌ దృష్ట్వాఽస్తీతి తతః పునః, ఉపాధీ న్సంపరిత్యజ్య తత్త్వభావేన పశ్యతి. ౧౦౭. ఉపాధీనాం మాయయైషాం కల్పితత్వేన తై ర్వినా, నిరుపాధికసన్మాత్రం వస్తు తచ్ఛతధీష్యతామ్. ౧౦౮. కలుషం జల మానీయ తతోఽస్మి న్కతకం రజః, యదా క్షిపే త్తదా నీరం ప్రసీదతి యథా తథా. ౧౦౯. సోపాధికజ్ఞానవతో నిరుపాధిః ప్రసీదతి, రజఃప్రక్షేపసదృశీ యోగా న్నిష్కామతా ధియః. ౧౧౦. యథా సర్వే ప్రముచ్యంతే కామా యేఽస్య హృది స్థితాః, తథైవ మర్త్యతాం హిత్వా స జీవ న్బ్రహ్మతాం వ్రజేత్. ౧౧౧. అహంకారేణ చైతన్యం గ్రథిత్వేచ్ఛతి చే త్తదా, హృదయే గ్రంథయః కామా స్తే భిద్యన్తే వివేకినః. ౧౧౨. అహంకారచితో రైక్యభ్రాంతే రపగమే సతి, కామాభాసా స్సంతు చిత్తే క్రమా న్నశ్యంతి తే ఽపిచ. ౧౧౩. జీవన్ముక్తస్తు నిష్కామో న మృతిం ప్రతిపద్యతే, ప్రాణోత్క్రాంతి ర్మృతస్యాస్య జ్ఞానినో నహి విద్యతే. ౧౧౪. ప్రాణా అంత ర్విలీయంతే తప్తాశ్మక్షిప్తనీరవత్, జ్ఞానీ పురాఽపి బ్రహ్మైవ సన్బ్రహ్మాప్యేతి తల్లయే. ౧౧౫. బ్రహ్మ బోద్ధుమశక్త స్స న్నుపాస్తే చే త్తదా పుమాన్, నాడ్యా మూర్ధన్యయా బ్రహ్మలోకం గత్వా విముచ్యతే. ౧౦౬. అత్రైవోపాసకస్యాస్య ధీశుద్ధిశ్చే త్తదా త్వసౌ, దేహా ద్వివిచ్య హృన్నిష్ఠం బ్రహ్మాత్వేనావగచ్ఛతి. ౧౧౭. మృత్యుప్రోక్తాం నాచికేతో విద్యాం యోగం తథాఽఖిలం, లబ్ధ్వా బ్రహ్మాఽఽప్తవా నేవం లబ్ధ్వా ఽన్యోఽపి విముచ్యతే. ౧౧౮. విద్యాతత్ఫలయో

ర్విఘ్న శాంత్యర్థం సహనావితి, మంత్రం జపే త్తేన విఘ్నా శ్శామ్యం త్యేవ న సంశయః. ౧౧౯. వైరాగ్యం నాచికేతస్య యథా తీవ్రం తథా పుమాన్, ప్రాప్నోతి సేవ్యమానస్సన్విద్యాతీర్థమహేశ్వరమ్. ౧౨౦.

ఇతి శ్రీవిద్యారణ్యవిరచితే అనుభూతిప్రకాశే

కఠవల్లీవివరణం నామ

ఏకాదశోఽధ్యాయః. ౧౧.

---

శ్రీగురుభ్యో నమః.

ఆ త్మ పు రా ణే

# కఠోపనిషద్వివరణరూపః.

## నవమోఽధ్యాయః.

### ఉపోద్ఘాతః.

ఏవం మాయా పృథగ్దృష్టా హ్యై రమీషాం విచారణాం, శ్రుత్వా శిష్యో గురుం భూయః పర్యపృచ్ఛ దిదం వచః. ౧. గురో త్వయా మమానేకమునిదృష్టం స్వవేదనం, విచిత్రాఖ్యానసంయుక్త ముక్తం తన్మోక్షసాధనమ్. ౨. ఐతరేయో ముని స్తద్వ న్మునిః కౌషీతకి స్తథా, ఆదిత్యో భగవాం స్తద్వద్యచ్ఛ్వేతాశ్వతరో మునిః. ౩. వేద తత్సకలం త్వత్తః శ్రుత మాఖ్యానసంయుతం, మయా గురో విచిత్రార్థా స్తత్ర చిత్రాః కథా మతాః. ౪. ప్రజానా మృషిభి స్సార్థం సంవాదో బ్రహ్మబోధకః, వామదేవస్య ముక్తస్య నిజానుభవకీర్తనమ్. ౫. ప్రతర్దనస్య కాశ్యస్య దైవోదాసే ర్మహాత్మనః, విజయః శక్రసంవాదరూపో బ్రహ్మాత్మబోధకః. ౬. బాలాకే శ్చైవ దృప్తస్య సంవాదో ఽజాతశత్రుణా, వంశః కాండత్రయస్యాపి భిన్నాభిన్నస్వరూపతః. ౭. అశ్విభ్యా మపి సంవాద ఋషే స్సర్వార్థదర్శినః, దధ్యఙ్ఙాథర్వణస్యాపి వ్యసనం శక్రసంభవమ్. ౮. బ్రహ్మవిద్యాకృతే తద్వ దశ్విభ్యా మపి యత్కృతం, యాజ్ఞవల్క్యస్య సంవాదో నానాదేశ్యై ర్ద్విజోత్తమైః. ౯. శాకల్యస్య తత్రైవాత్ర మరణం ద్వేషకారిణః, యాజ్ఞవల్క్యేన మునినా బ్రహ్మవిద్యోపదేశనమ్. ౧౦. వారద్వయం క్షితీశాయ జనకాయ మహాత్మనే, మైత్రేయ్యై చ

స్వజాయాయాస్మై ప్రవ్రజ్యాం హి యియాసునా, ౧౧. అత్యాశ్రమిభ్యో విజ్ఞానం యచ్ఛ్వేతాశ్వతరో మునిః, ఉక్తవాం స్తచ్చ తత్రైత చ్ఛ్రుతి మిత్థం యయా గురో. ౧౨. సంప్రార్థితాశ్చ దేవానాం బ్రహ్మవిద్యాం కదాచన, ప్రయచ్ఛన్తి వరాన్ కింతు తతోఽన్యా నపి దుర్లభాన్. ౧౩. సత్యపాశవశం ప్రాప్తాః కథంచి త్తాం వదంతి చ, యథా యమః పురాఽవాదీ ద్దర్శనే నచికేతసే. ౧౪. తదిదం శ్రోతు మిచ్ఛామి మహా త్కౌతూహలం గురో, కథం యమో బ్రహ్మవిద్యా ముక్తవా న్నచికేతసే. ౧౫. కీదృశాయ చ కా సాఽపి బ్రహ్మవిద్యా గురో వద, ఇత్యుక్తే గురు రాహైత దాఖ్యానం వేదకీర్తితమ్. ౧౬. ప్రహృష్టో హృష్టమనసే స్వశిష్యాయ ప్రియాయ సః,

## ప్రథమాధ్యాయము-ప్రథమవల్లి, ౧-వ మంత్రవివరణము.

ఆసీ దుద్దాలకో నామ్నా విప్రో వేదవిదాం వరః. ౧౭. అరుణస్య సుతో లోకే కమనీయతమస్సదా, అన్నదానేన నితరాం కీర్తిం ప్రాప్తో ద్విజోత్తమః. ౧౮. కదాచి త్క్రతుచి ద్యాగే సర్వస్వం దాతు ముద్యతః,

## ప్రథమాధ్యాయము-ప్రథమవల్లి, ౨-వ మంత్రవివరణము.

పుత్రస్త్వంప్రణిధాయైవ శుభాగాః స్నేహసంయుతః. ౧౯. పుత్రేఽతి బాలకే విప్రో ధర్మజ్ఞానాం పురస్థితః, గోవిత్తమేవ బహుళ మస్యాసీ ద్బ్రాహ్మణస్య హి. ౨౦.

## ప్రథమాధ్యాయము-ప్రథమవల్లి, ౩-వ మంత్రవివరణము.

వృద్ధగా స్తు స్వయం తత్ర జగృహే పుత్రలోభతః, స్వభాగేన చ తాః సోఽపి బ్రాహ్మణేభ్యో దదౌ తదా. ౨౧. పాతుం పానీయమప్యేతా అత్తుం చ యవసం తథా, న శక్తాః కేన దుగ్ధస్య దానే శక్తా స్తు ధేనవః. ౨౨. ఆశా తాసు కథం నామ భవే ద్గర్భస్య ధారణే, ఏతాదృశీ స్తు గా దాతుం ప్రవృత్తో ఽయం కదాచన. ౨౩. తస్యాసీ త్తనయః కశ్చి న్నచి

కేతా ఇతి శ్రుతః, స్వభావాదాస్తికో నిత్యం కుమారః పంచహాయనః. ౨౪. ఇదం విచారయామాస పితు రంకస్థిత స్తదా, యద్యేన దీయతే యస్మై యాదృశాయ చ యాదృశమ్. ౨౫. త త్తేన లభ్యతే యస్మా త్తాదృశేన చ తాదృశం, ఏతా గావో ఽధునా దత్తాః పిత్రా క్లేశైకహేతుకాః. ౨౬. విప్రాణాం తత ఏవాయం పితా క్లేశం గమిష్యతి, అసుఖా నామ యే లోకాః సర్వ్వదైవ భయప్రదాః, ౨౭. దుఃఖదో బ్రాహ్మణానాం య స్తాన్ స యాతి న సంశయః, తాం దదద్దుఃఖదో మే ఽత్ర పితా యాః స్యుర్నిరర్థకాః. ౨౮. గా స్తస్మా దము మేతస్మా ద్వారయామి కుదానతః, అనేన స్థాపితా గావో మదర్థం యాః స్సుశోభనాః. ౨౯. తాసా మేవ కరోత్వత్ర దాన మస్య మమైహికం, పుత్రదారాదికం విత్తం పరలోకోపకారి యత్. ౩౦. తదేవ విత్తం విజ్ఞేయం పరం లోహశృంఖలా, అహం చాస్య సుతో యస్మా త్తస్మా ద్విత్తం న సంశయః. ౩౧. అస్యైవ ధర్మ్మతః స్వస్య జనకస్య మహాత్మనః, అంధం తమః పితా యస్య దుఃఖోదధిసమం వ్రజేత్. ౩౨. సుతస్య జానతః పుత్రః పితు రుచ్చార ఏవ సః, తతో ఽహ మాత్మనో దానే ప్రేరయిష్యామ్యహం మయి. ౩౩. స్నేహాయుక్తం తత శ్చిత్త మయం మే జ్ఞాస్యతి స్వయం, అథ చైవం వచః శ్రుత్వా ప్రశ్న మేష కరిష్యతి. ౩౪. తతో ఽహం విశదం తస్మై వక్ష్యే పిత్రే ఽత్ర పృచ్ఛతే, ఇతి సంచింత్య తనయః పితరం ప్రాహ ధర్మ్మవిత్. ౩౫.

## ప్రథమాధ్యాయము-ప్రథమవల్లి, ౪-వ మంత్రవివరణము.

తాత కస్మై ద్విజేంద్రాయ మాం భవా న్సంప్రదాస్యతి, ద్విత్రివార మిదం వాక్య ముక్తవాన్ పితరం ప్రతి. ౩౬. పితాఽపి పండితంమన్యం విజ్ఞాయ తనయం తతః, కోపసంరక్తనయన ఇదం వచన మబ్రవీత్. ౩౭. త్వా మహం పండితంమన్యం పితృస్నేహావమానకం, దాస్యామి మృత్యవే సర్వ్వలోకసంహారహేతవే. ౩౮.

## ప్రథమాధ్యాయము-ప్రథమవల్లి, ౫-వ మంత్రవివరణము.

ఏవముక్తే సపుత్రో ఽపి చింతామేతా ముపాగతః, అయం దుఃఖ కరం స్వస్య కస్మా దేత ద్వచో ఽబ్రవీత్. ౩౯. పితా మమ యథా కశ్చి త్తామసః పామరః పరః, పుత్రస్య మరణా ద్దుఃఖం బ్రహ్మహత్యాఫలం విదుః. ౪౦. కుత ఏత త్స్వయం స్వస్య కృతవాన్ బుద్ధిమా నయం, మమ నాతః పరం శ్రేయో యస్మాం తస్తై పితా స్వయమ్. ౪౧. దత్తవాన్ మృత్యవే యో మాం స్వయ మేవ గ్రహిష్యతి, అస్య దుఃఖం పరం నిత్యం పితు రత్ర భవి ష్యతి. ౪౨. యతో ఽహం ప్రథమం నిత్యం బహూనా మస్మి మధ్యమః, తనయానాం ప్రియ శ్చైవ సర్వదా ఽస్మి మహాత్మనః. ౪౩. మాం వినా క్షణం త్వేవ పితా మే ఽత్రావతిష్ఠతే, కింస్వి ద్యమస్య సంయాతే గృహే మయి కరిష్యతి. ౪౪. కార్యం మయా వినా నూనం మ త్త ఏవ భవిష్యతి, ఇతో మయి గతే నూనం దుఃఖ మస్య భవిష్యతి. ౪౫. కర్తవ్యం చ మయా కింస్వి ద్యమస్యాద్య భవిష్యతి, మమాస్య చ వియోగో ఽయ ముభయో రప్ర యోజకః, ౪౬. యమస్య చ తతః కష్టం కృతవా న్మే పితా ఽధునా,

## ౧. అధ్యా. ౧-వ వల్లి, ౬-౧౮ మంత్రములవివరణము.

ఇదానీ మేవ వచనం పరిమ్లానం పితు ర్మమ. ౪౭. అశ్రూణి చ బహూన్యేష మాం విలోక్య విముంచతి, ఆలింగయతి మాం గాఢం స్నేహ పూర్ణాంతరాత్మనా. ౪౮. అనుతాపం పరం ప్రాప్త స్తిష్ఠత్యేష ఽతిదుఃఖి తః, తత ఏవం వదామ్యద్య మయి స్నేహం యథా త్యజేత్. ౪౯. అన్యథా ఽనృతవాక్యేన నరకో ఽస్య భవిష్యతి, ఇతి సంచింత్య పితర మిదం వాక్య మభాషత. ౫౦. అనుపశ్య యథా పూర్వే పూర్వజా స్తవ సువ్రత, అనృతం నోక్తవంత స్తే మరణే ఽపి మహాధియః. ౫౧. ఆత్మాన మవలోక్యాథ తా న్సర్వాంశ్చ స్వపూర్వజాన్, ప్రతిపశ్య పరాం స్తద్వ త్తావద్భుతాన్ సత్య వాదినః. ౫౨. త్రైవర్ణికాన్ మహాభాగాన్ దధ్యఙ్ఙాథర్వణాదికాన్, కర్ణ

స్త్వచం శిబి ర్మాంసం జీవం జీమూతవాహనః. ౧౩. దదౌ దధీచి రస్థీని ప్రతిశ్రుత్య వచః పురా, దధ్యఙ్ఞాథర్వణో ఽశ్విభ్యాం బ్రహ్మవిద్యాం ప్రతిశ్రుతామ్. ౧౪. త్యక్త్వా నిజం శిరో ఽప్యాహ బ్రాహ్మణో వేదవిత్తమః, ఇంద్రః ప్రతర్దనాయాహ బ్రహ్మవిద్యాం స్వశత్రవే. ౧౫. ప్రతిజ్ఞాయ దదౌ కామవరం జనకభూభుజే, యాజ్ఞవల్క్యో ఽపి మేధావీ బ్రాహ్మణో వేదవిత్తమః. ౧౬. తథా దశరథో రాజా ప్రాణేభ్యో ఽపి ప్రియం సుతం, అరణ్యే ప్రేషయామాస సింహవ్యాఘ్రాదిసేవితే. ౧౭. ఏవ మన్యే ఽపి బహవః కృతవంతో ఽతిదుష్కరం, సత్యపాశవశం ప్రాప్తా బహులాద్యాశ్చ జంతవః. ౧౮. అపి సస్యం యథా తద్వ ద్దివసే దివసే జనః, పచ్యతే కాలసూర్యేణ తద్వదేవ ప్రజాయతే. ౧౯. తతో ఽహం స్వయమేవాత్ర మరిష్యామి న సంశయః, త్వం చ తద్వ జ్జనా స్సర్వే మృత్యుపాశవశంగతాః. ౨౦. తత స్త్వం వచనం సత్యం కురు దత్వా యమాయ మాం, ఏవం తవ మమాప్యత్ర శ్రేయ స్తాత భవిష్యతి. ౨౧. ఏవ ముక్తో ఽతిదుఃఖేన పితా పుత్రం యమాయ సః, ప్రాహిణో ద్ధీతవచనః సత్యపాశవశం గతః. ౨౨. స తు గత్వా మహాభాగో నచికేతా యమాలయం, పితృభక్త్యా తథైవాత్మతపసా శుద్ధచేతసా. ౨౩. యమే గ్రామాంతరం యాతే ఉపవాసత్రయం గృహే, చకార తస్య తేనాత్మపరిగ్రహణకారణాత్. ౨౪. అన్యథా స్వపితు ర్వాక్య మసత్యం త ద్భవిష్యతి, దాతవ్యస్యాత్మన స్తేన యమేన న పరిగ్రహే. ౨౫. యమో ఽపి పరివారేణ కృత్వా సంకేత మాత్మనః, దినత్రయం గృహే నాగా త్తస్య చిత్తపరీక్షకః. ౨౬. ఏన మాగత మాజ్ఞాయ సర్వే తే యమకింకరాః, గృహే స్థిత మిదం వాక్య ముక్తవంతో ఽతిధార్మికాః. ౨౭. అస్మి న్యమపురే ఘోరే కిమర్థం విప్రబాలక, ఆగతో ఽసీతి తై రుక్తే సర్వ మేత దువాచ సః. ౨౮. పూర్వమేవ చ తే సర్వే జ్ఞాతతత్త్వా యమాశ్రితాః, జ్ఞాత్వా బాలస్య వచనా త్పున రూచు రిదం వచః. ౨౯. వత్స నాయుఃక్షయా త్పూర్వం యమో గృహ్ణాతి కంచన,

అదత్తం వా పి దత్తం వా చతుర్విధశరీరిణామ్. ౨౦. ధర్మరాజశ్చ నాత్రాస్తి ప్రాణినాం యో నియామకః, తతస్త్వం స్వగృహం శీఘ్రం గచ్ఛ స్వం పితరం ప్రతి. ౨౧. ఇత్యాది బహుధోక్తస్తైర్న చచాల యదా తదా, తృతీయే దివసే ఽతీతే యమ ఆగాన్నిజం గృహమ్. ౨౨. ఆగతం ధర్మ రాజం తం కింకరా ఇద మూచిరే, యమ వైశ్వానరో విప్రకుమార స్తే గృహే ఽతిథిః. ౨౩. తస్య శాంత్యర్థ ముదకం ఝటిత్యాహర మానద, జ్వలతో ఽత్ర యథా వహ్నే ర్భవే చ్ఛాంతి ర్జలై స్సదా. ౨౪. అర్ఘ్య పాద్యాదిభి స్తద్వ దతిథే శ్శాంతి రీరితా, శాంతిహీనో యథా వహ్ని రుదకై స్సపరిచ్ఛదాన్. ౨౫. గృహాన్ దహతి తద్వత్స్యా దతిథిః సర్వ దాహకః, అపూజితో నరేణాయ మర్ఘ్యపాద్యాదిభి ర్జలైః. ౨౬. సంభా వితసుఖస్యాశా ప్రతీక్షా నిశ్చితస్య చ, సుఖస్య సంగతం తద్వద్ద్వివిధం సుఖ హేతుకమ్. ౨౭. స్వాభీష్టేన జనేనాత్ర సూనృతా యా సమీరితా, వాణీ సుఖకరీ లోకే వేదే చార్థప్రకాశినీ. ౨౮. అగ్నిష్టోమాదికో యాగ ఇష్ట మిత్యుచ్యతే బుధైః, కూపారామతటాకాది పూర్త ముక్తం మనీషిభిః. ౨౯. ఔరసా స్తనయా స్తద్వ త్సర్వలక్షణసంయుతాః, గవాద్యాః పశవ స్తద్వ ద్బహుమూల్యా అనేకశః. ౩౦. ఏత త్సర్వం దహత్యేవ పురుష స్యాల్పచేతసః, యస్యానశ్న న్వసే దత్ర బ్రాహ్మణ స్త్వతిథి ర్గృహే. ౩౧. ఏవ ముక్తో యమ స్తైః స్తైః కింకరై రుక్తవా సథ, అతిథిం మితచేతాః సక్తం తదా నచికేతసమ్. ౩౨. తిస్రో రాత్రీ ర్గృహే యన్మే హ్యవాత్సీ స్త్వం ప్రియో ఽతిథిః, అనశ్నం స్తత ఏవ త్వం వరాం స్త్రీన్ వరయా ధునా. ౩౩. స్వస్తి తే ఽస్తు ప్రియం కర్తుం యది బ్రహ్మన్ సముద్యతః, నమ స్తే ఽతిథయే తస్మా దస్తు మేచా స్త్వనామయమ్. ౩౪. ఏవముక్తో యమే నైవ నచికేతా వరాం స్త్రీమాన్, వవ్రే త్రీన్ బుద్ధిసంపన్నో ధర్మరాజం ప్రతీదృశాన్. ౩౫. పితృప్రసాద మగ్నేశ్చ జ్ఞానం చైవాత్మన స్తథా, పితృప్రసాద మేవం స వవ్రే బుద్ధిమతాం వరః. ౩౬. దుఃఖహీనో యథా

ఽహం వై త్వత్ప్రసాదా ద్దివి స్థితః, సుమనా విగతక్రోధ స్తథా మాం ప్రతి గౌతమః. ౮౭. యమలోకా త్పునః ప్రాప్తం నాఽవిశ్వాస ముపాగతః, యథా పూర్వం వదేదేష వరో మే ప్రథమః స్మృతః. ౮౮. పితు ర్మే సుమహ ద్దుఃఖం వర్తతే మా మపశ్యతః, మనస శ్చ తథా తాపో మహాన్ వాక్య సమీరణే. ౮౯. మృత్యవే త్వా దదామీతి సక్రోధావిష్టచేతసః, పండితం-మన్యతాం తద్వ న్మమ జ్ఞాత్వా మహాత్మనః. ౯౦. క్రోధశ్చ సుమహాం శ్చిత్తే వర్తతే వహ్నినా సమః, యమం ప్రాప్య తథా కోఽపి మర్త్యలోకం న యాతిచ. ౯౧. తేనైవ వపుషా తస్మా దవిశ్వాస శ్చ సంభవేత్, ఇతో మయి గతే తత్ర ధర్మరాజ వరప్రద. ౯౨. మాభూయా దఖిలం త్వేత త్సంభావ్యం త్వత్ప్రసాదతః, ఏవ ముక్తో ధర్మరాజో నచికేతస మబ్రవీత్. ౯౩, సర్వ మేత త్త్వయా ప్రార్థ్యం పితు స్తేఽద్య భవిష్యతి, యథాపూర్వం స విశ్వాసీ మర్త్యలోకం గతే త్వయి. ౯౪. మయా సంప్రేరితే తత్ర తావ త్సర్వం భవిష్యతి, త్వత్కృతే నైవ దుఃఖం స గమిష్యతి కదాచన. ౯౫. వీతమన్యు శ్చ భవితా సుఖం స్థాస్యతి సర్వదా, నిద్రాహారాదికం తద్వ త్సుఖచిత్తో గమిష్యతి. ౯౬. ఉద్దాలకః పితా తే స ఆరుణిః సర్వశాస్త్రవిత్, దృష్ట్వా మృత్యు ముఖా న్ముక్తం భవన్తం పునరాగతమ్. ౯౭. పితృప్రసాద మాసాద్య వరం యమముఖా త్పునః, నచికేతా ధర్మరాజ మిదం వవ్రే వరాంతరమ్. ౯౮. స్వర్గే లోకే భయం కించి న్మనుజానాం న విద్యతే, మృత్యో స్త్వత్తో జరాతో వా వ్యాధితః శత్రుతో ఽపివా. ౯౯. క్షుధాతో వా పిపాసాతః శోకతో మోహతోఽపివా, మోదతే చ సదా జంతుః సుఖీ భూత్వేతి హి శ్రుతమ్. ౧౦౦. సతు స్వర్గో నృభి ర్గమ్య శ్చితైవాగ్నినా సదా, స్వర్గ్య మగ్నిం భవాన్ స్వర్గే స్మరత్యేవ న సంశయః. ౧౦౧. శ్రద్దధానాయ మహ్యం త్వం త మగ్నిం వక్తు మర్హసి, మోక్షం చ స్వర్గలోకస్థా భజంతి బ్రహ్మవిద్యయా. ౧౦౨. ఆభూతసంప్లవం స్థానం బ్రహ్మజ్ఞానం వినా ఽపిచ, అయం వరో ద్వితీయో మే దాతవ్యో భవతాఽనఘ. ౧౦౩. ఏవ ముక్తో

యమో రాజా నచికేతస మబ్రవీత్, స్వర్గ్య మగ్ని మహం జానన్ బ్రవీమి
నచికేతసే. తుభ్యం ప్రకర్షత స్తత్త్వం సావధానమనాః శృణు, అనంత
లోకసంప్రాప్తౌ స్థితావపిచ కారణమ్. ౧౦౫. ఏత మగ్నిం సదా బుద్ధౌ ధీమ
తాం సమవస్థితం, విద్ధి స్వరూపత స్సన్తం కాష్ఠేష్వివ జగత్త్రయే. ౧౦౬.
ఏవ ముక్త్వా యమో రాజా లోకాదిం సర్వకారణం, విరాడాత్మక మగ్నిం
తం తస్మై శిష్యాయ సోఽవదత్. ౧౦౭. యద్రూపా ఇష్టకా స్తద్వద్యావం
త్యో వా యథాఽపివా, చీయంతే సకలం తద్వ ద్ద్రవ్యమంత్ర క్రియాదికమ్.
౧౦౮. ప్రత్యవాదీ త్సచాప్యేత దధీతం యత్తు మృత్యుతః, విశ్వాససహిత
శ్శిష్యో ధర్మరాజస్య శాసనాత్. ౧౦౯. శిష్యస్య తస్య సంలోక్య మృత్యుః
ప్రజ్ఞా మలౌకికీం, యథోక్తోచ్చారణా దగ్నేః సంతుష్ట ఇద మబ్రవీత్.
౧౧౦. వరత్రయా ద్వరో ఽన్యోఽయం మయా తుభ్యం ప్రదీయతే, తవై
వాయం మయోక్తో ఽగ్ని ర్నామకారీ భవిష్యతి. ౧౧౧. నాచికేత మముం
వహ్నిం కథయిష్యంతి సద్ధియః, యావ ద్వేదాశ్చ సూర్య శ్చ తథా భూతా
దికం జగత్. ౧౧౨. తావ దగ్ని రయం బ్రహ్మం స్తవ నామ్నా భవిష్యతి,
అన్యం చైవ వరం తుభ్యం దదామి నచికేతసే. ౧౧౩. అగ్నేరుచ్చారణా
త్తుష్టః స్వశిష్యాయ మహాత్మనే, జాంబూనదమణిప్రోతసూత్రసంగవిరాజితామ్.
౧౧౪. అమూల్యనవరత్నౌఘమండితాం సూర్యసన్నిభాం, స్థూలామలకసంమాన
ముక్తకోటివిలంబినీమ్. ౧౧౫. మాలా మిమాం మయా దత్తాం స్వవక్షసి విధా
రయ, చిత్రవర్ణాం యథా మేఘో విద్యుతం శబ్దసంయుతామ్. ౧౧౬. ఇత్యు
క్త్వా తా మదా న్మాలాం తస్మై స నచికేతసే, ధర్మరాజోఽతిసంతుష్టో
హ్యగ్నే రత్రానుభాషణాత్. ౧౧౭. నాచికేత మముం యోఽగ్నిం త్రి శ్చి
త్వోక్తవిధానతః, యాగాం స్త్రీన్ కురుతే మాతృ పిత్రాచార్యైః సుశిక్షితః.
౧౧౮. జన్మమృత్యూ తరే త్సోఽత్ర బ్రహ్మవిజ్ఞానజన్మనా, వినా ఽపి
బ్రహ్మవిజ్ఞానసాకల్యం వా భవే ఽత్ర హి. ౧౧౯. స్వర్గే వాసో ఽథవా
మోక్షో బ్రాహ్మణస్య హి కస్య చిత్, స్వర్గా దస్య పరిభ్రంశో ధర్మిష్ఠస్య

మహాత్మనః. ౧౨౦. న భవే త్పుణ్యం యావద్వై తావత్కాలం వసే ద్ధ్రువం, బ్రహ్మణ స్సాత్రతో జాత మగ్నిం సర్వజ్ఞరూపిణమ్. ౧౨౧. విరాజం దీప్తవ పుషం స్తుత్యం సర్వై స్సురాసురైః, జ్ఞాత్వా కర్మాదికం కృత్వా స్వర్గం మోక్షంచ వా వ్రజేత్. ౧౨౨. యత ఏవం తతో యేన త్రిశ్చితో ఽగ్ని ర్భవే దయం, ఏతత్త్రయం సువిజ్ఞాయ రూపసంఖ్యాప్రకారతః. ౧౨౩. ఇష్టకా అగ్నిరూపం స స్వర్గే లోకే ఽత్ర మోదతే,

## ప్రథమాధ్యాయము-ప్రథమవల్లి, ౧౯-వ మంత్రవివరణము.

ఫలేన సహితం దేవ మగ్ని ముక్త్వా యమః పునః. ౧౨౪. ఇదం వచ న మాహైత త్స్వాశిష్యం నచికేతసం, అంగుళ్యా నిర్దిశ న్నగ్ని మేష తే ఽగ్ని ర్మయేరితః. ౧౨౫. నచికేత స్త్వయా పృష్టః స్వర్గ్యో యో దుర్లభో నృణాం, ద్వితీయో ఽయం వరో జాత స్తృతీయం వరయాధునా. ౧౨౬.

## ప్రథమాధ్యాయము-ప్రథమవల్లి, ౨౦-వ మంత్రవివరణము.

ఏవముక్తో పునః ప్రాహ తృతీయవరలిప్సయా, నచికేతా ధర్మరాజం సత్యపాశవశంగతమ్. ౧౨౭. ధర్మరాజ జన స్సర్వ శ్చతుర్విధశరీరభాక్, మ్రియతే సర్వథైవాంతే కాలాదేవ న సంశయః. ౧౨౮. మృత్యు ర్జన్మభృ తాం యస్మా ద్దేహేన సహ జాయతే, అద్యవాఽబ్దశతాంతే వా తతః సర్వో మృతింవ్రజేత్. ౧౨౯. జాతానాం మరణం నిత్యం బ్రహ్మాదీనాం సమంతతః, అవశ్యకం ధర్మరాజ శ్రుత మేత న్మయా పురా. ౧౩౦. విద్యమానోఽపి దే హే ఽస్మి న్న సత్తా మాత్మన స్సదా, కేచి ద్వదంతి ధీమంత ఏవం యుక్తి పరాయణాః. ౧౩౧. ఆత్మా నామ న దేహాదిసంఘాతా దపరోఽస్తిహి, న లేభ్య స్తు పృథక్త్వేన యస్మా న్నైవోపలభ్యతే. ౧౩౨. ఆత్మా దేహాదిసం ఘాతా త్పృథక్త్వే స తు కీదృశః, స్పర్శాదిమా న్యథా ఽన్యో వా ప్రాపిత స్సర్వదేహినామ్. ౧౩౩. స్పర్శేన లభ్యమానశ్చే ద్వాయు రేవ భవిష్యతి, ఆత్మా ప్రాణ ఇతి ప్రాప్తో వ్యానిష్టం తచ్చ వాదినామ్. ౧౩౪. అపి ప్రాణో వాయు

రూపో భవే దాత్మా యదా తదా, తేజఆది కుతో నాత్మా భవే దేతద్వదం త్వివా. ౧౩౫. ప్రాణేన న వినా యద్వ జ్జీవనం తద్వదేవ హి, తేజఆది వినా ఽప్యత్ర న దృష్టం జీవనం క్వచిత్. ౧౩౬. అనుష్ణో వా ఽపి నీరక్తో వ్యానోఽణా వా న జీవతి, అగ్నే రౌష్ణ్యం వపుష్యస్మిన్ రక్తం నీరా త్ప్రజాయతే. ౧౩౭. పృథివీత స్తథాఽజో ఽపి వాయోః ప్రాణశ్చ దేహినాం, అపాదో ఽత్ర చతుర్ణాం హి సమ ఏవ ప్రదృశ్యతే. ౧౩౮. మరణే పక్షపాతో ఽయం వ్యర్థః ప్రాణే తు వాదినాం, ఔష్ణ్యాదీనా మచైతన్యం యది ప్రాణేఽపి తత్సమమ్. ౧౩౯. అవస్థానే చతుర్ణాం హి జ్ఞాన ముత్పద్యతే యదా, తదా ప్రాణస్య విజ్ఞాన మితి కేన వినిర్ణయః. ౧౪౦. అతః ప్రాణాత్మవాదో ఽయం మోహమాత్రవిసర్పితః, బాలిశై ర్వాదిభి ర్యుక్తిహీనై రాత్మవిమోహకః, ౧౪౧. అపి ప్రాణో నిరాధారః కుతో దేశాంతరం వ్రజేత్, వ్రజన్ వా విలయం కేన న వ్రజే ద్బాహ్యవాయువత్. ౧౪౨. న బాహ్యవాయవో నాశం నయాంతీతి వ్యవస్థితిః, అపి వాయుస్వరూపో ఽయం సచ్ఛిద్రే ఽస్మిన్ శరీరకే. ౧౪౩. కేన బద్ధో వపు ర్హిత్వా యేన నాయం బహి ర్వ్రజేత్, కర్మణా బంధనం దేహే కర్మణైవ వినాశనమ్. ౧౪౪. యది ప్రాణస్య తత్కర్మ నిత్యం వా నిత్య మేవ వా, నిత్యేన కర్మణా దేహే బంధనం వా వినాశనమ్. ౧౪౫. యది తస్య తదేవాత్మా కుత స్తేన భవిష్యతి, అనిత్యే తస్య నాశేన దేహా ద్వద్వ ద్బహి ర్వ్రజేత్. ౧౪౬. నాశం కేనతు తన్నాశా దేవ నైవ ప్రయాస్యతి, తస్మా త్ప్రాణస్య యేషాం స్యా దాత్మత్వం తన్మతేఽపిహి. ౧౪౭. భూతానా మాత్మతైవ స్యా త్ప్రిచ్ఛన్నా శబ్దభేదతః, స్పర్శవాం స్తత ఏవాత్మా న భవే ద్దేహాతః పృథక్. ౧౪౮. అదర్శనాచ్చ సతతం న రూపరసగంధవాన్. చతుర్భ్యో ఽపిచ భూతేభ్యః శబ్దవాన్ న పృథక్ క్వచిత్. ౧౪౯. పృథక్త్వసంభవే వంధ్యాపుత్రో ఽత్ర కలభాషణః, అపిచేత్ శబ్దవా నేవ గృహ్యతే కేన తద్వద. ౧౫౦. న హి శబ్దవతాం శ్రోత్రా దస్తి లోకే గ్రహః క్వచిత్, మనసా గ్రహణం నైవ క్వచిత్సిద్ధి వ్యవస్థితమ్. ౧౫౧. యద్య

భవతి తచ్ఛృణు, యోని మన్యే ప్రపద్యన్తే జంగమత్వాయ దేహినః, ౧౮౩. స్థావరత్వం పరే యాంతి యథాకర్మ యథాశ్రుతం, పుణ్యాధిక్యా ద్భవంత్యేతే జంతవో జంగమాత్మకాః, ౧౮౪. పాపాధికాశ్చ సతతం భవంతి స్థావరా అపి, జంగమేషు చ పుణ్యస్య తారతమ్యా ద్భవంత్యమీ. ౧౮౫. బ్రహ్మాదయ శ్చకీటాంతాః సర్వదైవ శరీరిణః, పుణ్యం స్వల్పాంశతో యేషాం పాపం పర్వ తవ త్స్థితమ్. ౧౮౬. తే దుఃఖబహుళా ఏతే స్థావరా స్తబ్ధజీవినః, పుణ్యం వా పాతకం వాఽపి కరణీయతయా పురా. ౧౮౭. పిత్రాదిభ్యః స్వవృద్ధేభ్యః శ్రుతం జన్మాంతరే యథా, తథా తత్సమనుష్ఠాయ జాతా స్తే తాదృశాః పునః; ౧౮౮. కుర్వంతి చ తథైవైత చ్ఛృణ్వంతి చ పునఃపునః, కుర్వంతి చ తథై వైతత్ స్వదేహేన పునఃపునః. ౧౮౯. పాపినాం పాతకస్యైవ శ్రవణే కరణే ఽపిచ, ప్రీతి రుత్పద్యతే తద్వ ద్ధర్మస్యచ మహాత్మనామ్. ౧౯౦. వాలా గ్రశతభాగేన పాపం పూర్వశరీరిణి, పుణ్యం పర్వతసంకాశం విద్యతే పరమే శ్వరే. ౧౯౧. బ్రహ్మాదిస్థావరాంతో ఽయం పుణ్యపాపఫలాత్మకః, సంసారః కర్మతో జాతః తచ్చ పూర్వశరీరతః. ౧౯౨. పూర్వం శరీరం నైవైత దప త్యాత్మని విద్యతే, ఆత్మాఽస్తి తతఏవాయం శరీరాంతరభాక్ పుమాన్. ౧౯౩. అతః ప్రశ్నద్వయేఽప్యేత దేక మేవాత్మనో వపుః, పృష్టం తన్మిళితం కృత్వా గుహ్యం బ్రహ్మ సనాతనమ్. ౧౯౪. అస్తితా మభిధాయైవం యమ ఆహాన యాదిశా,

ద్వితీయాధ్యాయము-ద్వితీయవల్లి, ౮-వ మంత్రవివరణము.

యో జాగర్తి పుమా నేషు స్వప్రకాశచిదాత్మకః. ౧౯౫. కామం కామం బహువిధం పుత్రక్షేత్రాదిరూపకం, నిర్మిమాణః సదా స్వప్నే సర్వేషా మిహ దేహినామ్. ౧౯౬. పౌరుషం యదిదం రూపం హృద్యాస్తే స్వప్నసం శ్రయం, తదేవ దీప్తం తద్బ్రహ్మ మోక్షరూపం తదుచ్యతే. ౧౯౭. తస్మిం ల్లోకాః శ్రితా స్సర్వే భూరాద్యా బహుయోజనాః, చతుర్విధజనా స్తద్వ

న్నానాలోకసమాశ్రయాః. ౯౮. సంసారపరపారార్థీ తచ్చ నాప్యేతి కశ్చన, వితస్మా దపరస్యాత్ర పరస్యాసత్వహేతుతః. ౯౯. ఏకఏవాయ మాత్మాస్యా త్సర్వేషా మిహ దేహినాం, స్థూలేష్వపిచ సూక్ష్మేషు శరీరేషు స సర్వదా. ౨౦౦.

## ద్వితీయాధ్యాయము-ద్వితీయవల్లి, ౯, ౧౦, ౧౧, ౧౨-వ మంత్రములవివరణము.

యథా స్థూలేషు కాష్ఠేషు వహ్ని స్సర్వత్ర సంస్థితః, సదృశః కాష్ఠ సంస్థై స్తై ర్వస్తుతో ఽన్యాదృశో ఽపిచ. ౨౦౧. ఏవం స్థూలేషు దేహేషు దేవాసురనరాదిషు, తాదృగాత్మా భవే న్నేవ వస్తుతో ఽపి విలక్షణః. ౨౦౨. వాయు ర్యథా ఽత్ర సూక్ష్మేషు సూక్ష్మరూపో వ్యవస్థితః, తద్వ త్ప్రతియ త్రే ఽతద్వ ద్వస్తునః సముపస్థితః. ౨౦౩. తద్వ త్సూక్ష్మేషు దేహేషు లిప్తత్వా త్తాఽత్ర తాదృశః, అతాదృశః స్వరూపేణ సదానందాత్మరూపవాన్. ౨౦౪. శరీరద్వయసంస్థో ఽపి పరమాత్మా మహేశ్వరః, శరీరద్వయదోషేణ లిప్యతే న కదాచన. ౨౦౫. సూర్యో యథా ఽత్ర సర్వేషాం నేత్రేష్వా స్తే నిరంతరం, న లిప్యతే చ తత్ర స్థై ర్దోషై ర్నైవ గుణై రపి. ౨౦౬. బాహ్యే నభసి బింబాత్మా యస్మా దన్యః ప్రగృహ్యతే, శాస్త్రదృష్ట్యా తథై వాత్మా హార్దే నభసి గృహ్యతే. ౨౦౭. దేహద్వయా త్పృథక్త్వేన తద్ధర్మై ర్నైవ లిప్యతే, స్వతంత్ర ఏకఏవాయ మాత్మా సర్వశరీరిణామ్. ౨౦౮. సూర్యవ ద్బహుధా భాతి నేత్రభేదా ద్వ్యవస్థితః, యథైవ బహుధాభానై ర్భానో ర్నైవ భిదా క్వచిత్. ౨౦౯. ఆత్మనో బహుధా భాన మేవం భేదే న కారణం, భానా ద్భేదం యథా ఽనంతం గృహీత్వా దుఃఖ మాప్ర జేత్. ౨౧౦. ఉపహాసాదిజనితం బహుధా బాలిశః పుమాన్, ఆనందాత్మని తద్వద్యో ఽనంతం భేదం స్వచేతసా. ౨౧౧. గృహ్ణీయా త్సతు సంసారదుఃఖ మేత త్సమాప్నుయాత్, అంత

రాత్మా తత స్సర్వభూతానా మేక ఏవ సః. ౨౧౨. స్వతంత్రః స్వాత్మనో రూపం బహుధా కురుతే స్వయం, మాయయా జగదీశానో మాయయాఽపి వివర్జితః. ౨౧౩. య స్తం స్వహృదయే సంతం గురుశాస్త్రోపదేశనాత్, అను పశ్యంతి యే ధీరా బ్రహ్మచర్యాదిసాధనాః. ౨౧౪. శాశ్వతం మోక్షసంజ్ఞం స్యా త్సుఖం తేషాం మహాత్మనాం, అన్యేషాం దుఃఖ మఖిలం సంసారాఖ్యం భవే త్సదా. ౨౧౫.

## ద్వితీయాధ్యాయము-ద్వితీయవల్లి, ౧౩-వ మంత్రవివరణము.

నిత్యానా మపి నిత్యోఽయం కాలాదీనాం మహేశ్వరః, ఇంద్రియాణాం హి సర్వేషాం చేతనానాం చ చేతనః. ౨౧౬. యమస్వీత్య సుఖం ధీరా యాంతి పూర్వసమీరితం, ఏక ఏవ బహూనాం యః కామా న్మనసి సంస్థితాన్. ౨౧౭. దదాతి సర్వజంతూనాం దుఃఖశాంతికరః పుమాన్, తస్య రూప మిదం బ్రహ్మ సర్వప్రాణిహృదిస్థితమ్. ౨౧౮. అవాఙ్మానసగమ్యం య త్స్వయంజ్యోతిస్స్వరూపధృత్,

## ద్వితీయాధ్యాయము-ద్వితీయవల్లి, ౧౪-వ మంత్రవివరణము.

తదేత దితి మన్యంతే నిర్దేశ్యం పరమం సుఖం. ౨౧౯. మహాత్మానో ఽత్ర విద్వాంసః సదా స్వానుభవే రతాః, అపి వైషయికం య త్స్యా త్సుఖం తదపి కో వదేత్. ౨౨౦. మృష్టాన్నభోజనాదౌ య జ్జాయతే ఽత్ర సుఖం నృణాం, సుఖ మి త్యేవ తద్బ్రూయుః లౌకికా న విశేషతః. ౨౨౧. విశేషం కథయంతో ఽపి నైవ వక్తుం క్షమాః క్వచిత్, అధ్యస్య కస్యచి త్తస్య సాదృశ్యం తే వదంతి తత్. ౨౨౨. తత స్సుఖ మనిర్దేశ్యం సర్వ మేవ వ్యవస్థితం, తతః స్వానుభవైనైవ గమ్యతే నాన్యథా హి తత్. ౨౨౩. బ్రహ్మణో ఽపి సుఖం యత్తు సర్వానందశతాధికం, యతో ఽధికం న కించిత్స్యా త్సుఖం వైషయికం క్వచిత్. ౨౨౪. ఆనందవారిధే స్తచ్చ బిందుమాత్ర ముదీరితం,

అతః కథం హి నిర్దేశ్యం భవే త్తత్పరమం సుఖం. ౭౨౫. గురవః శ్రుతిభిః సార్థ మాత్మా ప్రియతమః సదా, ఇత్థం వదంతో నైవైతే శక్తా స్సాక్షా ద్విభాషితుం. ౭౨౬. గురూపదిష్టం తేనాయం యదస్తి పరమం సుఖం, కథంతు తద్విజానీయాం సాక్షా దితి విచింతయేత్. ౭౨౭. పరమం సుఖ మాత్మాఖ్యం కిము భాతి విభాతి హి, మమ బ్రహ్మాత్మవిజ్ఞానవతో నీరాగచేతసః. ౭౨౮. ఆనందస్య స్వయం యస్మా దన్యస్యాపి చ తాదృశం, తతో మే భాతి సమ్యక్త ద్విరుద్ధం భాతి వా ఒధునా. ౭౨౯. కారకాణీహ యత్ర స్యుశ్శేషో వా క్రియయా యుతః, తత్ర భేదో భవే న్నిత్యం భేదవ న్న సుఖం పరమ్. ౭౩౦. భేదే సతి హి జన్మాదిగ్రస్త మేవ సుఖం భవేత్, సుఖత్వ మపి నైవాస్తి తాదృశే పరతః కుతః. ౭౩౧. ఆదా వంతే చ య ద్దుఃఖం వర్తమానే కథం సుఖం, తతో దుఃఖే సుఖాఖ్యేయం బాలై ర్వైషయికే కృతా. ౭౩౨. తేన భానం హి యస్య స్యాత్ కారకాదే రభావతః, సుఖం తదేవ విజ్ఞేయం పరమంచ మహాత్మభిః. ౭౩౩. అన్యథాఒధ్యాసమాత్రం మే సుఖం భాతీతి వర్తతే, కాముకానాం యథా ఒధ్యాసాత్ సుఖం భాత్యత్ర కామినీ. ౭౩౪. ఇత్థం చింతయతో నిత్యం విరక్తస్య మహాత్మనః, అవాఙ్మానసగమ్యం తత్ప్రతిభాతి సుఖం పరం. ౭౩౫. యస్య దర్శనతో దుఃఖరూపైషా శర్వరీ నృణాం, సుప్రభాతా భవే న్నిత్య మానందాత్మదివాకరాత్. ౭౩౬. ఆనందాత్మా స్వయంజ్యోతి ర్దుఃఖరాత్రివినాశకః,

## ద్వితీయాధ్యాయము-ద్వితీయవల్లి, ౧౫-వ మంత్రవివరణము.

దివాకరః సదా మాయాతమస్తోమవినాశకః. ౭౩౭. సూర్యాదిభి స్స్వదైవాయం తైజసై ర్న ప్రతీయతే, కింతు తేనైవ సకలం సూర్యాద్యేతత్ప్రతీయతే. ౭౩౮. స్వయంజ్యోతి ర్యదైవాయం ఆనందాత్మా ప్రతీయతే, తదా పశ్చా జ్జగత్సర్వ మనుభాతి జడాజడం. ౭౩౯. యథా దీపస్య కలికాభాసా దనువిభాతి తత్, వర్తితైలాదికం తద్వ దాత్మభాసా దనంతరం. ౭౪౦.

బుద్ధ్యాదికం జగ త్సర్వ మధ్యాత్మాది విభేదవత్, ఆత్మభాసైవ| భా ల్యేత త్స్వయం భానవివర్జితం. ౨౪౧. భానవచ్చ యథాఽఽదిత్య భాసా భాంతం ఘటాదికం, చక్షుః ప్రకాశయే త్సర్వం స్వయం తదపి తైజసమ్. ౨౪౨.

ద్వితీయాధ్యాయమునందు ద్వితీయవల్లీ వివరణము సమాప్తము.

---

## ద్వితీయాధ్యాయమునందు-తృతీయవల్లీ వివరణము.

### ద్వితీయాధ్యాయము-తృతీయవల్లి, ౧-వ మంత్రవివరణము.

పుర మేకాదశద్వారం యదుక్తం తే మయా పురా, తదేవాశ్వత్థ రూపేణ కేచి దాహు ర్ద్విజోత్తమాః. ౨౪౩. ఊర్ధ్వం సర్వస్య జగతః కారణం బ్రహ్మ య త్పురా, స్వయంజ్యోతిః సదా మోక్షరూపం వస్తు చ కీర్త్యతే. ౨౪౪. మూలం తదేవ స్యా దస్య సదా ఽశ్వత్థస్వరూపిణః, . శ్వో న తిష్ఠతి యస్మా త్స తస్మా దశ్వత్థ ఈరితః. ౨౪౫. ప్రతిక్షణవినాశిత్వం భూతానా మస్య దృశ్యతే, తతః కథం ను విశ్వాసః శ్వో ఽవస్థానే ఽస్య సంభవేత్. ౨౪౬. అర్వా గథ ఇతి ప్రాహుః కారణాపేక్షయా ద్విజ, అధో నికృష్టతా లోకే కథ్యతే సర్వజంతుభిః. ౨౪౭. శాఖా నానావిధా దేహా స్సేంద్రియాః కర్మసంభవాః, అస్య స్థూలస్య దేహస్య నికృష్టా బ్రహ్మరూపతః. ౨౪౮. అశ్వత్థో ఽప్యేష సతతం నిత్యో బీజాంకురాదినా, ప్రవాహారూపతో యద్వ త్తరు రన్యో వటాదికః. ౨౪౯. మూలం యదస్య తస్మిన్ హి లోకా స్సర్వే సమాస్థితాః, య దతిక్రమ్య కో ఽప్యత్ర న గచ్ఛే దితి కీర్తితం. ౨౫౦. ఏతదేవ త్వయా పృష్టం ధర్మాదిపరివర్జితం, ప్రాణాత్మని జగద్ధేతౌ యస్మిన్ విశ్వం ప్రతిష్ఠితం. ౨౫౧. వ్యాపారం స్వస్య కురుతే సర్వదా శంకయా వినా, తత ఏవ చ సంజాతం ప్రాణా దాత్మస్వరూపిణః. ౨౫౨. స

హి సర్వస్య కథితో మృత్యురూపో మహేశ్వరః, అయమేవమిహ లోకే భయ ముద్యతవజ్రవత్. ౨౫౩. ఏతదాత్మతయా విప్రా యే విదుస్తే ఽమృతాః స్థితాః, ఆత్మనో మరణం నాత్మా కారయే త్కస్యచిత్క్వచిత్. ౨౫౪. తతఏవ మృతిం హిత్వా నిర్భయో భయదః స్థితః, సూర్యాగ్నీ తపతో నిత్యం నిఖిలం భువనత్రయం. ౨౫౫. ఇంద్రో వర్షతి వాయుశ్చ వాతి లోకసుఖప్రదః, మృత్యుశ్చ పంచమ స్తేషా మహం భీత స్సదా తతః. ౨౫౬. ధావన్ప్రాణాన్ శరీరేభ్య స్తస్మా దత్యంతభీతితః, కుతోఽపరే భయం నైవ గచ్ఛేయుః ప్రాణిన స్సదా. ౨౫౭. అస్మా ద్వామనతః ప్రాణా త్ప్రాణాపానాంతరస్థితాత్,

## ద్వితీయాధ్యాయము-తృతీయవల్లి, ౨-వ మంత్రవివరణము.

ఆత్మవిజ్ఞానతో యస్మా ద్భయ మేత న్న జాయతే. ౨౫౮. ఇహైవ తతఏవాయం జ్ఞాతవ్యో మృత్యుభీరుణా,

## ద్వితీయాధ్యాయము-తృతీయవల్లి, ౩, ౪, ౫-వ మంత్రముల వివరణము.

ఇహాచే దాత్మవిజ్ఞానం న జాతం పతనా త్పురా. ౨౫౯. తత స్సర్వేషు లోకేషు సృజ్యమానేషు సర్వదా, శుభాశుభేషు సతతం శరీరాణ్యధిగచ్ఛతి. ౨౬౦. బహుమృత్యుకరాణ్యేవ యత స్స్యా త్సతతం భయం, యథా విశుద్ధ ఆదర్శే విస్పష్టం దృశ్యతే ముఖం. ౨౬౧. అధికారశరీరేఽస్మి న్బుద్ధా వాత్మా తథైవ హి, స్వప్నే యథా న విశదం స్వస్య రూపం ప్రతీయతే. ౨౬౨. పితృలోకే తథైవాత్మా భోగాసక్త్యా న గమ్యతే, అప్సు యద్వ చ్చలాస్వత్ర వైపరీత్యా త్ప్రతీయతే. ౨౬౩. ముఖం గంధర్వలోకే ఽపి తథైవాత్మా ప్రతీయతే, గంధర్వలోక ఆత్మాఽయం భోగాసక్తేన చేతసా. ౨౬౪. ప్రతీతో ఽపి కరోత్యేష నావిద్యాయా వినాశనం, బ్రహ్మలోకే

ఽతివిశద మాత్మా జంతోః ప్రతీయతే. ౨౬౫. యద్యప్యత్ర తథా ఽప్యేవ దుష్ప్రాపః ప్రాణిభి స్సదా, ఛాయాఽఽతపౌ యథైవైతౌ ప్రతీయేతే పృథ క్పృథక్. ౨౬౬. బ్రహ్మలోకే తథైవాత్మా జగద్భిన్నః ప్రతీయతే, అస్మి న్నేవ తతో దేహే స్వాధీనే సులభే సతి. ౨౬౭. ఆత్మనో ఽనుభవ స్సాక్షా త్సంపాద్యః స్సుఖ మిచ్ఛతా,

## ద్వితీయాధ్యాయము-తృతీయవల్లి, ౬, ౭, ౮-వ మంత్రముల వివరణము.

ఇంద్రియాణాం పృథగ్భావ ముదయాస్తమయౌ చ యత్. ౨౬౮. పృథగుత్పద్యమానానాం వ్యాపారజ్ఞానరూపిణాం, జానాత్యాత్మా స విజ్ఞేయో బుద్ధిస్థ స్సర్వదేహినాం. ౨౬౯. ఏన మాత్మతయా విద్వాన్ మత్వా ధీరో న శోచతి, ఆత్మా య స్తే మయా పూర్వం హేతుకాన్యః ప్రకీర్తితః. ౨౭౦. విషయై ర్భేదకాన్యానాం ఇంద్రియాణాం ద్వయాత్మనాం, కర్మజ్ఞానాత్మకా దస్మా త్పరతో వ్యవహారతః. ౨౭౧. ఇంద్రియేభ్యః పరం జ్ఞేయం మనోబుద్ధి స్తతః పరా, సత్త్వా దపి మహానాత్మా మహతోఽవ్యక్త మేవచ. ౨౭౨. అవ్యక్తా త్పురుష స్తస్య త్పర స్సర్వగత స్సదా, కార్యకారణరూపేణ లింగేన చ వివర్జితః. ౨౭౩. యో జ్ఞాత్వా ముచ్యతే జంతు రమృతత్వం చ గచ్ఛతి, అవిద్యాయాః సకార్యాయా నాశో మోక్ష ఇతీరితః. ౨౭౪. ఆనందాత్మ ప్రధానం య దమృతత్వం తదీరితం, మోక్షామృతత్వయో రస్మా ద్భేదాద్భేద ఉదీరితః. ౨౭౫. అభేదే ఽపి చ విద్వద్భి ర్భేదం కించి ద్వివగమ్యచ,

## ద్వితీయాధ్యాయము-తృతీయవల్లి, ౯, ౧౦-వమంత్రవివరణము.

దర్శనే యోగ్యతాం నైతి రూప మస్యాత్మనః సదా. ౨౭౬. న చక్షు షైన మాత్మానం కోఽపి పశ్యతి కర్హిచిత్, యతో రూపాదిహీనో ఽయ

మింద్రియై ర్నైవ గమ్యతే. ౭౭౭. ఉక్త మేత త్త్వరా తుభ్యం మయా ఽత్ర నచికేతసే, హృత్స్థయా ఽత్ర తతో బుద్ధ్యా నియంత్ర్యా మనసో ఽపిహి. ౭౭౮. సంకల్ప్య కంచనాకార మవాఙ్మానసగోచరే, ఆనందాత్మని తేనాయం గమయే త్స్వాత్మరూపతః. ౭౭౯. ఇత్థం జానంతి యే నిత్య మమృతా స్తే భవన్తి చ, యదా పంచావతిష్ఠంతే జ్ఞానాని మనసా సహ. ౭౮౦. విచేష్టతే న బుద్ధిశ్చ తా మాహుః పరమాం గతిం, జీవతో విదుషో నాస్యాః సంప్రాప్యాఽస్తి పరా గతిః. ౭౮౧. మనోబుద్ధీంద్రియాణాం స్యా ద్యదైకాగ్ర్యం నిరంతరం, ఏతేషాం నిశ్చలీభావ ఆనందాత్మా స్వయం ప్రభః. ౭౮౨. ప్రతిభాతి యతో దుఃఖం నాణుమాత్రం చ గచ్ఛతి,

## ద్వితీయాధ్యాయము-తృతీయవల్లి, ౧౧, ౧౨, ౧౩-వ మంత్రములవివరణము.

తాం యోగ మితి మన్యంతే స్థిరా మింద్రియధారణాం. ౭౮౩. అప్రమత్త స్తదాభూయా ద్యోగో హి ప్రభవాప్యయౌ, అహం బ్రహ్మేతి విజ్ఞానం యోగో నేంద్రియధారణాం. ౭౮౪. వినా భవతి కామాదిప్రమాదాభావ ఏవ వా, అప్రమత్తః పుమాన్ యోగీ జగదుత్పత్తినాశనే. ౭౮౫. సమర్థో భవతి శ్రీమా నీశ్వరోఽత్ర యథైవ హి, యోగమేకం విహాయాయ మానందాత్మా మహేశ్వరః. ౭౮౬. నైవ వాచా న మనసా ప్రాప్తుం శక్యో న చక్షుషా, ఆత్మరూప మిదం శ్రద్ధావిత్తాదేవోపలభ్యతే. ౭౮౭. ఆనందాత్మా స్వయంజ్యోతి రస్తీత్యేతత్సమీరణం, గురుశాస్త్రాదివిశ్వాసా త్తస్మిన్ శ్రద్ధేయ మీరితా. ౭౮౮. కాలత్రయాత్మకం యత్తు యచ్చ కాలత్రయాత్పరం, సదసద్వ స్తు త త్సర్వం ధియా వాచా ఽవగమ్యతే. ౭౮౯. అవాఙ్మానసగమ్యం య త్సర్వతోఽపి విలక్షణం, అస్తీతి బ్రువతో ఽన్యత్ర కథం త దుపలభ్యతే. ౭౯౦. సదసత్త్వవినిర్ముక్తో మధ్యేఽయం సదసత్త్వయోః, అస్తీత్యే

వోపలబ్ధవ్య స్తత్త్వభావేన చోభయోః. ౭౯౧. అస్తీత్యేవోపలబ్ధస్య తత్త్వభావః ప్రసీదతి, ఆనందాత్మస్వరూపస్య స్వప్రియస్యాస్తితా యతః. ౭౯౨. తత్త్వభావ స్తతోఽస్తిత్వ మాత్మనో నాస్తి నాస్తితా, నాస్తితాభాసతో నాస్తీ త్యేవం వక్తుం న శక్యతే. ౭౯౩. అస్తితా ద్భాతి నిఖిలం ద్రష్టు స్తద్ధి ప్రసిద్ధ్యతి, కథం సత్త్వమయో గౌణే న ప్రసిద్ధ్యేత చాత్మనా. ౭౯౪. యథా రాజా ఽత్ర రాజేతి విజ్ఞాతః సన్ ప్రసీదతి, సుఖద స్తద్వ దాత్మా ఽయం తత్త్వజ్ఞానా త్ప్రసీదతి. ౭౯౫. భృత్యాదిరూపతో యద్వ దతత్త్వజ్ఞానతో నృపః, విజ్ఞాతో జ్ఞాతు రాత్మా ఽయం న ప్రసీదతి కర్హిచిత్. ౭౯౬. ప్రత్యుత ప్రాప్తకోప స్స న్ననర్థం సంప్రయచ్ఛతి, ఏవ మాత్మా ఽప్యతత్త్వేన విజ్ఞాతోఽనర్థదో భవేత్. ౭౯౭. అస్తితా చే దాత్మనో న విజ్ఞాతాఽనర్థదా భవేత్, తత్త్వభావేన తస్మా త్స జ్ఞాతవ్య స్సుఖ మిచ్ఛతా. ౭౯౮. అస్తితాయాశ్చ వస్తుత్త్వభావ ఉక్తో మనీషిభిః, తత్త్వభావేన తేనాయ మాత్మా దృష్టః ప్రసీదతి. ౭౯౯.

## ద్వితీయాధ్యాయము-తృతీయవల్లి, ౧౪-వ మంత్రవివరణము.

యదా సర్వే ప్రముచ్యంతే కామా యే ఽస్య హృది స్థితాః, అథ మర్త్యో ఽమృతో భవత్యత్ర బ్రహ్మ సమశ్నుతే. ౮౦౦. తత్త్వభావేన దృష్టస్స న్నాత్మకామం హృది స్థితం, ఇహాముత్ర సుఖేనైకం నాశయత్యాత్మసౌఖ్యవాత్. ౮౦౧. రూపయౌవనసంపన్నా కామినీ స్వీయసౌఖ్యవాత్, కాముకస్య యథైవాన్యవధూరాగం వినాశయేత్. ౮౦౨. సద్యస్తప్తం యథైవైత త్సుగంధం గోఘృతం నృణాం, హృది స్థితం తైలకామం నాశయత్యాత్మసౌఖ్యవాత్. ౮౦౩. ఆనందాత్మా స్వయంజ్యోతిః ప్రతీత స్తు తథైవసః, రాగం వినాశయే త్సద్యో నృణాం వైషయికే సుఖే. ౮౦౪. మర్త్యస్య మరణం నామ కామో వైషయికే సుఖే, తస్మి న్నపగతే జీవన్నమరః స ప్రజాయతే. ౮౦౫. దేహనాశో న విద్వద్భి ర్మరణం కీర్త్యతే

క్వచిత్, కింతు కామాభిధం దైన్యం మరణం సర్వదుఃఖదం. ౮౦౬. కామే ష్వపగతేష్వస్మా దమరత్వ మయం పుమాన్, జీవనం న కుతో నేయా త్సర్వ దుఃఖవివర్జితం. ౮౦౭. సర్వదుఃఖవినిర్ముక్త ఆనందాత్మని కేవలే, ప్రతిభాతి కథం నాయం జీవన్ బ్రహ్మాత్మకో న హి. ౮౦౮. బ్రహ్మప్రాప్తి రియం నామ జీవతో య ద్విబోధనం, ఆనందాత్మస్వరూపస్య స్వాత్మ భేదవివర్జనాత్. ౮౦౯. ఆనందాత్మాన మేతం చే త్స్వప్రభం సర్వగం మహత్, భావాభావవినిర్ముక్తం సర్వభేదవివర్జితం. ౮౧౦. దేహే ఽస్మిన్ ప్రాప్తవాన్ కేన వాఽప్తం బ్రహ్మ ద్వయం పరం, తతః కామవినిర్మోకే దుఃఖహానో ఽమృతః పుమాన్. ౮౧౧. బ్రహ్మానందాత్మరూపం తద్దేహే ఽస్మి న్నుపగచ్ఛతి, అహంబ్రహ్మేతి విజ్ఞానే సంశయగ్రంథిసన్నిభాః. ౮౧౨. విపర్యయాశ్చ జాయంతే ప్రాయ స్సర్వశరీరిణాం, అసత్యా స్తత ఏవాహంబ్రహ్మేతి జ్ఞానవాన్ భవేత్. ౮౧౩. అసద్బ్రహ్మప్రతీతేశ్చ విచ్ఛేత్కిం న ప్రతీయతే, సర్వధర్మవినిర్ముక్తం కథం బ్రహ్మ భవామి తత్. ౮౧౪. ఇత్యాదిరూపిణో న్వాణాం ముగ్ధానాం సంశయాహ్యపి, విపర్యయాశ్చ జాయంతే పండితంమన్యసేవినాం. ౮౧౫.

## ద్వితీయాధ్యాయము-తృతీయవల్లి, ౧౫-వ మంత్రవివరణము.

హృదయస్య యదైవైతే గ్రంథయ స్సంశయాదికాః, ఛిద్యంతే యస్య తేనైతత్ప్రాప్యం బ్రహ్మామృతాత్మనా. ౮౧౬. ఏతావ దేవ విజ్ఞేయ మప్యేత ద్ధృదయే నిజే,

## ద్వితీయాధ్యాయము-తృతీయవల్లి, ౧౬, ౧౭-వ మంత్రముల వివరణము.

హృదయస్యాస్య నాడ్య స్స్యుః శతమేకోత్తరంశతం. ౮౧౭. తాసామేకా చ మూర్ధానం విభిద్యా స్తే బహిఃసదా, ద్వారభూతా యయా గచ్ఛే, దనిశం వామన స్సదా. ౮౧౮. అన్యాస్తు శత సంఖ్యాకా బహి ర్నిర్గమనే.

సదా, భవంతి గచ్ఛతో నిత్యం త్వద్రూపేణ సమా వపుః. ౧౯. అంగుష్ఠ మాత్రః పురుషః సర్వదా మద్వశే పుమాన్, నిర్గతః శతసంఖ్యాభి రాయా త్యేవ నసంశయః ౨౦. హృదయే సన్నివిష్టోఽయం పురుష స్సర్వదేహినాం, సూక్ష్మదేహాధరో నిత్య మవిద్యాకంచుకావృతః. ౨౧. తం సూక్ష్మదేహా ద్దుఃఖౌఘకారణా చ్చిత్తనిగ్రహాత్, వివేకేన త్సృణం బాహ్యం మనసా చ త్వచో యథా. ౨౨. ఇషీకాఖ్యం హి ముంజాఖ్యా త్కురుతే కరతః శిశుః, బ్రహ్మచర్యాదిసంపన్నో ధైర్యయుక్తో వివేకవాన్. ౨౩. మనస్యైవైన మాత్మానం కుర్యా దస్మా జ్జడా త్పృథక్, పృథక్కృతో వామనో ఽయం జడజాతా దశేషతః. ౨౪. అవామనో భవే త్సద్యో విశ్వరూపధరః పుమాన్, అవామనో న మే పాశైః బధ్యతే కర్హిచి త్క్వచిత్. ౨౫. హృత్థ్సితో వామనో యద్వ న్నిత్యం దేహపరిక్షయే, అవామనః పుమాన్ యో ఽయం స్వప్రభో మృతివర్జితః. ౨౬. సఏవాత్మేతి విజ్ఞేయో నచికేత స్సదా త్వయా, ఇత్యుక్త్వా భగవాన్ ధర్మరాజ స్తూష్ణీం బభూవ సః. ౨౭. నచికేతా శ్చ సంతుష్టః కృతకృత్యోఽభవ త్తదా, మృత్యుప్రోక్తా మిమాం విద్యా మాత్మనో లబ్ధవాన్ పురా. ౨౮. కృత్స్నం యోగవిధిం తద్వ న్నచికేతాః కుమా రకః, లబ్ధ్వా చ దేహ ఏతస్మిన్ జీవన్ బ్రహ్మావ్యయం పరం. ౨౯. ఆనం దాత్మస్వరూపం తత్స్వప్రభం ప్రాప్తవా నపి, అవిద్యాలేశరహితో దుఃఖశోక వివర్జితం. ౩౦. మరణేన వినిర్ముక్తో మోక్షమేవ గతో మునిః,

## ద్వితీయాధ్యాయము-తృతీయవల్లి, ౧౮-వ మంత్రవివరణము.

నచికేతా యథా యమాద్బ్రహ్మాత్మవిజ్ఞానతోఽభవత్. ౩౧. అన్యోఽపి చ తథా తాదృ గాత్మవిజ్ఞానతో భవేత్, ఆఖ్యాన ముక్తవా నేత త్కర స్త్రైవర్ణికాన్ ప్రతి. ౩౨. అపౌరుషేయవచసా యదిదం తే మయేరితం, బ్రహ్మవిజ్ఞాన మేతద్ధి దుర్లభం సర్వదేహిభిః. ౩౩. ఏతద్యస్మా త్పురా ప్రాప్తం దేవేభ్యో మానవై రిహ, ఆశ్చర్యాత్మా బ్రహ్మబోధో వక్తా శ్రోతా చ

దుర్లభః. ౨౩౪. అత్ర వక్తు స్తథా శ్రోతు ర్ద్వయో రన్యతరస్య వా, విఘ్నో జాయతే ప్రాయో బ్రహ్మవిద్యాప్రబోధనే. ౨౩౫. దేవైః కృత స్తదేతత్తే మయా ప్రాగేవ కీర్తితం, శక్రేణ సహ సంవాదే దధ్యఙ్ఙాథర్వణస్య హి. ౨౩౬. కుశలోఽత్ర గురు స్తస్య విఘ్నో దేవజో న హి, శిష్యస్య జాయతే సోఽత్ర కౌశలాభావహేతుతః. ౨౩౭. పూర్వపాపసమాయోగా ద్విపరీతా ఽస్య ధీ ర్భవేత్, విపరీతధియా సోఽయం గురుద్వేషాదికం పుమాన్. ౨౩౮. కుర్యా త్తేనైవ నరకాన్ గచ్ఛే చ్ఛిష్యో బహూ నపి, గురుసేవాకృతే జ్ఞానం దేవసేవాకృతే ఫలం. ౨౩౯. ద్వయో స్స్వైకతంత్రేణ తతో విఘ్నై ర్వివర్జితః, గురో ర్విద్యా మవాప్నోతి శిష్యః కుశలభావదాం. ౨౪౦. మోక్షం దేవకృతం మన్యే స్వప్రకాశవిధానకం, కఠ ఏవ మువాచాద శిష్యాన్ విద్యార్థినః ప్రతి. ౨౪౧. తిత్తిరి శ్చ మహాత్మా యో బ్రహ్మవిద్యా మనేకధా, ఉవాచ శిష్యసంఘేభ్యో నానాభానసమన్వితామ్. ౨౪౨.

ఇతి శ్రీమత్పరమహంసపరివ్రాజకాచార్యానందాత్మపూజ్యపాదశిష్యేణ
శంకరానందభగవత్పాదేనవిరచితే ఉపనిషద్రత్నే ఆత్మపురాణే
కాఠకోపనిషత్సారార్థప్రకాశే
యమనచికేతస్సంవాదో నామ
నవమోఽధ్యాయః సమాప్తః.

---

చెన్నపురి : వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారి
'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము.
P. I, Card Q. H. No. Ms. 22—31—12—45—500 Copies.

# వేదాంత గ్రంథములు

| | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|
| అపరోక్షానుభూతి, సాంధ్ర తాత్పర్యము, చిన్నసైజు ... | 0 | 6 |
| అద్వైతపంచరత్నము ,, ... | 0 | 3 |
| అద్వైతానుభూతి ,, ... | 0 | 2 |
| అద్వైతోపదేశపంచరత్నములు (సాధనపంచకము) ... | 0 | 3 |
| అద్వైతసంగ్రహము, తెనుఁగువచనము ... | 0 | 2 |
| అష్టోత్తరశతోపనిషత్తులు, చక్కనికూర్పు ... | 8 | 0 |
| ఆత్మబోధము, సటీక ... | 0 | 6 |
| ఆనందలహరి, ఆంధ్ర తాత్పర్యసహితము ... | 0 | 6 |
| ఆత్మపూజ ,, ... | 0 | 2 |
| ఆత్మవిద్యావిలాసము ,, ... | 0 | 6 |
| ఆత్మానాత్మవివేకము ,, ... | 0 | 6 |
| ఉత్తరగీతా, సాంధ్రటీకాతాత్పర్యము, చిన్నసైజు ... | 0 | 12 |
| జ్ఞానవాసిష్ఠము, ఆంధ్ర తాత్పర్యసహితము ... | 10 | 0 |
| జీవన్ముక్తిప్రకాశిక, ఆంధ్ర తాత్పర్యసహితము ... | 2 | 8 |
| నైష్కర్మ్యసిద్ధి, సురేశ్వరాచార్యకృతము, ఆంధ్ర టీకాతాత్పర్యసహితము ... | 5 | 0 |
| పంచదశిప్రకరణము, ఆంధ్రటీకాతాత్పర్యసహితము ... | 6 | 0 |
| పంచీకరణము, ఆంధ్ర తాత్పర్యసహితము ... | 0 | 3 |
| డిటో తెనుఁగువచనము ... | 0 | 3 |
| బ్రహ్మసూత్రార్థచంద్రిక, తెనుఁగువచనము, శ్రీశంకరాచార్యుల వారిభాష్యము అందరికిని తెలియుట దుర్లభమనిదలఁచి చక్కనిశైలిలో అనేకవృత్తుల ననుసరించి తెనుఁగు వ్యాఖ్యానమును ప్రకటించినారము. 2 సంపుటములు | 12 | 0 |

# వైదిక గ్రంథములు.

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| అమావాస్యాతర్పణము | ... | 0 | 2 |
| ఆపస్తంబగృహ్యసూత్రములు | ... | 0 | 3 |
| ఆంధ్రద్రావిడసంధ్యావందనము | ... | 0 | 3 |
| ఋగ్వేదదేవతార్చన, బ్రహ్మయజ్ఞము, సస్వరము | ... | 0 | 3 |
| ఋగ్వేదపూర్వప్రయోగాదర్శము | ... | 2 | 8 |
| ఋగ్వేదశ్రాద్ధప్రయోగము, చిన్నసైజు | ... | 0 | 4 |
| ఋగ్వేదసంధ్యావందనము, సటీక | ... | 0 | 3 |
| తిథిమంత్రములు, (ఆరాధ్యులది) | ... | 0 | 2 |
| పంచోపనిషత్తులు, తైత్తిరీయము, సస్వరము | ... | 0 | 12 |
| దేవతార్చన, చిన్నసైజు | ... | 0 | 2 |
| పంచసూక్తములు, సస్వరము | ... | 0 | 2 |
| పంచోపనిషత్తులు, బ్రహ్మమేధసహితము | ... | 0 | 6 |
| పితృతర్పణము, చిన్నసైజు | ... | 0 | 2 |
| బ్రహ్మయజ్ఞము, సస్వరము | ... | 0 | 3 |
| మహాన్యాసము, సస్వరము, చిన్నసైజు | ... | 0 | 12 |
| డిటో సస్వరము (పితాగ్ని కాండ) | ... | 0 | 6 |
| తైత్తిరీయ ఆరణ్యకోపనిషత్తులు, పితృమేధము, మంత్రప్రశ్నములు సహా, సస్వరము | ... | 3 | 0 |
| యాజుషపూర్వప్రయోగచంద్రిక, సస్వరము | ... | 2 | 8 |
| యజుర్వేదసంధ్యావందనము, మూలము, సస్వరము | ... | 3 | 0 |
| డిటో పురుషసూక్తము, శ్రీసూక్తము, ఆంధ్రటీకాతాత్పర్యము | | 0 | 6 |
| డిటో ఆబ్దికమంత్రములు | ... | 0 | 8 |

| | | రూ. | అ. |
|---|---|---|---|
| | ప్రతి 1-కి | రూ. | అ. |
| నక్షత్రప్రశ్నములు, మూలము | ... | 0 | 3 |
| శ్రీవైష్ణవాహ్నికము, చిన్నసైజు | ... | 0 | 6 |
| శ్రీవైష్ణవశ్రాద్ధప్రయోగము | ... | 0 | 6 |
| సూర్యనమస్కారము, చిన్నసైజు | ... | 0 | 2 |
| రుద్రము—నమకము, చమకము, సస్వరము, చిన్నసైజు | ... | 0 | 3 |
| రుద్రాధ్యాయము, సటీక | ... | 1 | 8 |
| మంత్రపుష్పము, సటీక | ... | 0 | 2 |
| యజుర్వేదసంధ్యావందనభాష్యము | ... | 0 | 12 |

# జ్యోతిషగ్రంథములు.

| | | | |
|---|---|---|---|
| అఱువది (గత) సంవత్సరముల పంచాంగము (1867-1926) | | 10 | 0 |
| అష్టకవర్గు, సాంధ్రతాత్పర్యము | ... | 0 | 4 |
| ఆరూఢరత్నసిద్ధాంజనము | ... | 0 | 12 |
| కాలామృతము, మేలుప్రతి | ... | 2 | 0 |
| కృష్ణవాస్తుశాస్త్రము, అను వాస్తుసారసంగ్రహము | ... | 1 | 0 |
| కేరళప్రశ్నము, సాంధ్రతాత్పర్యము | ... | 0 | 4 |
| గౌళిశాస్త్రము, తెనుఁగు | ... | 0 | 3 |
| ఛప్పన్నము, ప్రశ్నశాస్త్రము, తాత్పర్యసహితము | ... | 0 | 6 |
| జలార్గళశాస్త్రము, ఆంధ్రటీకాసహితము | ... | 0 | 6 |
| జాతకచంద్రిక, గోపాలరత్నాకరము, సాంధ్రతాత్పర్యము | ... | 0 | 12 |
| జ్యోతిషార్ణవనవనీతము | ... | 2 | 0 |
| నక్షత్రచూడామణి, చక్కనిప్రతి | ... | 0 | 6 |
| పుష్పబంధము, సాధారణప్రతి | ... | 0 | 8 |
| బృహద్యోగరత్నాకరము, తెనుగువచనము | ... | 0 | 12 |

శాంతిపాఠం

ఓం సహనావవతు । సహనౌభునక్తు । సహవీర్యం కరవావహై ।

తేజస్వి నావధీతమస్తు మా విద్విషావహై॥

ఓం శాంతిః శాంతిః శాంతిః

# కఠోపనిషత్తు

## ప్రథమాధ్యాయం

### ప్రథమవల్లి

ఓం ఉశన్ హ వై వాజశ్రవసః సర్వవేదసం దదౌ ।
తస్య హ నచికేతా నామ పుత్ర ఆస ॥ 1

స్వర్గ ఫలాలను కోరి వాజశ్రవసుడు ఒకయుగంలో తన ఆస్తినంతటిని దానం చేశాడు. అతనికి నచికేతుడనే పేరు గల ఒక పుత్రుడున్నాడు.

తం హ కుమారం సంతం దక్షిణాసు।
నీయమానాసు శ్రద్ధాఽఽ వివేశసోఽమన్యత॥ 2

బ్రాహ్మణులకు దక్షిణగా ఇవ్వటానికి కానుకలు తీసుకువస్తూండగా పసివాడే ఐనా నచికేతులో ఒక విధమైనశ్రద్ధ ప్రవేశించింది.

పీతోదకా జగ్ధతృణా దుగ్ధదోహ నిరింద్రియాః।
అనందా నామ తే లోకాస్తాన్ స గచ్ఛతి తా దదత్॥ 3

ముసలితనంలో ఈనే వయసు దాటిపోయి ఇక గడ్డి తినటానికీ నీళ్ళు తాగటానికీ కూడ శక్తి లేకుండా ఉన్నవీ వట్టిపోయి ఎందుకూ పనికిరానివీ ఐన ఈ ఆవులను దానం చేసేవాడు చేరుకునే లోకాలుబొత్తిగా ఆనందం లేనివి.

స హెూవాచ పితరం తత కస్మై మాం దాస్యసీతి।
ద్వితీయం తృతీయం తం హెూవాచ మృత్యవే త్వా దదామీతి॥ 4

'తండ్రీ నన్ను ఎవరికి ఇవ్వబోతున్నావు?' అని అతడు తండ్రిని రెండు మూడు సార్లు అడిగాడు. ఆ ప్రశ్నని కోపం వచ్చిన తండ్రి 'నిన్ను మృత్యు దేవతైన యముడికి యిస్తాను' అని బదులు పల్కాడు.

బహూనామేమి ప్రథమో బహూనామేమి మధ్యమః।
కిం స్విద్ యమస్య కర్తవ్యం యన్మయాఽద్య కరిష్యతి॥ 5

తండ్రి మాటలు విన్నాక  నచికేతుడు తనలోతాను ఇలా అనుకున్నాడు చాలామంది శిష్యుల్లో నేను మొదటివాడను. మరికొందరిలో మధ్యముడను. (కాని ఎన్నడూ నేను ఆఖరి వాడుగా రాలేదు) (అలాంటప్పుడు ఎందుకు మా తండ్రి నన్ను మృత్యువు కిస్తానన్నాడు) నన్ను యముడికి ఇవ్వటంలో ఆయన ఉద్దేశం ఏమిటి ?

అనుపశ్య యథాపూర్వే ప్రతిపశ్య తథాఽపరే।

సస్యమివ మర్త్యః పచ్యతే సస్యమివా జాయతే పునః॥ 6

ప్రాచీనులు ఎలా వర్తించారో జ్ఞాపకం తెచ్చుకో. అలాగే ఇపుడు ఇతరులు కూడ ఎలా నడుచుకుంటున్నారో గమనించు. మర్త్యులు ధాన్యంలాగేనే పండి రాలిపోతారు. ధాన్యం లాగానే మళ్ళీ పుట్టుకొస్తారు.

వైశ్వానరః ప్రవిశత్యతిథిర్బ్రాహ్మణో గృహాన్।
తస్యైతాం శాంతిం కుర్వంతి హర వైవస్వతోదకమ్॥ 7

సత్యమహిమను గుర్తించినవాడై నచికేతుని తండ్రి చివరికి తన కుమారుని యముని వద్దకు పంపుతాడు. కాని ఆ సమయంలో యముడు ఇంట్లో లేడు. ఆయన రాకకోసం ఎదురు చూస్తూ నచికేతుడు మూడురోజులు నిద్రాహారాలు లేకుండా ఎదురుచూస్తున్నాడు. యముడు తిరిగివచ్చాక ఆయన భార్యో అనుచరులో ఆయనతో ఇలా అన్నారు.

బ్రాహ్మణుడైన అతిథి అగ్నిలాగా ఇంట్లో ప్రవేశిస్తాడు.  అతనిని సద్గృహస్థులు శాంతింప జేస్తారు. కాబట్టి వైవస్వతుడా నీళ్ళు తీసుకురా.

ఆశాప్రతీక్షే సంగతం సూనృతాం
చేష్టాపూర్తే పుత్రపశూంశ్చ సర్వాన్।
ఏతద్ వృఙ్క్తే పురుషస్యాల్పమేధసో
యస్యానశ్నన్ వసతి బ్రాహ్మణోగృహే॥ 8

బ్రాహ్మణుడు  ఏ ఇంట్లో నిరాహారుడుగా ఉంటాడో ఆ బుద్ధిహీనుడి ఆశలు మరియు ఆకాంక్షలు సత్సాంగత్య ఫలము సత్య మధురభాషణం వల్ల కలిగిన ఫలమూ సర్వపుణ్యకర్మల ఫలమూ పుత్రులూ పశుసంపదా అంతాకూడా నాశనమయిపోతుంది.

త్రిసోరాత్రీర్యద వాత్సీర్గృహే
మేఽనశ్నన్ బ్రహ్మన్నతిథిర్న మస్యః।
నమస్తేఽస్తు బ్రహ్మన్ స్వస్తిమేఽస్తు
తస్మాత్ ప్రతి త్రీన్ వరాన్ వృణీష్వ॥ 9

నచికేతునితో యముదు  అతనితో ఇలా అన్నాదు. ఓ బ్రాహ్మణుడా  గౌరవింప తగిన నువ్వు అతిథివై నా యింట్లో నిరాహారిగా మూడురాత్రులు గడిపావు కాబట్టి వాటికి పరిహారంగా మూడు వరాలు కోరుకో. ఓ బ్రాహ్మణుడా నీకు నమస్కారం. నాకు శుభమగుగాక.

శాంతసంకల్పః సుమనా యథాస్యాద్
వీతమన్యుర్గౌతమో మాఽభి మృత్యో।
త్వత్ప్రసృష్టం మాఽభివదేత్ ప్రతీతః
ఏతత్ త్రయాణాం ప్రథమం వరం వృణే॥ 10

నచికేతుడు ఇలా సమాధానం చెప్పాదు ఓ మృత్యుదేవా నా తండ్రిఐన గౌతముడు నా గురించిన ఆత్రుత తీరినవాడై సంతోషం నిండిన మనస్సుతో నీచే తిరిగి పంపబడిన నన్ను గుర్తించి ఆదరించుగాక.  మూడు వరాల్లో మొదటిదిగా నేను కోరే వరం ఇదే.

యథాపురస్తాద్ భవితా ప్రతీతః
ఔద్దాలకి వారుణిర్మత్ప్రసృష్టః
సుఖం రాత్రీః శయితా వీతమన్యుః
త్వాం దదృశివాన్ మృత్యుముఖాత్ ప్రముక్తమ్॥ 11

యముడిలా అన్నాదు నా ఆజ్ఞచేత ఔద్దాలకిఐన నీ తండ్రి నిన్ను గుర్తిస్తాడు. నీతో పూర్వంలా గానే  ప్రేమగా ఉంటాడు. మృత్యుముఖం నుండి తప్పించుకున్న నిన్ను చూసి కోపంపోయి రాత్రు లందు సుఖంగా నిద్రించగలడు.

స్వర్గేలోకే న భయం కించనాస్తి
న తత్ర త్వం న జరయా బిభేతి।
ఉభేతీర్త్వా ఽశనాయాపిపాసే
శోకాతిగో మోదతే స్వర్గలోకే॥ 12

(నచకేతుడిలా అన్నాదు) స్వర్గలోకంలో ఎలాంటి భయము లేదు. మృత్యుదేవా! నీవక్కడ లేవు. వృద్ధాప్యం వల్ల భయం లేదు. ఆకలిదప్పులను సకలదుఃఖాలను అతిక్రమించి మానవుడు స్వర్గ లోకంలో సుఖంగా ఉన్నాదు.

స త్వమగ్నిం స్వర్గ్యమధ్యేషి మృత్యో
ప్రబ్రూహి త్వం్శ్రద్ధదానాయ మహ్యమ్।
స్వర్గలోకా అమృతత్వం భజన్త
ఏతద్ ద్వితీయేన వృణేవరేణ॥ 13

యమరాజా స్వర్గానికి తీసుకుపోయే ఆ యజ్ఞం నీకు తెలుసు. నేను శ్రద్ధావంతుడను (అందుచేత ఉపదేశానికి అర్హుడను.) నాకా యజ్ఞ విద్యను ఉపదేశించు. ఆ యజ్ఞంచేత స్వర్గ కాములు అమరత్వం పొందుతారు. ఈ యజ్ఞరహస్యం నేను రెండవ వరంగా కోరుకుంటున్నాను.

ప్రతే బ్రవీమి తదుమే నిబోధ
స్వర్గ్యమగ్నిం నచికేతః ప్రజానన్।
అనంతలోకాప్తి మథో ప్రతిష్ఠాం
విద్ధి త్వమేతం నిహితం గుహాయామ్॥ 14

దానికి యముడు ఇలా బదులు చెప్పాడు. నచికేతా స్వర్గానికి తీసుకుపోయే ఆ అగ్ని యజ్ఞం; నాకు బాగా తెలుసు. నీకు చెబుతాను నేర్చుకో. ఆ విద్య శాశ్వతస్వర్గాన్ని పొందడానికి సాధన మనీ సకల జగత్తుకూ ఆధారమనీ విద్వాంసుల హృదయంలో నివసిస్తుందనీ తెలుసుకో.

లోకాదిమగ్నిం తమువాచ తస్మై
యా ఇష్టకా యావతీర్వా యథావా।
స చాపి తత్ ప్రత్యవదద్యథోక్త
మథాస్య మృత్యుః పునరేవాహ తుష్టః॥ 15

నచికేతునికి యముడు జగత్తుకు మూలమైన ఆ అగ్నిని వివరించాడు. కావలసిన ఇటు కలు ఎన్నో ఎటువంటివో హోమనిధి ఎలా నిర్వహించాలో అంతా వివరంగా చెప్పాడు. శ్రద్ధగా విన్న నిచికేతుడు అంతా మళ్ళీ యముడకి తిరిగి చెప్పాడు. దానికి ఎంతో సంతోషించి యముడు మళ్లీ ఇలా అన్నాడు.

తమబ్రవీత్ ప్రీయమాణో మహాత్మా
వరం తవేహాద్య దదామి భూయః।
తవైవ నామ్నా భవితాఽయమగ్నిః
సృంకాం చేమామనేక రూపాం గృహాణ॥ 16

సంప్రీతుడైన ఆ యముడు నచికేతునితో ఇంకా ఇలా అన్నాడు. నీకు మరో వరం కూడా ఇస్తున్నాను. ఇకమీద ఈ అగ్ని నీ పేరిటనే ప్రసిద్ధమవుతుంది. ఇదుగో ఎన్నో రంగులున్న ఈ మాలను స్వీకరించు.

త్రిణాచికేతస్త్రిభిరేత్య సంధిం
త్రికర్మకృత్ తరతి జన్మమృత్యూ।
బ్రహ్మ జజ్ఞం దేవమీడ్యం విదిత్వా
నిచాయ్యేమాం శాంతిమత్యంతమేతి॥ 17

ఈ నాచికేతయజ్ఞాన్ని మూడుసార్లు చేసి ఉపదేశం కొరకు ముగ్గురిని ఆశ్రయించి మూడు రకాల విధులనూ నిర్వర్తించినవానికి చావు పుట్టుకలు ఉండవు. బ్రహ్మము నుండి జనించిన

వాడూ దేదీప్యమానుడు సర్వజ్ఞుడు ఆరాధ్యుడు ఐన అతణ్ణి, అగ్నిని గూర్చి తెలుసుకుని సాక్షాత్కరించుకుని పరమశాంతిని పొందుతాడు.

త్రిణాచికేతస్త్రయమే తద్ విదిత్వా
యు ఏవం విద్వాంశ్చినుతే నాచికేతమ్।
స మృత్యుపాశాన్ పురతః ప్రణోద్య
శోకాతిగో మోదతే స్వర్గలోకే॥ 18

నాచికేతయజ్ఞాన్ని మూడుసార్లు నిర్వర్తించిన ఆ ధీశాలి ఆ మూడింటినీ తెలుసుకుని నిర్వర్తిస్తాడు. అతడు శరీరపతనానికి ముందే మృత్యుపాశాలను ఛేదించి శోకాన్ని అతిక్రమించి స్వర్గలోకంలో సుఖం అనుభవిస్తాడు.

ఏషతేఽగ్నిర్నచికేతః స్వర్గ్యో
యమవృణీథా ద్వితీయేన వరేణ ।
ఏతమగ్నిం తవైవ ప్రవక్ష్యంతి జనాస
స్తృతీయం వరం నచికేతోవృణీష్వ ॥ 19

స్వర్గానికి తీసుకుపోయే ఈ నీ అగ్ని రెండవ వరంగా నువ్వు కోరుకున్న యజ్ఞం జనులచేత నీ పేరిటనే ఇకమీద పిలువబడుతుంది. నచికేతా ఇక నీ మూడవరాన్ని కోరుకో.

యేయం ప్రేతే విచికిత్సా మనుష్యే
ఽస్తీత్యేకే నాయమస్తీతి చైకే ।
ఏతద్ విద్యామనుశిష్టస్త్వయాహం
వరాణామేష వరస్తృతీయః॥ 20

(నచికేతుడిలా అన్నాడు).

మానవుడు మరణించాక వచ్చే సందేహమిది. చనిపోయిన వ్యక్తి ఉన్నాడని కొందరంటారు. మరి కొందరు లేదంటారు. నువ్వు నేర్పితే దీని గురించి తెలుసుకోవాలని నా కోరిక. నా వరాలలో ఇదే మూడవ వరం.

దేవైరత్రాపి విచికిత్సితం పురా
నహి సు విజ్ఞేయమణురేష ధర్మః ।
అన్యం వరం నచికేతో వృణీష్వ
మా మోపరోత్సీరతి మా సృజైనమ్ ॥ 21

(యముడు ఇలా అన్నాడు)

ఈ విషయంలో దేవతలకు కూడా మునుపు సందేహం వచ్చింది. ఇది చాల సూక్ష్మమైన విషయం. అర్థం చేసుకోవడం ఎంతో కష్టం. అందుచేత ఓ నచికేతా మరొక వరం ఏదైనా కోరుకో. ఈ వరం మాత్రం నన్ను అర్థించకు. ఈ మాటనుండి నన్ను వదిలిపెట్టు.

దేవైరత్రాపి విచికిత్సితం కిల
త్వం చ మృత్యో యన్న సుజ్ఞేయమాత్థ।
వక్తా చాస్య త్వాదృగన్యో న లభ్యో
నాన్యో వరస్తుల్య ఏతస్య కశ్చిత్ ॥ 22

(నచికేతు డిలా అన్నాడు)

ఈ విషయంలో మరి దేవతలకు కూడా సందేహం వచ్చింది గదా! దానికితోడు ఈ విషయం సులభంగా అర్థమయ్యేది కాదని నువ్వుకూడా చెపుతున్నావు. ఈ విషయాన్ని వివరించడానికి నీతోసమానుడైన ఆచార్యుడు ఎక్కడా లభ్యంకాదు. అందుచేత ఈ వరంతో సమానమైన వరం మరేదీ లేదనే నేను అనుకుంటున్నాను.

శతాయుషః పుత్రపౌత్రాన్ వృణీష్వ
బహూన్ పశూన్ హస్తిహిరణ్యమశ్వాన్ ।
భూమేర్మహదాయతనం వృణీష్వ
స్వయం చ జీవ శరదో యావదిచ్ఛసి॥ 23

(యముడిలా అన్నాడు)

నూరేళ్ల జీవించే కొడుకులనూ మనుమలనూ కోరుకో. పశువుల మందలనూ ఏనుగులూ గుర్రాలనూ బంగారాన్నీ ఎంతైనా కోరుకో. భూమిమీద సువిశాల సామ్రాజ్యాన్ని వరించు. నువ్వు కూడా నీకు ఇష్టమైనంత  కాలం జీవించు.

ఏతత్తుల్యం యది మన్యసే వరం
వృణీష్వ విత్తం చిరజీవికాం చ ।
మహాభూమౌ నచికేతస్త్వమేధి
కామానాం త్వా కామభాజం కరోమి । 24

దీనితో సమానమైన వరమేదైనా నీకు తోస్తే అదే కోరుకో. ధనమూ దీర్ఘజీవనమూ కూడా కోరుకో. ఓ నచికేతా సువిశాల సామ్రాజ్యానికి నువ్వు చక్రవర్తివిగా ఉండు. నీకు కలిగే కోరికలన్నీ నెరవేరేలాగా నేను వరమిస్తాను.

యే యే కామా దుర్లభా మర్త్యలోకే
సర్వాన్ కామాన్ ఛందతః ప్రార్థయస్వ ।
ఇమారామాః సరథాః సతూర్యా
న హీదృశా లంభనీయా మనుష్యైః॥

ఆభిర్మ త్ప్ర త్తాభిః పరిచారయస్వ
నచికేతో మరణం మాஉనుప్రాక్షీః॥ 25

మానవలోకంలో ఏఏ కోరికలు దుర్లభాలో వాటన్నిటినీ నీ ఇష్టప్రకారం అడుగు. సంగీత వాద్యాలతో విహార రథాలతో ఉన్న ఈ అపురూప సుందరులైన కన్యలు మానవులకు లభ్యం కారు. వారందరినీ నేను నీకు ప్రసాదిస్తాను. వారి సేవలను పొందు. కానీ మరణాన్ని గురించి మాత్రం నన్ను అడుగవద్దు.

శ్వోభావా మర్త్యస్య యదంతకైతత్
సర్వేంద్రియాణాం జరయంతి తేజః।
అపి సర్వం జీవితమల్పమేవ
తవైవ వాహాస్తవ నృత్యగీతే ॥ 26

(నచికేతుడిలా అన్నాడు).

ఓ యమరాజా నువ్వు చెప్పే ఇవన్నీ కూడా క్షణికాలే మానవుడి ఇంద్రియాల శక్తిని నశింప జేసేవే. ఎంత పొడిగించినా మానవుడి జీవితం అల్పమే. అందుచేత నీ గుఱ్ఱాలు ఏనుగులు ఆట పాటలు నువ్వే ఉంచుకో.

న విత్తేన తర్పణీయో మనుష్యో
లప్స్యామహే విత్తమద్రాక్ష్మ చేత్త్వా।
జీవిష్యామో యావదీశిష్యసి త్వం
వరస్తు మే వరణీయః స ఏవ ॥ 27

మానవుడేనాటికీ ధనంతో తృప్తిపడడు. అంతేగాక నిన్ను దర్శించాక మాకు ఎలాగూ సంపద లభిస్తుంది. నువ్వు విధించినంత కాలమూ ఎలాగూ జీవిస్తాం. కానీ మరణానంతరం ఉండే అమోఘమైన జీవితం గురించిన జ్ఞానం నేను కోరే వరం.

అజీర్యతా మమృతానాముపేత్య
జీర్యన్ మర్త్యః క్వధః స్థః ప్రజానన్ ।
అభిధ్యాయన్ వర్ణరతిప్రమోదా
నతిదీర్ఘే జీవితే కో రమేత ॥ 28

అక్షయులూ అమరులూ ఐన వారివద్దకు చేరుకుని వారివద్ద నుండి పొందగలిగే శ్రేష్ఠతమమైన వరాలను తెలిసికూడా ఆటపాటల ఆనందాన్ని పరిశీలించిన ఏ మర్త్యుడు వాటిలో దీర్ఘకాలం ఆనందించాలని ఇష్టపడతాడు ?

యస్మిన్నిదం విచికిత్సంతి మృత్యో
యత్సాంపరాయే మహతి బ్రూహి నస్తత్।
యోஉయంవరో గూఢమనుప్రవిష్టో

నాన్యం తస్మాన్నచికేతా వృణీతే ॥ 29

ఓ యమరాజా మరణానంతరం ఉండే ఆ పరమ జీవితాన్ని గురించి చెప్పు. దాన్ని గురించే అందరికి సందేహం గ్రహించనలవి కాని ఈ విషయంతప్ప నచికేతుడు మరొక వరం కోరడు.

## ద్వితీయవల్లి

అన్యచ్ఛ్రేయోఽన్యదుతైవ ప్రేయ
స్తే ఉభే నానార్థే పురుషం సినీతః ।
తయోః శ్రేయః ఆదదానస్యసాధు
భవతి హీయతేఽర్థాద్య ఉప్రేయోవృణీతే ॥ 1

శుభకరమైన శ్రేయస్సు ఒకటి పూర్తిగా తద్భిన్నమైన ప్రాపంచిక సుఖం మరొకటి. విభిన్న గమ్యాలకు తీసుకుపోయే ఈ రెండూ పురుషుని బంధించేవే. ప్రేయస్సును ఎన్నుకుని అనుసరించే వాడు గమ్యం నుండి పతనం చెందుతాడు.

శ్రేయశ్చ ప్రేయశ్చ మనుష్యమేత
తౌ సంపరీత్య వివినక్తి ధీరః ।
శ్రేయో హి ధీరోఽభి ప్రేయసో వృణీతే
ప్రేయో మందో యోగక్షేమాత్ వృణీతే ॥ 2

శ్రేయస్కరమైనదీ, సుఖకరమైనదీ, ఈ రెండూ మానవుని సమీపిస్తాయి. బుద్ధిమంతుడు రెండింటినీ చక్కగా పరిశీలించి విచారిస్తాడు సుఖకరమైన దానికంటే శ్రేయస్కరమైనదే మేలని ఎన్ను కుంటాడు.కానీ బుద్ధి హీనుడు లోభంచేతా ఆసక్తిచేతా సుఖకరమైన దాన్నే కోరుకుంటాడు.

స త్వం ప్రియాన్ ప్రియరూపాంశ్చ కామా
నభిధ్యాయన్ నచికేతోఽత్య స్రాక్షీః।
నైతాం సృకాం విత్తమయీ మవాప్తో
యస్యాం మజ్జన్తి బహవో మనుష్యాః॥ 3

నచికేతా! ఆ నువ్వు ప్రేమాస్పదమైన విషయాలనూ ప్రియంగా కనిపించే ప్రాపంచిక విషయాలనూ చక్కగా పరిశీలించి వాటన్నింటినీ పరిత్యజించావు. ఎందరో మానవులు మునిగి నశించే ఈ ప్రేయోమార్గంలో (సుఖభోగమార్గం) నువ్వు ప్రవేశించలేదు.

దూరమేతే విపరీతే విషూచీ
అవిద్యా యా చ విద్యేతి జ్ఞాతా।
విద్యాభీప్సినం నచికేతసం మన్యే

నత్వాకామా బహవో౽లోలుపన్త॥ 4

అజ్ఞానమూ జ్ఞానమూ అనబడే ఈ రెండూ విభిన్న గమ్యాలకు తీసుకుపోయేవి. అపార మైన అంతరం గలవి. నచికేతుడు జ్ఞానాన్నే అన్వేషిస్తాడని నేను భావిస్తాను. ఎందుకంటే ఎన్ని విషయభోగాల ప్రలోభాలైనా నిన్ను చలింపజేయలేకపోయాయి.

అవిద్యాయామంతరే వర్తమానాః
స్వయం ధీరాః పండితం మన్యమానాః॥
దంద్రమ్యమాణాః పరియన్తి మూఢాః
అంధేనైవ నీయమానా యథాంధాః॥ 5

గాఢమైన అజ్ఞానంలో కూరుకుపోయి ఉన్న మూర్ఖులు తామే ప్రజ్ఞావంతులూ గొప్ప విద్వాం సులూ అనుకుంటూ గ్రుడ్డివాళ్ళ చేత నడిపించబడే గ్రుడ్డివాళ్ళలాగా తూలుతూ తడబడుతూ సుడులు తిరుగుతూ ఉంటారు.

న సాంపరాయః ప్రతిభాతి బాలం
ప్రమాద్యంతం విత్తమోహేన మూఢమ్।
అయం లోకో నాస్తి పర ఇతి మానీ
పునః పునర్వశమాపద్యతే మే॥ 6

జాగ్రత్తలేని బాలుడికి ధనమదంతో మతిపోయిన వారికీ శ్రేయోమార్గం ఎన్నటికీ కనిపిం చదు. 'ఉన్నది ఈ లోకమే మరో లోకం లేనే లేదు' అనుకునేవాడు మళ్ళీమళ్ళీ నా చేతిలో పడుతూ ఉంటాడు.

శ్రవణాయాపి బహుభిర్యో న లభ్యః
శ్రణ్వంతో౽పి బహవో యం న విద్యుః॥
ఆశ్చర్యోవక్తా కుశలో౽స్య లబ్ధా
శ్చర్యో జ్ఞాతా కుశలానుశిష్టః॥ 7

దానిగురించి వినడం కూడా ఎంతోమందికి సాధ్యపడదు. దాని గూర్చి వినినవారుకూడా ఎందరో దానిని గ్రహించలేరు. దానిని ఉపదేశించే ఆచార్యుడు అద్భుతమైనవాడు శిష్యుడుకూడా అలాగే అద్భుతమైన బుద్ధి తీక్షణత గలవాడు. సమర్థుడైన ఆచార్యుడు ఉపదేశించగా దాన్ని గ్రహించగలిగే శిష్యుడు నిజంగా అద్భుతమైనవాడు గదా!

న నరేణావరేణ ప్రోక్త ఏష
సువిజ్ఞేయో బహుధా చింత్యమానః॥
అనన్యప్రోక్తే గతిరత్ర నాస్త్య
ణీయాన్ హ్యతర్క్య మణుప్రమాణాత్॥ 8

అసమర్థుడైన పురుషుడు బోధించితే ఈ ఆత్మ ఏనాటికీ సవ్యంగా గ్రహించబడదు. ఎన్ని విధాలుగా ఆలోచించినాసరే. మరొకరు బోధించితే తప్ప దానికి వేరే దారి లేదు. సూక్ష్మ తమ మైన దానికంటే అది సూక్ష్మతరమైనది. తర్కానికి లొంగనిది.

నైషా తర్కేణ మతిరాపనేయా
ప్రోక్తాన్యేనైవ సుజ్ఞానాయ ప్రేష్ఠ।
యాం త్వమాపః సత్యధృతిర్బతాసి
త్వాదృఙ్ నో భూయాన్నచికేతః ప్రష్టా॥ 9

నువ్వు పొందిన ఈ జ్ఞానం కేవలం తర్కమూ చర్చల వలన లభించేది కాదు. ప్రియతమా సమర్థవంత ఆచార్యుడు బోధించితేనే అర్థం అది అవుతుంది. నువ్వు అవశ్యం సత్యనిష్ఠ కల వాడవు. మాకు నీవంటి శిష్యులు లభిస్తారు గాక.

జానామ్యహం శేవధిరిత్యనిత్యం
న హ్యధ్రువైః ప్రాప్యతే హి ధ్రువం తత్।
తతో మయా నాచికేతశ్చితోఽగ్ని
రనిత్యై ర్ద్రవ్యైః ప్రాప్తవానస్మి నిత్యమ్॥ 10

శాశ్వత వస్తువు అశాశ్వత వస్తువులచేత ఎన్నటికీ పొందబడదు గనుక ఈ సంపదలన్ని అనిత్యాలని నాకు తెలుసు. అయినా ఈ అనిత్య వస్తువులతో నేను నాచికేతాగ్నిని నిర్వర్తించాను. (తద్వారా) శాశ్వత వస్తువును పొందాను.

కామస్యాప్తిం జగతః ప్రతిష్ఠాం
క్రతోరనంత్య మభయస్య పారమ్।
స్తోమ మహదురుగాయం ప్రతిష్ఠాం దృష్ట్వా
ధృత్యా ధీరో నచికేతోఽత్య స్రాక్షీః॥ 11

సకలవాంఛల సంపూర్ణ పరిపూర్తినీ అన్ని యజ్ఞాదికర్మలశాశ్వతఫలాన్నీ అభయత్వపు అవ్వ లిదరినీ ఆరాధ్యతమమూ ఘనమూ ఉన్నతమైన స్థితినీ జీవితాధారాన్నీ దీనినంతటినీ చూచీకూడా ఓ నచికేతా ధీమంతుడవైన నువ్వు దృఢనిశ్చయంతో తిరస్కరించావు.

తం దుర్దర్శం గూఢమనుప్రవిష్టం
గుహాహితం గహ్వరేష్ఠం పురాణమ్।
అధ్యాత్మయోగాధిగమేన దేవం
మత్వా ధీరో హర్షశోకౌ జహాతి॥ 12

ఈ శరీరంలోనే ఉన్నదీ, హృత్పద్మంలో ఆసీనమై ఉన్నదీ, సనాతనమూ అతి సూక్ష్మమూ అంతర్లీనము జ్యోతిర్మయము ఐన ఆ ఆత్మను ధ్యానం ద్వారా సాక్షాత్కరంచుకుని ధీశాలి సుఖ దుఃఖాలకు అతీతుడవుతాడు.

ఏతచ్ఛ్రుత్వా సంపరిగృహ్యమర్త్యః
ప్రవృహ్య ధర్మ్యమణుమేతమాప్య
స మోదతే మోదనీయం హి లబ్ధ్వా
వివృతం సద్మ నచికేతనం మన్యే॥ 13

ధర్మానికి ప్రాణమైన ఆ సూక్ష్మతత్వాన్ని విని తగిన విధంగా ఆలోచించి చక్కగా గ్రహించిన మానవుడు దానిని పొందుతాడు. ఆనందించదగిన దానిని పొందడంచేత ఆనందపరవశుడవుతాడు. నచికేతునికి ఇది తెరచిన ఇల్లే అని నేను భావిస్తున్నాను.

అన్యత్ర ధర్మాదన్యత్రాధర్మా
దన్యత్రాస్మాత్ కృతాకృతాత్।
అన్యత్ర భూతా చ్చ భవ్యాచ్చ
యత్తత్పశ్యసి తద్వద॥ 14

(నచికేతుడిలా అన్నాడు.)

ధర్మాధర్మాలకూ కార్యకారణాలకూ భూత భవిష్యత్తులకూ కూడా భిన్నంగా నువ్వు దేన్ని సాక్షాత్కరించుకున్నావో దాన్ని దయ చేసి నాకు ఉపదేశించు.

సర్వే వేదా యత్పదమామనంతి
తపాంసి సర్వాణి చ యద్వదంతి।
యదిచ్ఛంతో బ్రహ్మచర్యం చరంతి
తత్తేపదం సంగ్రహేణ బ్రవీమ్యోమిత్యేతత్॥ 15

అన్ని వేదాలూ ఘోషించే గమ్యమూ అన్ని తపస్సులూ ఉద్ఘాటించే గమ్యమూ ఐన దేన్నికోరి సాధువులు బ్రహ్మచర్య జీవితం గడుపుతారో దాన్ని సంగ్రహంగా చెపుతున్నాను విను. అదే ఓంకారం.

ఏతద్ధ్యే వాక్షరం బ్రహ్మఏతద్ధ్యే వాక్షరం పరమ్।
ఏతద్ధ్యేవాక్షరం జ్ఞాత్వా యో యదిచ్ఛతి తస్య తత్॥ 16

ఈ అక్షరమే బ్రహ్మం. ఈ అక్షరమే సర్వోత్తమం కూడా. ఈ అక్షరాన్ని తెలుసుకున్నవారికి ఏది కోరితే అది సిద్ధిస్తుంది.

ఏతదాలంబనం శ్రేష్ఠమేతదాలంబనం పరమ్।
ఏతదాలంబనం జ్ఞాత్వా బ్రహ్మలోకే మహీయతే॥ 17

ఈ ఆలంబనమే ఉత్తమమైనది. ఈ ఆలంబనమే సర్వోత్కృష్టమైనది. దీని ఆలంబనాన్ని తెలుసుకుని బ్రహ్మలోకంలో పూజింపబడతాడు.

నజాయతే మ్రియతే వా విపశ్చి

న్నాయం కుతశ్చిన్న బభూవ కశ్చిత్।
అజో నిత్యః శాశ్వతోఽయం పురాణో
న హన్యతే హన్యమానే శరీరే॥ 18

జ్ఞాత ఐన ఆత్మ పుట్టదు. చావదు. దేని నుంచిగానీ అది పరిణమించదు. దానినుండికూడా ఏదీ పరిణామం పొందదు. శరీరం నశిస్తూ ఉన్నప్పుడు కూడా జన్మరహితమూ అనశ్వరమూ శాశ్వతమూ సనాతనమూ ఐన ఈ ఆత్మకు నాశనమనేది లేదు.

హంతా చేన్మన్యతే హంతుం హతశ్చేన్మన్యతే హతమ్।
ఉభౌ తౌ న విజానీతో నాయం హంతి న హన్యతే॥ 19

చంపేవాడు తాను చంపుతున్నాననీ; చంపబడినవాడు తాను చంపబడ్డాననీ భావిస్తే ఆ ఇరువురికీ దాని (ఆత్మ) గురించి సరిగా తెలియదు. నిజానికి అది చంపదు చంపబడదూ.

అణోరణీయాన్ మహతో మహీయా
నాత్మాఽస్య జంతోర్నిహితోగుహాయామ్ ।
తమక్రతుః పశ్యతి వీతశోకో
ధాతుప్రసాదాన్మ హిమానమాత్మనః॥ 20

సూక్ష్మాతి సూక్ష్మమైన అణువుకంటే చిన్నదీ బ్రహ్మాండాని కంటే ఘనమైనదీ ఐన ఆత్మ ప్రాణుల హృదయాలలోనే ఉన్నది. కామనారహితుడు శోకరహితుడై ఇంద్రియాలయొక్కా మనస్సు యొక్కా పవిత్రత ద్వారా ఆత్మ మహిమను సాక్షాత్కరించుకుంటాడు.

ఆసీనో దూరం వ్రజతి శయానోయాతి సర్వతః ।
కస్తం మదామదం దేవం మదన్యో జ్ఞాతుమర్హతి ॥ 21

కదలకుండా కూర్చునే ఉన్నా అతడు ఎంతోదూరం ప్రయాణిస్తాడు. పడుకునే ఉన్నా అతడు సకల ప్రదేశాలకూ పోతాడు. ఆనందమయుడూ ఆనందరహితుడూ ఐన ఆ జ్యోతిర్మయుని నేను తప్ప ఎవరు తెలుసుకోన సమర్థుడై ఉన్నాడు.

అశరీరం శరీరేష్వనవస్థేష్వ వస్థితమ్ ।
మహాంతం విభుమాత్మానం మత్వా ధీరో న శోచతి ॥ 22

శరీరరహితమూ సర్వవ్యాపీ ఐన పరమాత్మను అస్థిరాలైన అన్ని శరీరాలనూ ఉన్న దానిని తెలుసుకుని ప్రజ్ఞావంతుడు శోకింపడు.

నాయమాత్మా ప్రవచనేన లభ్యో
న మేధయా న బహూనా శ్రుతేన।
యమేవైష వృణుతే తేన లభ్య
స్తస్యైష ఆత్మా వివృణుతే తనూం స్వామ్ ॥ 23

వేదాధ్యయన చేతగానీ బుద్ధి కుశలతచేతగానీ అపారమైన పాండిత్యం చేతనైనాగానీ ఈ ఆత్మ పొందబడదు. అది ఎవరిని వరిస్తుందో ఎన్నుకుంటుందో అతనిచేతనే ఆత్మ పొందబడు తుంది.ఇది అంటే అతనియొక్క ఆత్మే తనయొక్క నిజస్వరూపాన్ని వెల్లడిస్తుంది.

నా విరతో దుశ్చరితాన్నాశాంతో నా సమాహితః।
నాశాంతామానసో వాఽపి ప్రజ్ఞానేనైన మాప్నుయాత్ ॥ 24

చెడు నడతలనుండి విరమించనివారూ ఇంద్రియ లౌల్యాన్ని నిగ్రహించుకోలేనివారూ ధ్యానపరులు కానివారూ ప్రశాంతి చెందిన మనస్సులేనివారు ధ్యానపరులు కానివారూ ప్రశాంతి చెందిన మనస్సు లేనివారూ జ్ఞానంచేత కూడా దీనిని పొందగలరు.

యస్య బ్రహ్మ చ క్షత్రం చ ఉభే; భవతి ఓదనః ।
మృత్యుర్యస్యోపసేచనం క ఇత్థా వేద యత్ర సః॥ 25

(లేకపోతే) బ్రాహ్మణ క్షత్రియులు ఎవనికి ఆహారమో మృత్యువు ఎవనికి నంజుకునే పచ్చడో ఆ ఆత్మ ఎక్కడ ఉన్నదో ఎవరికి ఇలా తెలుసు.

## తృతీయవల్లి

ఋతం పిబంతౌ సుకృతస్య లోకే
గుహాం ప్రవిష్టౌ పరమే పరార్ధే।
ఛాయాతపౌ బ్రహ్మవిదో వదంతి
పంచాగ్నయో యే చ త్రిణాచికేతాః ॥ 1

తమ పుణ్య కర్మఫలాన్ని అనుభవిస్తూ పరమమైన హృదాకాశంలోని బుద్ధియందు ప్రవేశించిన వారు ఈ లోకంలో ఇరువురున్నారు. బ్రహ్మవిదులు వానిని వెలుగునీడలని అంటారు. నాచికేత యజ్ఞాన్ని మూడుసార్లు చేసిన గృహస్థులు కూడా అలాగే అంటారు.

యః సేతురీజానానామక్షరం బ్రహ్మయత్ పరమ్ ।
అభయం తితీర్షతాం పారం నాచికేతం శకేమహి ॥ 2

ఆత్మానం రథినం విద్ధి శరీరం రథమేవ తు ।
బుద్ధింతు సారథిం విద్ధి మనః ప్రగ్రహమేవ చ ॥ 3

ఆత్మ దాన్ని అధిరోహించిన యజమాని అని తెలుసుకో. అలాగే శరీరం రథము బుద్ధే సారథి మనస్సే కళ్ళెమూ అని గ్రహించు.

ఇంద్రియాణి హయానా
హుర్విషయాంస్తేషు గోచరాన్ ।
ఆత్మేంద్రియ మనోయుక్తం

భోక్తేత్యాహుర్మనీషిణః॥ 4

ఇంద్రియాలే గుర్రాలూ ఇంద్రియ విషయాలే అవి పరుగుతీసే మార్గాలూ అని అంటారు. శరీరమూ ఇంద్రియాలూ మనస్సులతో కూడివున్న ఆత్మనే ప్రాజ్ఞులు భోక్తగా చెపుతారు.

యస్త్వ విజ్ఞానవాన్ భవత్య యుక్తేన మనసా సదా ।
తస్యేంద్రియాణ్యవశ్యాని దుష్టాశ్వా ఇవ సారథేః॥ 5

మనస్సును విచ్చలవిడిగా వదిలేసి సరైన జ్ఞానం లేకుండా ఎవడైనా ఎల్లప్పుడూ సంచరిస్తే అలాంటివాని ఇంద్రియాలు దోషం వున్న గుర్రాలు సారథి అదుపుతప్పి పోయినట్లే వశం తప్పిపోతాయి.

యస్తు విజ్ఞానవాన్ భవతి యుక్తేన మనసా సదా ।
తస్యేంద్రియాణి వశ్యాని సదశ్వా ఇవ సారథేః ॥ 6

అయితే ఎల్లప్పుడూ మనస్సును అదుపులో ఉంచుకుని సరైన జ్ఞానంగలిగి ప్రవర్తించే వాని ఇంద్రియాలు సారథియొక్క మంచి గుర్రాల్లో వశంలో ఉంటాయి.

యస్త్వవిజ్ఞానవాన్ భవత్య మనస్కః సదాఽశుచిః।
న స తత్ పదమాప్నోతి సంసారం చాధిగచ్ఛతి ॥ 7

సరైన జ్ఞానంలేక చెదరిపోయిన మనస్సుతో ఎల్లప్పుడూ అశుచిగా ఉండేవాడు ఆ గమ్యాన్ని పరమ పదాన్ని ఎన్నటికీ పొందలేడు. అంతేగాక జననమరణచక్రరూపమైన సంసారంలో పడిపోతాడు.

యస్తు విజ్ఞానవాన్ భవతి సమనస్కః సదా శుచిః ।
స తు తత్ పదమాప్నోతి యస్మాద్ భూయో న జాయతే ॥ 8

కానీ ఎవడైతే విజ్ఞానవంతుడో వశముచేసుకొన్న మనస్సు గలవాడో సదా పరిశుద్ధుడో అతడు పునర్జన్మలేని ఆ పరమపదాన్ని చేరుకుంటాడు.

విజ్ఞానసారథిర్యస్తు మనఃప్రగ్రహవాన్ నరః ।
సో ఽధ్వనః పారమాప్నోతి తద్ విష్ణోః పరమం పదమ్ ॥ 9

బుద్ధే సారథిగా గలవాడు మనస్సే చాకచక్యంతో పట్టుకోబడిన కళ్ళెమైనవాడు అయిన మానవుడు ప్రయాణపు గమ్యమైన విష్ణువుయొక్క పరమపదాన్ని చేరుకుంటాడు.

ఇంద్రియేభ్యః పరా హ్యర్థా అర్థేభ్యశ్చ పరం మనః।
మనసస్తు పరా బుద్ధిర్బుద్ధేరాత్మా మహాన్ పరః ॥ 10
మహతః పరమవ్యక్తమవ్యక్తాత్ పురుషః పరః ।
పురుషాన్న పరం కించిత్ సా కాష్ఠా సా పరా గతిః॥ 11

ఇంద్రియాలకంటే వాటి విషయాలు శ్రేష్ఠమైనవి. విషయాల కంటే మనస్సు గొప్పది. మనస్సుకంటే బుద్ధి ప్రశస్తమైనది. బుద్ధి కంటే కూడా ప్రశస్తమైనది మహత్తు. అవ్యక్తం మహత్తుకంటే ఉత్కృష్టమైనది. ఆ అవ్యక్తాని కంటే కూడా పరమోత్కృష్టమైనది పురుషుడు.ఆ పురుషుని మించినది మరేదీ లేదు. అదే చరమసీమ. అదే పరమగమ్యం.

ఏషసర్వేషు భూతేషు
గూఢో௨௨త్మా నప్రకాశతే ।
దృశ్యతే త్వగ్ర్యయా బుద్ధ్యా
సూక్ష్మయా సూక్ష్మదర్శిభిః ॥ 12

అన్ని జీవులలోనూ గూఢంగా వున్న ఈ ఆత్మ అందరికీ ప్రకటితం కాదు. సూక్ష్మ దర్శులైన ఋషులు మాత్రమే తీక్షణమైన ఏకాగ్రమైన తమ బుద్ధిద్వారా ఆ ఆత్మను సాక్షాత్కరించుకోగలరు.

యచ్ఛేద్ వాఙ్ మనసీ
ప్రాజ్ఞస్తద్యచ్ఛేద్ జ్ఞాన ఆత్మని।
జ్ఞానమాత్మాని మహతి నియచ్ఛేత్
తద్యచ్ఛేచ్ఛాంత ఆత్మని॥ 13

ప్రాజ్ఞుడు వాక్కును మనస్సులోనూ మనస్సును బుద్ధి యందూ ఆ బుద్ధిని హిరణ్యగర్భుని లోనూ ఆ హిరణ్యగర్భునికూడా తుదకు పరమశాంతి అనే పరమాత్మయందూ క్రమంగా లయింపజేయాలి.

ఉత్తిష్ఠత జాగ్రత
ప్రాప్య వరాన్ నిబోధత ।
క్షురస్యధారా నిశితా దురత్యయా
దుర్గం పథస్తత్ కవయో వదంతి ॥ 14

లేవండి! మేలుకోండి! శ్రేష్ఠులైన ఆచార్యులను ఆశ్రయించి ఆ ఆత్మను సాక్షాత్కరించుకోండి. ఆ మార్గం కత్తి మొనవలె తీక్షమైనది. దాని ననుసరించి పోవడం ఎంతో ప్రయాసతో కూడినదనీ అనుసరించడం ఎంతో కష్టమనీ విజ్ఞులు చెపుతారు.

అశబ్ద మస్పర్శ మరూపమవ్యయం
తథా௨రసం నిత్యమగంధ వచ్చయత్ ।
అనాద్యనంతం మహతః పరం ధ్రువం
నిచాయ్య తన్మృత్యు ముఖాత్ ప్రముచ్యతే ॥ 15

శబ్దస్పర్శ రూపరసగంధాలు లేనిదీ నాశరహితమైనదీ శాశ్వతమూ ఆదీ అంతూ లేనిదీ మహత్తుకు అతీతమైనదీ ధృవమైనదీ అయిన ఆత్మను సాక్షాత్కరించుకుని మృత్యువునుండి మానవుడు విముక్తి పొందుతాడు .

నాచికేత ముపాఖ్యానం
మృత్యుప్రోక్తం సనాతనమ్ ।
ఉక్త్వా శ్రుత్వా చ మేధావీ
బ్రహ్మలోకే మహీయతే ॥ 16

యమరాజు చెప్పిన ఈ నాచికేతోపాఖ్యానాన్ని, సనాతనమైన దాన్ని, ఇతరులకు చెప్పి తాను వినిన బుద్ధిశాలి బ్రహ్మలోకంలో ఘనత నొందుతాడు.

య ఇమం పరమం గుహ్యం
శ్రావయేత్ బ్రహ్మ సంసది ।
ప్రయతః శ్రాద్ధకాలే వా
తదానంత్యాయ కల్పతే ॥
తదానంత్యాయ కల్పత ఇతి ॥ 17

అత్యంత గోప్యమైన ఈ కథను బ్రాహ్మణ సభలో గానీ శ్రాద్ధకర్మ చేసే సమయంలోగానీ పరమభక్తితో వినిపించినవాడు అనంతమైన ప్రతిఫలాన్ని పొందగలడు.

## ద్వితీయాధ్యాయం

### చతుర్థవల్లి

పరాంచి ఖాని వ్యతృణత్ స్వయంభూ
స్తస్మాత్ పరాఙ్ పశ్యతి నాంతరాత్మన్ ।
కశ్చిద్ధీరః ప్రత్యగాత్మానమైక్ష
దావృత్తచక్షురమృతత్వమిచ్ఛన్ ॥ 1

స్వతః సిద్ధుడు స్వయంగా ఆవిర్భవించినవాడూ అయిన భగవంతుడు ఇంద్రియాలను దోషపూరితాలుగా సృష్టించాడు. అందుచేత అవి బైటి విషయాలవైపు మాత్రమే పోగలవు. లోపల ఉన్న ప్రత్యగాత్మను అవి దర్శించలేవు. ప్రయత్నముతో ఎవరో ఒక ధీరుడు అమృతత్వాన్ని కోరి తన కళ్లను లోపలికి మరల్చుతాడు. అంతరాత్మను దర్శిస్తాడు.

పరాచః కామాననుయంతి బాలా
స్తే మృత్యోర్యంతి వితతస్య పాశమ్।
అథ ధీరా అమృతత్వం విదిత్వా
ధ్రువమధ్రువేష్విహ న ప్రార్థయంతే॥ 2

పసిబాలురు బాహ్యసుఖాల వెంటపడతారు. అలా వారు అపారమైన మృత్యువు వలలో పడిపోతారు. కానీ ప్రాజ్ఞులు ఈ అనిత్య విషయాలమధ్య నిత్యమూ శాశ్వతమూ అమరమూ అయినదేదో తెలుసుకుని ఈ ప్రపంచంలో దేనిని కూడా కోరరు.

యేన రూపం రసం గంధం శబ్దాన్ స్పర్శాంశ్చ మైథునాన్।
ఏతేనైవ విజానాతి కిమత్ర పరిశిష్యతే ఏతద్వై తత్॥ 3

రంగూ రుచీ వాసనలనూ శబ్ద స్పర్శలను మైథున సంయోగాలను మానవుడు ఏ ఆత్మచేత తెలుసుకుంటున్నాడో ఆ ఆత్మకు తెలియరానిది ఈ ప్రపంచంలో ఏమున్నది? ఇదే నువ్వు తెలుసు కోగోరిన ఆ ఆత్మ.

స్వప్నాంతం జాగరితాంతం చోభౌ యేనానుపశ్యతి।
మహాంతం విభూమాత్మానం మత్వా ధీరో న శోచతి॥ 4

స్వప్నావస్థలో జాగ్రదవస్థలో అన్ని విషయాలనూ ఏ ఆత్మ ద్వారా మానవుడు దర్శిస్తాడో మహత్తరమూ సర్వవ్యాపీ అయిన ఆ ఆత్మను సాక్షాత్కరించుకుని ప్రాజ్ఞుడు ఇక దుఃఖించడు.

య ఇమం మధ్వదం వేద
ఆత్మానం జీవమంతికాత్।
ఈశానం భూత భవ్యస్య న తతో
విజుగుప్సతే ఏతద్వైతత్॥ 5

తేనెను ఆస్వాదిస్తున్నదీ జీవితాన్ని పోషిస్తున్నదీ భూతభివిష్యత్తులకు ప్రభువూ అయిన ఆత్మను చాలా దగ్గరగా తెలుసుకున్నవాడు ఆ తరువాత ఇక భయం చెందడు. నిజంగా ఇదే ఆ ఆత్మ.

యః పూర్వం తపసో జాత
మద్భ్యః పూర్వమజాయత।
గుహాం ప్రవిశ్య తిష్ఠంతం యో
భూతేభిర్వ్య పశ్యత ఏతద్వై తత్॥ 6

పూర్వం జ్ఞానానికి జన్మించినవాడు నీటికంటే కూడా ముందుగా జన్మించినవాడు అయిన అది హృదయంలో ప్రవేశించి పంచభూతాలతో ఉంటున్నదని దర్శించినవాడు నిజంగా బ్రహ్మన్నే దర్శిస్తాడు. నిజంగా ఇదే ఆ ఆత్మ.

యా ప్రాణేన సంభవత్యది
తిర్దేవతా మయీ।
గుహాం ప్రవిశ్య తిష్ఠంతీం యా భూతే
భిర్వ్య జాయత ఏతద్వై తత్॥ 7

ప్రాణరూపంగా కనబడేది పంచభూతాలతో సృష్టించబడినదీ హృదయంలో ప్రవేశించి నివ సించేదీ అయిన ఆత్మని  దేవతల ఆత్మను తెలిసికొన్నవాడు నిజంగా బ్రహ్మాన్నే తెలుసుకుంటాడు. నిజంగా ఇదే ఆ ఆత్మ.

అరణ్యోర్నిహితో జాతవేదా గర్భ
ఇవ సుభృతో గర్భిణీభిః।
దివే దివ ఈడ్యో జాగృవద్భిర్హ్వ
విష్మద్భిర్మనుష్యేభిరగ్నిః ఏతద్వై తత్॥ 8

గర్భవతులైన తల్లులచేత చక్కగా రక్షింపబడి పోషించబడే గర్భంలాగా మండే కర్రలలో జాగ్రత్తగా ఉంచబడిన సర్వజ్ఞుడైన అగ్నిదేవుడు ప్రబోధితులైన వారిచేతా యజ్ఞకర్తలచేతా అను దినమూ ఆరాధింపబడతాడు. నిజంగా ఇదే అది.

యతశ్చోదేతి సూర్యోఽస్తం యత్రచ గచ్ఛతి।
తం దేవాః సర్వేఽర్పితాస్తదునాత్యేతి కశ్చన। ఏతద్వై తత్॥ 9

సూర్యుడు దేనినుండి ఉదయిస్తూ దేనిలో అస్తమిస్తాడో దానియందే సకలదేవతలూ అమర్చ బడి ఉన్నారు.  నిజంగా ఎవరుగానీ దానిని అతిక్రమించ గలరు.  నిజంగా ఇదే ఆ ఆత్మ.

యదేవేహ తదముత్ర యదముత్ర తదన్విహ।
మృత్యోః స మృత్యుమాప్నోతి య ఇహ నానేవ పశ్యతి॥ 10

ఇక్కడ ఉన్నదే అక్కడా ఉన్నది. అలాగే అక్కడ ఉన్నదే ఇక్కడా ఉన్నది. ఇక్కడ అన్యంగా ఉన్నదని చూచేవాడు. మళ్ళీ మళ్లీ అట్టివానికి జనన మరణాలు తప్పవు.

మనసైవేదమాప్తవ్యం నేహ నానాఽ స్తి  కించన।
మృత్యోః స మృ త్యుం గచ్ఛతి య ఇహ నానేవ పశ్యతి॥ 11

మనస్సు ద్వారానే దీన్ని సాక్షాత్కరించుకోవాలి. (అప్పుడు) ఇక్కడ ఏ వైవిధ్యమూ ఉండదు. ఇక్కడ వైవిధ్యం ఉన్నట్లు చూచే వాడు మరణాన్నుంచి మరణానికి పోతూ ఉంటాడు. అట్టివానికి జనన మరణాలు తప్పవు.

అంగుష్ఠమాత్రః పురుషో మధ్య ఆత్మని తిష్ఠతి।
ఈశానో భూత భవ్యస్య న తతో విజుగుప్సతే।
ఏతద్వైతత్॥ 12

బొటనవ్రేలి పరిమాణంగల పురుషుడు ఈ శరీరంలో నివసిస్తూ ఉంటాడు. భూత భవిష్యత్తు లకూ ఆయనే ప్రభువు. ఇది తెలిసి మానవుడు భయపడడు. నిజంగా ఇదే ఆత్మ.

అంగుష్ఠమాత్రః పురుషో జ్యోతిరివాధూమకః।
ఈశానో భూతభవ్యస్య స ఏవాద్య స ఉ శ్వః।

ఏతద్వై తత్॥ 13

బొటనవ్రేలి పరిమాణంగల పురుషుడు భూత భవిష్యత్తులకు ప్రభువు. ఆయన పొగేలేని జ్యోతి. ఇవాళా రేపూ కూడా ఆయన ఒకలాగే ఉంటాడు. నిజంగా ఇదే ఆత్మ.

యథోదకం దుర్గేవృష్టం పర్వతేషు విధావతి।
ఏవం ధర్మాన్ పృథక్ పశ్యన్ తానేవాను విధావతి॥ 14

ఉన్నత శిఖరంపైన వర్షించిన నీరు పర్వత సానువులలో లెక్క లేని పాయలై ప్రవహించి నట్లు గుణాలను వివిధాలుగా చూచేవాడు నిజంగా వాటివెంటనే పరుగుతీస్తాడు.

యథోదకం శుద్ధే శుద్ధమాస్తికం తాదృగేవ భవతి।
ఏవం మునేరిజానత ఆత్మాభవతి గౌతమ॥ 15

శుభ్రమైననీరు శుభ్రమైన నీటిలో పోయబడి శుభ్రంగానేఉంటుందో అలాగే ఆత్మయొక్క ఏకత్వాన్ని తెలుసుకున్న ఋషి ఆత్మకూడా అవుతుంది.

## పంచమవల్లి

పురమేకాదశద్వార మజస్యావక్ర చేతసః।
అనుష్ఠాయ న శోచతి విముక్తశ్చ విముచ్యతే।
ఏతద్వై తత్॥ 1

జన్మరహితుడూ అకుంఠిత ప్రజ్ఞావంతుడూ అయిన ఆత్మకు పదకొండు ద్వారాలుగల పట్టణం ఉన్నది. ఆ ఆత్మను ధ్యానించిన వానికి దుఃఖంలేదు. అన్ని అజ్ఞానబంధాలనుండి విముక్తుడై జన్మమృత్యుబంధాన్నుండి కూడా స్వేచ్ఛ పొందుతాడు. ఇదే నిజంగా అది.

హంసః శుచిషద్ వసురంతరిక్షసద్
హోతా వేదిషదతిథిర్దురోణసత్ ।
నృషద్ వరసదృతసద్ వ్యోమసదబ్జాగోజా
ఋతజా అద్రిజా ఋతం బృహత్॥ 2

స్వర్గంలో తిరిగే సూర్యుడు ఆ ఆత్మ. అంతరాళంలో సంచరించే వాయువు ఆ ఆత్మ. యజ్ఞ వేదికపైని అగ్నీ కూజాలోని అతిథీ (సోమరసం) ఆ ఆత్మయే. మానవులలో దేవతలలో యజ్ఞంలో ఆకాశంలో ఆ ఆత్మ ఉన్నది. ఆ ఆత్మ నీటిలో జన్మించింది భూమిపై జన్మించింది యజ్ఞంలో జన్మిం చింది పర్వతంపై జన్మించింది. ఆ ఆత్మయే సత్యం. అదే బృహత్తు.

ఊర్ధ్వం ప్రాణమున్న యత్యపానం ప్రత్యగస్యతి ।
మధ్యే వామనమాసీనం విశ్వేదేవా ఉపాసతే॥ 3

అతడు ప్రాణాన్ని పైకి పంపిస్తాడు. అపానాన్ని కిందికి విసురుతాడు. మధ్యలో ఆసీనుడై ఉన్న ఆ ఆత్మను పూజనీయుని అందరు దేవతలూ ఆరాధిస్తారు.

అస్య విస్రంసమానస్య శరీరస్థస్య దేహినః ।
దేహాద్ విముచ్యమానస్య కిమత్ర పరిశిష్యతే ।
ఏతద్వై తత్ ॥ 4

శరీరంలో నివసించే వానికి చెందినది. శరీరంనుండి అతడు వేరు చేయబడిన తరువాత ఇక్కడ ఏది మాత్రం మిగులుతుంది? ఇదే నిజంగా ఆ ఆత్మ .

న ప్రాణేన నాపానేన మర్త్యో జీవతి కశ్చన ।
ఇతరేణ తు జీవంతి యస్మిన్నేతా వుపాశ్రితౌ ॥ 5

మానవుడెవడూ ప్రాణం చేతగానీ అపానం చేతగానీ జీవించడు. ఈ రెండూ ఆధారపడి ఉండే మరొక దానిచేత జీవిస్తాడు. అదే ఆత్మ.

హంత త ఇదం ప్రవక్ష్యామి గుహ్యం బ్రహ్మసనాతనమ్ ।
యథాచ మరణంప్రాప్య ఆత్మాభవతి గౌతమ॥ 6

ఓ గౌతమా ఇక నీకు ఆ రహస్యమూ సనాతనమూ అయిన బ్రహ్మాన్ని గూర్చి చెబుతాను. అలాగే చనిపోయిన తర్వాత ఆత్మ ఏమవుతుందో కూడా చెపుతాను.

యోనిమన్యే ప్రపద్యంతే శరీరత్వాయ దేహినః।
స్థాణుమన్యే ఉనుసంయంతి యథాకర్మ యథాశ్రుతమ్ ॥ 7

కొన్ని జీవాత్మలు శరీరంకోసం గర్భంలో ప్రవేశిస్తాయి. మరి కొన్ని జీవాత్మలు చెట్టూ చేమలనాశ్రయిస్తాయి. అంతా వారి వారి కర్మ ననుసరించీ జ్ఞానాన్ని అనుసరించీ ఉంటుంది.

య ఏషసుప్తేషు జాగర్తి కామం కామం పురుషోనిర్మిమాణః।
తదేవ శుక్రంతద్ బ్రహ్మ తదేవామృతముచ్యతే ।
తస్మింల్లోకాః శ్రితాః సర్వే తదునాత్యేతి కశ్చన ।
ఏతద్వై తత్ ॥ 8

మనం నిద్రించేటప్పుడు కూడా వివిధమైన వాంఛనీయ వస్తువులను నిర్మిస్తూ మేలుకుని ఉండే ఆ పురుషుడే పరిశుద్ధమైన బ్రహ్మం. అదే అమరం అని కూడా చెప్పబడుతున్నది. అన్ని లోకాలూ ఉన్నది దానియందే. దాని నెవరూ అతిక్రమించలేరు. ఇదే నిజంగా ఆత్మ.

అగ్నిర్యథైకో భువనం ప్రవిష్టో
రూపంరూపం ప్రతిరూపో బభూవ।
ఏకస్తథా సర్వభూతాంతరాత్మా
రూపంరూపం ప్రతిరూపో బహిశ్చ॥ 9

ఒకే ఒక అగ్ని ప్రపంచంలో ప్రవేశించి అది మండించే పదార్థాన్ని పోలిన రూపాలనే ధరించినట్లు అన్ని జీవులలోనూ ఉన్న ఒకే ఒక ఆత్మ తాను ప్రవేశించిన ఆయావస్తువుల రూపాలనే ధరించి కన్పిస్తుంది. అంతేగాక వాటిని మించికూడా ఉంటుంది.

వాయుర్యథైకో భువనం ప్రవిష్టో
రూపంరూపం ప్రతిరూపో బభూవ।
ఏకస్తథా సర్వభూతాంతరాత్మా
రూపంరూపం ప్రతిరూపో బహిశ్చ॥ 10

ఒకే వాయువు ప్రపంచంలో ప్రవేశించి వివిధ రూపాలకు పోలిన రూపాలను ధరిస్తుందో అలాగే సకల జీవుల హృదయాల్లోనూ ఉన్న ఒకే ఆత్మ తాను ప్రవేశించిన వివిధ రూపాలలాగా వివిధంగా కన్పిస్తుంది.

సూర్యోయథా సర్వలోకస్య చక్షు
ర్న లిప్యతే చాక్షుషైర్బాహ్యదోషైః
ఏకస్తథా సర్వభూతాంతరాత్మా
న లిప్యతే లోకదుఃఖే; న బాహ్యః॥ 11

యావత్ప్రపంచానికీ నేత్రమైన సూర్యుడు చర్మ చక్షువుల మాలిన్యాల వలన మలినుడు కానట్లే ప్రపంచానికి అతీతమైనది సకల జీవుల హృదయాల్లోనూ ఉన్నదీ అయిన ఆత్మ ప్రపంచపు దుఃఖాల వలన దుఃఖాన్ని ఎంతమాత్రమూ ఆత్మ మలినము కాదు.

ఏకోవశీ సర్వభూతాంతరాత్మా
ఏకం రూపం బహుధా యః కరోతి ।
తమాత్మస్థం యేఽను పశ్యంతి ధీరా
స్తేషాం సుఖం శాశ్వతం నేతరేషామ్ ॥ 12

ఆ ఒక్క జగన్నియామకుని సకల జీవుల అంతరాత్మను తన ఒక్క రూపాన్నే అనేక విధాలుగా కల్పించే దానిని తమ ఆత్మయందే ఉన్నదని దర్శించే ప్రాజ్ఞులు శాశ్వతమైన ఆనందం పొందుతున్నారు. ఇతరులకు అది సాధ్యం కాదు.

నిత్యో ఽనిత్యానాం చేతనశ్చేతనానా
మేకో బహూనాం యోవిదధాతి కామాన్ ।
తమాత్మస్థం యేఽనుపశ్యంతి ధీరా
స్తేషాం శాంతిః శాశ్వతీ నేతరేషామ్ ॥ 13

అనిత్య వస్తువులలో నిత్యవస్తువూ చైతన్యవంతమైన వానిలోని చైతన్యమూ ఒక్కటే అయినా అనేకుల కోరికలను నెరవేర్చేదీ అయిన పరమాత్మను తమ ఆత్మయందే స్థితమై ఉన్న దానినిగా ఏ ప్రాజ్ఞులు దర్శిస్తారో వారిదే శాశ్వతమైన శాంతి. ఇతరులది కాదు.

తదేతదితి మన్యంతేఽనిర్దేశ్యం పరమం సుఖమ్ ।
కథం ను తద్విజానీయాం కిము భాతి విభాతి వా ॥ 14

ఋషులు ఆ అనిర్వచనీయమైన పరమానందాన్నే ఇదే అది అని దర్శిస్తారు.దానిని నే నెలా తెలుసుకోగలను? అది తన కాంతితో స్వయంగా ప్రకాశిస్తుందా లేక మరొకదాని కాంతి వలన మెరుస్తుందా?

న తత్ర సూర్యోభాతి న చంద్రతారకం
నేమా విద్యుతో భాంతి కుతోఽయమగ్నిః ।
తమేవ భాంతమనుభాతి సర్వం
తస్యభాసా సర్వమిదం విభాతి ॥ 15

అక్కడ సూర్యుడు ప్రకాశించడు. చంద్రుడు నక్షత్రాలు ప్రకాశించవు. మెరుపులు కూడామెర వలేవు. ఇక ఈ అగ్ని మాటెందుకు! అది ప్రకాశిస్తూ ఉంటే అన్నీ దాని ననుసరించి ప్రకాశిస్తాయి. దాని వెలుగుతోనే ఇదంతా వెలిగించబడుతున్నది.

## షష్ఠవల్లి

ఊర్ధ్వమూలోఽవాక్శాఖ ఏషోఽశ్వత్థః సనాతనః।
తదేవ శుక్రం తద్ బ్రహ్మ తదేవామృతముచ్యతే ।
తస్మింల్లోకాః శ్రితాః సర్వే తదు నాత్యేతి కశ్చన ।
ఏతద్వై తత్ ॥ 1

ఈ సనాతనమైన అశ్వత్థవృక్షానికి వేర్లు పైకి వ్యాపించి ఉంటాయి. కొమ్మలు కిందికి విస్త రించి ఉంటాయి. ఇదే పరిశుభ్రమైనది. ఇదే బ్రహ్మం. దీనినే అమరం అనికూడా అంటారు. అన్ని లోకాలూ దీనియందే ఉన్నవి. ఏదీ కూడా ఎవరూకూడా దీనిని అతిక్రమించ లేరు. నిజంగా ఇదే ఆత్మ.

యదిదం కించ జగత్సర్వం ప్రాణ ఏజతి నిఃసృతమ్ ।
మహద్భయం వజ్రముద్యతం య ఏతద్ విదురమృతాస్తే భవంతి ॥ 2

ప్రాణశక్తి ఉపస్థితమై ఉండగా అతనినుండి యావద్విశ్వమూ బహిర్గతమై అతనిలోనే కంప నం చెందుతూ ఉంటుంది. ఎత్తబడిన వజ్రాయుధంలాగా అతడు మహాభయంకరుడు. దీనిని తెలుసుకున్నవారే అమరులవుతారు.

భయాదస్యాగ్ని స్తపతి భయాత్తపతి సూర్యః ।
భయాదింద్రశ్చ వాయుశ్చ మృత్యుర్ధావతి పంచమః ॥ 3

